# కుటుంబరావు సాహిత్యం

మొదటి సంపుటం



# కుటుంబరావు సాహిత్యం

మొదటి సంపుటం

సంపాదకుడు

కేతు విశ్వనాథరెడ్డి



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్

హైదరాబాద్- 500 001

ప్రచురణ సంఖ్య : 1996
ప్రతుల సంఖ్య : 1000
ప్రథమ ముద్రణ : జనవరి, 1982
ద్వితీయ ముద్రణ : ఆగష్టు, 1990
తృతీయ ముద్రణ : సెప్టెంబరు, 1996



**వెల : రూ. 100-00**

ముఖచిత్రం : చంద్ర

ప్రతులకు :

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

4-1-435, విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాదు - 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్

విజయవాడ, హైదరాబాదు, విశాఖపట్నం,
అనంతపురం, గుంటూరు, తిరుపతి,
హన్మకొండ, కాకినాడ.

ముద్రణ : నాగార్జున ఎంటర్‌ప్రైజెస్, విజయవాడ-520 004.

# అంకురార్పణ

1979 ఆగస్టులో ఈ ఆలోచన కలిగింది. కుటుంబరావుగారి 70 వ జన్మ దినం నాటికి "సాహిత్య ప్రయోజనం" పునర్ముద్రించాలనుకొన్నాం. ఆయన కథలూ, నవలలూ దాదాపు ఏవీ లభించడం లేదు. వాటిని కొన్నిటిని ఒక సంపుటంగా ప్రచురించడం మరింత సముచితంగా వుంటుంది కదా అనిపించింది.

అదే సమయంలో "సాహిత్యమూ-పత్రికలూ" పేరుతో ఆయన జ్యోతి మాస పత్రికలో రాసిన సంపాదకలేఖ మా దృష్టికి తీసుకొచ్చారొక మిత్రుడు.

ఉత్తర ప్రత్యుత్తరాలూ, సంభాషణలూ జరిగాక అక్టోబరు నాటికి, "సరే" నన్నారు కుటుంబరావు. అప్పటికి మా ఆలోచన కొన్ని సంపుటాలకి విస్తరించింది. ఆయన రచనల సేకరణ ప్రారంభించాం.

ఆ దశలో, అప్పటికి దొరికిన వాటి ఆధారంగా, ఏకసూత్రత ప్రాతిపదిక మీద సంపుటీకరించడం బాగుంటుందనే భావం క్రమంగా బలపడింది. కాని సేక రించిన వాటికంటె సేకరించవలసినవి యింకా చాలా వున్నాయి. అందుకని యేవో కొన్ని ప్రచురించి బయట పడేద్దామనుకోలేకపోయాం.

ఇక యీ సేకరణ, కూర్పు బాధ్యత సమర్థులెవరికయినా అప్పగించనిదే తొందరపనిగా కనిపించలేదు.

అప్పుడు మిత్రులు విశ్వనాథరెడ్డి స్ఫురించారు. ఆయన కొ.కు. రచనలు చాలా వరకు చదివారు. సహృదయ పాఠకుడుగా మెచ్చుకోలుతో చదవడం మాత్రమే కాదు. కొ.కు. నవలలు, కథలపై జరిగే పరిశోధనాకృషితో ప్రత్యక్షం గానూ, పరోక్షంగానూ సంబంధంవుండి పరిశీలనా దృష్టితో చదివారు. ఇందుకు తోడు మా కాయనతోవున్న పరిచయాన్ని బట్టి ఈ కార్యభారాన్ని ఆయన నిర్వ హించగలరన్న నమ్మకమూ వుంది.

అందుకని ఆయన్ని ఈ సంపుటాలకి సంపాదకులుగా వుండమని కోరాం. ఆయన ఆనందంతో అంగీకరించారు. ఆనాటి నుంచి శ్రమించారు.

ఈనాటికి కొ.కు. నవలలు, కథలు, గల్పికలు, నాటికలూ అన్నీ కాక పోయినా చాలా వరకు సేకరించగలిగాం. సేకరణ కృషి కొనసాగిస్తూనే తొలి సంపుటాన్ని మీ ముందుంచ గలుగుతున్నాం.

ప్రకాశకులు

# అందరికీ...

పుస్తక రూపంలో వచ్చిన వాటినో, పుస్తక రూపంలో రాకుండా పత్రికల్లో వున్న వాటినో, వాటి సమాచారాన్నో, వుత్తరాలనో, జీవిత విశేషాలనో, ఫోటోలనో అందించీ, సేకరించడంలో తోడ్పడీ, సలహాలూ, సూచనలూ యిచ్చి వెన్నుతట్టి ఎందరో మిత్రులూ, శ్రేయోభిలాషులూ కుటుంబరావు సాహిత్యం సంకలన యజ్ఞానికి సహకరించారు. మరెందరో తమ సహకారాన్నందిస్తామని మాటిచ్చారు. ఆరంభించిన రెండున్నర సంవత్సరాలకైనా చాలా భాగం కల్పనా సాహిత్య రచనలను సేకరించి ఏరి కూర్చగలుగుతున్నామంటే యిందరు సహృదయ సాహిత్య బంధువుల సహకారం వల్లనే.

వీరిలో శ్రీమతి కొడవటిగంటి వరూధిని, శ్రీయుతులు పి.యన్. ప్రకాశరావు, ఎ. సుధాకరరావు, ఎ. రామమోహనరావు, పి. రామకోటేశ్వరరావు, దాసరి సుబ్రహ్మణ్యం, బి. యస్. రామారావు, ముద్దా విశ్వనాథం, గంగిశెట్టి కుమార్, రావి కొండలరావు, వి.ఎ.కె. రంగారావు, కె.వి. రమణారెడ్డి, రాచమల్లు రామచంద్రారెడ్డి, సొదుం జయరాం, సొదుం గోవిందరెడ్డి, డి.వి.వి.యస్. వర్మ; చలసాని ప్రసాద్, చలసాని ప్రసాదరావు, నండూరి రామమోహనరావు, పురాణం సుబ్రహ్మణ్యశర్మ, ఆరుద్ర, ఆవంత్స సోమసుందర్, యం. రాజారావు, ఆర్వీయార్, కుప్పిరెడ్డి పద్మనాభరెడ్డి, అత్తలూరి నరసింహారావు, కనక్ ప్రవాసి, నండూరి పార్థసారధి, మిరియాల రామకృష్ణ, ఎ.బి. సాయిప్రసాద్, టంకసాల అశోక్, భమిడిపాటి జగన్నాధరావులు, ఆచార్యులు జి. యన్. రెడ్డి, టి. వేణుగోపాలరావు, చల్లా రాధాకృష్ణశర్మలు, డా॥ సర్వోత్తమన్, షణ్ముగం, చి॥ టి.జి.ఆర్. ప్రసాద్, ఎం.ఆర్. వెంకటరమణ, తుమ్మల రామకృష్ణ, కె. శారద, యితర మిత్రులున్నారు. వీరందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

శ్రీ భ్రమరాంబా మల్లేశ్వర ఆంధ్ర గ్రంథాలయం, శ్రీ వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయం (విజయవాడ), సారస్వత నికేతన్ (వేటపాలెం), శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ గ్రంథాలయం, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యలిఖితపత్ర భాండాగారం (తిరుపతి), చిత్తూరుజిల్లా గ్రంథాలయ సంస-వీటిలో పాత పత్రికల సంచికలనుంచీ పుస్తకాలనుంచీ కొన్ని కథల్నూ గల్పికలు మొదలైనవి కాపీ చేసుకున్నాం. ఆయా గ్రంథాలయాధికారు లందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఆదర పూర్వకంగా, యింతటి బాధ్యతను నాకిచ్చి, యీ బృహత్సాహిత్య పథకంలో భాగస్వామినయ్యే అవకాశం కల్పించిన విశాలాంధ్ర సంస్థల బాధ్యులకూ, అడుగడుగునా తమ సూచనలూ ప్రోత్సాహమూ యిస్తూ నా బాధ్యతను అశ్రమంగా నిర్వహించగలిగేందుకు సంపూర్ణ సహకారాన్ని అందించిన శ్రీయుతులు ఏటుకూరి బలరామమూర్తి, తుమ్మల వెంకట్రామయ్య, సొదుం రామమోహన్, పి. పి. సి. జోషిలకు నా హృదయపూర్వక ధన్యవాదాలు. నకళ్ళు తయారు చెయ్యడంలో, సమాచార పట్టికను రూపొందించడంలో సహకరించిన శ్రీయుతులు ఖాదర్ మొహియుద్దీన్, పి. సూర్యనారాయణ, కుమారి అనంతలక్ష్మి మొదలయిన వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

కేతు విశ్వనాథరెడ్డి,
సంపాదకుడు.

# భూమిక

"ఏ రచన ఏ తరగతి పాఠకులకోసం పుట్టిందో, ఆ తరగతి పాఠకులు దాన్ని చదవటం జరగాలి"

—కొడవటిగంటి కుటుంబరావు.

కందుకూరి, గిడుగు, గురజాడల భూస్వామ్య వ్యతిరేక, ప్రజాస్వామిక సాహిత్య వారసత్వాన్ని సామ్యవాదోన్ముఖంగా తీసుకవెళ్ళి, తెలుగువాళ్ళ సాంస్కృతిక పురోగమనానికి దోహదం చేసిన వుత్తమ సాహిత్య స్రష్ట కీ. శే. కొడవటిగంటి కుటుంబరావు. రచనారంగంలో అడుగుపెట్టినప్పటినుండీ (1927) సాహిత్యాన్ని ఒక ప్రబలమైన సామాజిక సంస్కార శక్తిగా భావించి అభ్యుదయ మార్గంలో రచనలుచేసి, అభ్యుదయకర వుద్యమాలతో తన సాహిత్యాన్ని సమన్వయం చేసినందువల్లనే ఆయన సామ్యవాదోన్ముఖంగా తీసుకవెళ్ళగలిగారు. సాంస్కృతిక పురోగమనానికి తోడ్పడగలిగారు. సాహిత్య రచనకూ, శిల్పానికీ గల అనివార్యమైన సంబంధాన్ని గుర్తించినందువల్లనే వుత్తమ సాహిత్య స్రష్టగా నిలిచారు.

దాదాపు యాభైయేళ్ళ కాలంలో కుటుంబరావు పదిపన్నెండువేల పేజీలకు మించిన సాహిత్యం రాశారు. నాలుగువందలకుపైగా కథలూ, దాదాపు యెనభై గల్పికలూ- దాని రూపాంతరాలైన అల్పిక, బుల్లికథ, అభూతకల్పనలూ - యిరవై నవలలూ, వందదాకా రేడియో నాటికలూ, రెండుమూడు సినిమా స్క్రిప్టులూ రాశారు. మౌలికంగా కథా రచయిత, నవలా రచయిత అయినప్పటికీ వివిద అభిరుచులవల్లా సంగీతం, నాటికలు, సినిమాలు, సాహిత్యవిమర్శ, చరిత్ర, సౌందర్య, మనస్తత్వ, ఆర్థిక, రాజకీయ జీవశాస్త్రాలు మొదలైన వాటితో సమకూర్చుకున్న పుష్కలమైన పరిజ్ఞాన సంపదవల్లా, దాన్ని పాఠకులతో, సాటి రచయితలతో పంచుకోవాలనే ఆర్తివల్లా, ప్రగతిశీల వుద్యమ తత్పరతవల్లా, అన్నిటికీమించి అలవరచుకున్న గొప్ప పాత్రికేయ గుణంవల్లా, ఆరేడు వందల వరకు సాహిత్య సాంస్కృతిక వైజ్ఞానిక వ్యాసాలూ, ఫీచర్లూ, పుస్తక సమీక్షలూ, పుస్తక పరిచయాలూ రాశారు. ఎన్ని రకాల సాహిత్యం రాశారో దాదాపు ఆ రకాలన్నీ అనువదించారు. ఎందరికి యెన్నెన్ని విషయాల మీద లేఖలు రాశారో యింకా తేలని విషయమే.

కొత్త కథారూపమైన గల్పికకు తెలుగులో ప్రాచుర్యం కల్పించినవాడు ఆయనే. దినచర్య నవలను (?1940) మొట్టమొదటిసారిగా తెలుగులో ప్రవేశ పెట్టింది ఆయనే. వ్యంగ్య, అధిక్షేప, ప్రతీకాత్మక, శాస్త్రీయ కల్పనా సాహిత్యానికి తెలుగులో గట్టి పునాదులు వేసింది కూడా ఆయనే. ఈ విధంగా సాహిత్య ప్రయోగాలతో తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేయడమేకాదు, బాలసాహిత్యానికి ఆయన "చందమామ"గా వున్నారు. వారపత్రికల ఒరవడిని తీర్చిదిద్దారు. ఉత్తమ అనువాద సాహిత్యాభివృద్ధికి దోహదం చేశారు. సమకాలిక సామాజిక సాహిత్య సమస్యలకు స్పందించే పాఠకులకూ, రచయితలకూ, ప్రేరకశక్తిగా వున్నారు.

ఇతివృత్తాలలోని వాస్తవికత నిరూపణలో, జీవిత వాస్తవాన్ని వ్యాఖ్యానించే అభ్యుదయ దృక్పథంలో, శిల్ప నైపుణ్యంలో, ప్రయోగాలలో, ధోరణిలో, శైలిలో నాటికీ నేటికీ కుటుంబరావు మార్గదర్శకులుగా వున్నారు. జీవిత వాస్తవాన్ని దర్శించి కళాదృష్టితో; శిల్ప నైపుణ్యంతో చిత్రించి వాస్తవికతావాద రచయితలకు చోదక శక్తిగా వున్నారు. సంక్షిప్తత, సూటిదనం, సారళ్యం, పలుకుబడీ, పదునూగల శైలిని సాధించి, ఆధునిక వచనశైలీ వికాసానికి పట్టుగొమ్మగా వున్నారు. దానివల్లనే ఆయన కథలకు కథకుడు; నవలా రచయితలకు నవలా రచయిత; వచన రచయితలకు వచన రచయిత అయ్యారు. అందుకే కుటుంబరావు ఆధునిక భారతీయ సాహిత్య నిర్మాతలలో పరిగణింప దగిన వుత్తమ సాహిత్యకారుడు. ఆయన రచనలకు జాతీయస్థాయిలో రావలసినంత ప్రచారం రాకపోవడం ఆయన రచనలలోపం యెంత మాత్రం కాదు.

కుటుంబరావు, కొడవటిగంటి కుటుంబరావు, కె. కుటుంబరావు, కొ.కు; "రావు", అశ్వని, టి.వి. శంకరం పేర్లతో యెంతో విస్తారంగా రాసిన కుటుంబరావు రచనలు, యింకా యెన్నెన్నో మారుమూల పత్రికల్లో మరుగున పడి వున్నాయి. గ్రంథరూపంలో వచ్చిన రచనలు యెనభై వరకూ వున్నాయి. కానీ యీనాడు రెండు మూడు వ్యాస సంకలనాలూ, ఒకటీ అరా కథాసంపుటాలూ; నవలలూ తప్ప మిగతా వేవీ దొరకడంలేదు. ఈ సందర్భంలో, అన్నిటినీ కాకపోయినా, చెల్లాచెదురుగావున్న కొన్ని నవలలను, కథలను, గల్పికలను, నాటికలను ఏరికూర్చి సంపుటాలుగా తేవడం ఒక విశిష్ట కర్తవ్యమవుతుంది. ఉత్తమ ప్రగతిశీల సాహిత్య విలువల సంస్మరణ, పరిరక్షణ దృష్ట్యా ఒక సామాజిక అవసరమవుతుంది.

ఈనాడు కేవలం వూహాత్మక సమస్యలను సృష్టించి, పాత్రల కష్టాలను చూసి యేడవమనీ, సుఖాలు చూసి పొంగిపొమ్మనీ యేటేటా వందలాది నవలలూ,

వేలాది కథలూ, మినీకథలూ, పదులకొద్దీ నాటికలూ, నాటకాలూ వుత్పత్తి అవుతున్నాయి. కథలు, నవలల పరంగా కుటుంబరావు మాటల్లో చెప్పాలంటే:

> మనదేశం స్వతంత్రమైనాక.... పాఠకుల సంఖ్య హెచ్చింది. వారి అభిరుచుల సగటు ప్రమాణం చాలావరకు పడిపోయింది.... ఈనాటి కథానికలూ.... సినిమాలను జ్ఞాపకం చేస్తున్నవి. అదెలాగంటే, ఇవి సినిమా చిత్రాల ప్రభావానికి బలంగా గురి అవుతున్నవి. వీటిలోకూడా సినిమాలలోలాగా కృత్రిమమైన వ్యక్తి సమస్యలు, సంఘసమస్యలు, వాటి తాలూకు 'ఈక్వేషనులూ' తయారవుతున్నవి. ప్రేమ అనేది, ఎటువంటి సంస్కృతిలో, స్త్రీ పురుషుల సాంఘిక సంబంధాలు ఏ విధంగా ఉండే పరిస్థితిలో, ఎటువంటి మనస్తత్వాలను ఆశ్రయించుకొని పుట్టి పెరుగుతుందో, సూచించిన రచనలు ఈనాడు మచ్చుకైనా కానరావు. కానీ ప్రేమికుల బాధ్యత లేమిటో, వాళ్ళు చేయవలసిన త్యాగాలేవో వైన వైనాలుగా చిత్రిస్తూ అనేక వందల రచనలు వెలువడ్డాయి. ఇదంతా ఎలాంటి సమాజంలో? ఆడపిల్లల తండ్రులు తమ కుమార్తెలను వదిలించుకోవటానికి ఉన్నదంతా పోగొట్టుకుంటున్న సమాజంలో!" (1968).

ఈ చారిత్రక నేపథ్యంలో అన్ని విధాలా వుత్తమమయిన కుటుంబరావు వంటివారి సాహిత్య అవసరం వుంది. ఈ అవసరం అభ్యుదయ సాహిత్య వారసత్వాన్ని పాఠకులకు అందించే దృక్పథంనుంచీ యేర్పడింది. "శ్రామిక వర్గం ముందుకు వచ్చి ఆత్మచైతన్యం కలిగించగల సాహిత్యం సృష్టించుకొనే" వర్ధకూ, అటువంటి సాహిత్యం విరివిగా వచ్చేవరకూ అవసరం వుంది. (అటు తర్వాత కూడా సాహిత్య, సాంస్కృతిక విమర్శద్వారా కుటుంబరావులాంటివారు సృజించిన సాహిత్యాన్ని సజీవంగా వుంచుకోవలసిన బాధ్యత వుంటుంది) "ఏ రచన ఏ తరగతి పాఠకులకోసం పుట్టిందో ఆ తరగతి పాఠకుల"కు పరిచయం చేయ్యవలసిన అవసరం వుంది. కుటుంబరావు సాహిత్యం యీ తరం పాఠకులకే కాదు, రచయితలకూ, విమర్శకులకూ పరిచయం చేయవలసిన అవసరమూ వుంది.

కుటుంబరావు తన నవలలనూ, కథలనూ, గల్పికలనూ, నాటికలనూ ఉద్దేశించింది "lower middle class లో కాస్త గ్రహణ శక్తిగల" వారి కోసం. వీరికోసమే రెండు ప్రపంచయుద్ధాల మధ్యకాలంలోనూ, స్వాతంత్ర్యా నంతర కాలంలోనూ తెలుగు గ్రామీణ, పట్టణ జీవితాల్లో, బొంబాయి, మద్రాసు నగరాల ప్రవాసాంధ్రుల జీవితాల్లో కలిగిన పరిణామాలను చిత్రించారు. ఈ పరిణామాలు మధ్యతరగతివాళ్ళ ఆర్థిక స్థితిగతుల్లో, స్వభావాల్లో జరుగుతున్న

మార్పులను- ఒకవైపు ధనికవాదానికి అనుకూలంగా, మరొకవైపు వ్యతిరేకంగా జరుగుతున్న మార్పులను- వాటి ప్రధాన వైరుధ్యాలను, సంఘర్షణలను చిత్రించారు. కుటుంబరావు తనకు తెలిసిన జీవితంలోంచే చిత్రించిన మధ్యతరగతి మనుషులు, వర్గ మనస్తత్వాన్ని మించిన కులస్వభావాలేవోవున్న పాత్రలు మాత్రం కాదు. చరిత్ర, ఆర్థిక స్థితిగతులు, కుటుంబం, పరిసరాలు, యాదృచ్ఛిక సమావేశాలు, సంఘటనలు, వర్గస్వభావం, చదువు, వ్యక్తిత్వం, సాంఘిక చైతన్యం - ఈ వాతావరణంలోని అన్యోన్య ప్రభావాల నేపథ్యంలో పాత్రలనూ పాత్రల మనస్తత్వాలనూ చిత్రించారు. పిల్లల పెంపకాల్లో, బాంధవ్య సంబంధాల్లో, ప్రేమల్లో, స్నేహాల్లో, వివాహ సంబంధాల్లో, స్వేచ్ఛలో, నీతిలో, అభిరుచుల్లో, విశ్వాసాల్లో యింకా యింకా అనేకమైన భౌతిక వాస్తవిక విషయాల్లో వున్న పరిస్థితిని చిత్రించారు. విశ్లేషించారు. విమర్శించారు. ఇది కాల్పనిక (రొమాంటిక్) చిత్రణకాదు. యాంత్రిక విశ్లేషణ కాదు. నిరాశాపూర్వకమైన విమర్శ అంతకన్నా కాదు. రానున్న పరిస్థితులమీద దృష్టి నిలిపి చేసిన నిశితమైన చిత్రణ, విశ్లేషణ, విమర్శ. ఒక్కమాటలో చెప్పాలంటే "మధ్యతరగతి నియమాలన్నింటినీ తోసిపుచ్చి" మార్క్సిస్టు మానవతా వాదంవైపు సాగే విమర్శనాత్మక వాస్తవికతా వాదానికి కుటుంబరావు రచనలు సంకేతం.

1931 - 1942 మధ్య వచ్చిన కుటుంబరావు రచనలు ఎక్కువగా కుటుంబ బంధుత్వ సంబంధాలు, స్త్రీపురుష సంబంధాల పరంగా సాగాయి. అప్పటికే తెలుగుదేశంలో ప్రచలితంగావున్న భూస్వామ్య వ్యతిరేక, ప్రజాస్వామ్య, జాతీయ భావాల ప్రభావం, సామ్యవాద భావాల స్పృహ, కుటుంబరావు రచనల్లో స్థూలంగా కనిపిస్తాయి. ప్రపంచ ఉత్తమ సాహిత్యాధ్యయనం ద్వారా సంక్రమించిన అంతర్జాతీయ తత్వంకూడ రేఖామాత్రంగా కన్పిస్తుంది. 1930 నాటి ఆర్థిక సంక్షోభం వ్యవసాయ వాణిజ్య రంగాలకిచ్చిన గట్టి కుదుపు, దానివల్ల కలిగిన సామాజిక క్షైణ్యం, దురన్యాయాలూ; ఆ తర్వాత యుద్ధం తెచ్చిన సామాజిక సంక్షోభం, వీటి స్పృహ యీ దశలోని రచనల్లో కనిపిస్తుంది. ఈ దశలో ఆనాటి భారతీయ ప్రగతిశీల మేధావులందరి లాగానే కుటుంబరావుకూడా ఒక **intellectual guide** కోసం తపించినట్టు తోస్తుంది. మార్క్స్ కాపిటల్ చదవటంతో (1942) ఆ మార్గదర్శి కుటుంబరావుకు లభించింది. భౌతిక శాస్త్ర విద్యార్థిగా, రచయితగా, అప్పటికే అలవడిన హేతువాదం, శాస్త్రీయ దృక్పథం "కాపిటల్" చదవటంతో మార్క్సిస్టు ప్రాపంచిక దృక్పథం దిశగా సాగింది. మార్క్సిస్టు సాహిత్యంతో, పత్రికలతో పరిచయం ఏర్పడింది. దీనితో 1942 తర్వాత వచ్చిన రచనల్లో కుటుంబ సామాజిక సంబంధాలకు ప్రాతిపదిక అయిన ఆర్థిక సంబంధాలు, వర్గాల విశ్లేషణ ప్రముఖంగా, నిశితంగా కన్పిస్తుంది. శిల్ప సమన్వితంగా సాగిన వివిధ సమస్యల విశ్లేషణ రెండు తరాల (1940-1960)

మధ్యతరగతి పాఠకుల కనువిప్పుకు కొంతయినా తోడ్పడింది - ఆ చిత్రణద్వారా సంస్కారంలోకి యింకిపోయే చారిత్రక జ్ఞానంవల్ల, భౌతికవాద దృక్పథం వల్ల.

ఈ రకం "కనువిప్పు" కథలూ, నవలలూ రాశారన్న సంగతి యీ తరం పాఠకులలో చాలామందికి తెలియదు. అలాంటివారి కనువిప్పుకు యీ కూర్పు తోడ్పడుతుందని ఆశిస్తున్నాను. చాలామంది యువరచయితల, విమర్శకుల కనువిప్పుకు కూడా ఏమాత్రం తోడ్పడినా అడుగులు ముందుకే పడతాయి.

కుటుంబరావు రచనా సారాన్ని విభజించి చూపడం కష్టమే - ఇతర అభ్యుదయ సాహిత్యంలాగే అది సమగ్ర సామాజిక స్వరూపంగల సాహిత్యం కాబట్టి. వస్తుసారపరిచయ సౌకర్యం కోసం, ఆయన సాహిత్యంలో గుర్తించిన నాలుగు ప్రధానాంశాల పరంగా ఆరు సంపుటాల నిర్మాణం తలపెట్టాము.

ఆ అంశాలు :

1. సామాజిక, రాజకీయ, ఆర్థిక పరిణామాలు-అన్యోన్య ప్రభావాలు.
2. కుటుంబ, బంధుత్వ, ప్రణయ, స్నేహసంబంధాలు, సౌందర్య సమస్య-వాటి మూలాలు, పరిణామాలు.
3. కుటుంబరావు ధోరణి అనదగిన వ్యంగ్య, అధిక్షేప, ప్రతీకాత్మక, కల్పనా సాహిత్యం.
4. శాస్త్రీయ కల్పనా సాహిత్యం.

మొదటి రెండూ వస్తుగతమైనవి. మిగతావి రెండూ కత్తిపదునులాంటి వ్యంగ్యానికీ, కథనానికీ, శైలికీ, టోన్‌కూ, రచనా ప్రత్యేకతకూ సంబంధించినవి. ఈ విభజనను అనుసరించి ప్రచురితమయ్యే ప్రతి సంపుటంలోనూ, వస్తుగతమైన వీక స్వాతంత్రతకు స్థూలంగా ఒదిగిన కొన్ని నవలలు, కథలు, గల్పికలు, నాటికలు వుంటాయి.

ఖచ్చితమైన విభజన పూర్తిగా వీలుకాదు, కాబట్టి యీ విభజనలో అతివ్యాప్తిదోషం వుండవచ్చు. అయినా కుటుంబరావు సాహిత్యంలోని వస్తువైవిధ్యాన్నీ, నిర్వహణనూ, శిల్పవిశిష్టతనూ అనుభవించడానికీ, పరిశీలించడానికీ, వాస్తవికతావాద రచయితగా ఆయనను షేరీజు వేయడానికీ, వాస్తవికతావాద రచయితలకూ, ఇతర రచయితలకు వున్న తేడాను ఆలోచించుకోవడానికీ, అన్నిటికి మించి అభ్యుదయ ప్రాపంచిక దృక్పథాన్ని ఏర్పరచుకోవడానికి ఈ కూర్పు తోడ్పడుతుందని విశ్వసిస్తున్నాను. కుటుంబరావు సాహిత్యం సంపుటాలుగా చూడాలనే చిరకాల వాంఛకూ, యీతరం పాఠకులకు అందించాలనే సంకల్పానికి యిది ఒక సాఫల్యం.

రెండవ ముద్రణలో ట్యూటర్ కథను పరిహరించాము. అది రెండవ సంపుటంలో చేర్చాము. దఅనంగా పరిశోధనా బుద్ధి, సద్యోగం అనే కథలనూ, ఆనందం, ప్రజాహితుడు, మాయపొర అనే గల్పికలను చేర్చాము. కుటుంబరావు మొదటి రచన, మొదటి కథ నిరూపణ విషయంలో జరిగిన పరిశోధనా ఫలితాలను ఈ సంపుటంలో పొందుపరచాము.

మొదటి రెండు సంపుటాలు రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలం, ఆ తర్వాత ఆంధ్రదేశంలో జరిగిన ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక పరిణామాలను-ప్రధానంగా ఆర్థిక సంబంధాలలో వచ్చిన మార్పులను అవగతం చేసుకోడానికి తోడ్పడతాయని ఆశిస్తున్నాం.

హైదరాబాదు

కేతు విశ్వనాథరెడ్డి,
సంపాదకుడు.

# పాఠకులతో కాసేపు

కొడవటిగంటి కుటుంబరావు కలం పట్టేనాటికి భావకవిత్వం రాజ్యమేలు తున్నది. చలం, శ్రీపాదగార్ల కథలను తీసిపారేయలేము కానీ వారు తమ కథల్లోని సమస్యల తాలూకు సామాజిక, ఆర్థిక మూలాల్లోకి వెళ్ళినవారు కాదు. సమస్యలను వస్తుగత దృక్కోణం నుంచి పరిశీలించినవారు కాదు.

సమస్యలను వస్తుగత దృక్కోణం నుంచి పరిశీలిస్తూ, సాహిత్యానికిగల సామాజిక ప్రయోజనాన్ని గుర్తించి, ఆ ప్రయోజనాన్ని సాధించడానికి కలం పట్టుకున్న రచయిత కొ.కు.

సాహిత్యం సాధించాల్సిన సామాజిక ప్రయోజనం పట్ల 1937 నాటికే ఆయనకు స్పష్టమైన అవగాహన వుండింది. 1937 లో ఆయన రాసిన "సాహిత్యం యెందుకు?" అన్న వ్యాసంలో ఇలా అన్నారు. "....మనకు అందుబాటులో వుంచిన ప్రతిశక్తి వినియోగించితే కానీ మన అభివృద్ధి సంపూర్ణంకాదని గ్రహించగలిగితే, ఈ శక్తి దుర్వినియోగం చెయ్యకుండా వుండగలందులకు మనకు సంస్కారం అవసరమని అంగీకరించి తీరాలి ఈ సంస్కారాన్ని మనము శతకోటి లక్షల విధాల సంపాదించగలగవచ్చును. కాని వాటిలో కలం కాగితం మీద పెట్టడం కూడా ఒకటయితే, ఆ విధంగా సంస్కారం పెంపొందించగలది సాహిత్యం తప్ప వాఙ్మయంలో మరొకటి లేదు."

మన సమాజం మరింత ముందుకెళ్ళాలంటే ముందు మన సంస్కారానికి పదును పెట్టుకోవడం అవసరమనీ, అందుకు సాహిత్యం ఆకురాయిలాగా వుపయోగపడుతుందనీ స్పష్టమైన ప్రగతిశీల దృక్పథంతో ఆయన తన తొలిదినాల్లోనే గ్రహించగలిగారు.

కొ.కు. రచనలకు యీ సామాజిక ప్రయోజనం బలమైన ఉత్తేజం వంటిది. ఆయన కలాన్ని నడిపించింది ఈ ఉత్తేజమే. మంది సంస్కారానికి పదునుబెట్టే సాహితీ పోరాటంలో ఆయన గొప్ప క్రూసేడర్.

అయితే సాహితీ సృజనకు ఈ వుత్తేజ మొక్కటే చాలదు. కనీసం మరి రెండు ప్రతిభలైనా రచయితకు అవసరం.

ఆయన "కథా, నవలా" అనే వ్యాసంలో ఇలా అంటారు: "కథల్లో నవలల్లో ప్రతిబింబించే జీవితం తాలూకు వాస్తవికత, జీవిత సత్యం మాత్రమే. ఈ

సత్యం వ్యక్తం కానప్పుడు జీవితాన్ని ఎంత వివరంగా చిత్రించి కూడా యేమీ ప్రయోజనం లేదు. ఆ జీవిత సత్యమే రచనను అభ్యుదయ రచనగా చేసేది."

అంటే జీవిత సత్యం యేదో గ్రహించగలిగే ప్రతిభ వుండాలి. ఇది మొదటి ప్రతిభ. ఇక రెండవ ప్రతిభ. ఇది శిల్ప సంబంధమైంది. ఆయన మాటల్లోనే విందాం:

"అభ్యుదయ రచన అన్నట్లయితే అందులో కళాదృష్టీ, శిల్ప నైపుణ్యమూ అవసరం లేదనీ, శ్రామికవర్గం గురించి రాస్తే ఎట్లా రాసినా అభ్యుదయ రచనేననీ, రకరకాల అపోహలు రచయితల్లో వున్నట్లు కనిపిస్తుంది."

రచనకు జీవిత సత్యం ముడి సరుకు మాత్రమే. ఆ ముడి సరుకుకు కళా రూపం ఇస్తే తప్ప అది రాణించదు. ఈ గుర్తింపు ఆయనకు ఆదినుంచీ వుంది.

నలభైల దశాబ్దం ప్రారంభమయ్యేనాటికే ఆయన స్థూలంగా శాస్త్రీయ ప్రపంచ దృక్పథం సంతరించుకుని, వాస్తవ జీవితాన్ని తన ముడి సరుకుగా వుపయోగించుకున్నారు. ఆయన ఒక వ్యాసంలో యిలా అంటారు: "సాహిత్య కారుడుగా జీవితం నాకు ప్రమాణం. సిద్ధాంతం కోసం జీవితాన్ని వక్రంగా చిత్రిస్తే ఆ రచన ఉత్తమ రచన ఎలా అనిపించుకుంటుందో నాకు యేనాడూ అర్థం కాలేదు."

వాస్తవ జీవితాన్ని చిత్రించడానికి సిద్ధాంత పరిజ్ఞానం ఒక సాధనం మాత్రమే; సంకీర్ణమైన జీవితాన్ని స్పష్టంగా అవగాహన చేసుకోడానికి సిద్ధాంత పరిజ్ఞానం తప్పనిసరిగా అవసరమే.

సామాజిక వాతావరణానికీ, వ్యక్తి జీవితానికీ మధ్య పరస్పర సంబంధం వుంటుంది. జీవితాన్ని సమాజమూ, సమాజాన్ని జీవితమూ పరస్పరం ప్రభావితం చేస్తుంటాయి. పరిస్థితులు కానీ, మనిషికానీ నిత్యం మార్పులకు గురవుతుంటారు. ఈ పారస్పర్య సంబంధం పరిజ్ఞానం, రచన సందర్భంగా ఆయనకు కరదీపికగా పనిచేసింది.

1931 లో రచన ప్రారంభించింది లగాయతు, సృజనాత్మక రచననుంచి విరమించుకునే దాకా, ఆయా కాలాల్లో సమాజాన్ని కలవరపరచిన వివిధ సమస్యలను తన రచనల్లో ఆయన ప్రతిబింబించారు.

ఆర్థిక సంక్షోభం తెచ్చిపెట్టిన అనర్థాలు, పరిశ్రమల విస్తరణ వెంటవున్న సాధక బాధకాలు, యజమానుల లాకౌట్లు, కార్మికుల సమ్మెలు, వాణిజ్య నాగరికతా సమాజంలో వివిధ వర్గాల ప్రజల ప్రతిస్పందనలు, ప్రేమలు, పెళ్ళిళ్ళు, వాటి మధ్యగల వైరుధ్యాలు, ఆత్మిక రంగంపై ఆర్థిక రంగ ప్రభావం, మనిషి ప్రవర్తనలో ఐశ్వర్యం తెచ్చే మార్పు, నగర నాగరికతా విస్తరణలో మంచి

షెడ్డలు, పెట్టుబడిదార్ల నీతికి కార్మికుల నీతికి మధ్యగల వైరుధ్యం వగైరా వగైరా ఈయన రచనల్లో మనకు దర్శనమిస్తాయి.

అయితే ఇంతటి వైవిధ్యపూరిత జీవితాన్ని ప్రదర్శించడం కాదు ఆయన గొప్ప. జీవితంలోని కుళ్లుని కడిగేయాలన్న తపన పాఠకుల్లో కలిగించేలా రచించారు ఆయన. అది ప్రగతిశీల దృక్పథంగల వారికే చేతనవును. 1947 లో ఆయన ఇలా రాశారు: "కళారాధకులలో సాంఘిక చైతన్యం కలిగించడం మన విధి. జీవితం ప్రమాద భూయిష్టంకాదనీ, జీవితానుభవం వెనుక కొన్ని సూత్రా లున్నాయనీ, వాటి సహాయంతో జీవితాన్ని అభ్యుదయ మార్గాల నడిపించ వచ్చుననీ మన రచనల ద్వారా చాటాలి."

ఈ సంపుటంలో మూడు నవలలు, 20 కథలు, 10 గల్పికలు, రెండు నాటికలు వున్నాయి.

మచ్చుకు ఒక నవలనూ, రెండు కథానికలనూ స్థూలంగా పరిశీలిద్దాం.

ముందు "ఎండమావులు" నవల గురించి.

స్వాతంత్ర్యానంతరం, ప్రణాళికల ప్రారంభంతో దేశంలో 'డబ్బురాజ్యం' తిష్టవేసుకుంది. డబ్బు రాజ్యంలో సాధారణంగా డబ్బుదే ప్రధాన పాత్ర. మొత్తం మీద మనుషులమధ్య నేడు చెలామణిలో వున్నవి ఆస్తి సంబంధాలే. ఈ ఆస్తి సంబంధాలలో డబ్బు, దానితో ముడిపడ్డ సామాజిక హోదా మనుషుల మధ్య అఖాతాలను సృష్టిస్తాయి. మనుషుల మధ్య వైమనస్యం, ఎడం, ఒంటరి తనం యేర్పడుతుంది. నేటి సమాజంలోని శ్రమ విభజన కూడా యీ వైమనస్య క్రమాన్ని మరింత పెంచుతున్నది. డబ్బు, హోదా ముందు మనుషుల వ్యక్తిత్వం దాదాపు లుప్తమైపోతుంది; మానవత్వానికి స్థానం తగ్గిపోతుంది. ఇది ఎగుడు దిగుడు సమాజం. జీవిత పరమపదసోపానంలో పాములూ వుంటై, నిచ్చెనలూ వుంటై. పైకి పోయేవాళ్ళు పోతుంటారు. చితికిపోయేవాళ్ళు చితికిపోతుంటారు. పేద రైతులు వ్యవసాయ కార్మికులుగా, ధనిక రైతులు మరీ ధనిక రైతులుగా లేదా పరిశ్రమల యజమానులుగా మారిపోతుంటారు. శ్రమజీవులు కూడా పైకి ఎగబాకే అవకాశాలున్నట్లు కనిపిస్తాయి. కానీ నిజానికి అవి ఎండమావులే. ఎండమావుల వెంట ఎంతగా పరుగులు తీసినా నీళ్ళు దొరకడం కల్ల.

"ఎండమావులు" నవలలోని ప్రధాన పాత్ర రంగారావు జీవితమే ఇందుకు నిదర్శనం.

రంగారావు వడ్రంగి కుమారుడు. గంగితో పెళ్ళవుతుంది. ఇద్దరి మధ్య వున్న సంస్కారపరమైన అఖాతం మూలంగా వారు విడిపోతారు. అప్పటికి రంగారావు వృత్తిరీత్యా కంపోజిటర్. అయినా అప్పుడప్పుడు కథలు రాస్తుంటాడు.

-పెళ్ళాం నుంచి విడిపోగానే అతడు మద్రాసు చేరుకుంటాడు. అతని వెంట సుందరం అనే మిత్రురాలు కూడా మద్రాసు వెడుతుంది.

రంగారావు ఒకవైపు నవల రాస్తూ మరోవైపు ఒకసినిమాకు స్క్రిప్టు రాస్తుంటాడు.

పెట్టుబడిదారీ సమాజం సృష్టించే భ్రమల వలయంలో చిక్కుకుంటాడు. ఇదిగో పైకి ఎగబాకిపోతున్నాను అనుకుంటాడు. ఈ దశలో అతని మనస్తత్వంలో, అలవాట్లలో మార్పు వస్తుంది. శ్రామికవర్గ మనస్తత్వానికి స్వస్తి చెప్పి, పెట్టుబడిదారులను సమర్థించే స్థితికి దిగజారుతాడు. అతనికి ఆత్మ పరిశీలన చేసుకునే శక్తివుంది కాబట్టి, వాస్తవం గ్రహించి బాధపడతాడు. సుందరం, రాజులాంటి మిత్రుల నుంచి రానురాను ఎడం అవుతున్నట్లు, ఒంటరితనం పాలవుతున్నట్లు, డబ్బుకు దాసుడై, ఏది రాయమని శాసిస్తే అది రాస్తూ, అయినవాళ్ళతో సంబంధాలు తాను తెంచుకున్నట్లు తెలుసుకుని బాధపడతాడు.

ఈ దశలో రంగారావు స్వభావ పరిణామం గురించి కొ.కు. యిలా విశ్లేషిస్తారు:

"అతను కొంతకాలంగా అంతర్ముఖుడవుతున్నాడు. సినిమావాళ్ళు ఏం రాయమంటే, అది రాయటమూ, వాళ్ళిచ్చే డబ్బే ప్రధానంగా గణించడమూ అతనికి స్వాభావికంగా కనబడుతున్నది. ఈ వాతావరణంలో కూడా అతనికి సన్నిహిత మిత్రులున్నారు. కానీ వాళ్ళతో తనకున్న అన్యోన్యత రాజుతోనూ, ఇతర ప్రెస్ వర్కర్లతోనూ వున్నటువంటిది కాదు. ఆకాశంలోకి ఎత్తుకు వెళ్ళినకొద్దీ ప్రాణవాయువు తగ్గినట్లుగా యీ సమాజంలో మనుషుల స్థాయి పెరిగినకొద్దీ వాళ్ళ మధ్యగల జీవిత బంధాలు సడలి పోతాయిలాగుంది. దీన్ని రంగారావు ఆమోదించాడు. సుందరం ఆమోదించలేదు...."

మనుషుల స్థాయి పెరిగినకొద్దీ అంటే మనుషుల ఆస్తీ, ఆ పునాదిమీద ఏర్పడిన సామాజిక హోదా అని అర్థం చెప్పుకోవాలి. "జీవిత బంధాలు సడలి పోతాయిలాగుంది" అన్న మాటలకు మనుషుల మధ్య నిజంగా వుండాల్సిన ఆత్మిక సంబంధాలు అదృశ్యమై, వైమనస్య సంబంధాలు ఏర్పడతాయని అర్థం చెప్పుకోవాలి.

అయితే రంగారావు ఆత్మ పరిశోధన చేసుకుని పొరపాటుని పరిహరించుకోగల సంస్కారంవున్న రచయిత కాబట్టి చివరకతడు ఎండమావుల్లాంటి జీవితానికి గుడ్ బై కొట్టి తిరిగి శ్రమజీవిగా జీవించడానికి మనసారా సిద్ధమవుతాడు.

కొ.కు. కథలను పరిశీలించడానికి ముందు చిన్న కథ భవిష్యత్తును ప్రస్తావిస్తూ ఆయన అన్న మాటలను పరిశీలించాలి.

"చిన్న కథ, సామాజిక వ్యవస్థలో మార్పు" అన్న వ్యాసంలో ఇలా అన్నారు:

"మానవజాతి ఎటు పోతున్నది? ఎటు పోవాలి? దారిద్ర్యమూ, అనారోగ్యమూ, సంకుచితత్వమూ, యుద్ధ భయమూ, కులతత్వాలు, మతతత్వాలు, ఇటువంటి సాంఘిక పీడలు నిర్మూలమై ప్రజలు స్వేచ్ఛగా, అవాంతరాలు లేకుండా విబేదాలు పోగొట్టుకుని, తమ ఆర్థిక, విజ్ఞాన, నైతిక జీవితాలను గట్టి పునాదిమీద నిర్మించుకోవడానికి మార్గమేది? కథకులు కూడా ఈ సమస్యలకు ఎడంగా నిలబడివుండలేరు. ఇటువంటి ప్రశ్నలకు వీరు సరైన సమాధానం తెలుసుకునేకొద్దీ కథలు జీవితానికి మరింత సన్నిహితంగా వచ్చి జీవిత సత్యాన్ని చిత్రించ గలుగుతాయి."

పై వాక్యాలు, కొ.కు. కథల్లోని ఇతివృత్తాలేమిటో సూచిస్తున్నాయి.

మిగతా కథకుల మాటేమోకాని కొ.కు. కథలు మాత్రం జీవితానికి మరింత సన్నిహితంగా వచ్చి జీవిత సత్యాన్ని చిత్రించగలుగుతున్నాయి.

పెట్టుబడిదారీ సమాజంలో మనుషుల్లో ఇరవై నాలుగ్గంటలూ వ్యాపార దృష్టి పని చేస్తూంటుంది. అల్లుడుగానీ, తమ్ముడుగానీ ఎవరినైనా వ్యాపారానికే వాడుకుందామనిపిస్తుంది. బంధువుల్ని, బంధువులుగా ప్రేమించడం వేరు, వాళ్ళని అవసరమొస్తే డబ్బుకోసం వాడుకోవడం వేరూను.

'నువ్వులు - తెలకపిండి' అన్న కథలో యీ జీవిత నగ్నసత్యమే వెల్లడిస్తాడు రచయిత.

సోమయాజులు అద్భుతంగా పాడతాడు. గుర్నాదం కూతురు జయలక్ష్మి అతడి మధురమైన గాత్రం విని అతన్ని ప్రేమిస్తుంది. పట్టుపట్టి పెళ్ళి చేసుకుంటుంది. మొదట జయలక్ష్మి తండ్రి గుర్నాధానికి ఈ పెళ్ళి ఇష్టం వుండదు. పెళ్ళయ్యాక సోమయాజులే పెళ్ళాం ఇంటికి కాపరానికి వెడతాడు. జయలక్ష్మి తండ్రి గుర్నాధం, సోదరుడు పరబ్రహ్మశాస్త్రి సోమయాజులులోని గాన ప్రతిభను ఇట్టే కనిపెట్టి, దానిని వ్యాపారంగా మార్చడానికి విజయవంతంగా ప్రారంభిస్తారు. అతడితో నాటకాలు ఆడించి రెండు వందల ప్రదర్శనలు ఇప్పిస్తారు. పరబ్రహ్మశాస్త్రికీ, డైరెక్టరు శేషయ్యకూ పాతికవేలు లాభిస్తుంది. ట్రాజెడీ ఏమిటంటే, సోమయాజులు శాస్త్రీయ సంగీతం నేర్చుకుని ఇతరులకోసం పాడడం ప్రారంభించే సరికి, పాడడంలో సహజసిద్ధంగా లభించే ఆనందాన్ని కోల్పోతాడు.

వాళ్ళు సోమయాజుల్ని అంతటితో వదలరు. ఓ సినిమా తీసి అందులో సోమయాజులు పాడిన పాటలు పన్నెండింటు ఇరికిస్తారు. పాటలన్నీ రికార్డులవుతాయి. విన్నవాళ్ళు చాలా మెచ్చుకుంటారు. ఆ విధంగా వాళ్ళు సోమయాజుల్ని

లును వుపయోగించి అచ్చంగా సంగీత చిత్రాలు తీయడానికే పథకాలు వేసు కుంటారు.

"వాటిమీదవచ్చే లాభం గుర్నాదంగారి మూడో లక్షలో చేరుతుంది. సోమ యాజులు దేమీ వుండదు. నాలుగైదు చిత్రాలవరకూ సోమయాజులుకు తోకా వుండదు. ఆ తర్వాత అతని పాటలు పాతబడసాగుతాయి. ఆ తరువాత సోమ యాజులు తెలకపిండి రూపంలో గానుగలోంచి తోడబడతాడు. గురునాదంగారి వ్యాపారరథం చెక్కుచెదరకుండా ముందుకు సాగిపోతుంది."

అదీ మనిషిని మనిషి వుపయోగించుకునే తీరు.

ఈ సంపుటంలోని ఒక కథలో ఒక పాత్ర ఇలా అంటుంది: "కూలి మానేస్తే కూలివాడికి కూలి నష్టం. యజమానికి అంతకన్నా నష్టం."

అంతకన్నా నష్టం అంటే దాని అర్థం - కూలివాడు ఒక తన కూలి మాత్రమే కోల్పోతే, యజమానేమో వందమంది కూలీలనుంచి రోజూ గుంజే అదనపు విలువను కోల్పోతాడన్నమాట. పెట్టుబడిదార్లు, గ్రామికుల నుంచి అదనపు విలువను అపహరించడాన్నే దోపిడీ అంటారు. మామూలు మాటల్లో అయితే అద నపు విలువ అపహరణను యిలా వివరించవచ్చు.

ఏ పెట్టుబడిదారయినా కార్మికునితో (మేధస్సుతో పనిచేసే కార్మికునితో కూడా) ఎక్కువ శ్రమ చేయించుకుని తక్కువ శ్రమకు మాత్రమే వేతనం చెల్లిస్తాడు. ఇలా వేతనం చెల్లించబడని శ్రమ విలువను అపహరించడాన్నే దోపిడీ అంటారు.

ఈ అదనపు విలువ అపహరణను మనం కొ.కు. గారి 'ట్యూటర్' అన్న కథానికలో (ఈ కథ రెండవ సంపుటంలో ఉంది చూడండి) స్పష్టంగా చూడొచ్చు.

శేఖర్ అనే రచయిత వాణి అనే పెద్దింటి అమ్మాయికి హిందీ ట్యూషన్ చెబుతుంటాడు. ఈలోగా శేఖర్ ఏడాదిపాటు కష్టపడి ఒక నాటకం రాస్తాడు. నాటకం విజయవంతమవుతుంది. ఈ విషయం ఒక సినిమా ప్రొడ్యూసర్‌కు తెలిసి దాన్ని సినిమాగా తీయాలనుకుంటాడు. రచయితకు కబురు పెట్టి, అరవం లోనూ, తెలుగులోనూ నీ కథను సినిమాగా తీస్తాను. అందుగ్గాను నువ్వు అయిదు వేలు పుచ్చుకొమ్మంటాడు. సరేనంటాడు శేఖర్. తన ప్రైవేటు మాష్టారుక్కు ఒక్క దెబ్బతో అయిదు వేలు వస్తాయికదా అని వాణి మురిసిపోయింది. ఆమె శేఖర్‌తో ఆ మాటే అంటుంది.

శేఖర్ మండిపడుతూ "నేనే పేరున్నవాణ్ణయితే అయిదు వేలిస్తాననడానికి సాహసించేవాడా? నన్నడిగితే రాబరీ (దోపిడీ) అంటాను. డే లైట్ రాబరీ" అని అంటాడు.

ii)

మరి అంత తక్కువ మొత్తానికి ఎందుకు ఒప్పుకున్నావు మహానుభావా అంటే ఇలా సమాధానమిస్తాడు: "నెసెసిటీ, నాబోటివాళ్ళకు నెసెసిటీ (అవసరం) అనేది ఒకటుంది సిస్టర్. నెలకు నూరు రూపాయలు ట్యూషన్ ఎందుకు యాక్సెప్ట్ చేశాను? నెసెసిటీ. నేను బతకాలంటే యీ దోపిడీకి ఒప్పుకోవాలి."

అన్నట్లు యీ కథను మొత్తం మూడు భాషల్లో సినిమా తీస్తారు. ప్రొడ్యూసర్‌కు కొన్ని లక్షలు లాభం వచ్చి వుంటుంది. అయితే కథ రాసిన మేధావికి ముట్టింది మాత్రం ముష్టి అయిదువేలే. కొ.కు. లోని శ్రామికజన పక్షపాతం ఇందులో స్పష్టంగా ప్రతిబింబిస్తున్నది. ఈ కధానిక శ్రమజీవులకు స్టెన్‌గన్ వంటిది.

ఆయా నిర్దిష్ట సామాజిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితుల్లో మనుషులు వాటికి ఎలా ప్రతిస్పందించారో మనకి సంపుటిలోని కథలు చదివితే తెలుస్తుంది. ముఖ్యంగా నగరాల్లోని మధ్యతరగతి జీవితాలకు పట్టిన అద్దంలాటివి ఈయన కథలు. మాయదారి మధ్యతరగతి సంస్కారంలోని చెడుల్నీ, బలహీనతల్నీ ప్రదర్శించడమేకాక, వాటిమీద పాఠకులకు అసహ్యం కలిగేలా చేస్తారు, కొ.కు.

మధ్యతరగతి సంస్కారాన్ని ఆయన ఎంతగా ఈసడించుకుంటాతో శ్రామికవర్గ సంస్కారాన్ని అంతగా ప్రేమిస్తారు. ఈ శ్రామికవర్గ పక్షపాతి 1955లో ఇలా అన్నారు: "భావి సాంఘిక పరిణామానికి మూలకందమైన శ్రామిక వర్గంలో యింకా కళాచైతన్యం రాలేదు. కాని వస్తుంది. జీవిత సత్యం తాలూకు కీలకం వారి చేతిలోవుంది. వారిలో నుంచి కథకులూ నవలాకారులూ బయలుదేరి తమ జీవితాన్నీ, దాని వెనక దాగివుండే సత్యాన్ని చిత్రించడం ప్రారంభించినాక యీనాడు మనం చూసి మురిసే సాహిత్యం పేలపిండిలాగా గోచరిస్తుంది." సాహిత్యానికి వున్న సాపేక్ష విలువను ఒక్క ముక్కలో చెప్పారు ఆయన.

జీవిత సత్యాన్ని వ్యక్తం చేయని సాహిత్యంవల్ల ప్రయోజనం లేదంటారు ఆయన. ఆయన అన్న యీ మాటను దృష్టిలో పెట్టుకుని ఇందులోని "నడమంత్రపు సిరి" అనే నాటికలో ఆయన వెల్లడించిన జీవితసత్యం యేమిటో పరిశీలిద్దాం.

మనిషిలో నేడున్నంత స్వార్థం గతంలో యేనాడూలేదు. ప్రతి మనిషీ ఎదుటి మనిషిని ఎరగానే వాడుకోవాలనుకుంటాడు. ఎప్పుడు ఎవ్వర్ని ఎలా స్వార్థానికి వినియోగించుకుందామా అని ఎదురు చూస్తుంటాడు. ఈ స్వార్థం మంటల్లో స్నేహం, బంధుత్వం అన్నీ సమిధలుగానే వుపయోగింపబడతాయి. ఇది నేటి జీవితాల నగ్నసత్యం. ఈ నగ్నసత్యాన్ని "నడమంత్రపు సిరి" నాటికలో మనం స్పష్టంగా గమనించవచ్చు.

ట్యుటోరియల్ కాలేజీ నడుపుతూ శాస్త్రి, దాసును తన స్వార్థానికి వాడుకుని పైకి రావాలనుకుంటాడు. ఆ స్థానంలో సీత వస్తుంది. ఆమెను టీచర్‌గా తన స్వార్థానికి వినియోగించుకుని పైకి ఎగబాకాలనుకుంటాడు శాస్త్రి. ఆమెకు కూడా దాసు సినిమాఛాన్సు ప్రసాదిస్తాడు. ఇద్దరూ సినిమా ఫీల్డులో వుంటారు. సీత తాను ఎలాచెప్తే అలా నడుచుకునే మనిషి అన్న అభిప్రాయం కలిగించి ముందుకు పోవాలనుకుంటాడు దాసు. అయితే సీత పడనివ్వదు. ఆమెను డైరెక్టర్ కూడా తన హద్దుల్లో పెట్టడానికి ప్రయత్నిస్తాడు. సీతమాటల్లో చెబితే "ఒక మెట్టు మీదనుంచి కాలు తీయకుంటే ఇంకో మెట్టు ఎట్లా ఎక్కటం? ఆ డైరెక్టర్‌కూ ఇదే రోగం ఆరంభమైంది. ప్రౌఢవ్యాసర్లతో స్నేహంగా వుండొద్దంటాడు."

సీతకు నడమంత్రపు సిరి వచ్చి దాసును, డైరెక్టర్‌నూ ఎక్కివచ్చిన నిచ్చెన లాగా తన్నివేయాలనుకుంటుంది. జీవితం తాలూకు ఒక సత్యాన్ని ఎంతో స్పష్టంగా చూపించారు యీ నాటికలో.

అయితే మధ్యతరగతి సంస్కారంలోని రుణధృవాన్నే కాక ధనధృవాన్ని చూపెట్టిన కథలు కూడా వున్నాయి ఇందులో.

'గల్పిక' అనే సాహితీ ప్రక్రియను పరిపుష్టం చేసినవారు కొ.కు. గారే.

కథానికలకూ, గల్పికలకూ, ఒక తేడావుంది. కథలు ప్రధానంగా సంస్కారాన్ని మెరుగుపరిస్తే, గల్పికలు ప్రధానంగా విజ్ఞానాన్ని పెంచడానికి వుపకరిస్తాయి. 'గల్పిక'కు గొప్ప educative values వున్నట్లు ఈయన గల్పికలు చదివితే స్పష్టంగా తెలుస్తుంది.

కొ.కు. రచనలను నేటితరం పాఠకులకు పరిచయం చేయాల్సిన అవసరం గురించి మిత్రుడు కేతు విశ్వనాథరెడ్డి చెప్పినప్పటికీ, నామాటగా ఒకటి చెప్పాలని పిస్తున్నది.

బూర్జువా ఆర్థిక శాస్త్రంలోని గ్రెషమ్ సూత్రం గురించి కొ.కు. తన రచనల్లో తరచుగా ప్రస్తావించారు. చెడ్డడబ్బు, మంచిడబ్బును చలామణీ నుంచి తరిమేస్తుంది అంటుంది గ్రెషమ్ సూత్రం. అంటే వెండిపాలు ఎక్కువగావున్న నాణాలూ, వెండిపాలు తక్కువగావున్న నాణాలు చలామణీలో వున్నట్లయితే, ప్రజలు సహజం గానే వెండి ఎక్కువవున్న నాణేలను ఇళ్ళల్లో దాచుకుని వెండి తక్కువవున్న నాణే అనే చలామణీలోకి తోస్తూంటారు.

నేడు తెలుగు సాహితీరంగంలో గ్రెషమ్ సూత్రం ఒక రకంగా ఆపరేట్ అవుతున్నది. అంటే మనిషి సంస్కారాన్ని పెంచే వుత్తమ సాహిత్యం మరుగున పడుతున్నది. మరోవైపు పాఠకుల మతులుపోగొట్టే క్షీణ సాహిత్యం పుష్కలంగా

సంస్కారం అనుభవంలోకి వచ్చింది. ఈ రకం అనుభవాల మూలంగా పల్లెటూరి వాతావరణాన్ని యిష్టపడినా హేతురహితమైన విశ్వాసాలు రుద్దే ముసలిబుద్ధులను ఆయన అసహ్యించుకునేవారు. కొడవటిగంటి కుటుంబరావులోని యీ నాగరిక మనస్తత్వం తర్వాత కాలంలో పెరిగిందే తప్ప తరగలేదు. పదహారోయేటనే పెద్దకట్టె మనిషి అనిపించుకున్నాడు. "ఆడిపోసుకోవడం, కుళ్ళటం, విషం కక్కటం, లేచిపోయిన వాళ్ళను గురించి, పరిస్థితుల అన్యాయానికి గురైన వార్ని గురించి", బంధువులు "రాళ్ళు విసరటం, జాలి నటించటాన్ని యీయన విరిచేసే" వారు. బంధువర్గకశ్మలం ఆధారంగా సమాజకశ్మలం కుటుంబరావుకు యీ దశలో అర్థమయింది.

1914 లో తండ్రి మరణించారు. 1920 లో తల్లి మరణించింది. పెత్తండ్రి సంరక్షణలో బాల్యం గడిచింది. హేతువాద దృష్టి అలవడడానికి బహుశా ఈ పెంపకం కూడా కారణమేమో? ఈ రోజుల్లోనే సహాయనిరాకరణోద్యమం ఆయనను ఆకర్షించింది. పదకొండేళ్ళ వయసులో తెనాలిలోని జాతీయ పాఠశాలలో చేరాలని వుత్సహించారు. కొంతకాలం జాతీయ కళాశాలలో వడ్రంగం నేర్చుకున్నారు. కుటుంబరావు బాల్య స్మృతుల ఛాయలు "చదువు", "అనుభవం" నవలల్లో "యెందుకూ కొరగాడు", "మొండివాడు" వంటి కథల్లో కనిపిస్తాయి. చేతివృత్తులమీద మమకారానికి చిహ్నం "ఎండమావులు" నవలలోని రాఘవులు వడ్రంగం వృత్తి చిత్రణ.

అన్నగారైన వెంకటసుబ్బయ్య కవి, కథకుడు. సాహితీసమితి ముఖ్యుడు. (1921 లో ఇల్లు విడిచి లోకం మీదికెళ్ళారు. ఏమయ్యారో తెలియదు.) వెంకటసుబ్బయ్య కోసం వచ్చిపోయే సాహితీ సమితి సభ్యులు, కాల్పనికయుగ కవుల పరిచయం యీ దశలో యేర్పడింది. ఈ సాహిత్య వాతావరణంలో పాఠ్య పుస్తకాల చదువుతోపాటు ఆధునిక సృజనాత్మక సాహిత్య పఠనాసక్తి ప్రారంభమైంది. చదవటమూ, రాయటమూ రాగానే సుమతి శతకం, కుచేలోపాఖ్యానం, రుక్మిణీ కళ్యాణం, ప్రహ్లాదచరిత్ర, గజేంద్ర మోక్షం కథలు చదివారు. ఎనిమిదేళ్ళలోనే గురజాడ కన్యాశుల్కం చదివారు. వీరేశలింగం తిర్యగ్విద్వన్మహాసభ, మహారణ్య పురాధిపత్యం చదివారు. బావ పిల్లలమర్రి గోపాలకృష్ణయ్య ద్వారా తెలుగు ప్రాచీన సాహిత్య పరిచయం యేర్పడింది. పాశ్చాత్య సాహిత్య సంపర్కం కూడా ఈ రోజుల్లోనే కలిగింది.

పదోయేట ఒక స్నేహితుడికి తొమ్మిది రోజులపాటు తరగని కథ చెప్పారు. పదమూడోయేట తలా తోకాలేని డిటెక్టివ్ నవల కొంత రాసిపడేశారు. కవిత్వం జోలికి వెళ్ళి అది తన ఒంటికి సరిపడదని తెలుసుకున్నారు. చదువుకు, సృజనకు సంబంధించిన జిజ్ఞాస, ఆర్తి యిట్లా సాగుతుండగానే 1924 లో వుపనయనం జరిగింది. స్కూలుఫైనలు పరీక్షల సమయంలో (1925), కొల్లూరులో

గ్రామస్థులైన మెట్టా వెంకటరత్నశాస్త్రి, సీతమ్మల కుమార్తె పద్మావతితో కుటుంబరావు పెళ్ళి జరిగింది. పెళ్ళికూతురు వయసు ఆనాటికి పదకొండేళ్ళు. విజయవాడలోని గోపువారి సత్రంలో అయిదురోజులపాటు సంప్రదాయ పద్ధతిలో యీ బాల్య వివాహం జరిగింది.

గుంటూరు ఎ. సీ. కాలేజీలో 1925-1927 మధ్య ఇంటరు చదివారు. ఈ రెండేళ్ళలో పఠనాసక్తి పెరిగింది. హాస్టల్ వార్డెనుగా వుంటున్న ఉపాధ్యాయులు తెలికచెర్ల వెంకటరత్నం కింద రాజశేఖర చరిత్ర, గోరా నవలలు చదివారు. కాలేజీలో గిడుగువారి ఉపన్యాసం వినటంతో ఆయనకు వాడుక భాష జీవశక్తి అర్థమైంది. కృష్ణశాస్త్రి పద్యాల, ఎంకిపాటల మాధుర్యమూ, నాటకాలూ, సంగీతమూ, కథలూ అనుభవంలోకి వచ్చాయి. కాంగ్రెసు మీటింగుకు మద్రాసు వెళ్ళారు (1927). కథలు రాయాలనే వుత్సుకత కలిగింది. కానీ రాయలేని అశక్తత అడ్డుపడింది.

మొదటినుంచీ ఫిజిక్సు యిష్టం కావడంవల్ల, విజయనగరం మహారాజా కాలేజీలో 1927-29 మధ్య బి.ఎ. ఫిజిక్సు చదివారు. డా॥ ఎ. ఎల్. నారాయణ, డా॥ బుర్రా శేషగిరిరావు, కిళాంబి రంగాచార్యులువంటి మంచి ఉపాధ్యాయులకు శిష్యుడయ్యారు. విజయనగరంలో వుండగా హాస్టల్‌డేకు భమిడిపాటివారు 'బాగు బాగు' ఆడారు. ఆ నాటకాన్ని నిర్వహించే భారాన్ని వహించారు. ఈ రోజుల్లో అంతర్జాతీయ సాహిత్యంతో ఆయనకు పరిచయం విస్తారంగా యేర్పడింది. రచనా వ్యాసంగానికి బీజాలు పడ్డాయి. ఆనాడొస్తున్న కథావాఙ్మయం మీద అసంతృప్తితో మంచి కథలు రాయాలని తపించారు. ఆ తపనలో విపరీతంగా రాసేవారు. పెట్టె నిండా కథలతో నిండిన ఎక్సర్‌సైజు పుస్తకాలే. సాధనకోసం తన రచనలు తానే విమర్శించుకుంటూ చించిపారేసేవారు. శిల్పసాధనకు ఈ కృషి తోడ్పడింది. అప్పటిదాకా చేస్తున్న సంధ్యావందనాది ఆచారాలు వదిలేశారు. హేతువాదిగా ఈ రోజుల్లోనే పూర్తిగా మారారు.

1929 లో బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో ఎం.ఎస్‌సీ ఫిజిక్స్‌లో చేరారు. బెనారస్‌లో చదివేటప్పుడు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులైన మదన మోహన మాలవ్యా ఉదార రాజకీయ విధానాల స్వేచ్ఛావాతావరణంలో ఆయన మానసిక స్వాతంత్ర్యం పురులు విప్పింది. పాకీవాళ్ళు వడ్డించిన చాపకూడుకు హాజరయ్యారు. శాసనోల్లంఘన వుద్యమంకంటే కూడా టెర్రరిస్టు వుద్యమమే ఆయనను ఆకర్షించింది. అయితే యూనివర్శిటీలోనే వున్న విప్లవకారులతో విప్లవ వాదులతో ఆయనకు పరిచయాలు లేవు. ఈ అనుభవాల మధ్య నిరంతర పరిశీలన సాహిత్య పరిశ్రమ కొనసాగుతూనే వున్నందువల్ల 1930 నాటికి ఆయన రచయితగా ఆవిర్భవించారు. మొదటి వ్యాసం 'సినిమా' కలకత్తానుంచే వెలువడే ఓరియంటల్ వీక్లీలో ప్రచురితమైంది. ("అప్పారావు గారి పరిచయం" అనే వ్యాసాన్ని 1929

సెప్టెంబరు, 22 కృష్ణా పత్రికలో గురజాడపై తమ 13వ ఏట కుటుంబరావు రాసినట్లు కాత్యాయని విద్మహే కొడవటిగంటి కుటుంబరావు వాఙ్మయ సూచిక (రచయిత్రి, వరంగల్లు, 1986) పేర్కొన్నారు.) మొదటి కథ 'ప్రాణాధికం' గృహలక్ష్మిలో అగ్రస్థానాన్ని పొందింది (1931). (సుభాషి అనే పత్రిక 1927 అక్టోబరు సంచికలో ఆంధ్ర విష్ణువు అనే కథను రాసినట్లు కాత్యాయని విద్మహే వాఙ్మయ సూచికలో పేర్కొన్నారు.) తమ్ముడు కృష్ణమూర్తి కూడా కథలు రాయటానికి కుటుంబరావు ప్రేరకుడయ్యాడు. (కొడవటిగంటి కృష్ణమూర్తి తన కథల సంపుటి "మాలో మేము"కు రాసిన పరిచయం యధాతథంగా ఇస్తున్నాం. చూడండి)

ఆర్థికమాంద్యం మూలంగా సంఘటిల్లిన ఆర్థిక యిబ్బందులు వచ్చిపడ్డాయి. ఆ అంతర్జాతీయ సంక్షోభం తెనాలిని తాకింది. 24 ఎకరాల ఆస్తి, 1000 గజాల ఆవరణలో వున్న పెద్దయిల్లు హరించుకుపోయాయి. ఎం ఎస్‌సి రెండో సంవత్సరం చదువు ఆగిపోయింది.

ఆ పరిస్థితుల్లో వుద్యోగం చేయాలి. సంసార బాధ్యతలున్నాయి. తెనాలి మునిసిపల్ హైస్కూల్లో వుద్యోగం చేయమనీ, మేనేజిమెంటులోని కులస్తులు సహకరిస్తారనీ సన్నిహితులు చెప్పినపుడు ఒప్పుకోలేదు. "కమిటీ మెంబర్లయిన సన్నాసులందరికీ గుడ్‌మార్నింగ్ కొట్టలేను" అని అన్నారట. ఉద్యోగం అంటే విముఖత్వం, స్వేచ్ఛాప్రియత్వం కుటుంబరావు లక్షణాలు. వరంగల్‌లో ట్యూషన్లు చెప్పే స్వంత వుద్యోగం 1931 లో కొన్నాళ్ళు చేశారు. ఆ తర్వాత తెనాలికే తిరిగివచ్చారు. ఈ యేడాదే మొదటి కొడుకు రామచంద్రరావు జన్మించారు. 1930-31 ఖద్దరు ప్రచార ప్రభావంవల్ల ఖద్దరు వస్త్రధారణ చేశారు.

1934 లో చక్రపాణి, పిల్లలమర్రి బాలకృష్ణశాస్త్రి, పిల్లలమర్రి సాంబశివ రావు మొదలైన వాళ్ళతో యువప్రెస్ స్థాపించారు. యువపత్రిక ప్రచురణ ఆరంభించారు. ప్రెస్సుకు నష్టం వచ్చింది. పత్రిక ఆగిపోయింది. ఈ దశలో చక్రపాణితో పరిచయం ఏర్పడ్డది. కమ్యూనిస్టుపార్టీ ఆవిర్భావం (1934) తెనాలిలో దాని ప్రభావం కొడవటిగంటి కుటుంబరావుకు పరిచితమయ్యాయి. పిరాఖి మన్య సినిమా తీసే సందర్భంలో 1936 లో ఆరునెలలు బొంబాయిలో వున్నారు. బొంబాయినుంచి మద్రాసుకు, మద్రాసునుంచి తెనాలికీ తిరిగి, 1937-39 మధ్య తెనాలిలో వున్నారు. 1937 ఎన్నికల హడావిడిలో పాల్గొన్నారు. యువప్రచురణలు మొదలయ్యాయి. ఆయన మొదటి కధాసంపుటాలు కారుణ్యం (1937), ఇల్లరికం (1937), స్వగతం (1939) వచ్చాయి. ఈ మూడు కథాసంపుటాలకు తన కథారచన మేనిఫెస్టోలు సమకూర్చారు.

తన కథల సంపుటి కారుణ్యం తరువాత రెండవ ప్రచురణగా చలంగారి "పాపం" ప్రచురించి ప్రజామిత్ర కోపానికి గురి అయ్యారు. బాలకృష్ణశాస్త్రి,



కుటుంబరావు - పద్మావతి

(1925 లో జరిగిన మొదటి వివాహం)

మునిమాణిక్యం, బొడ్డు బాపిరాజు రచనలను అందించారు. సౌరిస్ ఉత్తమ కథా రచయితల శ్రేణిలో తప్పక స్థానం సంపాదించుకొంటుందనే నమ్మకం ప్రకటిస్తూ సౌరిస్ కథ ఉషను యువకథావళి ద్వారా పరిచయం చేశారు.

1939 జూన్‌లో బాలనాగమ్మ స్క్రిప్టు రచయితగా ఊటీ వెళ్ళారు. 1939 చివర్లో తెనాలి వచ్చారు. భార్య పద్మావతి మరణించింది. నవంబరు 1940 నుండి 1942 ఫిబ్రవరి వరకు జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రితో కలిసి ఆంధ్ర పత్రిక వారపత్రికలో వుద్యోగం చేశారు. 1942లోనే బొంబాయికి వెళ్ళి అక్కడ నాలుగున్నర నెలలపాటు మెటల్ ఫాక్టరీలో వుద్యోగం చేశారు. జూలై 1942, జనవరి 1943 మధ్య సిమ్లాలో, నేషనల్ వార్ క్రియేటివ్ పబ్లిసిటీ యూనిట్‌లో ఆరుమాసాలు కాపీరైటరు వుద్యోగం చేశారు. అప్పుడు ఐరిష్ జాతీయవాది బ్రిటిష్ వ్యతిరేకి ఎల్విన్‌వుడ్ ఆ శాఖ డైరెక్టరు.

జనవరి 1944, జూన్ 1944 మధ్య జయపూర్‌లో ఇనస్పెక్టరేట్ ఆఫ్ మెటల్ అండ్ స్టీల్‌లో ఫోర్మన్‌గా వున్నారు. విజయనగరం ఆర్.డి.ఓ. అవసరాల జగన్నాథరావు కుమార్తెతో రెండవ పెళ్ళి జరిగింది. రెణ్ణెల్లకాపురం తర్వాత భార్య ఆకస్మికంగా జయపూర్‌లోనే మరణించింది.

19౼5 నవంబరు 30వ తేదీన కొమ్మూరి వెంకట్రామయ్య (గుడిపాటి వెంకటచలం స్వయాన తమ్ముడు) పద్మావతి (ప్రసిద్ధ నటి) పెద్ద కూతురు శ్రీమతి వరూధినితో పెళ్ళి జరిగింది. బళ్ళారి రాఘవ పెళ్ళిపెద్దగా వ్యవహరించారు. శ్రీశ్రీ, మా గోఖలే సాక్షి సంతకాలతో రిజిష్టరు పెళ్ళి జరిగింది. వివాహం జరిపించినవారు శ్రీమతి దుర్గాభాయి దేశ్‌ముఖ్. పెళ్ళినాటికి కుటుంబరావు నిరుద్యోగే.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలోనే కుటుంబరావు ప్రాపంచిక దృక్పథం మార్క్సిజం వైపు మళ్ళింది. 1942లో మార్క్స్ కాపిటల్ చదివారు. మార్క్సిస్టు సాహిత్యంతో, పీపుల్స్‌వార్‌వంటి పత్రికలతో పరిచయం యేర్పడింది. జీవితంలోని అస్తవ్యస్తతకు, కుళ్ళుకు కారణాలేమిటో; విరుగుడు యేమిటో తెలిసి వచ్చింది. శ్రీశ్రీవంటివారు సన్నిహితమయ్యారు. విస్తృతమైన ప్రాపంచికానుభవాల మూలంగా సుపరిచితమైన సామాజిక వాతావరణాన్ని యెట్లా యెందుకు చిత్రించాలో తెలిసివచ్చింది. అనుభవంలోకి వచ్చిన తెలుగు వాతావరణాన్ని చిత్రించారు. కుటుంబరావు జీవితంలోనూ, సాహిత్యంలోనూ అరుణోదయం జరిగింది.

అస్థిరత్వం యింకా కొనసాగుతూనేవుంది. 1947 ఏప్రిల్ 8వ తేదీ కూతురు శాంతసుందరి పుట్టాక కూడా మళ్ళీ దేశాటనం మొదలైంది. బొంబాయి ఏర్ ఇండియా కార్యాలయంలో రోజువారీ కూలీమీద అకౌంట్సు క్లర్క్‌గా 1948లో మూడు నెలలు గుమాస్తా వుద్యోగం చేశారు. అక్టోబరు 1948లో ఆంధ్రపత్రిక దినపత్రికలో చేరారు. ఆ తర్వాత 50-51 ప్రాంతాల్లో వారపత్రిక సంపాదకత్వ బాధ్యత తీసుకున్నారు. కొత్తతరం రచయితల కథలతో ప్రత్యేక శీర్షికలతో

సాహిత్య పత్రికగా, ఆంధ్రపత్రిక ఒరవడిని దిద్ది తీర్చారు. పత్రిక విలువను పెంచారు. ఆంధ్రపత్రికలో వుద్యోగం చేస్తున్న రోజుల్లోనే 1949 సెప్టెంబరు 14 వ తేదీన కొడుకు రోహిణీప్రసాద్ పుట్టాడు. 1951 అక్టోబరు 28 వ తేదీ వెంకట రామారావు (బగ్గి) పుట్టాడు. (1957 సెప్టెంబరు 15 వ తేదీ మరణించాడు.) 1951 లో సినిమా మాసపత్రిక సంపాదకత్వ బాధ్యతను కొన్నాళ్లు నిర్వహించారు. 1952 జనవరి మొదటి తేదీనుండి చివరి శ్వాసవరకు (మరణం 1980 ఆగష్టు 17 సాయంత్రం 7-15గం.) చందమామలో వుండి మాయమయ్యారు.

భావుకుడైన మధ్యతరగతి యువకుల స్థిరంలేని వుద్యోగమూ, జీవితమూ, చేసే రకరకాల వుద్యోగాలూ, జీవనోపాధికి అక్కరకురాని చదువులూ యేవిధంగా వుంటాయో అరుణోదయం, గడ్డురోజులు, జీవితం, వారసత్వం, ఎండమావులు వంటి నవలల్లో ఈ వివిధానుభవాల మూలంగానే చిత్రించారు. కార్మికులతోటి ఆయనకు కలిగిన సంబంధాల ప్రభావం కొత్తజీవితం వంటి కథల్లో కన్పిస్తుంది. నవలల్లో, కథల్లో, గల్పికల్లో బహుముఖమైన ఆయన అనుభవాలూ వివిధ అభిరుచులూ, విస్తారమైన జ్ఞానసంపదా కథావాతావరణంలో యిమిడిపోయి, సామాజికానుభవాలుగా, అభిరుచులుగా జ్ఞానసంపదగా రూపొంది కన్పిస్తాయి. (కొడవటిగంటి కుటుంబరావుకు సంగీతంలో వున్న అభినివేశం సామాన్యమైందికాదు. 1924 నుంచే బాలగంధర్వ మొదలు బాలమురళీకృష్ణ వరకుగల సంగీతవేత్తల పాటలు అనుభవించి పలవరించారు. స్వయంగా సంగీత సాధనచేశారు. హార్మోనియం నేర్చుకున్నారు. సితారా వాయించేవారు. నటులతో పరిచయాలు సరేసరి. తెనాలిలో ఆ రోజుల్లో గ్రామఫోనువున్న ఒకరిద్దరిలో కొడవటిగంటి కుటుంబరావు ఒకరు. బొబ్బిలియుద్ధం నాటకంలో బుస్సీవేషం వేశారు. తార్డేవ్ శ్రీకృష్ణతులాభారం సినిమాలో సంభాషణలు లేని ధృతరాష్ట్రుడి వేషం వేసి, కళ్ళు తెరుచుకునే నటిస్తానని చెప్పి నటించారు. తారుమారులో కొద్ది సంభాషణలున్న మేనేజరు వేషం వేశారు. వీటికితోడు ఫోటోగ్రఫీ, హోమియో వైద్యం సైన్సు పుస్తకాలు చదవడం ఆయన అభిరుచులు. కొందరికి పోస్టుద్వారా హోమియో వైద్యం చేశారు కూడా.)

చందమామలో స్థిరపడేదాకా ఆయనకు వుద్యోగ స్థిమితమంటూ లేదు. ప్రవృత్తిలోని వుద్యోగ విముఖత్వమే యిందుకు కారణం. ఈ కారణంగా యెన్నో ఆర్థికమైన ఇబ్బందులకు గురి అయ్యారు. కుటుంబ దుఃఖాలు కొల్లలు. అయితే యేనాడూ తన బాధలు తానే పడేవారు. ఒకళ్ళకు తగలనిచ్చేవారుకాదు. కుటుంబ దుఃఖాలనుంచీ, ఆర్థిక బాధలనుంచీ ఆయనకు హృదయ దౌర్బల్యం యేనాడూ యేర్పడలేదు. అనితరసాధ్యమైన దృఢమైన వ్యక్తిత్వం, సంయమనం యేర్పడ్డాయి. వాటిని కాపాడుకుంటూ వచ్చారు. చిన్ననాడే అబ్బిన సంగీతం, నాటకాలు, సినిమాలు, హోమియోపతి తదితర అభిరుచులను పోషించుకుంటూ వచ్చారు. నిరంతరాధ్యయనశీలిగా వున్నారు.



కుమార్తె శాంతసుందరి వివాహం - కుటుంబరావు, కొడవటిగంటి కృష్ణమూర్తి, మెట్టా రాజారావు కుటుంబ సభ్యులు

ఏదో అమెరికన్ పత్రికలో SALLY అనే ఒక పెద్దకథ పడినపుడు 1941 లో ఒకరోజు "ఇంతకన్నా బాగా రాయవచ్చునే" అని కొడవటిగంటి కుటుంబరావు, గోరాశాస్త్రి గారితో అన్నారు. "రాయి చూస్తా" అన్నారు గోరా శాస్త్రి. ఆరోజే ప్రారంభించి 'నీకేం కావాలి' రాశారు. రాసి కస్తూరి పాత్ర SALLYకి యేమాత్రం తీసిపోదని నిరూపించారు. అలాగే అదే ఏడాది చక్రపాణి ప్రోద్బలంతో కులంలేని మనిషి ఒకరోజు ఉదయం ప్రారంభించి రాత్రికి పూర్తి చేశారు. ఈ దృష్టాంతాల్ని బట్టి కుటుంబరావు పాశ్చాత్య సాహిత్య పరిచయమూ; ఆత్మ విశ్వాసమూ, రచనావేగమూ అర్థమవుతాయి.

కొడవటిగంటి కుటుంబరావు యేనాడూ జీతం డబ్బులకోసం, సన్మానాలూ బిరుదులకోసం, పారితోషికాలకోసం, కీర్తికోసం, వ్యక్తిత్వాన్నీ రచనా స్వాతంత్ర్యాన్నీ పణంగా పెట్టలేదు. వ్యక్తిత్వాన్నీ, రచనా స్వాతంత్ర్యాన్నీ 1935 ప్రాంతాలనుంచీ ఆధునిక ప్రగతిశీల సాహిత్యోద్యమాలతో* ఆయన సమన్వయం చేయడానికి కృషిచేయడం గమనిస్తే కుటుంబరావు వ్యక్తిత్వం వ్యక్తివాద ధోరణికి సంబంధించినది కాదనీ, రచనా స్వాతంత్ర్యం ఇచ్ఛానుసార రచనా విధానం కాదనీ తెలుస్తుంది. కాదుకాబట్టే రా.రా. అభిప్రాయపడినట్లు ఆయన శాస్త్రీయమైన ఆలోచనా విధానమూ, మార్క్సిస్టు సామాజిక దృక్పథమూ, మానవతా వాదమూ, శైలీ, వ్యక్తిత్వపు లోతుల నుంచీ వుద్భవించాయి.

మా. గోఖలే అన్నట్లు "నిజాయితీతో నిర్భయంగా అభ్యుదయం దిక్కుగా నడచిన యీయన రచనా జీవితం, సాహిత్యలోకంలో ఒక అపూర్వాధ్యాయం. ఈ సాహిత్యలోకాని కెప్పుడూ యీ మహా రచయిత సజీవే." ★

---

* నవ్యసాహిత్య పరిషత్తు (1935-1942), అభ్యుదయ రచయితల సంఘం (1943-1970), విప్లవ రచయితల సంఘం (1970-1980) సభ్యులుగా కె. కె. వున్నారు.

నగలూ, అవీ చేయించి, ఒక్క దమ్మిడీకూడా బాకీ చెల్లు వేయలేదనీ తెలుసుకుంటాడు. తన కుటుంబంవాళ్ళతో తన కార్మిక మిత్రులను పోల్చుకు చూసుకుని కార్మికులే నిజమైన మనుషులని తేల్చుకుని, బొంబాయికి తిరిగి వచ్చి, అక్కడి పారిశ్రామిక కార్మిక వర్గంలో ఐక్యమైపోతాడు. శాస్త్రి అట్లా కార్మిక వర్గంలో చేరడు, చేరినా వారిలో ఐక్యం కావటానికి అతనికి చాలా కాలం పట్టుతుంది. అది మళ్ళీ మరొక నవల అవుతుంది.

"Art లో చాలా రకాలున్నాయి; ప్రతి రకానికీ దశలున్నాయి. మధ్య తరగతికి కనువిప్పులో చాలా భాగం శ్రామికులకు కనువిప్పేకాదు. కూలివాళ్ళు, అయ్యో, చెమటోడ్చి పని చేస్తున్నారే అని మధ్య తరగతి కవి ఆకస్మాత్తుగా గ్రహించి అశ్రువులు రాల్చితే, వాణ్ణిచూసి శ్రామికుడు నవ్వక ఏం చేస్తాడు. అయినా కవిగారికి కనువిప్పయినందుకు మనం సంతోషించకుండా ఎట్లా? మధ్య తరగతి కళ అన్న తరువాత అది ఎంత ఉత్తమంగావున్నా అందులో మధ్య తరగతి బలహీనతలు ఉండి తీరుతాయి, ఉండక వీలులేదు. వర్గ చైతన్యం పొందిన శ్రామికులు ఆ దౌర్బల్యాలను క్షమించవచ్చుగాని, ఆరాధించేది కల్ల. నేను రచన చేసేటప్పుడు నా మధ్య తరగతి దౌర్బల్యాలను సాధ్యమైనంతవరకు వావిగా రచనలోకి రానివ్వను. చాలా దౌర్బల్యాలను శాశనంకూడా చేసుకున్నానని కూడా చెప్పగలను. అందుకే ఒకే కార్మికుడి కథను ఆ కార్మికుడి దృక్పథం నుంచి రాయగలిగాను. యుద్ధకాలం అయిపోగానే నాకు శ్రామికులతో సహజీవనం లేకుండా పోయింది. మధ్య తరగతి జీవితాన్ని ఆశ్రయించుకుని రచనలు చేస్తున్నాను."

(శ్రీ సొదుం గోవిందరెడ్డికి 23-3-55 న రాసిన ఉత్తరం నుంచి)

# పరిచయం

1929 లో విజయనగరంలో బి. ఏ. పూర్తిచేసి కుటుంబరావు ఎండాకాలపు శెలవలకు తెనాలి వచ్చేశాడు. ఒకరోజు ఉదయాన ఆయన మొహానికి హేజలయిను స్నో రాచుకోవటం చూచి నాకూ అలా చెయ్యాలని తీవ్రమైన కోరిక కలిగింది. ఎందుకంటే అది రాచుకుంటే మొహం కాంతివంతంగా వుంటుందని నాకు తెలుసు. అదివరకల్లా పరాయివాళ్ళు అది రాచుకోవటమే నేను ఎరుగుదును, కాని అది మా ఇంటికి వస్తుందని కూడా నాకు తెలియదు. అదివరకే దాన్ని కొనాలని నేను ప్రయత్నం చేశాను కాని నా దగ్గిర డబ్బు వుండకపోవటమూ, ఒక వేళ వున్నా అది కొనటానికి ధైర్యం లేకపోవటమూ జరిగేది. అసలు చిన్నతనంలో మన దగ్గిర డబ్బులు వుండటమే ఒక అపచారం. ఇక హేజలయిను స్నో వుండటం మహాపరాధం. అందుకని ఎప్పుడైనా డబ్బులుంటే అవి వున్నట్టు కూడా తెలియనీకుండా వుండటానికి శ్రమపడాల్సివచ్చేది. ఇక ఆ డబ్బు దేనికి? ఏ స్నో అన్నా కొంటే నా దగ్గిర డబ్బులున్నాయి అని ఎలానూ బైటపడుతుందని ఏ కాఫీహోటలులోనో ఖర్చు చేశేవాడిని. ఇంటోవాళ్ళకి నాకు ఆకలిగాలేదని మటుకు తెలిసేదేకాని డబ్బులున్నాయి అని మటుకు తెలిసేదికాదు! అందువల్ల స్నో కొనటానికి నాకు పడనేలేదు. ఇప్పుడు ఆ మహా అవకాశం లభించింది. అయితే మావాడు తెలుసుకునేటట్టుగా అది రాచుకోవటానికి వీల్లేదు! మన ఆనందం ఇతరుల కెప్పుడూ కష్టంగానే వుంటుంది కనక నేను స్నో రాసుకోవటం మావాడికి ఇష్టం లేకపోవచ్చు. అందుకని అది ఆయనకు తెలియకుండానే జరగాలి. కాబట్టి అది రాసుకుని సాయంత్రం షికారుకు వెళ్ళి రాత్రికింటికి వచ్చేద్దామని నిశ్చయించుకున్నాను. దీనికి పెద్ద అవాంతరం లేదు. మావాడి ధర్మమా అని ఆయన పెట్టెకు అసలు తాళమే వుండదు. పెట్టెకేవున్న తాళం అయినా చెడివుంటుంది!

మావాడిని అటు పోనిచ్చి పెట్టెతెరిచి చూచాను. ఎక్సరసైజు పుస్తకాలూ, ఓ చొక్కా, కొన్ని ఇంగ్లీషు పుస్తకాలూ, ఓ పావలా ఫుల్‌నానా సెంటూ, ఓపాత టూత్‌బ్రష్, కొలినాస్ పేస్టు, ఓకానీ, ఇంకో టూత్‌బ్రష్ (!) మెర్క్యులయిజుడు వాక్సు మొదలైనవి వున్నాయి. మొదట నన్ను ఆకర్షించినవి ఎక్సరసైజు పుస్తకాలు. నా దురదృష్టమేమిటో నేనెప్పుడు కొన్నా ఆ ఎక్సరసైజు పుస్తకం ఇతరులు కొన్నవాటికంటె అసహ్యంగానే వుంటుంది. మరి మావాడి పుస్తకాలు అద్భుతంగా వున్నాయి. తీసి చూచాను. ఏదో రాసివుంది. పేజీలు తిరగేశాను. ప్రతిపేజీలోనూ ఏదో రాసేవుంది. శాంపిల్‌కు ఒక్క కాగితం చించుకుని దాచుకుందామన్నా వీల్లేదు. కొన్ని పేజీలు సగమే రాసివున్నాయి. కొన్ని పేజీలమీద ఒక్క మాట రాసి గీత పెట్టి వున్నది. ఎంత వెదికినా హేజలయిను స్నో కనిపించలేదు. చివరకు మావాడు రాచుకుంటున్నది ఆ మెర్క్యులయిజుడు వాక్సు అని గ్రహించాను. సరే అది రాచుకుని ఎలావున్నవి అలా వుంచి షికారుకు బైలుదేరాను. నా మొహం వేసో

అనుకున్నదానికంటే ప్రకాశమానంగా వున్నది కామాలు, అంతా నావంకే చూడటం మొదలుపెట్టారు. కొంతమంది స్త్రీలకు నన్ను చూసి అసూయకలిగి అసహ్యం కూడా వేసినట్టు మొహాలలో స్పష్టపరిచారు. వీళ్ళగోల నాకెందుకని రైలుకట్టమీదిగా కాలవలుదాటి చివరకు ఇంటికి చేరుకున్నాను. భోజనాలయిం తరువాత మావాడు నాటకానికి వెళ్ళిపోయినాడు. వెధవ బొబ్బిలియుద్ధం తిరుమలరావు ధర్మమా అని ఇదివరకే అనేకసార్లు చూచాను. విజయరామరాజు ముసుగుపెట్టుకుని పొట్టిపుణ్యా నికి చావటం మళ్ళీ చూడటం నాకు ఇష్టంలేదు.

ఆరుబైట మంచం వేసుకుని పడుకున్నాను. నాకెందుకనో విపరీతమైన చెమటపోసింది. ఇంతలో నా దృష్టి మళ్ళీ ఆ ఎక్సరసైజు పుస్తకంమీదికి పోయింది. అందులో రాసివున్నది తెలుగే కనక ఏమిటో చూద్దామని, లాంతరు తీసుకెళ్ళి పుస్తకం తెచ్చి చదివాను. అదేమిటో కథ అల్లేవుంది. నాకు ఆశ్చర్యం వేసింది. అంతవరకు కథలు పత్రికలలో చదవటమే తప్ప ఎక్సరసైజు పుస్తకాల్లో నేనెన్నడూ చదవలేదు. కాని ఆ కథ అయినా పూర్తిగాలేదు. ఆ కథే మళ్ళీ ఇంకో పేరుతో ఇంకోచోట వుంది కాని అది పేజీమధ్యలోనే ఆగిపోయింది. ఒకచోట మాటుకు పదిపేజీలు విడవకుండా వున్నాయి. చదివాను. అది వకకధ. బాగానే వుంది కాని జానకిని రామారావు కావిలించుకుని ముద్దుపెట్టుకున్న తరవాత కథ ఏమిటో తేలలేదు. కథ పూర్తికాలేదు అనుకోటానికి అయినా మావాడు చివర గీత పెట్టటంవల్ల అది పూర్తి అయినట్లే భావించాలి. మావాడు కథలు రాయటం బాగానే వుంది కాని అవి పూర్తిచెయ్యకపోవటం ఏమీ బాగలేకపోగా పూర్తి చేసినట్టు గీత పెట్టటం సుతరామూ బాగాలేదు. మన కెందుకని ఆ పుస్తకం మళ్ళీ దాచి మళ్ళీ కాస్త స్నో రాచుకుని వచ్చి పడుకున్నాను.

మర్నాడు పొద్దున్నే మావాడు ఆసీసా పట్టుకుని నాదగ్గిరికివచ్చి "ఇది ఎవరు తీశారు?" అన్నాడు. నేను ఎలా వున్నవి అలాగే వుంచాను కాని ఎలాగో కనుక్కున్నాడు మావాడు. బహుశా అది తియ్యటంలో కొంచెం గోటిపట్టు పట్టి వుంటటం వల్ల తెలిసివుంటుంది.

మావాడు నాదగ్గిరికి వచ్చి నా మొహం వాసనచూచి నవ్వాడు.

"ఇది స్నో కాదు. ఇది రాచుకుంటే మొహం అంతా జిడ్డుగా వుంటుంది!"

తర్వాత మావాడు బెనారస్ చదువుకోసం వెళ్ళటమూ శలవలకు ఇంటికి రావటమూ జరిగింది. ఒకరోజున నేను స్కూలునుంచి ఇంటికి రాగానే "గృహలక్ష్మి" కనిపించింది. సరే తీసి చదివాను. అందులో మావాడి కథ ఒకటి వుంది. పైగా ఆ కథకు మావాడికి మొదటి బహుమానంకూడా వచ్చినట్టు సంపాదకుడు రాశాడు. పోనీ మనవాడికి బహుమానాలుకూడా వస్తున్నాయికదా అని సంతోషించాను. మళ్ళీ ఇంకో కథ పడింది—మళ్ళీ మొదటి బహుమానం! బహుమానాలు వస్తున్నాయి.

మావాడుకూడా కదలు రాస్తున్నాడనే సంతోషించాను కాని ఇది ఇంకోతీరుగా నన్ను తగులుకుంటుందని వూహించలేదు.

"కుటుంబరావు నీకేమవుతాడు?" అన్నాడు ఒకరోజున ఒకాయన. చెప్పాను. "మన కుటుంబరావు తమ్ముడు!" అన్నాడు ఇంకో అతను ఇంకోరోజున. ఇది నాకు అర్థంకాలేదు. అదివరకల్లా "రామచంద్రయ్య కొడుకురా - మూడోవాడు!" అని ఎవరో పెద్దవాళ్లు అనుకుని నన్ను చూచి ఇంకోమాట లేకుండా వెళ్ళిపోవటం నేనెరుగుదును. "వెంకట సుబ్బయ్య తమ్ముడు!" అని స్వామిగారూ శివశంకరశాస్త్రిగారూ అనటం కూడా నాకు తెలియని విషయం కాదు! కాని "కుటుంబరావు తమ్ముడు!" అని నాకు పేరు రావటం మరీ క్రొత్త. ఏమిట్రా దీని వ్యవహారం అని విచారిస్తే ఏమీ తేలలేదు.

"మన వెంకటసుబ్బయ్య జాడా ఏమన్నా?" అన్నాడు వకరోజున సుబ్బమ్మ గారి హోటల్లో ఒకాయన. ఆయన ఎవరో నేను ఎరగను.

"ఏం తెలీదండీ!" అన్నాను నేను.

పాపం ఆయనకు ఏమి జ్ఞాపకం వచ్చిందో మరి అన్నం తిన్నగా తినలేదు. "కుటుంబరావుకూడా రాస్తున్నాడే?" అన్నాడు ఆయన మళ్ళీ.

"ఏవో రాస్తున్నాడు" అన్నాను నేను.

"మీ యిద్దరిలో ఎవరు పెద్ద?"

"మావాడే!" అన్నాను నేను.

"కుటుంబరావు తమ్ముడు"నిగా కావటానికి కారణం నాకు అర్థం ఐంది. మావాడు కేవలం కథలు రాసి నాకీపేరు సంపాదించాడు! నాకిది ఎంతమాత్రమూ మనస్కరించలేదు. వెంకటసుబ్బయ్య, కుటుంబరావు పద్యాలూ, కథలూ రాసి నాకు సోదరులుగా కావటం, చివరకు ఆ కారణంవల్ల నేను వాళ్ళకు తమ్ముడిని కావటం సుతరామూ ఇష్టంలేదు. మరి కృష్ణమూర్తి అన్నవా అని కుటుంబరావుకు ఎందుకు పేరు రాకూడదు? ఇక నేనూ కథలు రాయాలన్నమాట! వుద్దేశ్యం బాగానేవుంది కాని కథలు రాయటం ఎలా? మావాడిని అడగటం నాకిష్టంలేదు. కాని గత్యంతరం లేక చివరకు అడిగాను.

"రాయటమే—అంతే!" అన్నాడు మావాడు.

కథ రాయటం ఏనాడో తీర్మానం అయింది. కాని ఎలా మొదలు పెట్టాలో ఏం చెయ్యాలో తెలియలేదు.

"నీవు రాసి చూపించు—నాకు తోస్తే ఏది ఎలా మార్చాలో చెబుతాను!" అన్నాడు మావాడు.

ఒకరోజున రాత్రి లాంతరు దగ్గిర పెట్టుకుని కథ రాయాలని తీర్మానించుకున్నాను. నాకు తెలిసిన విషయం ఒకటి రాశాను. కద పేరు "కమల" అని తేల్చాను. మర్నాడు మావాడికి చూపించాను. చదివి నాకిచ్చాడు.

"దేనికి పంపిస్తావు?"
"గృహలక్ష్మికి!"
"పంపు!"
"ఎలావుంది?"
"బాగుంది!"
"ఏమన్నా మార్చాలా?"
"ఏం మార్చక్కర్లేదు—పదపోదాం!" అన్నాడు మావాడు.

తెలిసినవాడు, పెద్దవాడు, కథలు రాస్తున్నవాడు అలా అనగానే నాకు నిజంగా అదో రకం ఆనందమే కలిగింది. మేమిద్దరం వెళ్ళి దాన్ని పోస్టు చేసి వచ్చేశాం!

మరి అది అచ్చు కావటమేకాక నాకుకూడా మొదటి బహుమానమే వచ్చింది! పైగా సంపాదకుడు దానిమీద అభిప్రాయాలను పంపమని చదువరులను కోరటం వల్ల తర్వాత సంచికనిండా "కమల"ను గురించి రకరకాల అభిప్రాయాలూ వెలిబుచ్చారు మొత్తంమీద ఆ కథ బాగానే వుందని తేలింది. కావాలంటే "గృహలక్ష్మి" పాతకాపీలు తిరగెయ్యండి!

"మరి బహుమానం ఏమీ రాలేదేం?" అన్నాను మావాడితో.

"తెలుగు పత్రికలవాళ్లు బహుమానంగా ఒకకాపీ పంపిస్తారు!" అన్నాడు మావాడు. ఇక ఆయనకు వచ్చే బహుమానాలు అవేనని చెప్పనక్కర్లేదు!

మొదటిసారి కథలు రాసేవాళ్లకు "కమల" అని కథానాయకురాలికి పేరు పెట్టటం ఇష్టం అని, మావాడే తర్వాత ఏదో కథలో ఎక్కిరించినట్టు జ్ఞాపకం. అదెంతవరకు నిజమో కాని ఆ పేరుతోనున్న ఒకరిద్దరి ఆడవాళ్లను చూచిం తరువాత ఆ పేరుమీద నాకు మోజుపోయింది.

ఇక ఈ "మాలోమేము"లో వచ్చే "సూరి"కి పదిపన్నెండేళ్ళ కిందటే కుటుంబరావు సృష్టించిన "సూరి"కీ సంబంధంలేదు. ఇద్దరిపేర్లో "సూరి" కావటం కేవలం దైవికం. కుటుంబరావు "సూరి" శాస్త్రవిజ్ఞానంతో చొరవ చేసుకుని సాధించే వ్యక్తి. ఈ సూరి కేవలం "జడదారి........రాత్రి ఏమి, దివంబేమి" అని తనదారిన తాను పోయే మచ్చు అని అనవచ్చు కాని యధార్థానికి చివరకు అది కూడా కాదు!

బొంబాయి
22-1-46

కొ. కృష్ణమూర్తి

(మాలో మేము కథల సంపుటి, మార్చి 1946,
మద్రాసు : యువ ప్రచురణ)

# వరుసగా...

# వారసత్వం

భాను దురదృష్టవంతురాలు. ఆమె దురదృష్టంలో ఒక ప్రత్యేకత ఉన్నది. చాలా మంది దురదృష్టవంతులు చూడగానే పెద్దమ్మ బిడ్డలని తెలుస్తూ ఉంటుంది. భాను ఎప్పుడూ అదృష్ట దేవత ముద్దు బిడ్డకి మల్లెనే కనిపించింది. ఆమె చిన్నపిల్లగానే చక్కని చుక్క. "బంగారుబొమ్మ....చక్కని చుక్క. దిష్టి తగులు తుందమ్మా బిడ్డకు!" అనేవాళ్ళు అమ్మలక్కలు. తల్లి భాగ్యమ్మ పూర్వజన్మంలో బంగారు పళ్ళు దానం చేసి ఈ జన్మలో ఇంత చక్కని పిల్లను కన్నదనేవారు. అందులో దురదృష్టం ఏమీ లేదు.

పదకొండో ఏట భానుకు పెళ్ళి అయింది. పెళ్ళికొడుకువాళ్ళు లక్షాధి కారులు. అంత భారీ సంబంధాన్ని తీసుకురావడం కోసమూ, వియ్యాలవారి మెప్పు కోసమూ భాను తండ్రి కూతురి పెళ్ళికి పదివేలు ఖర్చు చేశాడు. ఆయన బొత్తిగా లేనివాడుకాదు. పదెకరాల స్థితిపరుడే. నాలుగెకరాలు తెగనమ్మి ఉంటే ఏ చిక్కూ ఉండకపోను. కాని ఆయన కూతురు పెళ్ళికి డబ్బు అప్పుతెచ్చాడు. ఆ అప్పు ఆయన చేతిమీదగా తీరలేదు. భాను కాపరానికి వెళ్ళిన అయిదేళ్ళ అనంతరం ఆమె తండ్రి ఆస్తి యావత్తూ తుడిచిపెట్టుకు పోయింది.

ఆ ఆస్తికి న్యాయమైన వారసుడు శాస్త్రి. భాను తమ్ముడు, భాను కన్న ఎనిమిదేళ్ళు చిన్నవాడు. ఇల్లూ వాకిలీ లేకుండా, తిండికీ, చదువుకూ ఆధారం లేకుండా, విధవ తల్లితో సహా వీధిలో నిలబడ్డాడు. పుట్టిల్లు తుడిచిపెట్టి, తాను లక్షాధికార్ల యింట పడిందని అన్నవారు లేకపోలేదు. కాని, అది భాను తప్పు ఎట్లా అవుతుంది—ఆమె దురదృష్టం. కాని, ఆమె దురదృష్టమని ఒక్కరు కూడా అన్న పాపాన పోలేదు.

భాను అత్తింటివారు ఇనుప మనుషులు. వాళ్ళకు స్నేహాలూ, బంధుత్వాలూ, ఆపేక్షా, అంతఃకరణలూ మొదలైన వాటిల్లో నమ్మకంలేదు. భాను తన భర్తను ఎట్లాగో ఒప్పించి, తన మేనమామ దగ్గిర వెళ్ళి ఉంటున్న తన తల్లికి అప్పుడప్పుడు అయిదూ, పదీ పంపేటట్టూ, తన తమ్ముడు శాస్త్రిని తెచ్చుకుని తమ దగ్గిరే ఉంచు కుని చదువు చెప్పించేటట్టూ ఏర్పాడు చేసింది.

శాస్త్రి అక్కదగ్గర చేరి, థర్డుఫారం[1]లో చేరాడు. అతన్ని ఇంటి నౌకర్లే ఉపయోగించుకునేవారు. ఎక్కువగా అతను తన అక్కకూతురు పద్మను ఎత్తుకు

1. 8వ తరగతి.

మోసేవాడు. పద్మ నాలుగేళ్ళ పిల్ల. శాస్త్రి కన్న తొమ్మిదేళ్ళు చిన్నది. భాను మామగారూ, అత్తగారూ, బావగారూ, తోడికోడలూ, వాళ్ళ పిల్లలూ కూడా శాస్త్రికి పనులు చెప్పేవాళ్ళు. చెప్పిన పనులు చేసేవాడుగాని, వాళ్ళు తనను హీనంగా ఎందుకు చూస్తారో శాస్త్రికి అర్థమయేదికాదు.

నిజానికి భాను కూడా ఈ విషయంలో అత్తవారి వైపు మనిషిలాగా ప్రవర్తించేదిగాని, తమ్ముడు వైపు మనిషల్లే ప్రవర్తించేది కాదు. తమ దయాధర్మాల మీద ఆధారపడి బ్రతికేవాణ్ణి హీనంగా చూడటానికి వాళ్ళకు ఎంత హక్కున్నదో ఆమెకూ అంత హక్కున్నది. అయినా అప్పుడప్పుడు తమ్ముడికి ఎవరూ చూడకుండా అణాలు, బేడలూ ఇచ్చేది. తినటానికూడా ఏమన్నా పెట్టేది. అందుకని శాస్త్రి అక్కదగ్గిర చనువు అదీ లేకపోయినా ఆపేక్షగానే ఉండేవాడు. భాను ఎన మనిషే అయినా తనకన్నా చాలా ఎత్తున వున్నట్టుండేది.

శాస్త్రి స్కూలు ఫైనలు పరీక్ష[1] ఫలితాలు తెలిసినై; అతన్ని కాలేజీలో చేర్పించడానికి భర్త ఒప్పుకుంటాడో, చెప్పించిన చదువు చాలుసంటాడో అని భాను వితర్కించుకొనే రోజుల్లో ఆమె భర్త స్యూమోనియావచ్చి చనిపోయినాడు.

ఇది భానుకు నిజంగా దురదృష్టమే. ఆ పుట్టిన నలుసు మగపిల్లవాడైనా అయితే, తాతగారి ఆస్తికి వారసుడై ఉండును. పద్మ పుట్టి ఎనిమిదేళ్ళు గడిచినా భాను మళ్ళీ గర్భవతి కాలేదు. మగ పిల్లవాణ్ణి కనని కారణంచేత పాతికేళ్ళకే భాను జీవితం మొండిపడింది.

ఇంట్లోనుంచి శవం వెళ్ళితే, ఒక్క భాను మాత్రమే ఏడిచింది. మిగిలిన వాళ్ళు వేదాంతుల్లాగా ప్రవర్తించారు. భాను అత్తగారు వేదాంతం చెప్పి నిట్టూర్చింది. భాను భర్తమీద ప్రేమకొద్దీ ఏడిచిండనటానికి లేదు. ఆమె జీవితంలో ప్రేమ అనేదేమీ లేదు; ప్రేమించడానికీ, ద్వేషించడానికీకూడా మనిషికి కొంత మానసికమైన స్వేచ్ఛ వుండాలి.

దినవారాలకు భాను అత్తవారి వైపువాళ్ళు చాలామంది వచ్చారు. వాళ్ళలో సుదర్శనం వున్నాడు. ఆయన పట్నంనుంచి సకుటుంబంగా దిగాడు. శాస్త్రి సుదర్శనాన్ని చూసి చాలా బాగున్నాడనుకున్నాడు. ఆయన భార్య దుర్గాంబను చూసి చాలా అసహ్యంగా ఉందనుకున్నాడు. అవిణ్ణిచూస్తే రేగడిమట్టి బొమ్మలు జ్ఞాపకం వచ్చినై. మనిషి నల్లగా, ఇలకదుచుకుపోయి నట్టున్నది. వాళ్ళమ్మాయి దాను చామనచాయ అయినా అచ్చు తల్లిపోలికే. శాస్త్రి ఈడువాడే. అతని చెల్లెలు కోమల పద్మకన్న రెండేళ్ళు పెద్దది. ఆమెకూడా ఏమంత అందంగా లేదు.

పెద్దవాళ్ళు నలుగురు కూచుని మాట్లాడేటప్పుడు భాను గురించీ, ఆమె కూతురు గురించీ ప్రస్తావన వచ్చింది.

---

1. S.S.L.C. అంటే అప్పటి స్కూళ్ళలోని 11వ తరగతి.

"మా మరదలుకు ఇల్లూ, తిండి, బట్టా చూడడం మా విధిగదా. ఇంకో రెండు మూడేళ్ళలో పద్మకు పెళ్ళీడు వస్తుంది. తగిన సంబంధం తెచ్చి పెళ్ళిచేసే బాధ్యత కూడా మాదే. అంతకంటే ఇంకేముంటి?"...అన్నాడు భాను బావగారు పదిమంది సమక్షంలోనూ.

"మీ మరదలు తమ్ముడొకడు మీ దగ్గిరే ఉంటున్నట్టున్నాడు?" అని ఎవరో అడిగారు.

"ఆ! వాడూ స్కూలుఫైనలు పాసయినాడు. ఎక్కడో చిన్న ఉద్యోగం చూసుకుని వాడి పొట్టతిప్పలు వాడు పడతాడు" అన్నాడు భాను బావగారు.

ఈ మాటలు విన్న సుదర్శనం శాస్త్రిని వెతికి పట్టుకుని రోడ్డు మీదికి తీసుకుపోయి, "ఏంరా, అబ్బాయ్! నువు స్కూలుఫైనల్ పాసయినావుటగా? ఏం సబ్జక్టు తీసుకున్నావేం?" అన్నాడు.

తనకు కొంత షార్టుహాండ్, టైప్ రైటింగ్ వచ్చునని శాస్త్రి చెప్పాడు.

"నా వెంట పట్నం వస్తావా, ఏం? నీకు పని యిస్తాను" అన్నాడు సుదర్శనం.

"మా అక్కయ్య నడగాలి" అన్నాడు శాస్త్రి.

"అడుగు, నేనుకూడా ఆవిడతో మాట్లాడతాను" అన్నాడు సుదర్శనం.

తమ్ముడీ మాట చెప్పినప్పుడు భాను "వెళ్ళు, ఇక్కడేముంది బూడిద ? వాళ్ళు నిన్ను పైకి తీసుకురాగలరు" అన్నది.

ఆ రాత్రి మెయిలుకే శాస్త్రి తనకున్న నాలుగు బట్టలూ ఒక ధోవతిలో మూటగట్టుకొని సుదర్శనం కుటుంబం వెంట కొత్తచోట్లు వెతుక్కుంటూ బయలు దేరాడు. వెళ్ళేటప్పుడు భానుతో మాత్రమే చెప్పాడు. పద్మ నిద్రపోతున్నది.

# 2

సుదర్శనం నలభైఏళ్ళవాడు. ఆయన భాను మామగారికి పినతల్లి కొడుకు. ఆయనకూడా శాస్త్రి వయసులో శాస్త్రి అంత దరిద్రుడు. వాళ్ళ నాన్న జూదంలోనూ, ముండల కిందా చాలా పెద్ద ఆస్తి తగలేశాడు. శాస్త్రిని ఆదుకునేటందుకు అక్క అయినా వున్నది. సుదర్శనానికి ఎవరూ లేరు. శాస్త్రి స్కూలుఫైనల్ పాసయితే ఆయన దర్డ్ ఫారం పూర్తిచెయ్యలేదు. బతికి ఉండటం కోసం ఆయన ప్రెస్‌లో బైండరుగా పనిచేశాడు. తరువాత పుస్తకాల షాపులో గుమాస్తాగా పనిచేశాడు. అక్కడి నుంచి నోటుబుక్కులూ, ఎక్సర్‌సైజు బుక్కులూ అమ్మేవాళ్ళ దగ్గర చేరాడు. వాళ్ళు తమ పుస్తకాలను విశాఖపట్నం నుంచి నెల్లూరుదాకా అమ్మేవాళ్ళు.

వాళ్ళు పట్నంలో ఒక బ్రాంచి పెట్టినప్పుడు అందులో పనిచేయడానికి ఒప్పుకున్నాడు. వాళ్ళిచ్చిన పదిహేను రూపాయల జీతంతోనే కాలక్షేపం చేశాడు.

ఆ రోజుల్లోనే ఆయనకు లక్ష్మీదేవి గుర్తించరాని దుర్గాంబ రూపంలో సాక్షాత్కరించింది. దుర్గాంబ బాల వితంతువు. ఆమె తండ్రి ఏదో కాలేజీలో తెలుగు పండితుడు. ఆయనకు వుండిన ఆస్తి మైలాపూరులో ఒక పాత ఇల్లే — ఏనాడో చౌకగా వస్తే కొన్నది. కాని దుర్గాంబ తల్లికి పెద్ద ఆస్తివున్నది. వాళ్ళకు ముగ్గురు కొడుకులున్నారు. కాని దుర్గాంబ ఒక్కతే ఆడపిల్ల. తండ్రి పూర్వాచార పరాయణుడు.

దుర్గాంబ వికారమైన మనిషి అన్నది సుదర్శనాన్ని బాధించలేదు. ఆమె పెద్ద ఆస్తికి వారసురాలని తెలిసినాక, ఆయన కళ్ళకామె ఊర్వశీ తిలోత్తమలంత అందగత్తెగా తోచింది. ఆ కుటుంబంతో తలవని తలంపుగా కలిగిన పరిచయాన్ని ఆయన పెంచి పెద్ద చేసుకున్నాడు.

సుదర్శనానికి ఇంకే అర్హతా లేకపోయినా చాలా అందమైన విగ్రహం. తనకు అటువంటి అల్లుడు దొరికితే బాగుండునని దుర్గాంబ తల్లి అనుకున్నది. ఆయనకు తన కూతురితో స్నేహం చెయ్యాలని ఉన్నట్టు గ్రహించి వారిద్దరికీ సహకరించింది.

తన కూతురు గర్భవతి అయిందని తెలిసి దుర్గాంబ తండ్రి శివతాండవం చేశాడు. అరిచాడు. జుట్టు పీక్కున్నాడు. ఆ విధంగా కొంత వేడి తగ్గించుకొన్నాక తన కూతుర్ని సుదర్శనానికిచ్చి పెళ్ళిచేసి, సంఘ సంస్కర్త అని నలుగురిచేత ప్రశంసలు పొందాడు.

ఆ పెళ్ళితో సుదర్శనం దశ మారింది. అతనికి అత్తగారు ఎంత పెట్టుబడి అయినా ఇచ్చింది. దుర్గాంబ పెత్తనం ఏమీ లేదు. అసలు దుర్గాంబ చాలా విరస స్వభావం గలది. చాలా వరకు తండ్రి వంటిదే. మనుష్య స్వభావమే నీచమైనదనీ, స్వార్థం లేకుండా ఎవరూ ఏ మంచి పనీ చెయ్యరనీ ఆవిడ ఉద్దేశం. దుర్గాంబ తల్లి కొంత హృదయంగల మనిషి. దుర్గాంబ పెళ్ళి కాకమునుపు-అంటే, సుదర్శనం మీద తనకు ఏ విధమైన అధికారమూ లేనప్పుడు - అతనితో ప్రణయం జరపడం ద్వారా కొంత ఆనందం పొందింది గాని, తనతో తప్ప అతనికి మరొక మనిషితో కాపరం చేసే హక్కు లేదన్న పరిస్థితి ఏర్పడినాక, అతన్ని పరిగణించడం మానేసింది. భర్తను చూసినప్పుడల్లా మొహం చిట్లించడం అలవరుచుకున్నది.

అతన్ని అత్తగారు ఇంతకంటే చాలా బాగా ప్రేమించింది. సుదర్శనం ఆవిడ ప్రేమను నిరాకరించడంలేదని ప్రతీతి. అయితే, ఆయనకు డబ్బుమీద తప్ప మరి దేనిమీదా దృష్టి లేదు. అతను పెళ్ళాంతోబాటు అత్తగారినికూడా సాకినమాట నిజమైతే, అది కేవలం ధనాశతోనే అయివుంటుంది. సుదర్శనం నిఘంటువులో నైతిక వర్తన అనే దానికి స్థానం లేదు.

అత్తగారు అందించిన పెట్టుబడితో సుదర్శనం వ్యాపారం చేశాడు. కొన్ని రకాల ఔషధాలూ, ఇతర వాడుక సరుకులూ హోల్‌సేల్ పద్ధతిలో విక్రయించాడు. తరువాత కలప వ్యాపారం పెట్టాడు. రెండేళ్ళలో ఆయనకు పట్నంలో ఒక పెద్ద గోడౌనూ, మూడు షాపులూ ఏర్పడినై. ఈ వ్యాపారాలను సాగించడానికిగాను ఆయన తనకన్న చాలా ఎక్కువ చదువుకున్నవాళ్ళను జీతాలిచ్చి పెట్టుకున్నాడు. ఆయనకు మొదటినుంచీ నమ్మకస్తులు దొరికారు. నమ్మకస్తులను ఎన్నుకొనటంలో సుదర్శనానికి ప్రత్యేక దక్షత ఉన్నదో, ఆయన పట్టినదల్లా బంగారం కావడం చూచి వాళ్ళే నమ్మకస్తులుగా ప్రవర్తించి పైకి వద్దామనుకున్నారో మనం ఊహించలేం. ఏమైనా, సుదర్శనం ధనికుడు కావడానికి వాళ్ళు సర్వవిధాలా తోడ్పడ్డారు. వాళ్ళకు ఆయన జీతాలు మాత్రమే ఇచ్చాడు.

వ్యాపారంలో తాను అనుకున్నదానికి మించి విజయం లభించినాక, సుదర్శనం తన మొదటి ధైర్యాన్నీ, సాహసాన్నీ కోల్పోయి, తన లాభాలను ఇతరుల కృషిలో వాటాలుగా పెట్టుబడి చేశాడు. అటువంటి పెట్టుబడులు కూడా మంచి లాభాలు తెచ్చినై. అదృష్టం ఆయనను ఎక్కడా జారవిడువలేదు.

ఈ లాభాలతో సుదర్శనం ఒక పెద్ద మేడ కట్టించాడు. తనకు చిన్ననాడు లోపించిన సంస్కారాన్ని పోగుచేసుకోసాగాడు. రాజకీయ నాయకులూ, కళాభిమానులూ ఆయన మైత్రి సంపాదించుకుని, ఆయనకూడా పదిమందిలోనూ సాంస్కృతిక జీవితం తెలిసినవాడుగా కనపడేటందుకు తగిన వాతావరణం సృష్టించారు. కొద్ది సంవత్సరాలలోనే ఆయన నలుగురితోనూ సమానమైన ఘరానా మనిషి అయినాడు; వ్యాపారంలో పైకి వచ్చిన మధ్యతరగతివాడు ఏ యే విషయాలను గురించి ఎంత పరిజ్ఞానం కనబరచాలో అంతా కనబరచాడు.

కాని సుదర్శనం హృదయాంతరాళంలో ఒక గుల్ల వున్నది. అది డబ్బుతో పూడలేదు. భార్యా, కొడుకూ, కూతురూ, డబ్బూ, స్నేహితులూ, ఆదరా బాదరా అలవరుచుకున్న సంస్కారమూ ఆ డొల్లను పూడ్చలేకపోయినై. ఆయనది ప్రేమ రహితమైన జీవితం. చిన్నతనంలో తల్లిదండ్రులూ, తోడబుట్టినవాళ్ళూ లేరు. భార్యను ఆయన ఏనాడూ ప్రేమించలేదు. దుర్గాంబ తన పిల్లలను తన రెక్కల కింద నుంచి తండ్రికేసి వెళ్ళకుండా పెంచింది. వాళ్ళు తమ మనసును తల్లికి విప్పి చెప్పేవాళ్ళు గాని, తండ్రి దగ్గర పరాయివాళ్ళల్లే ప్రవర్తించేవాళ్ళు. నిజానికి సుదర్శనానికి ఈ ఏర్పాటు అనుకూలంగానే కనిపించింది. ఆయన తన దృష్టి యావత్తూ ఇతర విషయాలమీద కేంద్రీకరించగలిగాడు.

ఆయన భాను పెళ్ళికి వచ్చాడు. భాను చక్కని చుక్క అన్న విషయం తప్ప ఆయనకు మరొక ఆలోచన తట్టలేదు. అప్పటికి భాను పదకొండేళ్ళ పిల్ల;

కాని ఆయన భానును రెండోసారి చూచినప్పుడు భాను బాలింతరాలు. పద్మ నెల రోజుల పిల్ల. భానును చూస్తుంటే ఆయన హృదయంలోని గుల్లలోకి ఏదో స్రవించి నట్టయింది. భానును భార్యగా చేసుకున్నవాణ్ని చూసి అసూయపడ్డాడు. తాను సంపాదించిన డబ్బు యావత్తూ భాను కాలిగోరుకు పోలదనిపించింది. డబ్బు ఉన్న మీదట దాన్ని గురించి తృణీకారభావం తెచ్చిపెట్టుకోవడం కష్టం లేని మాట నిజమే గాని, సుదర్శనం తన జీవితంలో దాదాపు మొట్టమొదటిసారిగా ఒక ఆడదాన్ని గాఢంగా ప్రేమించ నారంభించిన మాట నిజమె మరి. అదివరకు చాలామంది స్త్రీలు ఆయన మనస్సును కలత పెట్టినమాట నిజమే, కాని వాళ్లు తన భార్యలు కావాలని, తన మిగిలిన జీవితమంతా వాళ్ళతో గడిస్తే తాను అదృష్టవంతుడనీ ఆయన అనుకోవడం ఇదే మొదటిసారి ...తాను ఎన్ని కోరికలైనా తీర్చుకోవచ్చు. కాని ఈ కోరిక తీరదు .. తాను ఎంత చాతకానివాడో తెలిసివచ్చినట్టయింది సుదర్శనానికి...

భానుకోసం ఇన్ని ఏళ్ళుగా దహించుకుపోతున్న తన హృదయాన్ని కొంత ఉపశమింపజేయగలనన్న భావంతో సుదర్శనం ఆమె తమ్ముణ్ని - శాస్త్రిని వెంటతెచ్చి తన ఇంట్లో పెట్టుకుని, తన సెక్రటరీ కింద టైపిస్టుగా వేసి, అది వరకున్న టైపిస్టును ఆఫీసుకు మార్చారు. ఇందువల్ల సుదర్శనం బాధ హెచ్చింది గాని తగ్గలేదు. శాస్త్రిని చూసినప్పుడల్లా దీనంగా తనకు ఆఖరుసారి కనిపించిన భాను మొహమూ, కన్నీటితో తడిసిన సున్నటి ఆమె చెక్కిళ్ళూ కళ్ళ ఎదుట కనబడుతున్నై..

"ఏంరా శాస్త్రీ? మీ అక్కయ్యకు ఉత్తరం రాశావా? రాయి మరీ?" అన్నాడు సుదర్శనం.

# 3

మానసికమైన ఆనందాన్ని అందరూ ఒకే విధంగా పొందలేరు. ఒకే పాటను గాని, పద్యాన్నిగాని అందరూ సమంగా అనుభవించరు. కొందరు ఆ పాటనుంచీ, పద్యంనుంచీ పొందదగిన ఆనందాన్ని సమగ్రంగా పొందుతారు. అదీ ఒక రకమైన అదృష్టమే. శరీర సంబంధమైన ఆనందం కూడా అందరూ సమగ్రంగా పొందలేరు. భానుకు ఆ శక్తి అపారంగా ఉన్నది. ఆ విషయంలో ఆమె ప్రబంధనాయికే అనాలి. ఆమెలో ఉండే ఆకర్షణలో ఒక భాగం శరీరానందం పొందగల శక్తేనేమో!

అయితే, భాను తన వైవాహిక జీవితంలో తాను పొందగలిగినంత ఆనందం పొందలేదు. ఆ పరిస్థితుల్లో మరొక ఆడది పొందగల ఆనందంకంటె ఎక్కువే పొందగలిగినప్పటికీ తాను పురుషులను ఆకర్షిస్తున్నట్టు ఆమెకు తెలుసు.

ఆమెకేసి ఆకలిగా చూచిన వాళ్ళున్నారు. అవకాశం దొరికినప్పుడు ఆమెను స్పృశించటానికి ప్రయత్నించిన వాళ్ళున్నారు. ఆమెను ఆమె దావగారే చాలాసార్లు వేటాడాడు. భాను వెకిలి మనిషి అయినట్టయితే ఈ రకాలన్నీ టినీ ప్రోత్సహించి ఉండేదేమో కాని ఆమె వెకిలిది కాదు. శరీర సుఖాన్ని సమగ్రంగా అనుభవించే శక్తికి ఆమె నిబ్బరమే, కాని ప్రతిబంధకమయింది.

తన భర్త దినవారాలకు అందరూ వచ్చినప్పుడు ఆమె మొదటిసారిగా సుదర్శనాన్ని గమనించింది. తనతో ఆయన రెండు ముక్కలే మాట్లాడాడు. అది కూడా శాస్త్రిని పట్నం తీసుకుపోయి ఉద్యోగం ఇవ్వడం గురించి.

సుదర్శనం గొంతూ, ఆయన కళ్ళూ భానుని విపరీతంగా కదిలించినై. ఒక పురుషుడి ప్రాణం తనకోసం కొట్టుకు పోతుంటే, ఆ సంగతి వాడు చెప్పక పోయినా ఆడది గ్రహిస్తుంది. గ్రహించ లేకపోతే, అది ఆడదేకాదు. గట్టిగా కొట్టేగాలికి వీణతీగెలు మోగినట్టు భాను నరాలు మూడుమోగినై. ఆ భావాన్ని ఆమె సరిగా అర్థంచేసుకోలేదు. తన తమ్ముడికి సాయపడుతున్నాడుగదా అని తనలో కృతజ్ఞత పుట్టుకొచ్చిం దనుకొన్నది.

సుదర్శనం వాళ్ళంతా వెళ్ళిపోయినాక, చాలా నింపాదిగా ఆమెకు నిజం స్ఫురించసాగింది. ఇంతమంది బంధువులు వచ్చారు. తన తమ్ముడొక సమస్య అని ఎవరికైనా తటిందా? సుదర్శనంగారికే ఎందుకు తట్టాలి ? తనతో మాట్లాడే టప్పుడు ఆయన కళ్ళలో యెంత జాలి కనిపించింది! .. దుర్గాంబ వదుడు నక్క లాటి మనిషి; పోతపోసిన విగ్రహమల్లే ... నిష్ఠుమూర్తిమల్లే – ఉందే ఈ మనిషికి ఆ భయంకరమైన భార్య ఎట్లా దొరికింది ?

భానుకు శాస్త్రివద్దనుంచి ఉత్తరం వచ్చింది. తాను కులాసాగా చేరాననీ, తనకు సుదర్శనంగారి ఇంట్లోనే ఉద్యోగమనీ, వాళ్ళ ఇల్లు చాలా పెద్దదనీ, వాళ్ళు కొత్తగా రేడియోసెట్టు ఒకటి కొన్నారనీ, సుదర్శనం అడిగానని చెప్ప మన్నారనీ శాస్త్రి రాశాడు. అప్పుడప్పుడూ ఉత్తరాలు రాస్తూవుందమన్నాడు.

ఆ ఉత్తరంలో భానుకు సుదర్శనంగారి చెయ్యి కనిపించింది.

రెండు రోజులిల్లా లాత్సారంచేసి ఆమె తమ్ముడికి జవాబు రాసింది:

"చిరంజీవి శాస్త్రిని దీవించి భానక్క వ్రాయునది. క్షేమం. నీ ఉత్తరము అందినది. నీవు అదృష్టవంతుడవు. దూరముగా వెళ్ళినావు. నాకు కూడా యెక్కడి కైనా దూరము పోవలెనని వున్నది. ఇక్కడ ఒకరితో ఇరుక్కుపోయినాను. రోజల్లా పద్మ స్కూలుకు పోతుంది. నాకేమీ తోచదు. సుదర్శనం మామయ్యగారు మనకు చేసిన మేలు మరువరానిది. ఆయన చెప్పినట్లు వింటే, నీవు బాగుపడతావు. సుదర్శనం మామయ్యగారినీ, దుర్గాంబ అత్తయ్యగారినీ, పిల్లలనూ అడిగినానని చెప్పవలెను. భానక్క."

తమ్ముడు పోయి నెల తిరగకుండానే బావగారు భానును వేటాడ నారంభించాడు. వారసత్వంరీత్యా భాను తన సొత్తు అన్న భావన ఆయనకున్నట్టు కనబడింది. రసికత బొత్తిగా లేని మనిషి కావడంచేతనో ఏమో ఆయన భానును కొంచెం కూడా లొంగదీయలేక పోయినాడు. భానుకు ఆయనమీద అసహ్యం అంతకంతకు హెచ్చి, ఆయన గొంతు వినిపిస్తేనే వికారపెట్టే పరిస్థితి ఏర్పడింది.

భాను సౌమ్యురాలు. ఏ విధమైన ఘర్షణా భరించలేదు. అఘాయిత్యం చెయ్యగలదైతే తన భర్త బతికి ఉండగానే బావగార్ని అల్లరి పెట్టేసి వుండును. ఆయనతో మూగయుద్ధం చెయ్యడమే ఆమెకు ప్రాణాంతకంగా వుంది. ఒకసారి ఆమె పడుకొని ఉండగా ఆయన మీదికి వస్తే డొక్కలో బలంగా తన్నింది. ఇంకోసారి మొహాన ఉమ్మేసింది.

ఇంతగా తనను వేటాడుతున్న ఆయన కళ్ళలో ప్రేమవంటి భావం పొరపాటున కూడా ఆమెకు కనిపించలేదు. ఆయన ఆమెకేసి హంతకుడల్లే చూసేవాడు. ఆమె తనను తృణీకరించినప్పుడు హత్య చేయడానికి సిద్ధంగా ఉన్నట్లే కనబడేవాడు. ఎప్పుడో ఆయన తనను హత్య చేయవచ్చునన్న అనుమానం భానుకు తట్టింది. కాని ఆమె చావటానికికూడా సిద్ధపడింది.

హత్యకు ఒడిగట్టక పోయినా, భాను జీవితం సాధ్యమైనంత దుర్భరంగా చెయ్యడానికి ఆమె బావగారు ఓపికతో కృషిచేశాడు. ఆమె పాకీవాణ్ణి కోప్పడితే చాలు వాడికీ ఆమెకూ రంకుకట్టాడు. నీచ వంశంనుంచి వచ్చిన మనిషికి నీచ బుద్ధులే ఉంటయ్యన్నాడు. ఆ కూతురైనా తన తమ్ముడికి పుట్టిందో లేదో అన్నాడు. ఆ భార్యా భర్తల రక్తాలు కలిసేవే అయితే ఆ తరువాత మళ్ళీ పిల్లాపీచూ లేకపోవడ మేమన్నాడు.

తాను ఆయనతో రంకు చెయ్యనందుకు కోపంవచ్చి తన బావగారు తనకు రంకు అంటగట్టడంలోగల సారస్యాన్ని భాను కొంతవరకు గ్రహించింది. బావగారు చేసే అన్యాయాన్ని తన తోడికోడలో, మామగారో, అత్తగారో అరికడతారనుకున్నది భాను. కాని అటువంటిదేమీ జరగలేదు. ఆమె ఒక పెద్ద పొరపాటు కూడా చేసింది. బావగారికి ఎదురు చెప్పక, మాటలన్నీ పడింది. మౌనం అంగీకారమయింది. బావగారు మరింత రెచ్చిపోయినాడు.

భరించినంత కాలం భరించి తన కష్టాలన్నీ తమ్ముడికి పెద్ద ఉత్తరం రాసుకున్నది. ఆ ఉత్తరాన్ని సుదర్శనంగారు చూసి తనకేదో ఉపకారం చేస్తాడని ఆమెకు ఆశ. అది గొంతెమ్మ కోరికలాగే ఆమెకు కనబడింది.

అందుచేత మూడోనాడు తెల్లవారుఝామున ఇంటి బయట కారు హారన్ వినిపించి, ఆ వచ్చినది సుదర్శనమని తెలిసినాక భానుగుండె చేతి గడియార మల్లే కొట్టుకున్నది.

సుదర్శనం వ్యాపారంమీద వచ్చినట్టు నటించాడు. అందులో అబద్ధం ఉన్నదని భానుకుతప్ప ఇంకెవరికీ తట్టలేదు. ఆయన అందరూ వింటుండగా భానుతో "అన్నట్టు, మీ తమ్ముడు మీ తల్లి కూతుళ్ళ నిద్దరిని వచ్చి తన వెంట ఉండమంటున్నాడు! సంపాదనాపరుడైనాడు గద; మీ కిక్కడే బాగుంటుందేమో నన్నాను. కాని వాడికి నా మాట నమ్మకం లేదు" అన్నాడు.

"నాకిక్కడ ఎట్లాబాగుంటుందీ - ఆయిన మనిషి పోయినాక?"

ఆ మాట భానునోట అప్రయత్నంగా వచ్చేసింది. దాన్ని సరిచేసుకొనే దానిలాగా ఆమె "అయినా ఒక నెలో, పదిహేను రోజులో వచ్చి ఉండడానికి నా కేమీ అభ్యంతరం లేదు. పిల్ల పట్నం చూడాలని ఈ మధ్య చాలాసార్లు అన్నది. వాళ్ళ మామ పట్నంలో ఉండడం దానికి అసూయగా ఉన్నది" అన్నది.

ఇక్కడ భాను బావగారు ఆగ్రహావేశంలో నోరుజారి సుదర్శనానికి అను కూలమైన మాట అనేశాడు.

"ఉంటే యిక్కడ వుండు, వెళ్ళితే నీ తమ్ముడి దగ్గిరికి వెళ్ళిపో. వస్తూ పోతూ ఉండటాని కిదేమన్నా హోటలా, సత్రమా ?"

సుదర్శనం గట్టిగా నవ్వి, "ఇది బందిఖానా అంటావా ఏమిట్రా? వెళ్ళిన వాళ్ళు మళ్ళీ రావటానికి వీల్లేనిది జైలేగా?" అన్నాడు హాస్యాని కన్నట్టుగా.

"కాదులే. నేనా మాట ఊరికే అనలేదు. మాకూ రొష్టుగానే ఉన్నది. దానికీ రొష్టుగానే ఉన్నది కాని-నువ్వు సాక్ష్యం ఉన్నావుగా మాకై మేం వెళ్ళ మనేది లేదు. తాను వెళతానంటే అడ్డగించబోం. వెళ్ళిన మనిషి మళ్ళీ రానవ సరం లేదంటాను" అన్నాడు భాను బావగారు.

సుదర్శనం నవ్వడం మానేసి, "అయితే తల్లీ పిల్లల వ్యవహారం పరిష్క రిస్తానంటా వేమిట్రా?" అని అడిగాడు.

"పరిష్కరించుదాం-కష్టమేముందీ? పెళ్ళి అయేదాకా తల్లీ పిల్లల భుక్తికీ, పిల్లపెళ్ళి ఖర్చుకూ, యావజ్జీవం తల్లి భరణంకిందా ఎంత యివ్వొచ్చు నంటావు?"

"ఎంత యివ్వొచ్చు నేమిటీ? పోయిన నీ తమ్ముడి పరువు కావాలంటే ఎంతైనా యివ్వొచ్చు. పూర్తి సెటిల్మెంటు చేద్దామనా?" అని సుదర్శనం అడి గాడు.

"అంతకూ కలిపి అయిదు వేలిద్దామను కుంటున్నాను, న్యాయమేనంటావా?"

సుదర్శనం నవ్వి, "నీ తమ్ముడి పెళ్ళికే వీళ్ళనాన్న పదివేలు ఖర్చుపెట్టా డని చెప్పుకున్నారు. పిల్లపెళ్ళికి అంతఖర్చు పెట్టగూడదని నీ ఉద్దేశమా? అంతకీ

కలిపి అయిదు వేలిస్తానంటే పెళ్ళిఖర్చు కెంతని నీ ఉద్దేశం. ఈ ఖాను తండ్రిగారి కన్న నువు పేదవాడినంటావా?" అన్నాడు.

"అదేంమాట? తండ్రి ఉంటే కూతురుపెళ్ళికి లక్షలు ఖర్చుచేసే వాడేమో కాని, ఆ పరిస్థితి లేదుగా! అంతకీ కలిపి పదివేలిస్తాను. చాలకపోతే కోర్టుకు పొమ్మను" అన్నాడు ఖాను బావగారు.

మధ్యాహ్నానికల్లా రాతకోత లన్నీ అయిపోయినై. కొత్తనూరు రూపాయల కట్ట ఖానుచేతిలో పడింది. ఖాను తన బట్టలూ, వస్తువులూ, నగలూ, తనవీ పిల్లవీ అన్నీ మూటగట్టి కారులో పెట్టి పద్మ వెంట కారు వెనుకసీటులో ఎక్కింది. సాయంకాలం అయిదు గంటలవేళ కారు బయలుదేరింది. డ్రైవరు వేరే లేడు, సుదర్శనమే చక్రం పట్టుకున్నాడు. అప్పగింతలూ, అంపకాలూ ఏమీ లేవు.

# 4

తెల్లవారిగాని పట్నం చేరనవసరం లేదనే ఉద్దేశంతో సుదర్శనం కారును తాపీగా నడిపించాడు. రోడ్డు చాలా పాడుగా ఉంది. అతవాళ్ళ హైరాన పడతారు.

నెల్లూరులో హోటల్లో భోజనం చేసుకున్నాక పద్మ నిద్రలో జోగ సాగింది.

"పిల్లను సీటులో పడుకోనిచ్చి నువ్వు ముందుకు వచ్చెయ్యి" అన్నాడు సుదర్శనం.

ఆయన ఆ మాట అనడం ఖానుకు దుశ్శకునంగా కనిపించింది. మగవాళ్ళంతా ఒకటేనన్నది సుదర్శనం రుజువు చెయ్యబోతున్నాడనుకున్నది. ఈ నడి రోడ్డుమీద అరిచి ఎవరినన్నా పిలవడానికూ్కడా ఉండదు. తానిప్పుడు బోనులో చిక్కిన ఎలుక!

సుదర్శనం మీద ఆమెకు ఎన్నడూ దురభిప్రాయం లేదు. అయినా ఇప్పుడు తన ప్రాణానికి ఆయన రాక్షసుడల్లే కనిపించడం ఆమెకు అసహజంగా తోచలేదు. అసలు దారి పొడుగునా ఖాను తాను అత్తవారితో తెగతెంచుకు రావడం చాలా పొరపాటయి వుంటుందన్న అభిప్రాయంతో పశ్చాత్తాపంలో మునిగి వున్నది. బావగారు ఎంత నీచంగా చూసినా అది తనకు ఉండదగిన ఇల్లు. తెలిసిన పీడనుంచి పారిపోయి తాను తెలియని పీడలకు గురికావలసి రావచ్చు.

ఆ పారిపోవడమైనా తన ప్రయత్నం ఏమీ లేకుండానే జరిగింది. కొద్ది రోజులపాటు తమ్ముడి దగ్గిర వుండిరావాలన్న కోరిక ప్రకటించటం తప్ప తాను ఏ అపచారమూ చెయ్యలేదు. ఈ సుదర్శనమూ, తన బావగారూ చేరి తనను ఆ ఇంట్లో నుంచి బయటికి ఈడ్చారు.

భాను మనసు ఉక్కిరి బిక్కిరి అయింది. తనతో ఇటువంటి సంభాషణ ఎవ్వరూ చెయ్యలేదు. సుదర్శనం ఆ మాట అంటుంటే భాను నిజంగా తనకు దేవత్వం వచ్చినట్టే భావించింది. కాని ఆ మాట పైకి అనాలని ఆమెకు తట్టలేదు.

సుదర్శనం చేతి గడియారం చూసుకుని, 'ఒంటిగంట కావస్తున్నది. బయల్దేరదాం" అంటూ కారు ముందుగా తిరిగి వచ్చి తన సీట్‌లో కూచుని స్టార్టు చేశాడు.

"మన దేశంలో అందానికి గుడ్డిగవ్వ విలువ లేదు. తెల్లవాళ్ళ దేశాలలో అందగత్తెలను పెళ్ళాడటానికి కోటీశ్వరులు పోటీపడతారు. ఒక అందగత్తె ఒక వేళ విధవ అయితే, క్షణంలో ఆమెను ఎవరో ఒకరు ఎగరేసుకు పోతారు. ముండ మోపిలాగ కూచోనివ్వరు" అన్నాడు సుదర్శనం.

"అదేమంత గొప్పసంగతి?" అన్నది భాను.

సుదర్శనం చిరునవ్వు నవ్వటం ఆమెకు కనిపించింది.

"అన్ని సుఖాలకు నీళ్ళు వదలుకొని మూల కూచోటం గొప్ప విషయమా?"

భాను జవాబు చెప్పలేదు. ఇద్దరూ కొంచెం సేపు మౌనంగా వున్నారు. సుదర్శనం స్వగతం మాట్లాడుకునే వాడల్లే, "ప్రేమ అంటే ఇదేనేమో? ప్రపంచంలో ఇంత మంది ఆడవాళ్ళుంటే నా ప్రాణం నీ ఒక్కత్తె కోసమే ఎందుకు పీకుతుంది? అది నీలోనే ఉన్నదనుకుంటే నిన్ను చూసే వందలాది మగవాళ్ళు నా మాదిరిగా ఎందుకు బాధపడరు.... పట్నం వెళ్ళినాక నన్ను పెళ్ళి చేసుకుంటావా భానూ ?" అన్నాడు అకస్మాత్తుగా.

"నాకు పెళ్ళేమిటి? మొగుడుపోయినదాన్ని, పిల్ల తల్లిని!" అన్నది భాను నిర్ఘాంతపోయి.

"నీ స్థితిలో మళ్ళీ పెళ్ళి చేసుకున్నవాళ్ళు నా ఎరికలోనే అయిదారుగు రున్నారు."

"నన్ను చేసుకుంటే నీకు లాభమే కాని నష్టం ఉండదు."[1]

"తరువాత చూద్దాం లెండి."

"నే నంటే కొంచెమైనా ఇష్టం ఉంటేనే—లేకపోతే చూడటం అనవసరం."

"మీరు నాకు చాలా ఉపకారం చేశారు" అన్నది భాను. ఆ మాటంటే తనకు ఆయన మీద ఇష్టం లేకపోలేదని స్పష్టమవుతుందన్న ఆశతో.

సుదర్శనం బ్రేక్ వెయ్యకుండా స్విచ్ ఆఫ్‌చేసి కారు తనంతట అదే క్రమంగా ఆగేటట్టు చేశాడు. ఆయన ప్రక్కకు వంగి భాను చెంపను తేలికగా

---

1. ఈ రెండు వాక్యాల మధ్య భాను సమాధానం ఉండి ఉండాలి. లేకపోతే ఉల్లేఖన చిహ్నాలు రెండు వాక్యాలకు వేరు వేరుగా ఉండవలసిన పనిలేదు.

ముద్దు పెట్టుకున్నాడు! భాను మొహం ప్రక్కకి తిప్పేసుకున్నది. ఆమె కెందుకో నవ్వొచ్చింది.

ఆ నవ్వు యిచ్చిన ప్రోత్సాహంతో సుదర్శనం ఆమెకు దగ్గిరిగా జరిగి ఆమె చుట్టూ చేతులు వేసి ఆమె శరీరాన్ని తనకేసి అదుముకుంటూ భాను మూతిని ముద్దుపెట్టుకోడానికి ప్రయత్నించాడు, కాని భాను కొంచెంకూడా సహాయం చెయ్య లేదు.

"నీ శాపం తీరిందిగాని, నా శాపం తీరలేదు. ఏం చేస్తాం?" అంటూ ఆయన ఆమెను వదిలేశాడు.

ఆయన మళ్ళీ కారులో నుంచి బయటికి దిగి సిగరెట్ కేసు తీశాడు. భాను తనంతట తనే తలుపు తెరుచుకు దిగి ఆయనకు కొంత ఎడంలో నిలబడి, "వెన్నెల బాగుంది!" అన్నది.

"వెన్నెల్లో నువ్వెంత బాగున్నావో నీకు తెలియదుగద!"

సుదర్శనం సిగిరెట్టు కేసు జేబులో పెట్టేసి ఆమె కెదురుగా నిలబడ్డాడు.

"మీరు నన్ను గురించి అభిప్రాయం మార్చుకుంటే బాగుంటుంది. అందరికీ మంచిది" అన్నది భాను.

"అవును" అంటూ సుదర్శనం ఆమె చెయ్యి పట్టుకుని చెట్ల అవతలికి తీసుకు పోయి ఆమెను గట్టిగా కౌగిలించుకుని ముద్దు పెట్టుకున్నాడు. భానుకు తన శరీరం యావత్తూ కరిగి ప్రవాహాలై పోతున్నట్టు తోచింది. పురుష స్పర్శ అనేది ఎట్లా వుంటుందో ఇప్పుడే తెలుసుకుంటున్న దానిలాగా అయిపోయిందామె.

దేవతలూ, శాపాలూ మొదలైన కవికల్పనలమాట అటుంది, కొద్దిమంది పురుషులకూ, కొద్దిమంది స్త్రీలకూ మధ్య ప్రగాఢమైన సంబంధం ఏర్పడడానికి ప్రకృతి అవకాశాన్ని కలిగిస్తుంది. సాధారణంగా ఆ స్త్రీలూ ఆ పురుషులూ కలుసు కోవడం జరగదు. జరిగితే, వారిని ఈశ్వరుడు కూడా వేరుచెయ్యలేడు. కావ్యాల లోనూ, ప్రబంధాలలోనూ అటువంటి జంటలను గురించి రాశారు. సాంఘిక పరి స్థితులను బట్టి అటువంటి జంటలను గురించి రాయడం బొత్తిగా అవసరమై పోయింది. భానూ, సుదర్శనమూ అటువంటి జంట. వాళ్ళిద్దరూ కలవడమే వింత- మిగిలినదానిలో వింత ఏమీ లేదు.

## 5

సుదర్శనం వెంట భానూ, ఆమె కుమార్తె పద్మా సామానుతో సహా దిగడం చూసి అందరూ ఆశ్చర్యపడ్డారు. అందరికన్నా ఎక్కువ ఆశ్చర్యపడ్డాడు శాస్త్రి. అయితే, అతను సంతోషించాడు. మిగిలిన వాళ్ళెవరూ సంతోషించలేదు. అంతే లేదా.

భాను అత్తవారింటి నుంచి వచ్చెయ్యడం ఏ పరిస్థితులలో జరిగిందో సుదర్శనం ఉన్నది ఉన్నట్టే తన భార్యకు చెప్పాడు. కాని దుర్గాంబకు తప్పంతా తన మొగుడిదేనని తోచింది. అసలు ఆవిడకు తన మొగుడి ఇంగితజ్ఞానంలో ఆవగింజంత అయినా నమ్మకంలేదు. ఎప్పుడే అవకతవక పని చేస్తాడో అనుకుంటూనే ఉంటుంది. అప్పుడప్పుడూ ఆవిడ భయపడ్డంతా జరుగుతుంది. దాంతో తన మొగుడికి ఇంగితజ్ఞానం లేదన్న ఆవిడ విశ్వాసం మరింత స్థిరపడుతుంది.

"వాడిమీదాన్నీ కసి. నానెత్తినెక్కి అన్నట్టుగా, వాళ్ళ ఆవిణ్ణి ఇంట్లోనుంచి వెళ్ళగొట్టడమేమిటి? మీరు వీళ్ళిద్దర్నీ కొంపమీదకు తీసుకురావడ మేమిటి? ప్రతిదీ మీకు పట్టుకుంటుందేమిటి కర్మ?" అని దుర్గాంబ మూతీ, ముక్కూ తిప్పుతూ భర్తను అడిగింది.

సాటి మానవులకు దయా దాక్షిణ్యాలు చూపడమనేది పనికిమాలిన వ్యాపకమని ఆవిడ దృఢ విశ్వాసం. భానుకు చేతనయిన సహాయం చేశానని చెబితే దుర్గాంబ లక్ష్యం చేసుకోలేదు. భానును నేను ప్రేమించాను. ఇకముందు ఆమె నా రెండో భార్య అని చెబితే దుర్గాంబ సులువుగా అర్థంచేసుకుంటుంది. కాని ఇంటిని శవం లేచిన కొంపల్లె చేసెయ్యగలదు. గృహ వాతావరణాన్ని క్షణాలమీద పాడుపెట్టడంలో సిద్ధహస్తురాలు. అందుచేత సుదర్శనం ఏమీ చెప్పలేదు.

"అడిగేదానికి సమాధానం కూడా చెప్పరు. ఏమిటి మీ ఉద్దేశం?" అని దుర్గాంబ దబాయించింది.

"సమ్మెటిపెంపు ఉండాననని బయలుదేరి వచ్చింది. రావడం రైల్లోరాక నా కారులో వచ్చింది. అందుకు నేను ఏం పరిహారం చెయ్యవలసి ఉంటుంది? నువ్వు ఏ మడుగుతున్నదీ నాకు సరిగా అర్థం కాలేదు. నువు వేసినది తలా తోకా ఉన్న ప్రశ్న అయితే సమాధానం చెబుతాను" అన్నాడు సుదర్శనం.

"ఇంతకూ మీరు బయలుదేరి వెళ్ళినపని ఇదేనా?" అన్నది దుర్గాంబ నిజం పసికట్టి. పసికట్టడంలో దుర్గాంబ కుక్కలకు ఆదే తీసిపోదు. సుదర్శనాన్నీ, భానునూ గజం దూరంలో ఉండగా చూసే వారిమధ్య అంత ఎడం లేకపోవచ్చునని గ్రహించింది.

"అవునవును. ఆవిణ్ణీ, కూతుర్నీ తీసుకురావడానికి బయలుదేరి వెళ్ళా!" అన్నాడు సుదర్శనం వెటకారంగా.

"అసలు మీరా యింటికెందు కెళ్ళవలసొచ్చిందీ?" అన్నది దుర్గాంబ, పారిపోవడానికి పిల్లికంత చూసుకున్నట్లుగా.

"మా అన్నయ్యగారింటికి యెందుకు వెళ్ళవలసొచ్చిందనా అడుగుతున్నావు?" అన్నాడు సుదర్శనం భార్య మాటలను నమ్మలేని వాడి పోజుపెట్టి.

"ఇదంతా నాకు తెలీదు. వాళ్ళ రోజుల తరబడి ఇక్కడుండడం అసహ్యంగా ఉంటుంది. ఆవిడ తమ్ముడింటికి వస్తే నేను కాదన్నానా ఏమిటి? మొదట ఆ తమ్ముడు మన ఇల్లు పట్టుకు వేళ్ళాడుతుంటే - వాడికి ఇళ్ళా వాకిలా?"

"ఆ బారిస్టరుగారి వదినెగారు గంపెడు పిల్లలతో రెండు వారాలుండిపోయి నప్పుడు నీకేమీ అభ్యంతరం లేకపోయిందే!" అన్నాడు సుదర్శనం.

"ఆవిడ నా స్నేహితురాలు! ఈవిడ నా స్నేహితురాలా? నా కర్మ కాలితే—"

ఆ ఆఖరు మాటకు అన్వయం ఏమిటో మనం ఊహించవలసిందే.

ఈ సంభాషణంతా ఇంట్లో పై అంతస్తులో జరిగినా దాన్ని ఏ క్షణాన అయినా భానో, పద్మో, శాస్త్రో వినేటందుకు సకలమైన అవకాశాలూ ఉన్నై. అయితే, ఇంకొకరు తన మాటలు వినిపోతారన్న భయం దుర్గాంబకు ఏ కోశానా లేదు. ముఖ్యంగా తాను భర్తను దబాయించే టప్పుడూ, తనకు ఇంకొకరు వినుకుని పోతారన్న భయంలేదని రుజువు చేసుకునే సంభాషణ చేసేటప్పుడు శ్రోత లుంటేనే ఆవిడకు మరింత ప్రోత్సాహంగా ఉండేది. ఇంకో మనిషిని గడ్డిపోచ కింద కట్టటానికి దొరికిన ప్రతి అవకాశాన్నీ ఆవిడ తృప్తిగా ఉపయోగించుకునేది. భానును గులకరాయి క్రింద చూడటంకన్న గొప్ప ఆనంద మేమంటే, ఆ సంగతి భానుకు తెలియటం.

"శాస్త్రిని అదివరకే గది వెతుక్కోమన్నాను. ఇప్పుడు పోర్షను వెతుక్కుంటాడు. అంతదాకా వాళ్ళు ఇక్కడే ఉంటారు!" అన్నాడు సుదర్శనం.

"అయితే ఈ ఇంట్లో నా ఇష్టమంటూ ఏమీలేదా ఏమిటి?" అని దుర్గాంబ నిష్కర్షగా అడిగింది.

"నీ కిష్టంలేని విషయం ఏనాడైనా భరించావా ఏమిటి? ప్రతీసారీ ఇంత రాద్ధాంతమూ చేస్తూనే ఉన్నావే? నే నడుగుతాను నువు చెప్పు - ఈ ఇంట్లో నా ఇష్టప్రకారం ఏదీ జరగటానికి వీల్లేదా?"

"ఈవిణ్ణి తీసుకురావటంలో మీ ఇష్టం ఉన్నదని ఇప్పుడేగా నాకు తెలిసింది. ఆవిడ నాకెంతో మీకూ అంతే అనుకుని ఇందాకణ్ణుంచీ మాట్లాడాను. 'నేను నా ఇష్టం కొద్దీ తెచ్చుకున్నాను. ఇంట్లో ఉంచుకుంటాను' అనేట్టుంటే ఉంచుకోండి!" అని దుర్గాంబ చెప్పింది.

ఈ రకం సంభాషణను సుదర్శనం చాలా ఏళ్ళుగా వింటున్నాడు. దానికి తరుగూ విరుగూలేదు. 'పరాకు సేయుట పాడిగాదురా' అనే పాట[1] ఎంత అరిగి పోయిందో దుర్గాంబ సంభాషణ తాలూకు పడికట్టురాళ్ళు అంతగా అరిగిపోయినై.

---

1. భద్రాచల రామదాసు కీర్తనలోని పల్లవి.

జీవితానికి ఎప్పటి కప్పుడు కొత్తగా రియాక్ట్ కావడం ఆవిడకు చాతకాదు. ఆవిడ నేర్చుకోదగిన లౌకిక జ్ఞానమంతా ఏ పదేళ్ళ లోపలనో నేర్చుకుని మిగిలిన జీవిత మంతా దానితోనే కాలక్షేపం చేసి నెగ్గుకొస్తున్నది.

దుర్గాంబకు భర్త అంటే అలుసుకావటానికి చాలా కారణాలున్నై. ఆమె దృష్టిలో అవన్నీ నిరాక్షేపణీయమైనవే. ఆయన తననుచూసి మోహించి, వెంట పడి, తనను బలాత్కారంగా అనుభవించలేదా? ఇది కారణం. వారిద్దరికీ పెళ్ళి అయేనాటికి సుదర్శనం సంస్కారం చాల హీనదశలో ఉన్నది. ఆ సంగతి దుర్గాంబ సులువుగానే కనిపెట్టింది. సుదర్శనం ఎన్నో అల్పవిషయాలు ఆమె దగ్గిర నేర్చుకున్నాడు. అది రెండో కారణం. అన్నిటికన్న ప్రబలమైన ఆర్థిక కారణం వుండనే ఉన్నది - తన డబ్బే లేకపోతే సుదర్శనం ఎక్కడుండేవాడు? ఆయన మొదటి నుంచీ తనపట్ల ఎంతో సహనం చూపించటం ఇందుకేనని దుర్గాంబ ఊహించింది. ఆ ఊహలో అవగింజంత పొరపాటు కూడా లేదు.

కాకపోతే, ఏ ఆడదీ చూస్తూచూస్తూ తాను వికారంగా ఉన్నాననుకోలేదు గనుక, మొదట్లో సుదర్శనం తనను డబ్బుకోసం పట్టుకున్నా డనుకోలేదు. తనను నిజంగా మోహించాడనే అనుకున్నది. తా వలచింది రంభ అన్న సామెత ఆమె విశ్వాసానికి ఆధారమయింది.

సుదర్శనం కార్యవాది. చిన్నతనం నుంచీ ఓర్పు నేర్చుకున్నవాడు. 'భుక్తికో ముక్తికో' అయిన విషయాలనే మనసుకు పట్టించుకునేవాడు. మిగిలిన విషయాలను ఉపేక్షించటం ఆయనకు చాతనవును. అందుకే ఆయన దుర్గాంబ మానసిక జీవితాన్ని కొంచెం కూడా పంచుకోలేదు. పిల్లలు తమ తల్లి ప్రపంచాని కంతకు యజమానురాలనీ, తండ్రి ఆవిడ నడిపించే గుర్రమనీ అనుకునేవాళ్ళు – వాళ్ళకుగల ఆ భావాన్ని పోగొట్టటానికి కూడా సుదర్శనం యత్నించలేదు. ఆయనకు చేతినిండా ఎప్పుడూ పని ఉంటుంది. పని పెట్టుకుని యితరుల మనస్సులను కెలకటానికీ, దువ్వటానికీ, చిక్కు తియ్యడానికి బోలెడంత తీరిక ఉండాలి. ఆ తీరిక సుదర్శనానికి ఏనాడూ లేదు.

## 6

ఏనాడో స్నేహితుల మాట తీసెయ్యలేక సుదర్శనం కొంత నివేశన స్థలం కొన్నాడు. ఆ స్థలం రాజాగారిది. ఏదో బ్యాంకుకు తాకట్టుకు ఉన్నది. మొత్తం మూడెకరాలు వున్నది. బ్యాంకు బాకీ ఆరువేలూ తీర్చేవాళ్ళకు రాజాగారు స్థలం యిచ్చేస్తారన్నట్లు తెలిసి, ఒక మిత్రుడు సుదర్శనంతో కొందామా అన్నాడు; సుదర్శనానికి యిళ్ళ స్థలాల మీద మక్కువలేదు. అయినా ఒక ఎకరం తీసికొంటా నన్నాడు. ఇదంతా జరిగి రెండేళ్ళయింది. ఈ లోపుగా ఆ మిత్రుడు

ప్లానులు వేయించి మొత్తం స్థలమంతా ప్లాటు వేయించి, రోడ్డు గీయించి కార్పొరేషన్ వాళ్ళచేత ఆమోదింప చెయ్యటమే గాక తన భాగంలో కొన్ని ప్లాటు అమ్మనుకూడా అమ్మేశాడు. సుదర్శనం వంతు వచ్చిన పద్నాలుగు గ్రౌండ్ల ప్లాటూ అట్లాగే ఉండిపోయింది.

భాను వచ్చిననాడే ఆయన తన స్థలంలో నాలుగు గ్రౌండ్లు ఆమెకు ఇచ్చే ప్రయత్నం ప్రారంభించాడు. శాస్త్రీ, భానూ వెళ్ళి పదివేలతోనూ ఆమె పేర ఎకౌంటు పెట్టారు. తరువాత సుదర్శనం శాస్త్రిని తన మిత్రుడిదగ్గరికి పంపి స్థలాన్ని అమ్మాలంటే ఏం చెయ్యాలో కనుక్కోమన్నాడు. ఆ స్నేహితుడు యింకో మనిషిని సుదర్శనం ఇంటికి పంపాడు. ఆయన ప్లానులు తీసిచూసి ఆ పద్నాలుగు గ్రౌండ్లనూ ఏ విధంగా ప్లాటుచేస్తే బాగుంటుందో చెప్పాడు.

"ఈ ప్రక్కనాలుగు గ్రౌండ్లప్లాటు వదలి, మిగిలిన స్థలం మీ యిష్టంవచ్చినట్టు చెయ్యండి" అన్నాడు సుదర్శనం.

శ్రమా, జాప్యమూ హెచ్చి, పనిసాగటం తక్కువా అయినై. నెలల తరబడి ఏమీ జరగలేదు...

భాను ప్రాణానికి తాను నిజంగా భయపడ్డంతా జరిగినట్టే తోచింది. తెలిసిన పీడనుంచి పారిపోయివచ్చి తెలియని పీడవాతను తాను పడింది. అక్కడ తనకు అన్యాయం జరిగితే తనను చూసి 'అయ్యో పాపం!' అని నలుగురూ అంటారు. ఈ ఇంట్లో తనకు ఏ స్థానమూ లేదు. బోనులో పడిన పులిని తుపాకితో కాల్చినట్టుగా, దుర్గాంబ తనను అసహాయ స్థితిలో సూటి పోటి మాటలంటున్నది. స్థానబలం పోగొట్టుకున్న తాను, యీ బోనులోనుంచి బయటపడే మార్గమేమిటి?

వచ్చిననాడూ, మర్నాడూ కూడా భానుకు సుదర్శనంగారు ఒంటరిగా చిక్కలేదు. మూడోనాడు శాస్త్రి ఆమెను బీచికి తీసుకుపోయినాడు. ఎప్పుడో చాలా ఏళ్ళ కిందట విశాఖపట్నం బీచి చూసింది. మద్రాసు బీచి యింత అందంగా ఉంటుందని భానుకు తెలీదు. ఆమె కెరటాలనూ, ఉత్తర దక్షిణాలుగా విస్తరించి వున్న తీరాన్ని, దూరాన కనిపించే రేవులోని స్టీమర్లనూ, చేపలు పట్టి తిరిగి వస్తున్న బెస్తవాళ్ళ తెప్పలనూ, ఇసుకలో చల్లినట్లుగా కూచునివున్న జనాన్ని, పరిగెత్తే పిల్లలనూ చూస్తూ, "రోజూ యిక్కడొచ్చి కూచుంటే ఎంత బాగా తోస్తుందిరా ఒరే!" అంటున్న సమయంలో, సుదర్శనం వాళ్ళను వెతుక్కుంటూ వచ్చాడు.

ఆయన బీచిలో కూచుని ఆనందించటానికి రాలేదు. శాస్త్రిని అక్కడే వేచి వుండమని చెప్పి ఆయన భానును తీసుకుని కారులో బయలుదేరాడు. కారు ఎటు పోతున్నదో భానుకు తెలియదు. ఆమె బయటి దృశ్యాలు గమనించలేదు. సుదర్శనం ఆమెతో తాను అనుకున్న ప్లాను వివరించ నారంభించాడు.

"నాలుగు గ్రౌండ్లు....వెయ్యి చదరపు గజాల పైబడిన స్థలం....నీ పేర రిజిస్టరు చేసేస్తాను. చిన్న ఇల్లు వేసుకొని నీవూ, శాస్త్రీ హాయిగా ఉండవచ్చు. . స్థలమే మూడువేలు చేస్తుంది. చెట్టూ చేమా వేసుకోవచ్చు. పెద్ద ఇల్లే వేసుకుని. అద్దె కివ్వచ్చుగాని, అప్పుడది మనది కాకుండా పోతుంది. అందుకని"

సుదర్శనం కారు ఆపి భానును దగ్గిరికి తీసుకొని, "భానూ! ప్రపంచంలో మనమిద్దరమూ తప్ప యింకెవరూ లేకుండా పోగూడదూ? పెద్ద సమస్యలు పరిష్కరించవచ్చు. పెద్ద త్యాగాలు చెయ్యవచ్చుగాని చిన్న సమస్యలు, చిన్న త్యాగాలు చాతకావేమిటో! నీ కోసం సముద్రంలోకి దూకవలసివస్తే క్షణం ఆలో చించకుండా దూకేస్తాను. కాని దుర్గతో ఛిద్రం పడడమంటే నాకు చాతకాకుండా వున్నది....అందరూ నా సాహసాన్ని ఎప్పుడూ మెచ్చుకుంటారు. కాని తీరా చూస్తే నేను వట్టి పిరికివెధవలాగున్నాను....ఏ రిక్షావాడైనా యిద్దరు పెళ్ళాలతో అవలీలగా కాపురం చేస్తాడు. నేను మటుకు నిన్ను పెళ్ళామని చెప్పుకోగలుగు తానని తోచటంలేదు....ప్రేమలేని రంకుతో పెళ్ళాన్ని తెచ్చుకున్నందుకు ఇది శిక్షలాగుంది—ప్రేమించినదానితో రంకుపోవటం..." అంటూ తన మనస్సులో బాధ వెళ్ళబోసుకున్నాడు.

భాను ఆయన చెప్పేది చాలా జాగర్తగావిని అర్థం చేసుకోవటానికి యత్నించింది. ఆయన బాధ అర్థమైనాక ఆయనను ఓదార్చింది. "ఫరవాలేదు లెండి. అందరూ నన్ను మీ పెళ్ళామని అనుకున్నందువల్ల నాకు హెచ్చుగౌరవం రాబోయేదిలేదు. చేసేది ఎట్టాగూ తప్పుపనే గనుక చాటుగానే చేస్తే సరిపోతుంది" అన్నది.

నిజానికి భానుకు తనసాంఘిక హక్కులు తెలీవు. పూర్వాచారం గీసిన గిరి దాటినాక ఆడదానికి ఏ విధమైన రక్షణా లేదనీ, ఉండనవసరంలేదనీ ఆమె విశ్వాసం. "నిన్ను నలుగురి ఎదుటా పెళ్ళాడినదాకా నన్ను అంటనివ్వకుండా చేసే అధికారం నీకున్నది" అని సుదర్శనం ఆమెతో చెప్పవచ్చును. కాని ఆ అధికారం ఆమెకు అక్కర్లేదు. దాన్ని ఆమె ఏ విధంగానూ ఉపయోగపరచుకోలేదు. ఇటు వంటి అమాయికత్వం ఇతరులలో కనిపించినప్పుడు సుదర్శనం లోగడ తన స్వార్థానికి వినియోగించుకున్నవాడే కాని భాను విషయంలో ఆయనకు అటువంటి ఆలోచన రానుకూడా లేదు. భానుకు గల హక్కులను వీలయినంతమటుకు తానే కాపాడాలని నిశ్చయించాడు. అశక్తత హెచ్చుగా వున్నప్పుడే బాధ్యతలు పెరగటం ఆయన చాలాసార్లు గమనించాడు.

భాను విషయంలో తన అశక్తత స్పష్టంగానే తెలుస్తుంది. దుర్గాంబవంటి అహంకారిణి తనకుపోటీగా ఇంకొక మిసెస్ సుదర్శనం వెలిసిందంటే ఒక రాగం

పెట్టి వూరుకోదు. రావణాసురుడి కాష్ఠం ఒకటి రగిలించి తాను హత్యో, ఆత్మ హత్యో చేసుకునే దాకా వదిలిపెట్టదు. ఆవిడలో అంత దీక్షా, ఆక్కసూ, నెగ్గాలనే తీవ్ర నిర్ణయమూ ఉన్న సంగతి సుదర్శనానికి తెలుసు.

మొదట్లో ఆయన తానే సాలీడుననీ దుర్గాంబకోసం గూడు పన్నితే ఆమె అందులో చిక్కిందనీ అనుకున్నాడు. కాని ఇటువంటి ఊహనాలు మనుషుల విషయంలో బెడిసికొడతై. ఎప్పుడో ఎట్లాగో తానే పురుగై దుర్గాంబ గూట్లో చిక్కి అవసరమయ్యేసరికి చెయ్యీ, కాలూ కదిలించలేని స్థితిలో ఉన్నాడు. ఉన్నా ఇప్పుడు వచ్చిపడిన పెద్దబెడద ఏమీలేదు. భాను తనకు చిక్కింది. ఆమె ఏ హక్కులూ అడగటం లేదు. మామూలు రంకుతనం ద్వారా తనకు కావలసిన సుఖమంతా తానామె నుంచి పొందవచ్చు. తాను ఇతర స్త్రీల మొహం ఎరగనివాడు కాడు. దుర్గాంబను పెండ్లాడక పూర్వం జరిగినవి అటుంచి పెళ్ళి తరవాతనే ఎంతో మందితో పోయాడు. కొన్ని సంఘటనలు దుర్గాంబకు తెలుసు. తెలిసికూడా ఊరుకుంది. తన హక్కులకు ఆటంకం కలగకపోతే ఆమెకు చింతే లేదు. ఇప్పటికి ఎనిమిదేళ్ళుగా వాళ్ళిద్దరి మధ్యా దాంపత్యం లేదు. తనకు నపుంసకత్వం పట్టుకున్నదని కూడా సుదర్శనం భయపడ్డాడు. ఒక డాక్టరును ఈ విషయం కదిలిస్తే, స్పెసిఫిక్ ఇంపొటెన్సీ కూడా ఉంటుందని మాటల సందర్భంలో వివరించాడు. అదే తరవాత రూఢీ అయింది. దుర్గాంబ కాకపోతే ఇంకో ఆడదాని విషయంలో సుదర్శనం మామూలుగానే ఉన్నాడు. దుర్గాంబ మూలంగా పుంసత్త్వం పోగొట్టుకున్న సుదర్శనం, తిరిగి మగవాడు కావటానికి రంకుతనాలు ఆధారం చేసుకోవలసి వచ్చింది.

అయితే, భానుతో తాను కోరి తెచ్చుకున్న ఈ సంబంధాన్ని ఆ రంకులతో జమకట్టడం సుదర్శనానికి ఆత్మద్రోహ మనిపించింది. ఎంత నీచుడు కూడా ఆత్మద్రోహం చేసుకోడు!

# 7

భానునూ, ఆమె కూతుర్నీ, ఆచేత్తోనే శాస్త్రినీ ఇంట్లోనుంచి వెళ్ళగొట్టటానికి కంకణం కట్టుకున్న దుర్గాంబ, ఆకస్మికంగా ఆ కంకణం విప్పేసుకున్నది. ఆవిడ ప్రారంభించిన వ్రతం ఫలోన్ముఖం కానున్న సమయంలో, ఈ పని బొత్తిగా తలవని తలంపుగా జరిగిపోయింది. భానుకోసం వేరే ఇల్లు చూడటం కూడా అయిపోయింది. అందులో ఉంటున్నవారు కొద్ది రోజుల్లో ఖాళీ చేస్తారట. వాళ్ళు వెళ్ళగానే అడ్వాన్సిచ్చి తీసుకోవటమే.

ఈ స్థితిలో ఒక అనుకోని సంగతి జరిగింది. ఒకనాడు కేవ్రలామ్స్‌లో దుర్గాంబా, భానూ, వాళ్ళిద్దరి కూతుళ్ళూ షాపింగు చేస్తూండగా జడ్జిగారి భార్య

తన యిద్దరి కూతుళ్ళతోనూ వచ్చింది. జడ్జీగారి భార్య సుందరమ్మగారు ఎరిగిన్న మనిషిని ఎన్నడూ పలకరించకుండా వదిలిపెట్టదు. ఆవిడకు జీవితంలో ఉండే ఒక్క పెద్ద ఆనందమూ ఏమిటంటే, ప్రతి ఒక్కరిని గురించీ ఎవరి కెవరికి ఏమే అభిప్రాయాలున్నదీ తెలుసుకుంటూ ఉండడం. ఇది నిజానికి పనికిమాలిన జ్ఞానమే. ఎందుకంటే, సుందరమ్మగారు స్వయంగా ఎవరిని గురించీ ఎటువంటి అభిప్రాయం ప్రకటించదు. ఇతరుల అభిప్రాయాలనుబట్టి వేరు వేరు వ్యక్తులతో తాను ప్రవర్తించే పద్ధతి మార్చుకోదు.

ఓహూ అంటే ఓహూ అనుకొనటం అయినాక, దుర్గాంబ భానును పరిచయం చెయ్యవలసి వచ్చింది. తన పుట్టింటివేపు వివరాలు దుర్గాంబకు తెలియవుగనుక భాను స్వయంగా చెప్పుకోవలసి వచ్చింది. అంతా విని సుందరమ్మగారు భానును వాటేసుకుని, "నువ్వేనుటె? చెప్పవేం! .......దీని....మేనత్త మా పెత్తల్లి ఆడబడుచే! దీని పెళ్ళికి మేం వెళ్ళాంగా! మా సుభద్ర అప్పటికి పుట్టింది—నెలల పిల్ల. ఈ రవణమ్మ పుట్టలేదింకా" అంటూ, తన చిన్న కూతుర్ని సంగ్రహంగా ముద్దు చేసింది.

చీరలబేరం వెనకబడింది. పెళ్ళి తరవాత భానుకు జరిగినదంతా కేవ్రాలమ్స్ నౌకర్ల సమక్షంలో సుందరమ్మగారు తెలుసుకున్నది. పద్మను ముద్దుచేసింది. "మనం బంధువులమైనామన్నమాట! అంతా బీరకాయ పీచు!" అని దుర్గాంబతో అన్నది. భానును తీసుకుని సాధ్యమైనంత త్వరలో వాళ్ళ ఇంటికి రాకపోతే, తనకు చాలా కోపం వస్తుందన్నది. ఆ తరువాత అందరూ కలసి షాపింగు చేశారు. పద్మకు చాలా బాగుంటుందని పావడాకూ, జాకెట్టుకూ మాచ్ అయేట్టుగా చూసి సుందరమ్మగారు గుడ్డలు సెలెక్టు చేసింది.

వెళ్ళిపోయేటప్పుడు సుందరమ్మగారు తాను చెక్కిళ్లు నిమరటమూ, పద్మను ముద్దుపెట్టుకొనటమూ చూసింది దుర్గాంబ. సుందరమ్మ కూతుళ్ళిద్దరూ కోమలతో మాట్లాడనైనా మాట్లాడక, అంతసేపూ పద్మతోనే కబుర్లు చెప్పుకోవటం చూసి మండిపోయింది. వాళ్లు వెళ్ళిపోతూ, "తప్పకుండా రావాలి, పద్మా - లేకపోతే మా క్కోపం వస్తుంది" అన్నారు, తల్లిని యథాశక్తి అనుకరిస్తూ.

ఇది జరిగినాక భానునూ, పద్మనూ ఇంటినుంచి వెళ్ళగొట్టటం గురించి పునరాలోచించవలసిన అవసరం ఉన్నదా, లేదా అన్న సమస్య దుర్గాంబ ఎదుర్కొన్నది. పునరాలోచన తప్పదని తోచింది. అయితే, వెళ్ళగొట్టటమా, మానటమా? మానితే ఏ వంకపెట్టి మానటం? అపజయం అన్నమాట పడకుండా ఎట్లా తిరోగమించటం? ఈ సమస్య దుర్గాంబను ఎదుర్కొన్నది.

గర్విష్ఠి అయిన దుర్గాంబకు ఈ సమస్య కొరుకుడుపడలేదు. ఎట్లా జరిగితే అట్లా జరుగుతుంది.... చెయి మించిపోయింది...చేసేదేమీ లేదు అని ఆవిడ చేతులు ముడుచుకోబోతుండగా, ఇంకొక విషయం మెరుపల్లె నిమిషంలో మెరిసింది. భాను తన ఇంటి చూరు కింద ఉన్నంత కాలమూ ఆమె తన భర్తకూ, ఆమెకూ మధ్య అట్టే గ్రంథం జరగకుండా కొన్ని కట్టుదిట్టాలు చెయ్యవచ్చు. కాని భాను వేరే ఇంటికి పోయిందో....!

ఎన్నిసార్లు అర్ధరాత్రివేళ తాను గాఢనిద్రలో ఉండగా, తన భర్తా, భానూ వేరువేరు చోట్ల కలుసుకున్నదీ దుర్గాంబకు కొంచెం కూడా తెలియదు. కాని భాను వేరే ఇంటికి పోతే వాళ్ళు దాదాపు రోజూ కలుసుకొంటారనేదిమటుకు నిజం.

ఈసారి దుర్గాంబ తప్పనిసరిగా పునరాలోచించి, భానును ఇల్లు దాటి పోనివ్వరాదని తేల్చింది. తనలో కలిగిన నిర్ణయానికి అనుగుణంగా ఇప్పటినుంచే ఆవిడ భాను మీద అధికమైన ఆదరం చూపించసాగింది. అయితే, ఆ సంగతి భానుకు స్పష్టంగా తెలియరాలేదు. ఎందుకంటే, పాపం దుర్గాంబ ఆదరానికీ, అనాదరణకూ ఉండే తేడాను మైక్రోస్కోపుతో మాత్రమే కొలవవచ్చు. ఆవిడ ఆపేక్షగా మాట్లాడుతుంటే దెప్పినట్టుంటుంది. హాస్యమాడితే కోప్పడుతున్నట్టుం టుంది. ఎవరికన్నా సానుభూతి చూపితే కసిరినట్టుంటుంది. ఆవిడ మనస్తత్వం అటువంటిది. అది ఆవిడ శరీరతత్వానికి ప్రతిబింబమే. ఆవిడ అందంగా ఉండ టానికి ప్రయత్నించిన కొద్దీ, వికారంగా తయారవుతుంది. "అమ్మా, నువు స్నానానికి పొయ్యేముందు బాగుంటావు గాని పేరంటానికి పొయ్యేటప్పుడు బాగుండవేం?" అని తల్లిని అడిగి ఒకసారి కోమల తల్లిచేత చెంప పగలకొట్టించు కున్నది...

ఒకనాడు సుదర్శనం శాస్త్రితో, "ఇవాళ ఆ అడ్వొకేటుగారు కనిపించాడు. ఎల్లుండి వాళ్ళు ఇల్లు ఖాళీచెయ్యటం ఖాయమేట. మీ అక్కయ్యనడిగి ఇంటికి కావలసిన సామగ్రి అది రాసుకో. కొత్త కాపరం గదా!" అనటం దుర్గాంబ చెవిన పడింది.

"కొత్తకాపురం" అన్నమాట ఆవిడ చెవులకు చుర్రున తగిలినట్టయింది.

"మీ కేమైనా కాస్తుపిచ్చా ఏమిటి?" అన్నదామె దగ్గరికి వస్తూ.

"అంటే?" అన్నాడు సుదర్శనం నిజమైన ఆశ్చర్యంతో.

"ఎందాకా వెళతారో చూదామని నేనూ ఆటే చూస్తున్నాను-లంకంత ఇల్లు మన దుండగా వాళ్ళు వేరే ఇంటికి పోవటమేమిటి? కొత్తకాపరం పెట్టటమేమిటి?" అన్నది దుర్గాంబ, అంత దారుణం తన జన్మలో ఎన్నడూ ఎరగనట్టు.

సుదర్శనం నోరుతెరచి ఏమీ అనటానికి లేదని గ్రహించి, మూసేశాడు...

శాస్త్రి ఆ దంపతు లిద్దరికేసీ అయోమయంగా చూశాడు.

"వాళ్ళు వేరే ఇంటికి పోవద్దంటావా?" అని సుదర్శనం అడిగాడు భార్యను. ఆవిడ ఆ విషయం కాగితంమీద రాసి వేలిముద్ర వేసినా, ఆయనకు నమ్మకం చిక్కేట్టు లేదు.

"ఏమీ అక్కర్లేదు! ఎవరన్నా వింటే నవ్విపోతారు!" అన్నది నాటకం ఆఖరు రంగంలో శివుడు ప్రత్యక్షమై అందరి కష్టాలూ గట్టెక్కించినట్టుగా. ఆవిడ దేవతల పుష్పవృష్టికోసం ఎదురుచూస్తున్న దానల్లే సుదర్శనం కళ్ళకు కనిపించింది కూడాను.

"ఎవరన్నా నవ్విపోతారు" అనే సెంటిమెంటు ఆవిడకు ఇటీవలనే ఏర్పడిం దని ఆయన ఊహించుకున్నాడు. ఎందుకంటే, ఆయన తెలిసినంతవరకు భానూ వాళ్ళను సాధ్యమైనంత శీఘ్రంగా ఇంట్లోనుంచి బయటకి గెంటటమనే ఆలోచన పూర్తిగా దుర్గాంబదే. భానును కాదుగదా, తనకు చూస్తేనేరోత అయిన మనిషిని కూడా ఇంట్లోనుంచి బలవంతాన బయటికి పంపించటం సుదర్శనానికి తట్టే ఆలోచనకాదు. ఆయన మనస్తత్వానికి అది విరుద్ధం.

"అయినా రేపటిదాకా టైము తీసుకుని బాగా ఆలోచించి చెప్పు. తొందరేం లేదు" అన్నాడు సుదర్శనం.

ఆ మాట సుదర్శనం పెళ్ళాన్ని అవమానించటానికే అన్నాడు. పైగా శాస్త్రి వింటుండగా అన్నాడేమో. దుర్గాంబ పోట్లాడి ఉండవలసిందే కాని ఈ క్షణంలో తను భర్తతో పోట్లాట పెట్టుకోవటం ఎటు లాగినా లాగవచ్చునని ఆవిడకు భయం వేసి సౌజన్యం అవలంబించింది.

"బాగా ఆలోచిచ్చే చెప్పాలెండి. ఇంకో ఇంటికి పోవటమేమిటి మనం పరాయి వాళ్ళమైనట్టు?"

ఈ పాటికి దుర్గాంబ మనస్సులో ఇదంతా తన భర్త జిత్తులమారి తనమేననీ, భానుతో యధేచ్ఛగా పూరేగటానికే ఆయన వాళ్ళను వేరే తీసుకుపోతున్నాడనీ రూఢి అయిపోయింది.

ఆ సాయంకాలం ఆవిడ భానునూ, పద్మనూ, శాస్త్రినీ కూడా జడ్జీగారింటికి బయలుదేరదీసింది. ఇప్పటికే చాలా రోజులయింది. ఇక వెళ్ళకపోతే బాగోదు.

దుర్గాంబ జడ్జీగారింటికి టెలిఫోన్ చేస్తే అయిదు నిమిషాల్లో సుందరమ్మగారు టెలిఫోన్ దగ్గరికి వచ్చింది. సాయంకాలం వస్తున్నామని చెబితే ఆవిడ "రండీ! దానికేం?" అన్నది. ఎందుకోగాని ఆవిడ గొంతు దుర్గాంబకు నచ్చలేదు. తన ఆహ్వానంపైనే వాళ్ళు వస్తామంటున్నారన్న సంగతి సుందరమ్మగారు పూర్తిగా మరచి పోయిన దానిలాగానూ, రావద్దనలేక రమ్మంటున్నదానల్లేనూ వినిపించింది.

ఒక నిమిషంసేపు ఏమనటానికి తోచక దుర్గాంబగారు, "అదేనండి - ఆ మాట చెప్పటానికే—" అన్నది.

"ఉంటా!" అంటూ సుందరమ్మగారు టెలిఫోన్ పెట్టేసింది. దుర్గాంబ మండిపడుతూ టెలిఫోన్ రిసీవరును పగలగొట్టేటంత గట్టిగా పెట్టేసింది. ఇటు వంటి ప్రవర్తన ఆవిడ అసలు సహించలేదు. గొప్పవాళ్ళనుకునేవాళ్ళు తనపట్ల మభావం వహిస్తే ఆవిడకు అది తీరని తలవంపుగా ఉంటుంది. ఈ జడ్జీగారి పెళ్ళాం (భార్యకాదు!) తనతో ఎట్లా మాట్లాడినది ప్రపంచమంతా విన్నట్లూ అందరూ తనను చూసి ముసిముసినవ్వులు నవ్వుకుంటున్నట్టూ ఆవిడ బాధ పడింది. జడ్జీ అయితే ఎవడి కెక్కువ? ఆయన జీతమెంత? తమ కంపెనీ గుమా స్తాలకందరికీ ఇచ్చే నెలజీతాలంతలేదు! హుఁ!

"సాయంకాలం వెళ్ళకుండా ఉండేసరికి! రోగం కుదురుతుంది!" అను కున్నది దుర్గాంబ. వెళ్ళగూడదని తీర్మానంకూడా చేసినాక తాను ముందేఇంటెల్లి పాదికి వెళుతున్నామని చెప్పినట్టు జ్ఞాపకం వచ్చింది.

సుందరమ్మగారు టెలిఫోనుమీద అవమానించటంతో పోనివ్వక దుర్గాంబ వచ్చినాకకూడ అవమానించింది. వాళ్ళు వెళ్ళి డ్రాయింగ్ రూములో కూచున్న పావుగంటకుగాని రాలేదు.

ఎవరో పనిచేసేది కనిపించేసరికి దుర్గాంబ కసికొద్దీ, "మీ అమ్మగారు పని మీద ఉంటే మేం పోతాం. ఇంకోసారి వస్తాం." అన్నది.

"చెబుతాను కూచోండి!" అంటూ పనిచేసేది వెళ్ళిపోయింది. తరవాత సుందరమ్మగారు వచ్చింది. చాలా ఆప్యాయంగా పలకరించింది. సోఫాలో కూచుని ఒకపక్క భానునూ, ఇంకోపక్క పద్మనూ కూచోబెట్టుకున్నది. శాస్త్రిని అప్పుడే ఆవిడ చూడడం.

ఆవిడ ప్రవర్తన గురించి ఏమనుకోవాలో దుర్గాంబకు తట్టలేదు. సుంద రమ్మగారికి మొహాలే తప్ప సామాన్యంగా పేర్లు - తరచు కలుసుకోని వారిని- జ్ఞాపకం ఉండవని దుర్గాంబకు తట్టనే లేదు. టెలిఫోను మీదా, ఇంటికి వచ్చి నప్పుడూ కూడా దుర్గాంబ తనపేరే ఆవిడకి తెలియజేసింది.

సుందరమ్మగారు ఎక్కువసేపు భానుతో పాతకబుర్లే చెప్పింది. శాస్త్రిని గురించి తెలుసుకున్నది.

"వాడి కెన్నేళ్ళూ? అప్పుడే చదువు చాలించడ మేమిటి? బియ్యేదాకా నిక్షేపంగా చదువుకోకా?" అన్నదావిడ.

దుర్గాంబ వెళ్ళుతామని లేస్తే ఆవిడ ఒప్పుకోలేదు. భోంచేసిగాని కదల టానికి వీల్లేదన్నది. అసలు భానువాళ్ళు తమ ఇంట్లో కొంతకాలం ఉండితీరాలని కూడా పట్టుబట్టింది.

# 8

సుదర్శనంగారికి చదువులో నమ్మకం లేకపోవటమేగాక, అపనమ్మకం కూడా ఉన్నది. తాను చదువులేకుండానే బాగుపడ్డాడు. ఎన్నో వందలమంది పెద్దచదువులు చదివినవాళ్ళు పొట్టలు చేతపట్టుకుని తన వద్దకు వచ్చారు. పట్టభద్రుల నిరుద్యోగ సమస్య ఆయన కళ్ళారా చూస్తూనే ఉన్నాడు. డాక్టర్లూ, ప్లీడర్లూ, ఇంజనీర్లూ పెద్ద చదువులు చదవాలన్నది నిజమేకాని, వాళ్ళు సాధించేదేమిటి? ఏ కొద్దిమంది అదృష్టవంతులో తప్పిస్తే, వాళ్ళుకూడా తనవంటి వాళ్ళను ఆశ్రయించి బతకవలసిందే. వాళ్ళలో ఎంతోమంది సొంతాన బతకలేక, ఉద్యోగాలకోసం తిరుగుతున్నారు. నలుగురికి ఉద్యోగాలు ఇవ్వగలవాడికే సంఘంలో అగ్రస్థానమని ఆయన ఏనాడో నిర్ణయించుకున్నాడు. వర్తకుడుగా తాను అగ్రశ్రేణిలో ఉన్నట్టు భావించుకున్నాడు. పరిశ్రమలను గురించి ఆయనకు అంతగా తెలియదు. పరిశ్రమలున్న మాట నిజమే కాని, వాటిని కూడా వర్తకులే బతికిస్తున్నారు. ఉత్పత్తిదారులు వర్తకులకు తీసికట్టేనని ఆయన నమ్మకం, ఆయన అనుభవం కూడా అదే. దేశసంపద దృష్ట్యా తనకన్న బీడీ పరిశ్రమ వాళ్ళుకూడా సంఘానికి ఎక్కువ సేవ చేస్తున్నారన్నది ఆయనకు తట్టలేదు. అసలాయన దేశాన్ని గురించి అంత విశాలంగా ఏనాడూ ఆలోచించలేదు. దేశంలో నడిచిన వివిధ జాతీయోద్యమాలలో ఏ ఒకటీ ఆయనను కొంచెమైనా ఆకర్షించలేదు— 1937 లో కాంగ్రెసు శాసనసభల ఎన్నికలకు నిలబడటం ఆయన జీవితంలో మొదటి ముఖ్యమైన రాజకీయ సంఘటన; ఆ సందర్భంలో ఆయన కాంగ్రెసులో చేరి తనకు తోచిన ఆర్థిక సహాయంకూడా చేశారు.

అసలు రహస్య మేమంటే ఆయన ప్రభుత్వం అనేదాన్ని ఒక దుష్టశక్తిగా ఏనాడూ భావించలేదు. తన పురోభివృద్ధికి పరపరిపాలన అడ్డం తగిలేటంత ఎత్తుకు అయన పెరగకపోవటమే ఇందుకు కారణం. కాంగ్రెసుపార్టీ ఎన్నికలకు నిలబడడానికి ప్రభుత్వం అనుమతించిందని తెలియగానే కాంగ్రెసువారు అచ్చగా ఖద్దరు బట్టలతో జైళ్ళకు పోయేవాళ్ళుకారని ఆయనకు నమ్మకం కుదిరింది. ఇదే ఆంధ్రరాష్ట్రోందోళన సమస్య వచ్చేసరికి అది ప్రభుత్వ వ్యతిరేకోద్యమంగా కనపడి ఆయన అంతగా పట్టించుకోలేదు.

రామదాసు కూడా కాలేజి చదువుకు పోలేదు. రోజూ ఆఫీసుకు వెళ్ళుతూ ఉండేవాడు. సుదర్శనం సొంత ఆఫీసు గది మాత్రమే ఇంట్లో వున్నది. రోజూ ఉదయమూ సాయంకాలమూ అసలు ఆఫీసునుంచి మేనేజరూ, ఎకౌంటెంటూ ఇంటికివచ్చి ఆయనకు విషయాలన్నీ చెబుతారు. సుదర్శనం ఎప్పుడోగాని ఆఫీసుకు వెళ్ళేవాడు కాడు. తాను రోజూవెళ్ళి అక్కడ కూర్చుండే పని స్వర్ణా

జరగదనీ, మేనేజరుపైన మిగిలినవాళ్ళకు తగినంత గురి ఉండదనీ ఆయన నమ్మిక.

రామదాసు నమ్మకం పూర్తిగా దీనికి విరుద్ధం. అతను ఆఫీసుకు ప్రతి రోజూ వెళ్ళి ఒంటిగంటదాకా ఉండేవాడు. అందరిపనులూ చెడగొట్టేవాడు. అందరినీ దొంగలల్లే చూసి తాను పోలీసల్లే ప్రవర్తించేవాడు. పదిహేనేసి ఏళ్ళనుంచీ పని చేస్తున్న వాళ్ళకు తాను పనినేర్ప యత్నించేవాడు. అతను వెళ్ళిపోయేసరికి ఒక్కొక్కసారి ఒకటిన్నరా, ఒకటీముప్పావు కూడా అయేది. అంతదాకా అందరూ టిఫిన్లు తినకుండా కూచోవలసి వచ్చేది.

ఆఫీసులో ఒకరిద్దరు అతని సదభిప్రాయం సంపాదించడానికి కాకాపట్టిన వారున్నారు. "అసలు ఖామందువచ్చి స్వయంగా చూసుకున్న దారి వేరు, పని చకచక్కన జరిగిపోతుంది. ఇప్పుడు చూడండి తారు బండిలాగా ఆఫీసు ఎట్లా సాగిపోతున్నదో?" అన్నాడొక యోగ్యుడు.

"కుర్చీలో చేరగిలబడి నిద్రపోయే అలవాటున్న వాళ్ళకే కాస్త ఇబ్బంది" అన్నాడు ఇంకొక యోగ్యుడు.

రామదాసుకు ఈ మాటలు విని తమపై సదభిప్రాయం ఏర్పడుతుందనుకోవడంలో వాళ్ళు చాలా పొరబడ్డారు. రామదాసుకు ఎవరిపైనా సదభిప్రాయమనేది లేదు. అతను సాక్షాత్తు పరమాత్మస్వరూపం - ఒంటరిగాడు. "నైనం ఛిందంతి శస్త్రాణి" అన్నట్లుగా తిట్లూదీవెనలూ, పురస్కార తిరస్కారాలూ మొదలైనవి అతన్ని అంటవు. అతను కారణజన్ముడు. అవాఙ్మానస గోచరమైన ఒక ప్రాకృత శక్తి అతన్ని నడిపిస్తున్నది. ఈ కథకు అంతా క్రియ అతనిదే....

ఇంతకాలమూ వెనక్కు నడుస్తున్న గ్రహాలేవో ముందుకు నడవసాగినట్టుంది. భాను ఇంటిపని ప్రారంభమై చురుకుగా సాగింది. పేరుకు అది భాను ఇల్లేగాని ఖర్చంతా సుదర్శనందే. ఇంటికి కావలసిన కలప అంతా అడితీ నుంచి వెళ్ళింది. ఇటుకలూ, సిమెంటూ, ఇనుమూ మొదలైనవన్నీ కంపెనీ తరఫునే కొన్నారు.

ఇల్లు అదే పెద్దది కాదుగాని రెండంతస్తులది. ముందు చిన్న వరండా, దాని ప్రక్కన ఒక గదీ, ఆ గది వెనక మెట్లగదీ. దాని నానుకుని వరండా వెనకగా చిన్న డ్రాయింగ్ రూమూ, మెట్లగదికి వెనకగా సామాన్ల గదీ, దానినానుకొని రెండోపక్క వంటగదీ, ఇంకా వెనకగా ఒక పక్క స్నానాలగదీ, రెండోపక్క దొడ్డీ, రెంటికి మధ్యగా ఓపెన్ కోర్టుయార్డ్, మేడమీద మెట్లగదీ, పెద్ద హాలూ, హాలుపక్క రెండు పడకగదులూ, వాటివెనక ఓపెన్ టెరేస్, పిట్టగోడా వున్నాయ్. ఇల్లు దాదాపు పదివేలయ్యింది.

దుర్గాంబకు ఈ ఇల్లు ఏర్పడడం ఏ విధంగాను బాగాలేదు. భాను అత్తవారింటినుంచి వచ్చి, ఏకంగా తన ఇంట దిగినప్పటినుంచీ ఆమె ఆవిడ దృష్టిలో "దిక్కులేని పక్షి"గానే ఉంటూ వచ్చింది. జడ్జీగారి భార్య భానుకు ఒక విధమైన అంగబలంగా కనిపించిన మాట నిజమేగాని, ఈ ఇల్లునుబట్టి భానుకు అర్థబలం వున్నదని రుజువయింది. ఎక్కడ నుంచి వచ్చిందీడబ్బు. ఇల్లు పది వేలయిందన్నారు. స్థలాన్ని రెండు వేలకు రిజిష్టరు చేసిన సంగతి దుర్గాంబ ఎరుగును. ఇంటికి ఖర్చయిన పదివేలూ తన భర్త ఇచ్చుకున్నాడని ఆవిడకు కలలో కూడా తట్టివుండదు. ఎవరో దిక్కులేని ఆడదానికి తన భర్త సహాయపడి ఇల్లు కట్టించడమే దుర్గాంబకు ఎబ్బెట్టుగా ఉన్నది.

దుర్గాంబ భానును అడిగి చూసింది. "నాకూ, పిల్లకూ ఖర్చుకింద మా అత్తగారు డబ్బిచ్చారు. దాన్ని స్థిరాస్థి రూపంలో ఉంచుకుంటే పడి వుంటుందని మామయ్యగారు చెప్పిన ఆలోచన నాకూ నచ్చింది. పైన మేముండి కింద అద్దెకిచ్చినా ఓ నలభై రూపాయలు రాకపోవు. జూన్‌లో శాస్త్రి కాలేజీలో చేరతానంటున్నాడు. వాడికొక ఏడాది చదువు చెడిపోయింది. ఇప్పటికే పద్మకూడా చదువూ సంధ్యా లేకుండా బడితెకిమల్లే తయారవుతున్నది" అన్నది భాను.

దుర్గాంబ నమ్మింది. భాను డబ్బంతా బ్యాంకులో తియ్యకుండా అట్లాగే ఉందని ఆవిడకు తెలీదు.

అందుచేత ఒక సాయంకాలం రామదాసు తండ్రితో "ఆ కలప మాటేమిటి?" అని అడగడమూ, "నా ఎకౌంటులో ఖర్చురాయమన్నానే!" అని తండ్రి అనడమూ, "ఎందుకూ?" అని దాసు అడగడమూ, తండ్రి గ్రుడ్లురిమి, "నేను రాయమన్నాను గనకా?" అనడమూ విని దుర్గాంబ ఆశ్చర్యపోయినది. కాని ఆ సంభాషణ దేన్ని గురించో ఆవిడకు వివరంగా తెలియలేదు.

ఆ మర్నాడే గృహప్రవేశం. పీటలపైన సుదర్శనమూ, దుర్గాంబా కూచున్నారు. సుదర్శనం గారి ఇంటి అక్కరలకు వచ్చే గొప్ప గొప్ప వాళ్ళంతా దీనికీ వచ్చారు. శాస్త్రి వెళ్ళి మేనమామ ఇంటినుంచి తల్లిని తెచ్చాడు. ఆవిడ ఆరోగ్యం అంత బాగలేదు. కార్తీకస్నానాలో, పాడో చేసి కీళ్ళ నొప్పులు తెచ్చుకున్నది.

ఇంకేలోటూ లేకపోయినా, దగ్గరవాళ్ళకోసం వాచిపోయిన సుందరమ్మగారు ఆవిడతో గంటల తరబడి బాతాఖానీ వేసుకుని కూచుంది.

భాను తల్లికి ఇల్లు నచ్చింది. "ఈ ఇల్లు బాగుందర్రా" అని ఆవిడ చాలాసార్లు అన్నది. ప్రపంచం మిథ్య అన్న వేదాంతం తలకెక్కని మనిషి కావడం చేత ఆవిడకు "సొత్తులో" చాలా నమ్మకం ఉన్నది. "ఈ దొడ్డంతా మనదే? నిండా కూరలు పెట్టేస్తాను. ఒసే భానూ, మామయ్యగారి దొడ్లో ఎంతేసి

పొట్లకాయలనుకున్నావ్ ? కాకరపాదో ? పిచ్చిగాసింది; దాయ కేంచేస్తుందే ? పొయ్యి బూడిదంతా దానికే పోశాం ..." అని ఆవిడ పల్లెటూరి గొడవలన్నీ చెప్పుకు పోయింది.

శాస్త్రికి కూడా ఉత్సాహం వచ్చింది. "చూడమ్మా, నువ్వు కూరలు పెట్టు, నేను క్రోటన్లు పెడతా. ఎటువంటి క్రోటన్లున్నయ్యనుకున్నావ్?" అన్నాడు ఉత్సాహంతో.

భాను పైకేమీ అనలేదుకాని అవకాశం దొరికినప్పుడల్లా ఆమె ఇంటికేసి చూసుకుంటూండడం సుదర్శనం గమనిస్తూనే వున్నాడు.

ఇక పద్మ తన యీడువాళ్ళందర్నీ చేర్చి మెట్లెక్కా, మెట్లు దిగా—పెద్ద సంబరంలో ఉన్నది.

సుదర్శనం తాను ఇంకో మంచి పని చేశాననుకున్నాడు. భానూ, ఆమె తల్లీ, తమ్ముడూ, కూతురూ-వీళ్ళ జీవితాన్ని ఒక మెట్టు పైకి తొయ్యడానికి తాను తోడ్పడ్డాడు. ఒకప్పుడు తాను సొంతానికి ఇల్లు కట్టుకున్నాడు-కాదు; తన భార్య పేర కట్టాడు. ఇంతకంటె చాలా పెద్ద ఇల్లు, ఖరీదైనది రూడాను. కాని తనభార్య ఆ ఇల్లు చూసి ఆనందించలేదు. కలలుకనలేదు. అడుగడుగునా ఆక్షేపించింది. పునాదులు తవ్వినప్పుడు వచ్చిచూసి, "ఇవి గదులా, ఎలుక బోనులా" అని అడిగింది. తర్వాత ఇంతంత పెద్దగదులేమిటీ? ఇంతకన్న మొదట వున్నట్టు చిన్నవిగా ఉంటేనే బాగుండేదే ! అన్నది. అవే గదులనీ, మార్పేమీ లేదని సుదర్శనం చెబితే, చాల్లే ఊరుకోమన్నది.. అందరూ ఇల్లు చాలా బాగున్నదన్న మీదట దుర్గాంబ ఎట్లా నిక్కి, నీలుక్కుపోయిందీ సుదర్శనం జన్మలో మరువలేడు.

మధ్యాన్నం అందరూ భోజనాలు చేసి సొమ్మసిల్లి నడుములు వాల్చినవేళ సుదర్శనం భానూను "ఇంతకూ ఇల్లు ఎట్లా ఉందంటావు?" అని అడిగాడు.

"ఎవరు కట్టించారు?" అని భాను ఎదురు ప్రశ్నించింది.

# 9

తరువాత ఒక నెలకు బళ్ళు తెరిచారు. పద్మ బడిలో చేరింది. శాస్త్రి ఇంజనీరింగు డిప్లోమాకోర్సు చదువుతా నన్నాడు. సుదర్శనం సరేనన్నాడు.

సుదర్శనం వారానికి రెండు మూడు సార్లు వచ్చేవాడు—పిల్లలిద్దరూ ఇంట్లో లేనప్పుడు ఆయన రాగానే భాను ఆయనను మేడమీదికి తీసుకుపొయ్యేది.

చూసి చూసి తల్లి భానుతో "ఈయన ఎప్పుడూ వస్తాడేమే!" అన్నది.

"అవునమ్మా, మా వ్యవహారాలు ఆయన చూడకపోతే మాగతి యీ పాటికి ఏమై ఉండునో!" అన్నది భాను.

"వచ్చినవాడు నిన్ను పైకి తీసుకుపోయి మాటాడతాడేం? రహస్యాలా" అని తల్లి అమాయకంగా అడిగింది.

భాను నవ్వు ఆపుకుని "అవును రహస్యమే!" అన్నది.

"అట్లా వస్తూ పోతుంటే నలుగురూ ఏమన్నా అనుకోరూ?" అని తల్లి అట్టే అమాయకత్వం లేకుండానే అడిగింది.

భాను కొంచెం ఆలోచించి, "మేం పెళ్ళి చేసుకోబోతున్నాంలే!" అన్నది.

తల్లి ముక్కుమీద వేలేసుకుని స్తంభించిపోయి, "అదేమిటే?....పిల్ల తల్లివి కూడానూ...." అన్నది.

"చేసుకోవచ్చునమ్మా! చట్టం ఒప్పుతుంది. ఆయనకు లేని అభ్యంతరం ఇంకొకరి కెందుకూ?" అన్నది భాను చిరాకుగా.

"అన్నీ వట్టిది! పెళ్ళీ లేదు; పెటాకులూ లేదు. నిన్ను నట్టేట ముంచుతాడు! చూస్తూండు!" అన్నది తల్లి.

"ముంచదలిచినవాడు ఇంత ఇల్లు కట్టించి పెడతాడూ?" అన్నది భాను.

"మా తాత అగ్రహారీకుడేవ్! ముండ నుంచుకుని మూడంతస్తుల మేడ కట్టించిపెట్టాడు! ఇంతమాత్రానికే పెళ్ళి చేసుకుంటా డనుకోను. చేసుకుంటే మాత్రం అదేం పెళ్ళి?... ఈ సంగతి ఆ దుర్గాంబకు తెలుసూ? మహా ఎక్కువగా మాట్లాడుతుందే, నిన్ను తన మొగుడు పబ్లీగ్గా వుంచుకుంటే ఒప్పుకున్నదీ? పీటల మీదకూడా కూచుందే?" అన్నది తల్లి. నిజాన్ని మనసులో తడివిచూస్తూ.

"ఆ విషయాలన్నీ నాకు తెలీవు!" అన్నది భాను.

"నీకేమి తెలీదు. అందుకే నువు గోతిలో పడుతున్నావు."

"గోతిలోపడి పైకి వచ్చాను. మళ్ళీ పడితే. ఈ మధ్యలో దక్కిన సుఖమే దక్కుడూ!" అని భాను వేదాంతం చెప్పింది.

నిజానికి ఆమెకిప్పుడు జీవితంలో లభించే ప్రేమానందం ఆడవాళ్ళకు ఎక్కడో, ఎప్పుడోగాని దొరకదు. సుదర్శనం అసలు ఎటువంటి మనిషో ఆమెకు తెలీదు. తెలుసుకోవాలనికూడా ఆమెకు లేదు. కాని ఆమెపట్ల ఆయన ఆదర్శవ్యక్తి మాదిరిగా ప్రవర్తిస్తున్నాడు. ఆయనలో ఆమెకు ఏమీ కపటం కనిపించలేదు. అంతకంటే చిత్రమేమిటంటే స్వార్థంకూడా కనిపించలేదు. కామసంతృప్తి గూర్చి స్వార్థం ఉండదు—దాన్నికూడా ఆయన తానై తీసుకుంటున్నట్టు కనబడలేదు. తానిచ్చే సుఖం ఆయన తీసుకుంటున్నాడు. ఆయన ఇచ్చే సుఖం తాను పొందుతున్నది. ఎప్పుడు మాటల సందర్భంలో ఆయన "భానూ, నీ దగ్గరనుంచి అవతలికి వెళ్ళగానే నా బతుకంతా పచ్చి అబద్ధమనిపిస్తుంది. అదన్నా భ్రమకావాలి. ఇదన్నా భ్రమకావాలి!" అన్నాడు. భాను ఆయన మాటలు నమ్మింది.

భాను తన యింటిని చూసి మురవకపోలేదు. తనకున్న ఆర్థిక స్తోమత తోడా ఆమెకొకవంక ధైర్యము, తృప్తి ఇచ్చింది. కాని ఈ రకమైన ఆనందాలన్నీ తన ప్రేమతో ముడిపడి వున్నై. ఏ కారణం చేతనైనా ఈ ప్రేమ తెగిపోయ్యే పక్షంలో ఆమెకు ఈ ఇల్లూ, డబ్బూ మట్టితో సమానమవుతా యనిపించింది.

అయినప్పటికీ తన స్వర్గం ఎటువంటి అగ్నిపర్వత ముఖాన ఏర్పాటయి ఉన్నదో భాను ఎరగదు. ఎరిగివుంటే తల్లి చెప్పిన మీదట ఆమె మాటవరసకన్నా సుదర్శనంతో తమ కిద్దరికి పెళ్ళి లాంఛనప్రాయంగా జరగడం గురించి మాట్లాడి ఉండేదే. కాని ఆ మాట అన్న తరువాత ఆమె మనస్సు కుంగిపోయి ఉండేది. తనను పెళ్ళాడమని సుదర్శనాన్ని అడగటం తమ ప్రేమకు అత్యాచారమే. తన భద్రత కోసం తనకూ, సుదర్శనానికీ ఉండే సంబంధాన్ని ధ్వంసం చేసేకన్నా వీధులవెంట అడుక్కు తినటం చాలా మేలు! ఇట్లా అనుకోవటంలో భాను స్త్రీ సహజమైన స్వభావాన్ని ప్రదర్శించలేదు. అయితే చాలామంది స్త్రీలు తమ జీవితాలను ప్రేమరథమెక్కించారు. వాళ్ళు భానుకంటే చాలా తెలివిగలవాళ్ళు.

ఒకనాడు సుందరమ్మగారు వస్తే భానుతల్లి తన కూతురు "తెలివితక్కువ" గురించి ఆవిడతో చెప్పింది. సుదర్శనం భానును పెళ్ళాడదలిస్తే వెనకాడతాడని సుందరమ్మగారు పొరపాటున కూడా అనుకోలేదు. కొంచెం ఆలోచించిన మీదట సుదర్శనం ఆ వరడునక్క ఆవిడ పేరేమిటో - ఆవిడకికన్న భానుకు మంచి జంటగా వుంటాడని సుందరమ్మ గారికి తోచింది. సుదర్శనానికీ, భానుకూ పెళ్ళి కాబోతున్నదని ఆవిడ చాలా మందితో చెప్పేసింది.

ఆ మాట దశదిశల నుంచీ వచ్చి దుర్గాంబకు చేరింది. ఆవిడకు హిస్టీరియా వచ్చినంతపని అయింది. మళ్ళీ ఇంట్లోనుంచి శవం వెళ్ళిన ఎఫెక్ట్ తెప్పించింది దుర్గాంబ.

తాను భానును పెళ్ళాడే ప్రయత్నంలో లేనట్లు సుదర్శనం చెప్పాడు. అయితే ఆత్మగౌరవం కాపాడుకునేటందుకు. "కాని నువ్వు చెప్పిన తరవాత అది గూడా మంచి ఐడియాగానే కనపడుతున్నది. భాను ఒప్పుకుంటే" అన్నాడు.

ఈ మంత్రాలు దుర్గాంబమీద పారలేదు. భానుతో సంబంధం వున్నదా లేదా అని నిలవదీసి అడిగింది.

సుదర్శనానికి మండిపోయింది. తనబోటి దక్షుడు ఇంకో పెళ్ళాన్ని చేసుకోదలచుకుంటే, ఇల్లు అలగా కొంప కానా? చాతనయినవాళ్ళు ముగ్గురు పెళ్ళాలను కూడా చేసుకున్నారు. వాళ్ళ పెళ్ళాలు హిస్టీరియా వచ్చి అరుస్తున్నారా? దిష్టిబొమ్మలాటి పెళ్ళాన్ని చేసుకుని ఏడేళ్ళుగా ఆమెతో కాపరం చెయ్యకుండా, నామమాత్రపు భర్తృత్వం ఆపాదిస్తున్నవాడు తాను ప్రేమించిన దాన్ని పెళ్ళాడ రాదా?

"భానుతో నాకు సంబంధం ఉంటే నీ కేమిటి? లేకపోతే నీ కేమిటి? నేను రాముడల్లే ఏకపత్నీ వ్రతుణ్ని కాను, నీకూ తెలుసు. ఎందుకిప్పుడు అఘాయిత్యానికి దిగావు? కాస్త ఆత్మగౌరవం కాపాడుకో?" అని సుదర్శనం, భార్యకు సలహా ఇచ్చాడు.

"మీ ఎంగిలి కూళ్ళు నేను పట్టించుకోదలచలేదు. ఎవతెనో పెళ్ళి చేసుకుని, నాతో సమంగా పెళ్ళామని చెప్పుకోవడానికి మీ కెవరధికార మిచ్చారు?" అని దుర్గాంబ అడిగింది.

"నేనే పుచ్చుకుంటాను. నన్నడిగేదెవరు?" అన్నాడు సుదర్శనం. ఈ ఘర్షణ మొదట్లో ఆయనకు అసహ్యం కలిగించినా, ఏదో ఒక విధంగా ఈ సమస్య పరిష్కారం కావడమే మేలనిపించింది.

"నేనే అడుగుతాను—మీ రెండో పెళ్ళాన్ని ఏం పెట్టి పోషిస్తారు? లేక ఆవిడే మిమ్మల్ని పోషిస్తుందా? పోషించగలదేమో కూడానూ! మిమ్మల్ని పట్టుకున్నట్టే, ఎంత మందినైనా పట్టుకోవచ్చు!" అన్నది దుర్గాంబ విషం కక్కుతూ.

ఆమె గొంతు పిసకాలన్న ఆవేశాన్ని బలవంతాన అణచుకుని ఆయన "నేను తిండికి గతిలేనివాణ్ణా?" అని అడిగాడు.

"నన్ను పెళ్ళి చేసుకునే నాటికి—అవును!"

"నేను సంపాదించినదంతా నీదేనంటావా ఏమిటి? నీ ఆస్తి మూడింతలు చేశానే!"

"ఏ అంకమ్మ ఐనా చేసేదే. అందుకుగాను ఇన్నాళ్ళూ అందలా లెక్కి తిరగలా!..."

సుదర్శనానికి అకస్మాత్తుగా తన పరిస్థితి జ్ఞాపకం వచ్చింది. ఇల్లు భార్య పేర వున్నది. నాలుగు కంపెనీల వాటాలూ ఆవిడ పేరా, పిల్లల పేరా ఉన్నాయి. తాను మాత్రం నాలుగు కంపెనీలనుంచీ జీతాలు తీసుకుంటున్నాడు. ఇది భార్య కోరిక పైన చేసిన పనికాదు. అత్తగారూ, భార్యా చేసిన మేలుకు కృతజ్ఞతతో చేసినది. అత్తగారు పోయినాక, ఆవిడ వాటాలు భార్యకు సంక్రమించినై.

తన భార్య కావలిస్తే తన ఉద్యోగం తీసివేయించగల స్థితిలో ఉన్నదని ఆయన తెలుసుకున్నాడు. అందువల్ల వ్యాపారమంతా మంట గలవవచ్చు కాని, దుర్గాంబ మూర్ఖురాలు. తన పట్టు నెగ్గడం కోసమని సర్వనాశనం చెయ్యగలదు.

"ఇంత రాద్ధాంతం ఎందుకు చేస్తున్నావు? నేను ఆవిణ్ణి పెళ్ళాడతానని చెప్పనే లేదే?" అన్నాడు సుదర్శనం.

"మీరు వేరే చెప్పాలా? లోకమంతా చెప్పుకుంటున్నది. నేను మాత్రం పెళ్ళీ గిళ్ళీ సహించేదాన్ని కాను. తరవాత మీ యిష్టం" అన్నది దుర్గాంబ.

ప్రస్తుతానికి భార్యతో రాజీపడితేనే మంచిదని సుదర్శనం తేల్చుకున్నాడు. రంకు సాగితే పెళ్ళాండుకన్న సామెత ఉండనే ఉన్నది. తనకూ భానుకూ మధ్య ఎంత గాఢమైన సంబంధం ఉన్నా దురాంబ అభ్యంతరం చెప్పబోదు - పెళ్ళి మినహా. అటువంటిది పట్టుపట్టడానికి దుర్గాంబకు కొంత హక్కున్నదని ఆయన అంతరాత్మ కూడా చెబుతున్నది.

'ఇది నాకు దేవుడిచ్చిన శిక్ష. ఒకప్పుడు నా భార్యను ప్రేమించకుండా పెళ్ళి చేసుకున్నాను; అందుకు దేవుడు ప్రేమించినదాన్ని పెళ్ళి చేసుకోవటానికి లేకుండా చేస్తున్నాడు!' అని ఆయన మనస్సును సరిపేసుకున్నాడు.

ఇది జరిగినాక రెండు మూడు రోజులు ఆయన భాను ఇంటికేసి వెళ్ళలేదు. అసలు ఇల్లే కదల్లేదు.

అంతరాత్మకు కొంత అలుసిస్తే అది నెత్తికెక్కి కూచుంటుంది. భానుతో తన భవిష్యత్తు ఎట్లా ఉండబోతుందో ఆయన ఊహించలేక పోయినాడు. ఆమెను పెళ్ళాడబోవడంలేదని భార్యకు మాట ఇచ్చినాక, ఆ సంగతి భానుకు చెప్పకుండా ఆమెను తాకడానికి తనకు అర్హత ఉండదు. పెళ్ళి చేసుకోనిపక్షాన తనను చూడరావద్దనటానికి భానుకు హక్కున్నది. తమ పెళ్ళి విషయం విస్పష్టంగా ఇద్దరి మధ్యా మాటలు జరగకపోయినప్పటికీ.

చివరకు ఆయన భానును చూడబోయినాడు.

"మనిద్దరమూ పెళ్ళాడబోతున్నామని ఊరంతా పొక్కించవట. నేను అదే ఉద్దేశంతో ఉన్నాననుకో. కాని ఇటువంటివి జరిగిపోయినాక ఇతరులకు తెలియాలి కాని, ముందే పొక్కితే ఎవరో ఒకరు అడ్డుపుల్ల వెయ్యరా? నా పెళ్ళానికి తెలిసింది. మా ఇంటికప్పు ఎగిరిపోయిందనుకో!"

ఆయన ఈ మాట అనేసరికి, భాను చిన్నబుచ్చుకుని; "నే నెవరితోనూ ఈ మాటే అనలేదు.....అన్నట్టు మా అమ్మ నన్ను ప్రశ్నలువేసి చంపుతుంటే, ఆవిడ నోరు ముయ్యటానికి, మనం త్వరలో పెళ్ళాడ బోతున్నామని బొంకాను- అంతే!" అన్నది.

పెదవి దాటితే పృథివి దాటుతుంది.

"నేనుకూడ మా ఆవిడ నోరుముయ్యడానికి నాకు నిన్ను పెళ్ళాడే ఉద్దేశం ఏమీలేదని బొంకవలసొచ్చింది!" అన్నాడు సుదర్శనం.

"పోనిస్తురూ—వెధవ పెళ్ళి దీన్నిగురించి ఇంత రాద్ధాంతం చేస్తున్నారేమిటి? పెళ్ళిచేసుకుంటే మనం చేసేపని మంచిదవుతుందని నా కేమీ నమ్మకంలేదు" అన్నది భాను.

ఆ మాటతో సుదర్శనం మనస్సు కాస్త స్థిమితపడింది.

"అన్నట్టు మొన్న మీరు పంపించిన కాగితంమీద సంతకం పెట్టాను. చూసుకున్నారుగా?" అన్నది భాను.

సుదర్శనం ఉలిక్కిపడి "ఏం కాగితం? నేనేమీ పంపించలేదే?" అన్నాడు.

"మీరే పంపించినట్టు చెప్పారే ఆ మనుషులు?"

"ఏ మనుషులు?"

సుదర్శనానికి అంతా అయోమయంగా ఉన్నది.

"ఎవరో ఇద్దరొచ్చారు. ఒకాయన నల్లకోటు వేసుకున్నాడు. రెండో మనిషి గుమాస్తా లాగున్నాడు."

ప్లీడరేమైనా వచ్చి ఉంటాడా అనుకున్నాడు. తనకు తెలియకుండా భానుచేత కాగితంమీద సంతకం పెట్టించి ఉంటారు. ఎందుకు? ఇది ఎవరి పని? దుర్గాంబకూ, దాసుకూ తెలియకుండా ఇది జరగదు.

సుదర్శనం భాను ఇంటినుండి నేరుగా ఆఫీసుకు వెళ్ళాడు.

# 10

అంతకు పూర్వమే రామదాసు తన ఉపయోగార్థం భాను ఇంటికిగాను అయిన ఖర్చు పద్దులన్నీ తీయించి లెక్కవేయించాడు. అంతా కలిసి తొమ్మిదివేల తొమ్మిది వందల ముప్పై ఆరు చిల్లర అయింది. కలపకూడా చేరిస్తే పదివేలు దాటింది. భాను తన ఇంటికింద ఒక్క దమ్మిడీ ఖర్చుచెయ్యలేదు—ఈ సంగతి దాసుకు రూఢిగా తెలిసిపోయింది. కాని ఈ విషయం తనలోనే ఉంచుకున్నాడతను.

తన తండ్రి భానును పెళ్ళాడతాడని తల్లి రచ్చచేసిన మర్నాడు, దాసు తాను కంపెనీ వ్యవహారాలు చూసే ప్లీడరును పిలిచి ప్రోనోటు తయారుచేయించాడు. దాని పైనే భాను సంతకం చేసింది.

ఈ వివరాలు సుదర్శనానికి ఆఫీసులో తెలిసినై.

"ఆ ప్రోనోటు ఏదీ?" అన్నాడు సుదర్శనం.

"అమ్మ ఇంటిదగ్గరే తన సేఫ్‌లో దాచింది. దాంతో ఏం పనీ?" అన్నాడు దాసు.

"ఊరికేనే అడిగాను," అన్నాడు సుదర్శనం. ఇదంతా తన భార్యచేసిన కుట్రే ననుకున్నాడుగాని, నిజానికి ఈ ఎత్తు కేవలం దాసు బుర్రనుంచీ ఊడిపడిందని ఆయన ఊహించలేదు.

"వాళ్ళేం చెయ్యగలరు? ఎప్పటికైనా ఆ ఇల్లు కాజెయ్యగలరు. అంతకంటె ఏమీ చెయ్యలేరు" అనుకున్నాడాయన. అదే జరిగితే భానుసంగతి మళ్ళీ మొదటికి వస్తుంది. తాను చెయ్యలేని పని చెయ్యలేకనే పోయినాడు. చేసిన పని కూడా బూడిదలో పోసిన పన్నీరవుతుందంటే, ఆయనకు చాలా కష్టంవేసింది.

సుదర్శనం ఆఫీసునుంచి బయలుదేరి ఆలోచించటానికి ట్రామెక్కి కూచు న్నాడు. ఆయన ట్రాముల్లోనూ, బస్సుల్లోనూ తిరిగి చాలా ఏళ్ళయింది. తనను అందరూ వింతగా చూస్తున్నారేమోనన్న అనుమానం రెండు, మూడు నిమిషాలలో పోయింది. ఆయన ఆలోచనలో పడ్డాడు. తాను ఏంచేస్తే బాగుంటుంది? తన మెడకు ఏదో ఉచ్చు బిగుస్తున్నదన్న భావాన్ని వదిలించుకోవటానికి ఏదో మార్గం వుండాలి.

భాను ఇల్లు అద్దెకిచ్చి, భానును మరొక చిన్న ఇంట్లో పెట్టి, అద్దెలో మిగులు ఆమె ఎకౌంటులో వేస్తూపోతే? అందరూ భానుని సొంత ఇంట్లో వుండటంలేదేమని అడుగుతారు. అదీగాక, తన భార్య ప్రోనోటుతో కోర్టుకు పోతుంది. ఆ ఎత్తు పారదు - తన జీతం ఐదువందల్లో తన చేతి ఖర్చుకు ఏ పాతికో వుంచుకొని మిగతాది భాను కివ్వవచ్చు. అది ఎట్లాగూ తాను చెయ్యనున్నాడు....సొంతాన ఇంకో వ్యాపారం ఏదన్నా మొదలుపెడితే? ఏం వ్యాపారం? దానివల్ల మనకు ఏం పెరుగుతుంది?

రాత్రి ఇంటికి వస్తూనే ఆయన తన భార్యను, "ఆవిడ దగ్గిర ప్రోనోటు వ్రాయించి తీసుకున్నావుటగా?" అన్నాడు శాంతంగానే.

"డబ్బుబాకీ ఉన్నప్పుడు రాయించి తీసుకోరూ?" అన్నది దుర్గాంబ.

"అవున్లే!" అన్నాడు సుదర్శనం.

ఆ రాత్రి భోజనం చేసి, చాలా ఆలస్యంగా భాను ఇంటికి వెళ్ళాడు. అందరూ నిద్రపోతున్నారు. భానుతో ఆయన జరిగిన సంగతిచెప్పి, "నీ దగ్గిర వున్న సొమ్ము ఇచ్చేసి ప్రోనోటు తీసుకుంటే ఇల్లు నీ దవుతుంది. ఇల్లు కావాలని ఉందా? పోయినప్పుడు పోనివ్వాలని ఉందా? ఇప్పుడే తేల్చుకోవటం మంచిది. తరువాత వడ్డీ పాపం పెరిగినట్టు పెరుగుతుంది. వాళ్ళు ఇంటిని రేపే స్వాధీనం చేసుకోవచ్చు. పదేళ్ళదాకా మాట్లాడక వూరుకోవచ్చు. ఏదో ఆలోచించి ఒక నిర్ణయం చెయ్యి" అన్నాడు.

కాని భాను ఏ నిర్ణయమూ చెయ్యలేకపోయింది. ఆ మాటకువస్తే, ఏది మేలో సుదర్శనం కూడా తేల్చలేక పోయినాడు.

ఎవరూ ఏమి చెయ్యకుండానే రోజులు గడిచినై. భానుకుగాని ఇంటికి గాని ఏ హానీ జరగలేదు. సుదర్శనం అనవసరంగా కంగారు పడ్డాననుకున్నాడు. ఆయన తన జీతంనుంచి భాను కుటుంబంకింద నెలనెల నూరురూపాయలదాకా ఖర్చు పెడుతున్నాడు. తరచు భానూ వాళ్ళింటికి వచ్చి గంటలతరబడి కూచుంటున్నాడు. ఆఫీసునుంచి ఎవరూ తనదగ్గిరికి చీటికీ మాటికి రానవసరం లేదని చెప్పే శాడు.

యుద్ధం వచ్చింది.[1] దాని వెంబడే దేశంలో చెలరేగిన ఆందోళనా, వస్తువుల కొరతా, దొంగమార్కెట్టు వ్యాపారాలూ, శత్రుదాడి భయమూ మనుషులలోనూ, వారి జీవితాలలోనూ పైకి కనబడని మార్పును తెచ్చినై. భేరీల మోత విన్న యుద్ధాశ్వకునివలె సుదర్శనం చైతన్యం పొందాడు. ఆయన భానుచేత రెండువేల రూపాయలకు నవరసులు కొనిపించి, ఇనప్పెట్టెలో దాచి పెట్టించాడు. రెండుసార్లు బొంబాయి వెళ్ళివచ్చాడు. బట్టకూ, ఇతర వస్తువులకూ గిరాకీ పెరుగుతున్నదని తెలిసి వాటినికూడా కొనిచేర్చాడు. బొంబాయిలో ఆయనకు మిత్రుడైన వర్తకులు గుజరాతీ, మార్వాడి వాళ్ళున్నారు. వాళ్ళిప్పుడు పారిశ్రామికులు కాబోతున్నారని సుదర్శనానికి తెలిసింది. పరిశ్రమలంటే ఏమిటో ఇప్పుడే ఆయనకు నిజంగా అర్థమయింది.

చీకటి బజారు వ్యాపారం సాగితే, అంతకంటె కావలసిందేమిటి? సుదర్శనం రెండేళ్ళు తిరక్కుండానే భాను డబ్బును రెట్టింపు చేశాడు. ఇంకా పెంచుతూనే ఉన్నాడు. ఇంతకాలానికి తన వ్యాపారదక్షతా, ముందుచూపూ సద్వినియోగమవుతున్నాయని ఆయనకు అనిపించింది. పూర్వం తన భార్య డబ్బును పెంచినప్పుడు కూడా తనకు ఇటువంటి ఆనందమే కలిగిందన్న విషయం ఆయన మరిచిపోయి నాడు.

యుద్ధం ప్రారంభమైన మూడేళ్ళకు శాస్త్రి డిప్లొమా ఇంజనీరైనాడు. అతనికి బొంబాయిలో ఒక ఫ్యాక్టరీలో రెండువందలమీద సుదర్శనం ఉద్యోగ మిప్పించాడు. శాస్త్రి తానుచేసే ఉద్యోగం తాలూకు ఓనమాలు దగ్గిరనుంచీ ఉద్యోగంలో చేరినాకనే నేర్చుకున్నాడు.

---

1. రెండవ ప్రపంచ యుద్ధం 1931 సెప్టెంబరు 18, 19 తేదీల్లో చైనా మీద జపాన్ యుద్ధం మొదలుపెట్టి మంచూరియాను దురాక్రమించటంతో రెండో ప్రపంచ యుద్ధానికి బీజాలు పడ్డాయి. 1939 సెప్టెంబరు 1వ తేదీ జర్మనీ పోలెండ్‌మీద దాడి చేసింది. 1945 సెప్టెంబరు 2వ తేదీన జపాన్ లొంగిపోయినట్లు సంతకం చేయటంతో యుద్ధం ముగిసింది. 1939-1945 మధ్యకాలంలో జరిగిన ప్రపంచవ్యాప్త యుద్ధాన్నే సాధారణంగా రెండో ప్రపంచ యుద్ధంగా పేర్కొంటూ ఉంటారు. 1939 లో వలస వాద ప్రభుత్వం లక్షా 60 వేల భారత సైనికుల్ని నమోదు చేసుకుంది. అది యుద్ధకాలంలో 20 లక్షలకు పెరిగింది. ఈ యుద్ధ సంస్కృతి కుటుంబరావు సాహిత్యంలో ప్రస్తావితం కావడం అన్ని సంపుటాల్లోనూ చూడవచ్చు.

అతను బొంబాయిలో ఇంకా చాలా విషయాలు తెలుసుకున్నాడు. ఈ దేశంలో ఏ పరిశ్రమనూ ప్రోత్సహించక, భారతీయులకు ఆధునిక, సాంకేతిక ప్రావీణ్యం అసాధ్యమని అన్న పాశ్చాత్యులు, తమకు అవసరం పడేసరికి సమస్త యుద్ధ పరికరాలూ తయారు చేయటానికి భారతీయ పారిశ్రామికులను ప్రోత్సహించి, వస్తు సహాయం కూడా చేశారు. ఈ పారిశ్రామికులలో చాలామంది గాంధీ భక్తులున్నట్టు శాస్త్రికి తెలిసింది.

మద్రాసులో ఉన్నంతకాలమూ శాస్త్రి యుద్ధం గురించిగాని, రాజకీయాలను గురించిగాని పట్టించుకోలేదు. ఈ రెండూ బొంబాయిలో అతనికి పట్టుకున్నై. సోషలిస్టులకూ, కమ్యూనిస్టులకూ వున్న విభేదాలు అతనికి స్పష్టంగా తెలియలేదు గాని, పెట్టుబడిదారీ వ్యవస్థకంటె సామ్యవాద వ్యవస్థ చాలా మంచిదని అతనికి గట్టిగా తోచింది. అతను పెట్టుబడిదార్లను కొందరిని స్వయంగాచూసి, వాళ్ళు లేకపోతే ప్రపంచం నడవదని నమ్మలేకపోయినాడు; ఎన్నో వేలమంది పరిశ్రమలలో తమకు వాటాలున్నంత శ్రద్ధతో పనిచేస్తే పెట్టుబడిదార్లు లక్షలకు లక్షలు లాభాలు తీసి, చెమటోడ్చేవాడు రోజుకూలి బేడ పెంచమంటే ఉగ్రరూపం ధరించటం కూడా అతను కళ్ళారా చూశాడు.

అతను బొంబాయిలో ఉండగానే బెంగాలులో క్షామం వచ్చింది. లక్షోపలక్షల సంఖ్యలో జనం చచ్చారు[1]....యుద్ధసామాగ్రితో డాక్‌లోకి వచ్చిన ఓడ పేలిపోయింది;[2] ఆనాడు అతను గేట్‌వేకు పోదామని కూడా అనుకున్నాడు.... నావికుల తిరుగుబాటుకూడా అతను బొంబాయిలో ఉండగానే జరిగింది[3]....చరిత్ర తన కళ్ళ ఎదటనే జరుగుతున్నదన్న భావం శాస్త్రికి బొంబాయి వెళ్ళినాకనే కలిగింది.

---

1. బెంగాలులో క్షామం 1943-1944 మధ్యకాలంలో కొన్ని లక్షల మందిని పొట్టన పెట్టుకుంది. ధాన్యం కొరత, పోషకాహారలోపం, అంటు వ్యాధులు పైగా దొంగవ్యాపారం కరువురోజుల్లో రాజ్యమేలాయి. బ్రిటిష్ ప్రభుత్వం దిగుమతులకు బదులు ఎగుమతులను ఈ దుర్దినాల్లో ప్రోత్సహించింది. పశుసంపద నాశనమైంది. పేదరైతులు భూమి పోగొట్టుకున్నారు. రెండవ సంపుటంలోని అరుణోదయం నవలలోనూ కరువు రోజులు కథలోనూ వివరాలకు చూడండి.
2. వివరాలు అలభ్యం.
3. నావికుల తిరుగుబాటు 1946 ఫిబ్రవరి 18-23 తేదీల్లో జరిగింది. జాతి వివక్ష పట్లా, పని పరిస్థితుల పట్లా అసంతృప్తి చెందిన రాయల్ భారత నౌకాదళం చేసిన చారిత్రాత్మకమైన తిరుగుబాటు. వివరాలకు మూడవ సంపుటంలోని పంచరత్నాలు కథలో చూడండి.

# 11

అతను తన భావి సహధర్మచారిణినికూడా బొంబాయిలోనే కలుసుకున్నాడు. ఆమె తెలుగువాళ్ళ పిల్ల. పేరు సరస్వతి. శాస్త్రి పనిచేసే ఫ్యాక్టరీలో వాళ్ళ చిన్నాన్న కెమిస్టుగా పనిచేసేవాడు. ఆయన పేరు శర్మ - సచ్చిదానంద శర్మ. ఫ్యాక్టరీకంతకీ యిద్దరే తెలుగువాళ్ళు కావడంచేత, మధ్యాహ్నం విశ్రాంతిలో రోజూ కలుస్తూండేవాళ్ళు. అదీగాక ఫ్యాక్టరీ పనిమీద ఎప్పుడు లాబ్ కు వెళ్ళవలసివచ్చినా, కాస్సేపు శర్మగారితో మాట్లాడి మరీ వచ్చేవాడు.

శాస్త్రి ఎప్పుడు వెళ్ళినా, శర్మగారు ఏదో టెస్ట్ట్యూబు, బర్నరుమీద వెచ్చబెట్టి మధ్య మధ్య గిలకరిస్తూనో లేక టైట్రేషన్ చేస్తూనో వుండేవాడు. ఎప్పుడన్నా శాంపిల్స్ తీసుకోవటానికి కార్ఖానాకు కూడా వచ్చేవాడు.

ఆదివారాలు తరచు శర్మగారింటే గడిపేవాడు శాస్త్రి. శర్మగారి అన్న - ఆయనా శర్మగారే. యజ్ఞేశ్వరశర్మ -రిజర్వుబ్యాంకులో ఉద్యోగి. ఆయనకు నలుగురైదుగురు పిల్లలు. అందరిలోకి సరస్వతి పెద్దది. బుద్ధెరిగినప్పటినుంచీ ఆమె బొంబాయిలోనే పెరిగింది. తెలుగుకన్న మరాఠీ, హిందీ, ఇంగ్లీషూ బాగా వచ్చు. గుజరాతీ కూడా కొంత తెలుసు.

శర్మలిద్దరూ తమ కుటుంబాలతో సహా - చిన్న శర్మగారికి పిల్లలు లేరు- దాదర్ లోని హిందూ కాలనీలో ఒకే ఫ్లాట్ లో ఉంటున్నారు. ఒక ఆదివారం ఉదయం శాస్త్రి వాళ్ళిల్లు వెతుకుంటూ వెళ్ళేసరికి, ఆ యింటి ఆవరణలోనే నలుగురాడపిల్లలు నెట్ కట్టి కొంగులు నడుముకు బిగించి షటిల్ కాక్ ఆడుతున్నారు. నలుగురూ శాస్త్రికి మరాఠీ అమ్మాయిలల్లే కనిపించారు. కానీ వారిలో ఒకతె సరస్వతి. ఆమె అతన్ని చూచి తెలుగువాడని తెలుసుకున్నట్లుంది. ఆట ఆపి కొంచెం యాసగా, "శాస్త్రిగారు కదండీ? మా చిన్నాన్నకోసం వచ్చారు కదూ? ఇలా రండి" అంటూ, రెండో అంతస్తులో ఎడమచేతి భాగంలోకి తీసుకపోయి సిటింగ్ రూములో కూచోబెట్టి, "చిన్నాన్నా! మీ ఫ్రెండ్" అని కేకపెట్టి చకచకా కిందికి దిగి వెళ్ళిపోయింది.

ఎందుకో ఆమెను చూస్తే శాస్త్రికి ముచ్చటయింది. మనిషి సన్నగా ఉన్నా, చిక్కిపోయినట్టుండక నాజూకుగా ఉన్నది. పలచని మొగం. ప్రత్యేకించి అందమైన మొహం కాకపోయినా, ఆహ్లాదం కలిగించే మొహం, కళ్ళు అంత పెద్దవి కావు గాని, కనుబొమ్మలు చక్కగా గీసినట్టున్నై. కొద్దిగా నొక్కుల జుట్టు, జడ నడుము దిగకపోయినా ఒత్తుగా ఉన్నది.

సరస్వతిలో అహంకారం లేని ఆత్మగౌరవమూ, జీవితం గురించి విశాలమైన దృక్పథమూ ఉన్నట్టు శాస్త్రి ఊహించుకున్నాడు. ఆమెతో పద్మనుగాని,

కోమలనుగాని పోల్చడం అతనికి సాధ్యం కాలేదు. వాళ్ళకూ, ఈ పిల్లకూ బావిలో కప్పలకూ, ఆకాశంలో ఎగిరే పక్షికీ ఉన్నంత తేడా ఉంది.

రానురాను శాస్త్రికి సరస్వతితో చాలా చనువైపోయింది. ఇద్దరూ ఏదో ఒక వాదన వేసుకునేవాళ్ళు. ఒక్కోసారి ఆమెను వాగించటానికి శాస్త్రి ఆమె చెప్పినది ఏదో ఒకటి కాదనేవాడు. శాస్త్రి ఆమెను చూసిన క్షణం నుంచీ ప్రేమించాడనే చెప్పాలి. కాని అతను ఏనాడూ ఆమెతో ప్రేమ ప్రసక్తి తీసుకురాలేదు. ప్రేమించుకున్న వాళ్ళు రేషనింగు గురించీ,[1] జిన్నా పాకిస్తాన్ వాదం[2] గురించీ, క్రిప్స్ సూచనలను[3] గురించీ వాదించుకోవడమే స్వాభావికమని అతనికి తోచింది.

ఇంతకూ ఆ అమ్మాయి - అందరిలాగే శాస్త్రి కూడా "సరూ" అని పిలిచేవాడు - తనను ప్రేమిస్తున్నట్లు శాస్త్రికి సాక్ష్యం లేదు. అయితే శాస్త్రిది ఆత్రంలేని ప్రేమ. ఇంకో అయిదేళ్ళకు - లేక పదేళ్ళకు - సరస్వతి ఎవరినన్నా ప్రేమించదలిస్తే, తాను ఎదురుగా తన అర్హతలేవీ చెక్కుచెదరకుండా హాజరులో ఉండటానికి అతను తీర్మానించుకున్నాడు.

సరస్వతి కిప్పుడు పద్దెనిమిదో ఏడు. బి.ఎ. రెండో సంవత్సరం చదువుతున్నది. ఆమె రోజూ బస్సుల్లోనూ, రైళ్ళలోనూ, వీధులవెంటా తనకన్నా ఎంతో స్మార్ట్‌గా కనపడేవాళ్ళనూ, అనేక విధాలుగా ప్రయోజకులనూ చూస్తూవుండాలి. తనను చూసి ఆమె పారవశ్యం చెందవలసిన కారణం ఏమీలేదు. ఏదో ఒక కారణంవల్ల తనకంటె ఎక్కువ అర్హతలు గలవాళ్ళతో పోటీ లేకుండా పోయి, తనను సరస్వతి వరిస్తే తన కేమి అభ్యంతరం లేదు. అతను బొంబాయి వచ్చి ఏడాది కాకమునుపే, అక్కడి యంత్రనాగరికత అతని నరాలన్నిటికీ ఎక్కిపోయింది. తమలో ఏదో విశిష్టత ఉన్నదన్న భ్రమలో పడకుండా భానూ, సుదర్శనమూ ఒకరినొకరు ప్రేమించలేరు. కాని అటువంటి అపోహలు ఏమీ లేకుండానే శాస్త్రి సరస్వతిని మనస్ఫూర్తిగా ప్రేమించేవాడు. ఆదివారాలు కలుసు

---

1. యుద్ధకాలం ఆ తర్వాత పెరిగిన ధాన్యం కొరతా, దొంగ వ్యాపారం మూలంగా వచ్చిపడిన రేషనింగు ప్రస్తావన.

2. మహమ్మద్ ఆలీ జిన్నా (1876-1948) 1940 ప్రాంతాల నుంచి దేశ విభజన అయ్యేంతవరకూ చేసిన ముస్లిం రాజ్యం పాకిస్తాన్ వాదం.

3. స్టాఫర్డ్ క్రిప్స్ బ్రిటిష్ మంత్రివర్గ సభ్యుడు. ఆయన 1942 మార్చిలో చేసిన ప్రతిపాదనలు దేశాన్ని ఖండఖండాలుగా చీలుస్తాయని అప్పట్లో కాంగ్రెసు నిరసించింది. పాకిస్తాన్ నిర్మాణ వాగ్దానం లేదని ముస్లింలీగు నిరాకరించింది. క్రిప్స్ రాయబారం విఫలమైంది.

కోవటం గాక, అప్పుడప్పుడూ అందరూ కలిసి ఏదన్నా సినిమాకు అడ్వాన్సుగా టిక్కెట్లుకొని వెళుతూండేవాళ్ళు.

ఒకనాడు శాస్త్రి మెట్రోకు వెళ్ళేసరికి, తలవని తలంపుగా సరస్వతి ఎవరి కోసమో ఎదురుచూస్తూ బుకింగ్ ఇవతల కనిపించింది. ఏమిటని అడిగితే ఎవరో స్నేహితురాలు వస్తానన్నదట, ఆమెకోసం ఎదురుచూస్తున్నానని చెప్పింది. ఆమె ముందుగానే రెండు టిక్కెట్లూ కొనేసింది కూడాను. శాస్త్రి టిక్కెట్టు కొన బోతుంటే ఆపి, "నా ఫ్రెండ్ ఇంకరాదు. మనం పోదాం లోపలికి, సిక్స్‌థర్టీ కూడా అయిపోయింది. అయ్ కాన్ట్ వెయిట్ ఎనీమోర్!" అంటూ శాస్త్రిని వెంటపెట్టుకొని లోపలికి వెళ్ళింది.

ఆట అయినాక వచ్చేటప్పుడు శాస్త్రి డబ్బివ్వబోతే "థాంక్యూ! ఆల్ ది సేమ్! డోంట్ బి ఫన్నీ" అని అక్షరాలు కలిపి మాట్లాడుతూ కోప్పడింది సరస్వతి.

# 12

ఫిబ్రవరి మాసంలో భానూ, సుదర్శనమూ బొంబాయి వచ్చారు. వాళ్ళిద్దరే వచ్చారు; వెంట మరెవరూ లేరు. భాను మూడోనెల గర్భిణి. వాళ్ళిద్దరికీ పెళ్ళి కూడా జరిగిపోయింది. పెళ్ళికి శాస్త్రి ఒకడేవున్నాడు. అంతా గంటసేపట్లో ముగి సింది. పెళ్ళిపెత్తనం చేసిన గుజరాతీ పెద్దమనిషిని శాస్త్రి ఎరగడు. పెళ్ళి అయి నాక ఆ గుజరాతీ ఆయనా, భానూ, సుదర్శనంగారూ, శాస్త్రీ ఒక కారులో మలబార్ హిల్స్‌పైన వాల్కేశ్వర్‌లో ఒక ఇంటికి వెళ్ళారు. అక్కడే సుదర్శనం గారి బస.

మర్నాడు అక్కడే చిన్నపార్టీ. శాస్త్రి తన వెంట చిన్నశర్మగారినీ, సరస్వతినీ, ఆమె తమ్ముళ్ళిద్దరినీ తీసుకువచ్చాడు. సరస్వతి భానును చూసి పరమా నందభరితురాలైంది. "బట్ షి ఈస్ బ్యూటిఫుల్!" అని ఆమె శాస్త్రితో రెండు సార్లన్నది. శాస్త్రి నవ్వి ఊరుకున్నాడు ..

మొత్తానికి సుదర్శనం పెద్దఫీట్ చేశాడు. ఈ పెళ్ళివార్తలు మద్రాసు పత్రికలకు ఆయన స్వయంగా పంపించాడు. పార్టీ జరిగిన మర్నాడు భానూ, ఆయనా పట్నం తిరిగి వెళ్ళిపోయినారు.

తరువాత శాస్త్రి, శర్మగారింట్లో వాళ్ళకు భానును గురించి సవిస్తరంగా చెప్పాడు. భానుకు పద్నాలుగేళ్ళ కూతురున్నదనీ, సుదర్శనం గారికి పెళ్ళామూ పిల్లలూ ఉన్నారనీ, తన యీడు కొడుకున్నాడనీ తెలిసి, శర్మగారింట్లో ఎవరూ ఆశ్చర్యపడలేదు. సుఖాన్వేషులైన మనుషులు పడేపాట్లన్నీ వాళ్ళకు తెలిసినవే. వ్యక్తిస్వాతంత్ర్యం, సాంఘిక నియమాలను తెంచుకొని ముందుకు పోవడం వారి దృష్టిలో అస్వాభావికం కాదు.

ఏప్రిల్ ఆఖరులో రామదాసుకు పెళ్ళి నిశ్చయించారని, తమ పెళ్ళి గురించి దుర్గాంబా వాళ్ళకు తెలిసిందని, ఆవిడ మనస్సు మారిపోయిందనీ, వాళ్ళంతా

తనను ఆదరంగా చూస్తున్నారనీ భాను రాసింది. రామదాసుకు మాట్లాడిన పిల్ల జమీందార్ల పిల్లట (కమ్మవారిలోనూ, వెలమవారిలోనూ మాత్రమే జమీందార్లుంటారని శాస్త్రి అనుకునేవాడు).[1] పెళ్ళి విశాఖపట్నం దగ్గర భీమ్లిలో జరుగుతుందట. బొంబాయిలో తన మిత్రులందరి ఎడ్రసులూ రాసిపంపిస్తే, ఆహ్వానాలు పంపడానికి వీలుగా ఉంటుందని భాను రాసింది. ఫ్యాక్టరీలో తనతో చనువుగా ఉండే వాళ్ళందరి పేర్లూ, పెద్దశర్మగారి ఎడ్రసూ, ప్రత్యేకించి సరస్వతి పేరూ పంపాడు శాస్త్రి.

పెళ్ళి వారంరోజులుండగా ఆహ్వానాలు వచ్చినై. శలవు అడిగి పదిహేను రోజులపాటు వచ్చెయ్యమని సుదర్శనం రాశాడు. మొట్టమొదటి సారిగా శాస్త్రి ఆయనమాట తీసివెయ్యడానికి నిశ్చయించాడు. గృహప్రవేశానికి పట్నం వస్తానని రాశాడు. బొంబాయి వాతావరణంనుంచి వెనక్కుపోవడం అతనికి ఏమీ నచ్చలేదు. పైగా పట్నంలో ఉండడంకూడాకాదు. రైళ్ళమీద ఎండల్లోపడి తిరగాలి.

శాస్త్రి, శర్మగారి ఇంటికి వెళ్ళినప్పుడు, సరస్వతి ఆహ్వానం వచ్చినట్టు చెప్పి "అదేమిటి పెళ్ళికూతురుకు అన్ని పేర్లున్నై?" అని అడిగింది. అది నిజమే. రామదాసు కాబోయే భార్యపేరు వెంకట కనకదుర్గా ప్రసన్న బాలా త్రిపుర సుందరి.

"వాళ్ళు వాళ్ళు జమీందార్లట. అందుకని అంత పొడుగున పేరు పెట్టారేమో?" అన్నాడు శాస్త్రి.

"అయితే మీరంతా చాలా గొప్పవాళ్ళన్నమాట!" అన్నది సరస్వతి.

"మేమంతా ఎవరం? మా అక్కను పెళ్ళాడినాయన లక్షాధికారి. ఆయనకు ఒకడే కొడుకు. నేను గర్భదరిద్రుణ్ణి. దరిద్రులకూ, ధనికులకూ మధ్య సంఘం ఏర్పరచిన ఎడాన్ని, మధ్య మధ్య వ్యక్తులు వచ్చి తీసి పారెయ్యడానికి ప్రయత్నిస్తారు. లక్షాధికారిని పెళ్ళిచేసుకున్నా మా అక్క నా కళ్ళకు భిక్షాధికారిణల్లేనే కనిపిస్తుంది" అన్నాడు శాస్త్రి.

"మద్రాసులో రిసెప్షన్‌కు పోదాం వస్తావా?" అని అతను అడిగితే "నో, థాంక్స్?" అని సరస్వతి చెప్పేసింది.

---

1. ఉర్లాం, లక్కవరం, బిల్లుమల్లి, పేరూరు, బంటుమిల్లి, మాగాం, చిలకలూరిపేట, సత్తెనపల్లి, వేగాయమ్మపేట - ఇవి ఆంధ్రదేశంలోని ఒకప్పటి బ్రాహ్మణుల అధీనంలోని ఎస్టేట్లు, జమీలు. విశాఖ, శ్రీకాకుళం జిల్లాలో ఏదో ఒక జమీందారీకి సంబంధించిన అమ్మాయి రామదాసుకు మాట్లాడిన అమ్మాయి కావచ్చు. కథాకాలానికి కమ్మ, వెలమ జమీందారీలు ప్రాపకంలో ఉండి, బ్రాహ్మణ జమీందారీలు, అగ్రహారాలు చాలా తగ్గుముఖంలో ఉన్నాయి.

# 13

శాస్త్రి అనుకున్న రోజు బయలుదేరలేక, మర్నాడు బయలుదేరాడు. అతను పట్నం చేరేసరికి గృహప్రవేశం జరుగుతున్నది. సుదర్శనంగారి ఇల్లంతా పందిరి వేసి అట్టహాసంగా చేశారు. భోజనాలు మొదలైనవాటి విషయంలో, యుద్ధకాల నిబంధన లన్నిటినీ సుదర్శనంగారు అతిక్రమించాడు.[1]

మనుష్యులమధ్య సంబంధాలన్నీ పూర్తిగా మారిపోయినై. ఖాను ధాటీగా పెత్తనం చేస్తున్నది, స్పష్టంగా తెలుస్తున్న కడుపు వేసుకుని. దుర్గాంబ ఖానును ఎంతో ఆపేక్షగా పిలుస్తున్నది. అందుకు ఖాను చాలా కృతజ్ఞత చూపిస్తున్నదానికి మల్లే కనిపిస్తున్నది.

"నేనైతే దుర్గాంబ ఆపేక్షలు కొంచెంకూడా నమ్మను" అనుకొన్నాడు శాస్త్రి.

కోమల పొడుగయింది; ఒక్క పని చెయ్యకుండానే ఆసులో గొట్టమల్లే అందరినీ రాచుకుంటున్నది - పావుగంటలో శాస్త్రిని అయిదుసార్లు రాచుకుని, గొప్ప పని చేసినదానల్లే చిరునవ్వు నవ్వింది.

"ఈ వాగు దిగువకు పారుతున్నది" అనుకున్నాడు శాస్త్రి.

పద్మకు ఏళ్ళు వస్తున్నకొద్దీ అందంగా తయారవుతున్నది. ఆమెకు అంగ రక్షకుడల్లే ఒక యువకుడుండడం గమనించి, శాస్త్రి అతని విషయం పద్మనే అడిగి తెలుసుకున్నాడు. అతని పేరు రంజనట.

"ఏం రంజనం ? జనరంజనమా? సభారంజనమా?" అని శాస్త్రి అడిగాడు.

"పో మామయ్యా!" అన్నది పద్మ శాస్త్రి రొమ్ముమీద గట్టిగా కొట్టి.

ఈ రంజనం రామదాసుకు ఒక విధమైన కార్యదర్శిగా పనిచేస్తున్నాట్ట. శాస్త్రికన్నా మూడేళ్ళు చిన్నకావచ్చు. ఇరవయ్యో ఇరవై ఒకటో వుండొచ్చు. ఇంకా రెండు మూడేళ్ళదాకా పద్మకు పెళ్ళి తొందర లేదు. కాని రంజనం పద్మను చేసుకుంటే, ఈడుజోడుగా వుండొచ్చు. రంజనం అనాకారి కాదు. పెద్ద అందగాడు కాకపోయినా మనిషి స్టైయిలిష్‌గానే వున్నాడు.

---

1. యుద్ధకాలంలో శుభకార్యాల సందర్భంలోనేకాదు మిగతా సందర్భాల్లో కూడా భోజనాలు మొదలైనవాటి విషయంలో నిబంధన లుండేవి. వెన్న, తాజా కూరగాయలు, తెల్లబ్రెడ్డు, గుడ్లు, కాఫీ, బత్తాయిలు, అరటిపండ్లు చాలా తక్కువగా లభించేవి. పశువులకోసం పెంచిన ఒక రకం గడ్డిని కూడా ఆ రోజుల్లో ఆకలిని చంపుకోడానికి తిన్నారు. ఆహార ధాన్యాల రేషనింగు ఉండేది. దాంతోపాటు దొంగ వ్యాపారం యూరోప్ ఆసియా దేశాల్లో.

తరవాత శాస్త్రి రంజనం తల్లినీ, అక్కనూ చూశాడు. అందరికన్నా వాళ్ళే నదరైన చీరెలు కట్టి, కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నారు. రంజనం అక్క ఏకంగా మేకప్ చేసుకుని లిప్‌స్టిక్ కూడా వేసుకున్నది. కాని వాళ్ళిద్దరికీ ఎవరూ అంత మర్యాద చూపకపోవడం శాస్త్రి గమనించాడు. అసలు వాళ్ళు ఆడవాళ్ళతో అట్టే కలవక, మగవాళ్ళతో ఎక్కువగా మాట్లాడుతున్నారు. ముఖ్యంగా ఒక మిలటరీ ఆయన రంజనం అక్కతో మాట్లాడినప్పుడల్లా, జావకారి పోతూండడం కూడా శాస్త్రి గమనించాడు.

ఇక పెళ్ళికూతురు-ఏ బీ సీ డి....ఎక్స్ వై జడ్ సుందరి—శాస్త్రి కళ్ళకు 'నిరాకారి'గా కనిపించింది. ఆమె మొగంలో అందమూ లేదు, అనాకారితనమూ లేదు. శరీరశాస్త్ర పుస్తకంలో మనిషి మొగం చూపటానికి రాసిన బొమ్మల్లే ఉంది. అయినా మనిషిలో ఠీవి లేకపోలేదు. ఆమె కాళ్ళకు బంగారు పట్టగొలుసులు పెట్టుకున్నది. ఆమె చేతి ఉంగరాలలో ఒకటి వెండిదిలాగా కనపడింది-అది బంగారం కన్న ఖరీదైన ప్లాటినంతో చేసినదట !

మర్నాటినుంచీ పెళ్ళికూతురు ప్రభ శాస్త్రికి మరింత బాగా కనిపించింది. ఆ అమ్మాయికి దుర్గాంబకున్న దానికంటె ఎక్కువ నిక్కే ఉంది. కాని దుర్గాంబకి మల్లే ఇతరులకు రోత పుట్టించకుండా, తన అధికారం చలాయించగలదు. ఆమె సాధ్యమైనంత తక్కువ మాటాడుతుంది. ఒక్క చూపుతో వ్యక్తం అయే దానికోసం నోరు చేసుకోదు. ఆమెను చూస్తే అందరికీ భయమేనని శాస్త్రి తెలుసుకున్నాడు. ఆమెకేసి ఎవరూ తేరిపార చూడరు. ఎవ్వరూ 'నువు' అని సంబోధించరు. దుర్గాంబ మాత్రం "అమ్మాయ్" అని పిలుస్తుంది. ఆమెకు "అమ్మాయిగారు" అన్న పేరు ఖాయమైపోయింది. ఆమె వెంటవచ్చిన దాసీది ఆ పేరు ప్రచారం చేసింది. రామదాసు భార్యతో మాట్లాడుతుండగా శాస్త్రి వినలేదు. కాని అతను తన భార్య ప్రస్తావన తెచ్చినప్పుడు "మేడమ్" అనేవాడు. ఆ "మేడమ్" అన్నమాట ఇంకెవరూ వాడేవారు కారు.

శాస్త్రికి మటుకు ఈ కొత్త పెళ్ళికూతురు పెద్ద "బొంకు"గా కనపడింది. అతనికి ఆమెను చూస్తే నవ్వొచ్చింది. ఆమెను గురించి ఆమె ఎదట మాట్లాడవలసి వచ్చిన మొదటిసారే, "బాల" అన్నాడు. ఎవరికీ అర్థం కాలేదు. ఆమె కూడా అందరితోబాటు తేరిపార చూసిందతన్ని. "నీ విషయమే చెబుతున్నాను" అని ఏక వచన ప్రయోగం చెయ్యడమేగాక ఆమె కళ్లు దించేదాకా ఆమె కేసి చూశాడు.

పై వాళ్ళంతా వెళ్ళిపోయినారు. ఇల్లు మామూలుగా అయింది- కాకపోతే కొత్త పెళ్ళికూతురు గౌరవార్థం పూట పూటా పిండివంటలూ అవీ మార్చి మార్చి-

చేస్తున్నారు. శాస్త్రి శలవు ఒక వారం అయిపోయింది. భాను తన ఇంటికి పోతా నంటే, దుర్గాంబ సుతరామూ ఒప్పుకోలేదు; తన కోడలు అందరికన్న భానుతో ఎక్కువ స్నేహంగా ఉండడం ఆవిడ గమనించింది.

ఒకనాడు మధ్యాన్నం శాస్త్రి భోంచేసి ఏదో పుస్తకం చదువుతూ పడుకుని వుండగా, బాలవెంట వచ్చిన దాసీది తొంగి చూసింది. ఆ గదిలో అతను తప్ప ఇంకెవరూ లేరు.

"ఎవరు కావాలి?" అన్నాడు శాస్త్రి.

"గదిలో ఎవరున్నారో చూడమంటేనూ-" అంటూ దాసీది వెళ్ళిపోయింది. ఆ మధ్యాన్నం దాటి నాలుగు గంటలకు భానూ, కొత్త పెళ్ళి కూతురూ భాను వాళ్ళిల్లు చూడబోతూ శాస్త్రిని రమ్మన్నారు - కనీసం భాను అన్నది. పద్మా, కోమలా వస్తామన్నారు. వెంటనే బాల, "ఇది తిరణాల అయేలాగుందా?" అన్నది. దుర్గాంబ వాళ్ళను వారించింది. పెళ్ళికూతురి దాసి మాత్రం కారులో యెక్కింది.

భాను వాళ్ళ ఇంటికి చేరుతూనే దాసీది చీపురుకట్ట తీసుకుని పైకి వెళ్ళింది. అది దిగి వచ్చినాక పెళ్ళికూతురు అకస్మాత్తుగా శాస్త్రికేసి తిరిగి "పై భాగం చూపిస్తారా?" అని అడిగింది. శాస్త్రి ఆశ్చర్యంతో అక్కకేసి చూశాడు. భాను వెళ్ళమన్నట్టు కళ్లు యెగరేసింది.

ఇదంతా ఏదో గూడుపుఠాణి అనుకున్నాడు శాస్త్రి. అతను ముందు గబ గబా మెట్లెక్కుతుంటే వెనుకనుంచి బాల, "ఎందుకట్టా పరుగెత్తుతారు ? నేను తినెయ్యను" అన్నది. శాస్త్రికి పౌరుషం వచ్చి ఒక మెట్టుమీద ఆగి ఆమె తనకు ఎంత దగ్గిరగా వస్తుందోనని పరీక్ష పెట్టాడు. ఆమె అతనున్న మెట్టు మీదికి వచ్చి, "పోతే అదే పోతా? లేకపోతే స్తంభంలాగా నిలబడటమా?" అన్నది.

గుండెల్లో రైళ్ళు పరుగెత్తుతూ శాస్త్రి ఆమె పిరుదుమీద చెయ్యివేసి, 'పద' అన్నాడు. ఆమె అభ్యంతరం చెప్పలేదు.

మెట్లన్నీ ఎక్కి మలుపు తిరగగానే శాస్త్రి వెనక్కు తిరిగి బాలను రెండు చేతులతోను దగ్గిరికి తీసుకున్నాడు. ఆమె మాట్లాడలేదు. ముద్దు పెట్టుకున్నాడు. తల పక్కకు తిప్పుకొనడానికి ప్రయత్నించినా బాల మరుక్షణమే అతన్ని ముద్దు పెట్టుకోనిచ్చింది.

ఇదంతా ప్లాను ప్రకారం జరుగుతున్నదన్న శాస్త్రి అనుమానం దృఢ పడింది. ఆ ప్లానును సాగనివ్వడం తప్ప తనకు మార్గాంతరం లేదు. దాన్ని భగ్నం చెయ్యాలన్న ఉద్దేశం ఏ కోశానా లేదు.

"ఇదే పడకగది" అంటూ బాలను పడకగదిలోకి తీసుకపోయి తలుపు గడియ పెట్టాడు శాస్త్రి.

బాల తనను ప్రేమించిందని శాస్త్రి భ్రమ పడలేదు. కాని ఆమె ఏ లెక్కన తనను ఎన్నుకున్నదో అతనికి అర్థంకాలేదు. మగవాళ్ళలో రెండు రకాలున్నారు. ప్రతి ఆడదాన్నీ ఆకర్షించగల మనుకునేవాళ్ళూ, ఏ ఆడదిగాని తమచేత ఎందుకాకర్షించబడేదీ ఊహించలేనివాళ్ళూనూ. శాస్త్రి రెండోరకం మనిషి.

పెళ్ళి అయి వారమైనా బాలకింకా కన్యాత్వం తొలగలేదని శాస్త్రికి స్పష్టమయింది. "దాసు ఏం చేస్తున్నట్టు?" అనుకున్నాడతను.

కాలం ఎట్లా గడుస్తున్నదీ శాస్త్రికి తెలీదు.

"చీకటి పడ్డట్టున్నది. మీరు వెళ్ళి మా రామిని పంపించండి" అన్నది బాల. అతను వెళ్ళబోతుంటే వెనక్కు పిలిచి చేతులు అతని మెడచుట్టూ వేసి, "మళ్ళీ రేపు–ఇవాళలాగే" అంటూ అతని చెంపకు చెంప ఆనించి నొక్కింది.

ఈ ఎదురు చూడని ప్రణయానికి గర్వించాలో, సిగ్గుపడాలో శాస్త్రి తేల్చుకోలేక పోయినాడు. నిజానికి అతనిలో రెండు భావాలు కలిగినై. ఎంతమంది యువకులను ఆడపిల్లలు ప్రేమించి ఎదురు వస్తారు?- అందులోనూ జమీందారీ కుటుంబాలవాళ్ళు! కాని అతని కిందులో కొంత అవమానం కూడా తోచింది. ఎందుకంటే ఇదంతా అతను ఊహించుకున్న ప్రణయంలాగా లేదు. ఏదో రాజకీయపు కుట్రలాగా ఉన్నది. ఈ కుట్రలో భాసూ, దాసీది చేరి ఉన్నారు. ఒకవేళ దుర్గాంబా, రామదాసూ, సుదర్శనంగారూ చేరి ఉన్నా, శాస్త్రికి ఆశ్చర్యం కలిగేటట్టు లేదు. దీనికంతకూ ఏదో కారణం ఉండాలి.

ఆ కారణం ఏమిటో భాను తరవాత చెప్పింది. రామదాసు నపుంసకుడట. అదివరకే కోమల స్నేహితురాలొకతె రామదాసును తన వలతో వేసుకోవడానికి ప్రయత్నించి, ఈ సంగతి కనిపెట్టింది. భానుకు ఈ సంగతి ఏడాదినుంచీ తెలుసు.

కొంతమంది నపుంసకులుంటారని శాస్త్రి విన్నాడు. కాని, నపుంసకులు కొజ్జాలల్లే ఉంటారని అతని నమ్మకం. ఎంత నమ్మశక్యంగాని విషయమైనా రామదాసు విషయం ప్రత్యక్షంగా రుజువయింది. తనకు అటువంటి భర్త వచ్చినందుకు జమీందారీ రక్తం ఉడికిపోయి, బాల తనను ప్రతీకార సాధనంగా ఉపయోగించుకున్నది- సాహసం గల మనిషే.

మరో అయిదు రోజులు బాలతో "కాపరం" చేసి, శాస్త్రి బొంబాయికి తిరుగు ప్రయాణం కట్టాడు.

"వెళ్ళితీరాల్సిందేనా?" అన్నది బాల, రేపు అతడు బయలుదేరుతాడనంగా. ఆ క్షణంలో, ఆమెలో అతనికి ప్రేమలాటి భావం గోచరించింది. కాని, అతను తన మనస్సును రాయిచేసుకున్నాడు. ఈ మనిషి తనను ఈ విధంగా ఎంత కాలమైనా ఉపయోగించుకోగలదు. తన కోసం అతను పెళ్ళి పెటాకులూ లేకుండా

ఉండిపోతే, ఇంకా సంతోషిస్తుంది; కాని, ఆమెను పెళ్ళాడడానికి తాను వచ్చినా పనికిరాడు! ఈ ప్రణయం అడుగున ఉన్న పరమ సత్యం ఇదే; ఇందులో ఆపోహకు కూడా అవకాశం లేదు.

## రెండవ భాగం

యుద్ధం అయిపోయింది. జర్మనీ ఓడిపోయింది. జపాను ధర్మమా అంటూ యుద్ధసామాగ్రి ఉత్పత్తి ఇంకా సాగుతూనే ఉంది. కాని ఇది ఎంతోకాలం సాగదు.[1] ఈ ఉత్పత్తీ, ఈ లాభాలూ ఇక ఎంతోకాలం ఉండవు. పెట్టుబడిదార్ల ఉత్సాహం పన్నెండు వీసాలు దిగజారిపోయింది. వాళ్ళు ఒక నిద్రనుంచి మేలుకొంటున్నారు. కలలో కనిపించిన ఆశలు జాగ్రదావస్థలో ఏ రూపం పొందేదీ ఎవరికీ తెలియదు... యుద్ధం ధర్మమా అంటూ వాళ్ళు చాలా ఆత్మవిశ్వాసం సంపాదించారు. చాలా మంది దొరల స్నేహం సంపాదించారు. వాళ్ళలో గాంధీ భక్తులు సైతం దొరలకు అవసరాన్నిబట్టి తాగుళ్ళు పోయించారు. పాడే అమ్మాయిలను, ఆడే అమ్మాయిలను, చెప్పినట్టు వినే అమ్మాయిలను సప్లయి చేశారు ..ఇక్కడనుంచి మళ్ళీ వెనక్కు పోయి, స్వాతంత్ర్య సత్యాగ్రహసమరాలు ఎదుర్కోవలసి వస్తుందా? ...చర్చిల్ ఇండియాకు స్వరాజ్యం ఇస్తాడా?[2] అసంభవం!

శాస్త్రికి స్వయంగా యుద్ధం అయిపోతున్నదంటే చాలా సంతోషం కలిగింది. ఈ యుద్ధం సాగినంతసేపూ, తనకొక జాతీయమైన జీవితం, ఒక సొంత బతుకు లేనట్టు తోచింది. ఇక ముందు తన జీవితానికి ఒక స్వరూపం ఏర్పాటు చేసుకోవాలి.

సరస్వతి బొంబాయిలోనే ఏదో ఉద్యోగం సంపాదించింది. ఆమెను పెళ్ళి చేసుకుంటే, తన జీవితం నిండుగా ఉంటుందనే విశ్వాసం శాస్త్రిలో ఎప్పటికన్నా బలంగా ఉన్నది. కాని ఆమె ఒప్పుకుంటుందన్న ఆశ కొంచెంకూడా పెరగలేదు.

---

1. జర్మనీ 1945 మే 7 వ తేదీ నాటికి ఏ షరతులు లేకుండా లొంగిపోయింది. సోవియట్ల చేతిలో బెర్లిన్ పతనం జరిగింది 1945 మే 2. అటంబాంబును హిరోషిమా మీద 1945 ఆగస్టు 6 వ తేదీన, 9వ తేదీన నాగసాకి మీదా ప్రయోగించాక ఆగస్టు 10 వ తేదీన జపాన్ ప్రాథమిక శాంతి సంభాషణలకు ఒప్పుకుంది. ఆగస్టు 15న లొంగిపోయింది. అంత వరకూ యుద్ధ సామగ్రి ఉత్పత్తి ఆగనేలేదు.
2. సర్ విన్స్టన్ లియోనార్డ్ స్పెన్సర్ చర్చిల్ (1874-1965) యుద్ధ కాలంలో-1940 మే లో-బ్రిటన్ ప్రధాని అయ్యాడు. యుద్ధానంతరం జరిగిన సాధారణ ఎన్నికల్లో ఓడిపోయి, అట్లీ ప్రధాని అయ్యాకే భారత దేశ స్వరాజ్యం వచ్చింది.

రైలు పట్టాలలాగా వాళ్ళిద్దరి భావాలూ, దూరపు విషయాలలో చాలా అద్భుతంగా కలిసిపోయేవి. కాని ఎంతదూరం వెళ్ళినా, సమీప విషయాలలో వాళ్ళిద్దరి మధ్యా ఉన్న ఎడం ఎప్పుడూ ఉన్నంతే ఉండినట్లు తోచేది. రూజువెల్టు మరణం[1] గురించి వారికి కలిగిన నిరాశ, మొదటి అణువు బాంబును అమెరికా పేల్చినప్పుడు[2] వాళ్ళిద్దరికీ కలిగిన ఆనందము, హిరోషిమా, నాగసాకీలపైన అమెరికనులు అనేక అణువు బాంబులను వేసిననాడు[3] వాళ్ళకు కలిగిన ఆగ్రహమూ ఒకదాని కొకటి తూచినట్లు సరిపోయినై. జాతీయ, అంతర్జాతీయ విషయాలమీద, తమ సొంత జీవితాలకు సంబంధించిన విషయాలమీద, వాళ్ల ఒకేరకంగా ఆలోచించడమో, ఒకరి ఆలోచనలనూ భావాలనూ రెండోవాళ్ళు తీర్చిదిద్దటమో జరిగినట్టుండేది. దీనికి ఒక కారణం చిన్న శర్మగారు కావచ్చు. ఆయన ప్రభావం ఇద్దరిపైనా ఉండేది.

"అమెరికావాళ్ళు అచ్చగా పెరల్ హార్బరుకు[4] పగ తీర్చుకున్నారని నేను నమ్మలేను. శ్వేతజాతి అహంకారం, సామ్రాజ్యవాదానికి తోడునీడ. ఈ యుద్ధంలో నిజంగా దెబ్బతినలేదు. సామ్రాజ్యాలు ఏలే దేశాలు, ఈ విజయాన్ని తమ సామ్రాజ్యవాదాన్ని దక్కించుకోవటానికి యత్నించితీరుతై. అమెరికాకు ఆర్థిక సామ్రాజ్యం ఉన్నదిమరి. ఇతర సామ్రాజ్యాలకన్నా ఈ సామ్రాజ్యం విస్తరించటానికి మంచి అవకాశం ఉన్నది. లెండ్‌లీజ్ కింద అమెరికా బ్రిటను కిచ్చిన తుక్కు పరికరాల సంగతి[5] విన్నావుకద. అమెరికా ఒక ఆదర్శంకోసం పోట్లాడు

---

1. రూజ్‌వెల్ట్ (1859-1919) అమెరికా 26 వ అధ్యక్షుడు.
2. మొదటి అణుబాంబును అమెరికా ప్రయోగాత్మకంగా పేల్చింది 1945 జూలై 16న ఉదయం 5-30 గంటలకు న్యూమెక్సికో ఎడారుల్లో.
3. హిరోషిమా మీద 1945 ఆగష్టు 6 న ఉదయం 8-15 గంటలకు యు 235, బి 29 ఎనోలాగే నుండి తయారైన నాలుగు టన్నుల బాంబును పారాచ్యూట్ ద్వారా కల్నల్ టిబ్బెట్స్ జారవిడిచాడు. గాలిలో పేలి 60 శాతం హిరోషిమాను ఈ బాంబు తగల బెట్టింది. లక్షా ఏభై వేల మంది ఆహుతి అయ్యారు. అదే ఆగష్టు10 వ తేదీ నాగసాకి పట్టణం మీద మరొక అణుబాంబును అమెరికా ప్రయోగించింది.
4. 1941 డిసెంబరు 7 వ తేదీన జపాన్ అమెరికా రాయబారుల మధ్య వాషింగ్‌టన్‌లో చర్చలు సాగుతున్నాయి. హవాయి సరిహద్దుల్లోని పెరల్ హార్బరులో అమెరికా 94 యుద్ధ నౌకలనూ, అనుబంధ నౌకలనూ లంగరు వేసింది. జపాన్ మీద పగ తీర్చుకుంది.
5. 1941 మార్చి 11 వ తేదీ - అమెరికా తటస్థంగా ఉన్నప్పుడే రూజ్‌వెల్ట్ లెండ్‌లీజు చట్టంపై సంతకం చేశాడు. ఈ చట్టం ప్రకారం అమెరికా

తున్నదని మనం గట్టిగా అనుకోవడానికి లేదు" అని చిన్న శర్మగారు హిరోషిమా వార్త తెలిపినాడు. శాస్త్రి, సరస్వతి వినేట్టుగా స్వగతం మాట్లాడుకున్నాడు.

ఆయనే, తమ ఉద్యోగాల భవిష్యత్తు గురించికూడా అనుమానంగా చెప్పాడు. "ఇతరుల మాటేమో నాకు తెలియదుగాని, మన ప్రొప్రయిటర్లు వట్టి వ్యాపారం చేసుకునే బాపతు. నన్నడిగితే వాళ్ళు పారిశ్రామికులేకారు. ఉత్పత్తిదార్లయినారేగాని, వాళ్ళ మనస్తత్వం షేర్ బజారు మనస్తత్వం? యుద్ధం కంట్రాక్టులు తీసుకుని ఉత్పత్తి చెయ్యడంలో మార్కెట్ సమస్యలేదు. కాని ఇకముందు ఏది చెయ్యాలన్నా మార్కెట్ సమస్య ఏర్పడుతుంది. అదీగాక, విదేశీ సరుకులు వచ్చిపడతై. నాణ్యంలో వాటితో పోటీచేసే మొహాలా ఇవి? అప్పుడే బీద అరుపు అరుస్తున్నారు. మనం వేరే ఉద్యోగాలు చూచుకోవాల్సిందే."

శాస్త్రికి తన అక్క గురించి, పద్మ గురించి బెంగ పట్టుకున్నది. భానుకు ఎనిమిదో నెలలో గర్భస్రావం అయింది. అది మామూలు గర్భస్రావమైతే, దాన్ని గురించి ఆలోచించవలసిన పనిలేదు. కాని, తనకు, దుర్గాంబ ఏదో మందు పెట్టించినట్టు అనుమానంగా ఉన్నదనీ, తానూ - పిల్లా త్వరలో తమ యింటికి పోతున్నామనీ రాసింది; ఆ తరువాత వెళ్ళింది కూడాను.

దుర్గాంబ - లేకపోతే, ఆవిడ కూతురో, కొడుకో - భానుకు రహస్యంగా మందు పెట్టి గర్భస్రావం కలిగించటమేమిటి? నాగరికులు యిటువంటిపనులు చేస్తారా? భానుకు ఏకొడుకో పుడితే, సుదర్శనంగారి ఆస్తిలో వంతుకొస్తాడనేనా? ఇదే స్పష్టంగా రుజువైన విషయమైతే, శాస్త్రి అంత బాధపడడు. కాని, అనుమానంగానే ఉండిపోయింది. ఈ అనుమానంకూడా సుదర్శనం గారు, భాను తలకాయలో పెట్టినది.

శాస్త్రి భాను పరిస్థితి ఊహించుకోగలిగాడు. ఆవిడ దుర్గాంబతో మామూలుగా ఉండడానికి లేదు; ఉండకుండా ఉండడానికీ లేదు - నిర్దోష అని కోర్టు వదిలేసిన హంతకుడితో స్నేహం చేసినట్టు!

శాస్త్రికి రుజువుకాని యింకొక అనుమానం కూడా వుంది: జనవరి మధ్యలో రామదాసు భార్య కొడుకును కన్నది. వాడు తన కొడుకై ఉంటాడా?

---

రక్షణ కోసం సహాయ పడదలచుకున్న ఏ దేశానికైనా అధ్యక్షుడు ఆయుధాలను అమ్మవచ్చు, కౌలుకివ్వవచ్చు. 1945 సెప్టెంబరు 27వరకూ ఈ చట్టం కొనసాగింది. బ్రిటన్, రష్యా, టర్కీలకు ఈ చట్టం కింద సేవలందించారు. బ్రిటన్‌కు తుక్కు పరికరాలను ఇచ్చిన సంగతి నాటి దినపత్రికల్లో ప్రముఖంగా వచ్చి ఉండాలి.

తన కొడుకైతే శాస్త్రి వాడికోసం బెంగపడుతున్నాడని కాదు - కాని శాస్త్రికి అనుమానాలంటే "ఎలర్జీ!" "వీడు నీ కొడుకే!" అని బాల ప్రమాణం చేసి చెప్పినా, శాస్త్రికి వాడిపైన పైతృక ప్రేమ కలిగేమాట కల్ల. మాతృత్వం ఉన్నట్టుగా, ప్రకృతిలో పితృత్వం అనేది లేదని శాస్త్రి ఇప్పుడు స్పష్టంగా తెలుసుకున్నాడు. తండ్రి కొడుకుల సంబంధం సామాజికం. శకుంతల గర్భవతిగా కాకుండా మామూలుగా వచ్చి ఉంటే దుష్యంతు డామెను ఏలుకోవానికి సందేహించేవాడు కాడేమో! ఒక ఆడదాని గర్భంలో పెరుగుతున్న బిడ్డకు, ఫలాని వాడు తండ్రి అనేది సంఘం ఒప్పుకోవడం చాలా అవసరం. ఈ అవసరాన్ని గుర్తించే, రాముడు నిండు చూలాలైన సీతను అడవులకు పంపాడు!....

శాస్త్రికి, బాల కొడుకుపైన పైత్యకమైన ప్రేమ ఏమీ లేదు—కానీ వాడు రామదాసుకూ, ఆతడి ఆస్తికీ వారసు డౌతాడనేది ఆతనికి ఆశ్చర్యం కలిగించింది.

ఈ రెండు విషయాలూ ఇట్లా ఉండగా, ఖాను ఒక ఉత్తరంలో పద్మను గురించి ఆందోళన కనపరుస్తూ రాసింది : "పద్మ ప్రవర్తన ఏమీ బాగాలేదు. అది కోమలను చూసి పాడు వేషాలన్నీ నేర్చుకుంటున్నది. నేను మంచిగా చెప్పబోతే, నీవు నాకు చెప్పడమేమిటి? ఎవరన్నా వింటే నవ్విపోతారు అన్నది. నేను దానికి చాలా లోకువైపోయినాను-సుదర్శనం గారిని చేసుకున్నందుకేమో. ఎప్పుడూ ఆ రంజనం వెంట తిరుగుతుంది. ఆ రంజనం తల్లీ, అక్కా కూడా వ్యభిచారం మీద డబ్బు సంపాదిస్తున్నారు. ఈ రంజనం వట్టి తార్పుడుగాడు. వాడితో తిరిగిందంటే పద్మకు పెళ్ళికూడా కాదని నా అనుమానం. దీన్ని సినిమా స్టారును చేస్తానని వాడు ఆశ పెట్టినట్టుంది. నా చిన్నతనంలోకూడా మనుషులు కష్టాలు పడడం చూశానుగాని, నాకిప్పుడు చుట్టుకున్న మనోవ్యాధిలాటి కష్టాన్ని ఎవరూ పడగా నే నెరగను. ఏదో ప్రవాహంలోపడి కొట్టుకుపోతున్నట్టున్నది. కాని నాకు ఒక మనిషల్లే బ్రతుకుతున్నాననిపించడం లేదు...."

"పాపం, ఖాను! దురదృష్టవంతురాలు! ఏ పూరిపాకలో, ఏ మామూలు మగవాడితోనైనా కాపురం చేసి, ఉన్నంతలో సుఖం అనుభవించి తృప్తిపడగల మనిషికి, ఏదో దశ ఎత్తుకున్నట్టు ఎత్తుకోవడమూ, మనస్సును విచారంతో గడపటమూ జరుగుతున్నది! - అన్యాయం!" అనుకున్నాడు శాస్త్రి.

ఖానును ఎన్నడూ అతను దేనికీ మనస్ఫూర్తిగా తప్పు పట్టలేదు. కాని పద్మను అదుపు చెయ్యాలనుకోవటంలో ఆమె పొరపాటు చేస్తున్నదనిపించింది. జనానికి జీవితంమీద మమత హెచ్చుతున్నది. ఇకముందు వాళ్ళు ఆదర్శాలకోసం స్వసుఖాన్ని త్యాగం చేసి, కోరికలను మీదుకట్టి కూచోరు. సుఖాల మీద ఎంతగా

ఎగబడాలో తమ తమ ఆర్థిక స్థాయిని బట్టి వ్యక్తులు నిర్ణయించుకుంటున్నారు. పద్మ తానొక పేదరికపు మధ్యతరగతి కుటుంబం పిల్ల ననుకోమంటే అనుకోదు. సుఖం జుర్రుకోవడానికి కోమల కున్నంత హక్కు తనక్కూడా ఉన్నదనే అను కుంటుంది. కోమల సుదర్శనం సొంత కూతురైతే, పద్మ ఆయనకు సవతి కూతురు.

పడుచుకు బతికేవాళ్ళను గురించి కూడా శాస్త్రికి అటే ఆగ్రహం లేదు. ఈనాడు అన్ని వృత్తులలోను పడుపు మనస్తత్వం ఉన్నది. ఉద్యోగాలు చేసే వాళ్ళెవరూ తమ శ్రమశక్తిని పరువుగా అమ్మేవాళ్ళల్లే ప్రవర్తించటం లేదు. ఈ దేశంలో అందరూ జీతం డబ్బులిచ్చేవాణ్ణి, అవసరమైతే కృత్రిమంగా తృప్తి పర్చ డానికే యత్నిస్తున్నారు. ఉద్యోగమూ, ఆత్మాభిమానమూ కలసినచోట, ఉద్యోగా నికీ, ఆత్మాభిమానానికీ కూడా దెబ్బతగులుతున్నది. ఈ సంగతి అదివరకే కళ్ళారా చూశాననుకున్న శాస్త్రి మరికొంత కాలానికి ఇంకా నగ్నంగా చూసి ఆశ్చర్యపడడం కూడా జరిగింది.

# 2

రెండో ప్రపంచ యుద్ధం అయిపోగానే[1] రామదాసు శకం ఆరంభ మయిం దనవచ్చు. దీనికి పునాది యావత్తూ ఒక సంవత్సరం లోపుగా పడింది. అజ్ఞానాంధ కార రూపంలో ఉన్నవాడు జ్ఞానుల సంభాషణా, వాసనా తగిలి జ్ఞాన జ్యోతిని వీక్షించి కూపంలోనుంచి పైకివచ్చి ముముక్షువు అయ్యేవిధంగా రామదాసు ధనలక్ష్మి ముద్దుబిడ్డల సంపర్కమూ, సంభాషణా అలవరచుకుని నిజంగా దనికుడు కాదలచిన వాడు పట్టుకోవలసిన రహదారి తెలుసుకున్నాడు—కనీసం ఆ రహదారికి దార్లు తెలుసుకున్నాడు.

తన తండ్రి డబ్బంతా వర్తకంలోనే చేసుకున్న కారణంచేతనో లేక యుద్ధ కాలంలో జరిగిన మార్పుల ఫలితంగానో అతను వర్తకం చూసి అసహ్యపడ్డాడు. "నన్నడిగితే, వర్తకం ఆడవాళ్ళ పని!" అన్నాడతను చాలాసార్లు తన తండ్రితోను.

"పరిశ్రమలు పెట్టాలంటే, వాటిని గురించి తెలుసుకుని ఉండాలే" అన్నాడు తండ్రి.

"మనకు వంట తెలీకపోతే, డబ్బు పారేసి వంటవాణ్ణి పెట్టుకోవా? డబ్బు పారేస్తే, ఏది కావాలంటే అది తెలిసినవాళ్ళు వస్తారు" అన్నాడు రామదాసు.

---

1. 1945 సెప్టెంబరు 2వ తేదీ జపాన్ లొంగిపోయినట్లు సంతకం చేయడంతో యుద్ధం ముగిసింది.

అతను తన పేర సొంతాన ఒక మందులు తయారుచేసే కంపెనీ పెట్టాడు. ఒక ఫార్మాస్యూటికల్ కెమిస్టును చేరదీశాడు. ఈ కంపెనీ తరపున ముఖ్యంగా మలేరియా మాత్రలూ, హైడ్రోజన్ పెరాక్సయిడ్ ద్రావకమూ తయారుచేశారు. మలేరియా మందును ఒక పెద్ద అడ్వర్టయిజింగ్ కంపెనీ ప్రచారం చేసింది. కొన్ని నగరాల్లో మందుల షాపులవాళ్ళు స్టాక్‌చేసి అమ్మారు. హైడ్రోజన్ పెరాక్సయిడు సీసాలు గవర్నమెంటు ఆస్పత్రులకు డజన్ల లెక్కన అమ్మడానికి రామదాసుకు కొందరు మిత్రులు సాయపడ్డారు. అతను వాళ్ళ రుణం ఉంచుకో లేదు. అది వట్టినీళ్ళ—కొద్దిగా తుప్పువాసన. అది చెవిలో వేస్తే పొంగదు. అందులో వుండవలసిన అదనపు ప్రాణవాయువు బొత్తిగా లేకపోవడంచేత దాన్ని క్రిమి సంహారానికి వినియోగించడం అపాయకరం.

యాభై, అరవై వేలు లాభం చేసుకుని రామదాసు ఆ కంపెనీని మూసి పెట్టాడు. ఇది మూయకముందే అతను ఖద్దరు "ఉత్పత్తి" చేశాడు. ఇదికూడా హైడ్రోజన్ పెరాక్సయిడు పరిశ్రమ వంటిదే. బొంబాయి వాళ్ళను యుద్ధాంత కాలంలో ఖద్దరు ఆకర్షించినట్లుగా అతనికి తెలిసింది. రామదాసు బొంబాయి వెళ్ళాడు. శాస్త్రిని కలుసుకున్నాడు. బొంబాయిలో ఖద్దరు షాపు పెట్టాలని ఉన్న దన్నాడు. శాస్త్రి ఉద్యోగం అయిపోయే టట్టున్నదని తెలుసుకున్నాడు.

"వెధవ ఉద్యోగం మానెయ్యి. ఇవాళే మీ ప్రొప్రయిటర్లతో మాట్లాడు. వాళ్ళు నెలకిచ్చేది ఒక వారంలో సంపాదించవచ్చు" అన్నాడు రామదాసు.

శాస్త్రి ఉద్యోగం మానేసి ఇంకోపని చూసుకుంటానంటే ఫ్యాక్టరీవాళ్ళు చాలా సంతోషించారు. అతనికి రెండు వేల నాలుగు వందలు బహుమానం ఇచ్చి పంప డానికి నిశ్చయించారు.

ఈ సంగతి తెలియగానే రామదాసు శాస్త్రిని లక్షాధికారి చేయడానికి బ్రహ్మాండమైన ఆలోచన చేశాడు.

"చూడు శాస్త్రీ, ఈ షాపు నీ పేరనే పెడదాం. నీ రెండు వేలూ నీ పెట్టు బడి. అది పెట్టి, నా ద్వారా నువ్వు ఖద్దరు తెప్పించు, అమ్ము. కమీషన్ నా వంతూ, లాభాలు నీవీనూ."

శాస్త్రి సరేనన్నాడు. లాభ కాంక్షతోగాదు, తనకు బొంబాయిలో కాలునిలవ తొక్కుకునే అవకాశం దొరికితే సరస్వతిని పెళ్ళిచేసుకుని ఇక్కడ స్థిరపడడమే గాక, తాను సమస్యలు పరిష్కారం చెయ్యడానికి తోడ్పడవచ్చునని. పద్మ మద్రాసులో ఎబ్బెట్టుగా కనబడవచ్చు. కాని బొంబాయిలో చాలమంది ఆడపిల్లలు స్వేచ్ఛగా ప్రవర్తిస్తారు.

కాల్బాదేవిలో ఒక కొట్టు అద్దెకు దొరికింది. రామదాసు రెండువేల రూపాయల "ఖద్దరు" పంపాడు. అది ఖద్దరు కాదు-ముతకరకం చేనేత గుడ్డ. రెండువేల రూపాయలకూ అతను పదిహేను వందల రూపాయల గుడ్డే పంపాడు. అది అంత చురుకుగా అమ్మలేదు. కాని ఆరోజు కారోజు కొనేవాళ్ళ సంఖ్య పెరగడం శాస్త్రి గమనించాడు. నెల అయినాక మళ్ళీ రెండువేలు పంపాడు.

రోజులు గడుస్తున్నకొద్దీ ఖద్దరు అమ్మకాలు పెరుగుతున్నై. ఏడెనిమిది నెలల్లో డెబ్బైవేల రూపాయల సరుకు అమ్మినాక ఆ షాపులో అమ్ముతున్నది ఖద్దరు కాదని బొంబాయి అంతటా పొక్కిపోయింది.

"నువ్వు వెంటనే ఉన్నస్టాకు యావత్తూ ఏదో కాడికి అమ్మివచ్చెయి. నాకిక్కడ సరుకు సప్లయి చేసినవాళ్ళు మోసం చేశారు...." అని రామదాసు రాశాడు.

శాస్త్రి గాలానికి చిక్కిన చేపలాగా అయినాడు. తన జీవితమంతా ఎవరి చేతనో మోసపోవడం తప్ప మరొకటి లేనట్టు అతనికి అనిపించింది. తనకు సొంత జీవితం ఎందుకు లేకపోవాలి? ఆఖరుకు ఫ్యాక్టరీ కూలీలను చూసి అసూయ పడవలసిన దురతి తన కెందుకు పట్టింది? ఈ ఫ్యాక్టరీ ఉద్యోగం సుదర్శనం గారిప్పించారు. జీతం బాగానే వచ్చింది. కాని, సుదర్శనంగారి పరువు నిలబెట్టుకోవడంకోసం, తాను తన వ్యక్తిత్వం అణచిపెట్టుకోవలసి వచ్చింది. ఎన్నోసార్లు ఫ్యాక్టరీ అధికార్ల ప్రవర్తన—తన విషయంలో కాకపోతే, ఇతరుల విషయంలో, ప్రత్యేకించి పనివాళ్ళ విషయంలో—అతనికి నచ్చలేదు. తనకు సుదర్శనంగారి తగలాటం లేకపోతే, కనీసం ఒకటి, రెండుసార్లు దుమ్ము రేపేసి ఉండేవాడు. జీతం డబ్బులకోసం గడ్డితినేవాడల్లె అతను అన్యాయాలను చూస్తూ సహించాడు.

సగం ఈ ఉద్యోగంనుంచి బయట పడడం కోసమే ఈ దొంగ ఖద్దరు అమ్మకానికి ఒప్పుకున్నాడు. నిజానికి అది దొంగ ఖద్దరని అతనికి తెలీదు. తన సంపాదనలో చాలాభాగం ఈ బట్టల దుకాణం పాలయింది. రామదాసు బుద్ధిపూర్వకంగానే ఈ దగా వ్యాపారంలో తనను భాగస్వామిగా చేశాడని శాస్త్రికి దాదాపు రూఢీగా తెలుసు. రామదాసు తనను మొదటికి తీసుకురావడమే గాక, బొంబాయి విడిచిపెట్టి రమ్మంటున్నాడు.

శాస్త్రి బొంబాయి వదలదలచలేదు. అతను మిగిలిన స్టాకులో కొంతభాగం తను ఉంటున్న చోటికి చేర్చాడు. మరికొంత ఎరిగిన వాళ్ళందరికీ పంచాడు. అతని దగ్గిర ఇంకా రెండువందలదాకా ఉన్నది. అదివరకల్లా తన అక్కను చూడాలని కలవరించినవాడు, ఇప్పుడు బొంబాయి వదలడానికి భయపడ్డాడు. ఇక్కడనుంచి వెళ్ళితే, తిరిగి వచ్చే అవకాశం ఉండదని అతని అంతరాత్మ చెప్పింది.

అతను, తన సమస్య గురించి చిన్నశర్మగారితో చెప్పడానికి వాళ్ళింటికి వెళ్ళాడు. ఆయన ఉద్యోగం ఏనాడో అయిపోయింది. అప్పుడే ఇంకోచోట చేరాడు కూడా.

"కష్టపడితే నీక్కూడా ఇంకో ఉద్యోగం దొరకవచ్చు - కాని ఎంతకాలం పడుతుందో చెప్పలేం. ధరలు మండిపోతున్నై, ద్రవ్యోల్బణం అంటున్నారు. రెండు వందల రూపాయలు ఎంతకాలం సరిపోతై?" అన్నాడు కెమిస్టు శర్మగారు.

"మళ్ళీ ఉద్యోగం చూస్తున్నారా? మీ బిజినెస్ అయిపోయినట్టేనా?" అని అడిగింది, మధ్యలో వచ్చిన సరస్వతి.

"షాపు ఖాళీ చేశాను. కొంత గుడ్డ మిగిలింది. మీక్కూడా తెచ్చి ఇస్తా· దుప్పట్లకిందనో, తువాలాలకిందనో వాడుకోండి" అన్నాడు శాస్త్రి హాస్యరహితంగా.

"ఇంకా మీరిక్కడే ఉండిపోతా రనుకున్నానే?" అన్నదామె. ఆపాటి ఆప్యాయత కనబరచడం ఆమె కిదే ప్రథమం.

"ఉండడానికి అతనికేం? ఉద్యోగం దొరికితే మహరాజుగా ఉంటాడు" అన్నాడు శర్మగారు.

ఎందుకో శాస్త్రికి తాను వెళ్ళిపోవడం తప్పదనిపించింది. "నీ కిక్కడ ఉద్యోగం దొరకడం చాలా కష్టం. పెందలాడే గూడు చేరుకో" అన్న సలహా శర్మగారి గొంతులో ధ్వనించింది.

అయినా శాస్త్రి ఆ ధ్వనిని పాటించదలచలేదు. శాస్త్రి ఫ్యాక్టరీ నుంచి చాలించుకున్నది మొదలు శర్మగారికీ, అతనికీ మధ్య కొంత ఎడం ఏర్పడింది. శాస్త్రి అదివరకంత తరచు రావడం లేదు కూడా. వచ్చినప్పుడుమటుకు సరస్వతి మామూలుగానే మాట్లాడుతున్నది. ఏ కారణంచేతనన్నా ఆమె పనిమీద ఉండి తాపీగా మాట్లాడకపోతే, ఆ రోజు శాస్త్రికి దుర్దినంగా ఉండేది.

ఈసారి మాత్రం శాస్త్రి కృంగిపోయి ఉన్నాడు. శర్మగారి గొంతులో ఉన్న అపశ్రుతి అతన్ని మరింత కుంగదీసింది. అందుచేత ఆమె సానుభూతి కూడా అతన్ని ఉత్సాహపరచలేకపోయింది.

అతను నెలరోజులపాటు విశ్వప్రయత్నం చేశాడు ఉద్యోగం కోసం. రోజూ పత్రికలలో "వాంటెడ్"లు చూచి, తనకు సూటిగా కనిపించిన ప్రతి ఉద్యోగానికీ దరఖాస్తు పడేశాడు. ఒక ఇంటర్‌వ్యూకు కూడా వెళ్ళాడు. అభిమానమంతా చంపుకుని, ఒకసారి మలబార్‌హిల్ మీద తన పాత ప్రొప్రయిటర్ల ఇంటికి కూడా వెళ్ళి, ఏదన్నా అవకాశం వుంటే ఇప్పించమని ప్రాధేయపడ్డాడు.

వాళ్ళు చాలా సానుభూతిగా మాట్లాడారు. వ్యాపారం సరిగా సాగక నిలిచి పోయిందని విని విచారం వెలిబుచ్చారు. అతనివంటి నమ్మకస్తుణ్ణి అవకాశం వుంటే కళ్ళకద్దుకుని పెట్టుకుంటామన్నారు. కాని ప్రస్తుతం లేదనీ రాగానే తప్పక తెలియ జేస్తామనీ అన్నారు. శాస్త్రి ఒక్క నిట్టూర్పు విడిచి తిరిగి వచ్చాడు.

నెలరోజులకల్లా వంద ఖర్చయిపోయింది. ఇంకొకనెల ఇట్లాగే వుంటే, రైలు చార్జీలకు ముట్టైత్తవలసి వస్తుంది. అందుకని అతను భానుకు ఉత్తరం రాశాడు. అందులో చిన్న అబద్ధం కూడా ఆడాడు: "ఇక్కడ నాకు ఉద్యోగం దొరికే లక్షణాలు కనిపిస్తున్నై. దగ్గిర డబ్బు తగినంత లేదు. వెంటనే రెండు మూడు వందలు పంపించు."

నాలుగైదురోజుల అనంతరం, భాను దగ్గిర నుంచి జవాబు వచ్చింది. "నువ్వు అక్కడ ఉద్యోగం చేయవలసిన గతి ఏం పట్టింది? ఇక్కడ రామదాసు అయిదులక్షల మూలధనంతో బ్రహ్మాండమైన కంపెనీ పెడుతున్నాడు. మన అందరి పేరా షేర్లు తీసుకుంటున్నాం. నా దగ్గిర ఉన్న డబ్బంతా అందులో పెట్టేస్తు న్నాను. సుదర్శనంగారు కూడా అదే సలహా ఇచ్చారు. నమ్ముతావో, నమ్మవో-నా దగ్గిర ఈ క్షణాన ఇరవై రూపాయలకంటె లేవు. నిన్ను వెంటనే బయలుదేరి రమ్మని రాయమని రామదాసు మరీ మరీ చెప్పాట్ట. కొత్త కంపెనీలో నీకు మంచి ఉద్యోగం ఉందిట. షేరుకూడా ఉంటుందిట...."

ఈ ఉత్తరం శాస్త్రి మనసును చుట్టుకునివున్న గుబులును పోగొట్టింది. సుదర్శనంగారు ఏదైనా చెయ్యడానికి సామర్థ్యం కలవాడు. రామదాసు-ఏమో, ఎట్లా తయారవుతున్నాడో ఎవరు చూశారు? వాళ్ళు ఏదైనా చేయగలవాళ్ళు. తను ఒకరి కింద పనిచేసే దానికన్నా, అయినవాళ్ళతో పడివుండడం మేలు. మొత్తం మీద ఇది సువార్తే. బొంబాయి విడిచి పెడితేనేంగాక ! ప్రపంచం అంతకంతకు చిన్నదవుతున్నది గాని, పెద్దది కావడంలేదు.

శాస్త్రి పట్నం వెళ్ళడానికి సిద్ధపడ్డాడు. మర్నాడు ఆదివారం. అతను టాక్సీలో తన దగ్గిర మిగిలిన నేతబట్ట యావత్తూ వేసుకుని శర్మగారింటికి వెళ్ళాడు. వాళ్ళతో అంతా చెప్పాడు. ఈవార్త చిన్నశర్మగారికి కూడా నచ్చింది. ఈసారి ఆయన గొంతులో అపస్వరాలు లేవు.

అతను వచ్చేసేటప్పుడు కొంచెం సెంటిమెంటల్‌గా, "ఇన్నాళ్ళూ మీరు నాకు బంధువులల్లే ఉన్నారు. నాకు మీ ఇల్లు సొంత ఇల్లల్లేనే ఉన్నది. బహుశా నేను బొంబాయికి చుట్టపుచూపుగా తప్ప రాను. మరిచిపోకండి. నా ఎడ్రసు ఉంచండి. మీలో ఎవరు ఎప్పుడు మద్రాసు వచ్చినా, మా యింటికి రాకుండా వెళ్ళ

పోవద్దు. మీ ఎడ్రసు నాకు తెలుసు. కాని ఇది మారే పక్షంలో, ఒక్కకార్డు రాసి తెలియ జెయ్యండి" అని చెప్పాడు.

అతను వాళ్ళింటోనే ఆ పూట భోజనం చేశాడు. అతను వెళ్ళిపోయే టప్పుడు పసిపిల్లల దగ్గిరనుంచీ దిగివచ్చి వీధిగేటుదగ్గిర నిలబడ్డారు. సరస్వతి అతనికేసి కళ్ళుపెట్టుకు చూసింది. కాని ఏమీ మాట్లాడలేదు.

# 3

సొంతాన దగా కంపెనీలు పెట్టడం రామదాసు కృషిలో మొదటి దశ. ఈ దగా కంపెనీలమీద అతను సంపాదించినది అతని తండ్రి పదేళ్ళ సంపాదనతో సమానం.

రెండవ దశ జాయింట్ స్టాక్ లిమిటెడ్ లయబిలిటీ కంపెనీలు. ఇవికూడా దగా కంపెనీలే. వీటిలో రెండు పెద్దవీ, ఒకటి చిన్నదీనూ. వీటి ప్రాస్పెక్టసులు చూస్తే, భారతదేశపు భవిష్యత్తు యావత్తూ ఇటువంటి కంపెనీలపైనే ఉన్నదని పిస్తుంది. ఆ మాట అనిపించబట్టే యుద్ధకాలంలో నాలుగు పిచ్చికలు చేరిన వాళ్ళంతా, తమ డబ్బు తెచ్చి ఈ కంపెనీలలో కుమ్మరించారు. ఇవి దగా కంపెనీలని సుదర్శనానికి కూడా తెలీదు - రామదాసుకూ; అతని తోడుదొంగలు ఒక రిద్దరికీ మాత్రమే తెలుసును.

కంపెనీలలో విశ్వాసంతోబాటు, సుదర్శనం ఇంకొకటికూడా ఆలోచించాడు. తన కొడుకు కొంత వ్యాపారదక్షత కనబరుస్తున్నాడు. వాడి బుద్ధి ఉత్పత్తి మీదికి మళ్ళుతున్నది. ఉత్పత్తిలో డబ్బున్నదని యుద్ధకాలం రుజావు చేసింది. వాడి కంపెనీలలో తానూ, బానూ డైరెక్టరు షేర్లు తీసుకుంటే, తన రెండు సంసారాల మధ్యా బంధాలు ఇంకా పెంపొందుతై. అంతా ఒకే కుటుంబం అయి పోయే అవకాశం ఉన్నది.

శాస్త్రి బొంబాయినుంచి దిగేసరికి, సౌహార్దం తేనెజల్లుగా ఉన్నది.

రామదాసు శాస్త్రిని చూచి, స్వర్గాన్ని చూసినంత ఆనందం వెలిబుచ్చాడు. "నేను నిన్ను కొంచెం కూడా తప్పు పట్టలేదు. మోసమంతా ఈ చివరే జరిగింది. ఈ రోజుల్లో మనుష్యులను నమ్మడం ఎంత ప్రమాదకరమో నేను జన్మ జన్మాలకూ జ్ఞాపకం ఉండేట్టు తెలుసుకున్నా నన్నమాట! నీకు బాధ కలుగుతుందని వివరాలు రాయలేదు. చేనేత బట్ట తెచ్చి ఖద్దరని నా నెత్తిన రుద్దిందిగాక, తడవ కొక ధర మార్చారు. ఎప్పటికప్పుడు వాళ్ళ బిల్లు చూడడమూ, నేను షాక్ అయిపోవడమూనూ! ఏం చెయ్యాలి? నాకు కమిషన్ కింద కనీసం పదివేలు మిగులుతుం దనుకున్నాను. రెండువేలు చేతిది తగిలింది. నువ్వేమో ఆనెస్ట్‌గా నీ

ఖర్చుల కుంచుకుని, ఎప్పటికప్పుడు దగ్గిరవున్న డబ్బంతా పంపుతూ వచ్చావు అందుచేత నీకూ ఆటే గిట్టుబాటయి ఉండదు—ఆఖరుకు దిగబడిన స్టాక్ తప్ప. దాన్ని ఏపాటికి అమ్మావు?" అని రామదాసు, శాస్త్రి నడిగాడు.

"దాన్ని అమ్మడానికి నాకు గుండె చాలక ఊరికే పంచేశాను" అన్నాడు శాస్త్రి నిర్లిప్తంగా.

"కనీసం నీ మొదటి పెట్టుబడి అయినా రాబట్టలేదా?" అన్నాడు రామదాసు సానుభూతిగా.

దాన్ని ఖద్దరు ధరకు అమ్మినా నాలుగువందలు రాదు. కాని ఆ సంగతి రామదాసుతో చెప్పడం నిరుపయోగ మనిపించింది శాస్త్రికి.

"అయిందేదో అయింది. నిన్ను రెండువందల యాభై మీద ఇవాళే అప్పాయింటు చేస్తాను" అన్నాడు రామదాసు, శాస్త్రి భుజంమీద తట్టి.

ఏ మహత్తర శక్తి ఆధారంతో ఈ రామదాసు అనే అల్పజ్ఞుడు, తనకు రెండువందల యాభై మీద ఉద్యోగం ఇస్తున్నాడో, ఆ శక్తిని ధ్యానించి శాస్త్రి, 'నీ ప్రభావం ఇంతెంత కాలమో గదా!' అనుకున్నాడు.

బాల, శాస్త్రిని తీసుకుపోయి పిల్లవాణ్ణి చూపించింది. వాడు నోట్లో వేలు వేసుకుని నిద్రపోతున్నాడు. వాణ్ణి చూస్తుంటే, తన మనసులో ఏం భావాలు కలిగినదీ శాస్త్రికే తెలియలేదు. ఆతను తల ఎత్తి చూసేసరికి, బాల కళ్ళు తన మొహానే ఉండడం అతనికి కనిపించింది.

సందేహం లేదు - వాడు తన కొడుకే. తనకు వారసుడు కాడు.

"ఈ మధ్యలో రానేలేదే?" అన్నది బాల. అందులో దైన్యమూ లేదు; సాధింపూ లేదు.

"రావడమూ, రాకపోవడమూ నా చేతిలో ఉందా? పరాధీనుణ్ణి. బొంబాయిలోనే ఉండమన్నారు, ఉన్నాను; వచ్చెయ్యమన్నారు, వచ్చేశాను. నాకు ఒక్క ఉత్తరం కూడా రాయనివాళ్ళ నేమనాలి?" అన్నాడు శాస్త్రి, బాలపైన లేని మమకారం ప్రకటించడానికి, పరిస్థితుల బానిసలాగా ప్రయత్నిస్తూ.

"పాపకు మా నాన్నగారి పేరు పెట్టాం" అన్నది బాల, శాస్త్రి మాట విననట్టు.

"ఏమిటో ఆ పేరు?"

"గంగాధరం."

"బాగానే ఉంది."

బాల పిల్లవాడి నుదుటిమీద జుట్టు ఎగదొయ్యటానికి వంగి వంగి, "సాయంకాలం ఆరింటికి—ఆ ఇంట్లో!" అన్నది చిన్న గొంతుతో.

శాస్త్రి ఒళ్లు ఝల్లుమన్నది. అతని జీవితంలో స్త్రీ సుఖం లోపించిన మాట అబద్ధం కాదు. బొంబాయిలో అతను గడిపిన ఆఖరి నెలల్లో అతని మనస్సు చిరాకుతోను, భాను రాసిన ఉత్తరాలవల్ల కలిగిన వ్యథతోను, రామదాసు మీద ఏర్పడిన అనుమానాగ్రహాలతోను కలవరపడి ఉండి, జీవితమంటే అతనికి అసహ్యం పుట్టింది. కేవలం పలాయనేచ్ఛతోనే అతను బొంబాయిలో ఉండిపోవాలని చూచాడు. కాని తీరా మద్రాసువచ్చి పరిస్థితులన్నీ చూచినాక, అంతా తృప్తికరంగానూ, సుఖమయంగానూ ఉన్నది. భాను తన కష్టాలను ఊహించుకున్నది. పద్మకు ఏమీ కాలేదు. నిక్షేపంగా ఉంది. రామదాసు, తాను అనుకున్నంత భ్రష్టుడు కాడు. రామదాసులో తాను అసూయపడవలసిన ఘనత ఏమీ లేకపోయినప్పటికీ, ఏదో శ్రమపడి కిందూ - మీదూ చెయ్యటానికి ప్రయత్నిస్తున్నాడు. వాడు సమర్థుడని సుదర్శనంగారివంటి అనుభవశాలే ఒప్పుకున్నాడు....తాను ఇక మళ్ళీ తన భవిష్యత్తు గురించి తడువుకోనవసరం లేదు. రామదాసు పరిచిన రెక్కకింద తాము నలుగురూ సుఖంగా బతకవచ్చు. జీవితంలో తనకు ఆపాటి స్థాయి చిక్కితే, శాస్త్రి తన బుద్ధిని పత్రికలపైనా, జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలపైనా, ఆర్థిక, సాంఘిక సమస్యలపైనా, ఆర్థిక ప్రణాళికల వైనంపైనా, సోషలిజంపైనా కేంద్రీకరించదలిచాడు. ఈ విషయంపైన అతనికి బొంబాయిలో ఉండగా కలిగిన అభిరుచి తృప్తికరంగా తీరనేలేదు.

ఈ క్షణానవున్న మనస్తత్వంలో, శాస్త్రికి, బాలతో తనకు సాగుతున్న ప్రణయం అపూర్వమైనదనీ, దాన్ని తాను సరిగా విలువ కట్టలేదనీ, సరస్వతి మీద తనకున్న భావంకన్న, బాలతో తనకున్న సంబంధం నిజమైన ప్రేమకు దగ్గరే మోననీ అనిపించింది. అతను బాలను, తనకోసం సోలిపోతున్న దానిలాగా ఊహించుకున్నాడు.

కాని ఇది భ్రమ అని ఆ సాయంకాలం అతనికి స్పష్టంగా రుజువయింది. బాల వైఖరిలో ఆత్మార్పణంలాంటి దేమీ లేదు. ఆమె వస్తూనే "బొంబాయి వెళ్ళినాక ఎంతమంది అయినారు?" అన్నది. శాస్త్రికి ఆ ప్రశ్న మొదట అర్థమేకాలేదు. అర్థమైనాక, కోపం వచ్చింది. తాను బొంబాయిలో ఏ సంకటాల పాలై వచ్చాడో తెలుసుకోవడానికే అడిగిందని తెలిసినాక, ఆ కోపం చల్లారింది.

అతను, ఆమెను పిల్లవాణ్ణి గురించి అడగడానికి బిడియపడి మానేశాడు. కాని రామదాసు ఏమన్నా మారాడా అని అడిగాడు. బాల తల అడ్డంగా తిప్పింది. తాను బొంబాయిలో ఉన్న కాలంలో, ఆమె యితర ప్రియులను సంపాదించుకున్న దన్న అనుమానం అతనికి తగలనుకూడా లేదు. అందుచేత ఆమె తనను అడిగిన ప్రశ్న వంటిది, తాను అడగలేదు.

నూతిలో గొంతులాగా ప్రేమ ఆమెచేత ఒకటి రెండు మాట లనిపించింది. "నువ్వు లేకపోతే నా గతి ఏమైవుండును?.. మళ్ళా ఎక్కడికీ వెళ్ళిపోకూ...."

"మన రహస్యం ఎంతకాలం దాగుతుందని నీ నమ్మకం?" అని అతను అడిగాడు.

"నే వీళ్ళకు భయపడతా ననుకుంటున్నావా? భయపడితే బాగుండును— ఈ రహస్యం, నాకూ అసహ్యంగానే ఉంది....ఆ దుర్గాంబ అననే అన్నది- పిల్లవాడి కెక్కడో నీ పోలిక ఉన్నదని....ఎందు కుండగూడదని అందామని నోటిదాకా వచ్చింది" అన్నది బాల ఆపుకోలేని అహంకారంతో.

శాస్త్రి గుండెల్లో రైళ్ళు పరుగెత్తినై. బాల నిజంగా ఇంత సాహసానికి ఒడిగడితే, తనకొక భార్యా, పిల్లలూ, సంసారమూ ఉండదు. తన జీవితం స్త్రైకాయ జీవితమే. తాను పూర్తిగా రామదాసు చేతిలో కీలుబొమ్మే. రామదాసు తనను డబ్బు చేసుకోవడానికి ఉపయోగిస్తాడు. అతని పెళ్ళాం, తనను, పిల్లలను- రామదాసు వారసులను-కనడానికి ఉపయోగిస్తుంది.

అయినా బాలతో తెగతెంపులు చేసుకోవాలని శాస్త్రికి తట్టలేదు. రెండుమూడు గంటలు అతను ప్రపంచాన్ని పూర్తిగా మరిచి, ఆనంద సముద్రంలో మునిగితేలాడు.

# 4

ఎవరి సహజ స్వభావం ఏమిటో ఎవరూ చెప్పలేరు. భాను పెరిగిన పరిస్థితిలో పెరిగితే, పద్మ, అచ్చంగా భానుమాదిరిగా పెరిగి ఉండేదేమో! భాను ఉద్రేకాలకు ఎన్నడూ బానిస కాదు. ఆమె సులువుగా ఆగ్రహించదు; ఎంతో దుఃఖం వస్తేనే గాని పైకి ఏడవదు. ఆఖరుకు కామోద్రేకం కూడా ఆమెను ఇష్టం లేని పనికి ఎన్నడూ ప్రేరేపించలేదు. సుదర్శనం తనకు ఏకైక శరణ్యం కావటమూ, రసికుడూ, తనను మనస్ఫూర్తిగా ప్రేమించినవాడు కావటమూ మూలంగా, ఆమె ఆయనకు లోబడింది గాని, లేకపోతే ఆమె చచ్చినా ఆ పని చేసి వుండదు.

పద్మ సహజ ప్రవృత్తి అదే అయివుండాలి కాని ఆమె తన స్వభావానికి భిన్నమైన వాతావరణంలో పడింది. ఆమె తొందరపడి, రంజనానికి తన మనస్సిచ్చే సింది. ఆ తరువాత అతని తల్లిపట్లా, అక్కపట్లా "హృదయ వైశాల్యం" అవలం బించింది. కోమలకున్న స్వేచ్ఛలో తనకు పదో వంతైనా ఉండగూడదా అనుకుని, రంజనంతో ప్రేమసల్లాపాలకు కూడా దిగింది.

తెరచాటున పద్మకు అవాంఛనీయమైన అనుభవాలు జరిగినై. ఒకనాడు సాయంకాలం రంజనం, ఆమెను తన తల్లి యింటికి తీసుకుపోయినాడు. వాళ్ళు భోజనం చెయ్యమని నిర్బంధించారు. భోజనమైనాక రంజనం ఒక గంటలో

వస్తానని వెళ్ళిపోయినాడు. అతను వెళ్ళినాక, ఒక అరగంటకు ఇద్దరు మిలటరీ వాళ్ళు వచ్చారు. ఒకడు రంజనం అక్కకు ప్రియుడు.

పద్మను ఎంతో మంచిగా వెళ్ళి పడుకోమన్నారు. ఆమెకు నిద్ర పట్టలేదు. కాస్సేపటికి రెండో మిలటరీవాడు ఆ గదిలోకి వచ్చాడు. ఆ రాత్రి, పద్మ వాడితో గడిపి, వాడు నిద్రపోయినాక నిశ్శబ్దంగా ఏడుస్తూ కూచున్నది....

ఆ తరవాత రంజనం పద్మకు క్షమాపణ చెప్పుకున్నాడు. తను తిరిగి రావటానికి అవకాశం లేకపోవటం చేత ఇంతపని జరిగిందని, తన అక్క మంచిదేనని, ఈ బుద్ధులన్నీ తన తల్లివేనని, అందుకే ఆవిణ్ణి పోలీసులు రెండు సార్లు అరెస్టుచేసి జైల్లో కూడా వేశారని చెప్పాడు.

పద్మకు జరిగిన ఈ అనుభవం ఒళ్ళు పై తెలియని పట్టణపు పిల్లలకు, అండాదండా లేని అనాధ బాలికలకు జరుగుతుంది. పద్మ ఈ రెండు తరగతుల కిందకి రాకపోయినా, ఇటువంటి అనుభవం పొందడమేగాక, అమాయకురాలు కావడంతో, రంజనం క్షమాపణను స్వీకరించింది. అయితే ఆమె ఈ సంగతి తల్లి దగ్గర దాచలేదు. ఆ తల్లి కూతుళ్ళ మధ్య రహస్యాలు లేవు. భాను లబలబ లాడి, ఆ రంజనంతో స్నేహం మానెయ్యమన్నది. తల్లి ఆ మాట అన్న తరువాత పద్మకు తెలిసివచ్చింది, రంజనం క్షమాపణ బూటకపు క్షమాపణ అని. అతను తల్లిని ఏ మాటలన్నప్పటికీ తల్లితో చాలా సఖ్యంగానే ఉంటున్నాడు.

భాను ఈ విషయాన్ని ఇంతటితో పోనివ్వక, సుదర్శనం గారితో చెప్పింది. ఆయన మండిపడ్డాడు. ఆరోజే ఆయన రామదాసుతో "మనకు ఈ పింప్‌గాడు ఎక్కడ దొరికాడురా? ఆ రంజనాన్ని వెంటనే డిస్మిస్ చెయ్యి" అంటూ, జరిగిన సంగతి అంతా చెప్పాడు.

రామదాసు అంతా విని, "మనం మన నౌకర్ల ప్రైవేట్ విషయాలలో జోక్యం కలిగించుకోవటం అంత మంచిది కాదు, నాన్నా. అయినా మనపద్మకు సంబంధించిన విషయంగనక, రంజనాన్ని సంజాయిషీ అడుగుతాను. ఏంచెబుతాడో?" అన్నాడు.

అతను రంజనంతో ఏమి మాట్లాడాడో, లేదో కూడా సుదర్శనానికి తెలియదు. రంజనం ఉద్యోగం ఊడనేలేదు. రామదాసుమటుకు, పద్మకు ఒంటరిగా చిన్న లెక్చరిచ్చాడు. "మన స్థాయిలో వున్నవాళ్ళు బెదురుగొడ్లల్లే ఉండరాదు. ఫ్రీగా అందరితోను మిక్స్ కావాలి. అమెరికాలో ప్రతి అమ్మాయి తనకు నచ్చిన అయిదారుగురితో కాపరం చేసి చూసి, ఎవడితో జీవితం ఎక్కువ సుఖంగా వుంటుందని తోస్తే, వాణ్ణే పెళ్ళాడుతుంది. నీకూ, రంజనంకూ లవ్ ఎఫేర్ జరిగిందని నాకు తెలుసు. అందులో తప్పు లేదు. వాళ్ళింటో నీకు జరిగిన అనుభవం

గురించి; నిజంగా ఆ ఫెండు కావలసినవాడు రంజనం. ఆతను నీ తప్పేమీ లేదనీ, తప్పు మొదట తనదని, తరువాత వాళ్ళమ్మదనీ నాతో సిన్సియర్‌గా చెప్పాడు. కోమలచూడు—మోడరన్ గరల్స్ అలా వుండాలి. చాలా ఎడ్వెంచర్స్ చేస్తుంది. ఒక్కదాన్ని గురించి కూడా రెండో మనిషికి చెప్పదు. నీకు అనుభవంలేక, ఈ సంగతి ఇంతమందికి తెలియనిచ్చావు. లైఫ్ ఎన్జాయ్‌చెయ్యి. పద్మా! ఎన్జాయ్ చెయ్యి! చిన్న చిన్న ప్రమాదాలుంటే, ఆదుకోవడానికి నేనున్నానుగద! కోమలకు ఈ మధ్య కొంత మెడికల్ హెల్ప్ అవసరమయింది. డబ్బు పారేస్తే అన్నీ అందుబాటే; తెలిసింది గదా?"

అంతా విన్నాక, పద్మకు ఒక్కటే అర్థమయింది. ఆతను తనను కూడా కోమలలాగే కారుడ్రైవరు మొదలుకొని అడ్డమైనవాళ్ళతోనూ పొమ్మనీ, కడుపు అయితే తాను తీసేయిస్తాననీ చెబుతున్నాడు; మాటల పటాటోపం పక్కకి నెట్టితే, రామదాసు చెప్పినది కూడా నిజానికి అంతే. అట్లా మాటల అంతరార్థం తియ్యటం రాజకీయాలలోనూ, సంఘంలోనూ కూడా అనాగరికత అనిపించుకుంటుంది. కాని ఏం చెయ్యాలి? సంఘంలో నాగరికత సరిగా అబ్బని పద్మలాటివాళ్ళూ, అబ్బే అవకాశంలేని అసంఖ్యాకులైన శ్రామికులూ ఉన్నారు. వాళ్ళు నగ్నసత్యాలను మాత్రమే గ్రహించగలరు.

రామదాసు, పద్మకు ఈ ఉపన్యాసం ఊరికే ఇవ్వలేదు. ఈ అవకాశం తీసుకుని, అతను తన పవిత్రమైన రెక్కను పద్మమీదకూడా పరిచాడు. జీవిత మాదుర్యం సులువుగా అందేటట్టు అతడు పద్మను తన మిత్రులు కొందరితో తిప్పాడు. రామదాసు కోటీశ్వరుడు అయ్యే ప్రయత్నంలో, అతనికి పట్టుగొమ్మలుగా ఉపయోగించే గొప్ప గొప్పవాళ్ళంతా పద్మపట్ల ఆదరాభిమానాలు చూపారు. పద్మ గొప్ప గొప్ప హోటళ్ళలో విందు లారగించింది. వీశెలకొద్దీ ఐస్‌క్రీమ్, ఫ్రూట్ సాలెడ్ తిన్నది. షాంపేన్ కూడా ఒకసారి తాగింది. అది ఆమె నోటికి ఎందుకో పులి మజ్జిగ రుచిగా తగిలింది. కాని శరీరం బరువు లేకుండా గాలిలో తేలిపోతున్నట్టయింది. నవ్వాలనిపించింది. ఆమెను ఎవరో ముద్దు పెట్టుకున్నారు. "పెట్టుకోనీ!" అనుకున్నది పద్మ కళ్ళు తెరవకుండా. మర్నాడు ఝాముపొద్దెక్కి సుదర్శనంగారి ఇంటి గదిలో నిద్ర లేచినప్పుడామెకు హోటలుగది తరవాత జరిగిన వృత్తాంతాలేమీ జ్ఞాపకం లేవు.

త్వరలోనే పద్మ ఆనందాన్ని మనుషులనుంచి వేరుచేసి, అనుభవించటం నేర్చుకున్నది. ఖరీదైన చీరలు కట్టటం, ఎత్తుమడమల బూట్లు వేసుకోవటం, కార్లలో షికార్లు కొట్టటం, జిడ్డు వదిలించే హోటళ్ళలో కూచుని ఐస్‌క్రీములు తినటం, సినిమాలను గురించి మాట్లాడటం, ఎక్కడ కూచున్నా పదిమంది

దృష్టిని ఆకర్షించటం, జేబుల్లో వందరూపాయల నోట్ల బొత్తులు పెట్టుకు తిరిగే యువకుల ప్రేమాలాపాలు వినటం, వారి ఆలింగనాలలో ఒదిగిపోవటం - వీటిలో పద్మకు స్వర్గసౌఖ్యాలు కనిపిస్తే, తప్పుపట్టే అధికారం ఎవరికున్నది? ప్రపంచం మిధ్య అని చెప్పేవారు, ప్రపంచంలో జీవిస్తున్నారు; సుఖాలు మిధ్య అనుకున్న వాళ్ళు కూడా సుఖాలలో జీవించవచ్చు.

రామదాసు పద్మ చేత వేశ్యావృత్తి చేయించాడనలేం. అతను తన స్నేహితులను "ఒబ్లెయిజ్" చేశాడు. వాళ్ళు అతని కంపెనీలలో షేర్లు కొనియుండవచ్చు. అతనికి అనుకూలించే ఇతర సహాయాలూ, సదుపాయాలూ చేసి యుండవచ్చు. ఒళ్ళు అమ్ముకునేవాళ్ళు చిన్న మొత్తాలను గురించి ఆలోచిస్తారు. వాళ్ళు చేసే పని చట్ట వ్యతిరేకం. రామదాసు పెద్ద మొత్తాలను చట్ట ఉల్లంఘన లేకుండా సంపాదించాడు. పద్మ పరాయిదని ఈ పని చేశాడనుకున్నా అన్యాయమే అవుతుంది. పద్మ పాటి ఆకర్షణ ఉంటే అతను తల్లినీ, చెల్లినీకూడా స్నేహితులకు తార్చివుండును. కాని వాళ్ళు అందుకు బొత్తిగా పనికిరారు. అతను ఒక్కసారే భానును ఈ విధంగా ఉపయోగపరచ యత్నించాడు. కాని ఆ ఎత్తు పారలేదు. భాను వైరిదాగు లది కాదు.

పరిస్థితులు ఈ దశలో ఉండగా, భాను తమ్ముడికి ఉత్తరం రాసింది. శాస్త్రి వచ్చేసరికి పరిస్థితులేమీ మారలేదు గాని, పద్మలో తప్పు చేశాననుకునే మనిషి లక్షణాలేమీ లేవు. ఆమె శాస్త్రి అనుకున్నట్టు, నిక్షేపంగా ఉన్నది. ఆమె ఒంటినిండా వాళ్ళు ఇచ్చిన బహుమతులు—రిస్టువాచీ, ఉంగరాలూ, మెళ్ళో రెండు మూడు రకాల గొలుసులూ ఉన్నై. ఇవిగాక వానిటీ లేసులూ, పెర్‌ఫ్యూమ్ బుడ్డీలూ, దంతపు దువ్వెన్నా-ఇంకేమేమిటో ఉన్నై ఆమె గదిలో.

పద్మ ఇప్పుడు రంజనంతో స్నేహం మానేసిందని విని శాస్త్రి చాలా సంతోషించాడు. పద్మ చెడిపోవటంలేదు, బాగుపడుతున్నది - భాను ఎందుకు కంగారు పడింది.

మళ్ళీ అందరూ సుదర్శనంగారి ఇంట్లోనే ఉంటున్నారు. శాస్త్రి కూడా అక్కడే ఉంటున్నాడు. భాను వాళ్ళిల్లు, అతనూ, బాలా కలుసుకోవడానికి పనికి వస్తున్నది.

శాస్త్రి వచ్చిన రెండు వారాలకు ఒక చిత్రం జరిగింది. అతను ముందుగానే వచ్చాడు. వరండాలోకి రాగానే కాలికింద ఉత్తరం తగిలింది. అతను ఎత్తి చూస్తే దానిపైన తన పేరున్నది. కవరు చించి చూస్తే అది సరస్వతి రాసిన ఉత్తరం. తనకు సరస్వతి ఉత్తరం రాసింది.

శాస్త్రి ఉత్తరాన్ని జేబులో పెట్టుకుని, తలుపు తెరచి లోనికివెళ్ళి, డ్రాయింగ్ రూమ్‌లో కూచుని ఉత్తరం చదవసాగాడు.

తను ఉద్యోగం మానుకోవలసివస్తుందనీ, తన తండ్రికి మద్రాసు బదిలీ అవుతున్నదనీ, త్వరలోనే చూస్తాననీ, శాస్త్రికి ఈ పాటికి ఉద్యోగం దొరికిందను కుంటాననీ సరస్వతి రాసింది. జవాబు రాయమని అర్థిస్తూ ఉత్తరం ముగించింది.

అతను ఆ ఉత్తరంలో నిమగ్నుడై ఉండి, బాల కాలి చప్పుడు వినలేదు.

"ఏమి టా ఉత్తరం? ప్రేమలేఖా?" అన్నది బాల హాస్యానికన్నట్టుగా.

"అవును, చూడు!" అంటూ శాస్త్రి ఆ ఉత్తరాన్ని బాల కిచ్చాడు.

"నే నింకొకరు వ్రాసిన ప్రేమలేఖలు చదవను-నేనై రాయను" అన్నది బాల, యీసడింపుగా.

"చదవకుండా అది ప్రేమలేఖ అయినదీ, కానిదీ ఎట్లా తెలుస్తుంది?" అన్నాడు శాస్త్రి.

చేతిరాత చదివేపాటి ఇంగ్లీషు తనకు రాదని చెప్పక, బాల ప్రణయకోపం అవలంబించింది. శాస్త్రి తాను నిర్వహించవలసిన పాత్ర సత్యభామ దగ్గిర కృష్ణుడి దని అర్థం చేసుకుని, చాతనయినమటుకు బాల అలక తీర్చాడు.

మామూలుకన్న ఆనాడు చాలా ఎక్కువ సుఖం పొందినట్టు కనబడింది. తనపాలిటి కీ ప్రబంధ నాయిక దొరికినందుకు శాస్త్రి ఇంకోసారి ఆశ్చర్యపడ్డాడు.

# 5

శాస్త్రికి తన ఉద్యోగం ఏమిటో స్పష్టంగా తెలియలేదు - బాల కింకొక ప్రియుడుగానో, ప్రియకింకరుడుగానో ఉండటం తప్పితే, అప్పుడప్పుడూ పిక్‌నిక్‌లు తగులుతూ ఉండేవి. అతను ఏ నెలా జీతం తీసుకోలేదు-అంటే, ఎవరో అతన్ని పిలిచి, "ఇదిగో, నీ కిందటి నెలజీతం" అని డబ్బు చేతిలో పెట్టలేదు. స్టాంపు వేసిన రసీదులపై జీతం ముట్టినట్టు సంతకం మాత్రం పెడుతున్నాడు.

చూసి చూసి శాస్త్రి కాషియర్‌ను ఇదేమిటని అడిగితే, అతను నవ్వి, కాష్ బాక్సు చూపించి, "ఇందులో ఉన్నదంతా మీది కాదుటండీ?" అన్నాడు.

శాస్త్రి ఈ మాటకు ఉబ్బిపోక, "అది నిజమేననుకోండి! కాని ఈ డబ్బంతా నేను పట్టుకుపోతే, మిగిలిన వాటాదారులు ఊరుకోరుగా, అందుకని ఒక లెక్కంటూ ఉన్నది. గనుక ఎవరి కివ్వాలిసిన డబ్బు వాళ్ళ చేతికి...." అని ఏడి పించే ధోరణిలో మాట్లాడాడు.

కాషియర్ తన మొహంమీది నవ్వు చప్పున తీసేసి, "ఆ విషయం ఎకౌంటెంటు గారితో మాట్లాడతారా ఏమిటి? వారివ్యవహారంపే నాకే మత్యాంతరమండీ?" అన్నాడు బెట్టుగా.

కాషియర్ మాటలను బట్టి ఒక సంగతి స్పష్టమయింది. శాస్త్రికి జీతం డబ్బులు ఇవ్వవద్దని ఎవరో ఈ కాషియరుతో చెప్పారు. ఆ చెప్పినవాడు ఎకౌంటెంటు అయి ఉండవచ్చు. కాని ఆయన సొంతాన సాహసించి ఈ పని చెయ్యడు. ఇది రామదాసు పనే.

డబ్బు అవసరంకొద్దీ కాకపోయినా, ఈ ఏర్పాటు ఎటువంటిదో అంతు తేల్చుకొనే ఉద్దేశంతో, శాస్త్రి ఎకౌంటెంటు వద్దకు వెళ్ళాడు.

"మీ వాటా డబ్బు జీతంనుంచి రికవరీ చేస్తున్నాం. రామదాసుగారు ఇలా చెయ్యమన్నారు" అన్నాడు ఎకౌంటెంటు.

"మరి నాకు డబ్బు కావలసివస్తే?" అని శాస్త్రి అడిగాడు.

"మీ పేర ఎకౌంటు ఓపెన్ చేస్తాను. అత్యావసరంగా కావలసివస్తే డ్రా చేస్తూ వుండండి."

శాస్త్రి కిదంతా భారీ రాజకీయాలల్లే కనబడింది. తనకు కంపెనీలో షేర్లెందుకు? వాటికోసం ఈ నామమాత్రపు ఉద్యోగ మెందుకు? పేరు గొప్ప, ఊరు దిబ్బ అన్నట్టు! రామదాసు ఏదిచేసినా ఇట్లాగే వుంటుందని శాస్త్రికి రూఢి అయిపోయింది.

ఈ సమయంలో రామదాసు ఇంకొక గొప్ప ఏర్పాటు చేశాడు-ఆ ఏర్పాటుకు సుదర్శనం కూడా ఒప్పుకున్నాట్ట—ఇంతకాలమూ ఖాను పేర వుంటున్న ఇల్లూ, స్థలమూ బాల పేర ట్రాన్స్‌ఫర్ చేసి, వెనక ఖాను రాసిచ్చిన ప్రోనోటు కాన్సిల్ చేసి భద్రంగా సుదర్శనంగారి కిచ్చేశాడు.

"డబ్బు విలువ తగ్గిపోతున్నది. ఖానుగారికి ఈ బాకీ తీరటం మంచిది" అన్నాడు రామదాసు, ఆర్థిక సూత్రాలు కాచి వడబోసినట్టుగా. ధరలు పెరిగిన కొద్దీ ఖానుకు ఈ బాకీ తీర్చటం నష్టం. సుదర్శనంగారు ఆ విషయంలో ఆలోచించలేదు. ఆయన చూసినదల్లా తనమీదినుంచి ఒక సొద్దు పోతుందనే. తాను ఖానును పెళ్ళాడటం తన భార్యాబిడ్డలు ఆమోదించిననాటినుంచీ, ఆయన నైతికంగా నడుం విరిగినవాడై పోయినాడు.

"అదీగాక, ఖానుగారు కావలిస్తే నిరాక్షేపణగా ఆ ఇల్లు తనకిందే ఉంచుకోవచ్చు. ఈ ట్రాన్స్‌ఫర్ వట్టి ఫార్మాలిటీ, నామమాత్రం" అన్నాడు రామదాసు.

కాని ట్రాన్స్‌ఫర్ జరిగిన రోజునుంచీ ఖాను పేర నెలకు రెండువందలు అద్దె ఛార్జిచేసి, తన భార్య ఎకౌంటులో క్రెడిట్ చెయ్యమని రామదాసు ఎకౌం

చెంటుతో చెప్పాడు. ఈ "స్వల్ప" విషయం ఖానుకు గాని, సుదర్శనంగారికి గాని తెలియదు.

శాస్త్రికి ఇంటి సంగతి బాలద్వారా తెలియవచ్చింది. "ఇవాళనుంచి ఇది నా యిల్లు, ఇది నా ఖర్మ" అన్నదామె శాస్త్రితో. (ఆమె నోట మొగుడు అనే మాట రాదు.)

"ఏమిటి కథ?" అని శాస్త్రి అడిగి, జరిగిన సంగతి తెలుసుకున్నాడు. అతనికి యిదికూడ దుర్మార్గంగానే తోచింది. ఆ సంగతి అతను చెప్పటానికి యత్నిస్తే బాల వినిపించుకోలేదు. రామదాసు పేరెత్తితే ఆమెకు జెర్రులు పాకినట్టయి పోయేది. "ఆ స్వర్గానికి పోయినా విడాకులు తప్పవుట" అనే సామెత చెప్పేది. తన ఉద్యోగానికి జీతంలేదని అదివరకు చెప్పినప్పుడు కూడా ఆమె విసుక్కున్నది.

"అది కాదు, నాకు డబ్బు కావాలంటే ఎకౌంటులో తీసుకోవాలట. నేను కూడా దోపిడీ విధానాలను గురించి చదివాను గాని, ఈ పద్ధతి ఎక్కడా చూడలేదు" అన్నాడు శాస్త్రి.

"కమ్యూనిస్టల్లే మాట్లాడక, నీకు డబ్బు కావలిస్తే నాతో చెప్పు" అన్నది బాల.

బాలద్వారా డబ్బు తీసుకోవటం అతనికి చాలా నీచంగా కనిపిస్తుంది. ఆమెకు పిల్లల్ని కనటం వేరు. అది "నాచురల్ సెలెక్షన్!" ఈ నాచురల్ సెలెక్షన్‌లో, ప్రకృతి, బాలకు మరొక గర్భం ప్రసాదించినట్టు అనుమానంగా ఉంది. బాల తనకు నెల తప్పిందని చెబుతూ, "ఈసారి ఆడపిల్లయితే బాగుంటుంది" అన్నది.

ఈ మాట విని శాస్త్రి మురిసిపోలేదు. ఆ రోజే అతనికి సరస్వతి దగ్గిర నుంచి మళ్ళీ ఉత్తరం వచ్చింది. వాళ్ళు ఇంకో వారంలో మద్రాసు వస్తున్నారట. ఫలాని రోజు ఫలాని బండికి టిక్కెట్టు బుక్ చేసుకొన్నామని ఆమె రాసింది.

సరస్వతి మొదటి ఉత్తరానికి సమాధానం రాసినప్పుడు శాస్త్రి తనకు ఉద్యోగమయిందనీ, తన బావగారి కంపెనీలోనే పనిచేస్తున్నాననీ రాశాడు. కాని ఆమె వచ్చినాక ఆమెతో తన పరిస్థితి అంతా చెప్పేసి, తను ఇంకా నడిసముద్రం లోనే ఉన్నాననీ, ఎటు చూసినా తీరం కనిపించటం లేదనీ చెప్పేద్దామనుకున్నాడు. సరస్వతి తనను ఏ విధంగానైనా బయటపడేస్తుందని అతని మనసులో ఒక అస్పష్టమైన ఆశ ఏ మూలో ఉన్నది. దానికి ఆధారం ఏమీ లేదు.. అర్థంలేదు. కాని; మునిగి పొయ్యేవాడు గడ్డిపరక పట్టుకుంటాడు.

ఒక్కోసారి శాస్త్రికి తాను నడిసముద్రంలో మునిగిపోతున్నానన్న భావం కేవలం తన కల్పనే అనిపించేది. అటువంటప్పుడు అతను వేదాంతం తెచ్చుకునేవాడు! నిండా మునిగినవాడికి చలేమిటి? రామదాసు తనవంటి పుట్టు దరిద్రుడి దగ్గిర ఏం కాజేస్తాడు? "నీకు షేర్లు లేవు, ఏమీ లేవు. ఇవాళ నుంచి ఉద్యోగం కూడా లేదు" అని రామదాసు అన్నప్పటికీ, తనకు నష్టమేమిటి? తలకొట్టి మొలెయ్యడు గదా! జైలుకు పంపడుగదా! ఒకవేళ పంపితే మాత్రం నష్టమేమిటి? ఆ జైలునుంచి బయటికి రావటమే, తన స్వేచ్ఛా జీవితానికి ప్రారంభమనుకుంటే సరిపోయె!

ఈ విధంగా అనుకున్నప్పుడు కాస్సేపు శాస్త్రికి మనస్సు తేలికగా ఉండేది. కాని మళ్ళీ గుబులు ఆవరించేది; తామరాకుమీది నుంచి నీటిబొట్టు కాస్తా జారిపోయేది. అందుకు రెండు కారణాలు : ఒకటి. భాను గురించీ, పద్మ గురించీ అతని మనస్సు తెలిసీ, తెలియకుండా కూడా అస్తమానం ఆందోళనలో నలిగిపోతూంటుంది. నిజానికి వారిద్దరికి కొండంత అండ సుదర్శనం ఉన్నాడు. కాని ఆ సుదర్శనం ఇటీవల శాస్త్రికి వట్టి అసమర్థుడిగా కనిపిస్తున్నాడు. ఆయన సమర్థుడైతే, రామదాసు ఈ ఆటలన్నీ ఎట్లా ఆడుతున్నాడు?

శాస్త్రి మనస్సుకు వేదాంతం అంటకపోవడానికి రెండో కారణం బాల. బాల మీద తనకు నిజమైన ప్రేమ లేనందుకూ, ఆమె ప్రేమించదగిన మనిషి కానందుకూ శాస్త్రి చాలా సార్లు విచారించాడు. తమ ఇద్దరి మధ్యా నిజమైన ప్రేమ బంధమే ఉంటే, అతను కత్తెర బోనులో తలపెట్టమన్నా పెట్టగలడు. కాని బాలతో తనకున్న సంబంధం ప్రేమబంధంకాదు, సంకెళ్ళు. రామదాసు భవిష్యత్తును గురించీ ఏమి పథకాలు ఆలోచిస్తున్నదీ తెలుసుకోవటం ఎంత కష్టమో, బాల ఆలోచిస్తున్న ఆలోచనలను గురించి ఊహించడం కూడా అంత కష్టంగానే ఉన్నది శాస్త్రికి....అతని మనస్సును తొలుస్తున్న అస్పష్టమైన భయాలలో ఒకటి, ఇదివరకే రామదాసు తమ రహస్యం - బాలకూ తనకూ గల సంబంధం - విషయం తెలుసుననీ, తననూ భానునూ, పద్మనూ కాలబెట్టి నేలరాయటానికి, ఈ రహస్యాన్ని ఎప్పుడో ఎట్లాగో ఉపయోగించుకుంటాడనీనూ.

రానురాను శాస్త్రికి రామదాసంటే నిస్సందేహంగా అసహ్యంతో బాటు భయం కూడా పెరుగుతున్నది. కాని రామదాసు దుష్టుడని ఇంకొక ప్రాణిని ఒప్పించడానికి, శాస్త్రి దగ్గర కొంచెం కూడా ఆధారంలేదు. ఈ భయం రాను రాను ఒక అబ్సెషన్ కింద - ఒక మనోవ్యాధిలాగా - తయారవుతున్నది. ఈ మనోవ్యాధినుంచి బయటపడాలంటే, అతనికి మరొకరి ఆధారం కావాలి. తన్న

చుట్టుప్రక్కల ఉండేవారిలో, అతని మనస్సుకు బలం ఇచ్చేవాళ్ళు ఒక్కరూలేరు. సరస్వతి ఆ పని చెయ్యగలుగుతుందని అతనికి ఏదో ఆశ. ఈ స్వార్థంతోనే అతను ఆమె రాకకోసం ఎదురు చూడసాగాడు.

# 6

పెద్ద శర్మగారి కుటుంబాన్ని రిసీవ్ చెయ్యటానికి శాస్త్రి సెంట్రల్ స్టేషనుకు వెళ్ళాడు. రైలు పావుగంట మాత్రమే లేటు. చిన్నపిల్లలు శాస్త్రి కాళ్ళు చుట్టేసుకుని "మామా, మామా!" అన్నారు.

పోర్టర్లు సామాను దించుతుంటే, వాళ్ళకు అడ్డంగా ఉన్నానని తెలుసుకొన్నా, సరస్వతి, శాస్త్రి పక్కనే వచ్చి నిలబడింది. ఆమె తలకు ఒక రుమాలు చుట్టుకొని గడ్డం కింద ముడివేసింది. ఎవరేమనుకున్నా సరేనన్నట్టు, శాస్త్రి ఆమెకేసి అదే పనిగా చూశాడు. కొన్ని ప్రకృతి దృశ్యాలు ఎంతసేపు చూసినా చూడాలని పిస్తుంది—సరస్వతిలో కూడా అదే లక్షణం ఉన్నది. మందలో చేర్చటానికి వీల్లేని మనిషి!

శర్మగారు బొంబాయి అలవాటు చొప్పున పోర్టర్లతో హిందీ, మరాఠీ కలిపి మాట్లాడేస్తున్నాడు. శాస్త్రి ఆయనకు సహాయం వెళ్ళాడు. ఒక హోటలువాడు జోరీగలాగా తగులుకుని, వసంతా లాడ్జికి రమ్మని ఆహ్వానిస్తున్నాడు.

"అన్నట్టు మీరు ఎక్కడ దిగుతున్నారు?" అని శాస్త్రి, శర్మగారిని అడిగాడు.

"ఒక వారంపాటు హోటల్లో ఉండటానికి ప్రిపేరై వచ్చాం" అన్నాడు శర్మగారు.

"వద్దు, మా ఇంటికి రండి. ఇల్లు ఖాళీగానే వుంది" అన్నాడు శాస్త్రి. ఆ ఆలోచన అతనికి ఆ క్షణంలోనే తట్టింది.

శర్మగారు పస్తాయించి తన భార్యకేసి చూచాడు. ఆవిడ "వాళ్ళని బాధించటమెందుకు? బోలెడన్ని హోటళ్ళున్నై" అన్నది. ఇది కేవలం మొహ మాటమేననీ, వారం రోజులపాటు ఇల్లు దొరికితే, వాళ్ళకేమీ అభ్యంతరం లేదనీ శాస్త్రి గ్రహించాడు.

రెండు టాక్సీలలో సామానుతో సహా అందరూ భానువాళ్ళ ఇంటికి చేరారు. ఇంటి ప్రక్కనే గుడిసెలో ఉంటున్న పనిమనిషి వచ్చి ఇల్లంతా శుభ్రం చేసింది.

"ఇట్సె బ్యూటిఫుల్ హౌజ్!" అన్నది సరస్వతి నిష్కపటంగా.

"ఇది మా సిస్టర్ ఇల్లు" అన్నాడు శాస్త్రి. ఈ ఇల్లు బాల పేర మారిన సంగతి అతను అప్పుడే మరచిపోయినాడు.

"ఈ పూటకు హోటలునుంచి తెప్పించుకు తిందాం" అన్నది సరస్వతి.

"ఇల్లు కుదిరినదాకా హోటలునుంచే తెప్పించుకోవచ్చు. రెండు క్యారియర్లున్నై!" అన్నది ఆమె తల్లి.

"దగ్గర్లో మంచి హోటలుందిటోయ్?" అన్నారు శర్మగారు.

"రెండు ఫర్లాంగులు వెళితే మంచి హోటలుంది! పనిమనిషిని పంపించవచ్చు. దానిచేత కావలసిన పనులన్నీ చేయించుకోండి" అని శాస్త్రి సలహా ఇచ్చాడు.

అతను ఒక్క పొరపాటు చేశాడు. శర్మగారి కుటుంబం స్నానాలూ అవీ చేసినాక, వాళ్ళను సుదర్శనంగారి ఇంటికి తీసుకుపోయి పరిచయంచేసి వుంటే బాగుండేది. అనేక చిక్కులూ మనస్తాపాలు తప్పేవి.

అందరూ స్నానాలుచేసే లోపుగా, పనిమనిషి హోటలునుంచి ఇడ్లెన్లు, కాఫీ తెచ్చింది. శాస్త్రికూడా వాళ్ళతోబాటే టిఫిన్ ఆరగించాడు. ఇదంతా అయేసరికి ఉదయం తొమ్మిదిన్నర అయింది. శర్మగారు బయటికి వెడుతుంటే, శాస్త్రికూడా బయలుదేరాడు.

"మళ్ళీ ఎప్పుడు కనిపిస్తారు?" అని సరస్వతి అడిగింది.

"సాయంకాలం అయిదుదాటి వస్తాను" అన్నాడు శాస్త్రి.

అయిదు గంటలవేళ బాల రిక్షాలో వచ్చి దిగింది. నిర్జనంగా వుండవలసిన ఇంట సందడి చూసి ఆశ్చర్యపడింది. కుడిపక్కన వున్న లాన్‌లో పిల్లలు బంతి తన్నుకుంటూ పరుగెత్తుతున్నారు! ఎడమ పక్కనున్న ఎర్రతంగేడు మామను ఆనుకుని కూచుని ఒక అమ్మాయి ఏదో పుస్తకం చదువుకుంటున్నది.

బాల మొదటి క్షణంలో నివ్వెరపోయి, ఇల్లు ఏమైనా మారిందా అని అటూ ఇటూ చూసింది. తరువాత క్షణంలో ఎవరూ తనను చూడకముందే వెళ్ళిపోయి, ఈ కొత్తవాళ్ళెవరో భానును అడిగి తెలుసుకుందామనుకున్నది! కాని అంతలోనే పుస్తకం చదువుకుంటున్న సరస్వతి తల ఎత్తి చూసింది. బాలకు ఇక వెళ్ళిపోవడం సాధ్యం కాదు. అదీగాక సరస్వతి మొగం చూడగానే, బాలకు, ఆ మొగం అక్కడ ఉండటానికి శాస్త్రి బాధ్యుడై ఉండవచ్చునని తోచింది. ఎవరో 'ప్రాంప్ట్' చేసినట్టుగా, ఆమెకు ఆనాడు శాస్త్రి చేతిలో కనిపించిన ఉత్తరం కూడా జ్ఞాపకం వచ్చింది. ఆశ్చర్యానుమానాలకు అసూయ తోడయింది.

బాల చరచరా నడుచుకుంటూ సరస్వతిని సమీపించి, "మీరంతా ఎవరు?" అని అడిగింది. ఆమె ఆ ప్రశ్న కోపంగా అడగలేదుగాని, ఆమెకు స్వతహాగా ఉన్న దాష్టీకం దానంతట అదే వ్యక్తమయింది.

"మీరు ఒక్కరూ ఎవరు?" అని సరస్వతి అడిగింది.

బాలకు ఆ ప్రశ్నలో హాస్యమేమీ కనిపించలేదు.

"నేను ఈ ఇంటికి....ఈ ఇల్లు నాదే!" అన్నది బాల, "యజమానురాలిని" అనడానికి బిడియంవేసి.

సరస్వతి మొహాన నవ్వుపోయి ఆశ్చర్యం వచ్చింది !

"ఈ ఇల్లు మీదా? మీరు భానుగారు కాదే? నే నామెను చూశాను!" అన్నదామె.

అంటే ఈ అమ్మాయి భానుకు దగ్గిర బంధువు కూడా కాదన్నమాట!

"అది చాల పాతకథ! ఇప్పుడీ ఇల్లు నా పేర ఉంటున్నది. మీరు ఎవరి అనుమతితో ఈ ఇల్లు ఆక్రమించారో నాకు తెలీదు. అయినా మీరెవరో తెలుసుకునే అధికారం నాకున్నది" అన్నది బాల దర్పంగానే.

"ఐ రియల్లీ బెగ్యు పాడన్! భానుగారి తమ్ముడు శాస్త్రిగారు మమ్మల్ని ఇన్వైట్ చేశారు! ఇది భానుగారి ఇల్లనే అనుకుంటున్నా...."

సరస్వతి బాలను తాను కూచున్న చాపమీద కూచోమని ఆహ్వానించి సంగ్రహంగా తమ పరిస్థితులూ, శాస్త్రితో తమకుగల పరిచయమూ అంతా చెప్పింది! శర్మగారు వెయ్యిరూపాయల జీతగాడని తెలిసినాక బాల గొంతు చాలవరకు మారిపోయింది.

"బహుశా, ఇవాళా రేపట్లో మా నాన్నగారు ఇల్లు చూచేస్తారులెండి. మీకు ఆటే శ్రమ ఇవ్వం" అన్నది సరస్వతి.

"నాకేమీ శ్రమలేదు... శాస్త్రిగారు ముందుగా నాతో మాట మాత్రం చెబితే....మీరు మీ ఇష్టమొచ్చినన్నాళ్ళుండండి. ఈ ఇల్లు పేరుకు నాదైనా, భానుగారి ఆధీనంలోనే ఉంది. శాస్త్రిగారు ఆవిడకైనా మీ సంగతి చెప్పారా అని నా సందేహం. ఆయనకు బాధ్యత అంతగా తెలియదు" అన్నది బాల లేస్తూ.

ఆమె శాస్త్రిమీద మండిపడుతున్నది. వీళ్ళు రైలుకు వస్తుంటే, శాస్త్రి రిసీవ్ చెయ్యటానికి వెళ్ళవలసిన అగత్యమేమిటి? సరస్వతి మాట్లాడుతున్నంతసేపూ ఆమె గొంతునుబట్టి ఆమెకూ, శాస్త్రికి ఏమైనా సంబంధం - నిజమైన బంధం-ఉన్నదా, లేదా తెలుసుకోవటానికి బాల మూడో చెవితో మహా ఆలకించింది. కాని, ఆమెకు రహస్య సంబంధమేదీ పొడగట్టలేదు. చిన్నతనం నుంచీ పట్టణాలలో పెరిగిన వాళ్ళకు నిష్కపటంగా, లౌక్యంలేకుండా మాట్లాడే భోళాతనం అబ్బుతుంది. సరస్వతి ఎప్పుడూ అట్లాగే మాట్లాడుతుంది. ఆమెకూ, శాస్త్రికీ ఉధృతంగా ప్రణయం నడుస్తూ ఉండినప్పటికీ బాల మూడోచెవికి ఏమీ వినిపించి ఉండేదికాదు.

బాల వెళ్ళిపోయిన రెండు నిముషాల లోపల శాస్త్రి వచ్చాడు.

సరస్వతి ఆతనితో బాల వచ్చిందనీ, ఈ ఇల్లు తనదని చెప్పిందనీ అన్నది. ఆమె తనకోసం వచ్చి ఉంటాలి. తలవనితలంపుగా ఇంటినిండా జనం కనిపించేసరికి ఆమెకు ఉత్సాహభంగమూ, ఆగ్రహమూ కలిగి ఉంటాలి. బాల ఆగ్రహం మాట అటుంచి సరస్వతికూడా రెచ్చుకున్నది.

"నా పర్మిషన్ లేకుండా మీరింట్లో ఎలా దిగారు అన్న ధోరణిలో ఆమె మాట్లాడేసరికి నాకు చెడ్డ అవమాన మయింది" అన్నది సరస్వతి.

ఇటువంటి పరిస్థితికి అవకాశం కలిగించినవాడు తానే. అతను సరస్వతికి ఏదో ఒక క్షమాపణ యివ్వక తప్పదు.

"ఆ మనిషి మాటలు పట్టించుకోవద్దు. అసలే జమీందారు బిడ్డ-అతిశయం హెచ్చు. అదీగాక ఆవిడ మొగుడు-మా రామదాసు, బిగ్ బిజినెస్ మనిషి. బ్రహ్మని తిమ్మి, తిమ్మిను బ్రహ్మ చేస్తుంటాడు. ఎవరి డబ్బు వారి దగ్గరే ఉంటుంది. ఒకరి షేర్లు ఇంకొకరికి మారుతాయి. ఒకరి ఆస్తి ఇంకొకరికి మారుతుంది. ఈ ఇల్లు దస్తావేజుల్లో ఎవరి పేర ఉంటేనేంగాక, మొదటినుంచీ ఈనాటి దాకా మా ఆధీనంలోనే వుంది. కాని, మేం ఏడాదికి పదిన్నర మాసాలు మా బావగారి యింట్లోనే ఉంటాం... ఇంకో చిత్రం చెప్పనా? నాకు ఉద్యోగం ఉంది గాని చేసేటందుకు పనీ లేదు, డబ్బూ లేదు. ఆర్థిక శాస్త్రంలో ఉండని ఎన్నో రహస్యాలు నేను తెలుసుకుంటున్నాననుకో!" అన్నాడతను.

సంభాషణ హాస్య ధోరణిలోకి మళ్ళింది. బిగ్ బిజినెస్ గురించి అతను వర్ణిస్తుంటే సరస్వతి విరగబడి నవ్వింది. అతను కంపెనీ ఆఫీసులను దేవాలయాలతోనూ, మేనేజింగ్ డైరెక్టరును ధర్మకర్తతోనూ, ఎకౌంట్స్ గుమాస్తాలను అర్చకులతోను, వాటాలు కొనేవాళ్ళను కానుకలు చెల్లించుకొనే భక్తులతోనూ పోల్చాడు.

"వర్తకులు చాలా నయం—మా బావగారు ఏ మందు సీసానైనా ఇరవై గజాల దూరంలో గుర్తించగలడు. అది ఏ రోగాలకు పనికివస్తుందో చెప్పగలడు. ఉత్పత్తిదార్లు చాలా అన్యాయం-మా రామదాసుకు ఎరువేదో, ఎమెరీ యేదో తెలీదు. మా వాడు డబ్బును కూడా కళ్ళతోచూసి గ్రహించలేడు; ఎకౌంట్ పుస్తకాలలో కనిపించినదే నిజమైన డబ్బు; పనిచేసేవాళ్ళూ, గుమాస్తాలూ రూపాయలనోట్లను మాత్రమే నమ్ముకుంటారు. అదీగాక వాళ్ళకు తాము ఏం చేస్తున్నదీ తెలుసు. అందుకని వాళ్ళకు అట్టే గిట్టుబాటు కాదు. నువ్వు పరిశ్రమనుంచి నిజమైన డబ్బు చేసికొని, ఇళ్ళుకొని, కార్లలో తిరగాలంటే, నీకు పరిశ్రమ గురించి దాదాపు ఏమీ తెలియగూడదు. నోట్లకట్టల్లోకన్నా ఎకౌంటు పుస్తకాలలో ఎక్కువ గురి ఉండాలి. మీ చిన్నాయన ఎప్పుడూ చెప్పలేదా? మా ఫ్యాక్టరీవాళ్ళు ఇత్తడీ, కంచూ చెంబు

ల్లోనూ, పళ్ళాల్లోనూ తప్ప చూడలేదు. ఏమేం లోహాలు కలిస్తే ఇత్తడీ, కంచూ అయేదీ తెలియదు; ఈ ఫలాని కంచులో ఇంత తగరం ఉందని మీ చిన్నాయన ఎట్లా చెప్పేవాడో వాళ్ళకు తెలియదు; వాళ్ళు నలభై యాభై లక్షల లాభం తీశారు. రూపాయి నోట్లలో నమ్మకం గల నేనూ, మీ చిన్నాన్నా ఎప్పటిలాగే ఉన్నాం...."

"ఆ మాట అనటం అన్యాయం. పారిశ్రామికులకు శాస్త్రజ్ఞానం అంతగా లేకపోవచ్చుగాని వాళ్ళకు అర్థికశాస్త్రం బాగా తెలుసు" అన్నది సరస్వతి.

"అవునవును! మా రామదాసు చెబుతున్నాడు — జీతాలు లాభాలలోనుంచి వస్తయ్యని! జీతగాళ్ళూ, వాటాదార్లూ, ఒకటేనా అని అడిగాను. ఆటే తేడా లేదన్నాడు. ఎందుకుటా? అందరూ పరిశ్రమమీదనే డబ్బు చేసుకుంటారుట!"....

బాలకూ తనకూ గల బంధుత్వం గురించి సరస్వతికి చెప్పెయ్యాలని శాస్త్రి అదివరకే తీర్మానించుకున్నాడు. ఆ పని చెయ్యటానికి ఇప్పుడు అవకాశం దొరికి కూడా వినియోగంకాలేదు. దిక్కుమాలిన ఈ బాల వ్యవహారం కనపడకుండా తమ ఇద్దరిమధ్యా ఉండటం అతనికి ఇష్టంలేదు. అది ప్రత్యక్షంగా వాళ్ళని వేరుచేసినా అతను ఈ స్థితిలో బాధపడడు. ఎందుకంటే, ఇంతవరకు అతను సరస్వతికి తగినంత దూరంలోనే ఉంటున్నాడు. ఒకవేళ సరస్వతి తనను అర్థం చేసుకునే పక్షంలో ఆమెకు మరింత దగ్గిర కావాలనికూడా శాస్త్రికి కోరిక ఉన్నది...

## 7

బాల శాస్త్రిపైన కత్తికట్టింది. ఆ రాత్రి భోజనాల దగ్గర ఆమె భానుతో, "మీ ఇంటికి ఎవరో అతిథులు వచ్చినట్టుందే?" అన్నది.

"అతిథులా?" అన్నది భాను పిచ్చిమొహంవేసి.

"బొంబాయిలో ఇద్దరు శర్మగార్లుండే వాళ్ళని చెబితినే. పెద్ద శర్మగారికి బదిలీ అయింది. ఆయన కుటుంబంతోసహా వచ్చారు. హోటల్లో దిగుతామంటే, మనింట్లో ఉండమన్నాను. రెండురోజుల్లో వాళ్ళు వేరే ఇల్లు చూసుకొంటారు." అని శాస్త్రి భానుతో చెప్పాడు.

"దిగితే దిగారు. నాకూ, మీకూ కూడా తెలీకుండా దిగారు! అదీ నాకు ఆశ్చర్యం?" అన్నది బాల, ఇంకా భానుతోనే మాట్లాడుతూ.

"నాకు తెలిస్తే చాలుననుకున్నానే. ఆ ఇంటి తాళపుచెవులు పెట్టుకొని తిరుగుతున్నది నేనేగదా! ఆ ఇల్లు నాకు ఉపయోగపడుతున్నట్టు మరెవరికీ ఉపయోగపడడం లేదుగదా!" అన్నాడు శాస్త్రి.

భాను దెబ్బతిన్నదానల్లే తల ఎత్తి ఒకసారి శాస్త్రికేసీ, ఒకసారి బాలకేసీ చూసి మళ్ళీ తలవంచుకున్నది. "నాకు తెలిస్తే, నేను వెళ్ళి వాళ్ళను చూసేదాన్ని" అన్నదామె, ఏ ఒకరితోనూ కాకుండా.

"రేపు వెళ్ళిచూడు" అన్నాడు శాస్త్రి.

"బొంబాయిలో ఒకసారి వాళ్ళను చూశాను" అన్నది భాను, తన పెళ్ళి విషయం ప్రస్తావించకుండా.

మర్నాడు భాను తన ఇంటికి శాస్త్రివెంట బయలుదేరింది. వాళ్ళ అమ్మను కూడా తీసుకుపోదా మనుకున్నదిగాని, ఆవిడ కాళ్ళు వాచి కదలలేకుండా ఉన్నది. కాస్త నయంగా ఉన్ననాడు కొద్దిగా లేచి అటూ ఇటూ తిరుగుతుంది. ఆ తరవాత వారం రోజులపాటు మంచానపడి ఉంటుంది.

భానూ, శాస్త్రీ వెళ్ళేసరికి శర్మగారి కుటుంబం అద్దె ఇంటికి మారే ప్రయత్నంలో ఉన్నారు. నిన్న సాయంకాలమే రెండువందల రూపాయల అద్దెకు ఇల్లు దొరికిందట.

భాను రాకతో ఈ ప్రయత్నాలు అకస్మాత్తుగా నిలిచిపోయి, పరామర్శలు ప్రారంభమయినై. సరస్వతి ప్రత్యేకించి ఎంతో ఆప్యాయంగా మాట్లాడింది భానుతో.

"నేను వచ్చి మీ పని పాడు చేసినట్టున్నాను. ఇల్లు వెతుక్కోవడానికి ఏమంత తొందరపడ్డారు? మా ఇల్లు మీకు సుఖంగా లేదా?" అన్నది భాను.

"నిన్న మీ బంధువు ఒకరు వచ్చారు. తనకు తెలియకుండా ఇంట్లో దిగామని కోప్పడ్డారు" అన్నది సరస్వతి నిష్కపటంగా కుండపగలేస్తూ.

భాను నవ్వేసింది. ఆమెక్కూడా కొన్ని ట్రిక్కులు అలవడినై. "మా రామదాసు భార్య అన్నమాట! ఎందుకో ఈ యిల్లు ఆవిడపేర మార్చారు—ఆ లఘువు బిగువులు నాకు తెలిసి యాదవ్వ మరి! నేను మరీ పాతకాలపుదాన్ని!" అన్నదామె.

శర్మగారు చేరిన సామాను దగ్గర ఉండిపోయి, ఖాళీ వాన్ పంపాడు. అందులో మనుష్యులు వెళ్ళాలన్నమాట.

"ఏమండీ, మీ ఇల్లు మీకు వప్పగించేస్తున్నాం ఒక్కసారి ఇల్లంతా చూసుకుంటారా?" అన్నది శర్మగారి భార్య.

"ఇంకా నయం? మీ సరస్వతిని మా వెంట పంపండి, ఒకరోజు ఉంచుకుని రేపు పంపేస్తాం" అన్నది భాను.

తల్లి సమాధానం చెప్పేలోపునే సరస్వతి, "మరెప్పుడన్నా వస్తాను, ఇక్కడే ఉంటాంకదా!" అన్నది.

"భానక్కా, నువు ఇల్లు తాళం వేసి కారులో వెళ్ళిపో. తాళపు చెవులు బాల కిచ్చెయ్యి. ఏమిటి పీడ! నేను వీళ్ళ తీసుకున్న ఇల్లు చూసి భోజనం వేళకు వస్తే వస్తాను. లేకపోతే ఆఫీసుకే పోతాను" అన్నాడు శాస్త్రి.

భాను తాళపు చెవులు తనకిస్తుంటే బాల నివ్వెరపోయి, "ఇవి దేని తాళపు చెవులు? నావి కావే!" అన్నది.

భాను నవ్వి "నీవి కాకపోవడమేమిటి? నీవే! ఆ ఇంటివి. ఇన్నాళ్ళూ మా తమ్ముడు దగ్గర పెట్టుకు తిరిగాడు. నీ కిచ్చెయ్యమంటే ఇచ్చేశాను" అన్నది.

ఆ తాళపుచెవులు తనచేతికి రావడంలో ఏదో అనుమానమూ, అపజయమూ ఉన్నట్టు బాల గ్రహించింది. ఆమెకు పట్టరాని ఆగ్రహం వచ్చింది. కాని ఆ ఆగ్రహాన్ని భానుమీద చూపడానికి లేదు. శాస్త్రి తన కీ తాళపుచెవులు ఇప్పించ డంలో ఎన్ని తిరుగుళ్ళున్నదీ భాను ఊహించనుకూడా లేదు. ఆ ఇల్లు తనదని ఆ శర్మగారి మనుషులతో అన్నందుకు ఇది శిక్ష! అంతేకాదు. ఇది తనకు విడా కులు కూడాను! ఇప్పుడా సరస్వతి వచ్చిందిగా. ఇక తనతో శాస్త్రికి అవసరం తీరిపోయింది! వాళ్ళిద్దరికీ తప్పక సంబంధం వుండి వుంటుందని బాల రూఢి చేసుకున్నది.

పైకి నిబ్బరంగా కనిపించే వాళ్ళంతా నిజంగా నిబ్బరమయిన మనుషులు కారు-వారికి తమ ఆందోళనను పైకి కనిపించనివ్వకుండా దాచడం చాతనై వుంటుంది, అంతే. కాని, బాల నిజంగా నిబ్బరమైన మనిషి. ఆమె ఒకంతట ఆందోళన చెందే మనిషి కాదు. ఐతే, ఈసారి ఆమెకు ఏదో అయింది. గర్భిణిగా వుండడం చేత నరాలు కొంత దుర్బలంగా వున్నయ్యేమో కూడా. ఎంత వద్దనుకున్నా ఆమెకు తన అవమానమూ, శాస్త్రిద్వారా తాను పొందిన సుఖమూ జ్ఞాపకం రాసాగినై.... నిన్న సాయంకాలం కూడా అతనిని వెతుక్కుంటూ వెళ్ళిందే-పన్నెండు గంటలు గడిచే లోపుగా తన మొహాన తాళం చెవులు పారేస్తాడా? ఆ మాట తలుచుకుంటే కంట్లో కారం పడ్డట్టయి కళ్ళు చెమ్మగిల్లినై....

ఆ సాయంకాలం బాల ఆ ఇంటికి వెళ్ళింది. శాస్త్రి రాలేదు. ఆమె పడక గదిలో మంచంమీద బోర్లాపడుకుని సుఖంగా ఏడిచింది.

సరిగా అదే సమయానికి శాస్త్రి, సరస్వతి బీచ్‌లో కూచుని మాట్లాడుకుంటు న్నారు. అతను సరస్వతితో తనకూ బాలకూగల్గ సంబంధమంతా దాచకుండా చెప్పేశాడు.

సరస్వతి ఆశ్చర్యంగా కథ వినినట్టు అంతా విన్నది.

"ఇటువంటిదే ఒక విషయం నా పసితనంలో విన్నాను. మా అమ్మ పుట్టిన ఊరు పల్లెటూరు. ఆ వూళ్ళో ఒకావిడ మొగుడు నపుంసకుడట. ఆవిడ

మా అమ్మ మేనమామకు వరసగా పిల్లల్ని కన్నది. రహస్యం ఏమీలేదు, ఊరంతా అందరికీ తెలుసు. ఎవరూ అభ్యంతరం చెప్పలేదు. మా అమ్మ ఆవిణ్ని "ఏవమ్మా అత్తయ్యా?" అని పిలిచేది. ఒక విధంగా మన ముందు తరాలవాళ్ళు కూడా చాలా రేషనల్‌గానే ఉండేవాళ్ళు. అన్ని రకాల చాదస్తాలూ మధ్యలో వచ్చినట్టు కనిపిస్తయి" అన్నది సరస్వతి.

"ఇది అటువంటి విషయం కాదు. మీ అమ్మ మేనమామగారికి వేరే భార్యా, సంసారమూ ఉండి ఉంటుంది. ఆయనకు ప్రేమ సమస్య లేదు. నేనీ బాలకు మొగుడు కాని మొగుడుగా నా జన్మంతా గడపలేను. నాకామె అంటే ఇష్టం కూడా లేదు. ఎవరినన్నా ప్రేమించి పెళ్ళిచేసుకుని, నా చిన్న బతుకు నేను బతకాలని ఎన్నో ఏళ్ళుగా కలలు కంటున్నాను. నీకు తెలుసా సరూ? మా ఇంట్లో అందరమూ ఒక కుటుంబంగా వుండడమనేది కిందటి జన్మలో జరిగిన సంగతి లాగా నాకు జ్ఞాపకం ఉన్నది. బుద్ధి బాగా తెలిసి నేను అటువంటి కుటుంబంలో ఒకడుగా ఉండడం జరగలేదు. ఏ కుటుంబం వెంట వుంటున్నా ఆ కుటుంబానికి పరాయివాణ్ణిగానే ఉండవలసి వచ్చింది. నేను మళ్ళీ ఒక కుటుంబం మధ్య బతుకు తానంటే, నాకే నమ్మశక్యం కాకుండా ఉంది. నేను కనే కలలకూ, నాకు జరిగే సంఘటనలకూ ఎక్కడా సంబంధం లేకుండా ఉంది. మధ్యలో నాకీ బాల తగలాట మేమిటని!" అన్నాడు శాస్త్రి.

"అందువల్ల మీ కిప్పుడు వచ్చిన నష్టమేమిటి? ఎప్పుడు వదిలించుకున్నా వదులుతుందే! అదీగాక, ఆ తగలాటం ఏర్పడటానికి మీ బాధ్యత ఏమీ లేనట్టు మాట్లాడుతున్నారు. అది నాకు మరింత ఆశ్చర్యంగా వుంది."

"నా బాధ్యత లేదని ఇతరులను నమ్మించడం నాకు సాధ్యం కాక పోవచ్చు. కాని, నా బాధ్యత కేవలం అంతరాత్మకు సంబంధించినది. ఈ తగ లాటం కోసం నేను కలవరించలేదు. నా చిన్న చిటికెన వేలుకూడ కదపలేదు.... నిన్న బాల ఎందుకు వచ్చిందనుకుంటున్నావు? నా కోసం! ఆవిడగారు వచ్చేసరికి నేను హాజరుగా ఉండాలన్నమాట? ముందుగా నాతో సంకేతం కూడా ఏర్పాటు చేసుకో నవసరం లేదు. ఆ ప్రకారం నేను ఆవిడకు కావలసినప్పుడు రెడీగా ఉంటూనే వచ్చాను కూడా! దేనికి? నా అంతరాత్మకు సమాధానం చెప్పుకోలేక! రేపు నేను పెళ్ళి చేసుకోవాలన్నా ఈ అంతరాత్మ వూరుకోదు. నా కాబోయే భార్యకు జరిగినదంతా చెప్పకుండా నేను పెళ్ళాడలేను. అసలు సమస్య పెళ్ళి కూడా కాదు. వెంటనే నేను నిజమైన ఉద్యోగం చూచుకోవాలి - నేనిప్పుడు చేసే ఉద్యోగం బాలకూ, నాకూ ఉండే దాంపత్యం మల్లేనే పచ్చి అబద్ధంగా ఉన్నది" అన్నాడు శాస్త్రి.

"మీ రీ బాలను గురించి మనసు పాడుచేసుకోవడం అనవసరం అను కుంటాను. మిమ్మల్ని చేసుకునేది ఒక జ్ఞానం గలదైతే మీ చేస్టిటీ గురించి ఆజే దిగులుపడదేమో అనుకుంటాను. అంతగా దిగులుపడేదాన్ని పెళ్ళి చేసుకోవడం మానేస్తే సరి!....ఉద్యోగం మాట అంటారా? చూస్తే ఏదో ఒకటి దొరక్క పోతుందా? మా నాన్నగారితో కూడా చెప్పి పెడదాం" అన్నది సరస్వతి.

తన మనసులో వుండే బరువును సరస్వతి ఇట్టే దించెయ్యగలదని శాస్త్రికి మరొకసారి దాఖలా కనిపించింది. అతను బాలను గురించి బాధపడడం మానేశాడు. తమ కిద్దరికీ ఇకముందు ఏ సంబంధమూ వుండదని అతనికి గట్టి నమ్మకం కుదిరింది.

# 8

జాయింట్ స్టాక్ లిమిటెడ్ లయబిలిటీ కంపెనీలు రామదాసును "ఆర్బిట్"లో పెట్టి, రాకెట్‌ల లాగా అంతరిక్షంలోనే కాలి బూడిద అయిపోయినై. ఈ కంపెనీలు దక్కవని లోకం కొంత కాలంగా అనుకుంటూనే వున్నది. ఆ కంపెనీలకు చట్టరీత్యా ఉత్తర క్రియలు జరిగినై.

అయినా, కొందరు రామదాసును తిట్టారు. అది అన్యాయం. ఎన్ని లక్షల రూపాయల మూలధనం గల కంపెనీకైనా, దివాళా తియ్యటానికి చట్టంలో సౌకర్యం ఉన్నది. కంపెనీలు నడపడంలో అక్రమాలు జరిగితే జరగవచ్చు. కాని వాటిని అధికారులు పట్టుకోలేకపోయిన తరువాత, అవి జరగలేదనే అనుకోవాలి. లాభాలమీది ఆశకొద్దీ షేర్లు కొన్నవారు, అసలుకు మోసం వచ్చి నంతమాత్రంచేత విప్లవాలు చెయ్యరని మనకు తెలుసు.

ఇక పైవాళ్ళ సంగతి అడగనే అక్కరలేదు. ఈ పుణ్యభూమిలో ఇంకొక రికి జరిగే అన్యాయం గురించి ఎవరు పట్టించుకుంటారు? మన తత్వ గ్రంథా లన్నీ స్వార్థం నూరిపోసినై - పెళ్ళా మెవరు? పిల్ల లెవరు? బంధువు లెవరు? మిత్రు లెవరు? చచ్చేటప్పుడు నీ వెంట ఎవరూ రారు! ఎవడి మోక్షం వాడు చూసుకోవాల్సిందే! ఇటువంటి వేదాంతం వందలాది సంవత్సరాలుగా మన రక్తంలో ఇంకిపోవడంచేత, మన సమాజాన్ని ముట్టుకుంటే మసి రాలుతుంది.

రామదాసుకు వందలాది ఆశ్రితులు ఏర్పడ్డారు. వాళ్ళు రామదాసును రకరకాల కీర్తించారు. అందులో తప్పేమీ లేదు. మనం సంస్కృతిగలవాళ్ళం. అడివి మనుషులం కాం. కబళించబోయే దాన్ని కూడా కళ్ళకద్దు కోవడం మనకు రివాజు. జంతువులూ, జంతు ప్రాయులూ మాత్రమే స్వార్థాన్ని నగ్నంగా ప్రదర్శిస్తారు.

రామదాసు తన ఆశ్రితుల కోరికలు తీర్చాడా అంటే, అది వేరే విషయం. మొక్కుకునేవాళ్ళ కోరికలన్నీ భగవంతుడు తీర్చుతున్నాడా? అంతమాత్రాన భగవంతుడికి డిమాండు గాని, ఖ్యాతిగాని తగ్గిందా?

రామదాసును కీర్తించిన భక్తాజులలో ఒక వయసు మళ్ళినవాడు చెప్పిన మాటలు, శాస్త్రి చెవులారా విని అందులోవున్న నిజానికి ఆశ్చర్యపోయినాడు.

"రామదాసుగారు నిజంగా తపస్వి అనాలి. కిందటి జన్మలో ఏదో నిష్ఠాభంగం కలిగి మళ్ళీ జన్మ ఎత్తి ఉంటాడని తోస్తుంది. ఆయనకు ఒక్క వ్యసనం లేదు గదా - ఒక సిగరెట్ గాని, తాగుడు గాని, పొడుంగాని, స్త్రీ వ్యామోహం గాని, జూదం గాని - ఆఖరుకు ఆయన తాంబూలం వేసుకోగా కూడా నేను చూడలేదు. ఈ కాలంలో అటువంటి వాళ్ళు చాలా అరుదు.

ఇదంతా నిజమే, కాని శాస్త్రికి రామదాసుమీద గౌరవం కలగడానికి బదులు వ్యసనాలుగలవాళ్ళ మీద సానుభూతి హెచ్చింది.

రామదాసు తపస్వి అయితే, అతనిచుట్టూ చేరిన రఘు, లింగం, యాజులూ మొదలైనవాళ్ళందరూ తపస్వులే అయి వుండాలి. ఆ మాట ఆ ముసలాయన కూడా అనలేదు. వాళ్ళలో లింగం అనేవాడు ఒక హత్య కేసులో అప్రూవరు. రఘు అనేవాడు డిప్రెషన్ రోజుల్లో[1] దొంగనోట్లు మార్చినవాడు. దొంగనోట్లు మార్చి పట్టుపడ్డవాళ్ళు చాలామంది ఉన్నారు. రఘు చేసిన పద్ధతి బ్రహ్మభేద్యమైనది. అది ఆ రోజుల్లో ప్రసిద్ధికెక్కింది కూడా. ఆ రోజుల్లోనే బస్తీలలో కొందరు మధ్య తరగతి ఆడవాళ్ళు లంజరికం సాగించారు. మొగుళ్ళు ఆఫీసుకు వెళ్ళిన సమయాలలో విటులు వచ్చేవాళ్ళు. ఈ విధంగా శరీరాలు అమ్ముకొని సంపాదించిన సొమ్ము రెండు వందలో, మూడువందలో ఉంటే, అది భర్తలకు తెలియకుండా దాచుకున్నారు. వీళ్ళకు తార్పుగత్తె ఒక చాకలిది ఉండేది. దాన్ని రఘు పట్టుకున్నాడు. దాని చేతికి అయిదారు వందలు ఖరీదుచేసే బంగారు నగలు యిచ్చాడు. అది ఆ నగలు తీసుకొని ఒక్కొక్కతే దగ్గరికి పోయి, వాటిని తాకట్టుపెట్టి ఎంతవిలయితే అంతా అప్పు తెచ్చింది. మర్నాడు దొంగనోట్లు ఇచ్చి నగలు తెచ్చేది. ఈ విధంగా రఘు నాలుగు

---

1. డిప్రెషన్ ప్రపంచ వ్యాప్తంగా 1929-1934 మధ్యకాలంలో వచ్చిన ఆర్థిక కాటకం. మూడవ సంపుటంలోని అనుభవం నవలలోనూ, చదువు నవలలోనూ వివరాలు చూడండి. వ్యావసాయిక ఆర్థిక జీవితంలో వచ్చిన మార్పులు ఈ సంక్షోభంవల్ల అన్నీ ఇన్నీ కావు. రూపాయి విలువ అపారంగా పెరిగి, డబ్బు మాయమైపోయింది. దొంగనోట్ల వ్యాపారం కొందరికి చాలా లాభసాటిగా కన్పించింది.

వేల చిల్లర రూపాయల దొంగనోట్లు మార్చేసి, ఆ నగలు చాకలిదానికి ఇచ్చే శాడు....యాజులును గురించి శాస్త్రికి అట్టే తెలీదు-యాజులు తల్లి వాళ్ళ ఊళ్ళో ఇడ్లెన్లు అమ్ముకొని బతుకుతున్నదని తప్ప! ...రామదాసు తపస్వి అయితే, అతనికి సన్నిహితులందరూ ఈ రంగూ, వాసనా కలవాళ్ళు ఎందుకు కావాలో శాస్త్రికి అర్థం కాలేదు.

అదివరకల్లా శాస్త్రికి రామదాసును అక్రమంగా ద్వేషిస్తున్నానేమోనన్న అనుమానం ఉండేది. ఆ అనుమానం నిశ్శేషంగా పోయింది. రామదాసు తన నగ్నరూపం బయటపెట్టుకున్నాడు.

ఏం జరిగిందంటే, శర్మగారు శాస్త్రికి ఒక ఉద్యోగం ఇప్పించాడు. శాస్త్రి నూరు రూపాయల జీతానికి సంతోషంగా ఒప్పుకొని తనకు రామదాసు నుంచి విముక్తి అయిందనుకున్నాడు. అత నీ ఉద్యోగం మూడు రోజులేచేశాడు. ఇంతలో ఈ సంగతి రామదాసుకు ఎట్లాగో తెలిసింది. శాస్త్రికి పని ఇచ్చిన కంపెనీకి టెలిఫోను చేసి, శాస్త్రి తమ కంపెనీలో జీతంమీద పనిచేస్తున్నాడనీ, అతను ఇంకొకచోట పనిచేసే అధికారంలేదనీ చెప్పాడు. ఆ కంపెనీవాళ్ళు శాస్త్రిని మర్యాదగా ఖండలించి, మూడు రోజుల జీతం కూడా ఇవ్వకుండా పంపేశారు.

ఇది జరిగిన నెలరోజులకే శాస్త్రి పనిచేసే కంపెనీ దివాలా తీసింది.

ఇంట్లో అందరూ వింటూండగానే శాస్త్రి రామదాసును, "నేను నీకేం ద్రోహం చేశాను? నన్నెందుకిట్లా దయ్యంలాగా పట్టుకున్నావు?" అని అడిగాడు.

"అక్కడా ఇక్కడా ఉద్యోగం చేయటం నీకేం గతిపట్టింది? నాలో నీకెందుకు నమ్మకం లేకుండా పోయిందో నాకర్థం కావటంలేదు. ఇంతమందిని పోషించగలవాణ్ని నిన్ను పోషించలేక పోయినానా? నీకు ఎంత కావలిస్తే అంత తీసుకోమని నీ పేర ఎకౌంటు కూడా ఓపెన్ చేయిస్తినే?" అన్నాడు రామదాసు చాలా ఓర్పుతో.

"నా జన్మలో నేను పోగుచేసుకున్న నాలుగు డబ్బులూ నీ ఖద్దరు వ్యాపారంలో పోగొట్టుకున్నాను. నాకు ఉద్యోగం ఇచ్చినట్లు ఇచ్చి, కానీ చేతికి ఇవ్వకుండా, నాకు కంపెనీలో వాటాల కింద జమవేస్తున్నా నన్నావు. ఎకౌంటులో తీసుకున్నకొద్దీ నేను నీకు ఋణంతప్ప ఇంకేముందీ? ఏదో విధంగా నన్ను బతకనివ్వక, ఇంత పెద్ద బిజినెస్‌లో నన్నెందుకు దూర్చావు? నేను బిజినెస్‌కు పనికిరాను" అన్నాడు శాస్త్రి.

"ఆ సంగతి ఇప్పుడే నాకు తెలుస్తున్నది. నీకు ఎంటర్‌ప్రయిజ్ లేదు. జీతం రాళ్ళు లెక్కపెట్టుకోవలసినవాడవే. బిజినెస్ అన్న తరువాత లాభం రావచ్చు, నష్టం రావచ్చు! ఆ ఖద్దరు వ్యాపారంలో నువు పోగొట్టుకొన్నదానికి పాతికరెట్లు నేను పోగొట్టుకొన్నాను. నీలాగ మనోవ్యాధిపడ్డానా? నాసొంత ఖర్చు

నెలకు నలభై రూపాయలుండదు; నేనీ శ్రమంతా నాకోసమే పడుతున్నా ననుకుంటున్నావా? ఒకటికి రెండూ, రెంటికి మూడూ కంపెనీలు పెట్టాను. కలిసి రాలేదు. ఒక కంపెనీలో నాకు ఆరునెల్ల శాలరీ రావలసుంది. కావలిస్తే బుక్స్ చూడు! ఫండ్స్ లేవు. ఏంచెయ్యాలి? అపజయం ఎదురయినప్పుడే మన ప్రయోజకత్వం చూపించాలి. కలసి వచ్చేటప్పుడు అందరూ మొనగాళ్ళమే!" అని రామదాసు ఉపన్యాసం దంచేశాడు.

అతని మాటలు వింటున్నవాళ్ళంతా అతని పక్షంగానే కనిపించారు. అందుచేత శాస్త్రి ఆ చర్చ అంతటితో పోనిచ్చాడు. వినేవాళ్ళంటే రామదాసు వాదనలో పురుగేరే శక్తి అతని కిప్పుడున్నది. రామదాసు ప్లాను ప్రకారం పబ్లిక్ లిమిటెడ్ కంపెనీలను హత్యచేస్తూ వచ్చాడు. చట్టం ఆ కంపెనీలకు చికిత్సచేసే వైద్యుడుగా రాదు. ఉత్తరక్రియలు చేయించే బ్రాహ్మడుగా పని చెయ్యడానికి మాత్రమే వస్తుంది. ఈ సంగతి శాస్త్రికి తెలుసు. రామదాసుకు ఇంకా బాగా తెలుసు.

ఈ కంపెనీలు దివాలా తీసిన ఫలితంగా భాను డబ్బు దాదాపు పూర్తిగా పోయింది. అంతో ఇంతో మిగిలితే అది ఆమె ఇంటి అద్దెకు పూర్తిగా సరిపోలేదు. ఇల్లు బాలపేర మారినప్పటినుంచి భాను నెల నెలా రెండువందల రూపాయలు బాలకు కట్టుతున్న సంగతి ఇప్పుడే అందరికీ వెల్లడయింది.

"ఇది నువు చేసిన ఏర్పాటేనా?" అని సుదర్శనంగారు కొడుకును అడిగాడు.

రామదాసు భుజాలెగరేసి, "అఫ్‌కోర్స్! బాలకు న్యాయంగా ఆ అద్దె రావాలిసిందే గద?" అన్నాడు.

భానుకు తన భవిష్యత్తు ఏమిటో తెలియదు. ఇన్నాళ్ళూ ఎవరితోను అనకుండా కడుపులో పెట్టుకుని ఊరుకున్నది గాని, రామదాసు పెత్తనం కింద సుదర్శనం గారి ఇంట కొంతకాలంగా ఆమె దాదాపు దాసీదానిలాగ ఉంటున్నది. పద్మకూడా తనతో అంతగా మాట్లాడడం లేదు. సుదర్శనం గారికి రామదాసుపైన ఎటువంటి అదుపూ లేదని భానుకు స్పష్టంగా తెలిసింది.

## 9

మర్నాడు శాస్త్రిని చూసి సరస్వతి నిర్ఘాంతపోయింది. అతని మొహం అంత కళావిహీనంగా ఉండటం ఆమె ఎన్నడూ చూడలేదు.

"ప్రత్యేకించి ఏమీలేదు. ఇన్నాళ్ళనుంచీ ఉన్నదే!" అన్నాడతను ఆమె ప్రశ్నకు.

సరస్వతి మెల్లిగా అతనినుంచి జరిగినదంతా రాబట్టింది. అతను ఏమీ దాచ లేదు. "ఒక్కందుకు నాకు సంతోషం. ఇక నన్ను రామదాసు ఏమీ చెయ్యలేడు. కంపెనీ దివాలా ఎత్తింది. ఇంత కాలానికి నాకు విమోచనం కలిగింది. నేనిక ఆ ఇంటి చాయలకు పోదలచలేదు. ఏ కంపెనీకి నైట్ వాచ్‌మన్‌గా వున్నా, ఏ సినిమా థియేటర్‌లో డోర్‌కీపర్‌గా ఉన్నా నన్ను అడిగేవాళ్ళు లేరు" అన్నాడతను.

ఇవాళ శాస్త్రిని చూస్తుంటే, కొందరు దురదృష్ట జీవులుంటారని సరస్వతికి నమ్మకం కలిగింది. అతనికి వచ్చిన సమస్యలన్నీ తరిచిచూస్తే అందులో ఏ ఒక దానికీ శాస్త్రి స్వయంగా బాధ్యుడు కాడని ఆమెకు అనిపించింది. తాను దురదృష్ట వంతురాలనన్న భావం ఆమెకు ఎన్నడూ కలగలేదు. ప్రత్యేకించి దురదృష్టంచేత వేటాడబడిన మనుషులను ఆమె స్వయంగా ఎరగదు కూడా. చిత్ర మేమిటంటే, శాస్త్రి మునిగిపోతున్న పడవల్లే వున్నప్పటికీ నడిసముద్రంలో దిక్కులేకుండా మునిగిపోయే పడవలాగా లేడు. రేవులో మునిగిపోతున్న పడవలాగా వున్నాడు. అతని చుట్టూవున్న మనుషులూ, వాతావరణమూ చూసి ఎవరుకూడా అతన్ని దిక్కులేనిపక్షి అనుకోరు.

"మీ సిస్టరు ఏమంటారు? ఆవిడకేం, చెట్టంత మనిషి అండ వున్నాడు!" అన్నది సరస్వతి.

"మూఢ విశ్వాసమని ఎగతాళిచేస్తే చెయ్యి. కాని నేను దగ్గర చేరినప్పటి నుంచే భానక్కకు దురదృష్టం పట్టుకున్నది. నేను మా నాన్న పోయినాక ఆవిడ దగ్గిర చేరినది మొదలు ఆవిడకు శని పట్టుకున్నది. నేను బొంబాయిలో ఉన్న రోజుల్లో కూడా ఆవిడ పని చాలా బాగుంది. నేను మళ్ళీ తిరిగివచ్చాను. ఆవిడను శని పట్టుకున్నది. అందుకే నేను విడిగా బతకదలచుకున్నాను" అన్నాడు శాస్త్రి.

అతను తన అంతరాత్మకు ఎంతగా బానిస అయిపోయినాడో, అతని మాటలు వింటుంటే సరస్వతికి స్పష్టంగా తెలిసింది; ఈ విచిత్రమైన అంతరాత్మ వెంట అతనికి అసాధారణమైన బంధుప్రేమకూడా వున్నది. ఈ రెండూ కలిసి పీడించకపోతే అతను ఇంతగా కుంగిపోడు.

"వెనక మీరు చేసిన ఉద్యోగం ఇంకా ఖాళీగా ఉందేమో కనుక్కుంటాను మా నాన్నగారిని" అన్నదామె.

"వద్దు. వద్దు. ఆయనకు ఇదివరకే అప్రతిష్ఠ తెచ్చిపెట్టాను" అన్నాడు శాస్త్రి.

అయినా సరస్వతి శాస్త్రి విషయమంతా తండ్రికి చెప్పింది. ఆయన శాస్త్రికి ఉద్యోగం దొరికేదాకా తమ ఇంటనే ఉండమని ఆహ్వానించాడు.

"వద్దులెండి, ఏదన్నా గది తీసుకుంటాను" అన్నాడు శాస్త్రి.

"మేం ఈ ఊరు చేరిననాడు మాకు మీ ఇల్లు చూపిస్తే నేను కాదన్నానా? నా మాట తీసెయ్యనవసరం లేదు. గదులు అంత తేలికగా దొరకడంలేదు కూడా" అన్నాడు శర్మగారు.

ఆయన విచారిస్తే, ఆ ఉద్యోగం ఇంకా ఖాళీగానే ఉన్నట్లు తెలిసింది. ఆ సాయంకాలం శర్మగారు శాస్త్రితో "రేపు ఆ కంపెనీవాళ్ళు రమ్మన్నారు" అని చెప్పాడు.

శాస్త్రి మనసు నిండిపోయింది. సాయంకాలం లోపుగా అతను తన విచారాన్ని సగం మరచిపోయినాడు. తనకు ఉద్యోగం దొరుకుతుందనగానే అతని మనస్సు పూర్తిగా చిగిర్చింది. మళ్ళీ తన జీవితం కొత్త చైతన్యాన్ని పొందుతున్నది! ఇట్లా జరగడం ఎన్నోసారో!

శాస్త్రి పనిచేసే కంపెనీ ఒక కంట్రాక్టర్ల సంస్థ. ఆ సంస్థ రకరకాల ఇళ్ళూ, వంతెనలూ, రోడ్లు - ఏదిపడితే అది నిర్మిస్తుంది. నూరు రూపాయల జీతం మీద మూడునెల్లు ప్రొబేషన్, ఆ తరువాత నూటయాభై మీద ఉద్యోగం ఖాయపరచడమునూ.

ప్రభాకరరావనే స్ట్రక్చరల్ ఇంజనీరు తెలుగువాడు. శాస్త్రి అతనికి అసిస్టెంటుగా పనిచెయ్యాలి. ఈ ప్రభాకరరావు మంచివాడే గాని చాలా కోపిష్టి. అయినదానికీ కానిదానికీ చిరాకుపడేవాడు. పనిలో చాలా గట్టివాడు. ఏదో ఇంగ్లీషు కంపెనీలో రెండేళ్ళు పనిచేశాట్ట. అతను శాస్త్రికన్నా అట్టే పెద్దవాడు కాడు. అందుచేత ప్రభాకరం చిరాకులో తనను పురుగల్లే విదిలించినప్పుడల్లా శాస్త్రికి కోపంకన్నా ఆశ్చర్యం ఎక్కువగా కలిగేది. తనమీద యితరులు చీదరించుకోవటం శాస్త్రికి అలవాటు లేదు. ఉద్యోగం బానిసత్వమేనని శాస్త్రికి తెలుసు- ముఖ్యంగా పనిచేసుకునే హక్కు ప్రతి పౌరుడికీ లేని రాజ్యాంగం కింద నౌకరీ అంటే బానిసత్వమే; దాన్ని వదిలించుకోవచ్చు – తిండికి మాడటానికి అభ్యంతరం లేకపోతే.

"ఏం చెయ్యాలి? బానిసత్వం కూడా కష్టపడి నేర్చుకోవాలి!" అనుకున్నాడు శాస్త్రి.

ఆ ప్రభాకరరావు కొంచెంకూడా ఆలోచించకుండా, తనకు తెలిసినంతా శాస్త్రికి తెలియనందుకు విసుక్కొనేవాడు. "అయ్యా, మీకు తెలిసినంతా నాకూ తెలిస్తే, మీ జీతం నేనూ పుచ్చుకొనేవాణ్ణికదా !" అని అనటానికి లేకపోవటం శాస్త్రికి ఎంతో బాధ కలిగించింది.

కాని, ప్రభాకరరావును అర్థం చేసుకున్నకొద్దీ, శాస్త్రికి మనఃక్లేశం తగ్గింది. అతను ఏదన్నా కొత్త విషయం చెప్పేటప్పుడు కూడా, 'ఈ సంగతి నీకు ఎన్ని సార్లు చెప్పాలి?' అనే పద్ధతిలో చెప్పేవాడు. అది ప్రభాకరరావుకున్న దురలవాటు. దాన్ని శాస్త్రి అర్థం చేసుకొని సహించవలసి వచ్చిందంటే, ఆ పరిస్థితులలో వుంటె పొరపాటు. అటువంటి పొరపాటువల్లనే ఎందరో భార్యలు తమ భర్తలను 'అర్థం చేసుకొని' వాళ్ళ దురలవాట్లను తప్పనిసరి అయి సహిస్తున్నారు....

ఉద్యోగం దొరకగానే శాస్త్రి గది చూసుకొంటానంటే, శర్మగారింట్లో అందరూ కోప్పడ్డారు. జీతం చేతికి వచ్చినదాకా తొందర పడవద్దన్నారు.

"చక్కగా పది గంటలకల్లా ఎవరి ఉద్యోగాలమీద వాళ్ళు వెళ్ళిపోతారు. నేను తోచక కొట్టుకుంటున్నాను. నేను కూడా ఏదన్నా ఉద్యోగం చూస్తాను" అన్నది సరస్వతి.

"పెళ్ళి చేసుకుంటే తోస్తుంది" అన్నాడు శాస్త్రి.

"ఎవరన్నా వచ్చి అడుగుతేగాని పెళ్ళి విషయం ఆలోచించను."

"నేనే ఎప్పుడో అడుగుతాను" అన్నాడు శాస్త్రి.

"అడిగినప్పు డాలోచిస్తాను" అన్నది.

"నేను కూడా తొందరపడను. నాకన్న నాసివాడు నిన్ను పెళ్ళాడతాడని తోచినప్పుడు, నేను తుపానులాగా వచ్చి అడ్డపడతాను" అన్నాడు శాస్త్రి.

ఈ మాటలో కూడా సరస్వతికి శాస్త్రి అంతరాత్మ ధ్వనించింది. "ఈ అంతరాత్మ ఇతనికి గుదిబండే!" అనుకొన్న దామె.

శాస్త్రికి శర్మగారి గృహవాతావరణం చాలా బాగా నచ్చింది. అతనికి తనవాళ్ళ మధ్య ఉన్నట్టుంది. శర్మగారి కుటుంబానికి మాత్రం అతను ప్రతి స్వల్ప విషయానికి చచ్చే మొగమాటపడుతున్నట్టు కనిపించింది. అతను సరస్వతితో బాగా చనువుగా ఉండేవాడు.

ఆమె మాట్లాడే ఇంగ్లీషులోని లక్షణమైన అంశమేమిటో అతనికి ఒక రోజున ఆకస్మాత్తుగా స్ఫురించింది. ఆమె ఎ, ఒ అచ్చులను ఐ. ఓ గా ఉచ్చరిస్తుంది. దేశపు అలవాటు. వాళ్ళకు పొట్టి ఎ, పొట్టి ఒ లేవు. అందుకే ఆమె "మెట్" అనటానికి "మేట్" అంటుంది; "వెరీ" అనలేదు "వ్హేరీ" అంటుంది. వకారం వెంట హకారం చేర్చటం మహారాష్ట్రీల అలవాటు.

ఈ సంగతి గ్రహించిన క్షణంనుంచీ శాస్త్రి ఆమెలాగా ఇంగ్లీషు మాటలు మాట్లాడి అందరినీ నవ్విస్తూ వచ్చాడు.

సరస్వతి నిజంగానే ఉద్యోగం సంపాదించింది — ఇన్సూరెన్సు కంపెనీలో - శాస్త్రి పనిచేసే ఆఫీసుకు ఫర్లాంగుదూరంలో. ఇద్దర్నూ ఇంటిదగ్గిర కలిసి బయల్దేరే వాళ్ళు. మళ్ళీ లంచ్‌దగ్గర కలిసేవాళ్ళు. వీలయితే ఇంటికి కలిసే వచ్చేవాళ్ళు.

శాస్త్రిలో కలిగిన మార్పు ఆమెను తృప్తి పరిచింది. అతను ఇప్పుడ 'మోర్బిడ్'గా, ఎప్పుడూ నిరుత్సాహంలో మునిగి ఉండటంలేదు. తాను సరదాగా ఉండటమేగాక ఇతరులనుకూడా నవ్విస్తున్నాడు.

నిజానికి శాస్త్రి పైకి కనిపించేటంత సుఖంగాలేడు. వెనుకటి వాళ్ళు ఇంద్రియాలను బలమైన గుర్రాలతోనూ, బుద్ధిని సారథితోనూ పోల్చారు. శాస్త్రి విషయంలో ఈ గుర్రాలు చాలా బలవత్తరమైనవిగా పరిణమించినై. సంస్కృతి మూలంగా అతని నరాలు తెగబోయేదాకా బిగుసుకుని ఉన్నై. ఆ విధంగా వారాల తరబడి కళ్ళాలను బిగలాగి పట్టుకుని ఉన్న మనిషికి ఏపాటి సుఖం ఉంటుంది? అయినప్పటికీ ఈ బాధ అతని మనస్సుకు తెలుపదు పడలేదు. దీనికి కవులు 'తీయని బాధ' అని సరిగానే పేరు పెట్టారు. ఏ ఆడదాని విషయంలో కొంచెం కూడా ఆత్మనిగ్రహం అవలంబించలేక పోయినవాడు, తాను మనసంతా ఇచ్చి ప్రేమించే సరస్వతి విషయంలో ఇంత ఆత్మనిగ్రహం ప్రదర్శించ గలిగాడంటే ఆశ్చర్యమే! కాని ఆ ఆత్మనిగ్రహం నిజమైన ప్రేమకు చిహ్నమేమో!

# 10

రామదాసు మూడో మెట్టు ఎక్కాడు - ప్రైవేటు కంపెనీ ప్రారంభించాడు. అతను పెట్టిన మొదటి కంపెనీ సినిమా కంపెనీ. ఈ కంపెనీకి వెనక ఒకటి రెండు సంఘటనలున్నై. ఎవరో సినిమా కంపెనీవాళ్ళకు డబ్బు చాలలేదు. యాజులు ద్వారా వాళ్ళు రామదాసును ఇరవైవేలు అప్పు అడిగారు. పిక్చరు రిలీజు కాగానే నలభై వేలిస్తామన్నారు. వాళ్ళు మాయకులూ, అమాయకులూ కూడా కారని రూఢి చేసుకున్నాక, రామదాసు అప్పుపెట్టాడు. సరిగా నాలుగు నెలలకు ఆ సొమ్ము రెట్టింపై అతనికి తిరిగి వచ్చింది.

ఈ అనుభవం ఆధారంతో, అతను సొంతాన ఒక పిక్చరును మద్రాసుకు డిస్ట్రిబ్యూషను తీసుకుని, పదివేలు పోగొట్టుకున్నాడు. తనకు నష్టం తెచ్చిన పిక్చరే ప్రొడ్యూసర్లకు మంచి లాభాలు తెచ్చింది.

రామదాసు సినిమా కంపెనీ పెట్టాడు-బి.టి.యస్. పిక్చర్స్. ఈ కంపెనీ రిజిస్టరయిన రోజునే శాల నర్సింగ్ హోమ్‌లో ఆడపిల్లను కన్నది.

రామదాసు సినిమారంగంలో ప్రవేశించేనాటికి సినిమా పరిశ్రమ ఒక మూఢ విశ్వాసం నుంచి బయటికి వస్తున్నది - గుడ్డునుంచి పిల్ల వచ్చినట్టు. ఆ మూఢ విశ్వాసమేమంటే సినిమా ఒక కళా సాధనమని. పిక్చర్లు తీసేవాళ్ళల్లో "కళ" అనే మాట చూసి బెదిరేవాళ్ళు నిక్షేపంగా పిక్చర్లుతీసి డబ్బుచేసుకోక, ఈ దిక్కుమాలిన కళారాధన ఏమిటనీ. కళ అనే విమర్శకులందర్నీ దుల్లభ్యం

దొడ్డిలో ఎందుకు పెట్టరనీ అనుకొనేవాళ్ళు చాలా మంది ఉండి కూడా, తమ నమ్మకాలను పైకి చెప్పేవారుకారు. కాని ఉన్నట్టుండి అదంతా పోయింది. సినిమాలు తియ్యడంలో అందెలు వేసుకొన్న చేతులే కుండపగలేసి, "మేం చేసేది వ్యాపారం! సాధ్యమైనంత ఎక్కువ మందికి చిత్రంలో ఆకర్షణ కలిగించి వినోదం వెదజల్లడమే మా కృషి. ఎవరన్నా ప్రజల అభిరుచులను బాగు చెయ్యండి. మేము వారి అభిరుచులకు అనుగుణంగా మా చిత్రాలలో కళను ప్రవేశ పెడతాం. అంతేకాని, నూరుమంది ప్రేక్షకులలో ఇద్దరి చేత శభాషనిపించుకునే టందుకు పిక్చర్లు తీసి, మేము దివాలా తియ్యడమంటే అది జరిగే పనికాదు" అని ఉన్న సంగతి స్పష్టం చేసి, కొత్త "మానిఫెస్టో" ప్రకటించారు.

ఈ మానిఫెస్టో రామదాసు హృదయానికి మధురాతి మధుర సంగీతం లాగా వినిపించింది. రహస్యమేమంటే కళా ప్రమాణాలు అమలు జరిగితే, తనకు పిక్చర్లు తీసే అర్హత అంతగా ఉండదనీ చిత్ర నిర్మాణం వ్యాపారమే అయే పక్షంలో, మరెవరికీ తాను తీసిపోననీ అతని నమ్మకం.

ఈ నమ్మకానికి ఆధారం ఏమి లేదు. ఆనాడు తెలుగు సినిమా రంగంలో, రామదాసుకన్న చిత్ర నిర్మాణం గురించి తక్కువ తెలిసినవాడు మరొక డెవడూ లేడు. ప్రొడ్యూసరని పేరు పెట్టుకుని, కంట్రాక్టరుగా సినిమా రంగంలోకి వచ్చిన మొదటి ఇద్దరు ముగ్గురులో రామదాసు ఒకడు.

రామదాసు ఇటీవల విడుదల అయిన పిక్చర్లలో బాగా డబ్బు గడించిన రెండు పిక్చర్లు తీసుకుని, అందులో ఎవరెవరు నటించారో, వాటికి స్క్రీన్ప్లేలు రాసిందెవరో, ఆర్టు మ్యూజిక్, డాన్సు వగైరాలకు డైరెక్టర్లెవరో, ప్లేబాక్ పాడిన వాళ్ళెవరో లిస్టు తయారుచేయించాడు. ఎవరెవరు ఎంతెంత పుచ్చుకున్నదీ ఒక లిస్టు తయారు చేయించాడు. ఏ శాఖలో ఎవరెవరు ఎక్కువ పుచ్చుకున్నదీ, ఎవరి పనితనం ఫీల్డులో ఎక్కువ ప్రశంసలు పొందినదీ ఇంకో లిస్టు తయారు చేయించాడు. ఈ లిస్టులన్నీ చక్కగా, మంచి బాండ్ పేపర్ మీద టైప్ చేయించి, వాటిని రోజుల తరబడి అహోరాత్రులు పారాయణ చేసి అన్ని పేర్లూ, అన్ని సంఖ్యలూ కంఠస్థం చేసుకున్నాడు.

తరువాత అతను ఇద్దరు ముగ్గురు ఫిలిం జర్నలిస్టులను పిలిచి, వాళ్ళకు పిక్చరు ఎట్లా తియ్యాలో చెప్పాడు. అతనితో వాళ్ళు అన్ని విషయాలలోనూ పూర్తిగా ఏకీభవించారు: ఇతర విస్పష్టమయిన అభిప్రాయాలతో సినిమా రంగం లోకి ఎవరూ రాలేదని ఒకడు ఒప్పుకున్నాడు కూడా.

రామదాసు లిస్టులో వున్న ఇద్దరు సినీ కథకులకూ ఆహ్వానం వెళ్ళింది. ఒకతని కోసం ఇవాళా, రెండో అతని కోసం రేపు కారు వెళ్ళింది. వాళ్ళతో

రామదాసు, తనకు సినిమా పరిశ్రమ కొత్త అని ఒప్పుకున్నాడు. వాళ్ళు లోగడ తీసుకుంటున్న మొత్తాల కంటె ఇంకా ఎక్కువే ఇవ్వడానికి తాను సిద్ధంగా వున్నానని అతను సూచించాడు. మంచి కథ లభించే పక్షంలో, అయిదువేలిస్తే దొరికే కథకన్న, పదివేలకు రెట్టింపు మంచి కథ దొరుకుతుందనీ, చాతనయిన వాణ్ణి పట్టుకుని వాడికి డబ్బాశ పెట్టడం కంటె, నేర్పరి అయిన ప్రొడ్యూసరు చెయ్యగలదేమి లేదనీ అతని దృఢ విశ్వాసం.

ఇద్దరు సినీ కథకులలోనూ ఒకడు రామదాసుకు నచ్చలేదు. అతను రామదాసుకు నచ్చని మాట అన్నాడు. "అయ్యా, నేనిప్పటికి అరడజను పిక్చర్లకు కథలు రాశాను. అన్నిటికన్న ఎక్కువ పెద్ద హిట్ అయిన కథ నా ఉద్దేశంలో అన్నిటికన్నా చప్పుది."

"ఎందువల్లా?" అని రామదాసు అడిగాడు.

"కథ ఉండగానే సరాంటి? కాస్టింగ్ బాగుండాలి, మంచి డైరెక్టరును అమర్చాలి. సినిమాకు ఎన్ని హంగులు!"

ఈ మనిషి ధోరణి చూస్తే, ఇతను కళావాదిగా కనబడ్డాడు.

"నా ఏర్పాటు పూర్తికాగానే, మీకు మళ్ళీ కబురు చేస్తాను" అన్నాడు రామదాసు. అతని ఉద్దేశంలో కథ రాసేవాడు అంతా కథలోనే ఉందనాలి. పాట లిచ్చేవాడు పాటలలోనే ఉందనాలి. ఆఖరుకు మేకప్ వాడు కూడా, తన మేకప్ లోనే పిక్చర్ హిట్ అవుతుందన్న నమ్మకం వెలిబుచ్చాలి. అంతేగాని, కథకుడు డైరెక్టర్ మీద అంతా ఆధారపడి ఉంటుందని, డైరెక్టర్ స్టార్ల మీద ఆధారపడి ఉంటుందని అంటూ పోతే, దానికి అంతెక్కడ? అటువంటి వాళ్ళను నమ్ముకుని తాను నట్టేట దిగగలడా!

రెండో కథకుడు రామదాసుకు తగినట్టు మాట్లాడాడు. "మీలాగ అందరూ కథకు విలువనిస్తే, పిక్చర్లు దెబ్బ తింటయ్యాండీ? మంచి కథ అన్నారే, మంచి కథ తయారు చెయ్యటానికి ఒకటే పద్ధతి ఉంది. మనం ఏ కథ తీసుకున్నప్పటికీ, దాన్ని మలుచుకుంటూపోతే అదే మంచి కథ అవుతుంది. ఒక్క రహస్యం చూడండి. ఒక పిక్చరుతీసి రిలీజు చేశాం. అది ఫెయిలయింది. ఎందుకూ? కథ బాగాలేక. అందులో ఏం బాగాలేదో, ఏ పావలా టిక్కెట్టువాణ్ణి అడిగినా చెప్పేస్తాడు. చిత్రం చూశారో, లేదో, ఏ పావలా టిక్కెట్టు వాణ్ణయినా అడగండి. అందరూ ఒకే లోపాలు చెబుతారు. బెజవాడలో ఫెయిలయిన పిక్చరు, బందరులో డబ్బు చేసుకోగా చూశారా? ఫెయిలయ్యే పిక్చరు అన్ని సెంటర్లలోనూ ఫెయిలవుతుంది. అంటే ఏమిటన్న మాటా? ప్రొడ్యూసరు దగ్గిర ఇంతమందీ వుండి, ఇంతమంది డబ్బుతిని, దేశ

మంతటా వుండే సామాన్య ప్రేక్షకులు పట్టుకునే లోపాలు సవరణ చెయ్యలేక పోయారన్నమాట. ఇంతకంటే నామర్దా మరొకటి ఉంటుందా? అసలు ఒక పిక్చరు ఎందుకు ఫెయిలు కావాలని నే నడుగుతున్నాను."

రామదాసు చెవులకు ఈ మాటలు అమృతోపమానంగా వుండినై. అటువంటి వాణ్ణి వెంటబెట్టుకుని, నడిసముద్రములో దూకినా ఫరవా లేదనుకున్నాడతను.

# 11

సుదర్శనం మానసికంగా పింఛను పుచ్చేసుకుని చాలాకాలమయింది. ఆయనకు రామదాసుతో వున్న సంబంధం చాలా పరిణామాలు పొందింది. వాళ్ళిద్దరి మధ్యా తండ్రీ కొడుకుల కుండదగిన అన్యోన్యత ఏనాడూ లేదు. తనకు ఒక భార్యా, ఇద్దరు బిడ్డలూ ఉన్న సంగతి, సాధ్యమైనంత వరకు మరిచిపోవడానికే ఆయన ప్రయత్నించేవాడు. ఒకవేళ జ్ఞాపకము తెచ్చుకుని, కుటుంబీకుడుగా తన ధర్మం నెరవేర్చుకోవడానికి ప్రయత్నిస్తే, ఆయనకు బురదగుంటలో దిగబడినట్టయ్యేది. వెంటనే ఆయన తన మనస్సును వర్తకంలో నిమగ్నంచేసేసి, తన భార్యనూ, బిడ్డలనూ పూర్తిగా మరచేవాడు. అందువల్ల ఆయన చాలా సుఖంగా ఉండేవాడు. ఆయనకు వర్తకంలో గల ఆసక్తి ఎక్కువగా పెళ్ళాం బిడ్డలపై గల ద్వేషం యొక్క మారురూపమేమో.

సుదర్శనాన్ని ఎవరూ స్వార్థపరుడని ఆక్షేపించలేదు గాని, నిజానికి ఆయన స్వార్థం తప్ప ఏనాడూ ఇంకేమీ చూడలేదు. ఆయన జీవితమంతా పోరాటమనీ, తనను తాను రక్షించుకోగలవాడే నెగ్గుతాడనీ మొదటినుంచీ గట్టి నమ్మకం. తన లాభంకోసం ఆయన ఇతరులకు నష్టం కలిగించడానికి ఏనాడూ వెనుకాడలేదు - తన సుఖాన్నే లాభంకోసం యెన్నోసార్లు త్యాగం చేశాడు. అయితే, జీవితం ఆయనకు అనుకూలించింది. అందుచేత ఆయనకు జీవితంపైన గాని, ప్రపంచంపైన గాని ద్వేషం పేరుకోలేదు. తనచుట్టూ ఉండే సమాజమూ, దాని నియమాలూ ఆయనకు ఏనాడూ పెద్ద అవాంతరం కలిగించకపోవడంచేత, ఆయన ఉన్న సాంఘిక వ్యవస్థలో మార్పులు కూడా కోరలేదు.

భాను ఆయన జీవితంలో ప్రవేశించేవరకూ సుదర్శనంగారు ఒకరిని గురించి మదనపడలేదని చెప్పవచ్చు! భాను ఆయనకు కొత్త జీవితం యిచ్చింది. తన కష్టసుఖాలు ఎన్నడూ ఇంకొకరితో పంచుకోనివాడు, భాను ఆనందం పంచుకోవడమూ, ఆమె విచారం తన విచారం చేసుకోవడమూ నేర్చుకున్నాడు. భానూకు, తనకూ మధ్య దుర్గాంబ అంతో ఇంతో అడ్డుపడుతుందని తెలిసి కొంత

జాగ్రత్తగానే మసులుకొన్నాడు. ఆ ఇష్టం తొలగిపోయినట్టు కనపడగానే ఆయనకు సంపూర్ణమైన సంతృప్తి కలిగింది.

తరవాత రామదాసు తన దృష్టిని ఆకర్షించడం మొదలుపెట్టాడు. అతనంటే మొదట ఉండిన అసహ్యం క్రమంగా పోయింది. ఎంతైనా తన కొడుకు అన్నభావం రామదాసుపైన సుదర్శనంగారికి కలగసాగింది. రామదాసు డబ్బును ఆకర్షించే విద్యలు అలవరచుకొంటున్నవాడల్లే కనిపించడమే అందుకు కారణం.

రామదాసుపైన సుదర్శనంగారికి సదభిప్రాయము ఏర్పడడానికి మరొక కారణం కూడా ఉంది. అతను ఎప్పుడూ భానుపక్షం ఆదరం ఉన్నవాడల్లెనే ప్రవర్తించాడు. తల్లి మాదిరిగా విషం కక్కలేదు.

తన కొడుకుపైన సద్భావం ఏర్పడడం ప్రారంభమైనప్పటినుంచీ, ఆయన డబ్బు సంపాదన పూర్తిగా రామదాసుకు వదలి, తాను భానుతో ఎక్కువ కాలం గడుపుతూ మనస్సుకు సుఖమూ, శాంతీ పొంది, వృద్ధాప్యంలోకి జారుకొందామని తలుచుకున్నాడు. కొంతకాలం ఆయన ఆ శాంతి సౌఖ్యాలు అనుభవించాడు కూడా. భానూ, పద్మా తన ఇంటికి వచ్చెయ్యడానికి తగిన పరిస్థితులు రామదాసే కలిపించాడు. మంత్రగాడు పామును కట్టేసినట్లుగా అతను తన తల్లిని కూడా పూర్తిగా మార్చేసినట్టు కనబడ్డాడు.

కొడుకుపైన ఏర్పడిన ఈ గుడ్డినమ్మకం మూలాన సుదర్శనంగారు భానుకు ఏర్పడిన ఆస్తిని కాపాడలేకపోయినాడు. దుర్గాంబ పామే అయినప్పటికీ, రామదాసుతో పోలిస్తే వట్టి బురదకట్టె అనీ, రామదాసు అసలైన కట్లపామనీ సుదర్శనంగారు గ్రహించేసరికి వ్యవహారం పూర్తిగా చెయ్యిదాటిపోయింది. రామదాసు ముందుగానే పథకంవేసి కంపెనీలు దివాలా తీసేనాటికి తన తండ్రికి గాని, భానుకిగాని ఏమీలేకుండా చేశాడు. ఇది కాకతాళీయంగా జరిగినది మటుకు కాదు. పరిపూర్ణమైన శకుని ఎత్తు !

అయితే, ఈ ఎత్తు దేనికి ఉపోద్ఘాతమో స్పష్టం కావడంలేదు. రామదాసుకు కావలసిందేమిటి? తననూ, భానునూ అతనిపై ఆధారపడి బతికేటట్టు చెయ్యడమా, లేక యిద్దరినీ బయటికి తోసేసి అవమానించడమా ? రామదాసు ఉద్దేశం ఇదేదీ కాదనీ, డబ్బు సాధ్యమైనంత పెద్ద మొత్తంలో ఒకచోట కేంద్రీకరించడం కోసం ఈ వెధవ ఎత్తులన్నీ వేస్తున్నాడనీ సుదర్శనంగారు ఊహించాడు. తన కొడుకు మనసులో వున్న అభిప్రాయం స్పష్టమయేదాక ఆయన ఏమీ చెయ్యడం లేదు.

రామదాసు ప్రారంభించిన సినిమా కంపెనీలో అతనికీ, అతని భార్యకూ, అతని కొడుక్కూ, తల్లికీ, చెల్లెలుకూ మాత్రమే షేర్లున్నై. ఈ షేర్లను ఒక్క

నాడు రామదాసూ, తల్లీ, కోమలా చర్చించుకుంటుండగా సుదర్శనంగారు బయటి వరండాలో నుంచి విన్నాడు.

"నాన్నకు షేరులేకుండా చేశావేం?" అన్నది కోమల రామదాసుతో.

"ఒకందుకు నాన్నను ఫ్రీగా ఉంచాను. అది తర్వాత చెబుతాను. ఆఫ్టరాల్, నాన్న పేరు సినీఫీల్డులో పెద్దగా కౌంట్ కాదు కూడా. అందుకని-"

"మా పేర్లేనా కౌంటయేది" అన్నది కోమల.

"అదే నేనూ అనేది-మన పేర్లాంటిదే నాన్న పేరుకూడా- ఈ ఫీల్డులో. కాని నాన్న పేరు కౌంటయే ఫీల్డు వేరే ఉండొచ్చుగా…"

ఈ సంభాషణ వింటుంటే సుదర్శనానికి వికారం వేసింది. "వట్టి వెధవ!" అనుకున్నాడాయన తన సుపుత్రుణ్ని గురించి.

అహోరాత్రులు సినిమాగురించి చర్చలు జరుగుతున్నై. ఎవరో వస్తున్నారు. పోతున్నారు. బయటివాళ్ళతో మాట్లాడడంవల్ల సంపాదించిన పడికట్టురాళ్లు నాలుగూ తెచ్చి తల్లిదగ్గరా, చెల్లెలు దగ్గిరా గలబరించేవాడు రామదాసు.

"చూడమ్మా! నువ్వు సినిమాకు ఎందుకు పోతావు? వినోదం కోసం. జీవితంలో మనకు వినోదం ఎట్లా వస్తుంది? మనకంటే మనకు కాదనుకో - మనం అప్పర్ స్టాల్స్ క్లాసు. సినిమాలు ఆ క్లాసుకోసం తియ్యగూడదు. వేలిముద్రనిశానీ గాళ్ళకోసం తియ్యాలి. వాళ్ళటేస్టు చాలా పూర్‌గా వుంటుంది. సినిమాల్లో ఎంత తక్కువ చేస్తుంటే, అంత మంచి బిజినెస్ జరుగుతుంది. బాక్సాఫీస్ అపీల్, అద్భుతమైన సన్నివేశాలు - ఆశ్చర్యకరంగా వుండాలి ప్రతి సంఘటనా! అది నా మోటో! మిగిలిన విషయమేమైనా, ప్రతి సీను ఆశ్చర్యకరంగా వుండాలని కవిగారితో స్పష్టంగా చెప్పేశాను…."

సాధారణంగా నోరు తెరవని రామదాసు సినీధర్మమా అంటూ వట్టి వదరుడుగాడు కావడం సుదర్శనానికి ఆశ్చర్యం వేసింది. చిన్నతనంలో ఏ ఆటలూ ఆడేవాడు కాడు. ఇప్పుడు సినిమాతో ఆడుకుంటున్నాడు! ఆయన మిత్రుడు గూడవల్లి ప్రొడ్యూసరుననీ, డైరెక్టరుననీ చెప్పుకొనే ముందు సినిమాలలో ఎంతగా ఊరాడో, ఎంత అనుభవం గడించాడో సుదర్శనం గారికి తెలుసు. ఆయన రామదాసుకు అపజయం శంకించడంతో తృప్తిపడక, అతను ఈ సినిమాలలో నడుము విరిగే దెబ్బ తినాలని వాంఛించాడు కసిగా.

ఉన్నట్టుండి ఒకనాడు వ్యవహారం సీరియస్‌గా పరిణమించింది. ఒకరాత్రి భోజనాల దగ్గిర సంభాషణలో అగ్నిపర్వతం బద్దలయింది.

"నీ పిక్చర్లో నాక్కూడా వేషం ఉందా ఏమిటి? చిన్న సినిమాస్టారైపోతాను. నాకు డబ్బివ్వక్కర్లేదులే. మంచి క్లోజప్‌లు నాలుగుంటే చాలు" అన్నది కోమల వేళాకోళానికి అన్నట్టుగానే.

రామదాసు మాత్రం చాలా గంభీరంగా, "సారీ, కోమలా! నీకిస్తే హీరోయిన్ వేషానికి తక్కువ ఇచ్చి లాభం లేదు. మొదటి పిక్చరులోనే నిన్ను స్టారు చెయ్యడం చాలా రిస్కు. ఒక చిన్నవేషం ఉందిగాని, దాన్ని పద్మకు ఆదివరకే ప్రామిస్ చేశాను. డైరెక్టరుగారు కూడా పద్మ ఆ వేషానికి సరిగా సూట్ అవుతుందన్నాడు. మీ అందరికన్నా భానూగారికి చాలా మంచిరోల్ ఉన్నది. దాని కావిడ ఐడియల్‌గా సరిపోయింది" అన్నాడు.

సుదర్శనంలో ఉన్న రాక్షసి కెవ్వున కేకవేసింది. "ఎట్లాగూ? భానూకు నీ పిక్చర్లో వేషం ఇవ్వడానికి నిశ్చయించావా? నాతో మాటమాత్రం అనలేదేం?" అన్నాడాయన తన కోపాన్ని అతికష్టం మీద అణుచుకుంటూ.

"ఇప్పుడు చెబుతున్నానుగా?" అన్నాడు రామదాసు, చాలా శాంతంగా.

"నోరుముయ్యరా. కుక్కా! మక్కెలు విరగదన్నగలను! నువ్వూ నీ బోడి పిక్చరూనూ" అన్నాడు సుదర్శనం, కోపంతో వణికిపోతూ.

దుర్గాంబా, కోమలా కూడా ఆయన కోపాన్ని అర్థం చేసుకోలేనట్టు ఆశ్చర్యపడ్డారు. "భాను వేషం వేస్తే ఏం? తప్పా? ఆవిడ గౌరవానికి భంగమా? ఈనాడు సినిమా నటులకున్న గౌరవం మరెవరికీ లేదే! ..

వాళ్ళు పూర్తిచేయకమునుపే రామదాసు అందుకున్నాడు! "ఇందులో అఫెన్స్ ఉన్నదని నేను కలలో కూడా అనుకోలేదు. ఎప్పుడో నేను పుట్టకమునుపు స్టేజిమీద ఆడవాళ్ళు నటించడం అమర్యాద అని ఫూల్స్ అనుకుంటే, రాఘవాచారిగారు[1] తన భార్యచేత వేషాలు వేయించారని విన్నాను. సమ్‌హౌ, నాకు ఈ పాత కాలపు అభిప్రాయాలు నచ్చవు. అవకాశం దొరికితే వేషం వేయించడానికి నా కభ్యంతరంలేదు!" అన్నాడు రామదాసు.

---

1. బళ్ళారి రాఘవాచార్యులు (1880-1946). స్త్రీపాత్రలు స్త్రీలే ధరించాలని చెప్పి, ముందుగా తన భార్యనే రంగస్థలం మీద నటింపచేసిన సంస్కారి. ఆంధ్ర నాటక రంగంలో మార్పుకు తోడ్పడిన ఆదర్శనటుడు. బళ్ళారి రాఘవ పిలుపు నందుకొని రంగస్థలంమీద నటించడానికి ముందుకొచ్చిన నటీమణుల్లో కొమ్మూరి పద్మావతి (1908-1970)ని గురించి ప్రత్యేకంగా పేర్కొనాలి. సంప్రదాయాన్ని ఎదిరించి, కుటుంబ స్త్రీ అయిన ఆమె నాటక రంగం మీదికొచ్చారు.

"నాకు అభ్యంతరం ఉంది" అన్నది బాల, నిర్వికారంగా.

"భానూగారు అభ్యంతరం చెబితే నేను అర్థం చేసుకోగలను" అన్నాడు రామదాసు.

భాను వంచిన తల ఎత్తలేదు.

"భాను తన కభ్యంతరంలేదని చెప్పిందా?" అని సుదర్శనం, రామదాసుని అడిగాడు. అతను, తనను ఫూల్ అన్న సంగతి, ఆయన గ్రహించి, నిగ్రహం తెచ్చుకున్నాడు.

"లేదు. అడుగుదామని అనుకుంటున్నాను. ఈ ఐడియా ఇంతకుముందే...."

"నా కభ్యంతరం ఉన్నది. నా కభ్యంతరం ఉంటే భానుకు ఉన్నట్టే. మా ఇద్దరిమధ్యా నువ్వు తేడా తీయనవసరంలేదు" అన్నాడు సుదర్శనం.

ఆ రాత్రి భాను సుదర్శనాన్ని కావిలించుకుని చిన్న పిల్లల్లే ఏడిచింది.

"నేనంటే వాళ్ళకు గడ్డిపోచతో సమంగా ఉంది. చాలా కాలంగా భరిస్తున్నాను. నాకోసం మీవాడితో ఎందుకు పోట్లాడుతారు?" అన్నదామె.

రక్షణ అవసరమైన ఆడది, మంచితనంగల మగవాడిలో మంచితనాన్ని రేకెత్తిస్తుంది. మొదటినుంచీ భాను ఒక్కతే సుదర్శనంలో ఉండే మంచి సుగుణాలను పైకి తెచ్చింది.

"మనం ఇక్కడ వుండవద్దు భానూ? ముందూ, వెనకా ఆలోచించకుండా తాళ్ళాలు వాడిచేతికి ఇచ్చేశాను. తప్పంతా నాదే. వాడితో పోట్లాడి ఏం లాభం? ఓడిపోయినా, నేనింకా చితికిపోలేదు" అన్నాడు సుదర్శనం.

## 12

మర్నాడు ఆయన ఇన్సూరెన్సు కంపెనీకి వెళ్ళి, తన ఎండోమెంటు పాలసీ మీద అయిదువేలు అప్పు తీసుకున్నాడు. ఆ సాయంకాలంలోపల ఆయన ఎకామొడేషన్ కంట్రోలరుద్వారా, యాభై రూపాయల అద్దెగల భాగం ఒకటి, త్యాగరాయ నగరులో సంపాదించాడు.

మర్నాడు సుదర్శనం భానునూ, ఆమె తల్లినీ తీసుకుని అద్దె ఇంటికి బయలుదేరాడు. పద్మ తల్లివెంట రానన్నది. సుదర్శనం తన వస్తువులేవీ తీసుకోకపోవటం చేత, ఆయన ఇల్లు మారుతున్నాడని ఎవరూ అనుకునే అవకాశం లేకపోయింది.

కొత్త ఇంటికి రాగానే భానులో కలిగిన మార్పు వర్ణనాతీతం. ఆమెకు తన ఇల్లు ఎంత నరకంగా ఉండినదీ ఆ నరకాన్ని ఆమె ఏ విధంగా భరించినదీ సుదర్శనం ఇప్పుడు ఊహించాడు.

"టాక్సీమీద వెళ్ళి ఇంటికి కావలసిన సామానులా తెచ్చుకుందాం" అన్నాడు సుదర్శనం.

"ఫర్లాంగు దూరంలో పాండిబజారు పెట్టుకుని టాక్సీలేమిటి? మనం ఏడ వాళ్ళం తెలుసా? డబ్బు విషంలాగా వాడాలి?" అన్నది భాను.

"డబ్బు విషంగాక మరేమిటి?" అని సుదర్శనం గొణుక్కున్నాడు.

"ఆ ఇంట్లో భానుకాక, ఇంటివాళ్ళ కుటుంబమూ, అద్దెకుంటున్న మరొక కుటుంబమూ ఉంటున్నవి; ఆ కుటుంబాల స్త్రీలు, భానుతో స్నేహంగా వుండి సలహాలిచ్చి సహాయపడ్డారు. పనిమనిషి, పాలమనిషి, చాకలివాడు ఈ సమస్యలు పొరుగువాళ్ళ సహాయం లేకుండా పరిష్కారం కావు.

సుదర్శనంగారు బట్టలు, తువాళ్ళు, సేఫ్టీరేజర్, పళ్ళతోముకునే బ్రష్ వగ్గర నుంచీ అన్నీ కొత్తగా ఏర్పాటు చేసుకున్నాడు. ఆ రాత్రి భాను చాలా పొదుపుగా వంటచేసింది. కందిపచ్చడి, ఉల్లిపాయల పచ్చిపులుసు, ఉర్లగడ్డ వేపుడూ చేసింది. సుదర్శనం వంక చూడలేకపోతున్నది. కాని ఆయన "ఈ పూట భోజనం హాయిగా వుంది. రోంపై వేస్తారు. ఒక్కటీ నోటికి దాసంచదు-వెధవ గొప్పలు!" అన్నాడు.

"అమ్మాయ్, శాస్త్రుల్లునుకూడా పిలిపించవే, వాడు ఎక్కడో వుంటున్నాడు చూసి ఎన్నో రోజులయింది" అన్నది భానుతో, తల్లి.

సుదర్శనంగారికి కూడా శాస్త్రి అంటే చాలా ఇష్టం. భాను లాగే అతను కూడా ఆయన హృదయంలో ఆప్తస్థానం ఆక్రమించుకున్నాడు. పద్మను చూస్తే మొదట్లో ఆయనకు అభిమానంగా వుండేది. కాని అది రానురాను సన్నగిల్లింది. పద్మ ఆయన అభిమానాన్ని పోగొట్టుకొన్నదనాలి. ఎందుకంటే సుదర్శనంగారికి ఇష్టంగాని, అయిష్టంగాని దానంతట అది వస్తుందిగాని ఆయన వాటిని పనిబెట్టుకొని పెంచుకోడు, తగ్గించుకోడు.

తన కోడలు శాస్త్రిని భర్తగా వరించిందని భాను చెప్పినప్పుడు సుదర్శనం గారి భావాలన్నీ తుడిచిపెట్టినట్టయిపోయింది. ఆయన తన జన్మలో మొట్టమొదటి సారిగా ఏదో ఒక వికారం ప్రయత్న పూర్వకంగా తెచ్చిపెట్టుకోవలసిన స్థితిలో పడ్డాడు. శాస్త్రి మీద కోపం తెచ్చుకుని చూసుకున్నాడు. తన కోడలిమీద అసహ్యం తెచ్చుకొని చూసుకున్నాడు. రెండు వికారాలూ ఆయన మనస్సులో వేరు వెయ్యలేదు. చివరకాయన ఆ గొడవ తనకు సంబంధించినది కాదనే నిర్ణయానికి వచ్చాడు. కాలక్రమాన రామదాసు మీద అసహ్యం పెరిగినకొద్దీ రెండోప్రక్క శాస్త్రి మీది అభిమానంకూడా తిరిగివచ్చింది.

భాను వేరే ఇల్లు తీసుకుందని తెలియగానే శాస్త్రి ఎగిరిగంతేసి శర్మగారిల్లు వదిలి వచ్చాడు. శర్మగారి కుటుంబం అభ్యంతరం చెప్పలేదు. అతన్ని సాగనంపడానికి సరస్వతి కూడా వచ్చింది.

సరస్వతికి భానునుచూస్తే చాలా ఇష్టం. ముఖ్యంగా భాను మొహం ఎంతసేపు చూసినా ఆమెకు తనివి తీరేదికాదు. శాస్త్రి మొహంలోకూడా భాను పోలికలన్నా ఆమెకు చాలా ఇష్టం.

అయితే, ఈ రోజు భాను తనతో అంతగా మనసిచ్చి మాట్లాడ లేదని సరస్వతికి తోచింది. సరస్వతి అర్థం చేసుకున్నది. భాను ఈ అద్దెభాగంలోకి రావడంలో చాలా మెట్లు దిగివచ్చింది. ఇటువంటి "పతనం" మగవాడికన్నా ఆడదాన్ని ఎక్కువ బాధిస్తుంది. మగవాడు మళ్ళీ ఎక్కగలడు. కనీసం ఎక్కడానికి ప్రయత్నించ గలడు. ఆడదానికి ఆ అవకాశం లేదు - ముఖ్యంగా భానువంటి ఆడదానికి.

కాని, భాను విషయంలో సరస్వతి అనుకున్నది నిజం కాదు. ఆమె బెండు లాగా ప్రవాహంతోబాటు కొట్టుకుపోయే మనిషికాదు. ఆమె చాలావరకు మానసికజీవి. సుదర్శనాన్ని పెళ్ళాడ్డంవల్ల తన స్థాయి పెరిగిందని ఆమె ఏనాడూ అనుకోలేదు. ఆమెకు తెలిసిందల్లా, తన జీవితంలోకి కొంత ఆనందమూ, శాంతీ అడుగుపెట్టినయ్యని మాత్రమే. అవి రెండూ పెరిగితే ఆమె సంతోషించేది, తరిగితే దిగులుపడేది.

భాను ఇవాళ సరస్వతితో సరిగా మాట్లాడకపోవడానికి వేరే కారణం ఉంది. అది అసూయ. శాస్త్రీ, సరస్వతీ కలిసి లోపలికి వస్తుంటే చూసి వాళ్ళిద్దరూ ఎంతమంచి జోడు అవుతారో భాను తెలుసుకుంది. కొంతకాలంగా ఆమె మనసులో తన కూతురు రామదాసు బోధలువిని ఈ తిప్పతిరుగుళ్ళు తిరగడానికి మారుగా శాస్త్రిని పెళ్ళిచేసుకున్నట్టయితే, ఎంతో ఆదర్శప్రాయంగా ఉండేదని అనిపిస్తు వస్తున్నది. ఇప్పుడున్న పరిస్థితిలో శాస్త్రి పద్మను చేసుకోడు. కాని సరస్వతి పద్మవంటిదే కావచ్చు - ఎవరు చూశారు? అయినా శాస్త్రి పద్మను చేసుకోడు. ఈ సరస్వతిని చేసుకుంటాడు. వాళ్ళిద్దరికీ మధ్య ప్రణయం నడుస్తున్నదేమో కూడాను! ఈ సరస్వతి లేకపోతే శాస్త్రి పద్మను చేసుకునేవాడేమో! ఎంతచెడ్డా రక్తసంబంధం కద...!

ఇటువంటి ఆలోచనల ఫలితంగా భాను సరస్వతిని చూసి అసూయపడింది. దాన్ని దాచడం ఆమెకు సాధ్యం కాలేదు.

సరస్వతి శాస్త్రిని చేసుకొనడానికి ఒప్పుకోక పోవచ్చుననన్న అనుమానం భానుకు కలుగలేదు. ఈ విషయంలో ఆమె పొరపాటు పడనుకూడా లేదు.

బొంబాయిలో ఉన్న రోజుల్లోకూడా సరస్వతికి శాస్త్రి అంటే ఇష్టం లేకపోదుకాని, ఆ ఇష్టంలో ఒక ప్రత్యేకత లేదు. ఆమెకు నచ్చిన అరడజను మందిలో శాస్త్రి ఒకడు.

కాని ఆమె మద్రాసు వచ్చి చాలా కాలానికి శాస్త్రిని చూడగానే, ఆమె ఇష్టం ఒక విస్పష్టమైన రూపాన్ని పొందసాగింది. శాస్త్రి అంగబలం లేకుండా బతక లేడని తోచిన క్షణంనుంచి ఆమె అతన్ని పెళ్ళాడదానికి కూడా నిశ్చ యించుకున్నది.

నిజానికి, సరస్వతికి ఏ రెండు సంవత్సరాల క్రితమో పెళ్ళి అయి ఉండ వలసింది. కాని, ఆమె సుఖమయమైన కుటుంబ జీవితంలో పెరుగుతూ తండ్రి ప్రేమ, తల్లిప్రేమ, తోబుట్టువుల ప్రేమా కలది దావడంచేత, ఆమె మనసు ఆ వాతావరణం నుంచి బయటపడదానికి తహతహ లాడలేదు. అదీగాక, శర్మగారి సిద్ధాంతం - తన కూతురు తన భావిభర్తను స్నేహంద్వారా సంపాదించుకోవడం సరియైన పద్ధతి అని. శాస్త్రికీ, ఆమెకూ మధ్య పెరుగుతున్న స్నేహాన్ని సరస్వతి తల్లిదండ్రులు కనిపెట్టుతూనే ఉన్నారు. వాళ్ళిద్దరికీ పెళ్ళి అవుతుందని వాళ్ళకూ తెలుసు.

ఈ విషయంలో సరస్వతి తల్లిదండ్రులకు ఏమాత్రం సందేహం లేకపోవ డానికి ఒక కారణమేమంటే-శాస్త్రిమీద పోటీగా ఎవరూ లేకపోవడం. సరస్వతిని అనాకారి అయినట్టు - లేక అదివరకే పెళ్ళి అయిన మనిషిలాగా - చూశారు మద్రాసు యువకులు. ఆమెకేసి ఆకలిగా చూసేవాళ్ళూ, వీదుల్లో ఆమెను వెంబడిం చినవారూ కరువైనారనికాదు. మద్రాసులో మగవాళ్ళకు చిత్తకార్తె కుక్కలకున్నపాటి 'జ్ఞానం' లేకపోలేదు - అంతకుమించి మాత్రం లేదు.

సరస్వతిని చూసి ఆమెతో పరిచయంవున్న బ్రహ్మచార్లలో కనీసం ముగ్గురు, నలుగురు ఆమె తమను కోరదగిన భార్య అవుతుందని భావించి, ఆమె స్నేహం సంపాదించడానికి యత్నించివుండవచ్చు. వాళ్ళు శాస్త్రికి పోటీ అయి వుండేవాళ్ళు. కాని అదేమీ జరగలేదు. ముక్కూ మొఖమూ ఎరుగనివాణ్ణి చేసుకోవడానికి సరస్వతి సిద్ధంగా ఉన్నట్టయితే, ఏమయేదో చెప్పలేం. కాని, ఆమెకు అటువంటి ఉద్దేశం లేకపోవడంచేత ఆమె శాస్త్రిని వరించుకున్నది. శాస్త్రి తనను అప్పుడప్పుడూ మాటలతో కవ్వించినా, తనపట్ల ఎంతో ఆత్మనిగ్రహం ప్రదర్శిస్తూ ఉందటం ఆమె గమనించి, దాన్ని మంచి లక్షణంగా భావించింది.

# 13

రామదాసు పిక్చరు పూర్తి చేశాడు. చూసినవాళ్ళు తమ అభిప్రాయాలను రకరకాలుగా వ్యక్తం చేశారు. పిక్చరు కొత్తరకంగా ఉన్నది .... క్లాసెస్‌నేమో

గాని, మాసెస్‌ను అప్పీలు చేస్తుంది ... టెక్నికల్‌గా ఇంకా బాగుండవచ్చు. కాని అది బాక్సాఫీసు పాయింటు కాదు .... కొత్త ప్రొడ్యూసరు ఈపాటి పిక్చరు తియ్యడం ఘనమే...పిక్చరు హిట్టే! ఇంకెందుకు, స్టూడియోకు, శంకుస్థాపన చెయ్యవచ్చు. లేకపోతే ఇన్‌కంటాక్స్ కట్టుకోవాలి! .... దీన్ని తమిళంలో తీయవలసింది ....

రామదాసు తానే కథకుడు, డైరెక్టరు, కెమెరామన్ అయినట్టుగా పిక్చరును చూసి తన ప్రజ్ఞకు ఎంతో మురిసిపోయినాడు! ఇంటిల్లిపాదీ పిక్చరును దాదాపు రోజూ చూశారు. బాలమ్మాత్రం ఒకటి రెండుసార్లే చూసింది. తరవాత ఏదో సాకు చెప్పి ఎగగొట్టింది. పద్మ ప్రతిసారీ చూసింది. అందులో ఆమె వేషం వేసిందిగద. ప్రతిసారీ తనను మాత్రమే ఆసక్తితో చూసుకునేది. నిజానికి పిక్చరులో ఆమెకు నచ్చిందీ తన వేషం ఒక్కటే. మిగిలిందంతా చెత్తే. అయినా, పిక్చరు బాగాలేదని ఆమె తన నోటితో అనలేదు.

ఒక రిద్దరు డైరెక్టర్లుకూడా రామదాసు కోరికపై పిక్చరు చూడవచ్చారు. ఏదోవిధంగా పద్మ ప్రతిసారీ డైరెక్టర్ల పక్కనచేరి తాను వేషం వేసిన షాట్సు వచ్చినప్పుడు వాళ్ళ మొహంకేసి ఆశగా చూసింది.

పిక్చరు చూడడానికి రమ్మని రామదాసు ఖానునుగాని, సుదర్శనాన్ని గాని, శాస్త్రినిగాని పిలవలేదు. అతను పత్రికల వాళ్ళకు కూడా పిక్చరు చూపించలేదు. అది అనవసరమని అతను సులువుగా రుజువుచేశాడు. పత్రికలలో బాగా రాయకపోతే, పిక్చరు దెబ్బతినదు. బాగారాస్తే డబ్బు ఎక్కువ వచ్చేదీ లేదు. వాళ్ళు తిట్టినా, పిక్చరు దెబ్బతిన్నా, దీవించినా, పిక్చరు హిట్టయినా అంతా తమ ప్రయోజకత్వమే అంటారు. వాళ్ళు దీవించిన పిక్చరు దెబ్బతింటేను, తిట్టిన పిక్చరుకు డబ్బు వస్తేను, వాళ్ళు ప్రేక్షకులను తిడతారుగాని తమది బుద్ధితక్కువ అని ఒప్పుకోరు .. ఇంకెందుకు పిక్చరు వాళ్ళకు చూపడం ?

రామదాసు తన చిత్రానికి పత్రికలలో పబ్లిసిటి బాగా ఇచ్చాడు. అయినా పిక్చరు దెబ్బతిన్నది. మొదటి మూడు రోజులూ వచ్చిన కలెక్షను మరి రానే లేదు. రెండో ఆదివారం కలెక్షను మొదటి ఆదివారం కలెక్షనులో సగం ఉంది. మూడు వారాలదాకా కొత్త పిక్చరు రిలీజుగాని కారణంచేత, కొంత డబ్బయినా వచ్చింది. పిక్చరుకు మంచిపేరు రాలేదు మొత్తానికి.

"ఈ పిక్చరు మీద నాకు రెండు లక్షలదాకా నష్టం రావచ్చు!" అన్నాడు రామదాసు. అది అబద్ధం. అతను తన సొంత సొమ్ము ఖర్చు చెయ్యనేలేదు. పిక్చరు దెబ్బతిన్నదని అతను విచారపడగా చూసినవారు లేరు.

కాని పద్మ కుంగిపోయింది. తనకు స్వయంగా అన్యాయం చేసినట్లు తలపోసింది. చాటుగా ఏడిచింది.

రామదాసు దెబ్బతింటే, సంతోషించాలనుకున్న ఉపన్యాసంకూడా సంతో షించలేక పోయినాడు - కాని రామదాసును కసితీర తిట్టాడు.

అసలు సంగతేమిటంటే, రామదాసు ఈ పిక్చరువల్ల ఆర్థికంగా దెబ్బతిన లేదు. అతని డబ్బు అతనికి వచ్చింది. అతను మళ్ళీ ఇంకో పిక్చరుకు ప్రయత్నాలు కూడా ఆరంభించాడు. తన డిస్ట్రిబ్యూషన్ సంస్థనుకూడా లిమిటెడ్ కంపెనీచేసి. తనవాళ్ళనే వాటాదార్లుగా పెట్టుకున్నాడు.

ఈ రెండో పిక్చరులో తనకు వేషం ఉండదని తెలియగానే, పద్మ కుంగి పోయింది. ఆమె వెర్రిదానిలాగా నిర్మాణంలో వున్న చిత్రాలన్నిటిలోనూ వేషాల కోసం ప్రయత్నించింది. ఆమె నిజంగా వెర్రిదే - అంత అపర్థా చేసుకునే మనిషికి ఎవరూ, ఎన్నడూ వేషాలివ్వరు. ప్రొడ్యూసర్లు ఆమెకు విస్పష్టంగా ప్రవర్తించారు: “నీకు వేషం ఇవ్వడానికేం. కళ్ళకద్దుకుని ఇస్తాం - సరి అయిన వేషం ఉండాలేగాని, అడిగావుగదా అని ఏదో వేషం ఇస్తే నీకూ దెబ్బ. పిక్చరుకూ దెబ్బ. అదేమీ ప్రయోజనంలేదు ...మీవాడే ప్రొడ్యూసరై ఉండగా, నీకు వేషాలకేం కొదవ?.... కిందటి వారమే గిరి కుమారిని బుక్ చేశాం - నీకు సరిగా సూటయ్యే వేషం!! ఎంత పొరపాటయింది!....”

ఇటువంటి సమాధానాలు పద్మ ఆందోళనను పెంచినైగాని, తగ్గించలేదు. ఆమె డైరెక్టర్లచుట్టూ తిరిగింది. వాళ్ళు ఇంతకన్న కూడా అయోమయంగా మాట్లా డారు. ఒక డైరెక్టరు ఆమెను మహాబలిపురం రమ్మని ఆహ్వానించాడు. పద్మలో ఆశ తలెత్తింది.

వాళ్ళిద్దరికీ ఆ విధంగా ప్రారంభమైన స్నేహం రెండునెలలపాటు మహ త్తరమైన ప్రణయ కథలాగా నడిచింది. దాన్ని గురించి పత్రికలవాళ్ళు అంటీ అంట కుండా రాశారు. ఒక దిక్కుమాలిన పత్రిక బహుళ ప్రచారమూ, అపఖ్యాతీ కలది- బహిరంగంగానే వివరాలతో సహా రాసింది. రెండు మూడు ఫోటోలతో- ప్రీవ్యూలూ, యితర ఫంక్షనులూ జరిగినప్పుడు తీసినవాటిలో - డైరెక్టరుతోబాటు పద్మ కూడా వున్నది నల్లద్దాలు పెట్టుకొని. ఆ నల్లద్దా లెందుకో పద్మకే తెలియాలి.

అంతా బాగానే వుందిగాని, డైరెక్టరు పద్మకు వేషం ఇప్పించలేదు. ఇప్పించ నని స్పష్టంగా చెప్పాడుకూడా. అందుకు అతను చెప్పిన కారణంలో ఎంత నిజం వున్నదో, పద్మకు అంత మండిపోయింది.

"నీకు నటించడం చేతకాదు - నిన్ను స్క్రీనుమీద చూశానుగద. మనిషిగా నిన్ను లవ్ చేయగలుగుతున్నానేగాని నటిగా అసహ్యించుకోవలసి వస్తుంది. జీవితంలో అదే ట్రాజెడీ. వెనక ఒకమ్మాయిని లవ్ చేశాను. పాపం ఆమె తానొక పాటగత్తెననుకునేది. ఎట్లా సంపాదించిందో ఒక రేడియో ఛాన్సు సంపాదించి రేడియోలో పాడింది. కర్మకాలి నేను వినడం జరిగింది. నా లవ్ అంతా విరిగిపోయింది. లవ్ సంపాదించుకోదగినవాళ్ళు ఆ లవ్‌కు విరుగుడుగా ఉండే పనులు చెయ్యకుండా చాలా జాగ్రత్తపడాలి" అన్నాడు డైరెక్టర్.

పద్మకు మంటరావడానికి కూడా కారణం ఉన్నది. పద్మ వేషంకోరి డైరెక్టరుకు స్వాధీనమయిందిగాని అతడి బోడిలవ్ ఆమెకెందుకు? ఈ డైరెక్టరు కన్నా చాలా రెట్లు అందమైనవాళ్ళే ఆమెను లవ్ చేశారు. పద్మ తన ప్రియుణ్ణి అనవలసిన మాటలన్నీ అని ఏడుస్తూ తల్లివద్దకు వచ్చేసింది.

తన కూతుర్ని జీవితం పూర్తిగా ఓడించిందనీ, ఆమె రామదాసు దగ్గర కూడా తట్టతగలేసుకొని వచ్చిందని ఆమెకు ఎక్కడా నిలవ నీడలేనిదనీ భాను తెలుసుకున్నది. ఆమెకు దుఃఖం ఆగలేదు. ఆమె మళ్ళీ గర్భిణిగా ఉన్నది. పద్మ కూడా నెలతప్పిందని తెలిసి ఆమె కంగారుపడింది.

కొన్ని కొన్ని పరిస్థితులను ధైర్యంగా ఎదుర్కోవడానికి కొంత హజం ఉండాలి. ఆ "హజం" ఒక తరగతి వాళ్ళకు ఉగ్గుపాలతో అలవడుతుంది. కోమల ఒకసారి కడుపు తీసేయించుకుని ఆ తరువాత కడుపురాకుండా పడవలసిన జాగ్రత్తలు మరింత శ్రద్ధగా అనుసరించింది. దాన్ని గురించి ఎటువంటి ఆందోళనా ఎవరూ పడలేదు. కాని భాను ఆ తరగతిది కాకపోవడంచేతా, ఆ తరగతికి అవసరమైన తర్ఫీదుకూడా లేనిది కావడంచేతా జరిగిన సంగతి మొదట సుదర్శనానికి చెప్పుకుని బావురుమన్నది.

"దీని కెందుకింత కంగారు పడతావు. డాక్టరును పిలిపిద్దాం?" అన్నాడు సుదర్శనం.

"అమ్మో, ప్రమాదమైతే?" అన్నది భాను.

"జీవితంలో ఎక్కడ ప్రమాదంలేదో చెప్పు. వీధిలోకి వెళ్ళిన వాళ్ళంతా ఇళ్ళకు తిరిగి వస్తున్నారా ఈ పూళ్ళో? కార్ల కింద, లారీల కిందా మనుషులు పడడం లేదూ? పద్మకు ఏనాడో పెళ్ళిచేసి ఉండవలసింది. అది పెళ్ళి చేసుకున్న వాణ్ణి సుఖపెట్టగలది. అటువంటిదాన్ని బలాదూర్లు తిరగనివ్వడం మనదే తప్పు. ఈ వచ్చినబెడద వదిలించుకుంటే తరువాతనన్నా పెళ్ళిసంగతి చూస్తాం!" అన్నాడు సుదర్శనంగారు.

పద్మ జీవితం ఈ విధంగా అవేగతిపాలు కావడంతో తాను చేసిన తప్పేమిటో భానుకు అర్థంకాలేదు. తాను ఆ దురాంబవాళ్ళ పంచన చేరకుండ ఉండవలసింది - అక్కడే భానుకు కూతురుమీద పూర్తిగా ఏ అదుపూ లేకుండా పోయింది. కాని ఆ పంచన ఉండడం తనకిష్టమై భాను ఒప్పుకోలేదు. సుదర్శనం గారిని చూసే ఒప్పుకున్నది.

అప్పటికీ, తాను పద్మకు అప్పుడప్పుడూ హితం చెబుతూ వచ్చింది. కాని, అది పద్మ తల కెక్కలేదు. ఇప్పుడు పద్మను తిట్టి ఏం లాభం? ఆమె తన బుద్ధితక్కువ అర్థం చేసుకున్నట్టే ఉన్నది. అదీగాక అదైకొంప! గట్టిగా అనుకో దానికి లేదు - అందరూ వింటారు. భాను గట్టిగా ఏడవడానికికూడా భయపడి నిశ్శబ్దంగా ఏడ్చింది!

# 14

దీపాలు పెట్టిన కొంతసేపటికిగాని శాస్త్రి ఇంటికి రాలేదు. ఇంట్లోకి అడుగు పెడుతూనే. "ఓహో, పద్మ ఎప్పుడో దిగింది!" అన్నాడు. పద్మ తలవంచుకుని అవతలికి వెళ్ళిపోవడం చూసి, అతనికి ఏదో జరిగిందని తెలిసింది.

అతను భానుదగ్గిరకి వెళ్ళి "పద్మ ఎట్లా ఉందేం?" అని అడిగాడు.

"పద్మ కేం? బాగానే ఉంది!" అన్నది భాను, ఎవరికో చెప్తున్నట్టు. శాస్త్రి సంకోచం మరింత బలపడింది.

"రెండురోజు లుంటుందా?" అని శాస్త్రి మళ్ళీ అడిగాడు.

"ఉండకెక్కడికి పోతుందీ? ఒకళ్ళు ఎంతకాలం ఉంచుకుంటారు నాయనా? ఇక ఇక్కడనే ఉంటుంది—ఏ అయ్యనో పెళ్ళి చేసుకొనేదాకా!"

"భేష్! పద్మ ఇక్కడే ఉండాలని నా ఉద్దేశం కూడా!" అంటూ శాస్త్రి బట్టలు విప్పి మామూలు దోవతి చుట్టుకుని, మోహమూ చేతులూ, కాళ్ళు కడుక్కొని వచ్చాడు.

"చొక్కా వేసుకో మామయ్యా! చల్లగాలికి అట్లా తిరిగివద్దాం" అన్నది పద్మ.

పద్మ తనకు ఏదో చెప్పగోరిందని ఊహించి, శాస్త్రి చొక్కా వేసు కున్నాడు. ఇద్దరూ కలిసి వెంకటనారాయణ రోడ్డు వెంబడి పార్కు కేసి నడిచారు. వారు వెంకటనారాయణరోడ్డు ప్రవేశించే మలుపులోనే, ఒక ఇంట పెళ్ళి జరుగు తున్నది. చాందినీ, ట్యూబులైట్లూ, లౌడ్‌స్పీకర్లో ఎవరో ఆడది పాడే పాటా, బయట కారులూ, ప్రహరీ గోడలమీదినుంచి లోపలికిచూసే దారిన పోయే మనుషులూ, పెళ్ళి ఇంటి బయట నలుగురైదుగురు పోలీసులు—ఈ ఆడావుడి

మూలంగా శాస్త్రీ పద్మా ఏమీ మాట్లాడే అవకాశం లేకపోయింది. పెళ్ళి ఇంటి మీదనో, వధూవరులమీదనో కష గలదానల్లే, పద్మ శాస్త్రికన్న వేగంగా నడిచి పెళ్ళిల్లు దాటివెళ్ళిపోయింది.

వెంకటనారాయణ రోడ్డు దాదాపు నిర్మానుష్యంగా వుంది, లౌడెస్పీకరు ఉధృతం అంతగా లేదు.

"ఓ సంగతి నీకు ముందుగానే చెబుదామని తీసుకొచ్చాను!" అన్నది పద్మ.

"నే ననుకున్నాలే!" అన్నాడు శాస్త్రి.

"అమ్మ నీతో నా పెళ్ళిమాట తెచ్చి, నిన్ను చేసుకోమంటుందేమో! ఒప్పు కోకు మామయ్యా!"

"అమ్మకు ఈ ఆలోచన ఎందుకొచ్చిందీ?" అన్నాడు శాస్త్రి ఆశ్చర్యంతో.

"దానికి కారణం ఉందిలే. నేను నా చదువంతా భ్రష్టు చేసేసుకున్నాను. నన్ను ఉద్ధరించడానికి నీ బతుక్కూడా భ్రష్టుచెయ్యాలని ఆలోచిస్తున్నది."

"నీకేం వంకొచ్చింది పద్మా. నిక్షేపంగా ఉన్నావు. భ్రష్టేమిటి?"

ఇద్దరూ పార్కు మొగదల ఆగారు. పద్మ తనకు చాతయినట్టు, సాధ్యమై నట్టు, తన ప్రస్తుత పరిస్థితి, దీనికి ముందు జరిగిన కథా శాస్త్రికి చెప్పేసింది. ఆమె కావాలని ఏదీ దాచలేదు. తన కథ చెప్పడం ప్రారంభించినప్పుడు, పద్మ ధైర్యంగానే ఉందిగాని, మాట్లాడుతున్న కొద్దీ ఆమెకు దుఃఖం వచ్చేసింది.

"బాబు డాక్టరును పిలుద్దామన్నారు. అమ్మ భయపడుతున్నది. నాకు భయం లేదు. అమ్మ భయపడేది జరిగితే—అదే బాగుండు ననుకుంటున్నాను. నాకు నిజంగా బతకాలని లేదు మామయ్యా!"

పద్మ బావురుమన్నది. శాస్త్రి మనసును ఎవరో ముళ్ళకర్రతో కెలికినట్ట యింది. ప్రపంచంలో కొంపలు తీసేవాళ్ళు, ఇతరులకు వర్ణనాతీతమైన మనః క్లేశం కలిగించే వాళ్ళు సుఖంగా ఉన్నారు. అజ్ఞానం తప్ప ఇంకే మహాపాతకమ్మూ చెయ్యని పద్మ - తాను పసిపిల్లగా ఎత్తి ఆడించిన పద్మ - కడుపు చెరు వయ్యేట్టుగా ఎందుకు ఏడవాలి? ఇందుకు ఏదైనా సామాజిక నియమం ఉంటే, దాన్ని తక్షణం భగ్నం చెయ్యవలసిందే.

శాస్త్రి జేబులోనుంచి చేతిరుమాలు తీసి పద్మకిస్తూ, "ఏడవకు, పద్మా. నేను చెయ్యని మహాపాపం ఏదీ నువు చెయ్యలేదు. మీ అమ్మే నిన్ను బెదరగొట్టి ఉంటుంది. ఏడవకు. తాపీగా జరగవలసిన దాన్ని గురించి ఆలోచింతాం. బాలకూ నాకూ ఉన్న సంబంధం నీకు తెలిసే వుంటుంది. ఈ డైరెక్టరుగాణ్ణి నువ్వెంత ప్రేమించావో, నేనూ బాలను అంతే ప్రేమించాను. నేను ఏడవలేదు. నువ్వెందు కేడవాలి?" అన్నాడు.

"నీకేం? మగవాడివి! నేను ఆడపక్షిని గదా!"

"మగవాళ్ళకు ఒక రూలూ ఆడవాళ్ళకు ఇంకొక రూలూ ఉన్నదని నేను ఒప్పుకోను. ఆ మాటకు వస్తే దాని ఆపది. నువ్వు చేసిన పనే చేసింది. దాని ఏడవలేదు."

"దానికు పెళ్ళయిందిగదా!"

"అదేవిధంగా నువ్వుకూడా పెళ్ళి చేసుకోదలిస్తే, తప్పకుండా చేసుకో. నన్నడిగితే బాల, పెళ్ళిచాటున ఈ విధంగా చెయ్యడం నాకు చాలా అసహ్యంగా తోస్తుంది. ఇంతకన్న నువ్వు ఎవరినన్నా మనస్ఫూర్తిగా ప్రేమించి ఉంటే, లేదా ఎవరి నన్నా నువ్వు ప్రేమించి ఉంటే-"

"నాకా ప్రేమ సంగతి చెప్పకు మామయ్యా. దానిపని ముగించేసి వెళితే తీసేయించుకుంటాను. ఆ తరువాత ఏ ముసలివాణ్ణో, గుడ్డివాణ్ణో చేసుకోమన్నా చేసుకుని, బతికున్నన్నాళ్ళూ కుక్కలాగ పడి ఉంటాను!" అన్నది పద్మ.

"మరి మొదట్లో అట్లా అన్నావేం? మీ అమ్మ మనిషికి పెళ్ళి విషయం మాట్లాడితే ఒప్పుకోవద్దన్నావేం?"

పద్మ షాక్ తిన్నదానల్లే "నకే ముందు మనసు ఏ ఉద్దేశమా? అంతా చెప్పాను కదా?" అన్నది.

"నువు చెప్పినదాన్ని గురించి నా అభిప్రాయం కూడా చెప్పానే?....ఆలోచిస్తే అమ్మ ఉద్దేశం బాగా ఉంది. పద్మా మనం పెళ్ళి చేసుకుందాం - నీకు వేరే అభ్యంతరం లేకపోతే, డాక్టరును కూడా పిలవనవసరం లేదు. కడుపు తీసేసుకోవడమూ, ఆ విషయం దాచిపెట్టి పెళ్ళికొడుకుకోసం వెతకడమూ, షాదీకి, ఏ కారణము[1] చేతనైనా నిజం తెలిస్తే వాడు రభస చెయ్యడమూ—ఇదంతా ఎందుకొచ్చిన బాధ!"

పద్మ తన మొహానికి చేతులు అడ్డం పెట్టుకొని తల అతని రొమ్ముమీదికి వాల్చింది. ఆమె ఏడవడం లేదు. వణుకుతున్నట్టు కనిపించింది.

హిందీ ప్రచార సభ వైపునుంచి వచ్చిన కారు వాళ్ళు నిలబడి వున్నవేపు తిరిగింది. హెడ్‌లైట్స్ కాంతి వాళ్ళపైన పడింది. కాని శాస్త్రి లక్ష్యపెట్టలేదు. కారు చప్పుడు వినబడి పద్మ తలపైకెత్తింది.

"నేను ఏ దిక్కుమాలినవాడికో బిడ్డనుకంటే నా బిడ్డ అని లోకానికి చెప్పుకుందామనా మామయ్యా?"

---

1. ఏ కావ్యభాషారూపం

"ఏం? అవమానమా? లేక నాసొత్తంతా మరొకడి బిడ్డకు పోతుందని విచారమా?"

పద్మ మాట్లాడలేదు. ఆమెకు శాస్త్రి సరస్వతిని ప్రేమించిన సంగతి పుకారుగా కూడా ఏమీ తెలియదు. అతను చెప్పనూ లేదు. ఒకవంక పద్మ మాట్లాడుతూండగానే అతను శీఘ్ర నిర్ణయం చేసి సరస్వతిని గురించి తాను ఇన్నేళ్ళుగా కన్న కలల కన్నిటికీ స్వస్తివాచకం చెప్పేశాడు. పద్మ సమస్య తీవ్రమైనది. సరస్వతికి సమస్యేలేదు. ప్రేమ-ప్రేమను తాను దూరంనుంచి చూచి ఆనందించాడు. దాన్ని వెంటబడి అందుకునేటందుకు పరిస్థితులు అనువుగాలేవు. మనిషిని మనిషి ఆదుకోవలసిన అవసరం ఉంటుండగా, ప్రేమను గురించి కలవరించడం అవాస్తవికమైన పని.

"అమ్మ కనిపెట్టుకుని వుంటుంది; మనం బయలుదేరి చాలా సేపయింది. ఇంటికిపోదాం" అన్నాడు శాస్త్రి.

పద్మ అతనికి తన చెయ్యి ఇచ్చింది. ఇద్దరూ చేతులు పట్టుకుని ఇంటికి తిరిగి వచ్చారు....

శాస్త్రి చెప్పినదంతా సరస్వతి శ్రద్ధగా విన్నది.

"మీరు చెప్పినదంతా బాగుంది. కాని నాకు ఒక్కటే అనుమానం-మీరు మీ మేనకోడలి సమస్య పరిష్కారం కోసం త్యాగం చేస్తున్నారేమో! నాకు త్యాగాలంటే ఎందుకో చాలా అసహ్యం. ప్రాణత్యాగాలు చేసినవాళ్ళ మాట వదిలేస్తే, మిగిలిన త్యాగాలుచేసేవాళ్ళు ఎప్పటికైనా పశ్చాత్తాప పడతారని నాకు అనుమానం" అన్నదామె.

శాస్త్రి తల అడ్డంగా తిప్పి, "ఇందులో త్యాగమేమీ లేదు. నే నీ నిర్ణయం చెయ్యటానికి రెండు సెకండ్లుకూడా మధన పడలేదు....కాక పోయినా మనం పెళ్ళి అనేదాన్ని భూతద్దంతో చూడడం అలవాటు చేసుకున్నాం. జీవితంలో జరిగే ఇతర సంఘటనలకన్నా, పెళ్ళి చాలా ఎక్కువని అనుకోవడం అనవసరమేమో? పెళ్ళి నుంచి మనం నిజంగా ఎంత ఆశిస్తామో అంతే ప్రాముఖ్యం దాని కివ్వటం మంచిది కాదా?....నేను ప్రేమను గురించి కలలు కనలేదని కాదు. కాని అవి కలలే. అవి కలలుగా ఉండడమే మంచిది. మోక్షం కోసం కలవరించే వాళ్ళలో, ఎవడో ఒకడే నిజంగా మోక్షాన్ని చేరుకుంటాట్ట. మాటవరసకు చెప్పాను" అన్నాడు.

ప్రతిసారీ శాస్త్రి అంతరాత్మను గురించి చిరాకుపడే సరస్వతి ఈసారి చిరాకు పడలేదు. "ఇతన్ని అంతరాత్మ నిజంగానే ముంచింది" అనే భావం, ఆమెలో కలగలేదు.

"మనం పాత స్నేహితులం. ముందుకూడా స్నేహంగానే ఉందాం"అన్నాడు శాస్త్రి.

అతను వెళ్ళిపోయినాక సరస్వతి ఏ ఆలోచనా లేకుండా, మెస్మరైజు చేసిన దానిలాగా చాలా సేపు కుర్చీలో కదలకుండా కూచున్నది. ఆమె జీవితంలో ఏదో శూన్యం అయిపోయినట్టు అనిపించింది. ఆ శూన్యం గురించి దిగులుపడాలో, లేక దాన్ని ఉపేక్షించాలో ఆమెకు అర్థం కాలేదు.

ప్రచురణ : డిసెంబరు, 1961, విశాలాంధ్ర ప్రచురణాలయం.

# ఐ శ్వ ర్యం

ఎల్లుండి పరీక్షలనగా నెత్తురుబంక విరేచనాలు పట్టుకున్నాయి. క్లాసు తెచ్చుకుందామనే ఆశతో ప్రిపరేటరీ హాలీడేస్‌లో చాలా కష్టపడి చదివాను. దిక్కుమాలిన డిసెంటరీ పట్టుకుంది. పరీక్ష తన్నేస్తుందని కాదుగాని క్లాసు రాదేమోనని.

అదే నేను డాక్టరు కనకంగారి దగ్గిరకి మొదటిసారి వెళ్ళటం. ఆయనను గురించి నా కదివరకే తెలుసు. మంచి డాక్టరుట, ప్రాక్టీసు లేదుట. ఈ రెండూ ఒకచోట ఎట్లా ఒనగూడాయో నాకర్థం కాలేదు. మా బాబాయితో కలిసి చదువుకున్న డాక్టరు ఒకాయన మా వూళ్ళో రెండేళ్ళక్రితం ప్రాక్టీసు పెట్టాడు. హస్తవాసి మంచిదన్నారు. ఇప్పుడాయన సంపాదన నెలకు రెండువేల ప్రాంతంలో వుంది.

"మంచిడాక్టరై ప్రాక్టీసు లేకపోవటమేమిటి" అని అడిగాను.

"ఏమిటంటే ఏంచెబుతాం? రాత! డిస్టింక్షన్‌తో పాసయిన గ్రాడ్యుయేట్లు ఉద్యోగాలు లేక రాట్ కావటంలా?" అన్నాడు చిదానందం. కనకంగారంటే వాడికి తగని అభిమానం. అందుచేత ఆయన్ని గురించి కర్కశంగా మాట్లాడే హక్కును పుష్కలంగా వినియోగించుకునేవాడు.

"ఉద్యోగం దొరక్కపోతే అది వేరే సమస్య. ప్రాక్టీసుచేసే డాక్టరు మంచివాడై నప్పుడు పేషంట్లు ఆయన్నెట్లా వదిలిపెడతారూ?"

"రోగికి రోగం నయం కావటమే అన్నిటికన్న ముఖ్యమని మూఢవిశ్వాసం. రోగికి కావలసింది డాక్టరుపైన గురి, మందు సెకండరీ. డాక్టరు వీరభద్రరావుకు చూడు ఎంత ప్రాక్టీసో? ప్రతి ఉదయమూ ఆయన డిస్పెన్సరీ దగ్గిర ఇసకేస్తే రాలనంతమంది జనం! జనాని కాయనంటే గురి. ఎవరో అన్నారులే. ఆయన మూడే మిక్శ్చర్లతో అనేకడజన్ల రోగాలకు చికిత్స చేస్తాట్ట. ఏడేళ్ళ ప్రాక్టీసులో ఒక మేడ లేపాడు. ఇప్పుడు రెండోమేడ లేస్తున్నది."

"కనకంగారంటే జనానికి గురి లేకపోవటాని కేమిటి కారణం?"

"ఖర్మ! ఆయన అదోరకం మనిషి. ఒకసారి వెళ్ళరాదు నీకే తెలుస్తుంది!"

నెత్తురుబంక విరేచనాల మూలంగా నేను కనకంగారి దగ్గిరికి వెళ్ళటం తటస్థించింది. అరండల్‌పేట పార్కు పరిసరాల్లో ఆయన ఒక డాబాయింట్లో ఉంటున్నాడు. డాక్టర్ పి. బి. కనకసుందరం ఎం.బి.బి.యస్. అన్న బోర్డొకటి తలవాకిలి పక్కగోడకుకొట్టి ఉన్నది. ఇంటికీ ప్రహరీగోడకూ మధ్య అయిదారు

గజాల ఖాళీ జాగాలో ఒక ప్రక్కగా చిన్న పాక వేసి వున్నది. అందులో ఒక కొయ్యబల్లా, ఒక మడత కుర్చీ వున్నాయి. ఒక సులకమంచం ఎత్తిపెట్టి వున్నది. బెంచీ విజిటర్లకోసం, కుర్చీ డాక్టర్‌గారికోసం. అందులో డాక్టరుగారే కాబోలు కూర్చొని, పేపరు మొహాని కడ్డం పెట్టుకుని చదువుకుంటున్నాడు.

"డాక్టరుగారండీ ?" అన్నాను.

ఆయన పేపరు దించి, "ఏం కావాలి? ఎవరూ?" అన్నాడు.

"మందు కావాలండీ" అన్నాను. రోగిని నేనేనని స్ఫురించేటట్టుగా గొంతు పెట్టాను.

"మందా!" అన్నాడాయన, ఆమాట ఎక్కడో చాలాసార్లు విన్నవాడిలాగా.

"అవునండీ, డిసెంటరీ."

"డిసెంటరీ అని మీరెట్లా చెప్పగలరూ?"

"రోజుకు ముప్పై విరేచనాలవుతున్నాయి."

డాక్టరుగారు నాకేసి జాలిగా చూసి, "డిసెంటరీలో అసలు విరేచనమే వుండదు. మలబద్ధకం వుంటేనేగాని డిసెంటరీ రాదు. కూర్చోండి."

"నెత్తురూ, బంకా, పొడుచుటూ మెలిపెట్టటం-ఇవన్నీ డిసెంటరీ లక్షణాలే అనుకుంటున్నాను. మీరు నన్ను ఎక్జామిన్ చెయ్యాలి" అన్నాను.

ఆయన అకస్మాత్తుగా నవ్వి "కూర్చోండి మీది డిసెంటరీ కాదని నేననటం లేదు. కాని పేషంట్స్ తమ డయాగ్నోసిస్ తామే చేసుకోవటం తప్పు. చాలామందికా సెన్సుండదు. 'హైపరాసిడిటీకి మందివ్వండి' 'లివర్ ట్రబుల్‌కు మందివ్వండి' 'ఆస్త్మాకు మందివ్వండి' అంటూ అడుగుతారు. ఏ విధమైన లివర్ ట్రబుల్? ఆస్త్మాలో ఏ రకం! అదేమి వాళ్ళకి తెలియదు. 'నీకేకాదు. మాక్కూడా కాస్త వైద్యం తెలుసులేవోయ్!' అన్నట్లు మాట్లాడతారు. ఐగెట్ వెరీ ఇంపేషంట్ విత్ సచ్ పేషంట్స్. ఇంకోటి చూశారా! నిజంగా పేషంటుకు తన రోగం తెలిస్తే డాక్టరు దగ్గిరికి రావటమెందుకూ? ఏ కెమిస్ట్స్ షాపులోనైనా మందు తీసుకోవచ్చు. ఆ సంగతికూడా వాళ్ళు గమనించరు....ఇంతకూ మీకు ఈ డిసెంటరీ ఎన్నాళ్ళ నుంచీ!"

"మొన్న ఉదయంనుంచినండి. ఎల్లుండి పరీక్షలు ఆరంభం."

ఏదో జోక్ చెయ్యబోయిన వాడల్లే నవ్వి ఆయన, "మీకీజబ్బు ఫ్రీక్వెంట్‌గా వస్తూంటుందా?" అన్నాడు.

"లేదండి, రెండేళ్ళ క్రితం స్కూల్ ఫైనల్[1] పరీక్షలప్పుడొచ్చింది. అప్పుడేమీ వైద్యం కూడా చెయ్యలేదు. పరీక్షలో మార్కులు బాగా తెచ్చుకోలేక పోయాను. ఈసారి కూడా అదే అవుతుందేమోనని భయం."

---

1. S.S.L.C. అంటే అప్పటి స్కూళ్ళలోని 11వ తరగతి.

డాక్టరుగారు జోక్‌ను నిగ్రహించుకోలేక పోయారు. "ఎగ్జామినేషన్ ఫోబియా అయివుంటుందా?" అన్నాడు.

"కావచ్చండి! కాని నాకు సాధారణంగా ఫస్టుమార్కుల్లాటివి రావడం అలవాటు. నాకు భయం క్లాసు రాదనే" అన్నాను కాస్త పౌరుషంగానే.

"అదీ ఒక భయమేగా? అయినా తెలిసే భయాలకన్న తెలీని భయాలు ఎక్కువ జబ్బుచేస్తాయి. ఇన్నేళ్ళయాక ఇప్పటికీ నేను స్కూలుఫైనలు పరీక్షలకు కూర్చున్నట్టూ పేపరేమీ అర్థం కానట్టూ, ఏమి రాయలేకపోయినట్టూ కలవచ్చి దిగులు పుట్టుకొస్తూంటుంది. పరీక్షలంటే భయం అణచి పెట్టటంచేత అట్లా జరుగుతుంది."

ఆయన ఎంతసేపైనా ఆ విధంగా మాట్లాడుకుంటూ పోయేటట్టున్నాడు. నా కివతల డిసెంటరీ, అవతల పరీక్షలూనూ. కనీసం ఇంకో పేషంటైనా వచ్చినా బాగుండుననిపించింది కాని ఎవరూ రాలేదు.

"ఫ్రాయిడ్"[1] అన్నాడాయన, ఆ ఒక్కముక్కలో ఎంతో ఇమిడి వున్నట్టు. ఏ కారణంచేతనో నే నప్పటిదాకా ఫ్రాయిడ్ పేరు వినివుండలేదు.

---

1. ఫ్రాయిడ్, సిగ్మండ్ (1856-1939) మనోవైజ్ఞానిక శాస్త్ర సంస్థాపకుడు. ఆస్ట్రియాదేశస్థుడు. వైద్యుడు, నరాలరోగ నిపుణుడు, మనస్తత్వ శాస్త్రవేత్త మనుషుల మానసిక స్థితిగతులు, చర్యలు, వ్యక్తి అచేతన యొక్క బాహ్యవ్యక్తీకరణలు అనీ, అందులోనూ స్త్రీ పురుష సంబంధమైన అంటే లైంగిక ప్రేరణల సంబంధమైన వ్యక్తీకరణలనీ సిద్ధాంతీకరించినవాడు. అచేతనలో అణచుకున్న కోరికలకు - ప్రధానంగా స్త్రీ పురుష సంబంధ కాంక్షలకు - కలలు ప్రతిరూపాలని భావించాడు. మానవ చరిత్ర, నీతి, కళ, శాస్త్రం, మతం, రాజ్యం, న్యాయం, యుద్ధం మొదలైన వాటికి మూలం ఈ అచేతనే అని ఫ్రాయిడ్ అభిప్రాయం. ఫ్రాయిడ్ తన మనోవిశ్లేషణా (సైకో ఎనాలిసిస్) పద్ధతులలో మనో వైజ్ఞానిక సిద్ధాంతాలలో ప్రతిపాదించిన ఈడిపస్ కాంప్లెక్స్ విశ్వ జనీనం కాదన్న వాదు ఆల్‌ఫ్రెడ్ అడ్లర్, కార్ల్ గస్టావ్ యూంగ్. అడ్లర్ మానసిక, సాంఘిక కారణాలకు ప్రాధాన్యమిస్తే, యూంగ్ జాతి అనుభవం పరంపరకు ప్రాధాన్యమిచ్చాడు. నవ్య ఫ్రాయిడ్ వాదులైన హార్నీ, కార్డినర్, అలెగ్జాండర్, ఎరిక్ ఫ్రాం, ఫ్రాయిడ్ స్త్రీ పురుష ప్రేరణ సిద్ధాంతంతో విభేదించారు. వీరు సాంస్కృతిక మనస్తత్వ వేత్తలు, మార్క్సిజానికీ ఫ్రాయిడిజానికి సమన్వయం చేయాలని ప్రయత్నించిన వారు. ఈ శతాబ్ది కళా సృజనపై, విమర్శపై ఫ్రాయిడ్ భావాలు చూపిన ప్రభావం

"ఏమిటండి అది!" అన్నాను... ఫ్రాయిడ్‌లాటి జబ్బేమో ననిపించింది.

"సైకో ఎనాలిసిస్.[1] మనకు ఫిజియాలజీయే సరిగా తెలియ" నన్నాడు. "రోగాలంటే అందరూ భయపడతారు, చాలా ప్రాథమిక రోగాలు శరీరం తనకు తాను చేసుకునే వైద్యమే. మామూలు జ్వరమూ, జలుబూ, కురుపులూ వంటివి శరీరం తనకు తాను చేసుకొనే వైద్యమే. కాకపోతే బాధ అన్నది మట్టుకు సహించ రానిది. వైద్యుడి మొట్టమొదటి కర్తవ్యం రోగికి బాధలేకుండా చూడటం. మిగిలిన దంతా వట్టిభేషజం. జ్వరంవస్తే డయాఫోరిటిక్ మిక్చరిస్తాం—చెమట పట్టడానికి అది ఇవ్వకపోయినా జ్వరం దానంతట అదే నయమవుతుంది. దానంతట అది నయంకాని జ్వరం డయాఫోరిటిక్‌తోనూ నయంకాదు. హాల్డెన్ చెప్పినట్టు పేషంటు మంచాన పడేదాకా వైద్యుడితో పనిలేదు. రోగి మంచాన పడ్డాక వైద్యుడు చెయ్యగలిగింది బహుకొద్ది. అందుచేత ఎథికల్‌గా చూస్తే వైద్యుణ్ని మించిన సంఘ సేవకుడుండడు. మోరల్‌గా చూస్తే ఈ వృత్తిలో ఐశ్వర్యవంతుడైన వాడికన్న రోగ్ ఉండడు. మిక్చర్లూ, మాత్రలూ ఇవ్వడంలోనూ, ఇంజెక్షన్లివ్వడంతోనూ ఎంత రోగరీ వుందో ఆపరేషన్లు చెయ్యటంలోనూ అంత రోగరి వుంది. నేనొక గొప్ప సర్జన్నైరుగుదును..."

నాకు కాస్త విసుగెత్తింది. చెప్పొద్దూ నేను వెళ్ళాలి; నాకు మందివ్వడు. నా పేరు కూడా అడక్కుండా చిన్ననాటి స్నేహితుడితో మాట్లాడినట్టు మాట్లాడుకు పోతున్నాడు. చూడగా ఆయనకు తన వృత్తిపట్ల ఏ విధమైన అభిమానమూ ఉన్నట్లు లేదు. తాను సంపాదించలేని స్థితిలో వుండి రెండు చేతులా ఆర్జించేవాళ్ళని తిట్టటంలో వున్న దౌర్బల్యం కూడా ఆయన గ్రహించినట్టులేదు.

"ఏమండీ, డాక్టరుగారూ! నాకేం మందు చెబుతారు!" అన్నాను.

ఆయన దేనికోసమో వెతుకుతున్న వాడల్లే అటూ ఇటూ చూస్తూ, "అమ్మాయ్ నర్సూ!" అని కేకపెట్టాడు.

ఓ పన్నెండు, పదమూడేళ్ళ గడ్డుకాయలాటిపిల్ల ఇంట్లో నుంచి వచ్చి "ఏమిటి నాన్నా!" అని అడిగింది.

---

గణనీయం. సామాజిక శాస్త్రాలలో ఫ్రాయిడ్ ధోరణి అత్యాశ్రయం. ఫ్రాయిడ్ రచనలు : Totem and Taboo (1918), Three Contribution of the Theory of Sex (1910), Inter preta- tion of Sex (1919), Ego and Id (1927), Civilization and its Development (1930).

1. మనో విశ్లేషణా పద్ధతి.

"కాస్త కలమూ, కాగితమూ తెస్తావా! ప్రిస్క్రిప్షన్ రాస్తాను" అనిడాక్టరుగా రంటుంటే నే నా పిల్లకేసి చిత్రంగా చూశాను. ఆమె పాత చొక్కా ఒక్కటి తొడుక్కున్నది. ఒక అరదుప్పటిలాటిది కట్టుకున్నది. చొక్కా డాక్టరు గారిదై వుండాలి. ఆ పిల్ల జుట్టు చిందరవందరగా వున్నది. తల దువ్వుకొని కనీసం రెండు రోజులయినట్టు.

కొంచెం సేపటి కాపిల్ల తిరిగొచ్చి, "కలంలో సిరా వున్నట్టులేదు. నాన్నా, కాగితం ఎక్కడా కనబడదు" అన్నది.

డాక్టరుగారేమీ ఆశ్చర్యపడలేదు.

"అన్నట్టు నాదగ్గిరేవో శాంపిల్స్ వుండాలి" అంటూ ఆయన తన అట్టపెట్టె పట్టుకురమ్మని కూతుర్ని మళ్ళా లోపలికి పంపాడు.

ఆ పిల్ల తెచ్చిన అట్టపెట్టెలో మెడికల్ లిటరేచర్‌తోబాటు ట్వైనుదారమూ, తెగిపోయిన రిబ్బను ముక్కలూ, ఒక రబ్బరూ, ఏవేవో మాత్రలూ, ఒక ఖాళీ ఇంజెక్షన్ బుడ్డీ వగైరాలున్నాయి.

"ఓయస్, ఇవుగో టాబ్లెట్స్, వన్ త్రీ టైమ్సె డే" అంటూ మూడు మాత్రలు నా చేతిలో పెట్టాడు డాక్టరుగారు.

"వీటి ఖరీదెంతండీ, డాక్టరుగారు" అన్నాను.

"ఖరీదా? ఇవి ఫ్రీ శాంపిల్స్. వీటితో రాత్రికల్లా కట్టకపోతే వచ్చి చెప్పండి. నేను రాత్రి పదిదాకా మేలుకొనే ఉంటాను" అన్నాడాయన.

ఆయనకు థాంక్సె చెప్పి మాత్రలు తీసుకుని రూముకొచ్చి వెంటనే ఒకటి మింగి నీళ్ళు తాగాను. చెప్పొద్దూ అవి పనిచేస్తాయని నేను కలలో కూడా అనుకోలేదు, కాని పనిచేశాయి. ఆఖరు విరేచనం మధ్యాహ్నం రెండుగంటల కయింది. ఆ తరువాత నాకు డిసెంటరీ మాటే గుర్తుకురాలేదు.

నేను శలవుల కింటికి పోలేదు. పోవటానికి నాకు సొంత ఇల్లంటూ లేదు. నాకున్న ఆప్తులు తెనాల్లో మా బాబాయీ, నందివెలుగులో మా సుబ్బక్కయ్యానూ. ఎక్కడికిపోయినా నాకు గుంటూరులో గడిచినట్టు కాలం గడవదు.

మొత్తంమీద పరీక్షలు బాగానే రాశాను. క్లాసు వస్తుందని ధైర్యం వుంది. కాని చెప్పలేం. నేనెవరితోనూ చెప్పలేదు. పరీక్షలయినరోజే డాక్టరుగారింటికి పోయి, "డాక్టరుగారూ, మీ మాత్రలు అమోఘంగా పనిచేశాయి. పరీక్షలకు హాయిగా చదివి రాశాను" అని చెప్పుకున్నాను.

"కూర్చోండి, అవి నా మాత్రలు కావు. ఎవరో కంపెనీవాళ్ళు తయారు చేసినవి. ఏదైనా పనిచేసింది మందు" అన్నారాయన.

ఈసారి కూడా డాక్టరుగారింట పేషంట్స్ లేరు. ఆయన్ని చూస్తే, ఏదన్నా సహాయం చెయ్యగలిగితే ఎంత బాగుండు ననిపించింది. మొత్తంమీద రోగులను ఆకర్షించే శక్తి ఆయనలో లేదు. ఆయనకు డబ్బు కావాలో అక్కర్లేదో కూడా తెలియరాలేదు. జీవితపు ఆఖరుమెట్టుమీద జీవిస్తున్నాడనటానికి సందేహం లేదు. అటువంటివాడికి కొంత డబ్బు కాంక్ష ఉండటంలో తప్పులేదు. ఒంటరిగాడైనా కాదు, పెళ్ళామూ, పిల్లా గల సంసారి. డాక్టరుగారి భార్యకూడా కనిపించింది. రెండు రూపాయలు ఖరీదు చేసే అహమ్మదాబాదు మిల్లుచీరె కట్టుకున్నది. ఒంటి మీద చిన్న మెత్తు బంగారంలేదు. ముక్కులూ, చెవులూ, చేతులూ బోడిగా వున్నాయి. క్రిస్టియనులా గున్నది - మొహాన బొట్టు మినహాయిస్తే.

కృతజ్ఞత చెప్పుకోవటం అయింది గనుక నేను సెలవు పుచ్చుకుందామను కున్నాను. కాని ఆయన వెళ్ళనివ్వక "సెలవులేగదా, ఏం తొందర. కూర్చోరాదూ?" అంటూ నేలమీద ఒక పుస్తకం తీశాడు.

"ఏమిటండి ఆ పుస్తకం?" అన్నాను.

"షా నాటకం, డాక్టర్స్ డిలేమా? నాటకం కాదు. చదవాలిసింది ప్రిఫేస్. వైద్యాన్నీ, వైద్యుల్నీ పట్టుకు కడిగేశాడు!" అన్నాడు డాక్టరుగారు తన కసి తీరి నంత సంతోషంగా.

డాక్టరుగారి అసలు వ్యసనం సాహిత్యమని నాకు క్రమంగా తెలిసివచ్చింది. ఆయన జీవితాన్ని మరచిపోవటానికే సాహిత్యాన్ని అడ్డం పెట్టుకుంటున్నాడో, లేక జీవిత సత్యాలను సాహిత్యంలో చూసి ఆనందిస్తున్నాడో నాకు చచ్చినా అర్థం కాలేదు.

నా సాహిత్యాభిలాష ఏమిటో తెలిసికోవటానికి ప్రయత్నించి ఆయన విఫలు డయ్యాడు. నేను అప్పటికి ఒక షా నాటకం గాని ప్రిఫేసు గాని చదవలేదు.

వినేవాళ్ళుంటే ఆయనకు మాట్లాడటం సరదా. ఆయన ప్రచారకుడిలాగా కనిపించేవాడు కాడు; తన తలలో ఎప్పటికప్పుడు ఏర్పడే సరికొత్త భావాలను ఎవరితోనన్నా పంచుకోవటం ఆయన కిష్టం. ఆయన సంభాషణలో ఇంకో విశేష మేమంటే, సాహిత్యం నుంచి వైద్యానికి వైద్యం నుంచి సాహిత్యానికి క్షణంలో మారేవాడు.

"వైద్యంలో వచ్చిన పెద్ద చిక్కేమిటంటే చాలా రోగాలకు నమ్మకమైన చికిత్సలేదు. జలుబుకూ, తలనొప్పికి మందుల్లేవు. టైఫాయిడ్‌కు మందుల్లేవు. పెర్నిషస్ ఎనీమియాకు ఫోలికేసిడ్ యామధ్యనే గదా వచ్చింది? టి.బి. లాటి దిక్కుమాలిన రోగానికి మందేమిటి? విశ్రాంతీ మంచి ఆహారమూ తప్ప ఏమీలేదు. ఊపిరితిత్తి మరీ దెబ్బతింటే ఏ.పి. ఇస్తారు. థొరకోప్లాస్టీ చికిత్స ఏ.పి. షాక్‌లో

పేషంటు బల్లమీదనే చావటం నేనెరుగుదును. టి.బి. అంటే జ్ఞాపకం వచ్చింది. థామస్‌మాన్ "మాజిక్ మౌంచెన్' చదివారా? ఎమేజింగ్! ఏళ్ళతరబడి శానిటోరి యాలలో ఉన్నవాడు తప్ప ఆ పుస్తకం రాయలేడు. లిటరేచరంటే అట్లా వుండాలి. మన లిటరేచరూ వుంది. ప్లీడరు ప్లీడరు లాగుండడు. డాక్టరు డాక్టరులాగుండడు. మేస్టరు మేస్టరులాగుండడు. అందరూ ఒక్క లాగే వుంటారు ఖర్మ."

డాక్టరుగారి ఖర్మమా అంటూ నాకు ఇంగ్లీషు సాహిత్యంలో పూర్వం ఎన్నడూ లేనంత ఆసక్తి కలిగింది. షా నాటకాలు చదివాను. రెండు ఇబ్సెన్[1] నాటకాలూ, గాల్స్‌వర్దీ[2] నాటకాల సంపుటీ చదివాను. ఇవన్నీ డాక్టరుగారు లైబ్రరీనుంచీ అరువు తెచ్చినవి. ఆయనదగ్గిర షేక్‌స్పియర్ రచనలు[3], డికెన్స్[4], థాకిరే[5], హార్డీ[6], స్కాట్[7] నవలలూ కొన్ని వున్నాయి.

డాక్టరుగారి వయస్సు నలభైదాటి వుండాలి. మనిషి సన్నం. కాని ఈడుకు మించిన వార్ధక్యలక్షణా లున్నాయి. ఆయనతో పరిచయం అయిన తర్వాత ఆయన సంగతులన్నీ అడిగి తెలుసుకున్నాను. ఆయనకు దీర్ఘరోగు లిద్దరున్నారు. ఇద్దరూ చెరొక పాతికా ఇస్తారు. దానితోనే ఆయనకు కాలక్షేపం.

---

1. హెన్రిక్ ఇబ్సెన్ (1828-1906) నార్వేజియన్ నాటకకర్త. యూరో పియన్ రంగస్థలాన్ని, వచన నాటకాన్ని విప్లవాత్మకమైన మార్పులకు గురిచేసిన నాటకకర్త. సంఘ వాతావరణానికీ, వ్యక్తులకు మధ్య ఉండే సజీవ సంబంధాన్ని చిత్రించిన రచయిత. ఉద్రేకాలనూ, బాధలనూ, స్త్రీల అగచాట్లనూ, తిరుగుబాట్లనూ చిత్రించి వాస్తవిక వాదానికి దోహదం చేసిన రచయిత. Pillars of Society (1874), A Doll's House (1879), Ghosts (1881), A Public Enemy (1882) వంటి ప్రభావక నాటకాల కర్త.
2. జాన్ గాల్స్‌వర్దీ (1867-1933). ఇంగ్లీషు నాటకకర్తా, నవలా రచయితా. పై మధ్యతరగతి జీవిత విధానాన్ని విమర్శనాత్మకంగా చిత్రించిన రచయిత. ఆయన ప్రముఖ నాటకాలు The Silver Box (1906), Strife (1909), Loyalties (1922), Escape (1922), ప్రఖ్యాత నవల The Forsyte Sage. 1932లో నోబెల్ బహుమతి గ్రహీత.
3. విలియం షేక్స్‌పియర్ (1564-1616) ప్రపంచ ప్రఖ్యాత ఆంగ్ల నాటక కర్త, ప్రయోక్త, కవి, ఎలిజబెత్ యుగ సంఘ చైతన్యాన్ని, ప్రధా నంగా కులీన వర్గ చైతన్యాన్ని చిత్రించిన రచయిత, ధనస్వామ్య

ఆయనకు రోగాలను గురించీ, చికిత్సలను గురించి కన్న ఆరోగ్యం గురించి మాట్లాడటం ఇష్టం.

"ఆరోగ్యమనేది ఫిక్స్డ్ డిపాజిట్ వేసుకునేదికాదు. అది డైనమిక్ ఫంక్షన్, డైనమోను నడిపి విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేసినట్టు శరీరంలో అనుక్షణమూ ఆరోగ్యము ఉత్పత్తి కావాలి. అంతేగాని....ఆరోగ్యాన్ని వినియోగించుకోవటంలోనే దానికి భంగం కలుగుతూంటుంది. దాన్ని సరిచేసుకునే శక్తి శరీరానికుండాలి. నడిచేవాడికి అడుగుతీసి అడుగు వేసినప్పుడల్లా బాలెన్సు తప్పుతూనే

---

ప్రాదుర్భావ దశలోని వైరుధ్యాలను చిత్రించిన రచయిత. ఇతివృత్త నిర్మాణంలో దాని నాటకీకరణలో కథనంలో పాత్ర స్వభావ చిత్రణలో సంభాషణా రూపకల్పనలో అనన్యమైన ప్రతిభాశాలి. ఆయన ప్రముఖ మోదాంత నాటకాలు **A Much Ado About Nothing, Twelfth Night, As You Like it.** విషాదాంత నాటకాలు: **Hamlet, Othello, King Lear, Macbeth.**

4. చార్లెస్ డికెన్స్ (1812-1870) ప్రముఖ విక్టోరియన్ నవలాకారుడు. గొప్ప భావుకుడు, పరిశీలనాశీలి. లండన్ నగరంలోని సమస్తమూ చాలా నవలలకు నేపథ్యం. ఆయన ప్రఖ్యాత నవలలు: Oliver Twist (1838), **David Copperfield** (1849-50), **Hard Times** (1854), **A Tale of Two Cities** (1859). మితిమీరిన అనుభూతి, వ్యంగ్య శక్తి ఆయన రచనల్లో కన్పిస్తాయి.

5. విలియం మేక్‌పస్ థాకిరే (1811-1863), ఇంగ్లీషు నవలాకర్త, డికెన్స్ లాగానే మెలోడ్రమటిక్ ఇతివృత్తాలంటే ఇష్టం. రచనల్లో బిగువుంటుంది; హాస్యం మొరటుగా ఉంటుంది.

6 థామస్ హార్డీ (1840-1928) ఇంగ్లీషు నవలా రచయిత, కవి. **Tess of the D'Urbervilles** (1891), **Jude the Obscure** (1895), **The Mayor of Casterbridge** (1886), **Far Form the Madding Crowd** (1874) మొదలైన ప్రఖ్యాత నవలల కర్త. వెసెక్స్ జీవితాన్ని చిత్రించిన రచయిత.

7. సర్‌వాల్టర్. బార్ట్ స్కాట్ (1771-1832). ప్రఖ్యాత స్కాటిష్ నవలాకారుడు. జనరంజక రచయిత. కాల్పనికవాది. స్కాట్ చారిత్రక నవలల ప్రభావం జాతీయోద్యమ దశలోని భారతీయ నవలా రచయితల మీద ప్రముఖంగా పడింది. **Rob Roy** (1818), **Iron Loe** (1819), **The Talisman** (1825) మొదలైన నవలలు రాశాడు.

పురిటుంది. దాన్ని నడకలోనే సరిచేసుకుంటూ వుంటాం. అంతేగాని బాలెన్సు అసలు భంగమే రాగూడదనుకుంటే నడవనే లేం; ఎక్కడికీ పోలేం. కొంతమంది ఆరోగ్యానికి భంగం కలక్కుండా జీవించాలనుకుంటారు. అదేం జీవించటం? అంటువ్యాధులనే తీసుకుందాం. వాటికి శరీరం ఇమ్యూన్ కావాలంటే అవి శరీరంలో ప్రవేశించి కూడా వ్యాధి కలిగించకుండా ఉండాలన్నమాట. అంతేగాని, వాటిని ఆమడదూరంలో ఉంచడం ఇమ్యూనిటీ సంపాదించడం కాదు. 'మైక్రోబ్ హంటర్స్'[8] అన్న పుస్తకం చదివి పిరికివాడైపోయి ఈనాటి కింకా భయంతో చదువుతున్నవాణ్ణి నే నెరుగుదును. ఈ నాగరికత ఒకవంక మనిషికి గొప్ప శక్తి లిస్తున్నదిగాని మరోవంక నిర్వీర్యపరుస్తున్నది."

నేను సాధారణంగా ఆయననే మాట్లాడనిచ్చేవాణ్ణి, వినేవాణ్ణి. కాని ఈసారి "ఈ నాగరికత అంటని వాళ్ళెంత మంది ఉన్నారంటారు?" అన్నాను.

"అబ్బో, లక్షలు, కోట్లు!" ఆయన ఏదో జ్ఞాపకం వచ్చి తనలో తానే నవ్వుకున్నాడు. "నాకు చిన్నప్పుడు టైఫాయిడ్ వచ్చింది. అది నయమయే దశలో డాక్టరు నాకు పథ్యం పెట్టించాడు. ఆముదంలో వేయించిన పొట్లకాయ ముక్కలు తప్ప ఇంకేమీ పెట్టవద్దన్నాడు. రెండురోజు లట్లాగే పెట్టారు. మూడో నాడెవరో బోడెమ్మ చూడవచ్చి నా పథ్యం గురించి విని, బుగ్గలునొక్కుకుని, 'ఈ యింగ్లీషు వైద్యులకు పత్థెం ఏమి తెలుసున్రా? ఇంత కారప్పొడి, చారూవేసి పత్థెం పెట్టు కోరూ?' అని నాకవి పెట్టించింది. మోషన్ ఎఫెక్టయింది. మీకెప్పుడైనా టైఫాయిడ్ వచ్చిందా? కోలుకునే స్టేజిలో ఫిజికల్ ఫీలింగ్ అద్భుతంగా ఉంటుంది. నాలో ఆ ఫీలింగు కాస్తా పోయి మళ్ళీ రోగం వచ్చిన ట్టనిపించింది. డాక్టరు వచ్చి మా పెద్ద వాళ్ళను ముక్కచీవాట్లు పెట్టి, తన పథ్యం పెట్టించాడు. ఆ డాక్టరు సర్వజ్ఞుడని చెప్పను. కాని ఆయనకన్న అజ్ఞానులు ఆయన జ్ఞానాన్ని తోసెయ్యటం మాటకు చెప్పాను. తెలీనివాళ్ళకు తెలీకపోగా, తెలుసుననుకునే వాళ్ళకు వైద్యం ఒక ఫాషను. కొందరు ప్రతిదానికీ ఇంజెక్షనియ్య మంటారు. నన్నెవరన్నా అలా శాసిస్తే ఇంజెక్షనే ఇవ్వాలో, మాత్రలే ఇవ్వాలో తేల్చుకునే వాణ్ణి నే నని స్పష్టంగా చెప్పే స్తాను. అందుకే నా దగ్గిరి కెవరూ రారు."

"డాక్టరుగారూ, మీరు మీ పేషంట్స్‌ని హ్యూమర్ చేసి వాళ్ళకు కావలసినట్టే వైద్యం చేశారనుకోండి. ఎవరికి నష్టం? ఏమిటి నష్టం?" అన్నాను.

"ఎందుకు హ్యూమర్ చెయ్యటం? నాలుగు డబ్బులు జాస్తిగా సంపాదించ టానికా? అట్లా అయితే మా నాన్ననే హ్యూమర్ చేసి బోలెడంత డబ్బు తెచ్చు కోలేకపోయానా?" అన్నాడు డాక్టరుగారు.

---

8. వివరాలు అలభ్యం.

ఆయన ఏమంటున్నదీ నా కర్థంకాలేదు. నాకు తన తండ్రి సంగతి తెలిసి ఉంటుందని ఆయన అనుకొని ఉండాలి. నా దిగ్భ్రమ గమనించి ఆయన, "మా నాయన సంగతి తెలీదా? మా నాన్న బెజవాడలో ఉంటాడు. ఆయన బందరులో చాలా ఏళ్ళు క్రిమినల్ ప్రాక్టీస్‌చేసి ఓ లక్ష గడించాడు. అయిదారేళ్ళనుంచీ బెజవాడలోనే ఉంటున్నాడు. డెబ్భైఏళ్ళు. నన్నుకూడా లా చదవమన్నాడు. మానవసేవ చేద్దామని డాక్టరు చదివి ఆయనకు అసంతృప్తి కలిగించాను. నా సేవకోసం మానవు లెదురు చూడరని నాకేం తెలుసూ? అది కూడా క్షమించేవాడేమో. కాని ఆయన అనుమతి లేకుండా వితంతువును పెళ్ళాడాను. అవును; నా భార్య నా మొదటి పేషంటు భార్య. పాపం, పాతికేళ్ళు నిండనివాడు. ఎక్యూట్ నెఫ్రైటిస్. డబ్బులేదు. ఏమీ లేదు. భార్య బండిలోపడేసి తెచ్చింది. కొత్తగా తెరిచిన నా క్లినిక్‌లోనే అతను పోయాడు. పోయిన వాడదృష్టవంతుడు. బతికున్న నిర్భాగ్యురాలిదే కష్టం. తన దూరపు బంధువులకు రెండు మూడు ఉత్తరాలు రాయించింది. ఎవరన్నా వచ్చేదాకా నా యింటనే ఉండమన్నాను. ఏం చెయ్యాలి? వీధిలోకి ఎట్లా తరమటం? ఎవరూ రాలేదు. జీవితంలో ఎంత రెపెడ్‌నెస్ ఉన్నదో నే నావిషయంలో చూడ్డం మొదటిసారి. అప్పుడే ఊళ్ళోవాళ్ళు పరాయివాళ్ళు కాదు, దగ్గిర బంధువులు - మా కిద్దరికీ రంకు కట్టేశారు. రెండు నెలలాగి రిజిస్ట్రారు దగ్గిరికి పోయి పెళ్ళి చేసేసుకున్నాం. నాన్న నాతో తెగతెంపులు చేసేశాడు" అంటూ ఏదో జ్ఞాపకం వచ్చినట్టు నవ్వాడు.

"ఏమిటది?" అన్నాను.

"కిందటేడు మా నాన్నకు సీరియస్‌గా జబ్బు చేసింది. కనీసం ఆయన భయపడ్డాడు. వచ్చి తనకు వైద్యం చెయ్యమని నాకు ఎవరి చేతనో ఉత్తరం రాయించాడు. బెజవాడ వెళ్ళా. ఆయనకు బ్లడ్ ప్రెషరూ, సుగరూ ఉన్నాయి. వాటితోనే బాధపడుతున్నాడు. మందులు రాసిచ్చి, వెళ్ళొస్తానన్నా. అందరికీ ఇట్లాగే వైద్యం చేస్తావేమిటి. పేషంటుకు నయమయినదాకా ఎటెండ్ కావా అన్నాడు. పేషంటు కోరితే ఎందుకుండను. ఫీ పుచ్చుకోవలసి ఉంటుందన్నా. నీ ఫీ ఎంత అన్నాడు. రోజుకు మూడు రూపాయ లన్నా. నేను వట్టి కన్సల్టేషనుకు యాభై రూపాయలు పుచ్చుకొన్న రోజులున్నాయి అన్నాడు. నా వృత్తి అసహాయుల్ను దోచుకోవటం కాదన్నా. డబ్బును గురించి లెక్చరిచ్చాడు. నాగరిక మానవుడికీ మిగిలిన జంతువులకూ తేడా ధనార్జన చెయ్యటంలోనే ఉందన్నాడు. అందుకనే నాగరికత అడవుల పాలవుతున్న దన్నా. ఎక్కడుంటావు. నీకీ ఇంట్లో ఎవరూ భోజనం పెట్టరు అన్నాడు. నాగరికంగా డబ్బు తీసుకొని తిండీ, బసా ఇచ్చే హోటళ్ళున్నాయి కదా అన్నా. మొత్తం మూడు రోజులున్నా. అ

తరవాత నేను వచ్చేటప్పుడు బిల్లెంత చెప్పమన్నాడు. రెండు రూపాయలన్నర ఇయ్యమన్నా. నా అంత దద్దమ్మ డాక్టరు నెక్కడా చూడలేదన్నాడు. పరువు ప్రతిష్ఠాగల డాక్టరైతే కనీసం పాతిక ముప్ఫై రూపాయలకు బిల్లిచ్చే వాడన్నాడు. పాపిష్ఠి డబ్బు కాకపోతే యాభై యిచ్చినా తీసుకునేవాణ్ణన్నా. డబ్బులో పాపం ఉందని కాదు. బెర్నార్డ్ షా అంటాడు చూడూ - కళంకం మనుషుల కుంటుంది గాని డబ్బుకుండదు. ఆ మాట తెలిసి కూడా అట్లా అనాలనిపించింది, అన్నా."

నా అభిప్రాయం కోసం కాబోలు డాక్టర్‌గారు మాట్లాడటం ఆపి నా మొహం లోకి చూశాడు. లేక ఏదో మాట్లాడాలని ఉన్నట్టుగా మొహం పెట్టానో.

"మీరు మీ నాన్నగారికి చాలా అన్యాయం చేశారు. పాపం, ఆయన మీతో మళ్ళీ ఖత్తుకలపాలని పిలిపించి ఉంటారు. కాని మీరు" అన్నాను.

"అదంతా నాన్సెన్స్! తాను నన్ను వెలివేసినందువల్ల నేను నానా బాధలూ పడి, నలిగి, చితికి, మెతకబారానేమో చూడాలని పిలిచాడు. పలుకున్న దని ఆయనకు తెలియ జెప్పాను. మా నాన్న రకం వాళ్ళు తాము నమ్మే ప్రతిదీ ఒక ఉద్యమం అనుకుంటారు. తమతో ఏకీభవించని వారిపైన కత్తి కడతారు. నమ్మకాలందరికీ ఉంటాయి. నాకూ వున్నాయి. కాని ఆ నమ్మకాలలో విశ్వాసం వున్న వాడు వాటిని నిలబెట్టుకునేందుకు జీవితంలో కొన్ని సుఖాలో, సౌకర్యాలో విడిచి పుచ్చాలి. ఆయనకు నేనంటే ఏమిటి కోపం? నా భార్య వితంతువనీ, బాలవితంతువన్నా గాక ఒక మొగుడితో కొంతకాలం కాపరం చేసిందనీనూ. ఆడవాళ్ళు రెండో పెళ్ళివాణ్ణీ, మూడో పెళ్ళివాణ్ణీ చేసుకోవటంలో వాళ్ళకేమీ విడ్డూరం కనిపించదు. మగవాడు రెండో పెళ్ళిదాన్ని చేసుకుంటే మిన్ను విరిగి మీదపడ్డంత గలభా చేస్తారు. అది రేషనల్ కాదు. మా నాన్నను మెప్పించటానికో, ఆయన డబ్బు కోసమో నేను కూడా ఇర్రేషనల్‌గా ఉండనా! ఒకడి పెళ్ళాన్ని చాటుగా ప్రేమించటం సాధ్యమైనప్పుడు, ఒక వితంతువును బహి రంగంగా ప్రేమించటం ఎందుకు అసాధ్యం కావాలి. ఎందరి సంసారాలో చూశాను. నా భార్యలాటి అనుకూలవతి నూరుమందిలో ఒకతె ఉంటుందని నాకు తోచలేదు. నేను కోతలు కొయ్యటం లేదు."

కొత్త స్థలంలో నీరులాగా డాక్టరుగారు నాకింకా పూర్తిగా వంటబట్టలేదు. ఆయన మాట్లాడుతుంటే ఒక్కొక్కసారి నా మనసు నిర్దుష్టంగా ప్రతిధ్వనించేది. కాని ఒక్కొక్కసారి ప్రతిధ్వని ఆయన మాటలకు ఎదురొచ్చేది. ఇప్పుడదే అయింది. ఆయన ఏదో ఆత్మ సంతృప్తితో మాట్లాడుతున్న వాడులాగా కనిపిం చాడు. ఆయనకు అంత ఆత్మ సంతృప్తి ఉండదగిన కారణం నాకేమీ కనిపించ లేదు. ఆయన వితంతువును చేసుకోవటమూ, ఆమె తనకు అనుకూలవతి అయిన

భార్య అనుకోవటమూ, నా కభ్యంతరం లేదు. కాని ఆయనకి యిప్పుడున్న దారిద్ర్యానికీ ఆయన రేషనల్‌గా జీవించటానికీ సంబంధమేమిటో నాకర్థంకాలేదు. ఆయన ఇల్లూ, ఇంటి వాతావరణమూ, ఆయన సాగించే వృత్తి చూస్తే ఎండి పోయిన మానులు స్ఫురించాయి. ఆయన చీకటిలో ఉన్న మనిషి అనిపించాడు గాని వెలుగులో ఉన్న మనిషిలా కనిపించేవాడు కాడు. క్షామదేవత లక్షణాలు, అనరాదుగాని, డాక్టరుగారిలో కొన్ని ఉండేవి. ఆ లక్షణాలకూ ఆయన చెప్పే నిజా లకూ సంబంధం వుండేది కాదు. ఒక్కొక్క నిజం ఒక్కొక్కరు చెబితేనే రాణి స్తుంది. ఇతరులు చెబితే రాణించదు. ఛాందస బ్రాహ్మడి నోట శృంగార కవిత్వం విన్నట్టుగా వుంటుంది.

నే డాక్టరుగారిని గురించి ఇటువంటి వ్యతిరేక భావంతో ఉన్నప్పుడల్లా ఆయన జీవితం మోడులాగా ఉండడం ఆయన తప్పేననిపించేది. రోగులాయన దగ్గిరికి రాకపోవటం కూడా సహజమే ననిపించేది. చిదానందంగాడి కాయన మీద కోపమూ, అభిమానమూ కూడా వున్నదంటే ఆశ్చర్యమేమిటి?

అయితే నాకు మాత్రం డాక్టరుగారంటే యిదే అభిప్రాయం ఉండేది కాదు. ముఖ్యంగా ఆయనకు గల సాహిత్య ప్రియత్వం చూసేటప్పుడు ఆయనంత సంపన్నుడు లేడనిపించేది. నేను చదివిన షేక్‌స్పియర్ నాటకమే ఆయన చదువుతూ ఆనందం పొందుతుంటే నా కా నాటకంలో రెట్టింపు స్వారస్యం కనిపించేది. ఆయన సాహిత్య ప్రియత్వం ఒకరకం అంటువ్యాధే నని చెప్పాలి. నేను దానితో యిప్పటికింకా తీసుకుంటూనే వున్నాను. నే నే యూనివర్శిటీ కైనా వైస్ ఛాన్సలరయితే ఆయన్ని ఇంగ్లీషు లిటరేచరు బోధించటానికి పెట్టి వుందును.

ఒకే ఒక్కసారి ఈ విషయంపై కూడా ఆయనని ఆక్షేపించాను. "డాక్టరు గారూ, మీకు భావాలపట్ల ఉన్న ఆసక్తి భౌతిక జీవితంపై కూడా ఉంటే మీ జీవితం మరింత సుఖంగా ఉండునేమో?" అన్నాను.

"నాకట్లా అనిపించటంలేదు. నిజమైన ఆనందమంతా భావప్రధాన మైనదే. నేనొక ఆడపేషెంటు నాడి చూస్తే అందులో ఏమీ లేదు. పేషెంటుకాని మనిషి చెయ్యి పట్టుకుంటే చాలా గొడవవుతుంది. చెయ్యి పట్టుకోవడం ముఖ్యం కాదు. భావమే ముఖ్యం. 31లో ఒక విషయం విన్నాను. మా ఊళ్ళో ఒక ప్లీడరు గుమాస్తా క్లయింట్ల సొమ్ము కొంత తినేశాట్ట. దాన్ని గురించి ప్లీడరుదాకా వెళ్ళి ఆయన ప్రోసిక్యూటు ఆరంభించే సమయంలో ఆ గుమాస్తా గాస్తా సత్యాగ్రహోద్యమంలో చేరి, అరెస్టయి, జైలుకు పోయి దేశభక్తుల జాబి తాలో చేరిపోయాడు. ఎందుకు చెప్పా నీమాట? ఆఁ! పెద్ద భావం వచ్చి చిన్న

భావాన్ని కొట్టేసింది....భావాలు గాలిలో తేలివుంటాయని కాదుసుమా. పుస్తకాలు చదివి నిజంగా ఆనందించ దలచినవాడికి జీవితం బాగా తెలియాలి. జీవితాను భవానికి అతీతంగా ఉండే కావ్యానందాన్ని నేనూ ఆమోదించాను. అయితే పుస్తకాలు చదివి ఆనందించటానికి మూడుపూటలా పెరుగన్నమూ, సిల్కు బట్టలూ, పెద్ద రాబడీ, పరువూ, హోదా, నౌకర్లూ, చాకళ్ళు కావాలంటావా? అదీ ఒప్పుకోను."

ఆయన అన్న మాటల్లో అభ్యంతరం చెప్పటానికి నాకేమీ కనిపించలేదు. ఆయన ఇంకా చెప్పుకుపోయారు.

"నీవు గమనించే వుంటావు. మన సమాజంలో క్రింది తరగతులవాళ్ళు పుస్తకాలు చదవరు. చదివినా పివదె. ఎందుచేత? వాళ్ళ వాస్తవ జీవితానికి అనుగుణమైనదేదీ సాధారణంగా పుస్తకాలలో వుండదు. వాళ్ళ భౌతికానుభవం సహాయంతో పొందటానికి కావ్యానందం మన మామూలు పుస్తకాలలో వాళ్ళకి కనిపించదు. మనం సాహిత్యమనుకునే దానికన్నా పురాణాలే వాళ్ళకి అందుబాటులో వుంటాయి. రాముడూ, రావణుడూ, సీతా, కైకేయీ, దశరథుడూ, పాండవులూ చాలా తేలికగా అర్థమయ్యే పాత్రలు. వాటితో పోల్చితే షేక్స్పియర్ పాత్రలు నిగూఢమైనవి. ఆ మాట అంటే మన పండితులు నేను పాశ్చాత్య వ్యామోహంలో పడిపోయానంటారు. భాసుడి నాటకాలేవైనా[1] చూశావా? అరెరే ఎంత పొరపాటూ? రేపు కూర్చుని ప్రతిమ[2] చదువుదాం. నా దగ్గర కాపీ ఉండాలి. వాల్మీకికన్న

1. భాసుడి నాటకాలు : ప్రఖ్యాత సంస్కృత నాటక కర్త (భాసుడు క్రీ. శ. 3-4 శతాబ్దాల మధ్య) రాసిన నాటకాలు. భాసుడు 24 రూపకాలు రాశాడని ప్రతీతి. లభ్యమైనవి 13: మధ్యమ, పంచరాత్ర, దూతవాక్య, దూత ఘటోత్కచ, కర్ణభార, ఊరుభంగ, ప్రతిమ, అభిషేక, అవి మారక, ప్రతిజ్ఞా యౌగంధరాయణ, స్వప్నవాసవదత్త, చారుదత్త. మహాభారత రామాయణ సంబంధమైన ఇతివృత్తాలనూ, సంప్రదాయక వీరగాథలనూ నాటకాలుగా మలిచాడు. వైవిధ్యభరితమూ, నిగూఢ సంపన్నమూ, సజీవమూ అయిన పాత్ర చిత్రణకూ హాస్యకుశలతకూ, లోకజ్ఞతకూ, సంభాషణల్లో సంక్షిప్తతకూ, రూపక నిర్మాణములో స్వతంత్రతకూ, నాటకీయ ఘటనా నిర్మాణదక్షతకూ పేరుపొందిన నాటక కర్త. నాటక సంప్రదాయానికి భిన్నంగా యుద్ధాన్ని, మరణాన్ని రంగస్థలం మీద చూపి రూపక లక్షణాతిక్రమణం చేసినవాడు. దశరథాది ప్రతిమా కల్పన చుట్టూ జరిగిన నాటకం. సీత నారచీర ధరించటం, రంగస్థలం మీద భాసుడు చూపడం, తద్వారా భవిష్యత్కాలాన్ని సూచన చేయటం భాస కల్పనకు దృష్టాంతాలు.

భాసుడు. నన్నడిగితే, చాలా సటిల్ ? అతనికి కవి సమయాలూ, కన్వెన్షన్లు కూడా ఉన్నట్లు కూడా నాకు తోచలేదు."[1]

మర్నాడు డాక్టరుగారు ప్రతిమ చదివి వినిపించాడు. ఆ అనుభవం నా జన్మలో మరువను. భాసుడెవడో, ఏ శతాబ్దివాడో నాకు తెలీదు. కనీసం షేక్స్పియర్[2] కన్నా, తప్పకుండా ఫ్రాయిడ్[3] కన్నా ముందువాడు. ప్రతిమలో సైకిక్ రిప్రెషన్[4] చిత్రించాడు భాసుడు : దాన్ని డాక్టరు వివరించాడు. నాకు మతిపోయినట్టయింది.

## 2

నా అంచనా తప్పలేదు. ఇంటరు ఫస్టుక్లాసులో పాసయ్యాను. రిజల్ట్సు తెలిసేసరికి నేను నందివెలుగులో మా సుబ్బక్కయ్య గారింట ఉన్నాను. మా అక్కయ్య పాత భాగోతమంతా తిరగేసింది. ఆడవాళ్ళకు గతాన్ని నెమరువేసుకోవటంలో ఉన్న ఆనందం యింతా అంతాకాదు. భవిష్యత్తు గురించి ఆలోచిస్తే భయంవేసి నప్పుడెవరన్నా గతాన్ని తలచుకొని ధైర్యం తెచ్చుకోక తప్పదేమో వ్యక్తులయ్యేది, జాతి అయ్యేది జీవితంలో అయేది—"గోదావరీ సావనోదారవాః పూర మఖిలభారతము మాదన్న నాడు!" "ఒకనాడు కలదాంధ్ర యువకులు" యేదో చేసిననాడు!

తప్పేదేముందీ! అంతా విన్నాను.

అక్క గతానికి తాను కోరిన రంగులు పులిమిందా? తనకిష్టం లేనివి మరిచి పోయిందా? జరగనవికూడా అవ్యక్త ప్రేరణతో జరిగినట్టు చెప్పిందా? ఏమో? ఎవరు చెప్పగలరు? నన్ను గురించిన సంగతులే ఆవిడ చెబుతుందే నాకు కొంచెం కూడా జ్ఞాపకం రాలేదు, మరుపు నాదేనేమో!

---

1. సంస్కృత రామాయణ కర్త వాల్మీకికన్న, భాసుడు సటిల్ అనటమూ. భాసుడికి కవిసమయాలు, కన్వెన్షన్లు కూడా ఉన్నట్లు తోచలేదు, అనటమూ భాస పాత్రల మనస్తత్వ చిత్రణలోని సంశ్లిష్టతనూ నిగూఢతనూ తెల్పటానికే; రూపకనిర్మాణంలోని సంప్రదాయాతిక్రమణను వివరించడం కోసమే. అంతేకాదు వాల్మీకిపాత్ర నిర్మాణమూ, కథనమూ సరళమైనవి. అందువల్లనే రామాయణ భారత పాత్రలను షేక్స్పియర్ పాత్రలతో పోల్చి చెప్పడం.

2,3. చూడండి ముందు పేజీల్లో.

4. ప్రతిమలో సైకిక్ రిప్రెషన్: ప్రతిమా గృహంలో భరతుని మానసిక సంక్షోభాన్ని వివరించే సన్నివేశంలోనిది ఈ ప్రస్తావన కావచ్చు.

కాని ఒకటి మాత్రం రూఢిగా చెప్పగలను. ఆవిడ చెప్పుకొచ్చిన గత చరిత్రలో భయంకరమైన సన్నివేశాలున్నాయి, అన్యాయమైనవి ఉన్నాయి. కాని వాటి తాలూకు భయంకరత్వాన్ని గురించిగాని, అన్యాయాన్ని గురించిగాని ఆవిడ బాధపడుతున్నట్లు కనిపించలేదు. సినిమా తెరమీది విషయాలను లీనా లీనావస్థలోచూసినట్టుగా గతాన్నావిడ స్మరించింది.

నాకు మటుకు భవిష్యత్తుకన్న గతమే భయంకరమైనది. చచ్చినవాళ్ళు దయ్యాలై పట్టుకుంటారుగాని, పుట్టబోయేవాళ్ళు పట్టుకోరు. అన్యాయాలు భవిష్యత్తులో జరగకుండా చూసే అవకాశం ఈనాడు బలికున్నది. గతం అట్లా కాదే! దానిలోనుంచి మానవులు దుర్మార్గాన్నీ, దురన్యాయాన్నీ, అవివేకాన్నీ తుడిచివెయ్యటానికి లేదే! రేపు భారతదేశం స్వాతంత్ర్యం కావచ్చు[1] కాని రెండు వందల ఏళ్ళ బ్రిటిషు పరిపాలనను చరిత్ర నుంచి ఎట్లా కడిగి వెయ్యటం? అంత పెద్ద విషయాలు కూడా తీసుకోనవసరం లేదు. నేను పుట్టక పూర్వం మా అమ్మకు జరిగిన అన్యాయమైన పెళ్ళిని నేనీనాటికి క్షమించలేదు. ఇవాళ మా అమ్మాలేదు. పట్టుబట్టి ఆ పెళ్ళిచేసిన ఆవిడ తండ్రీలేడు. అయినా ఒక చిన్న అప్సరసలాటి మా అమ్మను పెద్ద గొరిల్లాలాంటి మా నాన్నకు ఇచ్చి చెయ్యటమూ, వాళ్ళిద్దరి వయసు మధ్యాగల పాతికేళ్ళ తేడా తలుచుకున్నప్పుడల్లా నన్ను బాధిస్తూనే ఉంటుంది. ఒకరికోసం కాకుండా నేనా సంఘటన తలుచుకుని మానవ జాతి తరుపున సిగ్గుపడుతూంటాను.

మా నాన్నా మా అమ్మా పెళ్ళాడకపోతే నేను పుట్టి వుండను గనుక నేను వాళ్ళ పెళ్ళికి సిగ్గుపడటంలో అర్థంలేదని ఎవరన్నా ఆక్షేపించవచ్చు. కాని అది అర్థంలేని ఆక్షేపణ. నేను పుట్టివుండటంకన్న, ఆ పెళ్ళి జరగకుండా వుండటం ముఖ్యమన్న భావం నాలోనుంచి పోదు. పైగా ఆమె గురించి సిగ్గుపడే శక్తి నాకు పుట్టుకతో వచ్చినది కాదు. ఏ సంస్కృతో నాలోని భావాన్ని నాటింది. ఆ సంస్కృతి బాహ్యమైనది. నేను లేకపోయినా నాలో వుంటుంది. ఉండాలి. ఆ సంస్కృతి ఎంత వ్యాపిస్తే జీవితానికంత మంచిది. జరగగూడని పనులు క్రమంగా జరగకుండా పోవాలంటే అంతకుమించి మరో పద్ధతిలేదు.

మా బావ కూడా నాతో వ్యవసాయం గురించీ, కోడెదూడల పెంపకం గురించీ మాట్లాడాడు.

"ఎందుకొచ్చిన ఫస్టు క్లాసురా? కూటికా గుడ్డకా? హాయిగా నాతోబాటు వ్యవసాయంలో ప్రవేశించు. ఓ పాతిక ఎకరాలు మక్తాకు తీసుకుందాం. కాలు

---

1. విశ్వనాథ సత్యనారాయణ (1895-1976) రాసిన ఆంధ్రపౌరుషము లోని పాదాలు గత వైభవ స్మరణ మన జాతీయోద్యమ సన్నివేశంలో ఒక ప్రబల ధోరణి.

మీద కాలేసుకు తింటూ కూర్చో. పెళ్ళి చేసుకో. పెళ్ళాంచేత పాడి చేయించు" అన్నాడు సత్యంబావ.

నా భవిష్యత్తుకు పథకాలు వేసే హక్కు మా బావకు ఒక విధంగా ఉన్నది. మా కొలకలూరు పొలం ఆరెకరాలూ ఆయనే చూస్తున్నాడు. చూస్తున్నాడనటంకన్న దాంతో ఆడుకుంటున్నాడనటం సరిగా ఉంటుందేమో. తన పొలంలో చెయ్యాని పనులన్నీ ఆయన మా పొలంలో చేసేవాడు. ఒకసారి రెండెకరాల్లో చెరుకువేసి బెల్లం కాయించి నాకు నష్టం తెప్పించాడు. ఇంకోసారి పొరపొగాకు మూడెకరాల్లో వేసి నష్టం తెప్పించాడు. ఒకసారి రెండో పంటకింద జనుము వేసేవాడు. ఒకసారి మినుము వేసేవాడు. ఏమిటేమిటో చేసేవాడు.

అందుచేత ఆయన నా మీద గార్డియను హక్కులు చూపేవాడు. మా బాబాయి కూడా, "ఏం చేద్దామనుకుంటున్నావురా?" అని అడిగేవాడు. కాని మా సత్యంబావ, "ఇట్లా చెయ్యి" అనేవాడు.

"నా కప్పుడే పెళ్ళేమిటి?" అన్నాను.

"ఒరే నీ యీడుకు నేను-" అని దాక ఆగిపోయాడు. నా యీడుకు మా సుబ్బక్కయ్య ఇంకా కాపరానికి రాలేదు గనుక ఆయన ఏం చేసినా పైకి చెప్పుకోను టానికి లేదు.

"నువ్వాక పెళ్ళియీడు దాటుకున్నా చేసుకపోతేవ. అట్లాగే చేసుకుని ఉందును" అన్నాను.

మా బాబాయి వాళ్ళింటికి వెళ్ళి రెండు రోజులున్నాను. నేను పాసయినానని తెలిసి బాబాయి, "తరవాత కార్యక్రమ మేమిటిరా?" అన్నాడు.

"ఇంకేముంది? బియ్యే చదువుతాను."

"ఎక్కడ?"

"గుంటూరులోనే చదవాలనుంది. ఆ కాలేజీ వదలాలని లేదు."

"పెళ్ళి సంబంధా లేవన్నా చూడమన్నావుటోయ్?" అన్నది పిన్ని.

"ముక్కుపచ్చలారని పద్దెనిమిదేళ్ళవాణ్ణి పట్టుకుని అందరూ పెళ్ళిచేసుకో మంటారేమిటి?" అన్నాను.

"పెళ్ళయిన మర్నాడు అన్ని పచ్చలూ అవే ఆరతాయి- వగలు పోతున్నావు, వగలు!" అన్నదావిడ.

"అన్నయ్యా మేం సర్కస్ చూశాం. హిహిహి! సింహం ఎట్లా అరిచిందనుకున్నావు?"

మా బాబాయి కొడుకులిద్దరూ సింహాలైపోయి ఒకరినొకరు చూసుకుంటూ పోటీపడి అరవసాగారు. ఎందుకో చెప్పలేను, నాకూ వాళ్ళలాగే అరవాలనిపించింది.

"శ్రావణ మాసంలో మేం గుంటూరొస్తాములే. మా ఆఖరు బావమరిది శీనుకు గుంటూరులో సంబంధం చూస్తున్నారు. కుదిరినట్టే" అన్నాడు బాబాయి.

కొత్తచోట పొద్దుగడవదు. నందివెలుగులో నాలుగురోజులు గడిపితే నాలుగు యుగాలు గడచినట్టున్నది. మా బావగారింట పుస్తకాలుండవు. గుంటూరునుండి వచ్చి నాక పుస్తకం తిరగేసిన పాపాన పోలేదు. మా బాబాయి దగ్గిర పుస్తకాలుంటాయి. ఆయన పిల్లల పేపర్లు దిద్దటానికూర్చున్నప్పుడాయన బీరువా గాలించాను. వసుచరిత్రా,[1] మనుచరిత్రా,[2] కాశీఖండమూ,[3] కళాపూర్ణోదయమూ,[4] వీరేశలింగంగారి ప్రహసనాలూ[5] లాటి పుస్తకాలు చాలా ఉన్నాయి. కాని పెన్నిధిలాగా భాస నాటకాలు, చిలకమర్తివారి అనువాదం[6] కంటపడేసరికి మిగిలిన పుస్తకాలన్నీ మనసులో నుంచి మాయమయ్యాయి.

ఇష్టమైన భోజనానికి కూర్చునేవాడిలాగా ఆ పుస్తకం తీసుకుని చదవటానికి పట్టెమంచం మీద నడుము వాల్చాను. కాని అయిదు నిమిషాల అనంతరం నేను పొందిన ఆశాభంగం వర్ణనాతీతం. అవి భాసుడి నాటకాలల్లేలేవు. ఎవరో చాతకాని వాడు రాసినట్టున్నాయి. నేను ఏ నాటకంగాని అరపేజీపైన చదివాననికాదు. ఒకటి కాదని ఇంకొకటీ, అది కాదని మరొకటీ ప్రారంభించి చూశాను.

---

1. వసుచరిత్ర తెలుగు ప్రౌఢ ప్రబంధం. రామరాజ భూషణు (16వ శతాబ్ది)ని రచన.
2. మనుచరిత్ర తొలితెలుగు ప్రబంధం. అల్లసాని పెద్దన (1470-1533) రచన.
3. కాశీఖండం క్షేత్రకావ్యం. శ్రీనాథుని (15వ శతాబ్ది) రచన.
4. కళాపూర్ణోదయం స్వతంత్ర తెలుగు కావ్యం. పింగళి సూరన్న (16వ శతాబ్ది ఉత్తరార్థం) రచన.
5. కందుకూరి వీరేశలింగం పంతులు (1848-1919) యాభైకి పైగా రాసిన ప్రహసనాల ప్రస్తావన. కులాచారాలనూ, సనాతనుల నమ్మకాలనూ, అధికారుల దేష్ట్యాలనూ, విపరీతంగా కనపరచి అవహేళనచేస్తూ నవ్వుపుట్టిస్తూ మంట పుట్టిస్తూ సంస్కరణను ఉద్దేశిస్తూ పంతులుగారు ప్రహసనాలు రాశారు.
6. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు (1867-1946) భాసనాటకాలన్నిటికీ అనువాదాలు చేశారు. చిలకమర్తివారి భాసనాటకానువాదాలు స్వప్నవాసవదత్త (1913), ప్రసన్న యాదవము (1906), మధ్యమ వ్యాయోగము (1915), ప్రతిమ, ప్రతిజ్ఞా యౌగంధరాయణము, కర్ణభారము, పంచరాత్రము (1928).

ఏ ఒక్కటీ నడవలేదు. ప్రతిమ చదువుదామన్నా సాగలేదు. ఏం జరిగింది? డాక్టరుగారు చదివి వుండకపోతే నేను ప్రతిమకూడా ఆనందించి ఉండకపోదునా? కిటుకంతా డాక్టరుగారిలోనే ఉందా?

తలుచుకున్న కొద్దీ నా కాశ్చర్యమయింది.

నా శలవుల్లో చాలా భాగం గుంటూరులోనే ఉండిపోయాను. ఎండలు భరించలేకా, ఉన్నకొద్దిమంది చుట్టాలనూ చూడాలనిపించి బయలుదేరి వచ్చాను. తిరిగి కాలేజీ తెరిచేనాటికే గుంటూరు పోదామని మొదట అనుకున్నాను. ఎంత? ఇంకా నాలుగు రోజులు. కాని నాకు యీ నాలుగుకూడా డాక్టరుగారితోనే గడపా అనిపించింది. ఈ భాసుడి నాటకానువాదాలు చూస్తే ఆయన ఎంత సంతోషిస్తారో. ఆయనచేత చదివించి వీటిని వినితీరాలి. నా సాహిత్యాభిలాష పరిపక్వం చెందా లంటే ఇంకా నే నాయన శుశ్రూష చాలా చెయ్యాలి.

"బాబాయి, ఈ పుస్తకము నాకో నెల రోజుల పాటిస్తావా?" అన్నాను.

"ఏమిట్రా అదీ? భాసుడా! నీ కిష్టమూ యేమిటీ? కాళిదాసో,[1] భవభూతో[2] చదవక భాసుణ్ణి పట్టుకున్నావేమిటి? కాళిదాసు మెచ్చిన నాటక కర్తే అనుకో. కాని కాళిదాసు ముందర ఏపాటి?" అన్నాడు బాబాయి.

ఎందుచేతనో డాక్టరుగారు భాసుడి పేరువెంట కాళిదాసు పేరు ఉచ్చరించ నైనా లేదు. బాబాయి తెలీనివాడనటానికి లేదుమరి.

---

1. కాళిదాసు (క్రీ. శ. 5 వ శతాబ్ది). ప్రపంచ విఖ్యాత కవీ, నాటక కర్తా. ఆయన రాసిన కావ్యాలు: ఋతుసంహారం, మేఘదూతమ్, రఘువంశమ్, కుమార సంభవమ్. నాటకాలు : విక్రమోర్వశీయమ్, మాళవికాగ్ని మిత్రమ్, అభిజ్ఞాన శాకుంతలం, గుప్తరాజుల కాలం నాటి ప్రభువర్గ జీవితాన్నీ, నాటి సాంప్రదాయాలనూ చిత్రించిన కవీ, నాటకకర్త, సుకు మార భావప్రకటనకూ, లలిత శబ్ద ప్రయోగానికి పేరుమోసిన వాడు. సంప్రదాయ వాదుల్లో కాళిదాసు మహానాటక కర్త అనే విశ్వాసముంది. కాళిదాసులోని కవితా సౌందర్యంపట్ల మమకారంవల్లి, భాసుడు, శూద్ర కుడు వంటి గొప్ప నాటక కర్తల రూపక నిర్మాణ దక్షతను సంప్ర దాయవాదులు వేస్తూ ఉంటారు. నిజానికి కాళిదాసుపై భాస నాటకాల ప్రభావం లేకపోలేదు.

2. భవభూతి (క్రీ. శ. 8 వ శతాబ్దం) ఉత్తరరామ చరితమ్ నాటక కర్త, భవభూతి శ్లోకాలు అని శ్రీశ్రీ పేర్కొనటం భవభూతిలోని కరుణ రస దృష్టిని స్మరణకు తేవడం కోసమే.

ఆ రోజే వెళతానంటే మా పిన్ని కోప్పడింది. మర్నాడు బస్సు పట్టుకుని గుంటూరు చేరుకున్నాను. చిదానందం విషయం విచారిస్తే వాడింకా వాళ్ళ ఊరు నుంచి తిరిగి రాలేదని తెలిసింది. వాడు బ్రాడీపేటలో వాడి పెత్తండ్రి కొడుకింట ఒక గదిలో ఉండేవాడు. వాడు పాసయాడు. కాని బియ్యే చదువుతాడో, మెడికల్ కాలేజీకి పోతాడో. బియ్యే చదివినా గుంటూరులో చదువుతాడో లేదో ఏమీ తెలియ లేదు. వాడి పెత్తండ్రి కొడుకు రాఘవరావుకు వాడు ఉత్తరం కూడా రాయలేదట. నా చేతి పెట్టే, బెడ్డింగూ రాఘవరావుగారింటనే పారేసి, పాతగదికి వెళ్ళాను. ఆ గదికాస్తా ఇంకెవరో ఆక్రమించేశారు. మళ్ళీ నెలలోపుగా తిరిగి వస్తున్నానని తెలిసి కూడా ఒక్క నెల అద్దెదగ్గిర పీనాసిగా ప్రవర్తించటం నాకే బెడిసికొట్టింది.

అక్కడినుంచి డాక్టరుగారింటి కెళ్ళాను, భాసుడి నాటకాలతో సహా! డాక్టరుగారు నన్ను చూసి చాలా సంతోషించాడు.

"భేష్ భేష్! దీని కోసం ట్రైచేశాను దొరకలేదు" అన్నాడాయన.

మాటల సందర్భాన ఆయన చెప్పాడు - చిదానందం విశాఖపట్నం - మెడికల్ కాలేజీకి అప్లికేషన్ వేశాట్ట. సీటు వచ్చిందీ లేనిదీ ఆ ఉత్తరంలో వాడు రాయలేదట. బహుశ సీటు వస్తుందనీ, చిదానందం మెడిసన్ చదువుతాడనీ డాక్టరు గారన్నాడు.

వాడు డాక్టరు కావాలని ఎందుకు నిర్ణయించి ఉంటాడు? డాక్టరుగారి ప్రభావం ఉండకుండా ఉంటుందా? అయితే డాక్టరుపైన అభిమానం ఎంతవుందో ఆక్షేపణా అంత వుంది. ప్రాక్టీసు చెయ్యటం విషయంలో ఆయన చేసిన పొరపాట్లు సవరించుకుని, తాను ఆయనకు గుణపాఠంగా తయారు కావాలన్న అభిప్రాయం వాడిలో అవ్యక్తంగా ఉండి ఉండవచ్చు.

నిజానికిదంతా నా ఊహే, కాని చిదానందం సంగతి బాగా ఎరిగున్న వాణ్ని గనక, నా ఊహలో అట్టే పొరపాటుం దనిపించలేదు. అసలు నన్ను పట్టుకున్న సమస్య అది కాదు -డాక్టరవుదామని నాకెందుకనిపించలేదూ? ఆయన లాగా కావటానికి నాలో అజ్ఞాతంగా ఏదోభయం ఉండి ఉండాలి. ఆయనకు ఉత్తరం రాయాలన్న ఆలోచనకూడా నాకు తట్టలేదు. డాక్టరుగారికి చిదానందం నాకన్న సన్నిహితుడు. సందేహం లేదు. ఆయనను గురించి ఎలాటి భ్రమలూ లేకుండానే వాడాయనను ఆరాధిస్తాడు. నేను? నా కాయనపై మంచి అభిప్రాయం ఉన్నప్పుడు చిన్న దేవుడల్లే ఉంటాడు; దురభిప్రాయం ఉన్నప్పుడు శాపగ్రస్తుడి లాగా కనిపిస్తాడు. ఈ ద్వైతం నుంచి నేను తప్పించుకోలేకుండా ఉన్నాను. డాక్టరు గారికి సంబంధించినంతవరకు నా మనస్సు భ్రమలతోనేకూడి ఉంటున్నది.

నాకు చిదానందం గాడిపైన అసూయ పుట్టుకొచ్చింది.

"చిదానందం ఇక్కడికి వస్తాడో రాడో ఖచ్చితంగా తెలిస్తే బాగుణ్ను." అన్నాను.

"ఏం?"

"రాఘవరావుగారి నడిగి వాడిగది నేను తీసుకోవచ్చు" అన్నాను.

"నీ గది ఇంకా సౌకర్యంగా ఉంటుందనుకుంటున్నాను?"

"అది చెయ్యిజారిపోయింది."

"ఓ....నీ కభ్యంతరం లేకపోతే మా ఉత్తరపు గదిలో ఉండొచ్చు. నా క్కూడా మంచి కంపెనీగా ఉంటుంది." అన్నాడు డాక్టరుగారు.

ఇటువంటి సూచన ఆయననుంచి వస్తుందని కలలోకూడా అనుకుని వుండక పోవటంచేత నేను చాలా బిడియపడి పోయాను. నెట్ డిసిషన్ ఆయన సూచనను ఆమోదించరాదనే. ఆ క్షణంలో ఆయన సూచన ఆమోదించటానికి ఒక్క కారణమూ కనిపించలేదు. కనిపించదగిన కారణం ఒకే ఒకటి ఆయన కంపెనీ. కాని అదే నా కిష్టంలేదు. ఇంతవరకూ ఉన్న పరిస్థితిలో మా యిద్దరి మధ్యా ఉంటూ వస్తున్న సంబంధం నాకు చాలా తృప్తికరంగా వున్నది. ఎప్పుడైనా కలుసుకుంటాం. మాట్లాడుకుంటాం-కనీసం ఆయన మాట్లాడితే వింటాను. సంభాషణ బాగుందా, తృప్తిగా వెళ్ళిపోతాను. మరో సమావేశం కోసం ఆత్రంగా యెదురు చూస్తాను. సంభాషణ రుచించకపోతే ఏదో ఒక వంక పెట్టి నేను శలవు పుచ్చుకోవచ్చు. (ఇట్లా ఒకటి రెండుసార్లు జరిగింది కూడాను)

అస్తమానమూ ఇద్దరమూ ఒకేచోట ఉంటే ఈ సంబంధం పూర్తిగా మారిపోక తప్పదు. తృప్తికరంగా ఉన్న సంబంధంలో మార్పేవస్తే అది అసంతృప్తికరమైనది కావటానికే ఎక్కువ అవకాశం ఉంది. అందువల్ల నాకు నష్టం.

అది అటుంచి ప్రస్తుతం మేం ఒక విధమైన గురుశిష్యులం. మా మధ్య ఉన్న బంధం చాలావరకు సాహిత్యానికి సంబంధించినది. రేపు నే నీ ఇంటనే ఉండటం ఆరంభిస్తే, డాక్టరుగారి ప్రవర్తన పెళ్ళాంపట్ల ఎలా ఉండేది, కూతురిపట్ల యెలా ఉండేదీ, ఇంటికి వచ్చేపొయ్యేవాళ్ళ పట్ల ఎలా ఉండేదీ చూడక తప్పదు. ఆయన దేవుడేం కాదు. ఆయనలో వంద దౌర్బల్యాలుండవచ్చు. అప్పుడప్పుడూ వచ్చిపోతుంటేనే ఒక్కొక్కసారి ఆయనకు దూరంగా పారిపోదామనిపిస్తుంది. అటువంటి పరిస్థితిలో రోజూ పొద్దునా, సాయంకాలమూ, రాత్రీ ఆయనను చూస్తుంటే ఎలాంటి దురభిప్రాయాలైనా కలగవచ్చు. ఆ తరువాత ఆయన సాహిత్యప్రియత్వం కూడా నాకు రుచించకపోవచ్చు. మిగిలిన చిక్కులు అంత పెద్దవికావు. గదికి అద్దె ఇవ్వాలి. ఆయన అడిగినంత ఇవ్వాలి. అదిఎక్కువ అనిపించవచ్చు; బేరమాడటం చండాలం, తక్కువనిపిస్తే మొహమాటంగా ఉంటుంది. కాలేజీకి

జీతం కట్టినట్టుగా నెలనెలా "ఇదిగోనండి అద్దె!" అనటం బాదే. కాని అవన్నీ అంత పెద్ద బాధలు కావు.

ఆయన సూచనకు నేను ఎగిరి గంతెయ్యక పోవడం గమనించి ఆయన "ప్రస్తుతం నీ సామా నెక్కడ?" అన్నాడు.

"చిదానందం వచ్చి ఉంటాడనుకొని రాఘవరావు గారింటికెళ్ళి అక్కడే పెట్టాను. ఆ తరువాత నా గదికి వెళ్ళిచూస్తే అందులో ఎవరో ఉన్నారు" అన్నాను.

"సరే చిదానందం వచ్చేదీ రానిదీ తరువాత చూసుకోవచ్చు. నీ సామానక్కడెందుకూ, ఇక్కడికి పట్టుకొచ్చెయ్యి. రెండుమూడు రోజుల్లో ఏదో ఒక పెర్మనెంటు ఏర్పాటు చేసుకోవచ్చు." అన్నారాయన.

అందులో అబద్ధమేమీలేదు. మరో అరగంటకల్లా నా పెట్టే, బెడ్డింగూ తెచ్చి డాక్టరుగారింట చేర్చాను. ఈ లోపల ఎవరో వచ్చి డాక్టరుగారిని పిలుచుకు పోయారుట. ఆయన భార్య నన్ను చూడగానే, "ఆ గదిలో సామాను పెట్టుకోండి. గది ఖాళీయే" అన్నది.

ఉత్తరపువేపు గది నిజంగానే ఖాళీగా ఉన్నది. ఊడ్చినట్టు శుభ్రంగా వున్నది. నేను వెళ్ళివచ్చే లోపల గది ఖాళీచేశారో లేక అందులో ఎప్పుడూ ఏ సామానూ లేదో, అదిమాత్రం నాకు తెలీదు. నేనెప్పుడూ డాక్టరు గారింటి లోపలికి వెళ్ళలేదు. ఇదే మొదలు.

నా వెనకాలే డాక్టరుగారి భార్య సుందరమ్మగారూ, కూతురు నర్సూ గది లోకి వచ్చి నేను నా సామాను సర్దుకోవటం సినిమా చూసినట్టు చూడసాగారు. పాపం, వాళ్ళు పరాయివాళ్ళ నిత్యచర్యలుచూసి ఎన్నేళ్ళయిందో! నేను నా షేవింగు సామానూ, టూత్‌బ్రష్షూ, పేస్టూ, నా తలనూనె, దువ్వెనా, అద్దమూ మొదలైనవి గదిలో వున్న చిన్న అలమారులో పెట్టుకున్నాను. అడుగు అరలో పుస్తకాలు—నాలుగైదుకన్నా లేవు—సర్దుకున్నాను.

ఎవరో చెప్పినట్టుగా నర్సు అవతలికి వెళ్ళి ఒక పాత చాపతెచ్చి ఒక గోడ పక్కగా పరిచి, "పరుపు దానిమీద పెట్టుకోవచ్చు" అన్నది.

"స్నానం చేస్తారా? ఈలోపుగా ఆయన తిరిగొస్తారు....భోజనం చెయ్యొచ్చు" అన్నది సుందరమ్మగారు.

భోజనమా? నేను ప్రస్తుతం అతిథినన్న మాట! తర్వాత అద్దెవాడుగా మారాలా? ఘోరం!

డాక్టరుగారు తిరిగి రావటానికి దాదాపు ఒక గంట పట్టింది.

రాచపుండు కేసు....మీరన్నం తినక పోయారా? ఆపరేషన్ చేసి వచ్చాను. అన్నం సయించదు" అన్నారాయన.

నిజంగానే ఆయన మామూలుగా భోజనం చెయ్యలేదు. ఒక డిష్‌లో మజ్జిగ అన్నం కలిపి పెట్టించుకుని చంచాతో తిని లేచాడు. నాకు మామూలుగా భోజనం చెయ్యటాని కెందుకో పట్టిచ్చినట్టయింది.

"మా వంట బాగా సయించినట్టులేదు. ఆదేం భోజనం?" అన్నది సుంద రమ్మగారు.

"వంటా? అద్భుతంగా ఉంది. హోటల్లో తినేవాడికి నాకు ఇంటివంట బాగుండకపోవట మేమిటి?" అన్నాను.

"మరి అదేం తినటం?"

"పొద్దున టిఫిను కొంచెం హెవీగా వేశాలెండి" అన్నాను.

అన్నం తినగానే గదిలో పక్కపరుచుకుని ఒక నిద్రతీశాను. ఆ రోజు మరీవేడిగా ఉన్నట్టనిపించింది.

ఆ సాయంకాలం పాకలో కూర్చుని డాక్టరుగారు భాసుడి మధ్యమ[1] చదువు తూంటే నేను వింటూ అందులోవున్న హాస్యాన్ని తెగ అనుభవించాను. చిత్రం; ఆ నాటకం నేను సొంతాన చదువలేక దాటేసిన నాటకాలలో ఒకటి. అది చిన్న నాటకం—నాటిక. అటువంటి నాటికాన్ని వ్యాయోగ[2]మంటారుట.

డాక్టరుగారు నాటకం పూర్తిచేసి క్లాసుకు పాఠం చెబుతున్నట్టుగా, "భాసో హాసః[3] అని ప్రతిమలోనే విషాద ఘట్టంలో రాముడిచేత హాస్యంగా మాట్లాడించిన

---

1, 2. భాసుడు రాసిన మధ్యమ వ్యాయోగం అనే రూపకం. వ్యాయోగం ఒకే అంకం ఉండే రూపకం, వస్తువు ప్రఖ్యాతమైనదే ఉంటుంది. ధీరోద్ధతులైన నాయకులు ఒకరికంటే మించి ఉంటారు. చాలా పాత్రలుంటాయి. యుద్ధం, వర్ణన ఉంటాయి. "మధ్యమ వ్యాయోగము చూచుటకుఁ జిన్నదైనను గుణమున పెద్దది" అని మల్లాది సూర్యనారాయణశాస్త్రి తమ సంస్కృత వాఙ్మయ చరిత్రలో అంటారు. (సంస్కృత కవులూ, నాటక కర్తలను గురించిన వివరాలకు చూడండి సంస్కృత వాఙ్మయ చరిత్ర, ఆంధ్ర సారస్వత్ పరిషత్తు, హైదరాబాద్, అక్టోబరు 1982).

3. భాసుడి హాస్యకుశలతకు చూడండి ప్రతిమా నాటకం మొదటి అంకం (లభ్యమయ్యే ఏ తెలుగు అనువాదమైనా సరే.)

వాడు హాస్యనాటిక రాస్తే ఏం చేస్తాడో మనం ఊహించవచ్చు. స్టీఫెన్ లికాక్[1] హాస్యంమీద ఒక పుస్తకం రాస్తూ పందొమ్మిదో శతాబ్దికి పూర్వం నిజమైన హాస్యం లేదనేశాడు. మధ్యలో ఉన్నది హాస్యం కాదా! షేక్స్పియర్ హాస్యం అతడికి నచ్చకపోవచ్చు గాక, కాని ఈ ఘటోత్కచుడు[2]"—

మాట పూర్తిచెయ్యకుండా డాక్టరుగారు తనలో తాను నవ్వుకున్నాడు.

"ఏమిటి?" అన్నాను.

"ఈ ఘటోత్కచుణ్ణి చూస్తే, మా నాన్న గుర్తొచ్చాడు. వీడు ఆర్య సంస్కారం తెచ్చిపెట్టుకున్న రాక్షసుడు."

"వాళ్ళమ్మ ఏకాదశి ఉపోషం ఉంది. ద్వాదశిపారణకు తెమ్మన్నది మనిషిని. వాడు ఆ మనిషిని అడగటంలో ఎంత వినయం! వాడిలో ఎటువంటి మాతృభక్తి! ఈ ఇన్కాంగ్రుయిటీ ద్వారా భాసుడు హాస్యం పుట్టించాడు. మా నాన్నలో కూడా ఇటువంటి ఇన్కాంగ్రుయిటీ ఉన్నది. ఆయన డబ్బు సంపాదించినది క్రిమినల్స్ని డిఫెండుచేసి. ఆయన హంతకుల తరపునా, దొంగల తరఫునా వాదించారు. చాలా సార్లు నెగ్గాడు. నెగ్గకపోతే నీకు క్రిమినల్లాయరులా ఖ్యాతిరాదు. ఒక్క మర్డరుకు శిక్ష పడకుండా తప్పించావో నీ ప్రాక్టీసు ఆకాశమంటుతుంది. మా నాన్న కనీసం నలుగురు హంతకులను కాపాడానని చెప్పేవాడు. అటువంటివాడు నన్ను సంఘ ద్రోహి కింద జమకట్టి వెలివేసేశాడు. నేనే హత్య చేసివుంటే నా కేసుపట్టి, నాకు ఉరిపడకుండా ఉండటానికి సర్వశక్తులూ ధారపోసి ఉండేవాడు. నేనాపని చెయ్యక పోతిని. పైగా నన్ను సమర్థించటం వల్ల ఆయనకు కానీ రాదాయె. మా నాన్నకి సెన్సాఫ్ హ్యూమర్ లే దింతకూ!"

డాక్టరు గారీసారి విశాలంగా నవ్వాడు. తండ్రి తనను వెలివేసినందు కాయన బాధపడుతున్నాడా? పడుతూంటే నేను తప్పుపట్టను - కాని బాధపడని పక్షంలో సంతోషిస్తాను.

నోరు చేసుకుని అడిగేశాను.

---

1. స్టీఫెన్ లికాక్ (1869 - 1944) కెనెడియన్ హాస్యరచయిత, ఆర్థిక శాస్త్రవేత్త. Literary Lapses (1910), Nonsense Novels (1911), Sunshine Sketches of a little Town (1912) లోని హాస్యచతురత జనప్రియమైంది. మాంట్రియల్ లోని మాక్‌గిల్ విశ్వవిద్యాలయంలో 1908 - 36 మధ్య ఆర్థిక శాస్త్ర విభాగంలో ప్రొఫెసరుగా పని చేశారు.

2. ఘటోత్కచుడు మధ్యమవ్యాయోగంలో ఒక ప్రధాన పాత్ర.

"బాధ ఎందుకుండదోయ్. తగిన కారణం ఉండే స్నేహితుడులాంటివాడు మనతో మాట్లాడటం మానేస్తే ఎంతో బాధగా ఉంటుందిగదా? మన చిదానందం వైజాగ్‌లో చదువుతా డంటేనే ఏదోగా ఉందినాకు.... అదీగాక మనుషుల్ని వెలి వెయ్యటం మా నాన్న స్వభావానికి విరుద్ధం. పైకి చూపించటం చాతకాదు. చూపించటానికి బిడియం కూడాను - కాని ఆయనకు ప్రేమలు జాస్తి. లోపల చాలా సంఘర్షణ పడతాడు. మా అమ్మ నాకు బాగా బుద్ధి తెలిశాకే పోయింది. ఎన్నడూ ఆయన ఆవిడతో మృదువుగా గాని, హాస్యధోరణిలో గాని మాట్లాడగా విన్నట్లు నాకు జ్ఞాపకం లేదు. కాని ఆవిడ నవ్వలేదు. తాను సంపాదించిన డబ్బులాగే తన ప్రేమలను కూడా యెక్కడో ఫిక్స్‌డ్ డిపాజిట్ ఉంచేశాడు. వాటిని అనుభవించటం ఈనాటికీ చాతకాలేదు. పిటీ! ఆయన తన వృత్తిమీద అంత కేంద్రీకరించకపోతే జీవితంలో ఇంకా ఎక్కువ సుఖం అనుభవించి ఉండే వాడు."

సుందరమ్మగారు భోజనానికి రమ్మన్నదాకా మేం ఇదే విధంగా యేవోకబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నాం. నేను మా అమ్మ గురించి చెప్పాను. డాక్టరుగారి తండ్రి సుఖాన్ని అణచిపెట్టుకుంటే మా అమ్మ కష్టాన్ని అణచుకున్నది. మా అమ్మ తనకన్న పాతికేళ్ళు పెద్దవాణ్ణి పెళ్ళాడి, అందువల్ల కలిగిన బాధను ఎవరికీ తెలీకుండా అణచుకున్నదని చెబితే డాక్టరుగారు "ఎలా చెప్పగలం? కొందరాడవాళ్ళు తమకన్న చాలా హెచ్చు వయసు భర్తలతో చాలా సుఖపడతారు" అన్నాడు. నన్ను సముదాయించటానికే కావచ్చు.

"లేదు లెండి, అది గుండెలో ములికి అయి ఉండాలని నాకు రూఢిగా తెలుసు. మా ఇంటిపక్క సందులో ఒక ఎనిమిదేళ్ళ పిల్లను ఇరవై ఏళ్ళవాడికిచ్చి పెళ్ళి చేస్తుంటే మా అమ్మ 'అంత చిన్నపిల్లను తీసుకుపోయి అంత పెద్దవాడికేమని అంటగడతారో!' అన్నది. నేను చెవులారా విన్నమాట. అప్పట్లో నాకర్థంకాలేదు. అర్థమయినాక అది నా గుండెల్లో ములికి అయి తలుచుకున్నప్పుడల్లా బాధపెడుతుంది" అన్నాను.

డాక్టరుగారు చాలాసేపు ఏదో ఆలోచనలో ఉండిపోయినట్టు కనబడి చివరకు "కొన్ని కొన్ని అనుభవాలు చూస్తుంటే విధి లిఖితమంటూ ఉన్నదేమోననిపిస్తుంది" అన్నాడు.

ఆ రాత్రికూడా భోజనం బాగుండటం చూసి నాకు ఆశ్చర్యం కలిగింది. మధ్యాహ్నం భోజనం బాగుండటానికి కారణం నేను అతిథిగా ఉండట మేమోనని అహంకారంగా అనుకున్నాను. డాక్టరు గారింట తిండికూడా పేదగా వుంటుందని యెందు కనుకున్నానో నాకే తెలీదు. కొన్ని విషయాలలో వాళ్ళు పేదగా కనబడటం

చూసి, అన్ని విషయాలలోనూ అంతే అయివుంటుందనుకుని వుంటాను. నాలుగు రోజులు వరసగా భోజనం చేసినాక తెలిసివచ్చింది. వాళ్ళ ఆహారంలో మంచి వెరైటీ వున్నది. సుందరమ్మగారి వంట కూడా చాలా బాగుంటుంది. వాళ్ళింట్లో ముగ్గురూ ఆరోగ్యంగానే ఉంటారు. తల్లీ కూతుళ్ళు ఇంటిపని యావత్తూ స్వయంగా చేసుకుంటారు. పనిమనిషిని పెట్టుకోరు. నర్సు పొద్దున్నే లేచి దొడ్డి యావత్తూ చిమ్ముకొస్తుంది. ఒక్కొక్క రోజు గడుస్తున్నకొద్దీ డాక్టరుగారి కుటుంబంతో పరిచయం బలమవుతున్న కొద్దీ నాకు వాళ్ళతో ఉన్న సంబంధం దృఢమయింది గాని నేను భయపడ్డట్టుగా జరుగలేదు.

## 3

చిదానందం దగ్గిరనుంచి ఉత్తరం వచ్చింది. వాడు అనుకున్నంతపనీ చేశాడు. మెడికల్ కాలేజీలో చేరాడు. వైజాగ్ పరిసరాలన్నీ తిరిగాట్ట; తెగ వర్ణించాడు. నా విషయం తెలుపమని రాశాడు.

ఆ కిందటిరోజే నేను కాలేజీలో చేరాను. చిదానందం ఉత్తరం చూడగానే నాకు రాఘవరావుగా రింటిగది గుర్తుకొచ్చింది. ఆ గది మాట్లాడతానని డాక్టరుగారితో యెట్లా చెప్పాలో తెలియలేదు. మాట్లాడకుండా ఊరుకోవటం ఎంతమాత్రమూ బాగుండదనిపించింది. డాక్టరు గారింటిగది సొంతం చేసుకోవడమే కాదు. రెండు పూటలూ భోజనం కూడా చేస్తున్నాను.

చాతకాకుండా, నీళ్ళు నములుతూ "డాక్టరుగారూ, నేనింక గది చూసుకోవటం మర్యాదగా ఉంటుంది కాదూ? కాలేజీలో చేరానాయె. ఆ రాఘవరావుగారింట్లో గది పరాయివాళ్ళ కివ్వరనుకోండి—నాకైతే ఇవ్వొచ్చనుకుంటాను" అన్నాను.

"ఏం నాయనా! ఇంటిగది యేమీ బాగాలేదా?" అంది డాక్టరుగారి భార్య.

"బాగాలేకపోవట మేమిటండి? అద్దె యెంతో చెప్పండి. డాక్టరు గారిచేత పుస్తకాలు చదివించుకుని వినటం నాకేమన్నా చేదనుకున్నారా?" అన్నాను.

"ఇదిగో సూర్యం, నీ అంతరాత్మకు శాంతికలిగే పక్షంలో నీకిష్టమైనంత అద్దె యిచ్చి ఇక్కడే ఉండిపో. నిన్నడిగే వాళ్ళెవరూలేరు. భోజనంకూడా యిక్కడే చెయ్యి. నీకిష్టమైనవి అడిగి చేయించుకుంటే మా ఆవిడ సంతోషిస్తుంది కూడానూ. గెస్టుగా ఉండటం బాధైతే పేయింగ్ గెస్టుగా ఉండు. మేమంతా కంపెనీకోసం వాచిపోతున్న వాళ్ళమే. అదీ అసలు సంగతి".

"నాకభ్యంతరం లేదు" అన్నాను. నెలకో ముప్పై రూపాయలు డాక్టరు గారికి, కాదు, సుందరమ్మగారికి యిద్దామని నా మనస్సులో అనుకున్నాను. హోటలుకూ, గదికీ కలిపి అంతకన్న ఎక్కువకాదు—కాస్త తక్కువే అవుతుంది కూడానూ.

డాక్టరుగారింట మతంలేదు, దేవుడులేడు, పూజలులేవు, పండగలులేవు, పర్వాలు లేవు. డాక్టరుగారు ఖద్దరు కట్టకపోయినా, మిల్లు బట్టలు కట్టేవాడు కాడు. ఆయన బ్రాండు చేనేతబట్టలు. ఆడవాళ్ళిద్దరూ మిల్లుచీరెలు కట్టేవాళ్ళు. వాళ్ళిద్దరికీ కలిపి చిన్న మెత్తు బంగారం లేదు. వాళ్ళింట పౌడర్లుగానీ, స్నోలుగాని క్రీములు గాని లేవు. స్నానానికి సబ్బుమాత్రం వాడేవాళ్ళు. టూత్‌పేస్టు వాడేవాళ్ళు కాదు; కచ్చిక వాడేవాళ్ళు. డాక్టరుగారు వేపపుల్లతో పళ్ళు తోముకునేవారు.

ముగ్గురిలోకీ మాట్లాడాలని సరదా ఉన్నవాడు డాక్టరుగారే. అదైనా భార్యతోనూ, కుతూరితోనూ కాదు, నాబోటి వాళ్ళతో. ఆ కుటుంబాన్ని రోజురోజూ చూస్తుంటే వాళ్ళు తేనెటీగల్లా కొద్దిసంజ్ఞలతో[1] అర్థంచేసుకున్నట్టు కనపడేవాళ్ళు. అది నాకు కాస్తవింతగానే ఉండేది.

నేను వాళ్ళింట్లో గమనించిన వింత యేమిటంటే, ఆఫీసుకు వెళ్ళేవాళ్ళెవరూ లేకపోయినా ముగ్గురి దినచర్యా గడియారంలాగా జరిగిపోయేది. ఆ విద్య నాకు తెలియకపోవటం చేత నేను మొదట్లో వాళ్ళ పనులకు అడ్డంవచ్చి ఉండాలి. ఒంటి గంటి రామలింగంలాగా జీవిస్తూ వచ్చానేమో, నా యిష్టం వచ్చినప్పుడు నిద్ర లేవటమూ, ఇష్టం వచ్చినపుడు గడ్డం గీక్కోవటమూ, స్నానం చెయ్యటమూ చేసే వాణ్ణి. హోటల్లో భోజనం చేసి కాలేజీకి బయలుదేరటం ఒక్కటే గడియారానికి కట్టుబడి చేసేవాణ్ణి.

ఒకరోజు నర్సు నా గదిలోకివచ్చి యేదో పట్టుకుపోయింది. నేను పరధ్యానంగా ఉండి గమనించలేదు. ఆ అమ్మాయి నా షేవింగ్ కప్పులో వేడినీళ్ళు తెచ్చి, "మీ షేవ్‌కు నీళ్ళు. నేను స్నానం చెయ్యబోతున్నాను. పావుగంటదాకా బయటికి రాను. మీ షేవు ఆలస్యమైపోవచ్చు" అని వెళ్ళిపోయింది.

ఆ ఒక్క అనుభవంతోనూ నేను క్రమబద్ధంగా ప్రవర్తించటం నేర్చుకున్నాను. ఉదయం కనువూడ్చే చప్పుడుకు నిద్రలేవటం లగాయతు కాలేజీకి బయలుదేరినదాకా నేను చేసే మూడు నాలుగు పనులూ ఇంటివాళ్ళ కడ్డం రాకుండా చూసుకోవటం అలవర్చుకున్నాను.

నర్సు ఫోర్తుఫారం[2] పాసయి ఫిఫ్తుఫారంలో[3] చేరింది. ఫోర్తుఫారంలో ఆమెకు అయిదో రాంక్ వచ్చిందని విని ఆశ్చర్యపడ్డాను. తెలివిగలదై ఉండాలి.

కాలేజీలో చేరగానే మా బావకూ-బాబాయికీ ఉత్తరాలు రాశాను. మా బావ ఉత్తరాలు రాయడు. మా బాబాయి నా ఉత్తరం అందిన పది పన్నెండు రోజులకు

---

1. తేనెటీగల సంజ్ఞలు.
2. అప్పటి స్కూళ్ళలో 8వ తరగతి.
3. తొమ్మిదవ తరగతి.

తన బావమరది శ్రీనివాసరావు పెళ్ళి ఖాయమైనట్టు రాశాడు. తరువాత కొద్దిరోజులకే శుభలేఖ కూడా వచ్చింది.

నాకు శుభలేఖ వచ్చిననాడే డాక్టరుగారికి యెవరో వచ్చి ఒక పెళ్ళి శుభలేఖ యిచ్చి వెళ్ళారు. అది శ్రీనివాసరావు పెళ్ళి శుభలేఖే. కాని పెళ్ళికూతురి తరఫున వచ్చింది.

"భేష్, భేష్! మనం బంధువులమవుతున్నా మన్నమాట. పెళ్ళికొడుకు నీకేం కావాలి? మీ బాబాయి బావమరిదా? పెళ్ళికూతురు నాకు పెత్తండ్రి మనమరాలు - కూతురు" అన్నాడు డాక్టరుగారు.

"వాళ్ళ దీ వూరేనా?"

"కాదుగాని, మా పెత్తండ్రిగా రల్లు డిక్కడే. డిస్ట్రిక్టు కోర్టులో ఉద్యోగం చేస్తున్నాడు."

"మరి వాళ్ళెప్పుడూ వచ్చినట్లు కనబడరే?"

"ఎక్కడో అగ్రహారంలో ఉంటారు. వాళ్ళు నన్ను వెలివెయ్యలేదులే. ఎప్పుడైనా చూడవస్తారు-కాని మా ఇంట వచ్చి మంచినీళ్ళకూడా తాగరు. కులం చెడతామని భయం! ఎన్ని భయాలూ లేకుండా ఈ జీవితాలు వెళ్ళమారుతాయా?"

"మిమ్మల్ని పెళ్ళికి ఆహ్వానిస్తున్నారే? వాళ్ళింటో మీరు మంచినీళ్ళు తాగొచ్చునేమో?"

"పిలిచినా రానన్న ధైర్యంతో పిలిచి ఉంటారు." అందులో యేదో హాస్యం ఉన్నట్టు డాక్టరుగారు నవ్వుకున్నాడు. నాకుమాత్రం చాలా కోపంగా వుంది.

పెళ్ళికి కొద్ది రోజుల ముందరే నేనొక పాడుపని చేశాను. అది పాడుపని అవుతుందని నాకు తట్టనుకూడా లేదు. నా కోసం కొత్త సబ్బూ, టూత్‌బ్రష్షూ కొనుక్కుంటూ కళ్ళకు కొట్టవచ్చినట్టు ఎదురుగా కనిపిస్తే, నర్సుకోసం పాండ్స్ వానిషింగ్ క్రీమ్ కొన్నాను.

నర్సు దాన్ని తీసుకో ననేసింది.

"క్రీములు పూసుకోకూడదని నియమమా?" అన్నాను, కొంచెంగా నొచ్చుకుని.

"ఆ రకం వస్తువులకింద ఖర్చుచెయ్యటం అలవాటే లేదు. అవి అవసరమైన వస్తువుల కిందకి రావు." అన్నది నర్సు.

"ఖర్చు చేసింది నేనుగా?" అన్నాను ఫూల్‌లాగ.

"ఫరవాలేదు తీసుకోమ్మా." అన్నాడు వాసుదేవగారు. ఆయన కంఠస్వరం నాకు సుముఖంగా లేదు.

నర్సు తీసుకున్నది. కాని ఆమె దాన్ని వాడదని నేనప్పుడే అనుకున్నాను. నా ఊహ తప్పుకాలేదు.

ఇప్పుడు వెనక్కి తిరిగి చూసుకుంటే నేను నర్సు కా క్రీమ్ ఎందుకిచ్చానో అర్థమవుతున్నది. ఆడవాళ్ళు, ఆడతనమూ, ఆడ అందమూ అనేవి నా మానసిక జీవితంలో క్రమంగా ప్రాముఖ్యం సంపాదించుకున్నాయి. నేను చేసే ఇతర ఆలోచనలతోనూ, చదువుతోనూ అవి పోటీచేసి నాకు కొంత నష్టం కూడా కలిగిస్తున్నాయి. నాకు నిత్యమూ కనిపించే ఆడవాళ్ళిద్దరూ మరికాస్త 'ఆడ'గా ఉండాలని నా మనసులో ఒక కోరిక ఉండి ఉండాలి. నే నా క్రీము అప్పుగా నర్సు కోసమే కొనలేదు. తల్లీ కూతుళ్ళిద్దరూ దానిని పూసుకోవాలనే నా ఉద్దేశం.

నే నెంతో అభిమానంతో తెచ్చిన క్రీమును వాళ్ళు తృణీకరించడం అవమానమే అయింది. ఆ రోషంలో నాకు వాళ్ళ ప్రవర్తన మరింత అసహ్యంగా కనబడింది. పైకి చూడటానికి వాళ్ళు సంస్కారులు. నంఘ నియమాచారాలను తుస్కారించిన వాళ్ళు! కాని వీళ్ళకింకోరకం మడీ, మైలా వున్నాయి! స్నానం చేశాక దమ్మిడీ ఎత్తు క్రీమ్ తీసుకుని మొహానికి పూసుకుని, అరదమ్మిడీ ఎత్తు పౌడరు పాముకుంటే మైలపడిపోతారు! అంటే వాళ్ళ దృష్టిలో క్రీములూ, పౌడర్లూ ఉపయోగించే వాళ్ళందరూ హీనులేనా? అలాటివారు ఇతరుల మూఢవిశ్వాసాలను ఏమని తప్పుపడతారూ?

పోనీ, దుర్వ్యయమని వాళ్ళు అలంకరణ సాధనాలు వుపయోగించుకోకపోతే నాకేమీ ఆక్షేపణ ఉండదు. గుడిసెల్లో వాళ్ళు క్రీము లుపయోగించరని నే నా పిస్తానా? నేను కొంటే వాళ్ళకేం డబ్బుఖర్చా? నా క్రీము ఉపయోగించక పోవటంలో గల ప్రిన్సిపుల్ ఏమిటి?

నేను లోలోపల అవమానంతోనూ, కోపంతోనూ కుమిలిపోయాను. నా స్థితి ఇంట్లో అందరూ గమనించి ఉండాలి. నేను క్రీము తెచ్చిన మర్నాడుగాక, మూడో రోజు సాయంకాలం ఆయన నన్ను పాకలోకి పిలిచి కూర్చోమన్నాడు. ఆయన చేతిలో భాసనాటకా లున్నాయి.

"చారుదత్తం[1] గురించి ఆలోచిస్తున్నాను!" అన్నాడాయన.

"మంచి నాటకం. పూర్తిగా ఉంటే యెంత బాగుండేదో?" అన్నాను.

---

1. చారుదత్తం భాసుడి రూపకం, శూద్రకుడి మృచ్ఛకటిక నాటక రచనకు ప్రేరణ.

"నే నాలోచిస్తున్నది మనిషిలో వుండే స్పిరిట్ గురించి. చారుదత్తంలో మైత్రేయుడు, చూడు, తన స్నేహితుణ్ణి గురించి వసంతసేనతో అబద్ధమాడేస్తాడు. నీ వగను నా స్నేహితుడు జూదమాడి పోగొట్టుకున్నా డంటాడు; దొంగ ఎత్తుకు పోయినట్టు చెప్పాడు! ఎందుకు? ఆలోచించినకొద్దీ ఆ బ్రాహ్మడి ప్రవర్తనలో ఏవేవో లోతులు కనిపిస్తున్నాయి. వసంతసేన హారాన్ని దొంగవాడెత్తుకు పోవటానికి కారణం చారుదత్తుడి దారిద్ర్యం. అతను మంచి ఇంట ఉంటే దొంగ కన్నంవేసి సుఖువుగా ప్రవేశించలేడు. విలువైన నగలతో జూదం ఆడటం ధనికుల లక్షణం. తన మిత్రుడైన చారుదత్తుడిలో దరిద్రుడి లక్షణం చూపలేక ధనికుల లక్షణం చూపుతామనా? చారుదత్తుడి భార్య ఉదారంగా తన ముత్యాల హారం యిచ్చేసింది - వేశ్యకిచ్చెయ్యమని. అందుకు మైత్రేయుడి కడుపులో తన మిత్రుడిపైన మైత్రీ సంబంధమైన మంటరేగుతున్నదా? లేక అతను వసంతసేనను పరీక్షిస్తున్నాడా? దొంగలెత్తుకు పోయారంటే వసంతసేన చారుదత్తుడిపైన కనికరించి, పోయిన తన నగల విలువ పుచ్చుకొనక పోవచ్చు. జూదంలో తన నగలు ఓడిపోయాడంటే ఆమెకు చారుదత్తుడి పైన జాలి ఉండనవసరం లేదు. ఆమె కతనిపై నిజంగా ప్రేమే వుంటే ముత్యాలహారం తీసుకోకూడదు. కాని వసంతసేన "అయ్యో పాపం" అనికూడా అనకుండా ముత్యాలహారం తీసుకుంటుంది. 'లంజబుద్ధి' అని మైత్రేయుడు తిట్టుకుంటాడు. మైత్రేయుడి స్పిరిట్ యెంత చిత్రంగా చిత్రించాడో భాసుడు! వసంతసేన మటుకు? తన నగ దొంగ లెత్తుకుపోయిన సంగతి ఆమెకు తెలుసు. ఆ నగ ఆమె దగ్గరికి చేరిందికూడా. అయినా మైత్రేయుడు చెప్పిన అబద్ధం నమ్మినట్టే ప్రవర్తిస్తుంది. ముత్యాలహారం పుచ్చుకుంటుంది. తనకు చారుదత్తుడిపైన పొంగి పొర్లే ప్రేమను మైత్రేయుడికి అణుమాత్రం కూడా తెలియనివ్వదు? హ్యూమన్ స్పిరిట్ శూన్యం. అది విలువలేని వజ్రం లాగా ధగధగ మెరుస్తుంది. ఒకరికి దిగ్భ్రమ కలిగించాలనికాదు మెరవటం - దాని స్వభావం. ఆ స్పిరిట్ స్వభావంతో మనుషులు తమ ప్రవర్తనలోనూ, మాటలలోనూ, చర్యలలోనూ రకరకాల నిగ్రహాలు పాటిస్తారు. భాసుడి పాత్రలతో పోలుస్తున్నాననుకోక, మావాళ్ళు క్రీములూ, పౌడర్లూ వాడకపోవటంలో కూడా ఏదో ఒక వింత స్పిరిటున్నది. వాళ్ళ లిప్‌స్టిక్ వేసుకున్నా నేనభ్యంతరం చెప్పను. కాని నా వైఫ్‌కు కొన్ని కొన్ని పడవు. కొన్ని కొన్ని పనులు చేస్తే ఆవిడ స్పిరిట్ దెబ్బతింటుంది. సిల్కు చీరెలు కట్టదు. కట్టకపోవటంలో నీతి ఉందనీకాదు. గొప్పతనం ఉందనీ కాదు. సిల్కు చీరెలు కట్టేవాళ్ళను

గురించి తక్కువగా అనుకుంటుంటారు నాకు. మనం సిగరెట్టు కాల్చేవాళ్ళందర్నీ తక్కువ చేసి చూస్తామా? అది పాపమనుకుంటున్నావా? ."

ఆ రాత్రి నాకు చాలాసేపు నిద్రపట్టలేదు. నే నెంత ఇగోసెంట్రిక్‌గా ఎందుకుంటాను? ఏం చూసుకుని నాకీ అహంభావం? ఇతరులు నా లాగా లేనప్పుడూ, నా ఉద్దేశాలకు సూటిగా నడుచుకోనప్పుడూ నా కేదో అవమానమై పోయినట్టు ఎందుకుంటానూ? నాకనుగారి వంటి మనిషి పక్కనే ఉండబట్టి గానీ, లేకపోతే నేనిట్లా ఉన్నానని నాకు తెలీదు గదా.

నా గొడవలో పడి ఆలోచించుకోవటంలో నాకు భారతి రచనా నైపుణ్యం గురించి తలుచుకుని ఆనందించాలని కూడా తట్టలేదు. అది కూడా ఇగోసెంట్రిసిజమే! దాన్ని గురించి పశ్చాత్తాపపడటంలో కూడా అదే ప్రదర్శిస్తున్నాను. నా పశ్చాత్తాపం నిజమైతే, బుద్ధి తెచ్చుకుని నిశ్చింతగా నిద్రపోయే దాన్నేమో! కాని అహంభావం అంత సులువుగా వదిలేదికాదు. మనం సహించినంత తేలికగా చెడు నశించదు. దేవతల కన్నా రాక్షసులే ఎప్పుడూ బలవంతులే. అందుకే యూరపులో ముస్సోలినీ, హిట్లరు విజృంభిస్తున్నారు. ప్రపంచ నాగరికతకంతకీ పునాది అనుకున్న పాశ్చాత్య సంస్కృతి దగ్ధమైపోతున్నది....

పెళ్ళిరోజు వచ్చేసింది. లగ్నం రాత్రి తొమ్మిది ప్రాంతాల. మధ్యాహ్నం నుంచీ కాలేజీ ఎగగొట్టి పెళ్ళివారి విడిదికి వెళ్ళాను. పెళ్ళి పెట్టే మా బాబాయే. చుట్టాలెక్కువ మంది రాలేదు. కొలకలూరు స్టేషను దగ్గిర బస్సు పట్టుకుని సులువుగా రావచ్చు. సుబ్బక్కా వాళ్ళు కూడా రాలేదు. వచ్చిన నలుగురూ మా పిన్నివైపు బంధువులే. శ్రీనివాసరావును పెళ్ళికొడుకు చేసి ఉంచారు. లావుగా పొట్టిగా పొన్నకాయల్లె ఉండే శ్రీనివాసరావుకు పెళ్ళికొడుకు వేషం నప్పింది. అతను నన్ను కొంచెం కష్టపడి గుర్తించి, "ఎంతెత్తు ఎదిగిపోయావు!" అన్నాడు.

పెళ్ళివారికి ఉప్మా, కాఫీ వచ్చాయి. కాఫీ చుక్కలు కడుపులో పడుతూనే మా బాబాయి పెళ్ళివారింటికి ఏదో పనిమీద పోతూ తోడుగా నన్ను కూడా బయలుదేర దీశాడు. విడిది నుంచి పడమరగా వచ్చి పక్క వీధిలోకి తిరగగానే పెళ్ళివారిల్లు. ఇంటి చుట్టూ ఉన్న ఖాళీ స్థలమంతా పందిరి వేశారు. పందిట్లోకి అడుగు పెడుతుండగానే ఎవరో బాబాయిని పిలిచారు. ఆయన నన్ను స్వేచ్ఛగా వదిలేసి ఎటో వెళ్ళిపోయాడు. పెళ్ళివారిల్లు సందడిగానే ఉంది. కొంత మంది పనీ పాటా ఏమీ లేనట్టు విశ్రాంతి తీసుకుంటూ మందకొడిగా పడివున్నారు. మరి కొందరు చీమల్లాగా తెగ తిరుగుతున్నారు.

వరండాలో పెద్ద పేము పడకకుర్చీ వేసి వున్నది. అందులో ఒక పెద్ద సైజు వృద్ధుడు చేతులెత్తి నెత్తివెనక పెట్టుకుని పడుక్కుని ఉన్నాడు. నే నాయనకు కొంచెం దూరంలో ఉన్న బల్ల మీద కూర్చుని, అందరినీ గమనిస్తున్నాను. కళ్ళ ఎదటికి వచ్చిన ఆడవాళ్ళ వయసూ, పెళ్ళి అయిన వాళ్ళూ, కానివాళ్ళూ ఎంత మంది పిల్లలూ తల్లులూ ఇత్యాది విషయా లాలోచిస్తున్నాను.

ఇంతలో ఒక వంట బ్రాహ్మడులాంటి మనిషి ఒక పెద్ద మరచెంబులో కాఫీ కాబోలు తెచ్చి, "ఎవరన్నా మళ్ళీ కాఫీ తాగుతారా? ఆఖరు ఛాన్సు." అన్నాడు. ఆయన నన్ను కాఫీ తాగుతావా అని అడిగాడు. తాగనన్నాను. కుర్చీలో పడుకొని సమాధిలో వున్న ముసలాయన దగ్గరికి వెళ్ళి, "ఏం బాబూ, నరసింహం పంతులుగారూ? ఒక్కగ్లాసు కాఫీ పుచ్చుకోండి" అంటూ మరచెంబు మూత తీసి, అందులో నుంచే ఒక గ్లాసు తీసి అందులో కాఫీ పోసి ఇవ్వబోయాడు.

"నేను కాఫీ తాగాను" అన్నాడు ముసలాయన నిశ్చితంగా.

"కాఫీ తాగననరాదు? పుచ్చుకోండి."

"కాఫీ తాగననరాదూ. ఎందుకనరాదూ? నే చెబుతున్నాను-అనొచ్చు."

నరసింహం? విన్న పేరు. ముసలాడిలో కుర్రాడి మకురుతనం వున్నది. ఈ ముసలాడికి శరీరం ఒక పద్ధతిలో పెరిగింది. మనస్సు మరో పద్ధతిలో పెరిగింది. డెబ్బై దాటివుండాలి. ఏడేళ్ళ కుర్రాడి బుద్ధులు.... నరసింహం! గుడ్‌గాడ్.

"ఏమండీ డాక్టరు కనక సుందర్రావుగారు మీకేమన్నా అవుతారా?" అన్నాను.

ఆయన తల పక్కకి తిప్పి, నన్ను కొరకొరా చూసి, "ఎందుకూ?" అన్నాడు.

"ఆయన తండ్రిగారి పేరూ మీ పేరూ ఒక్కటే నన్నట్లు జ్ఞాపకం."

తనకు కావలసిందదే నన్నట్లుగా ఆయన మళ్ళా సమాధిలో పడ్డాడు. నే నడిగిన మాటకు సమాధానం చెప్పటం ఆయన కవసరంగా తోచినట్టు లేదు.

"డాక్టరుగారి తండ్రిగారు చాలా నీరసమైన మనిషి అని విన్నాను. అందుచేత మీరై వుండరు?" అన్నాను.

ముసలాయన తేలు కుట్టినట్లు కుర్చీలో లేచి కూర్చుని "నేనంటే నీకు వేళాకోళంగా ఉందా? ఎవరసలు నువ్వు? ఇక్కడ ఏం చేస్తావు?" అన్నాడు తీవ్రంగా.

"నేను పెళ్ళికొడుకు బావగారి అన్నకొడుకును. డాక్టరుగారింట్లో అద్దెకుంటున్నాను. రెండు వైపుల వారి ఆహ్వానాలూ అందాయి. పిల్ల తరఫు వాళ్ళు డాక్టరుగారిని వెలివేసినట్టు లేరు. అయినా డాక్టరుగారు రావటం లేదులెండి. తాను వస్తే కొందరు విస్తళ్ళ ముందునుంచి లేచిపోతారని ఆయన అనుమానం. ఆయన చట్ట విరుద్ధమైన పనులేమి చెయ్యలేదు. చూడండి! హంతకులను కాపాడేవాళ్ళు ఆయన పంక్తిని ఎట్లా భోంచేస్తారు? మీరే చెప్పండి!" అన్నాను.

పైకి నిర్వికారంగా మాట్లాడాననుకుంటాను. లోపల మాత్రం ఆ ముసలాడి మీద మండిపోతున్నది.

ముసలాయనమాత్రం నిర్వికారంగా ఉండలేకపోయాడు. మొహం జేవురించింది. పెదవులు వణికాయి. ఆయన నన్ను వెలివేసేసి సమాధిలోకి వెళ్ళిపోయాడు.

ఇంకా ఆయనను కెలకాలనిపించింది గాని పెద్దవాడు, ఇచ్చిన డోసు చాల్లెమ్మనుకున్నాను. ఈ బుల్లిబుల్లి హిట్లర్లకు అడపాదడపా పడవలసినట్టు డోసులు పడుతూండకపోతే మితిమీరిపోయి వాతావరణం కలుషితం చేస్తారు.

నేను కూర్చున్న బల్లమీద నుంచి లేచి, వరండా ముందు పందిట్లోకి వచ్చాను. తాటాకుల వాసనా, ఈతాకుల వాసనా, ఎక్కడినుంచో వస్తున్న ఊదు వత్తుల వాసనా అనుభవిస్తూ అటూ ఇటూ తిరిగాను. బాబాయి ఏం చేస్తాడో ఎవరితో మాట్లాడుతున్నాడో అంతు చిక్కలేదు.

"ఇదుగో, ఏమోయ్! నిన్నే! ఇలారా ఓసారి!"

క్రిమినలుగారు పిలుస్తున్నారు. నే నన్నమాటలకు పగతీర్చుకునే లా పాయింట్లాలోచించి ఉంటాడు. ఎంతచెడ్డా పేరుమోసిన లాయరు గద.

మళ్ళీ వరండాలోకి వెళ్ళాను.

"ఆ బెంచి దగ్గరగా ఈడ్చి కూచో."

కూర్చున్నాను.

"నువ్వా ఇంట్లో ఎంతకాలమై ఉంటున్నావు?"

ఏ ఇల్లని అడగలేదు; నెల రోజులుగా ఉంటున్నానని చెప్పాను.

"గది అద్దెకు తీసుకున్నావా?"

"గది తీసుకోవట మేమిటిలెండి. పేయింగ్ గెస్టులాటి ఏర్పాటు. భోజనం కూడా అక్కడే. హోటల్లో బొత్తిగా మాలకూడే గదండీ? అందుచేత కొంచెం శుచిగా—"

నా మీద కోపం తెచ్చుకోవాలా, వద్దా అన్నట్టు ముసలాయన నాకేసి చూసి, నన్ను క్షమించేసి "పిల్ల పెద్దదై ఉంటుంది. నేను దాన్ని ఎన్నడూ చూడలేదు" అన్నాడు.

"ఏ పిల్లండీ?" అన్నాను అమాయకంగా.

"బుర్ర పని చెయ్యటం లేదా ఏమిటి? నా మనవరాల్ని గురించి మాట్లాడు తున్నాను!" అన్నాడాయన కసురుగా. "దానికి వాళ్ళమ్మ పేరు పెట్టుకున్నాట్ట."

"వాళ్ళమ్మ పేరు నాకు తెలీదండీ! పిల్లను నర్సు అని పిలుస్తారు."

"నర్సు, డే నర్సూ, నైట్ నర్సూనూ, వెధవ్వేషాలు" ముసలాయన కాస్సేపు సణిగి చివరకు, "దాని నాయనమ్మ పేరు నరసమ్మ. ఆడపిల్ల కనక తల్లి పేరు పెట్టుకున్నాడు. మగపిల్లవాడైతే నా పేరు పెట్టుకుని ఉండడు" అన్నాడు.

"నర్సంటే నరసింహమేమోనండి? ఒక వేళ పిల్లకు మీ పేరే పెట్టుకున్నారేమో?" అన్నాను.

పెద్దబాతు (గూస్)[1] కావద్దని ఆయన నన్ను మందలించాడు. ఇంగ్లీషులోని పెద్దవాళ్ళు సంస్కృతంలో దీవించినట్లు.

"తిట్టకి ఇంగ్లీషూ, దీవించటానికి సంస్కృతమూనూ, తెలుగు కూరలు బేరం చేయటానికీ దానికీ తప్ప దేనికీ పనికిరాదు" అని నేను పైకే అనేసినట్టున్నాను.

"ఏమిటది?" అన్నాడాయన.

"ఏమిలేదండీ; స్వగతం."

"అదెలా వుంటుంది?" అన్నాడాయన కాస్సేపుండి.

"ఏదండీ!" అన్నాను పరధ్యానం అభినయిస్తూ.

"అదే నా మనమరాలు" అన్నాడాయవ చిరాకుగా. తనని వెంటనే అర్థం చేసుకోకపోతే ఆయనకు అవమానం జరిగినట్టయింది కాబోలు మరి.

"బాగానే వుంటుందండీ, స్నోలూ అవీ పూసుకోదు. సగా నట్రా ఏమీ లేదు. ఈ క్రైస్తవులమ్మాయి లుంటారు చూడండి! అచ్చంగా అలా ఉంటుందండి! మెళ్ళో ఒక క్రాసు తగిలించి, చేతిలో చిన్న బైబిలు పెడితే."

ఆయన నా మాటలు వినిపించుకుంటున్నట్టు లేదు.

"అప్రయోజకుడు! ఒక్క కూతురు - అరతులం బంగారంతో గాజులు చేయించి పెట్టలేడు. ఈ ముండమోపి నన్నూ నా ఆస్తినీ కాలదన్ని వేరుపోయాడు" అని ముసలాయన గొణిగాడు.

"లాభం లేదండీ. మీరు చేయించి యిచ్చినా ఆ అమ్మాయి పెట్టుకోదు కదండీ?" అన్నాను.

"పెట్టుకోదూ! నువు చూశావా ఏమిటి!, నగలొద్దన్న ఆడదెక్కడైనా ఉంటుందా."

---

1. Goose, A silly foolish person, Simpleton - తెలుగులోని పెద్దబాతు ఈ అర్థాన్ని సూచించేదే.

'నగలొల్లని నాతిగలదె పరికింపంగన్' అని ఆశుధారగా నాతలలోంచి పుట్టుకొచ్చింది. దాన్ని అదుపులో ఉంచి, "చూడండి-పోనీ గదా అని సద్యస్కార క్రీమ్ బుడ్డి కొనిచ్చానండి. పూసుకోదు. క్రీములు పూసుకోరాదుట. నగలు పెట్టుకోరాదుట. సినిమాలు చూడరాదుట. పట్టుబట్టలు పనికిరావుట—" అంటూ వేళ్ళ మీద లెక్క ప్రారంభించాను.

"ఏడవక పోయారు! దరిద్రపు వేషాలు; దారిద్ర్యాన్ని గోరిపై చెయ్యటం ! ఛీ!ఛీ! తాను చెడ్డాడు. పిల్లనూ చెడగొట్టాడు" అన్నాడాయన.

"డాక్టరుగారి భార్యగారుకూడా ఇదే వరసండి! ఆవిడ తల్లో పూలు పెట్టుకోదు!" అన్నాను.

"పూలూ, బొట్టు ఏవని పెట్టుకుంటుంది. ఐదోతనం ఏడిస్తేగా!" అన్నాడాయన.

నాకు అరికాలిమంట నెత్తికొచ్చింది.

"మీ రావిణ్ణి ద్వేషించటం రైటే. ఆవిడకూడా మీరంటె అంత ఘనమైన అభిప్రాయం లేదు" అన్నాను.

ముసలాయన అగ్గయిపోయాడు.

"దాని అభిప్రాయం ఎవడిక్కావాలి! అది నా కెవతె" అని ఆయన గాండ్రించాడు.

"మీ మనవరాలి తల్లే గదండీ!" అన్నాను.

ఆయన నాకు పెద్ద రహస్యం చెబుతున్నవాడల్లె, "నా మనవరాలెప్పటికైనా నావైపే వస్తుంది చూస్తూండు" అన్నాడు.

ఆయనకా మనవరాలిపైన ఏదో మమత వున్నట్టు నా కర్థమయింది.

నేను చప్పరించి, "చెప్పలేమండి. నర్సు ముమ్మూర్తులా తండ్రేనండి" అన్నాను.

ముసలాయన కళ్ళు మెరిశాయి: "అలాగా? చెప్పవేం? వాడంతా వాళ్ళమ్మ పోలిక. అది యెలాటి మనిషి! మనిషికాదు, దేవత! ఇన్ని వేలమంది ఆడవాళ్ళను చూశాను; అటువంటి యిల్లా లుండదు; రత్నంలాంటి మనిషిని పోగొట్టుకున్నాను" అన్నా డాయన.

"డాక్టరుగారి భార్య కూడా అలాంటి మనిషేనండీ, ఎంత అనుకూలంగా ఉంటుంది" అన్నాను.

ముసలాయన మొహం చిట్లించి, తల అడ్డంగా తిప్పుతూ "నాకు దాని సంగతి చెప్పకు!" అని చీదరించుకున్నాడు.

"నే నందుకు చెప్పలేదండి, తండ్రి కొడుకు లిద్దరికీ అనుకూలవతులైన భార్యలు దొరకటం చిత్రమని చెప్పడానికి చెప్పాను."

"వాడికీ నాకూ సాపత్య మేమిటి? ఏ చచ్చినవాడి పెళ్ళాన్నో తెచ్చి నేను చేసుకోలేదు!" అన్నారాయన. ఆయన మాటలు వింటుంటే నాకు పెద్దపెట్టున రోగం చేస్తున్నట్టనిపించింది. ఆయనలో ఏదో "మనువు కాంప్లెక్స్"[1] లాటి దున్నది. అటువంటి వాడికి శాసనాధికారం యిస్తే క్షణంలో ప్రపంచాన్ని ఒక్క కొలిక్కి తీసుకురాగలడు.

నేను లేచాను.

"ఒక్క క్షణం కూర్చో; వాళ్ళు పెళ్ళికి రావటంలేదన్నావు కదూ?"

"నాకు స్పష్టంగా తెలీదు సుమండీ. రారేమో అనుకున్నాను. ఒకవేళ వస్తే రావచ్చు; వెలి అయినవాళ్ళు చూడండీ. తిరిగి నలుగురి మధ్యకూ వచ్చే అవకాశం దొరికితే సాధారణంగా వదలిపెట్టరు.

ముసలాయన విసుక్కున్నాడు.

"వాళ్ళని యెవరు వెలివేశారు! ఒకరి నొకరు వెలి వెయ్యటానికి చట్టం ఒప్పదు. తాను చేసింది వెధవపని గనుక తనను లోకము వెలివేసిందని వా డను కొంటే అనుకోని? దాని కెవరు బాధ్యులు."

"అది నిజమే లెండి. వాళ్ళను రాత్రి లగ్గానికి తీసుకురమ్మంటారా?"

నన్ను ఆయన తన సీక్రెట్ ఏజంటుగా వేసేసుకుని, "మిగిలినవాళ్ళ మాటెం దుకులే. మా నరసమ్మను ఎలాగైనా తీసుకురా. ఏం లేదు. ఒకసారి చూద్దామని!" అన్నాడు.

"ఒక్కత్తే వస్తుందా? అయినా ట్రై చేస్తాం. కాని మీ రాట్టే ఆశ పెట్టుకో — అడుగో, మా బాబాయి, మళ్ళీ కనిపిస్తాలెండి. శలవు!" అంటూ వచ్చేశాను.

లగ్నం వేళకు తిరిగివస్తాననీ, రాత్రి భోజనానికుంటాననీ మాట యిచ్చిన మీదట మా బాబాయి నన్నింటికి వెళ్ళిరానిచ్చాడు.

"ఏమండి, డాక్టరుగారూ! మీ నాన్నగారిని చూశాను. మీలాగా సన్నగా చామనఛాయగా ఉంటారనుకున్నాను. చాలా స్థూలమైన మనిషి. మంచి రంగు. తెల్లబడినా ఒత్తయిన జుట్టు. ఆయనతో చాలాసేపు మాట్లాడాను. పాపం. ఆయన

---

1. ధర్మశాస్త్రాన్ని రాసిన మనువు. మనుస్మృతి వర్ణవ్యవస్థనూ, కుల వివక్షనూ, వర్గవ్యవస్థనూ, స్త్రీ వివక్షనూ సమర్థించే సనాతన వాదులకు ప్రమాణ సామాజిక నీతిగ్రంథం. జూలూరి అప్పయ్యశాస్త్రి సబోధకమైన వాడుక భాషలో ప్రతి పదానికి తెలుగు టీకను సమకూర్చారు.

ప్రాణం మనవరాలి నొకసారి చూడాలని మహా పీకుతున్నది. అన్నానికి నర్సును రమ్మని మరీమరీ చెప్పారు" అన్నాను.

"నామీద చూపవలసిన ఆపేక్షకూడా నర్సుమీదే చూపుతున్నాడేమో" అన్నాడు డాక్టరుగారు.

"మీ నర్సు మీ అమ్మగారల్లే ఉంటుందని ఆయన ఊహించారు."

డాక్టరుగారాశ్చర్యపడి, "ఎవరో చెప్పివుంటారాయనకు. అయినా ఆవిడ ఏనాడో పోయిందిగదా. ఆవిణ్ణి యెరిగి, ఆయనతో చెప్పేవాళ్ళెవరుంటారబ్బా!" అన్నాడు.

"మీరు డొంకంతా తిరుగుతున్నారు. నర్సు మీపోలికేనని నేనే చెప్పాను. మీరంతా మీ అమ్మగారి పోలికేనట."

"నర్సు నా పోలికని ఆయనతో యెందుకు చెప్పాలిసొచ్చింది?"

"నా మనవరాలెట్లా ఉంటుందని ఆయన గుచ్చి గుచ్చి అడుగుతుంటే, వర్ణించే శక్తిలేక సులువుగా మీలాగే ఉంటుందని చెప్పేశాను."

డాక్టరుగారు కొంచెంసేపింకేదో ఆలోచించి, "నిజానికి మా అమ్మ పోలికలు నాలోకన్న నర్సులోనే ఒక పిసరు జాస్తి. ఒకవేళ నేనాడదాన్నయితే అచ్చు నర్సులాగే ఉండేవాణ్ణేమో!" అన్నాడు.

"ఆయన, పాపం, యిప్పటికీ మీ అమ్మగారిని మరిచిపోలేదు. అటువంటి ఇల్లాలెక్కడా ఉండదన్నారు."

"కాదామరి, ఐతకని బిడ్డ బారెడుట! నీవంటి ఇల్లాలు ఎక్కడా ఉండదని ఆవిడతో ఒక్కసారి ఆయన అనివుంటే ఎంత సంతోషించేదో?" అన్నాడు డాక్టరుగారు బిట్టర్‌గా.

"ఏమండోవ్, సుందరమ్మగారూ! మిమ్మల్ని గురించి సందర్భవశాత్తూ ఒక్క అబద్ధం ఆడేశాను. చేసిన పాపం చెబితే పోతుంది. ఆయనంటే మీకు పరమ అసహ్యమని చెప్పేశాను."

సుందరమ్మగారు నవ్వుతూ, "అందులో అబద్ధ మేమీలేదులే. ఆయనలాగా నా అసహ్యాలను పొదుగుతూ కూర్చోనన్న మాటేగాని, నా కాయనంటే అసహ్యమే. ఆయనతో ముఖాముఖీ ఒక్కసారే మాట్లాడాను. జన్మకంతకీ సరిపోయినంత రోత పుట్టించారు" అన్నది.

"అది సహజమేలే, సుందరం. తనపైన తనకు అసహ్యం ఉన్న మనిషి ఇతరులకిక్కూడా రోతపుట్టిస్తాడు. మానాన్నవంటివాడు తననుచూసి తాను రోతపడకుండా ఉండటం సాధ్యంకాదు" అన్నారు డాక్టరుగారు.

"ఏం, నర్సమ్మా? మీ తాతను చూడవస్తావా?" అన్నాను.

"రాను" అన్నది నర్సు.

"నిన్నొక్కసారి చూడాలని చాలా తహతహ లాడుతున్నాడు. ఒక్కసారి కనిపిస్తే నేమిటి? ఆపాటి భూతదయ ఉండాలి. నా కాయనంటే ఏమీ మంచి అభిప్రాయం లేదు. కాని ఆయన కోరిక నిజమైనది. నాకే జాలేసిందంటే నమ్ము" అన్నాను.

డాక్టరు గారింట దేన్ని గురించీ దీర్ఘంగా చర్చలు జరగటం నే నెరగను. కొన్ని విషయాలలో డాక్టరుగారు చెప్పినది వేదవాక్యంగా వుంటుంది. మిగిలిన విషయాలలో సుందరమ్మగారి నిర్ణయాలకు తిరుగుండదు. అటువంటప్పుడు చర్చల కవకాశ మేముంటుందీ?

కాని నర్సు నావెంట లగ్నానికి వచ్చి తాతగారికి కనిపించడం గురించి చాలా సేపు చర్చ జరిగింది. నర్సు తన తాతగారికి కనిపించటం మంచిదని నేను కాస్త పట్టుదలగానే వాదించాను. ఆయనను ఇంకేవిధంగా నన్నా సాధించవచ్చుగాని, ఈ విధంగా సాధించవద్దన్నాను. నా పట్టుదల వల్లనైతేనేం, డాక్టరుగారు తగినంత పట్టు దల చూపకపోవటం వల్లనైతేనేం, నర్సును నావెంట పంపటానికే నిర్ణయం జరి గింది.

"బయలుదేప మరి. డ్రెస్ చేసుకో. అప్పుడే యెనిమిది దాటింది" అని నేను నర్సును తొందరచేశాను.

"డ్రెస్ చేసుకునే ఉన్నాను. రెడీయే" అన్నది నర్సు.

నరసింహం పంతులుగారు అదే వరండాలో, అదే పేముకుర్చీలో, అవే చేతులు, అదే నెత్తికింద పెట్టుకుని ఉన్నాడు.

"ఇదిగోనండీ. మీ మనవరాలూ! నర్సూ, వీరు తాతగారు" అన్నాను.

ముసలాయన కష్టపడి కుర్చీలో లేచికూర్చుని మెరిసే కళ్ళతో నర్సుకేసి చాలా సేపు చూశాడు. రక్తమనేది ఎంత చచ్చు మాటో నాకా క్షణంలో అర్థమైంది. కళ్ళతో ఒక మనిషిని తాగెయ్యవచ్చు.

"రా! తల్లీ" అంటూ ఆయన నర్సు చెయ్యిపట్టుకుని దగ్గిరికి తీసుకుని, ఒళ్ళో కూర్చోబెట్టుకున్నాడు. తల నిమిరాడు; వీపు నిమిరాడు; చెక్కిళ్ళు నిమిరాడు.

ఈయన నాటకంలో పాత్రలాగా ప్రవర్తించబోతాడని తెలిస్తే నర్సును వెంట బెట్టుకు రాకనేపోదును.

"రాణీవాసంగా ఉండవలసినదానివి మీ నాన్న ఇలాగా ఉంచాడు. నీయీడున మీ నాయనమ్మ అపర లక్ష్మీదేవిలా గుండేది తెలుసా?" అన్నాడాయన. నర్సు బిడి యంతో కుంగిపోయి తాతకేసి చూడనన్నా చూడకుండా ఉంది.

"ఏం చదువుతున్నావు తల్లీ?"

నర్సు మాట్లాడలేదు.

"నాతో మాట్లాడొద్దని మీ నాన్న చెప్పి పంపిచాదేమే?"

"ఫెష్టు ఫారం," అన్నది నర్సు, తల అడ్డంగా ఆడించి.

"నీకు మీనాన్న పెళ్ళెప్పుడు చేస్తాట? వాడిమొహం! వాడు చేసే దేమిటి? నీ పెళ్ళి నేను చేస్తానే? చూడెలా చేస్తానో!....లక్ష్మీ? ఓ వెంకటలక్ష్మీ?" గట్టిగా నిల్తితే ఆయన గొంతుకు ఇల్లంతా దద్దరిల్లింది.

"ఏమిటి, తాతయ్యా?" అంటూ ఒక పాతికేళ్ళ ఆడమనిషి వచ్చింది.

"నా మనవరాలే! ఇదుగో ఈ తాళంచెవి తీసుకుని నా పెట్టెతెరిచి అందులో ఉన్న నగలన్నీ పెట్టి, గులాబీరంగు సిల్కుచీరెకట్టి, కాళ్ళకు పసుపూ పారాణి పెట్టి, కల్యాణం బొట్టుపెట్టి మరీ తీసుకురా. నా మనవరాలు పెళ్ళికూతురైతే ఎలా వుంటుందో చూసుకుని సంతోషిస్తాను. చూడు, పిల్లి తలనిండా చక్కగా పూలు పెట్టు ఆఁ?"

నర్సు నాకేసి ప్రశ్నార్థకంగా చూసింది. భరించాలి, తప్పదన్నట్టు మొహం పెట్టి, వెళ్ళమన్నట్టు తల ఊపాను.

మరో పావుగంటకల్లా నర్సు గుర్తుపట్ట రాకుండా మారిపోయి వెంకటలక్ష్మి వెంట తాతగారి దగ్గిరికి తిరిగి వచ్చింది. నేను నర్సును చూసి స్తన్నయిపోయాను. ఆమె సినిమాలో వేషం లాగున్నది. మొహానికింత క్రీము పూసుకోటానికే కంపర మెత్తే మనిషి, డ్రెస్సుచేయించుకుని, మెడకూ, చేతులకూ, కాళ్ళకూ, నడుముకూ నగలు తగిలించుకుని, తలనిండా పూలు పెట్టుకుని, కాళ్ళకు పసుపూ పారాణి పూయించుకుని ఎట్లా సహించిందో నాకర్థంకాలేదు. నర్సులో నాకేమీ చిరాకు కని పించలేదు. ఆ మాటకువస్తే ఆనందం కూడా కనిపించలేదు.

ఆ ముసలాయన తన్మయత్వం పొందుతూ కాస్త పైత్యానబడ్డవాడల్లే "ఆ హ హా! నాతల్లి కెంత అందమే?.... నా మనమరాలిని అందరూ వచ్చి చూడండ్రా!" అని గట్టిగా అన్నాడు. ఆయన కుర్చీలోనుంచి లేవటానికి యాతన పడుతుంటే, నేను రెక్క పట్టుకుని సహాయం చేశాను.

నాకు ప్రాచీన సంప్రదాయాలు జ్ఞాపకంవచ్చి, "నర్సూ, తాతగారి కాళ్ళకు నమస్కారం చెయ్యి" అన్నాను.

"నేను చెయ్యను" అన్నది నర్సు ఖచ్చితంగా.

"వద్దే, తల్లీ!" ఎందుకొచ్చిన నమస్కారాలు. కావలసింది ఆపేక్షలూ, అంతఃకరణలూనూ!" అంటూ ముసలాయన నర్సు భుజాలమీద చేతులువేసి ఆమె రెండు చెంపలూ ముద్దుపెట్టుకున్నాడు.

జనం మూగుతున్నారు. "పంతులుగారి మనవరాలు," "కనకసుందరం కూతురు." అనే మాటలు వినిపిస్తున్నాయి.

"ఇంక ఈ వేషం విప్పవచ్చునా?" అన్నది నర్సు.

"ఛీ! ఛీ! అదేమిటి తల్లీ. ఇది వేషంకాదు. నీ నగలూ, నీ చీరే ఎందుకు విప్పటం, ఉంచుకో. ఇంటికి పట్టుకుపో!" అన్నాడు ముసలాయన. ఆయన నాకేసి తిరిగి, "లగ్నానికింకా యిరవై నిమిషాలున్నది. మీ రిద్దరూ వెళ్ళి భోం చెయ్యకూడదూ. పందిట్లో వడ్డన జరుగుతున్నది" అన్నాడు.

"ఇవన్ని తీసెయ్యకుండా ఎట్లా అన్నం తినటం!" అన్నది నర్సు.

"వాటి సంగతి తరువాత చూద్దాం పద!" అంటూ నర్సును చెయ్యి పట్టుకుని బయటికి తీసుకుపోయాను. దారిలో ఆమెతో "ఆయన ఎంతో ప్రేమతో యిచ్చిన వస్తువులు. ఇంటికి పోయి తీసెయ్యవచ్చు. నీకు పెట్టుకోవటం యిష్టం లేకపోతే మూటగట్టి ఏ అటకపైనో దాచెయ్యి. నే నిచ్చిన క్రీమ్ దాచేసినట్టు" అన్నాను.

ఇద్దరమూ ఇంటివెనక పందిట్లో వడ్డించి ఉన్న విస్తళ్ళ ముందు కూర్చుని భోజనం చేసేశాము. అది అనధికార పంక్తి. తినేవాళ్ళు తిని లేచిపోతున్నారు, వచ్చే వాళ్ళు వచ్చి విస్తళ్ళ ముందు కూర్చుంటున్నారు.

భోజనం పూర్తి చేసి, చేతులు కడుక్కునేటప్పుడు నర్సు, "మన మిక వెళ్ళ వచ్చునా?" అన్నది.

"లగ్నం చూడకుండానా?"

"ఈ వేషంతో అందరిమధ్యా కూర్చోనా! నేనిక్కడ ఒక్క క్షణం ఉండను. నేనా ముసలాయన్ని చూడటానికి వచ్చాను గాని, ముహూర్తం చూడటానికి రాలేదు" అన్నది నర్సు.

ఆ మాట రైటే మరి. నేను మా బాబాయిని వెతికి పట్టుకుని, "బాబాయ్! నేను అర్జంటుగా యింటికెళ్ళాలి. ముహూర్తానికి ఉన్నట్టే భావించుకో" అన్నాను.

బాబాయి నర్సుకేసి నోరు తెరుచుకు చూసి, "ఈ పెళ్ళి కూతుర్నెక్కడ సంపాదించావురా?" అన్నాడు.

"పిల్లతరపు బంధువు ఒక క్రిమినల్ లున్నాడు. ముసలాయన. ఆయన మనవరాలు. ఈ పిల్లనింటికి తీసుకుపోయే భారం నాది" అన్నాను.

తరవాత శ్రీనివాసరావు దగ్గిరికి వెళ్ళి "ఏరా, మామా? నీ పెళ్ళి లగ్నమూ, నా జన్మ నక్షత్రమూ షష్టాష్టకంలో ఉన్నాయిట. నేను పోతున్నాను. నువుమాత్రం కొంచెం జాగ్రత్తగా పెళ్ళి చేసుకో" అన్నాను. నా మాటలేమి శ్రీనివాసరావు కర్థమైనట్టు లేదు. వాడు నర్సుకేసి వెర్రిగా చూశాడు. వాడు

మరింత ఏడుచుకోగలందులకు, నేను నర్సును చెయ్యి పట్టుకుని ఈడ్చుకుంటూ వచ్చి ఇవతల పడ్డాను.

నర్సును వెంటబెట్టుకుని రాత్రి తొమ్మిది గంటల వేళ కొంపకి క్షేమంగా చేరటమెట్లాగా అన్న సమస్య నన్ను వేధిస్తున్నది. మే మిద్దరమూ వీధిలోకి అడుగు పెట్టుతుండగా చిన్న చిట్కా తట్టింది.

ముహూర్తానికి జనం వస్తున్నారు; ఎవరో జట్కాలో వచ్చి దిగి, బండి వాడికి డబ్బులిచ్చి లోపలికి వెళ్ళారు. నేను జట్కావాడితో ఏమి అనకుండా నర్సును యెక్కించి, వెనకగా నేనూ యెక్కి, "సర్కిలినిస్పెక్టరు గారింటికి తోలవోయ్" అన్నాను.

ఏం చెయ్యాలి? నర్సు ఒంటిపైన ఎంతలేదన్నా మూడు నాలుగు వేల రూపా యల బంగారపు నగలున్నాయి. జట్కా వాళ్ళను నమ్మటానికి లేదు. సర్కిలిన్స్పె క్టరు గారిల్లు డాక్టరు గారింటికి సరిగ్గా ముప్పై గజాలు లేదు. డాక్టరు గారిల్లు దాటితేగాని సర్కిలుగా రిల్లు రాదు.

జట్కావాడు మారు మాట్లాడకుండా బండి యెక్కి కూర్చుని గుర్రాన్ని అదిలించాడు.

దారిలో నర్సుతో, "ఇవన్నీ తగిలించుకుని సుఫ్లైట్లా ఉన్నావో నీకేమైనా ఐడియా ఉందా?" అని అడిగాను.

"ఎందుకు లేదూ? ఆ గదిలో నా ఎత్తు నిలువుటద్దం ఉంది. అందులో చూసు కున్నాను. ఎవరో లాగున్నాను" అన్నది నర్సు.

కొంచెం సేపుండి, "మీ తాతయ్యతో చెప్పకుండా వచ్చేశాం. ఆయన నీకోసం వెతుక్కుని చాలా బాధపడతాడు. నా నగలు తీసుకుని వుడాయించిందని ఆయన కేసు పెడితే ఏం చేస్తావు?" అన్నాను.

"వెధవ నగలు, ఆయనకు బంగీకట్టి పంపేద్దాం! పీడ! పీడమనుషులు!" అన్నది నర్సు.

ఇంకా సేపుండి, "అందరూ నీకేసి యెట్లా చూశారో గమనించావా?"

"సర్కసు జంతువును చూసినట్టు చూశారు."

"నేనుకూడా ఏమీ తక్కువ తినలేదులే. ఎవరు నీ కేసి నోరు తెరుచుకు చూసినా, నేనుకూడా నీకేసి యింకోసారి చూసుకుంటూనే ఉన్నాను."

నర్సు బండిలోనే చేతినగలు తీయ ప్రయత్నించింది.

"ఇంటికివెళ్ళి తియ్యొచ్చు. ఈ చీకట్లో బండిలో ఏదన్నా పడిపోయిందంటే దక్కదు." అని నర్సున వారించాను.

మొత్తంమీద ముసలాయన ప్రవర్తన నాకర్థం కాలేదు. ఆయన తన భార్య నగలూ చీరలూ వెంట తెచ్చి ఉండాలి. వాటిని తన మనవరాలికివ్వటానికి ముందుగానే నిశ్చయించి ఉండాలి. ఆయన ఆ పని ఏ విధంగా చేద్దామనుకున్నాడు? నేను తటస్థపడటం కేవలమూ దైవికం. అంతకంటే ముఖ్యమైన ప్రశ్న యీ వయస్సులో ఆయనకు మనవరాలిపైన ఎందుకు మనసు మళ్ళింది? ఇంతకాలమూ యేం చేస్తున్నాడు! మనవరాలు పుట్టిందని తెలియగానే కొడుకుతో ఏదో విధంగా రాజీపడక పోయాడా? ఆయన ప్రవర్తన నాకు అయోమయంగానే కనబడింది.

బండి డాక్టరుగారింటి వాకిలిదాటి ముందుకు పోతుండగా నర్సు, "ఆపు, ఆపు!" అని అరిచింది. బండివాడాపాడు.

వాడికి డబ్బులిచ్చి తలవాకిలి తట్టాను. సుందరమ్మగారు వచ్చి లోపలినుంచి పడే లైటులో కూతురుకేసి చూసి నిర్ఘాంత పోయింది.

# 4

రాత్రి పదిన్నర దాటింది. ఎవరమూ నిద్రపోయే ప్రయత్నంలో లేం. నర్సు తీసుకువచ్చిన నగలూ, కట్టుకొచ్చిన చీరా ఒక కుప్పగా పెట్టివున్నాయి. నర్సు పసుపూ పారాణి పోవటానికి సగం సబ్బు ఖర్చు చేసిందిగాని వాటి ఛాయలింక కాళ్ళకుండనే ఉన్నాయి.

జట్కాలో ఎక్కి నేను వేసుకున్న ప్రశ్నలకు డాక్టరుగారు ఒక రకం సమాధానం చెప్పాడు.

"మనం సంకేతాలను పట్టుకుని బతుకుతాం. భగవంతుడిపై భారంవేసిన వాళ్ళకి ఒక గుడో, అందులో ఉండే విగ్రహమో, ఒక పటమో సంకేతం. అట్లాగే మతానికీ, కళలకీ, ప్రేమకీ, దేశభక్తికీ, ఆధునికత్వానికీ, సనాతనత్వానికీ, స్వేచ్ఛకూ, జాతీయతకూ - ప్రతిదానికీ చాలా సంకేతాలున్నాయి. చాలామందికి సంకేతాలను గుర్తించడమే తెలుసు. వాటి వెనుక ఉండే అసలు సంగతి గురించి ఏమీ తెలియకపోవచ్చు. మా నాన్నకు ఒక సంకేతం కావాలి—తనక్కూడా ఒక హృదయమూ, ఆత్మీయుల పట్ల ప్రేమా ఉన్నట్లు దాఖలా కావాలి. ఆ సంకేతం తన వ్యక్తిత్వానికి హానికరంగా ఉండరాదు. అందుచేత నేను పనికిరాను. నా కూతురు పనికి వస్తుంది. మా అమ్మ నగలన్నీ మనవరాలి కివ్వటం ఒక జెశ్చర్. నటుడు ప్రేక్షకుల చప్పట్లు ఆశించి చేసే అభినయం వంటిది. నే నాయనను తప్పు పట్టటం లేదు. మన మందరము అటువంటి సింబల్స్‌తోనే, అటువంటి అభినయాలతోనే తృప్తిపడి జీవిస్తున్నాం. సంకేతాల వెనుక ఉండే వాస్తవ విష

యాన్ని అర్థం చేసుకున్నవాణ్ణి సాధారణంగా లోకం అర్థం చేసుకోదు. మచ్చు తీసుకో. అవి మనిషియొక్క కొనుగోలు శక్తికి సంకేతం. లోకం ఆ సంకేతాన్ని చూసి హర్షించినట్టుగా కొనుగోలును చూసి సంతోషించదు. వస్తువులు వినియోగానికి కొనుక్కునేవాడు మామూలు మనిషి. మరి పేరాసికి కొనుగోలు శక్తిని పెంచుకునే వాడు ఆ మామూలు మనిషికన్న గొప్పవాడు!"

డాక్టరుగారు చెప్పేది నిజమే కావచ్చుగాని, మనిషి హృదయం మహా సముద్రం లాటిది. అందులో ఏ క్షణాన ఏ విధమైన కల్లోలం చెలరేగేది ఎవరూ చెప్పలేరు. ముసలాయన తన యౌవనమూ, కౌమారమూ, వృత్తిలో మునిగిపోయాడు. ఆ తరువాత ప్రేమించదగిన భార్యనూ, కొడుకునూ పోగొట్టుకున్నాడు. ప్రేమానురాగాలలో మునిగితేలే వార్థక్యదశలో మనవరాలు కనిపించింది. ఆమె పట్ల తనకు గల ప్రేమను తనకు చాతనైన విధంగా ప్రదర్శించే అవకాశం కోసం ఆయన తహతహలాడుతూ ఉండవచ్చు. ఒకప్పుడు కొడుకు వితంతువును పెళ్ళాడితే క్షమించలేకపోయినవాడు. రేపు తన మనవరాలు ఏ అస్పృశ్యుణ్ణో పెళ్ళాడినా క్షమించవచ్చు...డబ్బు దాహమూ, కామేచ్ఛా, మనిషివాపీ, సరైన తరుణంలో తీరకపోతే దయ్యాలల్లే పట్టుకుని పీడిస్తాయని డాక్టరుగారే ఎప్పుడో అన్నారు. ముసలాయనకు మనిషివాపీ పట్టుకున్నది.

"రేపు వీటన్నిటినీ తీసుకుపోయి ఆయనకిచ్చేసే డ్యూటీ నీది!" అన్నారు డాక్టరుగారు.

"నే నెట్లాగూ అక్కడికి రేపు వెళ్ళక తప్పదు. ముహూర్తానిక్కూడా ఉండకుండా వచ్చేశాను" అన్నాను.

అదీ ఇదీ మాట్లాడుకుని పదకొండు దాటాక ఎవరి దారిన వాళ్ళం పడుకుని నిద్రపోయాం. నిద్రలోకూడా నా మెదడులో సర్సు అవతారం కళ్యాణం బొట్టుతో సహా ఏ మూలో మెదులుతూనే ఉన్నది. ఆమె కళ్యాణం బొట్టు పెట్టుకోవటం అదే మొదటిసారీ, చివరిసారీ అని నే నప్పుడెరగను.

మర్నాడు నిద్రలేస్తూనే స్నానం చేసేసి నగలూ, చీరా మూటగట్టుకుని అగ్రహారం వెళ్ళాను. మూటను ముసలాయన ముందుపెట్టి "పంతులుగారూ, ఇదిగో మీ నగలూ అవీనూ, సరిగా ఉన్నాయో లేవో చూసుకోండి" అన్నాను.

ముసలాయన నా మీద విరుచుకుపడ్డాడు. "నీవుచూస్తే పెద్ద రోగ్‌లాగున్నావే. నిన్నరాత్రి నా మనవరాలిని నాతో చెప్పకుండా తీసుకెళ్ళిపోయావు. పోలీసురిపోర్టివ్వ ద్దామనుకున్నాను—విత్ ఫోర్ డిఫరెంట్ ఛార్జెస్! ఇప్పుడు పిల్ల లేకుండా నగలు తెచ్చిస్తావా? పిల్లనేం చేశావు?" అని ఆయన చిందులు తొక్కాడు.

"నేనేం చేస్తానండీ? ఉండనంటే ఉండనని తొందర చేసింది. ముహూర్తాని క్కూడా ఉండకుండా నేను బయలుదేరి ఆమెనింటి దగ్గిర చేర్చవలిసొచ్చింది. నాకు లేనిపోని బాధ్యత మీరే అంటగట్టారు. ఆ పిల్లతో నగలన్నీ తొడగమని నేను మిమ్మల్ని కోరానా?" అన్నాను.

"నా పిల్లకు నేను పెట్టుకుంటాను. కోరటానికి మానటానికీ నువ్వెవడవ్?"

"నిజమే అనుకోండి. అయినా ఆ పిల్ల ఆ నగలతో ఒంటరిగా అరండల్ పేటకు బయల్దేరుతుంటే నేను, సరే వెళ్ళిరమ్మని ఎట్లా అననూ. పిల్లను నా వెంట తెచ్చినప్పుడామెను తిరిగి క్షేమంగా తల్లిదండ్రులకు అప్పగించే పూచీ నాదేగా? మీ రామెను తీసుకురమ్మని రిక్వెస్ట్ చెయ్యకపోతే - రిక్వెస్టేమిటి? బెగ్ చెయ్యక పోతే - ఒక్కణ్ణీ వచ్చేవాణ్ణి. నా యిష్టం వచ్చినప్పుడు వెళ్ళిపోయేవాణ్ణి. నిక్షేపంగా పెళ్ళిసంతంతా చూసేవాణ్ణి. నాకు అన్నిందాలా అన్యాయం చేశారు మీరు" అన్నాను.

"అయిందేదో అయింది. ఈ నగలన్నీ ఎందుకు తీసుకొచ్చావ్? వాటిని నేను పిల్లదాని కిచ్చేసుకున్నాను. అవి దానివే!" అన్నాడాయన.

"వాళ్ళు మాకొద్దు మొర్రో అంటుంటే ఏం చెయ్యనూ. మీ కివ్వాలని అంత పట్టుదలగా ఉంటే వాళ్ళకి పార్శెల్ చేసి, ఇన్సూరు చేసి మరీ పంపండి. వాళ్ళేం చేసుకుంటే అవి చేసుకుంటారు. పిల్లతో పాటు నగలను తేవటంచేత వాటిని మీకు తిరిగి ఇచ్చే భారం నా మీద పడింది."

"వాళ్ళంటావు : వాళ్ళెవరు? ఎవరువాళ్ళు? నా మనవరాలు నేను ప్రేమతో ఇచ్చిన నగలు వద్దంటుందా? ఆడది నగలు వద్దనదు. (నగలొల్లని నారి కలదె పరి కింపంగన్!) ఆ చాతకాని వాజమ్మ ఓర్చలేక తిప్పి పంపి ఉంటాడు. తాను పెట్ట లేడుగా! ఆ పని నేను చెయ్యగలనని కడుపు మంట."

"ఏమో అదంతా నాకు తెలీదు. అది మీరూ మీరూ తేల్చుకోండి" అన్నాను.

నగలను నర్సే నిరాకరించిందని ఆ మానవుడితో అనటానికి నాకు భూతదయ అడ్డొచ్చింది. తన మనవరాలికి తనమీద ఆవగింజపాటి అభిమానం ఉండి ఉంటుం దని భ్రమ ఉంటే దాన్ని నేనెందుకు తుడిచెయ్యాలి?

ఆయన కొంచెం సేపు యోచించి, "ఒక్క సహాయం చేసిపెట్టు. నా మనవరాలికి ప్రపంచజ్ఞానం లేదు. చిన్నదిగద! అందుచేత తల్లీ తండ్రి ఈ నగ లను తిప్పి పంపమనగానే ఇచ్చేసింది. వాళ్ళు నా మీది అక్కసుతో నా పైన దానికి ద్వేషం కూడా పుట్టించగలరు. కనుక నువ్వేం చేస్తావంటే, పిల్లకు చాటుగా బోధించు; నేను దాన్ని నెత్తిమీద దేవతలాగా చూసుకుంటానని చెప్పు. నేను

దాని తాతననేది దాని మనసులో బాగా ఇంకేటట్టు నూరిపొయ్యి. చూడూ, దానికి డబ్బు విలువ తెలియకపోవచ్చు. నా దగ్గిర పుష్కలంగా డబ్బున్నది. అది రాజా లాగా బతకవచ్చు. రేపు లక్షాధికారిని తెచ్చి పెళ్ళి చేసే తాహతు నాకున్నది. నా కొడుకువల్ల ఏమవుతుంది? ఏ పిచ్చిగాడికో ఇచ్చి చేస్తాడు. వాడు నష్టజాతకుడు. పెద్దమ్మ నెత్తినెక్కేసరికి నా డబ్బును వాడన్నీ తెగపోశాడు. నా మనవరాలు కూడా అటువంటి తెలివి తక్కువ పనే చేస్తే నాకున్న ఆస్తంతా ఎవరు తినరు? నా దగ్గర ఇంత డబ్బుండగా నా మనవరాలు బిచ్చగాళ్ళలాగా, చీపురుకట్టలాగా ఉండి ముష్టివానిలా బతుకుతుంటే నాకెంత బాధగా ఉంటుందో నువ్వే ఆలోచించు. అందుచేత దాని బుద్ధి నా వేపు మళ్ళేటట్టు చేసే భారం నీ మీద వేస్తున్నాను" అన్నాడు.

"అయ్యా, నామీద ఏ భారమూ పెట్టకండి. నేను చదువులు చెప్పగల వాణ్ణి కాను. నాకింకా అనుభవం లేదు. నా భవిష్యత్తు చూసుకోవటమే నాకు చాత కావటం లేదు. మీ అమ్మాయిగారి ధర్మమా అంటూ కాస్త కాస్త లోకజ్ఞానం కలుగు తున్నది" అన్నాను.

"వాడి మొహం! వాడికి లోకం గురించి ఒకటి తెలిసేటందుకేమిటి నీకు చెప్ప టానికి? ఇక జ్ఞానం కావాలంటే నన్నడుగు చెబుతాను. నువ్వింకా చదువుకుంటు న్నావు కద. చదువుకో. ఉద్యోగం వగైరాల విషయంలో నీకే సమస్య అయినా వస్తే తిన్నగా బెజవాడలో మా ఇంటికి వచ్చెయ్యి."

ఆయన ఎంతసేపు మాట్లాడినా నాకు ప్రపంచం గురించి ఏమీ తెలియలేదు- ఆడదన్న తరవాత నగల వ్యామోహం వుండి తీరుతుందన్న అనుమానాస్పదమైన సత్యం తప్ప. ఐనా ఆయనతో నా కెందుకు పేచీ?

"సరేనండీ థాంక్స్! నాకేదన్నా మంచి సలహా కావలిస్తే ఇంకెక్కడికీ వెళ్ళను. మీ దగ్గిరకే వస్తాను!" అన్నాను.

"తప్పకుండా రా. కాని నే చెప్పినది మరవకు. పిల్ల మనసులో ఉండే అజ్ఞా నాన్ని పోగొట్టే భారం నీది."

"ప్రయత్నిస్తానులెండి" అన్నాను.

ఆయన్ను వదిలించుకున్నాక నాకు మళ్ళీ కాస్త ఊపిరి ఆడింది. గట్టిగా ఊపిరి తీసుకుంటున్న సమయంలో "అన్నయ్యా" అంటూ వచ్చి బాబాయి పిల్లలు న్నా మీద దాడిచేసి తీసుకుపోయి నాకు టిఫిను పెట్టించారు. కాఫీ తాగించారు. తర వాత పెళ్ళికొడుకును వెతుక్కుంటూ వెళ్ళి వాడి పసుపు బట్టల్నీ, వెండి యజ్ఞో పవీతమూ తాకి చూసి, "ఏరా, మామయ్యా, పెళ్ళి కూతురి మెడలో తాళి గట్టిగా కట్టావా?" అన్నాను.

"ఏడిశావులే, నువు ఎంత గట్టిగా ముడేస్తావో నేను చూడకపోతానా?" అన్నాడు శ్రీనివాసుడు.

మా పిన్ని వచ్చి నన్ను చూసి "నిన్నల్లా అటుకేసి రానట్టుందే? ఏమంత అర్జంటు పనొచ్చి పడిందయ్యా?" అన్నది.

నిన్నరాత్రి ముసలాయన అంత నాటకమాడితే అందులో ప్రముఖపాత్ర వహించిన నన్ను పట్టుకుని ఆవిడ అంత మాటంటుందా?

"వాడు రాకపోవట మేమి టక్కయ్యా? ఎవరో పోటీ పెళ్ళికూతుర్ని తెచ్చి ఇల్లంతా తిప్పితేను?" అన్నాడు శ్రీనివాసరావు.

"ఎవరా అమ్మాయి? పెళ్ళి చేసుకున్నా వేమిటి? నీ కోసం రత్నంలాంటి పిల్లను చూసి ఉంచాను. సరేనంటావా రేపే ముహూర్తం పెట్టిస్తా నేమనుకున్నావో!" అన్నది పిన్ని.

"ఉండనీ; పోనీనూకు, ఇంకో నాలుగైదేళ్ళలో ఎట్లాగూ పెళ్ళి చేసుకు తీర తాను" అన్నాను.

"ఆఁహాఁ! ఇంతోటి మొగుడు దొరకడని నీకోసం ఏళ్ళతరబడి కనిపెట్టు కూర్చుంటుంది కాదూ?" అన్నది పిన్ని హేళనగా.

"పిల్లవాడు పిల్లవెంటపడితే వరహీనం, పిన్నీ. అయినా పిల్ల నిజంగా బాగుంటే హీనం కావటానికూడా ఒప్పుకుంటాను. ఏం చేస్తాము" అన్నాను.

"ఆ మాటన్నావు బాగుంది. రా నావెంట." అంటూ పిన్ని నన్ను వెంటబెట్టుకుని వరండాలోకి వచ్చి "అదిగో!" అన్నది ఒక పద్నాలుగు పదిహేనేళ్ళ పిల్లను చూపింది. ఆ పిల్ల భాగ్యవంతులపిల్ల అని తెలుస్తూనే ఉన్నది. పట్టుపావడ కట్టి పల చని వోణీ వేసుకుని ఉన్నది. మెడలో నెక్లెసొకటి మెరుస్తున్నది. చెవులకు జూంకీలున్నాయి. చేతులకూడా రాళ్ళు తాపిన గాజులున్నాయి.

పాపం పిన్ని నిన్నరాత్రి నర్సునుచూస్తే, ఈపూట నాకీ పిల్లను ఇంత ఇదిగా చూపించివుండదు.

"అబ్బో, ఇంత అందమైన పిల్లను నాకిస్తారా పిన్నీ. దురాశ పెట్టుకోకు" అనేశాను.

పిన్ని పిచ్చిది. నా తరపున పౌరుషం తెచ్చుకుంటూ, "ఇంకా నయం! నీ కన్న మంచి సంబంధం తెస్తారా వాళ్ళు? చూస్తాంగా!" అన్నది. అప్పుడే మేమడిగినట్టూ వాళ్ళు నిరాకరించినట్టూ.

ఆ రోజల్లా విడిదిలోనే గడిపి, కాలేజీ ఎగగొట్టేశాను. ఆ వాతావరణం నాకు మత్తెక్కించింది. ఆడవాళ్ళూ, చీరెలూ, పూలూ, గాజుల చప్పుడూ నా మీద విస్కీ, బ్రాందీల బాబులాగా పనిచేశాయి. ఏ జన్మలోనో నేను నవాబునూ

సుల్తానునూ, మహారాజునూ, అది నా అంతఃపురం. అందులో వున్న వందలాది స్త్రీలంతా నా భార్యలు. నాకు స్త్రీ దారిద్ర్యం లేదు. నా స్త్రీ సంపదకు పరిమితి లేదు. అటువంటి పగటి కలలో కన్ను మూసుకుని ఆఖరు క్షణందాకా ఆడవాళ్ళ గాజుల చప్పుడూ, నవ్వులు ఆలకిస్తూ గాఢనిద్రలో పడిపోయాను.

# 5

జీవితం సాఫీగా సాగిపోతున్నది. ఏ రోజు ఆనందం ఆ రోజు పరిమితంగా లభిస్తున్నది. డాక్టరుగారి భార్యకు నెలనెలా ముప్పై రూపాయ లిస్తున్నాను.

"మొహమాటపడకు. నీ దగ్గిర డబ్బులేనప్పు డడిగి తీసుకుంటూ ఉండు" అని సుందరమ్మగారు ప్రతిసారీ నాతో అని మరీ డబ్బు తీసుకునేది. నేను సరేననే వాణ్ణి. అవసరం పడితే తీసుకునే చనువుకూడా నాకున్న దిప్పుడు.

కాలేజీకి పోతున్నాను. వస్తున్నాను. ఇంటి దగ్గర నా కాలేజీ పుస్తకాలు చదువుతున్నాను భాసుడి నాటకాలన్నీ డాక్టరుగారు చదివి వినిపించారు. భాసుడి పనితనం ప్రతిజ్ఞలోనూ, స్వప్నవాసవదత్త[1] లోనూ ఎంత గొప్పగా ఉన్నదీ డాక్టరుగారు చక్కగా వివరించారు. ప్రతిజ్ఞా యౌగంధరాయణంలో[2] ముఖ్య పాత్రలైన వాసవదత్తా, వత్సరాజూ స్టేజీమీదికి రానేరారు. కాని కథంతా వాళ్ళదే స్వప్నవాసవదత్తలో వత్సరాజునూ, వాసవదత్తనూ ఒక్కచోటికి తీసుకురావటంలో భాసుడు చాలా ఉపజ్ఞ చూపాడు.

మేం ఏదైనా పుస్తకాలు చదువుకునేటప్పుడూ, పుస్తకాలను గురించి మాట్లాడుకునేటప్పుడూ నర్సుకూడా వచ్చి కూచుంటున్నది. తాతగారిని చూసిన తరువాత ఏదో నర్సులో అనిర్వచనీయమైన మార్పు వచ్చింది. మనిషిలో కొంత పెద్దరికపు లక్షణం ఏర్పడిందనుకుంటాను. అదివరకు నాతో చాలా మితంగా మాట్లాడేది. ఇప్పుడు స్వేచ్ఛగా మాట్లాడుతున్నది. తన పాఠాలలో ఏదన్నా అనుమానం వస్తే, నేను దగ్గిర ఉన్నప్పుడు నన్నే అడిగేస్తున్నది.

ప్రపంచమంతా భ్రమేనంటారు వేదాంతులు. ఇది భ్రమా, ఇది కాదూ అని చెప్పటాని కెవరికీ హక్కులేదు. నర్సు ఒక్కతే అయినా, నా మనసులో రోజూ చూసే నర్సూ, ఆనాడు ముసలాయన ముస్తాబుచేసిన నర్సూ ఇద్దరూ ప్రత్యేక వ్యక్తులుగా నిలిచిపోయారు. ఈ నర్సులో ఆ నర్సు లీనమైపోకుండా ఎడంగా నిలబడి ఉన్నది. ప్రపంచమంతా భ్రమేననటాని కింతకన్నా మంచి నిదర్శనం ఏంకావాలి?

---

1,2. బృహత్కథను అనుసరించి భాసుడు రాసిన నాటకాలు.

ఇన్నాళ్ళుగా డాక్టరుగారి కుటుంబంలో ఒకణ్ణిగా ఉంటున్నప్పటికీ అప్పు డప్పుడూ నాలో నేను "నర్సు ఇట్లా ఎందుకుండాలి? తాతగారి దగ్గిరచేరి అస్తమానమూ పెళ్ళికూతురులాగా ఎందుకుండకూడదు? ఈ మోడు జీవితంనుంచి ఆమె పొందు తున్న అదనపు ప్రయోజనం ఏమిటి?" అనుకునేవాణ్ణి.

డిసెంబరు శెలవుల్లో మేం నలుగురమూ కొండవీడు పిక్నిక్ వెళ్ళాం. అది వరకొకసారి నా స్నేహితులు కొందరు కొండవీడు వెళ్ళినప్పుడు నేను వాళ్ళతో వెళ్ళలేదు. కొండల్లో అందం ఉన్నది. కొండ లెక్కటంలో సరదా ఉన్నది. కొండలమీది గాలిపీల్చి, కొండలమీద నీరు తాగటంలో ఉత్సాహం ఉన్నది. నాకన్న నరుసు మరింత ఉత్సాహోద్రేకాలు కనబరిచింది.

ఈ ప్రయాణం కోసమని సుందరమ్మగారు పులిహోరా, గారెలూ చేసింది. గోంగూర పులుసు వండింది. ఇంత కొరివికారమూ, కందిపచ్చడీ నూరి పెట్టింది. అన్నం మాత్రం వండటానికి ఒక పాత్రా, బియ్యమూ తీసుకున్నాం. ఇంత నెయ్యీ, పెరుగు తీసుకున్నాం.

డాక్టరుగారు కొండవీడు చాలాసార్లు చూశాట్ట. మా సామానంతా ఒక్కటిగా కట్టకుండా, నలుగురూ పట్టుకోవటానికి వీలుగా నాలుగు మూటలు కట్టాం. తేలిక మూటలు ఆడవాళ్ళకిచ్చి బరువులు మగవాళ్ళం పట్టుకున్నాం.

నేను కొండ లెక్కటం అదే మొదలు. అయిదారు నిమిషాలపాటు వెనక్కు తిరిగి చూడకుండా ఎక్కి, మిగిలిన వాళ్ళకోసం తిరిగి చూసేసరికి నాకు, మేం వచ్చిన దారీ, పరిసరాలూ ఎంతో లోతున కనిపించి, ఒక విచిత్రమైన అనుభవ మయింది. ఒక్కొక్క మెట్టే పైకి పోతూ ఉంటే క్రిందినేల ఒక్కొక్క మెట్టే దిగి పోవటంలో ఆశ్చర్యమేమీలేదు. అయినా ఆ సంగతి ప్రత్యక్షంగా చూస్తుంటే చిత్రం గానే ఉంది. నిమిషాని కొకసారి ఆగి వెనక్కు చూసి, చుట్టూ కలయచూడసాగాను. కనుచూపు మేరకూడా విస్తరించటం నాకు వింతగానే వున్నది.

కొద్దిసేపటిలోనే మేం ఎక్కటం పూర్తిచేసి బంగళా చేరుకున్నాం. బంగ ళాలో యెవరో దిగివున్నారు. లేకపోతే దాని వరండాలో మకాం వేద్దామని మా ఉద్దేశం.

"ఇంకొంచెం నడిస్తే చెరువు దగ్గరికే వెళ్ళవచ్చు, పదండి" అన్నాడు డాక్టరు గారు. వెదుళ్ళమధ్య చెరువులాటిది ఉన్నది. అందులోని వాననీళ్ళు; ఎంతో నిర్మలం గానూ, తియ్యగానూ ఉన్నాయి.

"ఇటీవలనే ఇక్కడి కేదో పెద్ద పార్టీ వచ్చివుండాలి" అన్నాడు డాక్టరు గారు.

"ఎట్లా తెలుసు?" అన్నాను.

"ఆ పొగచూరిన రాళ్ళు చూడు, పొయ్యిలాగా అమర్చి ఉన్నాయి. వాటి పైన యెంత పెద్ద పాత్ర పెట్టివుంటారో ఊహించు, కనీసం ఇరవై ముప్పై మందికి అన్నం వండటానికి సరిపడ గుండిగ కాకపోతే రాళ్ళ మధ్యన దిగబడి పోతుంది."

ఆ వెదుళ్ళ పక్కన నిలబడి చూస్తే చుట్టూ ఎత్తుగా కొండలు, వాటన్నిటి పైన బురుజు లుండివుంటాయి ఒకప్పుడు. ఇప్పుడొక్క కొండపైననే శిథిలమైన బురుజు కనిపిస్తున్నది.

రెడ్డిరాజుల కాలంలో ఆ ప్రదేశమంతా ఎట్లావుండేదో ఊహించటం నాకు సాధ్యంకాలేదు. అక్కడ ఇళ్ళుండేవని, మనుషులుండేవాళ్ళనీ ఊహించటం కష్ట మయింది.

"మన సామా న్లిక్కడే ఉంచి ఓ గంటసేపు తిరిగివద్దాం" అన్నాడు డాక్టరు గారు.

"ఏదైనా ఒక కొండ ఎక్కి దిగుదాం" అన్నాను.

"నాకు తెలిసినంతవరకు ఆ బురుజున్న కొండశిఖరానికి దారిలాటిది వున్నది. మిగిలినవన్నీ రాళ్ళ మీదుగా పాకి యెక్కాలిసిందే."

"పోనీండి! దారివెంబడే పోదాం" అన్నది సుందరమ్మగారు.

మేం గమ్యస్థానం చేరటానికి ఎంతోసేపు పట్టలేదు. కాని అక్కడికి చేరిన తరవాత తిరిగి రాబుద్ధి పుట్టలేదు. అక్కడి నుంచి మైళ్ళకు మైళ్ళు కనిపిస్తుంది- స్వర్గం నుంచో భూలోకాన్ని చూస్తున్నట్టున్నది. ఆ గాలి పీలుస్తుంటేనే బలం వచ్చి నట్టనిపించింది.

మేం వెదుళ్ళ దగ్గిరికి తిరిగి వచ్చేసరికి మా సామాను భద్రంగానే ఉంది. చిన్న చిన్న రాళ్ళు మూడు ఏరి, పొయ్యిలాగా అమర్చాం. నేనూ, నర్సూ చితుకులు తెచ్చి పడేశాం. అడివి వున్నచోట వంటచెరుక్కు లోప మేముంటుందీ.

నర్సు చీటికీ మాటికీ బురుజుకేసి చూస్తుండటం గమనించి, "నాక్కూడా అక్కణ్ణుంచి రాబుద్ధి పుట్టలేదు" అన్నాను.

"అసలు అటువంటిచోటే ఉండిపోతే ఎంత బాగుంటుంది! అంత ఎత్తు! ఆ ఎత్తునుంచి ప్రపంచమంతా చూస్తూండొచ్చు. మనని పైనుంచి చూసేవాళ్ళంటూ ఉండరు" అన్నది నర్సు.

"కాని అక్కడ ఉండాలంటె ఒంటరిగాళ్ళ మైపోతామే! మనుష్య ప్రపంచా నికి దూరంగా ఉండి ఎట్లా బతకటం?" అన్నాను.

"మనక్కావలసిన వాళ్ళతో సహానే వుంటాం. ఒంటరిగా ఎందుకుంటాం?" అన్నది నర్సు. నేను నవ్వేను.

"మన కొక్కావలిసినవాళ్ళెవరో మనకేం తెలుస్తుందీ? మనం తినే బియ్యమూ, కూరలూ ఎవరు పండిస్తున్నారు? మనం కట్టుకునే బట్ట లెవరు నేస్తున్నారు? ఆ పత్తి ఎవరు పండిస్తున్నారు? మనం చదివే పుస్తకా లెవరు అచ్చేస్తున్నారు? ఎవరు చేర వేస్తున్నారు? మనం ఉండే యిళ్ళు ఎవరు కడుతున్నారు? వాటికి కావలసిన ఇటుకలూ, సున్నమూ, సిమెంటూ, కలపా ఎవరి పుణ్యాన వస్తున్నాయి? ఎట్లా తెలుస్తుంది? ప్రపంచంలో ఏ మూల ఏ రూపంలో శ్రమించేవాడైనా మనకు సహాయపడుతున్నాడనే అనుకోవాలి. మనం వాడే వస్తువులు మేడిన్ ఇంగ్లండ్, అమెరికా, జర్మనీ, వగైరా, వగైరా. ఎవరు లేకుండా మనకు జరుగుతుందంటే, లోఫర్లూ, దొంగలూ, శ్రమించని వాళ్ళూనూ-దీనికొక పారలల్ చెబుతా; కొన్నివేల ఏళ్ళక్రితం భూమిమీద జీవించిన ప్రతి ఒక్క మనిషికీ ఈనాడు భూమిమీద జీవించే ప్రతి ఒక్కడూ వారసుడేనని వెల్స్ రుజువు చేశాట్ట! అట్లాగే."

"సూర్యం నిప్పెట్టె కనబడదు. బుట్టలో వేసుకున్నాననుకున్నాను. మరిచానో ఏమో! కాస్త ఆ బంగళాదాకా వెళ్ళి వాళ్ళదగ్గరవుంటే పట్టుకురావాలోయ్!" అన్నది డాక్టరుగారి భార్య.

నేను చితుకు లేరటం మానేసి బంగళాకు బయలుదేరాను. అక్కడ ఎవరూ లేరు. ఎత్తయిన అరుగుల దిగువన ఒక ఖాళీనిప్పెట్టె పడివున్నది. ఖాళీ నిప్పెట్టెలో ఎప్పుడైనా పుల్లలు ఇరుక్కుని ఉండొచ్చు. ఆత్రంగా తీసి చూశాను. ఈ ఖాళీ నిప్పెట్టె—దానింట దొంగలుదూర!—నిజంగా ఖాళీ నిప్పెట్టే. అనాలోచనగా దాన్ని విసిరిపుచ్చుకుని దూరంగా పారేశాను.

బంగళాలో దిగినవాళ్ళెటుపోయి ఉంటారు? కొండ లెక్కుతూ ఉంటారు. చుట్టూవున్న కొండలు కలయచూశాను. ఎక్కడా మనిషి పొడలేదు. కొంచెంసేపటికి ఒక వైపునుంచి గొణిగినట్టుగా మనిషి కంఠం వినిపించింది. అది ధ్వనో, ప్రతిధ్వనో!

కుడిచేతిపక్క చాలా ఎత్తున తెల్లటి గుడ్డలు ధరించిన ఆకారం కనబడింది. అటుకేసి గబగబా కొండరాళ్ళు ఎక్కసాగాను. కొన్ని బండరాళ్ళు నాలుగేసి అడుగుల ఎత్తున్నాయి. వాటిమీదిగా దేకాను. అయిదారు నిమిషాలపాటు కొండయెక్కి రొగర్చుతూ చుట్టూ చూశాను. మనిషి జాడలేదు. అయినా మొండిగా ఎక్కుతూ వెళ్ళాను.

చాలా ఎత్తు ఎక్కిన మీదట నా ప్రయాస ఫలించింది. దూరాన యేదు రెండలో మనుషులు కనిపించారు. వాళ్ళొక చరియమీద కూర్చుని ఏదో చేస్తున్నారు. నాకు తట్టలేదుగాని వాళ్ళను కనిపెట్టటానికి నేను వీలయినంత ఎత్తుకు ఎక్కటం తప్ప మరో మంచి ఉపాయం లేదు. అడవుల్లో కూడా చాలా దూరం

కలియచూడాలంటే సమీపంలో ఉండే ఎత్తయిన చెట్టెక్కుతారు. ఈ సంగతి లక్ష సార్లు చదివాను. కాని చదివినవి జీవితంలో ఉపయోగపడటం చాలా అరుదు.

నేను మెల్లిగా వాళ్ళను చేరుకుని అందరిచేతుల్లోనూ సిగరెట్లు వెలుగు తూండటం చూసి పెద్ద నిట్టూర్పు విడిచాను. వాళ్ళు డబ్బులుపెట్టి పేకాడుకుంటూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

"ఏమండీ, మీ దగ్గిర నిప్పెట్టె ఉంటే ఇస్తారా? మేం వంట చేసుకోవా" అన్నాను.

"ఇంతకు ముందు ఆడవాళ్ళతో వచ్చింది మీరేనా? .... ఉన్నది రెండే నిప్పెట్టెలు" అన్నాడొకడు, అందులో ఒకటి నాకిస్తే వాళ్ళకు భవిష్యత్తు లేకుండా పోయేట్టు.

"నాలుగు పుల్లలివ్వండి చాలు. బంగళా కింద ఖాళీ నిప్పెట్టె చూశాను" అన్నాను.

వాళ్ళు నాకు అరడజను పుల్లలిచ్చారు. వాటిని భక్తిగా అందుకుని జేబులో పెట్టుకుని - బంగళాకు సులువుగా - అంటే పాకకుండానూ, దేక కుండానూ - వెళ్ళేదారి వాళ్ళు చూపిస్తే, ఆ దారిన బయలుదేరి బంగళాకు చేరుకున్నాను.

ఇంక ఖాళీ నిప్పెట్టె వెతికేపని ఉన్నది. అదెక్కడో పారేశాను. ఎంత సేపు చూసినా కనపడిచావలేదు. నన్ను చూస్తే నాకే మహా మండిపోయింది. చివరికది దొరకడానికి యే పది నిమిషాలో పట్టింది. మళ్ళీ ఒక పెద్ద నిట్టూర్పు విడిచి భక్తిగా ఆ ఖాళీ పెట్టెను తీసుకుని, అందులో అరడజను నిప్పుపుల్లలూ భక్తిగా పెట్టి, వెదుళ్ళకేసి బయలుదేరాను.

సగం దారిలో ఆర్తనాదం వినపడింది. ఆడగొంతు - నాకు గుండెగుభేలు మన్నది. ఏం జరిగింది? ఆ కేక మా మకాం నుంచే వచ్చింది. పరిగెత్తి చెరువు దగ్గిరికి చేరాను. నాకు కళ్ళు సరిగా పనిచెయ్యటం లేదు. సుందరమ్మగారు తడి బట్టలతో నిలబడి వుండటమూ, డాక్టరుగారు నీటికేసి చెయ్యి చాచి, "నర్సు మునిగిపోతున్నది! సూర్యం, ఎట్లా?" అనటమూ లీలగా జ్ఞాపకం ఉన్నాయి. ఆక్షణంలో చొక్కావిప్పి పక్కనపడేసి, పైజామాతోనూ, బనీనుతోనూ చెరువులోకి దూకాను. అద్దంలాంటి నీరు - నర్సు ఆకారం నీటిమట్టానికి కొంచెం దిగువగా కనిపిస్తున్నది. రెండు బారలువేసి ఆమెను చేరుకుని, నర్సుని పట్టి పైకెత్తాను. కాని మరుక్షణం ఇద్దరం మునిగాం. ఈసారి నర్సును నాకన్న పైకెత్తి నామీద వేసుకుని, నీటిలో వెల్లకిలా పడుకున్నాను. నేను తేలివుండగా నర్సు మునగడానికి వీలుండదు. కాకపోతే ఒడ్డు కీదటానికి కాళ్ళే ఉపయో

గించాలి. అదంత కష్టంకాదు. అర నిమిషంలో ఇద్దరమూ వచ్చి లోతులేని నీళ్ళలో చతికిలపడ్డాం. అస లా చెరువంతా ఎంత - కొండలమధ్య పెద్దగొయ్యి. ఇవతలి చివర లోతు చాలా తక్కువ. నీటికి రెండడుగుల లోతున విశాలమైన చట్రాయి వున్నది. దానవతల పది పన్నెండడుగుల లోతు. అవతలి చివర ఏ ఇరవై అడుగులో ఉంటుందేమో కూడాను. అటువేపు కొండ నిటారుగా ఉండటంచేత అటునుంచి చెరువులోకి దిగటానికీ, ఎక్కటానికీ లేదు.... కాని, గట్టిగా ముప్పై అడుగులు వెడల్పులేని ఆ గుంటలో మనిషి చావవచ్చు, ఈత రాకపోతే.

చిత్ర మేమంటే, నర్సు అటే నీరు మింగలేదు. గిల గిల తన్నుకోలేదు. ఎక్కడో సైన్సు పుస్తకంలో చదివిన ప్రకారం, తల వెనక్కు బాగా వాల్చేసి మొహం నీటిపైన తేలేటట్టు చెయ్యడానికి కూడా ప్రయత్నించిందట! చిత్రమైన మనిషి! పుస్తకజ్ఞానం అనుభవం లేకపోతే ఎందుకూ పనికిరాదని నర్సుకూ్కడా ఆ గంటలోనే తెలిసివచ్చింది.

నే నెంతసేపటికీ తిరిగి రాకపోయేసరికి, వూరకే ఉండటం దేనికని ముగ్గురూ స్నానాలు చేద్దామనుకున్నారుట. డాక్టరుగారికి ఈతరాదు. ఆయన చెరువులోకి జాగ్రత్తగా దిగి, లోతులేని ప్రాంతం విశాలంగానే ఉన్నట్టు తెలుసుకొని, స్నానం చేసి వచ్చేశాడు. తరవాత ఆడవాళ్ళు వెళ్ళారు స్నానానికి. అటే దూరం వెళ్ళవద్దని ఆయన వాళ్ళతో చెప్పాడు. నర్సు ఎంతో దూరం వెళ్ళలేదుట; అయినా అందని లోతులో దిగబడిపోయింది.

"నీ కీత రాకపోతే ఇవాళ యేమై ఉండును!" అన్నది సుందరమ్మగారు.

"నేనా! తెనాలి బెజవాడలమధ్య ఉన్న అన్ని కాలవల్లోనూ ఈదాను. ఒక్క బకింగ్‌హామ్ కాలువలో తప్ప!" అన్నాను.

"అయినా ఈ కొండ కోనేళ్ళు చాలా డేంజరస్. కొన్నేళ్ళ కిందట కొండపల్లి కొండలమధ్య మడుగులో ఈత వచ్చినవాడే పోయాడు. ఎంతలోతుందో చూడాలని అడుక్కు వెళ్ళాట్ట. పాదం రాళ్ళ సందున ఇరుక్కుపోయింది. శవం ఎందుకు తేలలేదా అనుకున్నారు. తరవాత మనుషులు వచ్చి నీటిలోనుంచి శవాన్ని పైకి లాగడానికి ప్రయత్నిస్తే అది ఒకంతట రాలేదు" అన్నాడు డాక్టరుగారు.

ఆ సంఘటన గురించి ఇంతకన్నా పెద్ద రాద్ధాంతమేమీ జరగలేదు. పది నిమిషాల్లో అనంతరం దాన్ని గురించి మాట్లాడటం మానేశాం. అరగంట తరవాత నేను దాన్ని గురించి ఆలోచించటం కూడా మానేశాను.

నేను నర్సును నీటిలోనుంచి పైకి లాగటంలో రొమాన్సున్నదని నా కప్పుడే కాదు, మనికొన్ని రోజులకుగాని తట్టలేదు. జీవితాన్ని వెనక్కు తిరిగి చూసుకుంటే గాని అందులోని రుచులు సరిగా తలకు పట్టవు. అందుకే కథకులు కథలన్నీ గతంలో వుంచి రాస్తారు.

ఒకరోజు రాత్రి నాకు ఆకస్మికంగా ఆ సంఘటన జ్ఞాపకం వచ్చి ఒళ్ళు పులకరించింది. నే నానాడు నర్సును కౌగలించుకున్నాను. నేను వెల్లకిలా ఈదుతున్నప్పుడు నర్సు నా పైన పడుకుని ఉన్నది. ఆమె శరీరమంతా నాకు తగిలింది. నా చేతులామె చుట్టూ ఉండిపోయాయి.

నర్సు నన్ను మొదటిసారి ఆకర్షించినది శీను పెళ్ళిలో పెళ్ళికూతురు వేషంలోనే అయినా, నాలో కోరికలు రేపినది ఆ రాత్రి నేను కొండవీడు సంఘటనను స్మరించుకున్నప్పుడు. ఆ తరువాత నేను నర్సుకేసి కోరిక లూరకుండా చూడలేకపోయాను.

నేనెంత దల్‌ఫెలోని! ఆ చెరువులో నర్సు స్పర్శసుఖం యెందుకు పొంద లేకపోయాను? ఇంకే మగాడైనా ఆ సుఖం గురించి ఆలోచించకుండా ఉంటాడా? ఉంటాడని నాకు తోచలేదు. అసలు నాకు నర్సుపైన కోరిక పుట్టడాని కింత కాలం పట్టునా? 'నర్సు నెప్పుడన్నా ప్రేమగా తాకావా?' అని దేవుడు నన్నడిగితే లేదని చెప్పాల్సిందే గదా! ఇప్పుడు నాకు నర్సు స్పర్శసుఖం కావాలనున్నది. లక్ష రూపాయలు సంపాదించటం ఎంత అసాధ్యమో అదీ అంత అసాధ్యమే! మళ్ళీ నర్సును ఏ జలగండం నుంచో కాపాడాలి! ఛీ!ఛీ! జీవితం—గోలీలాటలో నేను బొత్తిగా గురిలేని ఆటగాణ్ణి.

ఒక ఆదివారంనాడు మధ్యాహ్నం నర్సు నా గదిలోకి తొంగిచూసి, "నీ కోసం ఎవరో వచ్చారు" అన్నది. నర్సు నన్ను మీరని పిలిచేది కాదు. తన మొగుణ్ణవుతానని తెలీదనుకుంటాను.

ఎవరో క్లాసుమేటై ఉంటాడనుకుని ఆత్రంగా బయటికొచ్చాను.

"బాబుగారు తవర్ని రమ్మంటుండారు" అన్నా డెవరో నౌకరులాంటి మనిషి.

"ఎవ రా బాబుగారు?"

"సర్కిలుగా రింటికొచ్చిన బాబుగారేనండీ!"

"నన్నా? డాక్టరుగార్నా?"

"మిమ్మల్నేనండి!"

వాడు నా తెలివితేటలను శంకిస్తూ నవ్వాడు.

"ఉండు, చొక్కా వేసుకొస్తాను."

తీరా వెళ్ళి చూద్దును గదా, ముసలాయన! తనే సర్కిల్ ఇనస్పెక్టరు తండ్రి అయినంత దీమాగా వరండాలో పడక కుర్చీలో పడుకుని ఉన్నాడు. ఎక్కడి కొచ్చినా ఆయన కొక వరండా, ఒక పడక కుర్చీ తప్పవల్లే ఉంది.

"వచ్చావా? ఆ కుర్చీ దగ్గరకి లాక్కుని కూర్చో....ఏవంటుంది మా లక్ష్మి?" అన్నాడాయన.

లక్ష్మి అంటే నర్సని ఊహించడానికి నాకు పూర్తిగా ఒకటిన్నర సెకండ్లు పట్టింది.

"ఏమీ అనదు. అసలా పిల్ల బుర్రలో ఏ మాలోచనలున్నదీ ఆ ఈశ్వరుడికే తెలియాలి" అన్నాను.

"నీ పని నువు చేస్తున్నావు కదా? చీమలు పాకితే రాళ్ళరుగుతాయట."

"నిజమే ననుకోండి . .కాని ఈ సందర్భంలో చూడండి. డబ్బుమీద భ్రాంతిలేని పాషండుల్ని పంచుకురావటం మహాకష్టం. నే నేనాడనగా ఆ క్రిమిచ్చాను!"

"మధ్యలో క్రిమంటా వేమిటి?" అన్నాడాయన చిరాగ్గా. "డబ్బు భ్రాంతి లేనివాళ్ళంటూ ఎక్కడా ఉండరు. నీ తల వెంట్రుక లంతమందిని చూశాను. ఆధి అన్నం తినదూ? బట్ట కట్టదూ? చదవదూ? పుస్తకాలు కొనదూ? తలకి కొబ్బరి నూనెన్నా రాస్తుందిగా? ఇదంతా డబ్బు లేకుండానే అవుతున్నదా?"

నేను శాంతంగా, చిన్నపిల్లవాడికి ఒకటో ఎక్కం చెబుతున్నట్లుగా, "పంతులుగారూ, మీకు తెలిసినదాన్లో నాకు నూరోవంతు తెలీదు. ఒప్పుకుంటాను. డబ్బుతో అవసరం ఉండటానికీ, డబ్బుమీద భ్రాంతి ఉండటానికీ లక్ష తేడా ఉంది. పెళ్ళాడిన వాళ్ళంతా పెళ్ళాం వ్యామోహంలో పడిపోతున్నారా? మీ అబ్బాయివాళ్ళ అవసరాలుకూడా గడవనంత బీదిగా ఉన్నారని మీరేమన్నా అనుకుంటున్నారేమో! అది పొరపాటు. వాళ్ళ అవసరాలకు సరిపడా వాళ్ళ దగ్గిర డబ్బుంటూనే ఉంది. అందుచేత నా సలహా ఏమంటే-"

"ఒంటిమీద ఒక్క మంచి బట్టగాని, ఒక నగగాని లేకుండా ఉండట మేనా అవసరాలు తీరటం?"

"- అందుచేత నా సలహా ఏమంటే. మీరు డబ్బుమీద ఆటే స్ట్రెస్ చెయ్యకండి! మీరు మా లక్ష్మికి - అదే నర్సుకు - తాతగారు. తాతగారి కుండదగిన వాత్సల్యం మీలో ఉన్నది; అది నాకు తెలుసు. ఆడవాళ్ళకి - అందులోనూ డబ్బంటే లక్ష్యం లేనివాళ్ళకి - ఆపేక్ష అంతఃకరణాల్లపైన చాలా భ్రాంతి ఉంటుంది. నాకిన్నేళ్ళు వచ్చాయా? మా బాబాయిగాని, మా సుబ్బక్కగాని-"

"అసలు విషయం వదిలేసి ఏమిటో మాట్లాడుతావేం?"

"-మా సుబ్బక్కయ్యగానీ, 'అయ్యో ఎంత చిక్కిపొయ్యావురా! తిండిసరిగా లేదు గావాలు!" అంటే చాలు ప్రాణం లేచివచ్చినట్టుంటుంది."

తెరిచిన నోరు మూయకుండా ఆయన నాకేసి కాస్సేపు చూసి "నీ వాలకం చూస్తే నా పైన దాని మనసు నువ్వే విరిచేస్తున్నట్టున్నావే. తనకు రావలసిన ఆస్తి తన కూతురు కొస్తుందంటే నా కొడుక్కి కూడా ఇంత-ఇంత ఇన్‌డిఫరెన్సుండదు" అన్నాడు.

"నన్ను బొత్తిగా అన్యాయం చేస్తున్నారు. మిమ్మల్నీ మీ మనువరాల్నీ కలిపితే-నాకే లాభం గదండి, రేపు మీ రెకమండేషన్‌తో మంచి ఉద్యోగం సంపాదించుకోవచ్చు కూడా గదా!"

ముసలాయన ఈ మాటకు సంతోషించినట్టు కనబడ్డాడు. ఆయన కుట్రదారు గొంతుపెట్టి, "చూడు, దాన్నొక్కసారి ఇక్కడికి రమ్మంటావ్! వాళ్ళకి తెలీకూడదు సుమా! అయిదే అయిదు నిమిషాలు మాట్లాడుతాను. ఆఁ?" అన్నాడు.

నా కాయన వాలకం చూస్తుంటే ఏవో భయం వేసింది. నర్సును రానిచ్చి, దాని గొంతు కాస్తా పిసికేసి సర్కిల్‌తో శవాన్ని మాయం చేసెయ్యమని చెప్పేసి, బెజవాడ బండి ఎక్కేస్తాడేమో? అసలే కింగ్‌లియర్‌లాటి మనిషి; అటువంటివాడి ప్రేమ దారుణమైన కోపంగా మారటమూ, పిచ్చెత్తటమూ అసంభావ్యం కాదు.

"ట్రై చేస్తానండీ! ఇంక నేను వెళ్ళనా?" అన్నాను.

"త్వరగా వెళ్ళుమరి. నేనిక్కడ యింకో అరగంటే ఉంటాను. ఊళ్ళో కొంచెం పనిచూచుకుని రైలు పట్టుకోవాలి" అన్నారాయన.

నేను తిరిగి వచ్చేసరికి నర్సు బయటి పాకలో నులకమంచం వాల్చుకుని పడుకుని ఇంగ్లీషు ప్రోజో ఏదో చదువుతున్నది.

"ఆ వచ్చినవాడు సర్కిల్ గారి నౌకరుకాదూ?" అని ఆమె అడిగింది.

"అవును. మీ తాత వచ్చి అక్కడ కూర్చున్నాడు. నీతో అయిదు నిమిషాలు మాట్లాడాలిట. నన్నడిగితే ఆయనకు కాస్త మతి సరిలేదేమో నంటాను."

నర్సు మొహంలో ఎటువంటి వికారమూ లేదు. మళ్ళీ పుస్తకం చదవ సాగిందామె.

నేను లోపలికి వెళ్ళి నా గదిలో పడుకున్నాను. డాక్టర్‌గారు పడకగదిలో పడుకుని కునుకు తీస్తున్నాడు. సుందరమ్మగారు దొడ్లో అంట్లో కంచాలో తోముతున్న చప్పుడవుతున్నది.

నే నేదో నవల తీసుకుని కళ్ళతో చదువుతూ, మనస్సులో నర్సును గురించి ఆలోచిస్తున్నాను. అవకాశం బాగున్నది. నేను మళ్ళీ బయటికి వెళ్ళి పాకలో పడుకున్న నర్సును ఒకసారి ముద్దు పెట్టుకుంటే ఏమవుతుంది? కెవ్వున

అరుస్తుందా? ఎందుకరవాలి? నేను తన ప్రాణం కాపాడానే! ఆపాటి కృతజ్ఞత ఉండకూడదా? మనుషులెంత కృతఘ్నులూ!

అప్పుడే నేను నర్సును ముద్దు పెట్టుకున్నట్టూ, నర్సు కెవ్వున అరిచినట్టూ, డాక్టరుగారూ, భార్యా పరుగెత్తుకుంటూ వచ్చినట్టూ, నా దౌర్జన్యం గురించి పత్రికల్లో నా ఫోటోతో సహా పడినట్టూ అనిపించి నాకు సిగ్గూ, అవమానమూ, విరక్తీ కలిగాయి.

"అమ్మాయ్! నర్సూ!"

సుందరమ్మగారు దొడ్లోనుంచి పెట్టిన ఈ కేకతో నేను ఊబిలోనుంచి బయటపడ్డాను.

బయటినుంచి నర్సు పలకలేదు. చదువుతూ చదువుతూ నిద్రపోయిందేమో నని బయటికి వచ్చాను - లేపి, మీ అమ్మ పిలుస్తున్నదని చెప్పటానికి.

నర్సు పాకలో లేదు. ప్రోజ్ రీడరో ఏదో నులకమంచం మీద పెట్టి ఉన్నది.

నా గుండె గుభేలుమన్నది. నర్సు ఆ ముసలాయన దగ్గిరికి వెళ్ళిందా, తల్లికీ తండ్రికీ చెప్పకుండా! ఆ పిల్లలో ఇటువంటి కూబివేషా లున్నట్లు నేను కలలో కూడా ఊహించలేదు.

తలవాకిలి తలుపులు చేరవేసి వున్నాయిగాని, గడియపెట్టిలేవు. తలుపులు తెరిచి వీధిలోకి తొంగిచూశాను. నర్సు ఏదో ఆలోచిస్తూ తిరిగి వస్తూన్నది - తాత దగ్గరనుండే! నన్ను చూసి గబగబా నడిచివచ్చింది.

నేను పళ్ళు బిగబట్టి రహస్యంగా, "మీ అమ్మ కేకేసింది త్వరగా వెళ్ళు!" అంటూ వీపుమీద ఒక్కటి వేశాను. ఎవరికీ చెప్పకుండా ముసలాయన్ను చూడ బోయినందుకు శిక్షగా.

నర్సు వెనక్కు తిరిగి అదో విధంగా చూసింది - కోపంతోమటుకు కాదు. బతుకు జీవుడా అనుకున్నాను.

అయిదు నిమిషాలలో నర్సు తిరిగి వచ్చినదాకా నేను పాకలో బెంచీమీదే కూర్చున్నాను. ముసలాయన సీక్రెట్ ఏజంటుగా ఆయన పని ఒక్కటి చేసిపెట్టాను. ఆయన ఏమన్నాడో తెలుసుకోవాలని నా మనసు కొట్టుకుపోతున్నది. సీక్రెట్ ఏజం టయిన తరవాత రహస్యాలన్నీ తెలుసుకోకపోతే ఎట్లా?

నర్సు తిరిగివచ్చి మంచంమీద కూచుంటూ, "గిన్నెలు తోలిచి ఇస్తానేమోనని అమ్మ పిలిచిందట!" అన్నది.

"గిన్నెలమాట కేంలే? ఏమంటాడు?"

"ఏమంటాడు? కంటతడి పెట్టుకున్నాడు. అంత పెద్దవాడు కళ్ళు తుడుచు కుంటుంటే నాకు చాలా కష్టం వేసింది ... నాన్నకు చాలా అన్యాయమే చేశాడు.

గాని....నేనంటే పడి చచ్చిపోతున్నాడు. పాపం. కాని నేనేం చెయ్యగలనూ? నన్ను వచ్చి తనదగ్గిర ఉండమంటాడు" అన్నది నర్సు.

"మీ అమ్మనూ, నాన్ననూ వదలిపెట్టా?" అన్నాను ఆశ్చర్యంగా.

"పెళ్ళయితే అత్తారింటికెళ్ళిపోవా? ఆడపిల్లికి 'అమ్మా, నాన్నా శాశ్వతమా?' అని అడిగాడు."

"ఏమన్నావ్?"

"పెళ్ళయేది, పిల్లలు పుట్టేది, మా అమ్మా, నాన్నా నా దగ్గిర ఉండాలిసిందే నన్నా."

"అసలు విషయం అదికాదు. నీతోబాటు మీ అమ్మనూ, నాన్ననూ తన దగ్గిరి కెందుకు రమ్మనడో అడక్కపోయావా?"

"అడగలేదు.... మా నాన్న మీద విరోధం కట్టాడుగా?"

"పిచ్చిదానా, ఆయనకు మీ నాన్నమీద ప్రేమలేకుండా నీ పైన మాత్రమే పుట్టుకొచ్చిందంటే నమ్మావా? ఆయన నుంచేగదా నువ్వు ఆయన మనవరాలివి?"

"అయితే మమ్మల్నందర్నీ వచ్చి ఎందుకు తనదగ్గిర ఉండమనడూ?"

"అదే నువ్వాలోచించాలిసింది. నిన్ను బంగారంతో కప్పుతానంటున్నాడు గదా! మీ అమ్మనూ, నాన్ననూ పోషించటం ఆయనకు కష్టమవుతుందా? ఎన్నటికీ కాదు. నీకోసం ఏడవటానికి సిద్ధంగా ఉన్నవాడు నువ్వొక్కతివే రావాలని భీష్మించుక్కూచోకపోతే, నీ వెంట ఉండటానికి అర్హులైన వాళ్ళిద్దర్నీ కూడా ఎందుకు రమ్మన గూడదూ?"

"అదే నాకూ అర్థంకాలేదు."

"నర్సూ, ఆయనకు నీ మీద ఉన్న ప్రేమ కపటమైన దనటానికి నాకు గుండె చాలదు గాని, ఒక్కటి రూఢిగా చెప్పగలను. నీ మీద ప్రేమకంటేకూడా ఆయన దురహంకారం బలమైనది. నిన్ను నీ తల్లిదండ్రుల నుంచి వేరు చెయ్యలేకపోవటం చేత ఆ దురహంకారం దెబ్బతిని కన్నీరుగా బయటికివస్తున్నా నేనాశ్చర్యపడను. నే చెప్పేది అర్థమయిందా? ఇంకోటి చెబుతాను మనస్సులో ఉంచుకో. ఆయన అసలు ద్వేషం మీ అమ్మపైన. ఆవిడ పేరు చెబితే వాంతిచేసుకుంటాడు-చేసుకున్నాడు. ఆవిడ కారణంగానే మీ నాన్నపైన కత్తి కట్టాడు. ఆవిడను మీ నాన్న ఈ క్షణాన వదిలేస్తే మరుక్షణాన నిన్నొక భుజానా మీ నాన్న నొక భుజానా ఎక్కించుకొని డాన్సు చేస్తాడు."

నర్సు తల వంచుకుని, "నాకు తెలుసు. మా అమ్మక్కూడా తెలుసు" అన్నది.

నర్సుతో రహస్యం పంచుకున్న చనువుతో గడ్డం పట్టుకుని, మొహం పైకెత్తి, "నీ కోసం నేనుకూడా ఏడవగలను. కాని నిన్ను ఘోరమైన పన్లేవీ చెయ్య

మనను. ముసలాడి మాయలో పడకు, మంచి ముహూర్తం చూసి నా మాయలో పడుదువుగాని" అన్నాను.

నర్సు నా చేతినుంచి తల విదిలించేసుకున్నది.

# 6

డాక్టరుగారికి ప్రాక్టీసు బాగా తగ్గిపోయింది.

"ఏ ప్రాక్టీసున్న డాక్టరైనా అసిస్టెంటుగా పెట్టుకుంటే సంతోషంగా ఉంటాను. నెలకో వంద ఇచ్చినా చాలు. నెలకు పది, పది హేను వందలు సంపాదించే డాక్టర్లున్నా రీ వూళ్ళో" అన్నాడాయన.

"ఆ మాట తెలియాల్సిన వాళ్ళ కెట్లా తెలియాలి?" అన్నాను.

"నేను కొందరితో మాటవరసగా చెప్పి ఉంచాను. రూరల్ డిస్పెన్సరీ ఏదన్నా టేకప్ చెయ్యటానికి కూడ సిద్ధంగానే ఉన్నాను. చూస్తాం. అంత గండ గత్తరేమీ లేదు."

డాక్టరుగా రొకప్పుడు మనిషిలో ఉండే స్పిరిట్ గురించి చెప్పాడు. నాలో కూడా ఇప్పుడొక స్పిరిట్ బయలుదేరింది. ఊళ్ళో బాగా డబ్బున్న రోగుల దగ్గిరికి వెళ్ళి, "మా డాక్టరుగారి చేత వైద్యం చేయించుకోండి. అంతకన్న మంచి డాక్టరు జిల్లాలో లేడు" అని కాన్వాస్ చేద్దామనిపించింది. లేకపోతే ఒక ప్రైవేటు ఆస్పత్రి కట్టించి దాన్ని డాక్టరుగారి కిచ్చేద్దా మనిపించింది. కనీసం ప్రాక్టీసున్న డాక్టర్ల దగ్గరికి వెళ్ళి, డాక్టరుగారితో జాయింటు ప్రాక్టీసు పెట్టుకో మని హెచ్చరిద్దామనిపించింది. ఏమైనా నా స్పిరిట్ అంతా కలిసి డాక్టరు కొక చిన్న గజ్జిబిడుము కేసుకూడా ఇప్పించలేదన్నది స్పష్టమయింది. సృష్టిలో బోలెడన్ని రోగాలున్నాయి—క్షయా, రాచపుండూ, గుండెజబ్బూ, పక్షవాతమూ, ధనుర్వాతమూ, గుర్రపువాతమూ, కడుపులో పుళ్ళూ, గర్భకోశంలో పుళ్ళూ, సిఫిలిసూ, గనేరియా, ఉబ్బసమూ, ఇంకేమిటో ఉన్నాయి. వందలాది మనుషులకు ఈ రోగాలు వచ్చేసి, అందులో కనీసం కొందరైనా డాక్టరుగారి దగ్గిరికి రాకూడదూ?

నా స్పిరిట్ అట్లా ఆలోచించింది.

ఎటు చూసినా నిరాశే కనిపిస్తున్నది. "నేనీ ఫిఫ్తుఫారం తప్పకుండా తప్పుతాను" అని చెప్పేసింది నర్సు ఆఖరు పరీక్ష రాసొచ్చి.

"నాకు ఫస్ట్‌క్లాసు మార్కులొచ్చే సూచనలేవీ లేవు.... ఈసారి సెలవుల్లో మావాళ్ళు నన్ను పెళ్ళి చేసుకోమని థర్డ్ డిగ్రీ పెడతారు. నేనందరికీ విరోధి నవుతాను... వచ్చే జూలైలోనో ఆగస్టులోనో గుంటూర్లో కలరా ప్రగలేస్తుంది - ఇట్

విల్ బ్రేకౌట్....ప్రపంచయుద్ధం కూడా రావచ్చు" అన్నాను వీపింగ్ ఫిలాసఫర్ ధోరణిలో.

శలవు లిచ్చెయ్యగానే రమ్మనీ, బోలెడన్ని వ్యవహారాలు మాట్లాడాలనీ మా బావ రాశాడు. ఆ ఉత్తరాన్ని బుట్టదాఖలా చేసి ఉందును. కాని నేను డాక్టరు గారింటి నుంచి మకాం ఎత్తెయ్యవలసిన పరిస్థితి వచ్చింది - ఆయన కోరుకున్న రూరల్ డిస్పెన్సరీ పని లభ్యమయింది; ఆయనే గుంటూరునుంచి మకాం ఎత్తేసి వెళ్ళి పోతున్నాడు.

"శలవులంతా మీ బంధువులతోనే గడిపెయ్యకు. మే ముండే చోటకూడా కొన్నాళ్ళుండొచ్చు. వేసవిలో ఒక్కో ఏడు మంచి నీళ్ళు దొరకవుటగాని మంచి పల్లె టూరేనని విన్నాను" అన్నాడు డాక్టరుగారు నాతో.

పార్టింగ్ గిఫ్ట్ కింద నర్సు నాకు హేండ్‌షే కిచ్చింది - రహస్యంగా కాదు, బహిరంగంగానే.

పెట్టేబేడా తీసుకుని బస్సెక్కి గుంటూరు దాటగానే సినిమా చూసి బయటికి వచ్చినట్టుగా నా మనస్సు మరొక వాతావరణంలో పడింది. అందులో ఆశ్చర్యమేమీ లేదు. డాక్టరుగారింటి వాతావరణం విలక్షణమైనదే. మనం జీవితంలో ఒక విధమైన అష్టావధానం - మళ్ళా మాట్లాడితే సహస్రావధానం - చేస్తాం. కొత్త చోటికి వెళ్ళి నప్పుడల్లా ఒక కొత్త చిత్తవృత్తి మనలో మొలకెత్తుతుంది. పాతచోటు వదిలేసి కొంతకాలం ఎటో వెళ్ళి తిరిగివస్తే, ఆ చోటుకు సంబంధించిన భావాలు ఎక్కడ వదిలేశామో అక్కడినుంచి మళ్ళీ ప్రారంభమవుతాయి. కాలేజీలాటిది కూడా శుక్ర వారం ఎక్కడ వదిలామో సోమవారం అక్కడే అందుకుంటాం. మధ్య శని ఆది వారాలు మరొక కథ, మరొక గ్రంథం.

మా బావ చాలా పెద్దజిడ్డు పట్టించాడు.

"ఒరే, మనం రెండేళ్ళ క్రితం దొరపొగాకు వేశాం చూడూ, అందులో ఈ యేడు మళ్ళా చెరుకు వేయించా. చెరుకెందుకు గిట్టదో. దాని అంతు తేల్చాలనిపిం చింది. ఈసారి ఫరవాలా. పసుపుకూడా బాగానే అయింది. దుగ్గిరాలవాళ్ళే కొన్నారు. జనుమే అంత బాగా కాలా. విత్తనం మంచిది దొరకలా..."

అది అసలు జిడ్డుకాదు. అసలుజిడ్డు నా పెళ్ళికోసం బావ తహతహలాడి పోతున్నాడు. వాళ్ళవాళ్ళలో ఎవరో ఇద్దరాడపిల్లలు పెళ్ళికున్నారట. ఇద్దరినీ చూసి వాళ్ళలో ఎవరు నచ్చితే వాళ్ళను చేసుకోమన్నాడు.

"బావా, నీకేమన్నా వెర్రా? బ్రహ్మదేవుడు వెయ్యంది ముడి పడదు. మన ప్రయత్నాలన్నీ వృధా. కళ్యాణం ఘడియ వానంతట అదే తోసుకొస్తుంది. కళ్యాణం వచ్చినా, కక్కొచ్చినా ఆగదుట."

"ఈ పోసుకోలు కబుర్లు నాకూ తెలుసులేరా! తాతకు దగ్గులు నేర్పుతావేం?" అన్నాడు బావ.

ఆయన పోరు పడలేక, "చూతాంలే," అన్నాను.

"అయితే బయల్దేరు. ఒక పిల్లి దగ్గర్లోనే ఉంది" అంటూ బావ పైపంచ దులిపి మీద వేసుకున్నాడు.

బయలుదేరాను చచ్చినట్టు. తాటాకుల దడి ఉన్న ఒక ఇంటికి తీసుకుపోయాడు. పెంకుటిల్లు. అదేదో అవిభక్త కుటుంబంలాగుంది. ఇంటినిండా జనం. కనీసం నాలుగు తరాలవాళ్ళు కనిపించారు-రకానికి యిద్దరు మొదలుకుని ఏడెనిమిది మందిదాకా.

"పైకి కనిపించరుగాని, పెద్ద ఆస్తిపరులు. నూరెకరాల పైబడ్డ ఆస్తి. ఐదారేళ్ళ క్రితం డబ్బుకాటకం వచ్చింది చూడూ, అప్పుడు బాకీదార్లకింద వొడుచుకున్న ముదనష్టమే ముప్పై ఎకరాలదాకా ఉంది" అన్నాడు బావ రహస్యంగా.

"పంచుకుంటే తలా రెండెకరాలూ రాదు" అన్నాను.

బావ గట్టిగా, "ఆఁ ఏం, రావయమావా? వీడే మా బావమరిది" అని ఎవరితోనో అన్నాడు.

'రావయమావ' మమ్మల్ని ఆహ్వానించి లోపలికి తీసుకుపోయాడు. పిల్లదివచ్చి పాతంరాని విద్యార్థిలాగా తలవంచుకుని నామ్ముందు నిలబడింది. తల వంచుకోవటంలో 'సిగ్గు' ఉండనవసరంలేదని తెలుసుకున్నాను. ఆ పిల్లకు ఏ పన్నెండేళ్ళో ఉండొచ్చు.

"వీణ్ణి పెళ్ళి చేసుకుంటావుటే?" అని బావ ఆ పిల్ల నడిగాడు.

"ఫో!" అంటూ ఆ అమ్మాయి తల ఎత్తకుండానే నవ్వింది. బుగ్గలు పొట్టలు పడ్డాయిగాని, చూడటానికా సొట్ట లేమీ సొంపుగాలేవు.

"ఏంరా, చూశావుగా? అదీ ఉన్నసరుకు. ఇక నువుపోయి నీ పని చూసుకోవే."

తిరిగి వచ్చేటప్పుడు బావ "పిల్ల బాగానే ఉందికదూ?" అన్నాడు.

"ఎవరికో నిక్షేపమంటి ఇల్లాలవుతుంది" అన్నాను.

"ఏమిటీ?" అన్నాడు బావ, నా మాట అర్థంకాక.

"నాకింకా పెద్ద పిల్ల కావాలి, బాగా ఏపైన పిల్ల! నా సంగతి ఇప్పుడెట్లా ఉందో నీకు తెలియదు" అన్నాను.

"ఓరి పిడుగా!" అన్నాడు బావ.

నాకా నందివెలుగులో ఒక్కపూట గడవటమే ఎంతో కష్టమయింది. మళ్ళా వస్తానని చెప్పి పెట్టే, బేడా తీసుకుని తెనాలి చేరుకున్నాను. అక్కడ

ఎన్నాళ్ళు గడపగలనో నాకర్థం కాలేదు. ఇంత విశాల ప్రపంచంలో నా వేసవి శలవలు గడపటానికి తగిన చోటులేదు!

అయినా తెనాల్లో నాకు బాగానే గడిచింది. వేసవి ఎక్కడైనా తీవ్రంగానే ఉంటుందిగాని, గుంటూరు బెజవాడకన్న తెనాలి చాలా నయం.

మా బాబాయివాళ్ళ యింటి కెదురుగా ఒక రచయిత ఉన్నాడు. అతను కథలు రాస్తూంటాడు. గుంటూరులో రాతగాళ్ళ వాతావరణం నాకంతగా కని పించలేదుగాని తెనాల్లో బాగా కనిపించింది. పద్యాలు రానేవాళ్ళూ, కథలు రానే వాళ్ళూ చాలా మంది ఉన్నారు. వాళ్ళలో కొందరిని చూశాను.

అంతదాకా నాకు పాశ్చాత్య సాహిత్యం మీదనే మోజుండేది. వీళ్ళను చూసి నాకు తెలుగు సాహిత్యం మీదకూడా ఏదో అభిమానం పుట్టుకొచ్చింది. వీళ్ళు మపాసా[1] లాగా, మామ్[2]లాగా రాయకపోవచ్చుగాక - వాళ్ళొచ్చి తెలుగులో సాహిత్యం సృష్టిస్తారా!

వాళ్ళందరికీ చలమంటే[3] గౌరవం ఉంది. ఆయనా తెనాలివాడేట. ఎదురింటి శేషాచలం దగ్గిర చలం పుస్తకం ఒకటి తీసుకున్నాను చదువుదామని.

---

1. మపాసా (1850-1893) : ప్రఖ్యాత ఫ్రెంచి రచయిత. 300 కథలు రాశాడు. మనస్తత్వ పరిశీలకుడు. విశ్లేషణకారుడు కాదు. ఇంద్రియాను భూతుల చిత్రణకు ప్రాధాన్యం ఇచ్చిన రచయిత. సంక్షిప్తత మపాసా కథా నిర్మాణ ధ్యేయం. యథార్థవాద రచయిత అని చెప్పవచ్చు.
2. విలియం సోమర్ సెట్ మామ్ (1874-1905): బ్రిటిష్ నాటక కర్త. ముందు పేజీల్లో వివరాలు చూడండి.
3. గుడిపాటి వెంకట చలం (1894-1979) : స్త్రీ పురుష ప్రేమను ఒక లౌకిక చర్య, సుఖ సౌందర్యాన్వేషణలో ఒక గమ్యంగా భావించిన రచయిత. 1921 నుంచి రచనలు ప్రారంభించాడు. శశిరేఖ, దైవమిచ్చిన భార్య (1923), అమీనా (1924), మైదానం (1927), వివాహం (1928), అరుణ (1935), బ్రాహ్మణీకం (1937), జీవితాదర్శం (1948) మొద లైన నవలలూ, వందదాకా కథలూ, ఏడెనిమిది నాటకాలూ, యాభైదాకా నాటికలూ, అనేక వ్యాసాలు రాశారు. 1950కి ఈశ్వరుణ్ణి ప్రశ్నించినవాడు. ఆ తర్వాత ఈశ్వరాన్వేషకు దయ్యాడు. స్త్రీ విమోచన కోసం కలం పట్టిన తీవ్ర భావుకుడుగా, తెలుగు వచనా రచనకు వన్నె తెచ్చిన ఒక శైలీనిర్మాతగా వచన సాహిత్యాన్ని పరిపుష్టం చేశాడు. (మరికొన్ని వివ రాలకు చూడండి. కుటుంబరావు సాహిత్యం, మూడవ సంపుటం, పుట, 108, అయిదవ సంపుటం 'భావుకుల రచయిత కొకు' పుటలు IX-XXIV)

"చదవక చదవక ఆ బూతు కథలే చదువుతున్నావ్?" అన్నాడు బాబాయి.

"బూతులేని సాహిత్యం ఎక్కడుంది బాబాయ్? నీ బీరువాలో ఆ మను చరిత్రలు[1] ఏమిటి? బూతు కథలు కావూ"? అన్నాను.

"అవి అంత తేలిగ్గా అర్థమవుతాయా? వసుచరిత్రా,[2] ఆముక్తమాల్యదా[3] తీసి చదివి అర్థం చెప్పు చూస్తాం."

"అందుకే వాటికన్న ఇది మంచిది. ఇందులో ఉండే బూతు చక్కగా అందరికీ అర్థమవుతుంది."

బాబాయి కొంచెం ఆలోచించి "బూతు ఉంటే ఉంది, నీతి కూడా ఉండాలిగా! ఆ చలం కథల్లో నీతిలేదు" అన్నాడు.

"నీతి లేకేం బాబాయ్? ఉంది; నువ్వొప్పుకునే నీతి కాదేమో?"

"ఒప్పుకోవటానికి వీల్లేని నీతిని అవినీతి అంటారు. ఆమాత్రం తెలీదురా?" అన్నాడు బాబాయ్.

"నిజమే బాబాయ్, కాని ఒకరి నీతి ఒకరికి అవినీతి కావచ్చు. నన్నడిగితే పురాణాలన్నీ బూతు, అవినీతీనూ. కుంతి అడ్డమైనవాళ్ళకూ పిల్లల్ని కనటమూ నాకూ బాగా లేదు. వ్యాసుడు వెధవముండలకు కడుపులు చెయ్యటమూ, వాళ్ళ సంతానం దేవతాంశంతో పుట్టినవాళ్ళని చెప్పటమూ నా బుద్ధికి దారుణంగా వుంది. ద్రౌపదికి అయిదుగురు మొగుళ్ళు! ఈ చండాలమంతా ఉంది కనక భారతం సాహిత్యం కాదని నేసంటున్నానా? చలం కథల్ని నువ్వు కొట్టెయ్య కూడదు."

"అయితే ఈ దిక్కుమాలిన కథలను భారతంతో పోలుస్తావా?"

"ఎందుకు పోలుస్తానూ? భారతంలో ఉండే మనుషులూ, వాళ్ళ బుద్ధులూ, కష్టాలూ, సుఖాలూ, ఆచారాలు - ఏవీ నాకర్థంకావు. ఇందులో నాకు తెలిసిన మనుషులూ, జీవితమూ, బుద్ధులూ, ఆచారాలు ఉన్నాయి. నాకిదే మంచి సాహిత్యంగా కనిపిస్తుంది."

---

1,2,3. మనుచరిత్రలు అంటున్నప్పుడు ప్రబంధాలను దృష్టిలో ఉంచుకొని అవి బూతు కథలు అనే అభిప్రాయం పాత్ర వ్యక్తం చేస్తోంది. వసు చరిత్ర రామరాజ భూషణుడి ప్రౌఢప్రబంధం. ఆముక్తమాల్యద శ్రీకృష్ణ దేవరాయల ప్రౌఢకావ్యం. రెండింటిలోని ప్రౌఢశైలి వ్యాఖ్యానాన్ని ఆపేక్షించేది.

"నీతో మాట్లాడుతూ కూర్చుంటే అయినట్టే. అవతల పేపర్లు దిద్దుకోవాలి" అంటూ బాబాయి తప్పుకున్నాడు. నాకు ప్రశాంతంగా కూర్చుని "పాపం"[1] చదువుకునే అవకాశం దొరికింది.

ఆ పుస్తకం పూర్తిచేశాక నాక్కూడా కథలు రాయాలనిపించింది. నిజానికి చలం కథలు చదివి చాలామంది రచయితలై ఉండాలి. కొందరు రాసే కథలు గాలిలో కట్టిన పొగమేడల్లాగ ఉంటాయి. మరికొందరు లోకాన్ని ఉద్ధరించటానికిగాను పనిపెట్టుకు రాస్తారు. చలం తీసుకునే కథావస్తువులు ఉదాత్తంగా లేకపోవచ్చు. కాని వాస్తవంగా ఉంటాయి. పాత్రలు సహజంగా ఉంటాయి. వాటిని చదివేటప్పుడు ఈ లోకాన్ని విడిచి మరో లోకంలోకి పోనవసరంలేదు. జీవితం మీది మూతలు తీసి చూపిస్తారు చలం. కథలు రాసేవాడికి జీవితం గురించి ఒక స్పష్టమైన దృక్పథం ఉండటం రచనలకు బలమిస్తుందని చలం కథలు చదివి తెలుసుకున్నాను.

అక్కడే నా దౌర్బల్యం నాకు తెలిసివచ్చింది. జీవితం గురించి నాకే దృక్పథమూ లేదు. నీటిపైన బెండులాగా జీవితంలో తేలి ఉన్నాను. నీతిగా బతికేవాళ్ళంటే నా కిష్టమే. అవినీతిగా బతికేవాళ్ళంటే నాకు కోపం లేదు. నేను ద్వేషించేదల్లా ఒకరి నొకరు హింసించుకోవటమూ, పీడించుకోవటమూ ఒకరి సుఖాన్ని ఒకరు అపహరించటమూనూ.

కొన్ని కొంపల్లో మొగుడు పెళ్ళాలు అస్తమానమూ కీచులాడుకుంటారు. అటువంటిచోట నేను అయిదు క్షణాలుండలేను. జీవితంలో నాకు దుర్భరంగా తోచేవి అత్తలు కోడళ్ళను కాల్చుకు తినటమూ, ఆడబిడ్డలపోరూ, పిల్లల్ని హింసించటమూ, సవతితల్లి ఈర్ష్యా - ఇటువంటివి. వాటికి ఆధునిక జీవితంలో స్థానం లేదనీ, అవి లేకుండానే మనుషులు సుఖంగా జీవించవచ్చుననీ నా నమ్మకం. ఆస్తుల పంపకం తగాదాలూ, వ్యాజ్యాలూ, సాధింపులూ, అల్లుళ్ళ అలకలూ మొదలైనవి కూడా నాకు రోతే. నాకు రోత పుట్టించేవన్నీ అవాస్తవికంగా కూడా కనిపిస్తాయి. అవన్నీ సంప్రదాయం రూపంలో మనుషులు తగిలించుకునే సంకెళ్ళు. అల్లుడైనంత మాత్రాన అలగాలని ఎవరికీ సహజంగా తట్టదు. దిక్కుమాలిన సంప్రదాయం సంకెళ్ళులాగా చుట్టుకుని అల్లుడైనవాడిచేత అలిగింపజేస్తుంది.

---

1. చలం కథ. ప్రచురించినప్పుడు సంచలనం రేపి, చలంగారి 'పాపం ప్రజామిత్ర కోపం' అనే శ్రీశ్రీ పాదాలు స్మృతికితెచ్చే కథ.

నే నిటువంటి బంధాలలో చిక్కుకున్న వాణ్ణి కాను. బుద్ధెరిగినప్పటి నుంచీ నా సుఖానికి అవసరమైనంత స్వేచ్ఛను నే ననుభవిస్తూనే ఉన్నాను. నాపైన నేను పెట్టుకునే నిర్బంధాలు నిర్బంధా లనిపించుకోవుగద.

ఏమైనా కథలు రాయాలని నాలో గట్టిగా నిశ్చయం ఏర్పడింది. బాబాయి వాళ్ళ పట్టెల మంచం నాకు బాగా దొరికింది. కథ వ్రాసే వాడికి కలమూ, కాగితాలూ చివరిలో కావాలిసి ఉంటుంది. ఈ లోపల కథావస్తువు చూచుకోవాలి. సన్నివేశాలు అమర్చుకోవాలి. ముగింపు నిర్ణయించుకోవాలి. అదేదీ లేకుండా 40 పేజీల ఎక్సర్ సైజు బుక్కు ముందేసుకుని కథకు పేరు ఆలోచించటంతో కథా రచన ప్రారంభించాను. మంచి పేరు కుదిరితే కథ దానంతట అదే వస్తుందని, నా నమ్మకం.

రెండు వారాలపాటు బుర్రంతా పాడుచేసుకుని కాగితాలు ఖరాబు చేసి, ఇక నేను కథ రాయలేనన్న నిర్ణయానికి వచ్చాక కథ దానంతట అదే తట్టింది. పగటి అనుభవాలే రాత్రిపూట మరొక విధంగా కల వచ్చినట్టుగా ఆ కథ తయారయింది. వెంటనే ఒక ఎక్సర్ సైజు పుస్తకం కొనుక్కొచ్చి అందులో కథ రాసేశాను.

అది నర్సు కథే. కాని చాలా మారిపోయింది. నర్సు శ్యామల అయింది. శ్యామల తండ్రి కాలేజీలో చదువుకుంటూ తన స్నేహితుడి చెల్లెలిని, ఒక బాల వితంతువును రహస్యంగా ప్రేమిస్తాడు. వితంతువు గర్భవతి అవుతుంది. తప్పనిసరిగా ప్రేమికులు భార్యాభర్తలు కావలసి వస్తుంది. వారికి శ్యామల పుట్టుతుంది. శ్యామల తాతగారు ధనికుడు. వ్యాపారం చేసి లక్షలు గడిస్తాడు. (ఏ వ్యాపారం చేశాడో నేను చెప్పలేదు. ఏ వ్యాపారంలో లక్షలు గడించ వచ్చునో నాకు స్పష్టంగా తెలీక, దాన్ని పాఠకుల ఊహకు వదిలేశాను.) కొడుకు చేసిన పనికి మండిపడి ఇంటికి రానివ్వడు. తరవాత కొంత కాలానికి శ్యామల తండ్రి చనిపోతాడు. శ్యామల తాత ఒకనాడు వచ్చి తన మనవరాలిని మాత్రం తీసుకుపోతాడు. శ్యామల తల్లి ఏడుపు మహా హృదయవిదారకంగా రాశాలెండి. ఆమెకు ప్రపంచంలో వున్నదే ఒక్క కూతురూ....మాతృ హృదయం...,ఒక్క కూతురూ తనకు కాకుండాపోతే యింకేముంది? వగైరా, వగైరా. అయిందా? శ్యామల పెరిగి పెద్దదవుతుంది.

ఇన్నేళ్ళూ ఐశ్వర్యంలో ఓలలాడుతూ తల్లిని కూడా మరిచి పోయింది. తాతే సమస్తమూనూ. ఈ స్థితిలో శ్యామలను చూడడానికి తల్లి వస్తుంది. బిచ్చగత్తె అనుకుని కూతురు ఒక రూపాయి యిచ్చి పొమ్మంటుంది. (అణా ఇప్పింతామనుకున్నాను, కాని హీరోయిన్ చేత తన ఓన్ తల్లికి అణా ఇప్పించటం మరీ

హీనమనిపించింది. అందుచేత రూపాయి చేసేను. కావలిస్తే రాతప్రతి చూడండి. అణా అన్న మాట కొట్టేసి పైన రూపాయి అని రాసివుంటుంది.) ఆ తల్లి చేతుల్లో పడ్డ రూపాయి తేసి చూడదు. కళ్ళనీరు కారుస్తూ కూతురుకేసే చూస్తుంది. ఆ అభాగ్యురాలు కన్నీరు మూలంగా కూతురి మొహమైనా సరిగా చూడలేకపోయింది. తరవాత కొన్నాళ్ళకి ఆమె తన తల్లి అని శ్యామల తెలుసుకుంటుంది. ఆమె ఆ వూళ్ళోనే ఒక పూరి గుడిసెలో వుంటున్నది. (ఎట్లా బ్రతుకుతున్నది నేను చెప్పలేదు. ప్రపంచంలో బీదా బిక్కీ ఎట్లా బ్రతుకుతున్నారో ఎవరికి తెలుసు? ఎవరు విచారిస్తున్నారు?) ముఖ్యమైన విషయమేమంటే, శ్యామల తాతకు తెలియకుండా తల్లి వుండే గుడిసెకు వెళ్ళి తల్లిని కావలించుకుని "అమ్మా!" అని ఒక్క కేక పెట్టుతుంది. తాత పరవళ్ళు తొక్కుతాడు. శ్యామల కోసం వెతికిస్తాడు. పోలీసు రిపోర్టు యిస్తాడు. చివరకు శ్యామల ఎక్కడ వున్నదీ తెలుసుకుంటాడు. స్వయంగా వెళ్ళి శ్యామలను యింటికి వచ్చెయ్యమంటాడు. శ్యామల తల్లిని విడిచి రానంటుంది. తాతకు డీఫీట్! తల్లీ కూతుళ్ళ నిద్దరినీ తీసుకుపోతాడు. అంతా సుఖంగా ఉంటారు. క్లోజింగ్ డయలాగ్ ముసలాడిది:

"అమ్మా! నువ్వింత యోగ్యురాలివని తెలిస్తే నా కొడుకు బతికి వుండగానే మీ యిద్దరినీ తెచ్చి యింట్లో ఉంచుకుందునే!"

పాత్రలకూ, వాస్తవ వ్యక్తులకూ పోలికలేమీ లేవని మనవి చేస్తున్నాను. శ్యామలకూ, నర్సుకూ పోలిక లేదు. శ్యామల తల్లికీ సుందరమ్మగారికీ అసలు సంబంధమే లేదు, ఉండటానికి వీల్లేదు. రాసేటప్పుడు నా మనస్సులో అసలు వ్యక్తులుంటే కదా! అసలు వ్యక్తులంత తేలికగా అర్థం కారు. నర్సు ఆనాడు వాళ్ళ తాతను చూడటానికి ఎవరితోనూ చెప్పకుండా రహస్యంగా ఎందుకు వెళ్ళిందో నాకు తెలీదు. శ్యామల కథలో, వాళ్ళమ్మను ఎందుకు చూడబోయిందో నాకు తెలుసు. కథ చదివిన వాళ్ళకూ తెలుసు. నర్సుకన్న శ్యామల మరింత ఆకర్షవంతంగా వుండేటట్టుగా కథ రాశానంటారా? అనండి. అది వాస్తవం కూడా కావచ్చు.

ఒక్క నర్సునే కాదు, నన్ను కూడా నేను (కథకుడి రూపంతో) కాస్త మెరుగు దిద్దుకున్నాను. వాస్తవ జీవితంలో నన్ను నేను అర్థం చేసుకోలేకపోయాను. నర్సు తన తాతను కలుసుకోవటం నా కిష్టమా? కాదా? ఏమో? ఆమె తాతను చూడరాదని వుంటే, ఆయన సర్కిలుగారింట్లో వున్నట్లు చెప్పకుండా వుంటే సరిపోయేది. ఆ పని చేశాను కాను. కాని నర్సు నిజంగా వెళ్ళి ఆయనను చూసి రావటం నాకెందుకో అసంతృప్తి కలిగించింది. కథకుడుగా నాలో అటు

వంటి అయోమయమేమీ లేదు. నా భావాలూ, ఆదర్శాలూ, విలువలూ విస్పష్టమైనవి. నాలో వున్న లొట్టలు పూడ్చటానికే నేను కథకుణ్ణయానేమో!

నేను కథకుణ్ణయిన మాట నిజమే కదా! నా మొదటి కథ అచ్చువేసిన పత్రిక ఆ తరవాత కొద్ది మాసాలకే ఆగిపోయింది. ఈ లోపల నేను రెండు మూడు యితర పత్రికలలో ప్రచురించి కాలు నిలవదొక్కుకున్నాను.

మొత్తం మీద ఆ శలవల్లో నేను డాక్టరు గారుండే గ్రామానికి వెళ్ళలేక పోయాను. గట్టిగా తలుచుకుంటే వెళ్ళి వుందును. కాని తలుచుకో బుద్ధి పుట్టలేదు. డాక్టరుగారి ప్రభావానికి దూరమైనానన్న విచారంతోబాటు ఆ ప్రభావం నుంచి బయటపడి విముక్తుణ్ణి అయినానన్న సంతోషంకూడా కొంత లేకపోలేదు. ఆయన ద్వారా నాకు కొంత సంస్కారం అబ్బిందనటానికి సందేహం లేదుగాని, నా పెరుగుదల నిలిచిపోయి నట్టయింది. ప్రపంచంలో అనేక రకాల ప్రభావాలుంటాయి. వాటిలో ఒక్కదానికోసం మిగతావాటిని దూరంగా వుంచటం పెరుగుదలకు అడ్డం. నేను డాక్టరుగారింటనే వుంటే చచ్చినా కథలు రాయాలనిపించి వుండదు. డాక్టరుగారి జీవితంలో దుష్ప్రభావాలు లేవన్నమాటేగాని అది చాలా పరిమితమైన జీవితం. ఆ పరిమితిలోనే ఆయనకు జీవితానందం లభించవచ్చు. కాని నాకు లభిస్తుందా!

శలవల్లో ఒక పెళ్ళికి వెళ్ళాను. ఒక తిరపతి యాత్ర చేశాను. అటు నుంచి చెన్నపట్నం వెళ్ళాను. కాంచనమాలను[1] కారులో పోతుండగా చూసి గుర్తుపట్టాను. ఆంధ్రపత్రికా,[2] ప్రజామిత్రా[3] ఆఫీసులకు వెళ్ళాను. ప్రజామిత్ర

---

1. కాంచనమాల (1922-1981). ప్రసిద్ధ చిత్ర నటి. మాలపిల్ల చిత్ర కథానాయకి. ఆంధ్ర గ్రేటాగార్బో, ఊఫ్ గర్ల్ అని పేరుపొందిన సుందర నటి. విప్రనారాయణ (1937), మాలపిల్ల (1938), గృహలక్ష్మి (1938), బాలనాగమ్మ, వందేమాతరం (1939), మళ్ళీ పెళ్ళి (1939), ఇల్లాలు (1940) మొదలైన చిత్రాల్లో నటించింది.

2. ఆంధ్రపత్రిక: కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు స్థాపించిన పత్రిక. వారపత్రికగా (1908), వార్తాపత్రికగా (1914), మద్రాసులో పత్రిక కార్యాలయం తంబుచెట్టి స్ట్రీట్‌లో కథాకాలాన ఉండేది.

3. ప్రజామిత్ర గూడవల్లి రామబ్రహ్మం సంపాదకత్వంలో దాదాపు పదేండ్లు నడచిన వారపత్రిక. కొడవటిగంటి రాసిన హరిశ్చంద్రుడి ఆత్మకథ (అరవ సంపుటం) ప్రజామిత్రలో వచ్చింది. చలం రాసిన పాపం కథపై దుమారంరేగింది ఈ పత్రికలోనే. కపిల కాశీపతి ఈ పత్రికలో రాజకీయ విలేఖరిగా ఉండేవారు.

కొక కథ కూడా యిచ్చాను. కాలేజీ తెరిచేరోజు కొకరోజు ముందుగానే వచ్చి, రాధాకృష్ణమూర్తి అనే క్లాసుమేటుతో కలిసి ఒక గది తీసుకున్నాను.

ఆ రోజే డాక్టరుగారికి ఉత్తరం రాశాను. శలవల్లో వాళ్ళను చూడలేక పోయి నందుకు క్షమాపణ చెప్పుకుంటూ అందులోనే నర్సుకు వేరే చిన్న ఉత్తరం పెట్టాను. నర్సు ఫిఫ్తుఫారం తప్పలేదు, పాసయింది. మళ్ళీ ఎప్పుడు వచ్చి, స్కూల్లో చేరు తుంది? అందు కేం ఏర్పాట్లు చేస్తున్నారు? ఇత్యాది విషయాలు రాసి అడిగి సుంద రమ్మగారికి నా నమస్కారాలు చెప్పమని ఉత్తరం ముగించాను.

అయిదారు రోజులకు జవాబు వచ్చింది. పల్లెటూరి జీవితం డాక్టరుగారికి చాలా బాగున్నదిట. కపటంలేని మనుషులూ, తాజాకూరలూ, మంచిపాలూ, పెరుగూ, నెయ్యీ, మంచిగాలీ, ప్రశాంతీ, పొలాలకేసి షికారులూ - ఇవన్నీ ఆయనకు కొత్త చైతన్యం కలిగించాయట. నర్సు తనకు చదువక్కర్లేదంటున్నదిట. డిస్పెన్సింగ్ నేర్చుకుంటున్నదిట.

నర్సుకు పుస్తకాలంటే ఎన్నడూ ఆసక్తిలేదు. చదువులో కూడా లేదన్న మాట. నర్సు విరాగి కాకపోతే జీవితం గురించి ఏవో కలలుకుంటూ ఉండాలి. ఏమిటా కలలు? ఒకవేళ విరాగేనేమో! ఆ మాట అనుకుంటే నాకు నర్సును తలుచు కుని భయం వేసింది. జీవశక్తి ఎంతో తక్కువ మోతాదులో ఉంటేగాని ఆ యీడు పిల్ల విరాగిగా ఉండదు.

## 7

నా జీవితం ఒక గాట్లోపడి అక్కడే ఉండిపోయింది. కాలేజీ చదువూ, పబ్లిక్ పరీక్షలో క్లాసు తెచ్చుకోవాలన్న తాపత్రయమూ, దీనితోబాటు తరచు సిని మాలూ, అప్పుడప్పుడూ నాటకాలూనూ.

రాధాకృష్ణమూర్తి చాలా ఖర్చు మనిషి. డబ్బు మంచినీరులాగా వాడేవాడు- అతని తండ్రి ఏపాటి ధనికుడో నాకైతే తెలీదు. అతను చాలా తెలివి గలవాడై ఉండాలి. పుస్తకాలకేసి చూసినట్టుండేవాడు కాడు. పరీక్షల్లో నూటికి యాభైకి తక్కువ లేకుండా వచ్చేవి. అతనికి సంగీతం పిచ్చి. సుమారుగా పాడేవాడు. సైగల్[1] అంటే వెర్రిమోజు. అస్తమానమూ సైగల్ పాటలే హమ్ చేస్తూండేవాడు.

అటువంటివాడి కంపెనీతో ఎవరికీ పేచీ ఉండదు. అత నొకరి జోలికిరాడు. అతనిలో ఒక్కటే దౌర్బల్యం ఉండేది. తన ఆనందాలను పంచుకునేటందుకు ఎవరో ఒకరుండాలి. కిందటేడు అతనికి రూమ్‌మేట్ లేడు. ఏంచేశాడో తెలీదు.

1. సైగల్ ప్రఖ్యాత గాయకుడు, నటుడు.

ఈ యేడు నేను దొరికాను. అతనికి నేనంటే వ్యక్తిగతమైన అభిమానం ఉండను కోను. అయినా నాకింద డబ్బు తగలేసేవాడు. వద్దంటున్నా సినిమాలకూ నాటకాలకూ తీసుకుపోయి ఖర్చు తనే భరించేవాడు. నేను కాకుండా నా స్థానంలో మరొకడున్నా అతను ఇట్లాగే ప్రవర్తించే వాడనుకుంటాను.

ఏమైనా రాధాకృష్ణమూర్తి నాకొక కొత్త వాతావరణాన్ని కలిగించటం చేత కాలానికి కండపట్టినట్లయింది. ఎందుచేతనంటే, మనం కాలాన్ని కొలవ గలిగింది మార్పుతోనూ, నూతనానుభవాలతోనూ మాత్రమేగద? నిద్రలో గడిచిపోయిన గంటలు నిమిషాలతో సమానం. రెండు రోజులపాటు కొత్తచోటికి వెళ్ళి కొత్త అనుభవాలు పొందితే అది రెండేళ్ళ పెట్టుగా ఉంటుంది.

నిజానికి కిందటి సంవత్సరం కలిగినన్ని అనుభవా లీ యేడు లేవు. ఈ యేడు నాకు డల్‌గానే గడిచిందనాలి. కాని అప్పటికీ, ఇప్పటికీ నా జీవిత వాతావరణంలో ఎంత మార్పంటే-కిందటేడు జరిగిన సంఘటనలన్నీ కిందటి జన్మకి సంబంధించిన వన్నట్టు తోచింది. కథలు రాసే ఉత్సాహం కూడా పాత నీటితోనే కొట్టుకుపోయింది.

దసరా శలవలకు డాక్టరుగారి ఊరు తప్పక పోదా మనుకున్నాను. కాని వెళ్ళలేదు. వెళ్ళకుండా ఉంటానికి ఏదో సాకు చూసుకుని సమాధానపడ్డాను. తిరిగి డిసెంబరు శలవలకూ అదే జరిగింది. మిడ్‌టరమ్ పరీక్షలు కాగానే రాధాకృష్ణమూర్తి వెళ్ళాడు. అతను "బైరాగి టికెట్టు" మీద కలకత్తా, బొంబాయీ, మద్రాసూ, మైసూరూ ఇంకేవో తిరగ నిశ్చయించుకుని నన్ను కూడా రమ్మన్నాడు. రెండు మూడు జోన్‌ల టికెట్టు కొనటానికీ, పట్టణాల్లో తగలెయ్యటానికీ నా దగ్గర డబ్బులేదు. రాలేనన్నాను.

శలవ రెండువారాలూ నే నెక్కడికీ పోనుకూడా లేదు. రెండు రోజులపాటు డాక్టరుగారి ఊరు వెళ్ళి ఉండవచ్చు. కాని గుంటూరులోనే ఉండి ఒక క్రిస్టియన్ల పిల్లతో చిన్న రొమాన్స్ నడిపాను. దాని పేరు రత్నం. మా కాలేజిలోనే చదివేది. చాలా ఏళ్ళ తరవాత అంతర్జాతీయ రాజకీయాలలో డల్లెస్ ప్రవేశ పెట్టిన బ్రింక్‌మన్‌షిప్‌ను అది ప్రణయంలో అప్పుడే ప్రవేశపెట్టింది. "బ్రింక్" దగ్గరికి వచ్చేదాకా, "అయ్ లావ్ యూ, రీలీ ఆయ్ డూ" అనేది. "బ్రింక్" చేరువలో కొచ్చినాక "ఐ మె గుడ్ గాల్, అయామ్" అనేది. మా ప్రణయ సంభాషణల్లో పడికట్టు రాళ్ళుగా ఉండిన ఈ మాటలు రత్నం ఏ షాంగొహిట్స్‌తో నుంచో కాజేసిందని నా అనుమానం. మేం ఏం మాట్లాడుకునే వాళ్ళమో ఆ ఏసుప్రభువుకే తెలియాలి. చాలా వరకు తనే మాట్లాడేది - తుక్కూ దూగరా! తెలుగులోనే మాట్లాడుకునే వాళ్ళం. ఏదైనా బరువుగా అనాలి సొచ్చినప్పుడే ఇంగ్లీషు మాట్లాడేది.

ఈ చౌకబారు ప్రణయయజ్ఞం సఫలం కాకపోవటానికి కారణం నా అతని కతే అయి ఉంటుందని తరవాత నాకు తట్టింది. నేను రత్నానికి ఒక చిన్న బ్రూచ్ లాటిది కొనిపెట్టినా అది "బ్రింక్" మీదినుంచి దిగివచ్చి ఉండేదేమో—కనీసం ఒక ఫేస్‌క్రీమ్? ఉన్నట్టుండి క్రిస్మస్ ముందే రత్నం నన్ను విసర్జించింది. నా కంతేకావాలి. నేను క్రిస్మస్ ప్రెజెంటైనా ఇచ్చాను కాను.. కాలేజీ తెరిచినాక రత్నం నా మొహం కనిపించినప్పుడు గుర్తించినట్టయినా కనపడలేదు. నే నాటే అశ్రువులు రాల్చలేదు.

పరీక్షలు దగ్గిర పడుతున్నాయి. తెగ చదివేస్తున్నాను. సినిమాల మాటా, నాటకాల మాటా ఎత్తవద్దని రాధాకృష్ణమూర్తికి చెప్పేశాను. చదువుకోమని శలవ లిచ్చారు. బుద్ధిమంతనంగా చదువుతున్నాను.

తలవని తలంపుగా డాక్టరుగారు ఒకనాటి మధ్యాహ్నం మా గదికి వచ్చేశాడు. ఆయన్ను చూడగానే నాకంత సంతోషం కలుగుతుందనుకోలేదు. మొహం చెల్లక పోతుందేమోనని కూడా అనుకున్నాను. కానీ అటువంటిదేమీ జరగలేదు.

"ఓహో! రండి డాక్టరుగారూ, ఎప్పుడు రావటం? అంతా కులాసా?" అన్నాను. ఆయనకు నా కుర్చీ ఇచ్చి, నేను స్టూలుమీద కూర్చున్నాను.

"నేను మళ్ళీ గుంటూరు వచ్చేస్తున్నాను. డాక్టర్ శ్రీధర్ తనకు సహాయంగా ఉండమని రాశాడు. ఈ మధ్య అతను నర్సింగ్‌హోం పెట్టాడుగాదూ?"

నాకు తెలీదు. కాని, మోస్ట్ వెల్‌కమ్ న్యూస్ - ఆ మాటే అన్నాను.

"ఆ పల్లెటూళ్ళో ఫిజికల్ ఎగ్జిస్టెన్స్ బాగానే ఉంది గాని మెదడు బొత్తిగా బూజుపట్టి పోతున్నది. 'గో బాక్ టు ది విలేజ్' అన్న స్లోగన్ ఆచరణ సాధ్యం కాదేమో!" అన్నాడు డాక్టరుగారు.

ఆయన ఏదో జ్ఞాపకం వచ్చి తనలో తను నవ్వుకోవటం చూసి "ఏమిటి?" అన్నాను.

"మా నాన్న పెద్ద ఉత్తరం రాశాడు నాకు."

నే నా ముసలాయన్ని పూర్తిగా మరిచిపోయాను. ఆయన మాట వినగానే నాకు హిరణ్యకశిపుడు మొదలైన రాసులు జ్ఞాపకం వచ్చారు.

"ఏమంటా రాయన?" అని అడిగాను.

"నర్సును తక్షణమే తన దగ్గిరకు పంపెయ్యాలిట. నేను దాని జీవితాన్ని ధ్వంసం చేస్తున్నానుట. తన దగ్గిరకొస్తే అది మహారాణిలాగా బతుకుతుందిట. మహారాజులాటి వాణ్ణి పెళ్ళాడుతుందిట. నేను చేసిన పాతకాలన్నిటికీ ఆ అశ్మం శుభం ఎరగని పిల్ల శిక్ష పొందటం అన్యాయమంట. చేసిన పాతకాలకు తోడుగా నే నీ పాపం కూడా మెడకు చుట్టుకున్నానుట. తండ్రిగా దానిపై నాకున్న

హక్కే తాతగా తనకూ ఉందిట. ఒకటికాదు ఏ మేమిటో రాసాడు. ఫ్రేమ్ కట్టించి ఉంచుకోదగిన ఉత్తరం."

"అవును, ఆయనకు ఇదొక అబ్సెషనైపోయింది. ఆయన బుర్రలో ఏదన్నా ఆలోచనపడితే అది ఒకంతట పోదనుకుంటాను" అన్నాను. మరొకడైతే ఎప్పుడో గివప్‌చేసి ఉండేవాడే.

డాక్టరుగారు అంతలో సీరియస్‌గా అయిపోయి "చూడు. సూర్యం! నా బుర్ర పనిచేయకుండా ఉంది. నీ అభిప్రాయం ఏమిటోచెప్పు-నర్సుకు వాళ్ళ తాతదగ్గిర ఉండాలనుకొంటే మనం ఏం చెయ్యాలి?" అన్నాడు.

"మనం" అన్నమాట నా మీద మంత్రంలాగ పన్జేసింది. దాంతో నేనూ ఆయనా నర్సు సమస్యలో భాగస్వాములమైపోయాం.

"నర్సు తాతగారి దగ్గిరికి వెళ్ళి పోతానంటుందా?" అన్నాను.

"అలా అంటుందా? అంటే సమస్యేలేదు. ఆ ఉత్తరం ఇచ్చాను. మొహంలో ఏ ఎక్స్‌ప్రెషనూ లేకుండా చదివి, కామెంటు లేకుండా నా చేతికిచ్చేసింది. దాన్నిబట్టి ఏమనుకోవాలి? తాత కోరిక తీరిస్తే బాగుంటుందనేగా? 'మీ తాతయ్య రమ్మంటున్నాడు గదా; పోనీ వెళతావుటే?' అని అడిగా. 'నేనొక్కత్తెనే పోయి అక్కడ ఉంటానా?' అన్నది-నే నేదో భయంకరమైన సూచన చేసినట్టుగా. 'ఆయన ఇంకెవర్నీ ఆహ్వానించటం లేదుగదా? మేం రామనుకో. నీకోసం వద్దామన్నా ఆయన అవకాశం ఇవ్వటం లేదే?' అన్నాను. 'అటువంటప్పుడు దాని గురించి ఆలోచించటం దేనికో?' అన్నది. అర్థం చేసుకోగలవనుకుంటాను. ఆ మాట నా తరఫున అన్నది కాదు. నాకు విరుద్ధంగా, నాతో సానుభూతి లేకుండా అన్నది!... హుఁ! ఎడం ఎడంగా నాటిన మొక్కలుకూడా పెరిగినకొద్దీ దగ్గిరపడి కలుసుకుంటాయి. మనుషులు పెరిగిన కొద్దీ దూరమవుతారు. నర్సు మనసు నాకు తెలియటం లేదన్నది కాస్త ఆందోళన కలిగిస్తున్నది. నా ఆందోళనమాట దేవుడెరుగు, నేనేం చేస్తే న్యాయంగా ఉంటుంది?"

డాక్టరుగారు చిక్కులోనే పడ్డాడు. ఆయనకు తట్టని ఆలోచన నాకు మాత్రం ఏం తట్టుతుంది?

"ఒక కాంప్రొమైజ్ సొల్యూషన్ చూస్తే?" అన్నాను.

"ఏమిటది?"

"నర్సును కొంతకాలం తాతగారి దగ్గిర ఉండి రానిస్తే మిమ్మల్ని వదులుకోనూ అవసరంలేదు, ఆయన కోరిక తీరినట్టూ అవుతుంది. ఆ తరువాత నర్సుకు తాతదగ్గిరే ఉండాలనిపిస్తే ఉండిపోనూ వచ్చు. కొంతకాల మన్నదానికి లిమిట్ ఎంతో నర్సే నిర్ణయించుకుంటుంది. నాలుగురోజులే ఉండి తిరిగి మీ దగ్గరికి వచ్చే

సిందనుకోండి మీ నాన్నగారు ఎవరినీ తప్పుపట్టడానికుండదు. ఇప్పుడంటే మీరు అడ్డుపడుతున్నారని ఆక్షేపించగలడు. ఒకవేళ నర్సు మీ దగ్గరికి తిరిగిరాకుండా అక్కడే ఉండిపోయిందనుకోండి, అప్పుడు కూడా మీ పొజిషను క్లియర్‌గానే ఉంటుంది. ఆమె పైకి అనలేకుండా వున్న కోరికను తీర్చినవారవుతారు. మీరు కూడా వస్తే నర్సు తాతగారిదగ్గిరికి వెళతానన్నది ఫాల్స్ పొజిషన్. అది అందరికీ చెడ్డదే."

డాక్టరుగారి మొహంలో కొంత తృప్తి కనపడింది.

"నీ సజెషన్ బాగానే ఉంది సూర్యం. ఒక్కటే అనుమానం-నర్సు ఇందుక్కూడా ఒప్పుకోక మేం వస్తేనేగాని తాతదగ్గిరికి పోనని పట్టుబడితే?" అన్నాడు.

"పట్టదు" అన్నాను నమ్మకంగా.

ఆయన ఆశ్చర్యపోయి "ఎట్లా చెప్పగలవ్?" అన్నాడు.

ముసలాయన సర్కిల్ గారింట్లో తిష్ఠవేసి నాద్వారా నర్సును పిలిపించటమూ నాతోనైనా చెప్పకుండా నర్సు తాతగారి దగ్గరికివెళ్ళి రావటమూ ఆయనకి చెప్పేశాను.

"మా శీను పెళ్ళప్పుడు నేను నర్సును వెంటబెట్టుకు పోయాను చూడండి, అప్పుడాయన నర్సును అందలమెక్కించాడు-అందలమేమిటి? ఏకంగా పుష్పక విమానమే ఎక్కించాడు? సంతోషించాడు; ఆనందబాష్పాలు రాల్చాడు. తన లక్ష్మి అన్నాడు; మనవరాల్ని అందరికీ చూపించి గర్వపడ్డాడు. పెద్ద నాటకమాడాడు. దాని ఎఫెక్ట్ నర్సుపైన వుండదనుకోవటం ఎట్లా? ఏ ప్రాణి అయినా-చివరకు కుక్కలూ, పిల్లులూ కూడా-ప్రేమకి రెస్పాండ్ చేస్తాయిగదా!" అన్నాను.

"నిజమేనోయ్! నీ మాటల్లో చాలా సత్యం వుంది. ఈ పనికూడా నీ చేతి మీదిగానే కానీ. ఈ ఆలోచన చేసిన వాడివి నువ్వా. కిందటిసారి నర్సును తాతగారి దగ్గిరికి తీసుకుపోయినవాడివీ నువ్వే.... ఒకపని చేద్దాం. నేనప్పుడే గుంటూరుకు మారను. డాక్టర్ శ్రీధర్‌ని రెండు నెల్లుగడువడుగుతాను. నేను నర్సును ఇక్కడికి తీసుకొస్తాను."

"మీరు గుంటూరు రావటానికేం?" అన్నాను.

డాక్టర్‌గారు ఇబ్బందిమొహం పెట్టాడు.

"ఏం లేదూ, పాత ఇల్లు ఖాళీచేయించి తీసుకోవటానికి ఏర్పాటు చేశామా! ఆ ఇంట్లో నర్సు లేకుండా మేమిద్దరమూ ఉండటమంటే ఏదోగా అనిపిస్తున్నది."

ఆయనను చూస్తే జాలేసింది. నర్సు నిజంగానే తాతగారి దగ్గిర వుండిపోతే ఆయన బాధపడబోతున్నాడు.

"మీ యిష్టం" అన్నాను.

"నర్సునెప్పుడు తీసుకురాను?" అన్నాడాయన.

"మా పరీక్షలై పోనివ్వండి."

డాక్టరుగారు వెళ్ళిపోయారు. ఈ యేడంతా నాకే సమస్యాలేదు - మార్కులు బాగా తెచ్చుకోవటం తప్ప. డాక్టరుగారి రాకతో మళ్ళీ సమస్య అనేది వచ్చిపడింది. ఆ సమస్యకు డాక్టరుగారు కనిపెట్టలేని పరిష్కార మార్గం నేను కనిపెట్టానని చాలా గర్వపడ్డాను.

పరీక్ష లవుతుండగానే డాక్టరుగారు సకుటుంబంగా వచ్చి పాత ఇంట్లో దిగారట. గుంటూరు ప్రయాణం రెండు నెలలు వాయిదా వేద్దామనుకున్న అభిప్రాయాన్ని ఆయన మార్చుకున్నట్టున్నది. నర్సు లేకుండా తానూ భార్యా ఆ ఇంట వుండలేమని బయటపడ్డాక ఆయన తన దౌర్బల్యానికి సిగ్గుపడి దాన్ని జయించాలనుకున్నాడేమో! లేక ఇంకేదన్నా కారణం వుందో!

వాళ్ళు రావటం నాకు తెలీదు. పరీక్షలింకా రెండుమూడు రోజుల్లో అయిపోతాయనగా డాక్టర్‌గారు నా గదికి వచ్చాడు. వాళ్ళు గుంటూరు చేరి అప్పటికి వారం కావస్తున్నదట. ఆయన శ్రీధర్‌గారి దగ్గిర చేరిపోయాట్ట కూడా.

శుక్రవారంతో నా పరీక్షలైపోతాయని చెప్పాను.

"అయితే శనివారంనాడుగాని ఆదివారంనాడుగాని నువ్వు నర్సుని వెంటబెట్టుకు పోవచ్చు. నా భార్యకూడా ఈ ఏర్పాటుకు ఒప్పుకున్నది - నేనే ఒప్పించాననుకో పోనీ... మా నాన్నకు నీ పేరనే ఉత్తరం రాయి. ఆదివారం వస్తామని రాయి" అన్నాడు.

ముసలాయనకి ఒక ఉత్తరం రాశాను. రెండే ముక్కలు. ఆ ఉత్తరం చదివి చూసుకుని డాక్టరుగారు "చాలు. దీన్ని నేను పోస్టు చేస్తానులే. నీ చదువు డిస్టర్బ్ చెయ్యను" అని వెళ్ళిపోయాడు.

శుక్రవారంనాడు రాత్రికే నేను డాక్టరుగారింటికి చేరుకున్నాను. మళ్ళీ అంతా వెనుకటిలాగానే వుంది. మధ్య జరిగినదంతా నాటకంలో విష్కంభం లాటిదేనా? అసలు నాటకం యేదో యెవరు చెప్పగలరు? మనజీవితాలే విష్కంభాలు!

నాకిప్పుడు నలభై అయిదేళ్ళు. అనుభవంమీదా, ఆలోచించీ ఈ మాట అంటున్నాననుకోండి. అసలు నాటకం ఇప్పుడు నాకు లీలగా పొడగట్టుతున్నది. అది జగన్నాటకం. వేదాంతులుచెప్పే భగవల్లీల నాకింకా పొడగట్టటంలేదు. ఆ జగన్నాటకం గురించికాదు నేచెప్పేది. నాకు లీలగా పొడగట్టుతున్న నాటకం మానవ జీవితానికీ వివిధ దేశాలకూ, వివిధ యుగాలకూ సంబంధించినది. మనం చాలా చిన్న చిన్న సమస్యలతో సతమత మవుతూంటే పెద్ద సమస్యలు వాటంతట అవే

రూపం దాల్చి, కార్యకారణ సంబంధాన్ని బట్టి తమ రూపాన్ని మార్చుకుంటూ మానవజాతిని మౌనంగా ప్రశ్నిస్తున్నాయి. ఇప్పుడిప్పుడే "తాతా" "మామా" అనటం నేర్చుకుంటున్న మానవుడు కాలక్రమాన ఆ ప్రశ్నలను తన ఆధీనంలోకి తీసుకుని పరిష్కరిస్తాడు....

# 8

నరసింహం పంతులుగారు పెద్ద నటుడు. ఎప్పటికప్పు డాయనను చూసి నాకు కొత్తగా ఆశ్చర్యం కలుగుతుంది. ఆయనది లంకంత యిల్లు. నా ఉత్తరం అంది, నేను నర్సును వెంటబెట్టుకుని వచ్చేలోపుగా ఆయన యిల్లంతా సున్నం కొట్టించాడు. వాకిళ్ళకి తోరణాలు కట్టించాడు. కిటికీల కన్నిటికీ కొత్త కర్టెన్లు అమర్చాడు. హాలు మధ్య బల్లమీద కంచులోటాలో బియ్యం పోసి ఒక కట్ట ఊదు వత్తులు గుచ్చి ఉంచాడు. నర్సు కొకగది పడుకోవటానికి యేర్పాటు చేయించాడు. అందులో పాల సముద్రమంత పట్టె మంచమూ, ఆదిశేషుడంత పరుపూ, దానిపైన తెల్లని దుప్పటి, మంచానికి బ్రహ్మాండమైన కొత్త దోమతెరా ఉన్నాయి. దాని కెదురుగా కిటికీ దగ్గిర ఒక డ్రెస్సింగ్ టేబిలూ, చిన్న స్టూలూ, డ్రెస్సింగ్ టేబిలుమీద ఒక సెంటు స్ప్రే చేసుకునే బుడ్డీ, దువ్వెనలూ, కుంకుం డబ్బీ యింకేమేమిటో ఉన్నాయి. ఎవరో జమీందారు కొడుకు. పెళ్ళి చేసుకునేటందుకు ఏ లండనునుంచో తిరిగివస్తుంటే, జమీందారుగారు యింతకన్న అట్టహాసంగా రిసెప్షనివ్వలేడు. ఒక్క బాండుమేళం లేదు, అంతే.

"నా లక్ష్మికోసం చేశానోయ్ యీ యేర్పాట్లన్నీ!"

ఆయన తన లక్ష్మినేకాకుండా నన్ను కూడా కావలించుకున్నాడు. ఆయన ఉన్నచోట బెంగాలీ నవలలు ప్రత్యక్షం కావలసిందే. జీవితాన్ని యేదో విధంగా అవాస్తవం చెయ్యకపోతే ఆయనకు నిద్రపట్టదు. చిన్నతనంలో అణగారిపోయిన రొమాంటిక్ భావాలు వృద్ధాప్యంలో పైకి తన్నుకొస్తున్నాయి. అందులోనూ డబ్బుతో తీర్చుకోగల రొమాంటిసిజం! ఆయన మటుకేం చేస్తాడూ?

"పంతులుగారూ, నా డ్యూటీ చేసేశాను. ఇక నాకు సెలవిప్పిస్తే పోతాను" అన్నాను.

"పోతావా? ఎక్కడికి పోతావు? నీకేనా డ్యూటీ ఉన్నది? నాకు లేదూ? ఇంతో కాలంగా తీరని నా కోరిక తీర్చావు. రెండు రోజులు నా గెస్టుగా ఉండక యెట్లా వెళతావు? వీల్లేదు. వల్లగాదు. నిన్ను కట్టైనా ఉంచి తీరుతాను!" అన్నాడు ముసలాయన.

సద్భావాన్ని కటువు భాషలో వ్యక్తీకరించటం కూడా బెంగాలీ నవలాకారుల సంటే.

ముసలాయన ఇంట ముగ్గురు పనివాళ్ళూ, వంటమనిషీ ఉన్నారు. వాళ్ళు ఒకే కుటుంబం - భార్యాభర్తలూ, కొడుకూనూ. ఆడ పనిమనిషి నర్సును తీసుకు పోయి తలంటిపోసింది. తలకు సాంబ్రాణి ధూపం వేసింది. కొత్త చీరా, జాకెట్టూ యిచ్చింది. నగలు పెట్టింది. కాళ్ళకు పసుపూ, పారాణి పెడతానన్నది గాని నర్సు యెదురు తిరిగింది.

అలంకరణ పూర్తిచేసుకుని నర్సు డ్రెస్సింగ్ టేబిల్ అద్దంముందు కూర్చుని వానిషింగ్ క్రీమ్ సీసామూత తీస్తుండగా నేను గదిలోకి వచ్చి, అద్దంలో నర్సు మొహం చూస్తూ, “నే నిచ్చినప్పుడు పూసుకున్నావు కావు!” అన్నాను.

నర్సు వెనక్కు తిరిగి నాకు క్రీమ్‌జాడీ చూపిస్తూ, “ఇదెవరిచ్చారో?” అన్నది.

ఆ మనిషి వచ్చి, “అమ్మగారే తలనూనె పూసుకుంటారని బాబుగారడుగు తుండారు” అన్నది.

“కొబ్బరి నూనె” అన్నది నర్సు. ఆమె మాటతీరులో అప్పుడే చాలా తేడా కనిపించింది. ఇంతకాలానికి మొగ్గ వికసించి పువ్వు కానున్నది.

మరో పదినిమిషాలకల్లా కుర్రనౌకరు ఏదో తలనూనె సీసాతెచ్చి డ్రెస్సింగ్ టేబిలుమీద పెట్టి వెళ్ళిపోయాడు. అది బెంగాలీ తలనూనె అయి ఉంటుందని దూరం నుంచి చూసే గ్రహించాను. ఫాన్సీస్టోరేదో దగ్గిరలోనే ఉన్నట్టుంది.

నేను బయటికివెళ్ళి షాపు కనుక్కొని ఒక సబ్బూ, టూత్‌పేస్టు ట్యూబూ, ఒక పాకెట్ బ్లేడ్లూ కొనక్కొని తిరిగి వస్తుండగా, ముందు వరండాలో ఈజీ చైర్‌లో చేతులు తలకింద పెట్టుకుని ఉన్న ముసలాయన పట్టుకుని, “ఏమిటవి?.... నువ్వెందుకు వెళ్ళావ్? ఆ కుర్రకుంక ఏమయాడూ? ఇంతకుముందేగా షాపుకు పంపిస్తినీ? నీకేం కావాలో అడిగి మరీపోడూ? వెధవగాడిదె!” అన్నాడు.

తన గెస్టు దుకాణానికి వెళ్ళి వస్తువులు కొనుక్కొని తెచ్చుకోవటం ముసలా యనకు నామర్దా అయినట్టుంది.

“పరవాలేదు లేండి. నాక్కావలసినవి నేనే ఏరుకుని తెచ్చుకోవటం అల వాటు. షాపులో ఉన్న రకాలన్నీ చూసుకుని కొంటే నాకు తృప్తి” అన్నాను.

“అట్లా కుర్చీ లాక్కొని కూచో” అన్నాడాయన.

“చూడూ, రోజుకో కొత్తరకం వస్తువు దిగుతూ వుంటుంది. మనం వాటిని చూసి వ్యామోహపడరాదు. ఒక సబ్బు, ఒక టూత్‌పేస్టు, ఒక రేజరు, ఒక తల నూనె ఎన్నిక చేసుకుని, దానికే అంటపెట్టుకుని ఉండాలి” అని ఆయన సలహా యిచ్చాడు.

“మీరు కొంతకాలం బెంగాల్లో ఉన్నారా ఏమిటి?” అన్నాను.

"లేదుమరీ! నేను కలకటా బియ్యేని. బెస్ట్ యూనివర్శిటీ. నూటికి ఎనభై మందీ తొంభై మందీ పాసవుతారు. మెడ్రాసు లాగానా? ఇరవై యిద్దరు—ఇరవై ముగ్గురు; షేమ్! అసలే లిటరసీ లేనిదేశంలో మెడ్రాసులో నేను లా చదివి నప్పుడు గట్టిగా సగంమంది పాసుకాలేదు" అన్నాడాయన.

"బెంగాలీ సాహిత్యం మీకిష్ట మనుకుంటాను."

"ఓః బంకిమ్[1]! మాష్టర్! ఏం నావెల్స్, శరపరంపరంగా రాసేశాడు. ఆ లోతులు టాగోర్లో[2] కూడా లేవంటాను. టాగోరు సగానికి సగం పాశ్చాత్యుడు[4] ఇప్పుడు శరచ్చంద్రుడ[3]నే ఆయన రాస్తున్నాట్ట. ఎవరూ బంకింకు చాలరు!" అని అన్నాడాయన.

కనుక నా అనుమానం సరయినదే. ఆయన రక్తంలో కొంత వంగం ప్రవహిస్తుంది.

---

1. బంకించంద్ర చటర్జీ: వందేమాతరం గీతం ద్వారా, నవలా రచన ద్వారా ప్రఖ్యాతిగాంచిన బెంగాలీ రచయిత. భారతీయ భాషల్లో గత వైభవ స్మరణతో కూడిన దేశభక్తి నవలలకు ప్రేరకుడు. ఆయన రాసిన నవలలు : ఆనందమఠ్ (1882), కపాల కుండల, దుర్గేశనందిని, కృష్ణ కాంతుని మరణ శాసనం, శైవలిని, నవాబు నందిని, కార్యసాధనోత్సాహం. ఆత్మత్యాగ సహితమైన కార్యసాహసాలు బంకిం నవలల్లో కన్పిస్తాయి.
2. రవీంద్రనాధ టాగోర్ (1861 - 1941): విశ్వవిఖ్యాత కవీ, నాటకకర్తా, కల్పనా సాహిత్య స్రష్టా, వ్యాసరచయితా, కాల్పనిక భావాలూ, జాతీయ వాదమూ, మార్మికతా రవీంద్రుని రచనల్లో కన్పిస్తాయి. 1913లో గీతాంజలికి నోబుల్ బహుమతి గ్రహీత.
3. శరత్‌చంద్ర చటర్జీ (1873 - 1938): ప్రఖ్యాతి బెంగాలీ నవలాకర్త. తెలుగులోకి శరత్ నవలలు దాదాపు అన్నీ వచ్చాయి. సనాతన కుటుంబాల్లోని స్త్రీల కడగండ్లను హృదయవిదారకంగా చిత్రించిన రచయిత.
4. వంగరక్తం, వంగప్రభావం, వంగచైతన్యం: జాతీయోద్యమ కాలం నుండి దాదాపు 1960 వరకూ బెంగాలీ సాహిత్య ప్రభావం అనువాదాల ద్వారా తెలుగు రచయితలపై, పాఠకులపై గణనీయంగా పడింది. ఒక దశలో ఆంధ్ర బంకింలు, ఆంధ్ర టాగోర్లు, తెలుగు శరత్‌లు మన సాహిత్యంలో వెలిశారు - ఉన్నవ, చలం, గోపీచంద్, కుటుంబరావు వంటి రచయితలకు సమాంతరంగా.

ఆ రోజల్లా నాకొక యుగంగా గడచింది. చేసేటందు కేమీలేదు. ముస లాయన మనవరాలి గదిలోకి పడక కుర్చీ తెప్పించుకుని తిష్ఠవేశాడు. ఎక్కడి కన్నా పోదామన్నా నాకెవ్వరూ లేరు. బెజవాడలో మధ్యాన్నం మూడు గంటలకే బయలుదేరి కృష్ణ దగ్గిరికివెళ్ళి చీకటి పడేదాకా కూర్చున్నాను. కొండల్ని గురించీ, నదుల్ని గురించీ తాత్వికంగా ఆలోచించుకున్నాను. కొండ సత్యం, నది మిథ్యా. కొండమీద ఒక చిన్న పెళ్ళపీకి, ఇది ఆ కొండపుట్టిన పదిహేనుకోట్ల ఏళ్ళుగా ఆ కొండలోనే ఉందని చెప్పవచ్చు. నది క్షణ క్షణమూ మారుతూంటుంది. నేను వచ్చి కూర్చునే టప్పుడు కనిపించిన నీరు నేను బయలుదేరే సమయానికి సము ద్రాన్ని చేరినా చేరి ఉండవచ్చు. కానీ కృష్ణానదికూడా కొన్ని లక్షల యేళ్ళుగా అక్కడే ఉన్నదని భ్రమ పడుతుంటాం. నేనూ, నర్సూ నదుల జాబితాల్లోకి వస్తాం. ఈ ముసలాయనా, కొంతవరకూ డాక్టరుగారూ కొండల జాబితాల్లోకి వస్తారు. కొండలు లేకపోతే నదులూ వుండవుట. వాళ్ళు లేకపోతే మేం లేమన్న మాటే!

నా తెలివితేటలకు నేనే మురిసిపోతే ఇంటి కెళ్ళాను. ఇంటినిండా విద్యు ద్దీపాలు బ్రహ్మాండంగా వెలిగి పోతున్నాయి. ముసలాయన తన లక్ష్మికి దీపా రాధన చేశాడు.

నేను రాగానే ముగ్గురమూ అన్నాలు తిన్నాం.

"ఎక్కడి కెళ్ళా వింతసేపు?" అన్నది నర్సు.

"నదుల రహస్యం తెలుసుకోవటానికి కృష్ణ కెళ్ళాను."

"రహస్యం తెలిసిందా?" అన్నది నర్సు మళ్ళీ.

"కొండల్లేకపోతే నదుల్లేవు" అన్నాను.

"వెల్ సెడ్! వెల్ సెడ్!" అన్నాడు ముసలాయన. ఎందుకో!

"అయితే?" అన్నది నర్సు అయోమయంగా.

"చూడు, నది మాయ! అది కొండకు లొంగినట్టు కనిపిస్తుంది. మర్యాదగా పక్కకు తిరుగుతుంది. కొండకు ప్రదక్షిణ చేస్తుంది. కొండను కావిలిస్తున్నట్టు నటిస్తుంది. కొండను కొంచెం కొంచమే కబళించేస్తుంది. కృష్ణపక్కన అటూ ఇటూ ఉన్న కొండలు చూడు. అవి ఒకప్పుడు ఒకటే కొండ. దానిమధ్య కృష్ణ ఎంత పెద్ద గండి పెట్టిందో చూడు!" అన్నాను.

"రైట్! వెరీరైట్!" అన్నాడు ముసలాయన.

"నువు చెప్పేది నాకు కొంచెంకూడా అర్థం కావటంలేదు" అన్నది నర్సు.

"కొండలూ, నదులూ అర్థం చేసుకోవటమన్న సమస్యే లేదు. వాటి స్వభావాలే చెయ్యవలసినదంతా చేసేస్తాయి. నదికి మెదడు లేదు. కొండను

కొయ్యటమే దానికి తెలుసు. కొంచెమైనా మెదడు లేదు. కోతపడటమే దాని స్వభావం. జగన్నాటకం సాగిపోతున్నది" అన్నాను.

ఇక్కడికి వచ్చినాక నర్సు తల్లిదండ్రుల మాట యెత్తనైనా ఎత్తకపోవటం నాకు చాలా మంటగా ఉన్నది.

"ఇంక కొండలూ, నదులూ అంటే నేను సహించను" అన్నదామె.

నేను విషయం మార్చి, "ఈపాటికి వాళ్ళు భోజనాలు చేస్తూంటారు" అన్నాను.

నర్సు ఉలిక్కిపడటం నా కంటపడింది.

"పర్ఫెక్ట్‌లీ కరెక్ట్!" అన్నాడు ముసలాయన. ఆయన మాటలు వినటం లేదు-వా వాక్యాల్లో ఫుల్ స్టాప్‌లు ఆలకించి మర్యాదకోసం నన్ను బలపరుస్తున్నాడు! నేననుకున్నట్టు ఆయనకు కాస్త పిచ్చి ఉందేమో! నేను వెళ్ళిపోయాక నర్సును గొంతు పిసికి చంపేస్తే ఏం కాను?

భోజనం కాగానే ముసలాయనకు నిద్రపోయే అలవాటుట. ఆయన పడుకునేది నర్సుగదికి ఆనుకుని ఉన్న హాలులో. మగనౌకరు సహాయంతో ఆయన మేడమీది కెక్కి వెళ్ళిపోయాడు; పోతూ నర్సుతో, "లక్ష్మీ, ఎక్కువసేపు మేలుకోకు. పెందలాడె పడుకుని పెందలాడే లే; నే నెప్పుడూ అలాగే చేస్తాను. కాస్త చీకటి ఉండగానే లేచి ప్రాణాయామం చేశావంటే ఏ జబ్బులూ ఉండవు" అన్నాడు.

మగనౌకరు దిగివచ్చి నాతో, "అయ్యా! మీ పక్కకూడా బాబుగారి పక్కదగ్గిరే వేశాను. బాబుగారికి ఫాన్ జోరుగా ఆడాలి. అందులో ఈ ఏసం కాలంలో; మీగ్గాని గాలి జాస్తి అక్కర్లేకపోతే మంచం కాస్త దూరంగా జరుపుకోండి" అని, నర్సుతో "లచ్చమ్మగారూ, మీరు పడుకునే టప్పుడు ఫా నేసుకోండి. దోవతెర పైకెత్తి ఉంచా. కావలిస్తే దింపేసుకోండి. ఇంక నేను పోనా?" అన్నాడు.

నేనూ, నర్సూ పైకి మెట్లెక్కి వెళ్ళాం. నర్సు పడుకునే గదికి పడమరగా ఉన్న హాల్లో రెండు మంచాలు, ఫానుకు కిందిగా వేసి ఉన్నాయి; ఒకదానిపైన ముసలాయన వెల్లకిలా - కాళ్ళు బాగా ఎడంగా చాచుకుని, చేతులు తలకింద పెట్టుకు నిద్రపోతున్నాడప్పుడే. ఆయన ఉచ్ఛ్వాస నిశ్వాసాలు రంపపు కోతలాగా వినిపిస్తున్నాయి.

ఆ హాలుకు దక్షిణంగా డాబా ఉన్నది. ఆ వేపు కిటికీలు తెరిచి ఉన్నాయి. తలుపు గడియపెట్టి ఉన్నది.

"చాలా ఉక్క. బయటకూడా గాలి ఆడుతున్నట్టులేదు. నీకు నిద్రపట్టేట్టుంటే పడుకో" అన్నది నర్సు, డాబాకేసి ఆశగా చూస్తూ.

ఆమె ఉద్దేశం గ్రహించి నేను డాబాకేసి దారితీశాను. కటకటాల తలుపు తెరిచి యిద్దరమూ డాబామీదికి వెళ్ళాం. లోపలకన్న బయట చల్లగా ఉన్నది, గాలి లేకపోయినా.

"తాతయ్య నల్లమందు వేసుకుంటాట్ట. వంటావిడ చెప్పింది....పొద్దున నాకు మండిపోయింది-నన్నిక్కడ ఒక్కర్తెనూ దించేసి నువ్వు వెళ్ళిపోతున్నావు గదూ?" అన్నది నర్సు.

"ఒంటరిగా విడవట మేమిటి? మీ తాతేగా? మధ్య నేనేమిటీ సత్రకాయలాగా?" అన్నాను.

"అయినా నీకు వెళ్ళడానికి చోటేలేదుగా? ఏమా తొందర?"

"చోటు లేదుగదా అని మీ తాతకి గెస్టుగా ఉండిపోనా? మర్యాదకాయన రెండురోజులుండి వెళ్ళమన్నా నేను పెద్దమనిషి తరహాగా రేపు వెళ్ళిపోవటం మంచిది."

నర్సు కొంచెం ఆలోచించి "ఆయనమాట చెప్పను. నేనుండమన్నాననుకో, ఉండవా?" అన్నది.

ఇదేం పరీక్షో నాకర్థం కాలేదు.

"ఈ ఇంట్లో ఉండమని నువ్వు మాత్రం ఏమని అడుగుతావూ?"

"ఇది నా తాత ఇల్లేగనుక!" అన్నది నర్సు, తన హక్కులు పూర్తిగా వినియోగించుకున్న దానల్లే.

"ఇది మీ తాతగారిల్లే అనుకో ఇంతకన్న స్వతంత్రం ఉన్న మీ నాన్నగారింటి కైనా నువు పరాయివాళ్ళని -అంటే మీ నాన్నగారికి పరిచయం లేనివాళ్ళను-అతిథులుగా పిలుస్తావా? పిలుస్తావనుకోను."

"నన్ను మాటలతో బురిడీ కొట్టిస్తున్నావు. తాతయ్యకు పరాయివాడెట్లా అయినావూ? నా కన్నా నిన్నే ఆయన ముందుగా కలుసుకున్నాడు: నీ ద్వారానే ఆయన తన కోరిక సాధించుకున్నాడు. నువ్వెన్నాళ్ళుంటానంటే మాత్రం యెందుకు వద్దంటాడూ?"

"వద్దంటాడా? 'నీకు పోవటానికింకేదీ చోటులేదా?' అని అడుగుతాడు. 'నా మనవరాలి తోక పట్టుకుని తిరుగుతున్నా వెందు' కంటాడు. ఆ మాటలడిగించుకోనా?"

"ఛీ! అన్నీ పాడు మాటలు."

"నా అభ్యంతరమూ అదే-పాడుమాట లడిగించుకోవాలి...అయినా నాకు తెలీక అడుగుతాను-నన్నిక్కడ ఎంతకాలం ఉండమంటావు?"

"కనీసం సెలవు లాఖరిదాకాను" అన్నది నర్సు. [illegible]

నేను షాక్ తిన్నానన్నమాట! నర్సు మూడునెల్లుదాటి ఇక్కడ ఉండ నిశ్చయించింది! ప్రమాణపూర్తిగా - నేననుకున్న దేమంటే, తాను నాలుగు రోజులుండి తండ్రి యింటికి తిరిగి వెళ్ళిపోతా నంటుందనీ, ఈ నాలుగు రోజులూ నేను కూడా ఇక్కడే ఉండి తనను ఇంటికి చేర్చాలంటుందనీనూ! కాని ఆమెకు తిరిగి తండ్రిగారింటికి పొయ్యే ఆలోచన లేనట్టున్నది. అవును ఈమె ఇప్పుడు డాక్టరుగారి కూతురు కాదు, నరసింహంగారి మనవరాలు. ఆ నగలూ ఆ వాసన తలనూనే, ఆ ఖరీదైన బట్టలూ, మొహానికి క్రీమూ పౌడరూ-నే నెరిగిన నర్సు కాదు. ముసలాయన ను చూసుకుని మురిసే లక్ష్మి!

నా అంతరాత్మ ఇదంతా సహించలేక పోయింది. నర్సు సుఖపడటం నా కిష్టం లేకకాదు. ఆమె యింకా నగలు పెట్టుకుని, ఇంకా షోకుచేసుకుని, ఇంతకు పదింతలు జీవితానందం పొందినా నా కిష్టమే - కాని ఇట్లాకాదు! ఇట్లా కానేకాదు.

"నర్సూ, ఒకమాటడుగుతాను. నిజం చెబుతావా?" అన్నాను.

"అడుగు తెలిస్తే చెబుతాను".

"మీ నాన్న గారింట్లో నువ్వు మెంటల్‌గా బాధపడ్డావా?"

నర్సు కాస్సేపు మాట్లాడకుండా ఊరుకుని, "అది జైలు!" అన్నది.

"ఎప్పటినుంచీ నీ కాయిల్లు జైలనిపించింది?"

తన తాతను మొదట చూసినప్పటినుంచీ అనిపించిందంటుందని అనుకున్నాను.

"బుద్ధి తెలిసినప్పటినుంచీ అది జైలే. అడుగడుగునా మానాన్న శాసనం. ఎటు తిరుగుదామన్నా ఆయన గోడ పెట్టినట్టుగా కనిపించేవాడు."

నేను నిర్ఘాంతపోయి, "మీ నాన్నగారంత చండశాసనుడా?" అన్నాను.

"ఆయన ఎవరిని ఎన్నడూ కోప్పడేవాడు కాదు - నువ్వామాట అడుగుతున్నావేమో! కాని ఆయన పల్లెత్తుమాట అనకుండానే నాచేత మా అమ్మ చేతా సర్కసు చేయించాడు."

"ఏ విధంగా?"

"ప్రతి చిన్న విషయం గురించీ ఆయనకు దృఢమైన అభిప్రాయం ఉన్నది. దాన్ని వ్యతిరేకించి నేనూ మా అమ్మా ఏమైపోతాం? ఎందరో మొగుడు పెళ్ళాలు కీచులాడు కుంటారు. మా నాన్న చేయించే - అదేమిటంటారు? రేజర్స్ ఎడ్జ్-"

"అసిధారావ్రతం?"

"ఔ, అదే. మా నాన్న చేయించే అసిధారావ్రతం కన్న మా నాన్న అమ్మా కీచులాడుకుంటూ ఉండినా మా అమ్మకు కొంతలో కొంత స్వేచ్ఛ ఉందని సంతోషించేదాన్ని. ఆ రోజు నువ్విచ్చిన క్రీము పూసుకుంటే ఏమై ఉండేదనుకున్నావు? మా నాన్న పేర్చుకున్న కుటుంబ సౌఖ్యమంతా పునాదులతో సహా కూలిపోయేది. కాస్త పౌడరు వేసుకున్నా ఒక సిల్కు చీరె కట్టుకున్నా నరకయాతన పడతాడని తెలిసి మా నాన్నకు మే మిద్దరమూ లొంగిపోయి యమ చెరలను భవించాం. నీకేం తెలుస్తుంది? ఆ రోజు మీ బంధువుల ఇంట్లో పెళ్ళికొచ్చినప్పుడు నన్ను మా తాతయ్య పెళ్ళి కూతురల్లే ముస్తాబు చేయించాడే. అప్పుడు నిలువుటద్దంలో నన్ను నేను చూచి ఏడిచాను. తెలుసా? నేనేం పాపం చేశాను. నేను వీలయినంత అందంగా ఎందుకుండగూడదూ? అందరూ నన్ను చూసి ఎందుకానందించగూడదూ? అందువల్ల ఏ ఆదర్శాలకు భంగం వస్తుందీ?"

నర్సు కళ్ళు తుడుచుకున్నది.

"జరిగినదాని కెందుకు బాధపడతావు. అయిందేదో అయింది. ఇకనైనా నీ సుఖం నువ్వు చూచుకో," అన్నాను.

నేను తనతో పూర్తిగా ఏకీభవించటంలేదని నర్సుకు తోచి ఉండాలి. "నేనన్నదాన్లో అబద్ధమేమన్నా ఉన్నదా?" అన్నది.

"నేనేదన్నా అంటాననుకో. అది నీకు మళ్ళీ ప్రతిబంధక మవుతుంది. నువ్వు మీ నాన్నను గురించి అనుకుంటున్నది నీకు స్వేచ్ఛలాగా కనిపిస్తే స్వేచ్ఛ అనుభవించే హక్కు నీ కున్నది" అన్నాను.

"నీ మాటలు నాకు కొంచెంకూడా అర్థంకావటం లేదు. నే నన్నదంతా అబద్ధమంటావా?"

"అనను. నీ వైపునుంచి అంతా నిజమే. కాని ప్రపంచంలో చాలా నిజాలున్నాయి, నర్సూ! వాటన్నిటినీ తెలుసుకున్నకొద్దీ బుర్ర చెడిపోతుంది."

"ఇంకోవైపునుంచి నిజం యెట్లా ఉంటుందో చెప్పు - ఇంకో నిజం!"

"కావాలంటే చెబుతాను. మీ నాన్నలో ఏ కోశానా క్రూరత్వం లేదు- నాకు తెలిసిన మట్టుకు. ఆయనకు జీవితాన్ని విశాలంగా చూసే అలవాటున్నది. నన్నడిగితే ఆయన మేధావి - ఇంటలెక్చువల్. మీ అమ్మ సంగతి నాకు తెలీదు. నీకు విశాల దృక్పథం లేదు. ఉండాలని నేనను. నీ బుద్ధి నగలమీద ఉండగా నువ్వు ఆశ్రమ వాసిలాగా జీవించగూడదు. నీకు సొంత భావాలు లేని పరిస్థితిలో సహజంగా మీ నాన్న భావాలు అరువు తెచ్చుకున్నావు. అవి నీకు పనికిరావు-ఆ మాటకువస్తే నాకూ పనికిరావు. పనికివస్తే నీకు క్రీమివ్వను, మీ తాతయ్య దరికి తీసుకుపోను, ఇంకా చాలా చెయ్యను. నిన్ను నువ్వు అద్దంలో చూసుకుని యెంత

సంతోషించావో నేను కనీసం అంతా సంతోషించాను. కాని అసలు సంగతి అదీ కాదు. మీ నాన్నమీది గౌరవంకొద్దీ నువ్వు నీ స్వేచ్ఛను నిగ్రహించుకుని, ఆయన నీ స్వేచ్ఛను అరికట్టాడను కుంటున్నావు. నిజమైన స్వార్థపరుడు మీ తాతయ్య. మీ నాన్నలో యేకోశానా నాకు స్వార్థమన్నది కనిపించలేదు. మీతాత పైకి చూపించిన ప్రేమ చూసి భ్రమసిపోయి ఉంటావు. మీ నాన్నకు నీ పైన అంత ప్రేమా ఉండి ఉంటుందని నీకు తట్టలేదు. నువు లేకుండా మీ గుంటూరు యింట్లో ఉండటాని కాయన ఫంకు తిన్నాడు - ఆ సంగతి నీకు తెలుసా? నిన్నిక్కడికి పంపించటం కోసం ఆయన ఆ రూరల్ డిస్పెన్సరీలోనే ఉండిపోదామనీ, శ్రీధర్ యిస్తానన్న చాన్సు పోగొట్టుకుందామనీ అనుకున్నాడు. అది తన దౌర్బల్యమని తోచింది కామాల్సు, దాన్ని జయించటానికి గుంటూరు వచ్చేశారు. మీ అమ్మదీ, నీదీ ఒక అసి ధారావ్రతమా ఆయన దానిముందు?"

నా మాటలు నర్సు కెంతవరకు అర్థమయాయో, అసలు అర్థమయాయో లేదో నాకు తెలీదు. ఆమె చాలాసేపు మౌనంగా ఉండి, "నేనూ, మా అమ్మా కూడా మా నాన్న అభిప్రాయాలు ఖాతరు చెయ్యకుండా మా యిష్టం వచ్చిన బట్టలు కట్టుకుని మా యిష్టం వచ్చిన షోకులు చేసుకుని ఉండవలసిందంటావు?" అన్నది.

"తప్పకుండానూ."

"అట్లా చేస్తే ఆయన మమ్మల్ని గురించి హీనంగా అనుకుని ఉండడా?"

"అనుకుంటే అనుకోనీ. ఆయన ఆదర్శాలు నీవి కానప్పుడు ఆ సంగతి స్పష్టం చెయ్యటం మంచిదా లేక అవే నీవైనట్టు నటించి ఆయనను మోసగించటం మంచిదా? అదీ కాకా, మీ నాన్నకు తన ఆదర్శాల్లో నిజమైన నమ్మకం ఉంటే వాటిని ఇతరు లామోదిస్తున్నారా, లేదా అని బాధపడతాడా? నీకు ఐశ్వర్యంలో ఓలలాడటం ఆదర్శమనుకో, మిగిలినవాళ్ళు నిన్నుచూసి కళ్ళల్లో నిప్పులు పోసుకుంటారని నీవు అనుకుంటావా?"

నర్సు మళ్ళీ ఆలోచించింది. చాలాసేపుండి, "మా తాతయ్యది స్వార్థమన్నావు దేనికి?" అన్నది.

"ఎరవేసి చేపలు పట్టేవాడిది స్వార్థం కాదేమిటి? నిన్ను ఐశ్వర్యంలో ఓలలాడించడమే ఆయన ఉద్దేశమైతే మీ నాన్నకు తన ఆస్తిలో భాగం యివ్వ చ్చునే. మీ నాన్న యేమి ద్రోహం చేశాడని పగబట్టాడూ? తన కిష్టంలేని పెళ్ళి చేసుకున్నాడనేగా? రేపు నీగతీ అంతేగా! ఆయన కిష్టంలేని పెళ్ళి చేసుకుంటే నిన్ను వీధిలోకి గెంటడూ? ఒకవేళ గెంటకపోతే యెందుకు గెంటడో నేను

తెలుసుకోవచ్చా? నిన్ను మీ నాన్ననుంచి వేరుచెయ్యటంకాదా మీ తాతకు కావలసింది?"

"అట్టా అయితే నాకా నగలన్నీ పెట్టి యింటికి పంపిస్తాడా ఆ రోజున?"

"ఎర, నర్సూ, ఎర! నగ లిచ్చాడుగాని డబ్బివ్వలేదే. మీ నాన్న ఆ వగలు అమ్ముకోడనీ, వాటితో మీ నాన్న దారిద్ర్యం తీరదనీ ఆయనకు తెలుసు. నిన్ను డబ్బుకన్న నగలు ఆకర్షిస్తాయి! బాగుండలా ప్లాను?"

"నా కోసమైనా మా నాన్న ఆ నగలెందుకు ఉంచుకుని ఉండరాదు?"

"నీ కోసం ఆయన యెర వేస్తుంటే మీ నాన్న సహించగలడా? నేనే సహించ లేనుగద!"

"మా నాన్నకు నేను ఆ నగలుపెట్టుకోవటం యిష్టంలేదు. ఆడవాళ్ళు నగలు పెట్టుకోవటం ఆయన ఆదర్శాలకు విరుద్ధం. నీకేమీ తెలీదు."

"మళ్ళీ అసిధారావ్రతం తలుచుకుని బాధపడుతున్నావు. ఆ రోజు నీవు మీ తాతను కలుసుకోవటానికి సర్కిలుగారింటికి వెళ్ళినందుకాయన నిన్ను పల్లెత్తు మాట అన్నాడా?"

"తెలిస్తే అనేవాడేమో."

"ఆయనకు తెలుసు."

"తెలుసునా? ఎవరు చెప్పారు?"

"నేనే చెప్పాను."

"నువ్వా? ఎందుకు చెప్పావు?"

"నీ సుఖం కోసం! నీకు మీ తాతదగ్గిరికి పోవటం యిష్టమేనని ఆయనకు తెలియగలందుకు. నీ అసలు అభిప్రాయాలు నువు దాచిపెట్టి మీ నాన్నను మోస గిస్తుంటే, తన అభిప్రాయాలే నీవని ఆయన అనుకుంటూ వచ్చాడు. అదే ఆయన నీకు చేసిన ద్రోహం!"

ఎందుకో నర్సు మళ్ళీ కంటనీరు పెట్టుకొంటూ,"నాది పొట్టి దరిద్రపు బతుకు. నా కెక్కడా సుఖంలేదు. నేను గుంటూరు వెళ్ళిపోతాను. రేపేపోదాం. ఇక్కడికి రావటమే పొరపాటు," అన్నది.

"అంతలోనే నీకు నగలమీదా, సుఖాల మీదా అసహ్యం పుట్టిందని నాన్నను కోరుకున్నావా?"

"నేను ఇక్కడికి రావటం నాదే తప్పంటివిగా?"

"నేనన్లేదు."

"వేరే అనాలా ఏమి!"

"నేనంటే మటుకు నువ్వెందుకు లెక్క చెయ్యాలి, నేనింతసేపూ చెప్పింది కొంచెంకూడా బుర్రకెక్కలేదా? మీ నాన్న ఏదో అనుకుంటున్నాడని నీ మనసుకు బిరడాకొట్టుకుని ఆయనమీద పగ పెంచుకున్నావు. నా మీదకూడా పగపెంచుకుందా మనా నీ ఉద్దేశం?"

"నాకు మతిపోతున్నది. ఇంతకూ నన్నేం చెయ్యమంటావు?"

"నీకేం చెయ్యాలనుకుంటే అది చెయ్యమంటాను. వాళ్ళకోసమూ, వీళ్ళ కోసమూ నీకిష్టమైనవి చెయ్యటం మానుకుని ప్రపంచం నిన్ను హింసపెట్టినట్లు మాత్రం భ్రమపడకు. నీకు మీ తాతయ్యదగ్గరే ఉండాలనుకుంటే తప్పకుండా వుండు. ఇక్కడుండటం బాధ అని తోస్తేనే మీ నాన్నదగ్గిరికి వెళ్ళు."

"ఇక్కడుంటం బాధెందు కనిపిస్తుందీ."

"అయితే గుంటూరు పోతానకు."

"అనకపోతే నన్ను చూస్తే నీకు అసహ్యం వేస్తుంది."

"నిన్ను చూస్తే నా కెన్నటికీ అసహ్యం వెయ్యదు."

నర్సును స్నేహంగా ఒక చేత్తో పొదివి నాకేసి నొక్కుకున్నాను.

"నువు మాత్రం వెళ్ళిపోతానకు, నాకు తప్పకుండా పిచ్చెత్తుతుంది" అన్నది.

"నిన్ను చూస్తుంటే నాకిప్పుడే వెర్రెత్తుతున్నది" అన్నాను.

"చాలా పొద్దుపోయింది. పెందలాడే పడుకోమన్నాడు తాతయ్య."

ఇద్దరమూ లేచి హాల్లోకి వచ్చాం. నేను కటకటాల తలుపులు గడియపెట్టి వచ్చేసరికి నర్సు గదికేసి పోతున్నది. ముసలాయన భయంకరంగా గురక పెడు

నేను నా మంచందాకా వచ్చి నర్సుగదికేసి చూశాను. నర్సు లోపలికి వెళ్ళక వాకిట్లోనే నిలబడివున్నది. ఎవరో గాలం వేసినట్లుగా నే నామెదగ్గిరికి వెళ్ళి, ఆమెను గదిలోకి తీసుకుపోయాను. ఆ రాత్రి మేం నిద్రపోలేదు.

## 9

మర్నాడు డాక్టరుగారికి ఉత్తరం రాశాను; నర్సుకు తాతగారి ఇంట్లో బాగానే ఉన్నదిగాని, కొత్తచోటుకావడంచేత ఒంటరితనం ఫీలవుతున్నది; కొద్ది రోజులపాటు, ఆమెకి కొత్త వాతావరణం అలవాటయేదాకా, నన్ను వెళ్ళనిచ్చేటట్టులేదు; నాకైనా అర్జంటుగా వెళ్ళవలసిన చోట్లేవీ లేవు గనక, నాలుగు రోజులిక్కడే ఉంటాను. మొత్తంమీద తాతగారు పంతం నెగ్గించుకున్నారు.

ఆ ఉత్తరం నర్సుకు చూపించి పోస్టులో వేశాను.

ఆరోజే నర్సు తన నగల్లో మోటుగావున్నవి అమ్మేసి నాజూకైనవి కొనే కార్యక్రమం పెట్టింది. ఆమె తాతగారితో ఇట్లా చేస్తానని చెబితే "నీ యిష్టంవచ్చినట్టు చేసుకో తల్లీ. నీ చేతికి అడ్డేమిటి?" అన్నాడు.

గుర్రబ్బండీలో నేనూ నర్సూ మధ్యాన్నం దాటాక బజారు కెళ్ళాం. నగల షాపులు చాలా తిరిగాం. నర్సుకు అక్కర్లేని నగలు మారిస్తే అరుజతల బంగారు గాజులూ, మూడు పేటల గొలుసూ, ఒక రవ్వల ఉంగరమూ వచ్చాయి. డబ్బింకా మిగిలింది.

నర్సు ఇంకా ఉంగరాలు పరీక్షిస్తూండటం చూసి, "మరో ఉంగరం కొంటా వేమిటి?"

"అవును. నీకూ!" అన్నది.

"నన్ను వదిలేస్తావా?" అన్నాను.

"వదల్ను" అన్నది నర్సు.

ఆ దుకాణం వాళ్ళ ఎదుట నర్సుతో ఘర్షణ పడటం ఇష్టంలేక నాకొక పచ్చ వేసిన ఉంగరం కొననిచ్చాను.

ఇంటికి తిరిగి వస్తూనే నర్సు తాతగారి ముందు నిలబడి చేతులాయన మొహాన పెట్టి "బాగున్నాయా తాతయ్యా గాజులు! ఈ ఉంగరం! ఈ గొలుసు!" అన్నది.

వరండాలో పడకకుర్చీలో చేతులు తలకింద పెట్టుకుని కళ్ళు మూసుకుని ఉన్న ముసలాయన బద్ధకంగా కళ్ళు తెరచి, చిన్నగా నవ్వి, "ఎందుకు బాగుండవు తల్లీ? నువ్వేది పెట్టుకున్నా బాగానే ఉంటుంది" అన్నాడు.

ఆయన కిప్పుడు తన మనవరాలిని చూసుకుని అనుక్షణమూ మురిసిపోవాలిసిన అగత్యమేమీ లేదు. చేప బుట్టలో పడింది.

అన్నట్టు నువ్వొకసారి కనకదుర్గ గుడికి వెళ్ళిరావాలి, తల్లీ. నా లక్ష్మిని నా దగ్గిరికి చేరుస్తే పూజ చేయిస్తానని మొక్కుకున్నాను. రేపో ఎల్లుండో వెళ్ళితా!" అన్నాడు ముసలాయన.

నర్సు ఏమీ అనకుండా వచ్చేసింది. ఇద్దరమూ మెట్లెక్కేటప్పుడు "ఈగుళ్ళూ, పూజలూ ఏమిటి?" అన్నది.

"ఏమిటనుకున్నావు మరి? అందరికీ దారిద్ర్యాన్ని పంచే పెద్దమ్మ అదుపాజ్ఞలు లేకుండా తిరిగేది. లక్ష్మీదేవి మహా విష్ణువు యొక్క వక్షస్థలాన్ని అంటిపెట్టుకుని ఉండేది. దేవుడికి తలవంచనిదే లక్ష్మి కటాక్షించదు. కనకదుర్గ అంటే ఏమిటి? కనకం ఉన్నచోటే దుర్గ కూడా ఉంటుంది" అన్నాను.

"నాకు నిజంగా పిచ్చెత్తుతున్నది" అన్నది నర్సు.

"ఏమీ ఎత్తదు! అన్నింటికీ అలవాటు పడిపోవు."

తనకు పిచ్చెత్తుతుందనే అనుకున్నది గాని, తన కిక్కడ ఏనాడు బాగా లేకపోతే ఆనాడు తండ్రి దగ్గిరికి వెళ్ళిపోవచ్చునన్నది నర్సుకు ఆ క్షణాన స్ఫురించకపోవటం గమనించదగినది.

అయినా నర్సును నేను గాఢంగా ప్రేమించాను. ప్రేమించినవాడికి రెండే మార్గాలు. ఉన్న మనిషిని ఉన్నట్టుగా ప్రేమించాలి. లేదా తాను ప్రేమించే మనిషిలో ప్రేమపాత్ర గుణాలుంటే వాటిని సంస్కరించుకోవాలి. మూడో మార్గం ప్రేమకు తిలోదకా లిచ్చుకోవడమే. మనిషిని మనిషి పనిపెట్టుకొని సంస్కరించటం దాదాపు అసంభవమనే నా అనుమానం. అంతకంటె ఎవరికి వారుగా మారటం చాలా తేలిక. నా అభిప్రాయాలలోనూ, దృక్పథంలోనూ కొంత వరకు ప్రవర్తనలోనూ అనేక మార్పులు జరిగాయి; అన్నీ నేను కోరి తెచ్చు కున్నవే. అందుచేత నర్సును ఉన్న పళంగానే ప్రేమించాను.

మా ప్రేమ నాకెంత అవసరమో నర్సుకు కూడా అంత అవసరమే; మా ఇద్దరివీ మోడు జీవితాలే. రాత్రివేళ మాకేమీ అడ్డులేదు గాని పగటివేళ వంటావిడ మా పైన ఒక కన్నువేసి వుంచుతున్నదని నాకు అనుమానం వేసింది. నర్సు తాడు విప్పిన లేగదూడలాగా ప్రవర్తిస్తున్నది. కాస్త జాగ్రత్తగా ఉంట మని హెచ్చరించాను.

"నా యిష్టం! నేను వంటదానికి భయపడతానా?" అన్నది నర్సు. ఆ స్వేచ్ఛ ఉన్నదనే కదా నర్సు యిక్కడికి చేరింది.

ఆ వారం నర్సు కనకదుర్గ గుడికి ప్రయాణం కాక తప్పలేదు. నన్ను కూడా రమ్మంటే నేను రాననేశాను. నర్సు నా పైన అలిగి, పక్కిచేసే దంప తులను వెంటబెట్టుకుని గుడికి వెళ్ళింది.

నేను వంటావిడకి ఒంటరిగా దొరికిపోయాను.

"బాబుగారు నాకేమీ చెప్పరు. మీరూ మీరూ బంధువులా నాయనా? దూరపు బంధుత్వమా? మీ ఇంటి పేరు? ఓహో! మా శాఖేనన్నమాట. పిల్ల మన శాఖవాళ్ళు కారే? బంధుత్వమెట్లా కుదిరిందీ? అవునులే. ఈనాడు కులాలే పాటించకుండా పెళ్ళిళ్ళవుతున్నాయి. శాఖ లెవరు చూస్తారు? మా పెత్తల్లి మనవరాలు ఎవరో మరాఠీవాణ్ణి చేసుకున్నది. వాళ్ళిప్పుడు బెలగాంవులో ఉంటు న్నారు. శాఖలు వేరైతేనేం? మీరిద్దరూ నిక్షేపంగా పెళ్ళి చేసుకోవచ్చు. మిమ్మల్ని చూస్తుంటే పెళ్ళయి కాపురం చేస్తున్నవాళ్ళనే ఎవరన్నా అనుకుంటారు?" అన్నది వంటలక్క.

"శ్రీమంతుల మనవరాలు నన్నెందుకు చేసుకుంటుందండీ? మీ కేమన్నా పిచ్చా యేమిటి? చాలా ఏళ్ళుగా ఎరగటం చేతా, ఇక్కడ మీరంతా కొత్తవాళ్ళు గనుకా నన్ను పట్టుకు వేళ్ళాడుతున్నది. ఇవాళో రేపో నా దారి నేను పోతాను. మళ్ళీ వచ్చినాక నన్ను మీ లక్ష్మి పలకరిస్తుందని కూడా నాకు నమ్మకం లేదు."

"అట్లాగా? నాకు తెలీదు నాయనా! అయితే చూడూ. బెలగాంవులో ఉన్న దంటినే. దాని ఆఖరు చెల్లెలున్నది. దాన్ని చేసుకోరాదూ? మనశాఖే! వాళ్ళు కట్నాలూ కానుకలూ ఇవ్వలేరు. బాబూ! గుళ్ళో పెళ్ళిలాటిది చేసి పిల్లను చేతిలో పెడతారు. ఉత్తరం రాయమన్నావూ?"

"మీరు తొందర పడకండి. నాకోసం మా అక్కయ్య అయిదారు సంబంధాలూ, మా బాబాయి పది పన్నెండు సంబంధాలూ చూసి వుంచారు. ఇంకా నా చదువు రెండేళ్ళున్నది. అది అయినదాకా పిల్లల్ని కూడా చూదననేశాను. వాళ్ళను చూడబోయేటప్పుడు మీ వాళ్ళ పిల్లను కూడా చూస్తాను" అన్నాను.

అంతటితో ఆవిడ నన్ను మర్యాదగా వదిలి పెట్టిపోక మళ్ళీ నర్సు విషయం ఎత్తింది. "వాళ్ళమ్మ విధవరాలుటగా? ఒక మొగుడితో కాపురంకూడా చేసిందన్నారే? బాబుగారికీ, కొడుక్కూ మాటల్లేకుండా పోయింది అందుకేటగా?"

"చూడండి, సూరమ్మ పిన్నిగారూ! అయిదుసార్లు విధవలైనా సంసార సుఖమూ పిల్లలను కనటమూ సాధ్యమే. బాబుగారికి నిజంగా కొడుకు చేసినపని తప్పనితోస్తే, ఆ కొడుక్కూ, ఆ విధవరాలికీ పుట్టినపిల్లను తెచ్చి యింట్లో ఎందుకు పెట్టుకుంటారూ? కొడుకు చెడిపోయినవాడైతే, మనవరాలు చెడబుట్టినది కాలేదుటండీ?"

"అట్లా చూసుకుంటూపోతే అందరూ వెలే అవుతారు మరి. ప్రతి సంసారంలోనూ ఏదో సంకరం ఉంటూనే ఉంది. మా ఊరి మునసబు అచ్చగా వాళ్ళ కవంతగాడి పోలిక. అందరికీ తెలుసు. నోళ్ళు నొక్కుకుని ఊరుకున్నారు."

ఆవిణ్ణి ఈ ధోరణిలో మాట్లాడనిస్తే జీవితం మీదనే జుగుప్స కలిగించే ట్టు కనబడింది. మా దూరపు బంధువు వొకడు ఉన్నాడు. వాడు యెక్కడికి పోయిన రోతపుట్టే విషయాలే మాట్లాడేవాడు. వాడి సమర్థన ఏమిటంటే తాను చెప్పేవన్నీ యథార్థమని 'నిజం ఎంతొట్టుపడితే అంతొట్టు!' అనేవాడు. చూసి, చూసి, వాడికి 'పాయిఖానాల ఇనస్పెక్టర్' అని పేరు పెట్టేశారు. మరీ చనువు లేనివాళ్ళు, 'శానిటరీ ఇనస్పెక్టరు' అనేవాళ్ళు.

సూరమ్మగారిలోకూడా పాయిఖానాల ఇనస్పెక్టర్ లక్షణాలు కొన్ని లేక పోలేదు.

కిందినుంచి పనికుర్రాడు, "సూరమ్మగారూ" అని పిలిచి నన్ను బతికించాడు.

"వచ్చె, వచ్చె!....పాపిష్టిలోకం! మనం ఇట్లా మాట్లాడుకున్నామని తెలిస్తే చాలు-ఏదో ఒకకూత కూస్తారు"! అంటూ నాలో ఒక చిన్న ఆశ నాటి, నెత్తిమీది ముసుగు సవరించుకుని వంటలక్క వెళ్ళిపోయింది.

రోజులు గడిచిపోతున్నాయి. ఎండలు మండిపోతున్నాయి. నర్సు కొంచెం లావు చేసి నునుపెక్కి చాలా ఆకర్షవంతంగా తయారవుతున్నది. ఒక్కోరోజు మధ్యాహ్నం నుంచే రాత్రికోసం ఎదురు చూడసాగేవాణ్ణి. మా ఆనందానికి హద్దులేమీ లేవు.

"ఇదే నా క్కావలసింది? ఇంతకుమించిన ఆనందం ఎవరికీ ఉండదు!" అనేది నర్సు.

అటువంటి భ్రమలు లేకపోతే మనిషి బతకలేడు.

సూరమ్మగారింకా మమ్మల్ని-కనీసం నర్సును-వదిలిపెట్టలేదు.

"నీకు నెల ఎప్పుడమ్మాయ్?" అని అడిగిందట.

"ఏమో ఎందుకీ ఆరాలు?" అని నర్సు విసుక్కున్నదిట.

"ఏముందీ? నువు వచ్చి నెల దాటింది గదా? ఇంకా వాకిట ఉండలేదేమో అని. బాబుగారు ఆచారం మనిషి" అన్నదిట సూరమ్మ.

దొంగముండ! నర్సు కడుపుతో వున్నదేమో నని అనుమానమై వుంటుంది.

"పోనీ నువుకూడా ఒక చెంబూ, చాప తీసుకుని నెలకు మూడు రోజులు విడంగా కూర్చుంటూ వుండు. వంటలక్క నీకు విస్తట్లో తెచ్చి అన్నం పెడుతుంది. అన్నం తిన్న తరువాత విస్తరి ఎత్తేసి దొడ్డివాకిలిన బయటికి తీసుకుపోయి పారెయ్యి. తరువాత వంటలక్క ఇంత పేడ ఇస్తుంది. అది పెట్టి అన్నం తిన్నచోట అలుకు. ఆ తరవాత వంటలక్క నువు అలికినచోట ఇంత ఆవుపంచితం చిలికి శుద్ధిచేస్తుంది" అన్నాను

"ఛీ ఛీ!" అన్నది నర్సు.

మరి కొన్నాళ్ళ తరువాత ఒక రోజున ఉదయం పూట మేం హోటలు ఇడ్లీ తినేటప్పుడు నర్సు కొంచెం ఇడ్లెను తిని అక్కర్లేదని వదిలేసి, వంటలక్కను కాఫీ తెమ్మన్నది.

"పైత్యం వికారంగా ఉందా అమ్మాయ్?" అని వంటలక్క మామూలుగా అడిగినట్లే అడిగింది.

"అవునండీ" అన్నది నర్సు. పిచ్చిమొద్దు.

"డాక్టరుకు చూపించటం మంచిదేమో!" అంటూ వంటలక్క వెళ్ళి పోయింది. ఇడియట్? నర్సుకప్పుడు పీరియడ్? నాకు రెండు రోజులుగా ఉపవాస వ్రతం....

రిజల్ట్సు వచ్చాయి. పాసయాను-సెకండ్‌క్లాస్ పాస్.

"ఇంక చదవకు'' అన్నది నర్సు.

"చదవక మట్టి కొట్టుకోనా?" అన్నాను.

"ఇప్పుడు మట్టి కొట్టుకుంటున్నావా?"

"బాగుంది నువ్వనేది. ఇక్కడ ఇట్లాగే ఉండమన్నావా? ఇప్పటికే నేను చేస్తున్నది విడ్డూరమైన పని. చదవటం తప్పదులే. ఏం చదవమన్నావు. బియ్యే ఉత్త ముడిపదార్థం. దాన్ని ప్రోసెస్ చెయ్యాలంటే ట్రెయినింగన్నా చదవాలి. లేకపోతే లా చదవొచ్చు."

"అవును బాగుంది. లా చదువు" అన్నది నర్సు.

నేను లా చదవటం అన్న ఐడియా చెపినపడ్డాక నర్సు నా చదువు కర్తవ్యం తరం చెప్పలేదు. తనకొక లాయరు అవసరం కలుగుతుందని నర్సు అప్పుడే అనుకుని వుండాలి.

"సరే. పోనీ లా చదువుతాను" అన్నాను.

లా కాలేజీకి అప్లికేషన్ పడేసి మద్రాసు బయలుదేరాను. బయలుదేరేటప్పుడు నర్సు, పాపం పెద్ద సీనేమీ చెయ్యలేదు. ఉత్తరాలు రాస్తూండమన్నాను. శలవులిచ్చినప్పుడల్లా వస్తానన్నాను. డాక్టరుగారికి నర్సు ఒక్క ఉత్తరం కూడా రాయలేదింకా. మరిచిపోకుండా రాయమన్నాను. అన్నిటికీ తల ఊపింది.

పట్నం చేరుతూనే నర్సుకూ డాక్టరుగారికీ కూడా ఉత్తరాలు రాశాను. మరో రెండు రోజుల తర్వాత నర్సుకు ఇంకో ఉత్తరం రాశాను - నర్సు ప్రతి క్షణమూ జ్ఞాపకం వస్తున్నది. నాకు చదువంటేనూ, పట్నమంటేనూ రోతగా వున్నది.

తంబుచెట్టు వీధిలో కొంచెం దూరంగా ఒక మేడమీది గది పదిరూపాయలకు దొరికింది. ఆ ఎడ్రసు నుంచే ఉత్తరం రాశాను. మొదటి ఉత్తరాల్ని రాసేటప్పుడు నాకింకా ఎడ్రసు లేదు - హోటల్లు గదితప్ప. నా రెండో ఉత్తరానికి నర్సు జవాబిచ్చింది - తన విషయం ఆలోచించక శ్రద్ధగా లా చదవమన్నది. నేను వెళ్ళినాక తనక్కాడ అడివిలో ఉన్నట్టే ఉందిట. తను ముట్లుమైల ఇంట్లో కలపటం విషయం వంటలక్క చాలా పేచీ పెట్టుకున్నదిట. ఆవిడకు అనాచారం పనికిరాదుట. తను మాత్రం చచ్చినా చాప తీసుకుని ఎడంగా కూర్చోనని చెప్పిందిట. ఏ పక్షానికీ ఇంతా పూర్తి విజయం చేకూరినట్టు లేదు.

శలవులు రాగానే బెజవాడలో వెళ్ళి వాలాలనిపించింది. ఆవేశాన్ని నిగ్రహించుకుని తెనాలిలో దిగి, మా బాబాయి వాళ్ళ ఇంట ఒక్కపూట ఉండి, సాయంకాలానికల్లా గుంటూరు చేరుకుని డాక్టరుగారింటికి వెళ్ళాను.

డాక్టరుగారింకా ఆస్పత్రినుంచి రాలేదు. సుందరమ్మగారు రంగొచ్చి, చాలా మారిపోయినట్టు కనిపించింది. కారణం వెంటనే తెలియలేదు-ఆవిడ మళ్ళీ కడుపుతో ఉన్నది.

డాక్టరుగారు వచ్చేసరికి ఎనిమిది దాటింది. ఆయన నన్నుచూసి చాలా సంతోషించాడు.

"నర్సు లేకపోతే ఇల్లు కాస్త చిన్నబోతూనే ఉంది" అన్నాను.

"మొదట్లో చాలా గ్లూమీగా ఫీలయాం, కాని మాకు అలవాటైపోయింది. నర్సు కులాసాగా ఉందా?" అన్నాడాయన.

"ఏమోనండి. నేను శెలవుల్లో చూడడమే. ఎప్పుడన్నా ఒకఉత్తరం రాస్తుంది. అందులో ఏమీ ఉండదు" అన్నాను.

"కూపస్థమండూకం మాదిరిగా పెరిగింది. ఉత్తరాలు రాయటం అలవాటు లేదు. రాయటాని కెవరున్నారు. నర్సు జీవితం ఇప్పుడు కాస్త విశాలంగా ఉండి ఉండాలి.... మా మటుకు మాకు నర్సు పెళ్ళిచేసుకుని అత్తారింటి కెళ్ళిపోయి నట్టుగా ఉంది. వెళ్ళినచోట సుఖంగా ఉన్నదన్నదే తృప్తి" అన్నాడు డాక్టరుగారు.

అత్తవారింటికి వెళ్ళిపోయిన పిల్ల నర్సుకన్నా చాలా నయంకాదా? ఎప్పుడన్నా అమ్మకూ, నాన్నకూ ఒక ఉత్తరం రాయటానికేం? ఏం మనిషి? ఒకవేళ అదివరలో తండ్రిపైన పగ ఉండినా? ఇప్పుడు తనకు కావలిసింది దొరికిందిగా! ఇప్పుడు తండ్రితో మంచిగా ఉంటేనేం? డాక్టరుగారిని తన తాతగారు వెలివేసినట్టే తను వెయ్యాలా?

నాకు నర్సుని గురించి ఆలోచిస్తున్నకొద్దీ బాధ జాస్తి అయింది. ఆ విషయం మనసులో నుంచి నెట్టేసి, "మీ కిప్పుడున్న పని బాగానే ఉన్నట్టుందే?" అన్నాను.

"హెవీ వర్క్! ఇవాళమటుకివాళ దాదాపు ముప్పై ఇంజక్షన్లిచ్చాను. రెండు మైనర్ ఆపరేషన్‌లు చేశాను. నర్సింగ్ హోం పెద్ద సక్సెస్. శ్రీధర్, అఫ్‌కోర్స్ డబ్బు బాగానే ఇస్తున్నాడు. నేనెప్పుడూ డబ్బుతో సుఖాలు కొనుక్కోలేదు. అవసరాలు మాత్రమే గడుపుకుంటూ వస్తున్నాను. అందుచేత డబ్బు జాస్తి రావటం లెక్కలోకి రావటంలేదు. పుస్తకాలు చదవటానికి లేదు. డెడ్ టైర్డ్‌గా వచ్చి భోజనం కాగానే పడుకుని నిద్రపోతాను. మేజర్ ఆపరేషన్‌లు చేసినన్నాడు

తిండీ సుఖంకూడా ఉండదు. నర్సింగ్‌హోమ్‌లో అవికూడా జాస్తిగానే ఉంటున్నాయి."

వర్తమాన పరిస్థితి అంతగా రుచించనివాడు గతం గురించి స్మరించటం సహజం. డాక్టరుగారు పాతరోజుల్ని గురించి మాట్లాడుతూ నాకు పెద్ద కాంప్లిమెంటు పారేశాడు. నేను వెళ్ళిపోయాక ఆయనకు పుస్తకాలు చదవటంలో ఆనందం సగానికి సగం తగ్గిపోయిందిట.

"ఈ శలవులు కొద్దిరోజులే గామాలు. నీ ప్రోగ్రామేమిటి? నర్సును చూసే అవకాశం ఉంటుందా?" అని ఆయన అడిగాడు.

"అవునండీ, రేపు బెజవాడ పోదామనుకుంటున్నాను."

"అయితే నా భార్య మళ్ళీ కడుపుతో ఉన్నదని నర్సుకు చెప్పు. అయిదో నెల. ఏ ఫిబ్రవరిలోనో డెలివరీ కావచ్చు.... సైకలాజికల్ ఎఫెక్ట్ అయి ఉంటుంది-నర్సు బెజవాడ వెళ్ళిపోగానే నా భార్యకు మెన్‌స్ట్రుయేషన్ నిలిచిపోయింది. ఇటువంటి ఫిజియలాజికల్ ప్రోసెస్‌లు మరింత బాగా మన కంట్రోలులో ఉంటే జీవితం ఇంకా మెరుగవుతుంది" అన్నాడాయన.

మర్నాడి బెజవాడ చేరుకున్నాను. నన్ను ముసలాయన లగాయతు పనికుర్రాడు దాకా అందరూ సంతోషంగానే రిసీవ్ చేశారు. నర్సుమటుకు మూతిముడుచుకుంది. శలవు లివ్వగానే నేను వచ్చి యెందుకు దూకలేదని? మొన్నరాత్రి దిగవలసినవాడివి యివాళ మధ్యాహ్నం దిగుతావా? ఏమిటి నీ ఉద్దేశం?

ప్రణయ కోపమేగదా అని నర్సు కోపం పోగొట్టటానికి చాలా ముద్దుచేశాను. ఎండలో పెట్టిన పేర్నెయ్యిలాగా నర్సు యెంతకీ కరగలేదు. ఆమెను మురిపిద్దామని "అన్నట్టు మీ అమ్మకు అయిదోనెలట!" అన్నాను. ఆ మాట నర్సుమీద బ్రహ్మాస్త్రంలాగా పనిచేసింది.

నర్సు మొహంలో కలిగిన మార్పు ఆనందం సూచించేదిగా కనబడలేదు.

"ఆవదం తాగిన మొహం పెట్టావేం?" అన్నాను.

"ఇప్పుడింకా వాళ్ళకు పిల్లలేమిటీ? పెళ్ళయి ఉంటే నాకూ పిల్లల్ని కనేయీడే కదా! నాతోబాటు ఆవిడా కంటూంటేష్ట్ర చూసేవాళ్ళ కెంత అసహ్యం!" అన్నది.

అందులో కొంత అర్థం ఉంటే ఉండవచ్చు ననుకున్నాను. అయితే నర్సు యింకా లోతుగానే ఆలోచించింది. ఆ రాత్రి మేం ప్రపంచాన్నే మరిచి, పారవశ్యంలో పడికొట్టుకు పోతూండవలిసిన తరుణంలో నర్సు, "చూడూ, మా అమ్మకి రిసామగపిల్లవాడే పుడితే తాతయ్యకు నామీద ఈ ప్రేమ ఉండదు, కాదూ?" న్నది.

నా రక్తం ఒక్కసారిగా చల్లబడినట్టయింది.

"ఏమో, ఏం చెప్పగలం?" అన్నాను.

"అది కాదు. మా అమ్మ కడుపుతో ఉందని తెలియకముందే తాతయ్య ఆస్తి అంతా నా పేర రాయించేసుకుంటే?" అన్నది నర్సు.

ఆమె మనసు వక్రంగా పనిచేస్తుండవచ్చు. కాని ఆ సంగతి నా దగ్గిర దాచటానికే ప్రయత్నమూ చెయ్యలేదు. నా కామెపట్ల అసహ్యమూ, జాలీకూడా ఒకే సారి కలిగాయి. ఈ కర్ణ దుర్యోధన సంబంధం మా కిద్దరికీ అనాదేర్పడి యీనాటి దాకా నడుస్తూనే ఉంది.

"నీకో తమ్ముడు పుట్టినంత మాత్రంచేత మీ తాత నిన్ను గాలికి వదిలేస్తా డనుకోను. తన ఆస్తి మీ నాన్నకు చెందకుండానూ, నీకే చెందేట్టూ యేనాడో ఆయన విల్ రాసి ఉంటాడు. నీకు తమ్ముడు పుట్టితే - చెల్లెలు పుట్టినా కూడా - ఆ విల్ చించేసి యింకోటి రాస్తాడు. అంతకన్న యింకేమిటవుతుంది?"

"విల్లులు రాయటం కాదు. నీకు తెలీదు, ఆస్తి రాయించేసుకుని రిజిస్టరు చేయించుకుంటే దానికి చలనం ఉండదు."

నేను షాకై, "నీ పుట్టబోయే తమ్ముడికేమీ దక్కకుండానా?" అన్నాను.

"నన్ను బొత్తిగా పిశాచిని చూసినట్టు చూస్తున్నావు. నేను మా నాన్నకూ, తమ్ముడికీ అన్యాయం చేస్తాననేనా నీ అనుమానం? నా పుట్టబోయే తమ్ముడిదాకా యెందుకు? ఇవాళ నేను మా నాన్నకో వంద రూపాయలు పంపాలంటేమా తాతయ్యకు తెలీకుండా పంపగలనా? తెలిస్తే ఆయన ఒప్పుకుంటాడా?" అన్నది నర్సు.

"ఊరికే వాదనకోసం మాట్లాడకు, నీకూ, నాకూ మధ్య దాపరికాలేమిటి? మీ నాన్నకూ, అమ్మకూ కావలసింది డబ్బుకాదు - ఒక్క ఉత్తరం ముక్క! ఆరు నెలల్లో ఒక్క కార్డు రాశావా? మీ మధ్య ఉత్తరం ప్రత్యుత్తరాలు జరుగుతూంటే మీ అమ్మకు అయిదో నెల అని నేను చెప్పవలసిన గతి పట్టేదా?" అన్నాను.

నర్సు నా మెడలో మొహం దాచుకుంటూ "ఎన్నో సార్లనుకున్నాను. నాకు యేం రాయాలో, ఎట్లా రాయాలో తెలియటం లేదు. నీ తోడు" అన్నది.

నిజమే అయి ఉంటుంది.

## 10

తాత ఆస్తి తనపేర రిజిస్టరు చేసేటందు కేంచేయాలో అదంతా చూసే భారం నాపైన వేసి రోజూ నన్ను పీడించసాగింది నర్సు. ఏంచెయ్యాలో నాకు మటుకేం తెలుసు? అప్పుడే నేను లాయరునైపోయా ననుకుంటున్నది నర్సు. అయినా ఇది

లాయర్లద్వారా తేలేదికాదు. ముసలాయన మీద ఏదో తస్సావేసి పని జరిగించాలి. అంత చాణక్యం నాలోలేదు. అందుచేత నేను ఉపేక్ష చేస్తూ వచ్చాను. ప్రతి రాత్రీ నర్సు నన్ను సలపటం మానలేదు.

ఒకనాడు ముసలాయన, "అబ్బాయ్, నా హెల్త్ డిటీరియరేటై పోతున్నట్టుగా ఉంది. వయసు చూడూ! ఏ క్షణాన యములవాళ్ళు నాకోసం వస్తారో చెప్పలేం. నాతోబాటు ఎన్రోలైన వాళ్ళలో అందరూ చచ్చారు. ఆఖరువాడు శేషగిరికూడా కిందటి నెల పోయాడు" అన్నాడు.

"మీకేమండీ? మరో థర్టీయియర్స్ నిరాఘాటంగా బతుకుతారు" అన్నాను.

"బతికితే చేదా ఏమిటి? కీడెంచి మేలెంచాలిగా? మన లక్ష్మికి మంచి సంబంధం చూసి పెళ్ళి చేసేద్దామని ఉంది. నీ ఎరికని మంచి సంబంధాలేవైనా ఉన్నాయా?" అన్నాడు ముసలాయన.

ఇంకా నాకిచ్చి చేస్తానంటాడనుకున్నాను! దుర్మార్గుడు.

"లేకేమండీ నా క్లాస్‌మేట్స్‌లోనే పెద్ద పెద్ద ఐసీయస్‌ల కొడుకులూ, లక్షాధికార్ల కొడుకులు, కార్లలో కాలేజీకి వచ్చేవాళ్ళూ ఉన్నారు. మన లక్ష్మికి మీ ఆస్తంతా రాసేసే ఉంటారనుకుంటాను-కళ్ళకద్దుకుని చేసుకుంటారు." అన్నాను.

"నాకున్నదంతా దానికే విల్ చేసేశానులే. ఆస్తంతా దానిదే?

"విల్ అంత బలంగా ఉండదేమోనండీ. ఎవరన్నా కంటెస్టు చెయ్యొచ్చు. ఏకంగా రాసెయ్యక పోయారా? అందువల్ల నష్టమేమిటి? మీరున్నంత కాలమూ మీ అథారిటీకేమీ తభావతుండదు గదా! పిల్ల స్టేటస్ మరింత పెరుగుతుంది. నాకన్న ఈ సంగతులు మీకే బాగా తెలియాలి సుమండీ." అన్నాను.

ఆయన కొంచెం ఆలోచించి, "నువ్వన్న దాన్లోకూడా సబబు లేకపోలేదు. రేపు మన ఆచార్లను పిలిపిస్తాను. అతనితో మాట్లాడదాం," అన్నాడు.

నేను మద్రాసుకు తిరిగి వెళ్ళేలోపల ముసలాయన ఆస్తి అంతా నర్సు పేర రిజిస్టరై పోయింది. నర్సు చివరికి నాలుగు రోజులూ నాపైన కురిపించిన ప్రేమకు తడిసి చీకిపోయాను.

ముసలాయన నర్సుకు సీరియస్‌గా సంబంధాలు వెతుకుతున్నట్టు ఉత్తరం వచ్చింది. నా పెళ్ళి అదివరకే అయిపోయిందని తాతయ్యతో ఎలా చెప్పటం? వంటలక్క చమత్కారం చేసింది. 'ఈడూగా ఉంటారు. పట్నంలో చదివే అబ్బాయికే యిచ్చి చెసెయ్యరాదా!' అన్నది. తాతయ్య నవ్వి "అతడు బుద్ధిమంతుడే గాని నా లక్ష్మికి అదేం మొగుడు? అంత కన్న పదిరెట్లు మంచి మొగుణ్ణి తెస్తాను. నా సంగతి నీకేమీ తెలీదు. అన్నాడు?" అని నర్సు రాసింది.

నాకేం జవాబు రాయటానికీ తోచలేదు. నిజం చెప్పాలంటే, నర్సులోనే నాకు నమ్మకంలేదు. రేపు ముసలాయన చాలా మంచి సంబంధంతెస్తే ఆమెకు పెళ్ళాడా అని పించవచ్చు. నర్సుకు అన్యాయం చెయ్యటానికి చెప్పటం కాదు: ఆమె మనస్సు అలా మారకపోతే నాకు సంతోషమే. నేను ప్రేమిస్తున్న మనిషి నన్ను ప్రేమించటం మానేస్తుందనుకోవటం నాకు మాత్రమేం సుఖం? కాని ఆమె మనస్సు మార్చుకుంటే తప్పు పట్టడానికి నర్సుపైన నాకున్న హక్కు ఏమిటి? ప్రేమించక పూర్వం ఆమె తన మనస్సులో ఎవరినీ ప్రేమించి ఉండిలేదన్న గ్యారంటీ ఏమైనా ఉన్నదా? అందులో ఇప్పుడామె ఐశ్వర్యవంతురాలు. ఐశ్వర్యం మనిషిని మార్చకపోతే ఆశ్చర్యం గాని, మార్చితే ఏమీ ఆశ్చర్యం లేదు.

ఈ కారణంచేత నేను నర్సుకు, "మీ తాత చెప్పే సంబంధాలన్ని యేదో వంక పెట్టి నిరాకరించు," అని రాయలేక పోయాను. లోపల మాత్రం ఆ మాట రాయాలనే ఉన్నది. కాని నేను వాస్తవంగా రాసిందేమిటంటే: "ఆయన చూసే సంబంధాల విషయంలో ఏ నిర్ణయం చేసినా ఆయనకు కోపం తెప్పించకుండా మాత్రం జాగ్రత్తపడు." అని.

ఆ ఉత్తరం రాయటంలో పడిన జాగ్రత్త వృధాఅయింది. నర్సు రాసిన రెండో ఉత్తరంబట్టి ఆమెకు మరొకరిని చేసుకునే ఆలోచన ఏ కోశానాలేనట్టు స్పష్టమయింది.

"నాకేమిటి భయం? నాకు సంబంధాలు చూడవద్దనీ, నాకు కావలసినవాణ్ణి నేనే చూసి చేసుకుంటానని తాతయ్యతో అనేశాను. నేను వద్దన్నానా, తల్లీ? ఆ చేసుకునే దేదో నా కళ్ళఎదటే చేసికో?' అన్నాడు తాతయ్య. సరే నన్నాను. అసలు గొడవ అదికాదు. నాకు ఈసారి పీరియడ్ యిరవై రోజులు లేటయింది. ఇంత లేటు సాధారణంగా కాదు. నా కేదో భయంగా ఉంది." అని నర్సు రాసింది.

నాబుర్ర వేడెక్కింది. నర్సు ఒకవేళ కడుపుతోందా? ఉంటే ఏం చెయ్యాలి? మేమిద్దరమూ పెళ్ళిచేసుకోవటంతప్ప గత్యంతరంలేదు. అదైనా రహస్యంగా జరగాలి. ముసలాయన గొడవ చెయ్యగలడు.

ఎమర్జన్సీ ఏర్పడితే ఏం చేయాలో ఆలోచించి ఉంచాను. "ఇంకా పది హేను రోజులలో కూడా పీరియడ్ రాకపోతే నాకురాయి" అని నర్సుకు రాశాను.

నర్సునుంచి మరో రెండు వారాల అనంతరం ఉత్తరం వచ్చింది. ఆమెకు కడుపే, మార్నింగ్ సిక్‌నెస్ కొంచెంగా ఆరంభమయిందట.

పాడుముండ వంటలక్క, "పైత్య వికారమమ్మా! కాస్త పుల్లగా యేదన్నా నాలుక్కి రాసుకో. అదే తగ్గుతుంది." అన్నదిట.

నేను నాప్లాను అమలులో పెట్టాను. డాక్టరుగారికి ఉత్తరం రాశాను. నా ప్లానే ఫలిస్తే, డాక్టరుగారు ఏదో ఒక ఘోరకారణం సృష్టించి నర్సును గుంటూరు తెప్పించుకుని, అక్కడ నుంచి పట్నం పంపించాలి. పట్నంలో నర్సును పదిహేను రోజులుంచుకుని, రిజిస్టర్ మారేజి చేసుకుంటాను. నర్సు నన్నే పెళ్ళిచేసుకోవాలని చాలా పట్టుదలగా ఉన్నది. ఎవరినో కొండమీది కోతిని తెచ్చి చెయ్యాలని ముసలాయనకు మరింత పట్టుదలగా ఉన్నది. "మీ సహాయం లేకుండా మా పెళ్ళి జరగదు. మీ అమ్మాయి కోసమూ, నా కోసమూ కూడా మీరే సహాయం చేసితీరాలి" అని నేను డాక్టరుగారికి పెద ఉత్తరం రాశాను.

అదే రోజు నర్సుకు ఒక ఉత్తరం రాస్తూ, "నిన్ను ఒక్కసారి గుంటూరు పిలిపించాలని మీ నాన్నగారు అనుకున్నట్లున్నది. ఆయన నీక్కూడా ఉత్తరం రాయవచ్చు. ఉత్తరం రాగానే బయలుదేరి వెళ్ళు. ఆ తరువాత మన ఇద్దరి సమస్య పరిష్కార మౌతుంది" అని రాశాను.

డాక్టరుగారి దగ్గర నుంచి తిరుగు టపాలో జవాబు వచ్చింది. నన్నే గుంటూరు రమ్మనీ, మా పెళ్ళి తానే చేయిస్తాననీ ఆయన రాశారు. తన టెలిగ్రాం అందగానే బయలుదేరటానికి సిద్ధంగా ఉండమన్నారు.

మరో నాలుగైదు రోజులకు టెలిగ్రాం వచ్చింది. రాత్రి మెయిలుకు బయలుదేరి గుంటూరు చేరాను. నర్సు వచ్చి వున్నది.

"మా తాత చాలా పేచీ పెట్టాడు. పెద్ద పోట్లాట జరిగింది. నేనాయనకు ఎదురు తిరిగి నానా మాటలు అడగాలిసొచ్చింది. ఆయనకు దడిచి మా నాన్నకూ, అమ్మకూ ఉత్తరం కూడా రాయకుండా ఉన్నందు కిదేనా మెప్పని అడిగాను. నాకంత కోపం ఎన్నడూ రాలేదు. నా వెర్రికోపం చూసి ఆయన తగ్గి కాళ్ళ బేరానికివచ్చాడు. నౌకరు వచ్చి రైలుస్టేషను దాకా పంపాడు. నేనింకో రైలు ఎక్కుతానని భయమో ఏమిటో" అన్నది నర్సు.

మళ్ళీ డాక్టరుగారిల్లు వెనుకటిలా వున్నది. కాకపోతే ఇప్పుడిద్దరు గర్భిణీ స్త్రీలున్నారు. పెళ్ళిళ్ళ రిజిస్ట్రారు దగ్గిర అప్లికేషను వేశాం. పదిహేను రోజుల అవతల మాకు చట్టబద్ధంగా వివాహమయింది.

వెంటనే పట్నం పోదామనుకున్నాను గాని డాక్టరుగారు రెండు రోజులుండమని కోరాడు.

మా పెళ్ళి అయిన మూడోనాడే బెజవాడనుండి మనిషి వచ్చాడు. ముసలాయనకు స్ట్రోక్ వచ్చిందట. డాక్టరుగారు అపాయము శంకించి "అందరమూ బయలుదేరుదాం. అంతగా మేమిద్దరమూ ఏ హోటల్లో అయినా దిగుతాం. రైలు ఆలస్యమవుతుంది. బస్సులో పోదాం" అన్నాడు.

బస్సులో వెళ్ళినాకూడా మేము బెజవాడ చేరేసరికి దీపాలు పెట్టారు. అందరమూ ముసలాయన ఇంటికెళ్ళాం. తిన్నగా డాక్టరుగారు పైకివెళ్ళి తండ్రిని చూశాడు. అంతకు మునుపే వచ్చిన డాక్టరు "లాభంలేదు. నిమిషాలో వుంది" అని మాకు చెప్పాడు.

మరో ఇరవై నిముషాలకు ముసలాయన అస్తమించాడు. ఆ రాత్రి అందరమూ శవజాగారం చేశాం. జవలేని మనిషి సుందరమ్మగారు కూడా, ఎంతమంది చెప్పినా నడుం వాల్చలేదు.

మర్నాడు డాక్టరుగారే తండ్రి తలకు కొరివి పెట్టాడు.

* * *

ఆ తరువాత చెప్పవలసిందాటే లేదు. తాతగారి ఆస్తి నర్సుదఖలైంది తల్లినీ, తండ్రినీ తనవద్దనే వుండమని అడిగింది. వాళ్ళిద్దరూ ఒప్పుకోలేదు.

"ఎప్పుడు కావలిస్తే అప్పుడు వచ్చి పోతుంటాం. ఇప్పుడు నీ యిల్లే గదా!" అన్నాడు డాక్టరుగారు.

నేను మద్రాసు తిరిగిపోలేదు. నేను తిరిగి రావటంలేదనీ, గది మరెవరి కన్నా యిచ్చుకోవచ్చుననీ మా ఇంటివాళ్ళకు రాసేశాను.

ఫిబ్రవరి మొదటివారంలో డాక్టరుగారి భార్య మరొక ఆడపిల్లను కన్నది. బారసాల అంటూ జరగలేదుగాని, పిల్లపుట్టిన పదకొండో రోజున నర్సు తల్లి దండ్రులకూ, చెల్లెలికీ చాలా కట్నాలూ, కానుకలూ తెచ్చింది. అప్పటికి నర్సుకే అయిదునెల్ల కడుపు.

ఆమె కాన్పుకు డాక్టరుగారూ, భార్యావచ్చి పదిహేనురోజులున్నారు. నర్సు మగపిల్లవాణ్ణి కన్నది. ముసలాయన పేరుపెట్టుకుంటే బాగుంటుందని డాక్టరుగారన్నారు. నరసింహారావని వాడికి పేరుపెట్టాం.

నాకు నర్సు భర్తగా ఉండటంతప్ప వేరే ఉద్యోగం లేదు. అప్పుడప్పుడూ కథలు రాసి నా అస్తిత్వాన్ని సమర్థించుకుంటూ వస్తున్నాను. డాక్టరుగారు కూతురు దగ్గరకువచ్చి ఉన్నట్లయితే ఆయనక్కూడా పనీ పాటా లేకుండాపోయి ఉండేది. నా మాదిరిగానే ఆయనకూడా నర్సు జీవితం జీవిస్తూ కూర్చోవలసి వచ్చేది.

నర్సు ఆస్తిని జలగలాగా పట్టుకున్నది. "అందులో సగం నీ చెల్లెలికి రాసియిచ్చెయ్యి. మీ తాత ఆస్తి అనుభవించడానికి నీకెంత హక్కున్నదో దానికి అంతా ఉన్నదే" అని ఒక్కసారి బుద్ధితక్కువై సూచించాను.

నర్సు తోకత్రొక్కిన తాచల్లే అయి, "ఎందుకూ? నా చెల్లెలికి ఏ లోపమూ రాకుండా నేను చూస్తానని నీకు నమ్మకం లేదా? దానికి కావాలన్నంత చదువు

చెప్పిస్తాను. ఎంత కష్టమైనాసరే ఇచ్చి మంచి మొగుణ్ణి తెస్తాను. నావాళ్ళ పైన ఉన్న ప్రేమ చూపటానికి డబ్బుతప్ప - ఆస్తితప్ప - మరేముంది? అన్నది.

మాటలు వేరేమోగాని భావాలు ముసలాయనవే.

మరుసటి సెప్టెంబరులో యుద్ధం వచ్చేసింది.[1] డాక్టరుగారు యుద్ధంతో పోతాడు. ఆయన తిరిగి వచ్చినదాకా సుందరమ్మగారూ, పిల్లా మాదగ్గిరే ఉన్నారు. డాక్టరుగారి జీతంలో కొంత వాళ్ళకు ముట్టుతూనే వచ్చింది.

ఆ రోజుల్లో నర్సు ప్రవర్తనను నేను జాగ్రత్తగా గమనిస్తూ వచ్చాను. తల్లి తనను ఏమీ అడక్కపోవటం నర్సుకు బాధగా ఉండేది. ఈవిడ తనను రోజూ డబ్బులో, చీరెలో, వస్తువులో అడుగుతూ, తనపైన ఆధారపడిఉంటే నర్సు పరమానందం చెంది ఉండేది. కాని అలా జరగలేదు.

"ఎంత డబ్బు లుంటేనేం? నాకు నిజంగా నువు తప్ప ఎవరూలేరు!" అని నర్సు నాతో చాలాసార్లన్నది.

నిజమే. నేనొక్కణ్ణే ఆమెపైన బతుకున్నవాణ్ణి!

యుద్ధంనుంచి తిరిగి వచ్చాక డాక్టరుగారు గుంటూరులోనే ప్రాక్టీసు పెట్టారు. ఇప్పుడాయనది మంచిప్రాక్టీసు. కాని వాళ్ళఇంటి వాతావరణంలో మార్పులేదు. ఇంకొంచెం ఫర్నిచరు జాస్తి ఉన్నది. డాక్టరుగారి లైబ్రరీ ఇప్పుడు చాలా పెద్దది.

మాఇంట్లో ఖరీదైన వస్తువులున్నాయి గానీ, సంస్కృతిలేదు రేడియోగ్రాం అస్తమానం మోగుతుంటుంది. అది నిశబ్దంగా ఉంటే నర్సుగాని పిల్లలు గాని సహించరు. అది మోగుతుంటే వినరు. మా యింటినిండా గుట్టలు గుట్టలుగా డిటెక్టివు పుస్తకాలు!

ఎప్పుడన్నా గుంటూరు వెళ్ళినపుడు నా ప్రాణానికి హాయిగా ఉంటుంది. వాళ్ళింట్లోకూడా రేడియో వుంది. అది మోగుతున్నప్పుడు కూడా ఇల్లు ప్రశాంతం గానే ఉంటుంది.

నా మరదలు సరోజిని మాపెద్దవాడి ఈడుదే. కాని మావాడు ఏకులాగా ఉంటాడు. సరోజిని చాలా బాగా వుంటుంది. మా పిల్లలందరి తల లోనూ వాల్యూ లున్నాయి. వాళ్ళ తలలో పుట్టే భావాలు బయటికొస్తాయి గాని బయటినుంచి ఒక భావం కూడా వాళ్ళ తలలోకి ప్రవేశించినట్టు కనబడదు.

నాకా, మానవ ప్రయత్నంలో - అంటే నా ప్రయత్నంలో - విశ్వాసం పోయింది. నన్ను చాలా మంది మిష్టర్ నర్సు అంటారని నాకు తెలుసు.

ముద్రణ: ఏప్రిల్ 1965 నుంచి ఫిబ్రవరి 1966 వరకు
ధారావాహికం, ఆంధ్రప్రదేశ్ మాసపత్రిక

---

1. రెండవ ప్రపంచయుద్ధం. వివరాలు వారసత్వం నవలలో చూడండి.

ఆ చెక్కు చేతికి రావటానికి రంగారావు చేసిన శరీరశ్రమ ఏమీలేదు. అయినా అతనికి ఒక రోజల్లా బస్తాలు మోసినంత శ్రమ అయినట్టనిపించింది.

తనను కోరి తెచ్చుకున్న ప్రొడ్యూసర్ తనంతట తానే రెండు వేలిస్తాననీ. అంతకంటే ఇచ్చే తాహతు తనకు లేదనీ అన్నాడు. రంగారావు బేరమాడలేదు, మొదట చేతిలో పెట్టిన ఆయనే తరువాత దమ్మిడీ ఇవ్వలేదు. కాఫీలూ, సిగరెట్లు, కార్లలో తిప్పటమూ, ఎప్పుడన్నా సినిమాలకు తీసుకపోవటమూ, టిఫినులూ, రెండు మూడు సార్లు బీరూ, బ్రాందీ, కోడిమాంసంతో భోజనమూ- ఇంతే-

రాస్తున్నంత కాలమూ రాత అయిపోగానే యిస్తారని ఓర్చుకున్నాడు రంగారావు. అదే కష్టమయింది. ఆ నూరు రూపాయలు ఏనాడో అయిపోయాయి. ఆ తరవాత, పాపం! చిన్న చిన్న వేషాలు వేసుకునే హనుమంతరావు అనే అతనికి తన రెండు నవలలూ అంటె ఎంతో అభిమానం - ఆ హనుమంతరావు రెండూ మూడూ చేబదుళ్ళిస్తూ వచ్చాడు.

రాయటం పూర్తి అయి మూడు నెలలయింది. ఈ మూడు నెలలూ డబ్బు అడగకుండా నిగ్రహించుకోవడం రంగారావుకు శ్రమ అయింది. వెనుక వారపత్రిక వాళ్ళు తన సీరియల్ పూర్తి అయినాక పదిరోజులకు డబ్బు పంపితే "ఇవ్వవలసిన డబ్బు పదిరోజులు తొక్కిపెడితే వీళ్ళకేం తృప్తో! ఈ నవలలు రాసేవాళ్ళందరూ లక్షాధికార్లనుకొంటారు గాములు" అని చిరాకు పడ్డాడు. కాని మూడు నెల్లతో పోలిస్తే ఆ పదిరోజులెంత!

రంగారావు డబ్బుకోసం బాధపడటంతో బాటు యింకా అనేక విషయాలకు బాధపడ్డాడు.

తనను రాఘువయ్యగారు పిలిపించి పిక్చరుకు రాయాలన్నప్పుడు కథ కూడా తని చేతనే రాయించుకొంటారని రంగారావు అనుకున్నాడు. కాని కథ అదివరకే అనుకున్నారు. ('నీకు తెలీదాయేంటి? సినిమా కథలు రాయటానికి నీలాటోళ్ళు పనికిరారు. దానికి కారుడ్రైవర్లూ, టైపిస్టులూ, మేకప్పు మాన్లూ ఆళ్ళంతా ఉంటారు' అన్నాడు హనుమంతరావు నవ్వులకు.)

నిజానికి కథ ఎవరురాసినా రంగారావుకు ఒకటే - కథకు తలా తోకా ఉంటే, అదే శోభింపించింది. అనుమానిస్తూ అనుమానిస్తూ రంగారావు ఆమాటే అంటే రాఘవయ్య గారు "లోపాలుంటే మనం సరిచేసుకోవాలి. మిమ్మల్ని పెట్టింది అందుకేగా?" అన్నాడు.

"ఇచ్చట కథలు రిపేరు చేయబడును!" అన్న సైన్‌బోర్డు రంగారావు తలలో మెదిలింది.

రాఘవయ్యగారు రంగారావు రాసిన పది, పన్నెండు కథానికలుగానీ ఆ రెండు నవలల్లో ఏ ఒకటిగాని చదవలేదట! తనను ఆయన ఎందుకు పెట్టుకున్నాడో రంగారావుకు అర్థంకాలేదు.

ఒకరోజు ఒక పేరుమోసిన సినిమా రచయిత ఆఫీసుకు వచ్చాడు. సినిమా స్క్రిప్టులకు సాహిత్య గౌరవం అన్న విషయాన్ని తానే తెచ్చాడు. తెచ్చి "ఈ కాలంలో ప్రతి కుమ్మరీ, దొమ్మరీ సాహిత్యం రాస్తుంటే ఇంకా సాహిత్య గౌరవ మేమిటి, నా మొహం!" అన్నాడు.

రంగారావు కామాట గుండల్లో తగిలింది.

అవును, తను పండితుడు కాడు-పన్నెండో ఏట ప్రెస్‌వర్కర్‌గా జీవితం ప్రారంభించినవాడు కంపోజిటరుగా ఉంటూ ఒక చిన్న పత్రిక ద్వారా సాహిత్యాభి లాష అలవరచుకున్నాడు. ఆ రోజుల్లో కవులూ, కథకులూ పట్నాలకు చేరలేదు. వాళ్ళు కొందరు ప్రెస్సుకు వచ్చేవాళ్ళు. వాళ్ళ రచనల ప్రూఫులు వాళ్ళే చూసుకునే వాళ్ళు.

వాళ్ళతో మాట్లాడటం తనను రచయిత కావటానికి ప్రోత్సహించింది. తనకు భాష రానిమాట నిజమే-కాని 'వ్యావహారిక భాషకు ఒక స్వరూపం రావ టానికి యింకా రెండు మూడు తరాలు పడుతుందనీ, అంతదాకా ఎవరు వాడే భాషను వారు రచనకు ఉపయోగించడమే కర్తవ్యమనీ' అన్నారు. తనకు ఇంగ్లీషు రాదు. అటువంటి వాళ్ళ రచనే జాతీయంగా ఉంటుందన్నారు. ప్రజాస్వామ్యంలో అందరికీ రాసే హక్కుందన్నారు.

ఇన్నిరకాల ప్రోత్సాహం లభించిన మీదట రంగారావు సాహసించి ఒక చిన్న కథ రాశాడు. దాన్ని పత్రికలో వేసుకున్నారు. తానే కంపోజు చేశాడు. ఆ ఆనందం జన్మలో మరిచేదికాదు! ఆ చిన్న కథనుంచి సినిమాలదాకా తోసుకు వచ్చాడు. ఒక చిన్న పాత్రను సరిగ్గా పోషించలేని ఈ సినిమా రంగంలో తానొక కుమ్మరీ దొమ్మరీ అనిపించుకున్నాడు. రంగారావు రక్తం ఉడికిపోయింది. కాని, ఆ అవమానాన్ని కిక్కురుమనకుండా దిగమింగాడు...

స్క్రిప్టు రాస్తున్నంత కాలమూ రంగారావుకు అంపశయ్యపై ఉన్నట్టే ఉన్నది. సినిమా ప్రపంచం తెలియకా, మొగమోటపడి కొన్ని రకాల మర్యాదలు పాటించి అతను మొదట్లో లేనిపోని హైరానపడ్డమాట నిజమే. కథ తనది కానప్పుడు దాని జోలికి తానెందుకు పోవాలనుకున్నాడు; కాని కథ విషయంలో ఎవరు పడితే వాళ్ళు సూచనలు చేయవచ్చుననీ, దమ్మిడీ పుచ్చుకోనివాళ్ళు కూడా ఒక్కొక్కప్పుడు పనికివచ్చే సూచనలుచేస్తారనీ, పై వాళ్ళుచేసే సూచనలలో కొన్ని ఆమోదించబడతాయనీ అతనికి తెలిసి వచ్చింది. ఇతర పిక్చర్లలోని సంఘటనలూ, ఐడియాలూ కాపీ కొట్టడం గురించి మొదట్లో రంగారావుకు ఎంతో పట్టింపుగా వుండేది. కాని ఇది కూడా రివాజేనని తెలుసుకున్నాడు.

కాని మరికొన్ని విషయాలు అతను అంత సులువుగా ఆమోదించలేక బాధపడ్డాడు. కథను వారాల తరబడి దిద్ది, సవరణలుచేసి, అకస్మాత్తుగా విసర్జించేశారు. ఇవాళ చాలా అద్భుతంగా ఉన్నదని రాసుకున్న సీను మరిరెండ్రోజులకు కొట్టిపారేశారు. ఒక నటుడు డబ్బు కోసం వచ్చి చెక్కును చూడకుండానే ముడిచి జేబులో పెట్టేసుకుని వెళ్ళిపోతూ "అన్నట్టు స్క్రిప్టు ఎందాకా వచ్చిందో!" అన్నాడు. అక్కడక్కడా చదివి, "ఓయబ్బా" "ఇవేం సంభాషణ లండీ!" "ఇది కూడానా!" అని అతి తేలికగా విమర్శించి, కారెక్కి వెళ్ళిపోయాడు.

అతను స్క్రిప్టు మూసివేసినదాకా రంగారావు శరీరంలో రక్తప్రసరణ దాదాపు నిలిచిపోయినంత పని అయింది. తరువాత సెట్టుమీద ఒక నటి, "ఎవరయ్యా ఈ సంబాషణలు రాసింది?" అని అడిగింది. "బాగాలేకపోతే నీ యిష్టం వచ్చినట్లు మార్చు" అని డైరెక్టరన్నాట్ట. అప్పటికి రంగారావుకు ఆ స్క్రిప్టుతో అన్ని విధాలా ఋణం తీరిపోయింది-దాని బాపతు డబ్బు చేతికి రావటం తప్ప.

చివరకు పట్టలేక రాఘవయ్యగారిని రంగారావు డబ్బు అడిగాడు. రాఘవయ్యగారు కోప్పడలేదు. విసుక్కోలేదు. తన కష్టాలు చెప్పుకున్నాడు. వాటిని గురించి రంగారావు సానుభూతితో వినవలసిన అవసరమేమీ లేదు. కాని రచయితగా ఎవరేది ఉద్రేకంగా చెబుతున్నా వినటం అలవాటు చేసుకుని ఉండటంచేత విన్నాడు. పత్యావసానమేమిటంటే, రాఘవయ్య కష్టాలలో ఉన్నాడు. స్టూడియో వాళ్ళూ, పెట్రోలు కంపెనీ వాళ్ళూ, ప్రాపర్టీలు అద్దెకిచ్చే వాళ్ళూ, నటీనటులూ, ఆర్కెస్ట్రా వాళ్ళూ, అమాంబాపతూ, డైరెక్టరూ, రాఘవయ్య గారికి శత్రువులైపోయి, జలగల్లాగా ఆయన రక్తం పీల్చేస్తున్నారు. ఆయన చెప్పుకున్న వాటిలో అయిదేసివేల పద్దులూ, పదేసివేల పద్దులూ ఉన్నాయి. ఒక్క కొడాక్ వాళ్ళకు అమాంతంగా పన్నెండు వేల చెక్కు ఇవ్వవలసి వచ్చింది. ఒక్క ఫ్లైబాక్ పాటకు, ఆవిడగారు వెయ్యి,

గుంజేసింది. అందులో ఆరువందలు బ్లాకు అని చెప్పకుంటే తీరే కష్టాలు కావు.

ఇంతమంది శత్రువుల చేత పీడించబడే రాఘవయ్యగారికి తాను ఒక్కడే అప్పడన్నమాట! ఆ శత్రువులు వేలకు వేలు గుంజడం స్వాభావికం, రంగారావు తనకు రావలసిన కొద్ది మొత్తం-కనీసం అందులో సగం-కోరటం అస్వాభావికం!

తనను మిత్రవర్గంలో చేర్చిన రాఘవయ్య గారు పేరునుబట్టో ఏమో, ఆయనను చూసినప్పుడల్లా రంగారావుకు తన తండ్రి లాంటి వాడనిపించేది! మిత్రుడుగా తన కష్టాలెందుకు వినగూడదు? ఇదేం మానవత్వం? మానవత్వమంటే మన కష్టాలు ఇంకోరితో పంచుకుని, మన సుఖాలు మనకే ఉంచుకోవటమా? ఇతరుల కష్టాలను గురించి ఆలోచించను కూడా ఆలోచించక పోవటమా? రంగారావు తన మూడో నవలకు బీజం వేసుకుని దానికి "మానవత్వం" అని పేరు కూడా నిశ్చయించాడు.

"కొంతైనా ఇప్పించండి. చాలా కష్టంగా ఉంది. దొరికిన చోటనల్లా చేబదుళ్ళు చేశాను" అన్నాడు రంగారావు. ఇది రాఘవయ్యకే అప్రతిష్టగా పరిణమించి అందరూ నవ్వుతున్నారని కూడా అందామనుకున్నాడు గాని మానేశాడు. రాఘవయ్య ప్రొడ్యూసరుగా ప్రతిష్టను పట్టుకు వేళ్ళాడే మనిషయితే తనని బుక్‌చేసి ఉండడేమోనని రంగారావుకు అనుమానం కలిగింది.

"నేనివ్వననలేదే!" అన్నాడు రాఘవయ్య, తన సత్యసంధతకు కళంకంవచ్చిన హరిశ్చంద్రుడి వాలకంతో. "కొంచెం-నాలుగు రోజులు-ఆగితే-కొంతైనా తప్పక సర్దుతాను. నీకూ తెలుసుగా! డిస్ట్రిబ్యూషన్ టరమ్స్ దగ్గిర కొంచెం పేచీగా ఉంది. లేకపోతే...."

నాలుగు రోజులు పద్నాలుగు రోజులయింది. డిస్ట్రిబ్యూటరిచ్చే చెక్కు కోసం రాఘవయ్య కన్న రంగారావు పదిరెట్లు ఆత్రంగా కూచున్నాడు. చెక్కు వస్తే తనకు తెలపమని ఆఫీసు బాయి దగ్గిర నుంచీ అనేకమంది కాళ్ళు పట్టుకున్నాడు.

చివరకా శుభదినం రానేవచ్చింది. ప్రొడక్షనాఫీసు 'కొలుపుల రోజున గంగానమ్మ గుడిలాగే' సందడిగా ఉంది. పెద్ద స్టార్లకు చెక్కులు కారులో వాళ్ళ ఇళ్ళకు వెళ్ళాయి. (వారితో ఒకరు డిస్ట్రిబ్యూషను సెటిలయ్యేదాకా కాల్‌షీట్‌కు పిలవవద్దని కూడా చెప్పేశారుట!) అంతకన్న తక్కువ గ్రేడువాళ్ళు రాఘవయ్యగారి గదిలో చేరి మామూలుకన్న మరికొంచెం ఉత్సాహంగానూ, ఆనందంగానూ మాట్లాడుతున్నారు. చిల్లరబాపతు హాల్లో చేదురు మదురుగా నిలబడి రకరకాల పోజుల్లో కనబడ్డారు కొందరు రాఘవయ్యగారి గదికేసి తలుపావ కళ్ళగరేస్తే

మంకొందరు "దానికంతా ఉందిలే!" అన్నట్టు తల రుబ్బుడు పొత్రంలాగా ఆడించటమూ "నాకే నమ్మకం లేదు" అన్నట్టు మూతి విరవటమూ, "అంతా వాడిదయ" అన్నట్టు కళ్ళుమూసి ముఖం కప్పుకేసి ఎత్తటమూ చేశారు. కొందరు తాము డబ్బు కోసం రానివాలకం పెట్టి చిన్న గొంతుకలతో "ఇంకేవో" విష యాలు మాట్లాడుకుంటున్నారు.

అందరికన్నా ఆలస్యంగా వచ్చిన రంగారావు ఆ అమాంబాపతుతో చేరి పోయాడు.

"మాతో నీకెందుకు. నువు లోపలికి వెళ్ళవయ్యా" అన్నట్టు ఒక చిల్లర నటుడు రంగారావు మీద అభినయం చేశాడు. కాని రంగారావు గదిలోకి ప్రవే శించలేదు. బొత్తిగా ప్రాథమికావసరాలకు కూడా డబ్బులేని బాకీదార్లకు ఆ గదిలో తావులేదు. తనతో మరీ ఎక్కువ అవసరం ఉన్న వారివద్దకు లక్ష్మి ఆఖరుకు వస్తుంది.

అదే అయింది కూడా. లోపలివాళ్ళను సాగనంపుతూ బయటికి వచ్చిన రాఘవయ్య గారు వికసించిన మొహంతో అమాంబాపతు వాళ్ళ మధ్యకు వచ్చి "ఇక మనకేమీ చింతలేదు. మీరంతా రేపురండి! ఇచ్చేస్తాను" అన్నాడు.

"రేపు మళ్ళీ రాహుకాలమూ, యమగండమూ, వారశూల ఉండకుండా చూడండి బాబూ!" అన్నాడు చిన్న కామెడియన్ సత్తెం. అందరూ నవ్వారు. ఈ అకాలపు హాస్యం తరువాత, ఆ రోజే నిలదీసి డబ్బు వసూలు చేసుకుందామని తీర్మానించుకున్నవాళ్ళ ఆట కట్టయిపోయింది.

"అంతేమరి, బంతిభోజనాలయినాకే యేనాదాళ్ళకు యెంగిలాకులు! పండ గెళ్ళి మర్నాదే పాకీవాళ్ళ మామూళ్ళు" అన్నాడు రంగారావు.

అతడు కడుపుమండి అన్నప్పటికి-ఈ మాటలు అక్కడివాళ్ళకు ఘాటుగా తగులుతాయని అతడు ఊహించలేదు. అందరూ ఒక్కసారి స్థంభించి పోయినట్టు అతనికి అనిపించింది.

రాఘవయ్య అతనికేసి తిరిగి "నువ్విక్కడే ఉన్నావా? లోపలికి రాక పోయావా?" అంటూ భుజంమీద చెయ్యివేసి గదిలోకి తీసుకుపోయి, ఎకౌంటెంట్ రామస్వామితో "రంగారాకు ఫైవ్ హండ్రెడ్ చెక్కు ఇవ్వండి. రేపటి డేట్ వెయ్యండి" అనిచెప్పి, "నేనలా స్టూడియోకేసి వెళ్ళొస్తానూ!" అంటూ వెళ్ళి పోయినాడు.

తరువాత అరగంటసేపు కూచోబెట్టి రామస్వామి "మీరిక్కడనే ఉంటిరా? ఛెక్ పైన అయ్యా సిగ్నేచర్ చెయ్యవలెనే. సాయంకాలంవచ్చి తీసుకోండి! మీ చెక్ ఎక్కడికీ పోదు!" అన్నాడు.

"డబ్బే ఇవ్వగూడదూ? అయిదువందలేగా!" అన్నాడు రంగారావు.

రామస్వామి తన కష్టాలు ప్రారంభించాడు, చెక్కు తయారుచేస్తూ.

"చూస్తిరా?, రేపటి డేట్‌గా వేస్తినీ! క్యాష్ ఇచ్చే దానికేమి? ఇవ్వొచ్చునూ! మరి పిల్లకాయల టిఫిన్ కరుజుకూ; ఇంకా చిల్లర కరుజులుకూ క్యాష్‌దా నెల వర్లు పూడుచునే! రేపు మీరు క్యాష్ చేయవచ్చును! క్రాస్ చేస్తునా? ఓపెన్‌గా విడుస్తునా? మీకు ఎకౌంటూ ఉందిగదా?" అన్నాడు రామస్వామి.

"నాకు ఎకౌంటూ బొకౌంట్లూ లేవులెండి," అన్నాడు రంగారావు.

"సరి అప్పో, బేరర్ చెక్ ఇస్తును. బ్యాంకుకువెళ్ళి నేరుగా క్యాష్ పుచ్చుకోవచ్చునూ!"

మర్నాడు ఉదయంగాని రాఘవయ్య సంతకంతో చెక్కు రంగారావు చేతికి అందలేదు. దాన్ని తీసుకున్నప్పుడు రంగారావు మనస్థితి దూరప్రయాణం చేసి గమ్యస్థానాన్ని చేరుకునేవాడి స్థితిలో ఉన్నది.

అయిదువందలు! అంత డబ్బు తనచేతికి ఇంత వరకు ఎవ్వరూ ఇవ్వలేదు. ఇదికూడా తనకు రావలసిన దానిలో కొంతే. ఇంతడబ్బు తనబోటివాడికి సినిమా రంగంలో తప్ప ఇంకెక్కడ దొరుకుతుంది? ప్రెస్ వర్కరుగా ఉంటూ ఎన్నో ఏళ్ళుపనిచేశాకగాని రంగారావు ఏడాదికి ఐదువందలు సంపాదించలేదు.

అతని కళ్ళు మళ్ళీమళ్ళీ ఐదువందల సంఖ్యల మీదికి వెళ్ళాయి - నాగరికత చేసిన చిత్రమైన ఏర్పాట్లు. బ్యాంకులో ఉండే డబ్బులో ఐదువందలు తనది కావటానికి ఈ కాగితం ముక్క కీలకం!

"ఈ బ్యాంకు తెలుసుగా, పానగల్ పార్కు దగ్గిరే ఉంటుంది. పదిగంటలు దాటితే మూస్తారు. వెంటనే వెళితేగాని - ఆలస్యం కావచ్చు" అని అసిస్టెంటు డైరెక్టరు చెప్పిన మాటలు చెవులలో మోగుతూ రంగారావు బయలుదేరాడు.

అతను బ్యాంకు ఎక్కడున్నదీ కనుక్కునేటప్పటికే తొమ్మిదీ ముప్పావై పోయింది. లోపలికి పోయినాక అతనికంతా అయోమయంగానూ అగమ్యగోచరంగానూ తోచింది. ఈ చెక్కు ఎవరికివ్వాలి? ఏం చెయ్యాలి? ఏం చెయ్యాలో ఎవరినడగాలి?

ప్రతి మనిషికీ కొన్ని విషయాలు వర్జ్యంగా వుంటాయి. ఆ విషయాలను గురించి ఆలోచించవలసివస్తే బుర్ర పనిచెయ్యక ముడుచుకుపోతుంది. రంగారావుమొంత పెద్ద ప్రెస్‌లోకి తీసుపోయినా కొద్దిసేపట్లో దాన్ని అవగాహన చేసుకోగలుగుతాడు. ఇప్పుడిప్పుడు పత్రికా కార్యాలయాల్లో కూడా అతనికి మిస్టరీ ఏమీలేదు. కాని బ్యాంకు పూర్తిగా మిస్టరీ.

బోనులో పులిలాగా కటకటాల వెనక కూచునివున్న ఒక యువకుడు రంగారావు పడే సంక్షోభం చూసి "ఏమండీ, మీపని ఎవరన్నా చూస్తున్నారా?" అని అడిగాడు.

రంగారావు మారు మాట్లాడకుండా చెక్కు తీసి, కంతలోనుంచి అతనికిచ్చాడు. అతను దాన్ని ఎగాదిగా చూసి, "ఓపెన్ చెక్కే! క్యాషు తీసుకుంటారుగదూ! ఐడెంటిఫికేషన్ అవసరమే!" అన్నాడు.

"అంటే?" అన్నాడు రంగారావు.

"మీరేగా డి. వి. రంగారావు"

"అవును."

"మిమ్మల్ని గుర్తించేవాళ్ళెవరైనా

బోనులో పులి ఘ్రూటపూర్తి కాకముందే "ఏం గురూ?" అన్న కేక వినిపించింది. కామెడియన్ సత్తెం దేవుడల్లే వచ్చాడు.

"సత్తెంగారికి తెలుసా ఏం? ఇంకనేం! దీని వెనక సంతకం చెయ్యండి" అంటూ బ్యాంకు గుమాస్తా చెక్కు రంగారావుకు తిరిగియిచ్చాడు. తన చెయ్యి వదిలిపోయిందనుకున్న చెక్కు తిరిగి చేతికి రావటం రంగారావుకు అశుభంగా తోచింది. జాలీష్టరు పార్వతీశం టోపీలాగా అది తనను వదలదేం?

రంగారావు సత్తెం సహాయంతో చెక్కు వెనక ఇంగ్లీషులోనే సంతకంచేసి క్లర్క్కు తిరిగి యిచ్చేశాడు.

"అలా కూచోండి" అన్నాడు క్లర్కు.

రంగారావు సత్తెం తోడు కూచున్నాడు. ఇద్దరూ మాట్లాడుకోవటంతో కాలయాపన తెలియకుండా జరిగింది. రంగారావు తల యెత్తి చూసేసరికి బ్యాంకుకు వచ్చిన వాళ్ళందరూ వెళ్ళిపోయి ఉన్నారు. గడియారం పది కొట్టింది. జవాను వచ్చి బ్యాంకు ద్వారం ఒక రెక్క మూశాడు.

"సత్తెంగారూ!" అని క్లర్కు పిలిచాడు.

సత్తెం లేచివెళ్ళి అతనితో ఏదో మాట్లాడి వచ్చి రంగారావుతో "క్యాష్ లేదుట!" అన్నాడు.

ఆ చెక్ నాలుక గీసుకొనటానికి కూడా పనికిరాదన్నది బుర్రలోకి ఇంకటానికి రంగారావుకు చాలా కాలం పట్టింది. అదే రేటున అతని కాళ్ళు, చల్లబడటమూ, దుఃఖం మండిపోవటం కూడా జరిగింది.

రంగారావుకు ఇంటికి వెళ్ళేసరికి స్వంతరత్నం బయటికి వెళ్ళబోతున్నది. అతని మొహం చూస్తేనే, "ఇంత ఆలస్యమయిందేం? అన్నం ఉంది, పెట్టుకుతింటావా? ఆమ్మ దబ్బిచ్చి చాళ్లలేదుగా, అరవమిస్త్రీ చిన్న యానం వుంటట. యేమన్నా

రమ్మన్నాడు" అన్నది సుందరం. అతని రొమ్ము మీద తన కుడి చెయ్యి ఆనించి.

"పోయిరా, నీ అదృష్టమన్నా కాస్త బాగుందేమో!'' అన్నాడు రంగారావు సుందరం మొహంకేసి చూడకుండా.

"ఇప్పుడు నీ అదురుష్టాని కేవొచ్చిందో!" అన్నది సుందరం చేత్తో అతన్ని తోస్తూ.

"మారని చెక్కేచ్చారు.'' రంగారావు పరుషమైన మాట ఉపయోగించాడు.

"ఆళ్ళ జిమ్మడ?...పోనీ, నువ్వన్నం తిన్నాక పోతాలే! రా అన్నానికి?''

"వద్దు సుందరం! నే పెట్టుకుతింటాలే. ముందు ఏదన్నా రాసుకోవాలి. బుర్రంతా చెడి ఉంది."

"అందుక్కాదు. అన్నం తించే నాతోనూ గూడా రావచ్చుగా?"

"నువ్వెళ్ళిరా, నేను రాసుకుంటాలే. నే వొస్తే నీకూ్కడా చుక్కెదురు."

సుందరం తన చెయ్యి మెల్లిగా అతని భుజం మీదికి జరిపింది. ఏమీఅనలేదు. ఆమె చేతిభాష రంగారావుకు తెలుసు. అతను అప్రయత్నముగా[1] చిరునవ్వు నవ్వి "వెళ్ళిరా!" అన్నాడు.

ఆమె వెళ్ళినాక అతను తన కాగితాల ఫైలు తీసుకుని రాయటానికి కూచున్నాడు. "మానవత్వం" అని పైన రాసి ఆలోచనలో పడ్డాడు. ఎంతవద్దన్నా అతని ఆలోచనలు రాఘవయ్య మీదికే మళ్ళాయి.

ఎంత మోసం! ఎంత ద్రోహం! బ్యాంకులో ఉన్న డబ్బంతా నిన్ననే అయిన వాళ్ళందరికి సర్దేసి, తనకు ఇవాళ్టి తేదీ వేసి చెక్కేచ్చారు. తనకు తండ్రివంటి రాఘవయ్యకు అసలు శత్రువు తనే - ఆయన శత్రువులల్లె చెప్పుకునేవాళ్ళు కానేకారు. వాళ్ళందరికీ డబ్బు ముట్టిపోయింది. ఈ రాఘవయ్య డబ్బులేనప్పు డివ్వలేదు. డబ్బున్నప్పు డివ్వడు! తన తండ్రికీ ఈయనకూ పోలికేమిటి - ఆ పేరొకటి తప్ప.

రంగారావుకు తన తండ్రి బాగా జ్ఞాపకం. ఆ రోజుల్లో తాను రంగారావు కాదు-రంగడు.

రాఘవయ్య-రాఘవులు నోరున్న మూగవాడు. సాధారణంగా మాట్లాడేవాడు కాడు. ఎవరన్నా ఏదన్నా ప్రశ్న వేసినా చాలా సేపటికి గాని సమాధానం చెప్పేవాడు కాడు. ఆయన్ని లోకం అమాయకుడుగానూ, అసమర్థుడుగానూ చూసింది. "ఆ వత్రంగమేమో తనేమో తప్ప ఆ మానవుడి కింకో గొడవలేదు."

---

1. కొ. కు. శైలిలో అతకని కావ్యభాషారూపం. అప్రయత్నంగా.

అని ఆసంఖ్యాకులు తన తండ్రిని గురించి అనగా రంగడు విన్నాడు. ఆ మాట నమ్మాడు కూడా.

అయితే తనకు లోకానుభవం కలుగుతున్నకొద్దీ, తన తండ్రి చిన్నతనం నాటి విషయాలు ఇతరులు చెప్పగా విన్నవి అర్థమవుతున్నకొద్దీ, రంగడికి తండ్రిని గురించి అభిప్రాయం మారిపోయింది. ఈనాడు అతని మనసులో ఉన్న తండ్రి మనుషుల్లో అపూర్వమైనవాడు. ఇందులో కొంత రంగారావు కల్పన ఉంటే ఉన్నదేమో గాని, ఆ కల్పనలో అసత్యం ఏమీలేదు. ఏ మనిషిని వాస్తవంగా చిత్రించాలన్నా కొంత కల్పన కావాలి.

రాఘవుల్ని చిన్నతనంలో గొడ్లవెంట పంపేవాళ్ళుట. ఒకనాడు రాఘవులు వడ్రంగి బ్రహ్మయ్యగారింటి మీదుగా గొడ్లను తోలుకుపోతూ అక్కడ ఆగి బ్రహ్మయ్య చేసే వడ్రంగం చూడసాగాడు. గొడ్లదారి గొడ్లదయింది. అందుకు రాఘవులు తన్నులు తిన్నాడు. కాని మర్నాడు మళ్ళీ బ్రహ్మయ్యగారింటి ముందు ఆగిపోయాడు.

సందేహం లేదు. వడ్రంగంలో రాఘవులకు ఏదో సౌందర్యం కనిపించి ఉండాలి. తండ్రి వడ్రంగం చేసేటప్పుడు రంగడు చిన్నతనంలో దగ్గిరుండి చూసేవాడు. రంపంతో కర్రలు కోసేటప్పుడు రాఘవులు ఒక చెవితో రంపం చప్పుడు వినేవాడు. బాడితతో చెక్కుతుంటే లేచే పెళ్ళను మెరిసే కళ్ళతో చూసేవాడు. ఏ చెక్కనైనా చిత్రిక పట్టేటప్పుడు మధ్య మధ్య చేత్తో తడివి దాని నునుపు చూచి మురిసిపోయేవాడు.

రూపం లేని కొయ్యను కోసి, చెక్కి, మలిచి, నునుపు చేసి తనకు కావలసిన రూపం ఇవ్వటంలో తన తండ్రికి ఎటువంటి ఆనందమూ, తృప్తి ఉండేదో రంగడు చిన్నతనంలోనే తెలుసుకున్నాడు. ఆయన తన పనిముట్లను తాకే పద్ధతిలోనే ఎంతో ఆపేక్ష ఉండేది.

బ్రహ్మయ్యకు పిల్లలులేరు. రాఘవులకు వడ్రంగంలో ఉండే అభిలాష అర్థం చేసుకుని పని నేర్పాడు. బ్రహ్మయ్య సామాన్యపు వడ్రంగి. రాఘవులు తన దగ్గర చేరినాక బ్రహ్మయ్యకు వడ్రంగం పని మీద గురి హెచ్చిందేమో కూడాను.

తాను చేసిన వస్తువేదన్నా రాఘవులు చేతబట్టుకుని అటూ ఇటూ తిప్పి చూసి ఆనందం కనబరిస్తే బ్రహ్మయ్యకు ఆనందం పొంగివచ్చేది. "బాగుందట్రా రాఘవులూ?" అని అడిగేవాడు. రాఘవులు తలఆడిస్తే "నువ్వుకూడా అట్టాగని చెయ్యాలి. తెలిసిందా?" అనేవాడు బ్రహ్మయ్య.

రాఘవులు వడ్రంగిగానే జీవించాడు. కానీ అందులో ఆయన సంపాదించింది చాలా తక్కువ. బహుకొద్ది. పీటలూ, ముక్కాలి పీటలూ, మంచాలు ఎక్కువగా చేయించుకునేవారు. కిటికీలూ,దర్వాజాలూ ఎప్పుడన్నా చేసేవాడు. అట్లాగే సందుగాయి పెట్టెలుకూడా చేసేవాడు. జాజి చెక్కతో బీరువాలు అరుదుగా చేయించుకునేవాళ్ళు.

చిన్నతనంతో తనకుకూడా వడ్రంగి పనిలో ఉండే అందం అర్థమయ్యేటట్టు చెయ్యటానికి తండ్రి ప్రయత్నించినట్టు తండ్రి పోయినాకగాని రంగడికి అర్థం కాలేదు. మొత్తం మీద ఈ విషయంలో రాఘవులు ప్రయత్నాలు కొంచెము[1] కూడా ఫలించలేదు. వడ్రంగమంటే కూడూ గుడ్డా పెట్టే పని కాదని చిన్నతనం నుంచీ రంగడు వినటమే ఇందుకు కారణం కావచ్చు.

"రంగా, ఆ సిన్న బర్మా ఇటందుకో. ఆ మరమేకులు నాలుగిటియ్యి....అయితే తీగ మేకుల్లా, యిదా నానా, ఆ పొట్టంరోయి మరమేకు," అంటూ తండ్రి పనులు చెబుతుంటే రంగడు చేసేవాడేగాని వాడి ధ్యాస ఇంకెక్కడో ఉండేది.

తాను ఏదన్నా మంచి పనితనంగా చేశాననుకున్నప్పుడు రాఘవులు మీసాల్లోంచి నవ్వుతూ, "సూశావంట్రా రంగా!" అని కళ్ళు ఎగరేస్తే రంగడు చూసేవాడేగాని, వాడి కళ్ళలో మెరుపు ఉండేదికాదు.

ఎప్పుడన్నా దారి తప్పి రంగడు తన పనినిగురించి ఏదన్నా అడిగితే రాఘవులుకు ఎక్కడలేని ఉత్సాహమూ కలిగేది.

"ఇయేంటయ్యా?" అని రంగడు అడిగేవాడు.

"అయా. అయి యిత్తడి పూల్లే!"

"ఎందుకయ్యా యియీ?"

"ఆ శాతుల్లుగారి పీటలకు నాలుగుమూల్లా య్యెయ్యటానికి."

"ఇయి బంగారంవా, అయ్యా?"

"సీ యెదవా, ఇత్తడియిరా!"

"బంగారప్పూ వేసుకోరా అయ్యా?"

"యేసుకునే మారాజు లుండరు మరీ!"

ఇటువంటి సంభాషణలు జరిగినప్పుడు తనకుకూడా వడ్రంగంలో ఆసక్తి పుడుతుందనుకుని ఉంటే, తన తండ్రికి ఆ తరువాత ఎంత ఆశాభంగం కలిగి వుండాలో రంగడు ఊహించుకుని ఆవేదన పడేవాడు.

అయితే తాను వడ్రంగి కానందుకు మాత్రం రంగడు ఎప్పుడూ చింతించలేదు. వడ్రంగం తన తండ్రి దారిద్ర్యాన్ని తీర్చలేకపోయినా; దారిద్ర్యం

---

1. కొ. కు. శైలిలో అతకని కావ్యభాషారూపం. - కొంచెం.

మేటుకు ఆయనకు వ్రడంగంలో గల ఆసక్తిని చివరకు తన పొట్టన పెట్టుకున్నది.
అది ఈ విధంగా జరిగింది.

రంగడు పదేళ్ళవాడై వుండగా పెద్దవీధిలో ఒక ఫర్నీచరు కార్ఖానా వచ్చింది. అందులో తయారయ్యే సరుకు చాలా నాజూకైనదీ. ఖరీదైనదీనూ. అందులో ఎటువంటి అద్దాల బీరువాలు! ఎన్ని రకాల అందమైన కుర్చీలూ! ఎంత నాజూకైన పందిరి పట్టెమంచాలు! ఎంతషోకైన సోఫాలు! రోజ్‌వుడ్‌తో చేసినవీ, సిడార్ వుడ్‌తో చేసినవీ, టేకువీ....

రాఘవులు ఆ కార్ఖానాలో కూలికి చేరాడు. కార్ఖానా గలాయన మల్లుపంచె గట్టి, సిల్కు లాల్చీ తొడిగి, కళ్ళద్దాలు పెట్టి, సైకిల్ మీదవచ్చి, మంచి సువాసన సిగరెట్లు కాలుస్తూ, ఇంగ్లీషు వార్నీసు పూసిన బల్లదగ్గిర కూర్చునేవాడు. ఆ కార్ఖానాలో అంతా ఇంగిలీసు వ్రడంగం. చేబాడిత ల్లేవు. చేతిరంపాలే తప్ప పెద్ద రంపా

సొంతాన పనిచేసుకున్న దానికన్నా రాఘవులు ఈ నౌకరీలోనే నాలుగు డబ్బులు కళ్ళజూశాడు. కాని ఆయనకు వ్రడంగంలో లోగడ లభించిన ఆనందం కాస్తా పోయింది. రాత్రింబగళ్ళు పనిచేసినా అలవని రాఘవులు కార్ఖానా నుండి ఊలా పడి నీరసించి ఇంటికి వచ్చేవాడు.

"ఎన్నడూ లేదు. ఇంత నీరసంగా ఉంటుండదేందబ్బా" అని రాఘవులు ఆశ్చర్యపడితే, రంగడి తల్లి సీతమ్మ, "ఏండ్లు పైబడ్డ కొందికీ సత్తువ తగ్గదూ మరి?" అనేది.

ఈ కార్ఖానాలో పనిచేస్తూ తన తండ్రి పనిచేతగాని వాడనికూడా అనిపించుకున్నట్లు రంగడి కనుమానం. ఏమైనా రాఘవులను కుంగదీసినది కేవలం శరీర శ్రమ కాదు. మానసిక వ్యధ కూడా కొంత కావచ్చు. ఆ నౌకరీ చేస్తూనే రాఘవులు యాభై నిండకుండానే చనిపోయాడు.

రంగడు తన తండ్రిని పూర్తిగా అర్థం చేసుకున్నా ననుకున్నాక తానెరిగిన వారిళ్ళలో అనేకమంది ప్రవీణులనదగిన వారితో తండ్రిని పోల్చిచూచి, తన తండ్రే గొప్పవాడనే నిర్ణయానికి వచ్చాడు. ఆ మనిషికి జీవితంలో ఒక నిజమైన లక్ష్యం - ఒక గురి దొరికింది. దానికి తన హృదయాన్ని, ఆత్మనూ అంకితం చేశాడు. తన తండ్రి పొందిన అపజయమల్లా కార్ఖానాలో కూలికి కుదరటం. ఆ పనిలో చేరినాక ఆయన తనకు కావలసిన పని తాను కోరినట్లు చెయ్యలేదేమో - కాని అంత దాకా తన తండ్రి జీవితానికి ఏ వంకా లేదు, డబ్బు సంపాదించలేకపోవటం ఒక్కటి మినహాయిస్తే.

తన తండ్రితో పోలిస్తే ఈ రాఘవయ్య-మారని చెక్కల రాఘవయ్య-ఒక మనిషా? ఎంత డబ్బుండి ఏం లాభం? ఎప్పుడూ డబ్బు లేదో అనే ఏడుపే గదా? తన తండ్రి ఏనాడూ ఇంకోడిది ఒక్క దమ్మిడీ ఎగ్గొట్టలేదే! ఇతరులు ఆయన కష్టం తిన్నారేమో గాని!....

రంగారావు ఆత్మ పరిశోధనలోపడి తన తండ్రి మనసు వడ్రంగంలో లగ్నమయినట్టుగా, తన మనసు ఏ పనిలోనైనా లగ్నమయిందా అని ఆలోచించు తున్నాడు. కాని తృప్తికరమైన సమాధానం రాలేదు. ప్రెస్సు వాతావరణంలో తాను కొన్ని ఏళ్ళపాటు మునిగి తేలినమాట నిజమే. కంపోజింగు సరదాగానే ఉండేది. కాని అందులో తాను నిజంగా లీనమయ్యాడా? లేదు. అంతకన్న కథలు రాయటమే తనకు ఎక్కువ ఆనందం ఇచ్చిందేమో! రాసిన కథను తాను మళ్ళీ మళ్ళీ చదువుకుని కొంత ఆనందం పొందినమాట నిజం. తన కథలు చదివి తోటివాళ్ళు ఆశ్చర్యపడి మెచ్చుకుంటే తాను ఉబ్బిపోయిన మాట నిజమే. కాని కథలు రాయటంలో కూడా తాను ఒక అస్పష్టమైన అసంతృప్తిని పొందాడు. తనకు తెలుగు భాష అంతగా రాదనో, తన మనసులోని భావాలు మాటల్లో చెప్ప టంలో నైపుణ్యం చాలదనో, తనకు ఇంగ్లీషు రాదనో - ఏదో ఒక దుగ్ధ తనను వెంటాడుతూనే వస్తున్నది. తోటి కథకులలో ఇంగ్లీషు సాహిత్యం చదివినవాళ్ళతో మాట్లాడినప్పుడూ మాటలను తనకన్న పదునుగా ఇతరులు వాడటం చూసి నప్పుడూ అతనికి ఈ బాధ మరింత అవుతూవుంటుంది. ఇందుకు తాను చింతించ నవసరం లేదని నమ్మకంగా చెప్పినవాళ్ళు లేకపోలేదు - కాని ఆ మాటలో గురి కుదరాలి, నిలవాలి. అదే జరగటంలేదు. ఇటువంటి బాధలూ, సంకోచాలూ తన తండ్రి ఎరుగడు.

తండ్రిలాగా తానుకూడా ఒకరకం పనికి అంకితం కాలేకపోతే ఆ తప్పు కొంతవరకు కాలానికి చెందినదేమో, తనది కాదేమో - అనికూడా రంగారావుకు అనిపించింది. కాలం చిత్రమైన మార్పులు తెస్తున్నది. చివరి రెండేళ్ళూ తన తండ్రి ఫర్నీచరు షాపులో కూలి చెయ్యలేదా! అది కాల ప్రభావంచేత కాదా?

సినిమాలలో కూడా వడ్రంగులున్నారు. తన తండ్రి చేసినది వడ్రంగ మైతే వీళ్ళు చేసేది వడ్రంగమే కాదు. కాని వీళ్ళు తన తండ్రికన్న ఎన్నోరెట్లు సంపాదిస్తున్నారు. ఉన్నంతలో హాయిగా బ్రతుకుతున్నారు కూడా. ఇదంతా కాల ప్రభావమే.

ఒకరిదాకా ఎందుకు? తాను సినిమాలలోకి రావటం కాలప్రభావమే. తనకు దొరికిన ఈ ఛాన్సుకోసం తపస్సు చేస్తున్నవాళ్ళున్నారు. "మీకు ఛాన్సు దొరుకుతుందేమో గాని, మారని చెక్కలు తప్ప మరేమీ దొరకవు" అంటే

వాళిలో కొందరు లక్ష్యపెట్టకపోవచ్చు. వాళ్ళే తనకున్న తన తండ్రిలాటి వాళ్ళేమో?....

రంగారావు కళ్ళు గట్టిగా నలుచుకుని జుట్టు దేపుకుని కాగితాలకేసి చూశాడు. పై కాగితంమీద "మానవత్వం" అని మాత్రం రాసిఉంది. అతను తాబేలులాగా తన ఆలోచనలన్నీ లోపలికి ముడుచుకుని మనస్సును కేంద్రీకరించి రాయనారంభించాడు.

రంగారావు రచనచేసే పద్ధతి మరీ ప్రాకృతంగా ఉండేది. దాన్ని గమనించిన వాళ్ళకు వ్యద్రంగంకన్న వ్యవసాయం స్ఫురించేది. ఒక ఐడియా దొరికితే దానికి తన మనసులో యింత పాదు చేసిన ఆ క్షణాన తనను వదిలించే ఆలోచనలూ, ఆవేశాలూ ఎరువుకింద వేసి, ఎలాటి మొక్క వస్తుందోనని ఎదురు చూసేవాడు. మొదట్లో మొక్క చాలా నింపాదిగా పెరుగుతుంది. కాని పోను పోను దాని పెరుగుదల చాలా వేగంగా సాగేది.

ఒక కథగాని, నవలగాని చాలాభాగం ముందే అనుకుని ప్లాను ప్రకారం రాసుకుపోయేవాడికి దాన్ని తిరిగి చదువుకోవటంలో ప్రత్యేకమైన ఆనందం ఏమీ ఉండదు. కాని రంగారావు రచనలలో అతని చేయి ఉన్నంతమేర ప్రకృతి చెయ్యి కూడా ఉండటంచేత రచనలను చదివి మళ్ళీ మళ్ళీ ఆనందం పొందటానికి వీలుండేది.

చీకటిపడి అక్షరాలు కనిపించకుండా పోయినదాకా అతను రాస్తూనే ఉన్నాడు. గాని అప్పటికింకా నాలుగో పేజీలోనే వున్నాడు. తన అనుభవం నుంచే రాసే మనిషి కావటంచేత అతనికి తాను సృష్టించే పాత్రలను గురించి రాసే దానికన్నా చాలా హెచ్చు తెలిసి ఉంటుంది. అందులో తాను ఏది ఉపయోగించుకోవాలన్నది నిర్ణయించటంలో కాలయాపన జాస్తిగా అవుతుంది. అదీగాక ఆరంభదశలో అతను ప్రతి నాలుగైదు వాక్యాలూ కనీసం రెండేసిసార్లు చదివి గాని ముందుకు సాగేవాడు కాడు.

రాసే కాగితాలు ఫైలులో పెట్టి కలం మూసేస్తూనే రంగారావు తనలో చెలరేగే మంట రచనావేశం కాదనీ ఆకలి అనీ తెలుసుకున్నాడు. అతను లేచి దీపం వేసి చప్పగా చల్లబడిపోయిన వంటకాలతో అన్నం తిన్నాడు. ఇంటికి తాళం పెట్టి తాళపుచెవి పక్కింటి సంతానం కిచ్చి రాఘవయ్యగారి ఆఫీసుకు బయలుదేరాడు.

ఆఫీసులో రాఘవయ్య లేడు. రామస్వామి చెక్కు విషయం చాలా ఆదుర్దాగా తరచిచూశాడు.

"క్యాష్ లేదనేసినారా? ఆడదా! నిండా మోసమై పుడ్చిందే! క్యాష్ ఉండ వలాని తలస్తినీ. ట్రాన్స్‌ఫర్ డ్రిక్కీ అయిందంటే వుండవచ్చు. మీ రేమీ అపపర పడకండి. రేపు తిర్గిగి చెక్ ప్రెజెంట్ చేసినారంటే కట్టాయం క్యాష్ అయి తీరును."

"ఇట్టా రోజూ ప్రెజెంట్ చేస్తూ ఉండనా బ్యాంకుకు?" అన్నాడు రంగారావు.

రామస్వామి నవ్వి "ఎందుకు సార్, ఆ చెక్కు నా కివ్వండి. నేను మీకు మన పిల్లకాయచేత క్యాష్ తెప్పించి పెడతాను" అన్నాడు.

రంగారావు జేబులో చెయ్యి పెట్టి మళ్ళీ తీసేశాడు. ఈ పనికిమాలిన చెక్కు తన చేతినుంచిపోతే తాను మళ్ళీ నిన్నటి స్థితిలో ఉంటాడు.

"ఎందుకులెండి, నేనే బ్యాంకుకు ప్రెజెంట్ చేస్తాను. ఇది ఎవరికన్నా చూపించటానికైనా ఉంటుంది. సినిమా కంపెనీలో స్క్రిప్టురైటరునని చెప్పు కుంటూ చేబదుళ్ళడుగుతుంటే ఎవరూ నమ్మటంలేదు. ఈ చెక్కు చూపిస్తేనే నమ్ముతారు!" అన్నాడు రంగారావు.

రామస్వామి మొహాన చిరునవ్వుకూడా లేకుండా పోయింది.

"ఒక్క నిమిషం దయచేసి కూచోండి. నేనే క్యాష్ యిస్తున్నా. అయ్యే అడిగితే వెనక చెప్పుకుంటాం."

రంగారావు కూచున్నాడు. రామస్వామి రసీదు తయారుచేసి దానిమీద రెవెన్యూస్టాంపు అంటించి రంగారావు సంతకం పెట్టమన్నాడు.

"మళ్ళీ సంతకమా? డబ్బేదీ?"

"ఇస్తాను సార్, సంతకం చెయ్యండి. మీ ఆ చెక్కు నాకిచ్చెయ్యండి. కాన్సెల్ చేసి విడుస్తును. అయిపోయిందిగదా! ఇదుగో సార్, క్యాష! పెద్దనోట్లి స్తునా? కొత్త అయిదు రూపాయల బండిల్ అట్నే ఇస్తానా? తీసుకోండి సార్! మీకు నాపైన నిండా కోపం వచ్చేసింది. నేనే నిండా నంజహన్ అని తలిసిరి. ఏం చేసిదీ?"

రంగారావు కొత్త ఐదురూపాయల కట్ట తీసుకుని దాన్ని అటూఇటూ తిప్పి చూశాడు కావలిస్తే నోట్లు ఎంచి చూసుకోమనీ, సీలుకూడా ఊడదీయలేదు గనుక సరిగానే ఉంటాయనీ, అనుమానం ఉంటే తీర్చుకోవటం మంచిదనీ, ఈ కాలంలో ఎవర్నీ - బ్యాంకేమిటి, దేవుణ్ణి కూడా నమ్మేదానికి కూడదు అనీ రామస్వామి చెప్పాడు.

రంగారావు నిర్లిప్తంగా నోట్లకట్ట జేబులో పెట్టుకుని ఇంటిదారి పట్టాడు. ఆ పొద్దున చెక్కు తీసుకొన్నపుడు శరీరమంతటా ఫాకిన తిమ్మిరిలో అణుమాత్ర మైనా ఇప్పుడతనికి లేదు. 'అనుభవం కావాలి! అనుభవం! అది ఉంటే చెయ్యి

రూపాయల నోట్లకట్ట కూడా నిర్లిప్తంగా జేబులో పెట్టేసుకొనవచ్చు' అనుకున్నా డతను.

సుందరం తిరిగి వచ్చేసరికి రాత్రి తొమ్మిదిన్నర ఐంది. రంగారావు దీపం కింద కూచుని రాసుకుంటున్నాడు. అతను తలయెత్తి చూసి, "వేషం కూడా వేసినట్లు న్నావే?" అన్నాడు.

"ఏవేషం, పాడేషం! అయేపోయిందికూడా. ఎష్ట్రాప్రియేషను మనాల్సిందే. సచ్చి నాడి పెళ్ళి కొచ్చిందే చాలు; ఏంచేస్తా? యాభై ఇచ్చారు" అంటూ చేతిసంచిలో నుంచి సుందరం ఐదు పది రూపాయల నోట్లు తీసింది.

రంగారావు లేచివెళ్ళి పెట్టెలోనుంచి కొత్త ఐదురూపాయల నోట్లకట్ట తీసి చూపిస్తూ, "అయిదొందలు!" అన్నాడు.

"ఓరి బుల్లోడా!" అంటూ సుందరం రంగారావును వాటేసుకున్నది.

తాను వదిలినా రంగారావు తనను వొదిలేటట్టులేదని గ్రహించి, "నీకూ౯డో ! నేను ఆరుగంటలకి ఎక్కితొక్కినంతటి టిఫిను తిన్నా. కడుపులో రాయల్లె కదల్లు దిక్కుమాలిన టిఫిను!" అన్నది.

"నేనూ ఆ వేళకే తిన్నా" అన్నాడు రంగారావు.

సుందరం రంగారావు భార్యకాదు. ఆమె ఎవరి భార్యా కాదు. ఆమెకు పెళ్ళి కాలేదు. కాని వాళ్ళిద్దరూ ఇంచుమించు ఒకే ఈడు వాళ్ళు. చిన్నతనం నుంచీ స్నేహంగా కలిసి తిరిగారు. వాళ్ళవి దాదాపు ఎదురెదురు ఇళ్ళు.

రంగణ్నయినా తల్లి కొంతలో కొంత అదుపులో ఉంచేదిగాని సుందరం స్వేచ్ఛాజీవి. చెట్లెక్కేది. గోడలెక్కేది. మగపిల్లల్ని కూడా తన్ని మాట్లాడేది. సుందరం ఎప్పుడూ రంగడితో తిరగటం చూసి ఓర్వలేక రంగడి పక్క ఇంటి వాళ్ళ పిల్ల గంగమ్మ ఒకనాడు ఇద్దర్నీ కలిపి బూతుమాట అన్నది. సుందరం గంగిని దుమ్ములో పడేసి కాలితో చచ్చేట్టు తన్ని, "నీ యబ్బగాడితో చెప్పుకో!" అన్నది.

గంగమ్మ అక్కసుకు కారణం లేకపోలేదు. రంగడి తల్లి సీతమ్మ దాన్ని ఏనాడో కోడలుగా వరించింది. అయితే రంగడికి అదంటే చిన్నప్పటి నుంచీ రోతే. దానివన్నీ చప్పనాతి బుద్ధులే. అది దొంగది, దాని కడుపులో ఏముండేదో ఎవరికీ తెలీదు. సుందరం అట్లాకాదు. అది నిజమైన స్నేహితురాలు. రంగడూ, సుందరమూ గంటలకొద్దీ మాట్లాడుకునేవాళ్ళు, ఫలానా విషయమని తెలియకుండా. వాళ్ళ మధ్య రహస్యాలు లేవు. భార్యాభర్తలై యావజ్జీవం అతికి ఉండటానికి తగినదానికన్నా

ఎక్కువ బంధమే వాళ్ళిద్దరిమధ్య ఉండేది. కాని వాళ్ళకి పెళ్ళి జరిగి ఉండటం అసంభవం. దానికి సాంఘికమైన కారణాలు చాలా ఉన్నాయి.

అయితే రంగడికి, గంగికి పెళ్ళికావటం మట్టుకు పెద్ద పొరపాటు. ఇంగిత జ్ఞానం కొంచెంకూడాలేని సీతమ్మ ఏడిచి, రాగాలు పెట్టి, అన్నాహారాలు మాని, రంగడి ఎముకలు కొరికి ఆ పెళ్ళికి ఒప్పించింది. అప్పటికి రంగడు కంపోజిటరుగా ఇరవై రూపాయలు తెచ్చుకుంటూ కుటుంబభారం మోస్తున్నాడు. అద్దెకొంపలో ఉండి మూడు రూపాయలు అద్దెకూడా ఇచ్చుకుంటూన్నాడు. వాళ్ళ ఇళ్ళున్నచోట రోడ్డు పడింది. (ఆ స్థలం అసలు మునిసిపాలిటీదే) గంగమ్మా వాళ్ళు ఒక పేటకూ, సుందరం వాళ్ళు ఇంకొక పేటకూ మారారు.

పెళ్ళి స్థిరమైనట్లు తెలియగానే సుందరం రంగడు వాళ్ళింటికొచ్చి "ఏం గంగానమ్మ మొగుడా!" అని కొక్కిరించింది.

"నువుండగా నేను గంగానమ్మ మొగుణ్ణెందుకవుతానే!" అన్నాడు రంగడు సుందరాన్ని సమీపించి.

"చెప్పక, చెప్పక నా మాటే చెప్పు?'' అన్నది సుందరం. రంగడి గుండెమీద చెయ్యివేసి.

మరుక్షణం రంగడు సుందరాన్ని వాటేసుకున్నాడు.

ఆ క్షణంలోనే సీతమ్మ లోపల్నుంచి వచ్చి "నువ్వటే! కూచో'' అంటూ పెళ్ళి కబుర్లు చెప్పింది.....

రంగడు మానవయత్నంగా గంగితో సంసారం చెయ్యాలని ప్రయత్నించాడు కాని, గంగి దగ్గిరయినకొద్దీ వాడికి దానిపై రోత జాస్తి అయింది. ఎంత నాసి మనుషుల్లో కూడా ఏదో మంచి ఉంటుంది-ఎంత వికారంలో కూడా ఏదో ఒక అందం ఉన్నట్లు. ఎంత వెతికినా గంగిలో ఒక్క మంచిగుణం కనిపించలేదు రంగడికి. తన తల్లి తనకు పరమ శత్రువైనా యింతకన్నా నాసి పెళ్ళాన్ని ఏరగలిగి ఉండదు.

కావాలని చేసినట్టుగా మనుషులు ఇటువంటి పనులు ఎందుకుచేస్తారు? వాటిని చెయ్యటానికి యింతంత బుద్ధిబలాన్ని ఎందుకు ధారపోస్తారు? అని రంగడు ఎన్నో సార్లు తననుతానే ప్రశ్నించుకుని, సమాధానం చెప్పుకోలేక "ఖర్మా!" అనుకున్నాడు.

తనను ఈ పెళ్ళికి ఒప్పించటానికి తల్లి పడిన పాట్లు, అన్న మాటలూ, ఏడ్చిన ఏడుపులూ, పెట్టిన మొహాలూ ఒక్కటికూడా రంగడు మరచిపోలేదు. ఇన్ని చేసి సీతమ్మ ఏం బావుకుంది ? గంగమ్మ అత్తగారిని కుక్కకన్నా హీనంగా చూడసాగింది. రోజుకు తొంభైసార్లు అది అత్తగారిని, "నన్ను తీతా

లిచ్చి పెట్టుకున్నావెట్టా?....బాగుందే. ఏపనన్నా నాకు చాతయినట్లు నేజేస్తా! నువు మటుకు నీకు చాతయినట్లు గాకుండా జేస్తావెట్టా?" అని అడిగేది.

రంగడు గంగమ్మను దాదాపు రోజూ కొట్టేవాడు, ఎందుకో ఒకందుకు. అది తనకు పెళ్ళాం కావటమే తనకొక శిక్ష అని అతడు అనుకుంటుంటే, అది చాలనట్టుగా గంగమ్మ ఎప్పటికప్పుడు, "నేనింకా అసహ్యంగా మాట్లాడగలను, ఇంకా చండాలంగా ప్రవర్తించగలను" అన్న ధోరణి అవలంబించటం దుర్భరంగా ఉండేది.

మొగుడు తన్నినప్పుడు గంగమ్మ అఘాయిత్యపు ఏడుపులు ఏడిచేది. కాని ఆ మనిషికి దెబ్బలంటే లక్ష్యంలేదు. వాటితో మరింత రాటుతేలి, మరింత పేట్రేగింది.

చివరకు సీతమ్మ కొడుకును బతిమాలింది. "అది మన పరువు తీస్తాందిరా, దానిజోలి కెళ్ళకురా! మన కరమనుకుందాం. దానిష్టం వొచ్చినట్టల్లా ఆడనీ, నువు కొట్టా - అది యీదినబడి అమ్మశోకాలె ఆరవా-యేందిదీ?"

రంగడు తల్లికేసి చాలాసేపు చూసి, ఏమనికూడా ఏమి ప్రయోజనంలేదు గనక మాట్లాడక ఊరుకున్నాడు.

చివరకొకనాడు గంగమ్మకు కన్నవారిమీద గాలిమళ్ళి పుట్టింటికి వెళ్ళింది. రంగడు ప్రెస్‌నుంచి రాజును వెంటబెట్టుకుని తిరిగిరాగానే తల్లి చెప్పింది.

"పీడాపాయె! మళ్ళీ రావద్దని చెప్పకపోయావా?" అన్నాడు రంగడు. తాను ఆ మాట అన్నప్పుడు తల్లి ఆనందాన్ని ఆపుకోవటానికి ప్రయత్నించటం కూడా అతనికి కనిపించింది. గంగితో ఆమెక్కూడా చాలొచ్చి ఉండాలి-ఎందుకురాదూ? తెలీక ఒళ్ళో నిప్పులు పోసుకున్నది.

గంగి తిరిగి వస్తుందని రంగడు భయపడ్డాడు. కాని వారం గడిచినా ఆమె రాలేదు.

ఒకనాడు రంగడు చీకటిపడి ఇంటికొస్తే సీతమ్మ లంకిణ్ణి నొక్కుకుంటూ "అది రోజూ రెండో ఆట సినిమా చస్తాందంట్రా!" అని చెప్పింది.

రంగడు ఒక్కక్షణం ఆలోచించి, "చావనీ" అంటూ గిరుక్కున తిరిగి తన పనులు చూసుకోసాగాడు. అతని గుండెలో అసూయ భగ్గుమనిలేచింది. గంగి ఎవరితోనన్నా మాట్లాడుతుండగా పట్టుకుని గొంతుపిసికి పారెయ్యాలన్న తహ తహ అతన్ని ఆవేశించింది.

ఈ ఆవేశానికి అర్థంలేదు. ఆ సంగతి రంగడికి తెలుసు. తాను గంగిని ఏనాడూ ప్రేమించలేదు. అది వెళితే తిరిగిరాకుండా ఉంటే బాగుండునని కూడా అనుకున్నాడు. ఇక గంగి ఎట్లాచస్తే తనకేం? కాని ప్రేమకూ అసూయకూ ఏమీ

సంబంధంలేదు. రంగడు అసూయతో దహించుకుపోయాడు. ఆ మంట చల్లారేటట్లు కూడా లేదు.

మర్నాడు ప్రెస్సులో రాజుతో రంగడు గంగి సంగతి చెప్పేసి, దాన్ని చావగొట్టటానికి ఉపాయం ఆలోచించ మన్నాడు. రంగడికి సుందరం ఎంతో రాజుకూడా అంతే. వాళ్ళిద్దరిమధ్య దాపరికాలేమీలేవు. రాజు ప్రెస్‌లో ట్రెడిల్ వేసే వాడు.

"రంగడికి నేను త్రో ఆఫ్" అని చెప్పుకునేవాడు.

"గంగమ్మను చితగ్గొట్టటం ఒక లెక్కలోది కాదు. తరవాత?"

"ఇంకా తరవాతేంటి? చావగొట్టడమే పులిస్టాప్! డాష్! స్టార్లు!"[1] అన్నాడు రంగడు హాస్యధోరణి ఏమి లేకుండానే.

"నీ స్నేహితురాలు సుందరాన్నికూడా ఆ చేత్తోనే చితగ్గొడదామా? ఇద్దరూ ఒకచోటే దొరకొచ్చు" అన్నాడు రాజు.

"సుందరాన్ని ఇందులోకి లాక్కు, రాజూ! దానికి దీనికి పొంతేమిటి ?" అన్నాడు రంగడు.

"ఎవరి ఏడుపు వాళ్ళను ఏడవనీ, రంగా! వొదిలేసి ఊరుకో. నీ పెళ్ళాన్ని తెచ్చి మళ్ళీ ఏలుకోకు - నీకేమి పరువుపోదు" అన్నాడు రాజు.

కాని రంగడికి ఆరాటం తీరలేదు. అసలు చిక్కేమిటంటే, తల్లి చెప్పిన మాట నిజమని నిర్ధారణ అయితేగాని రంగడికి ఈ ఆరాటం తీరదు. ఆ రహస్యం రంగ డికే తెలీదు. రాజు ఊహించలేకపోయాడు.

ఆ రాత్రి రంగడు పదిదాటినాక సినిమాహాలుకేసి వెళ్ళాడు. రెండో ఆట జరుగుతున్నది. ఒకటి రెండు సోడా బళ్ళు మాత్రమే బయట కన్పించాయి. హాల్లో జనం లేరల్లే ఉంది. సినిమాహాలు దీపాలు కాంతికి దూరంగా రంగడు కొంతసేపు తారట్లాడాడు. అతనిచూపు ఆడవాళ్ళ గేటు మీదే ఉన్నది.

ఉన్నట్టుండి అక్కడ ఒక తెల్ల చీర కనిపించింది. ఎవరోవచ్చి గేటులో నిల బడి నిర్జనంగావున్న రోడ్డును అటూ ఇటూ పరకాయించి చూశారు....సుందరం!

రంగడు ఆమెను సమీపించాడు. అతన్ని చూడగానే సుందరం రెండు మెట్లూ దిగి ఆతని అదృష్టదేవత లాగా ఎదురువచ్చింది.

"ఇటొచ్చావేం, రంగా? అవున్లే. పదిరోజులుగా పెళ్ళాం లేదుగా; తిమ్మిరెక్కి ఉంటుంది." అన్నది సుందరం.

"అవును. తొందరపని లేకపోతే మా యింటికి పోదాంరా!" అన్నాడు రంగడు.

---

1. విరామ చిహ్నాలు - ముగింపు చుక్క, అడ్డగీత, నక్షత్రం గుర్తు.

"పద" అన్నది సుందరం తడుముకోకుండా.

ఇద్దరూ సినిమాహాలు దాటి మలుపు తిరిగినాక ఒకరి నడుము చుట్టూ ఒకరు చేతులు వేసుకుని నడిచారు.

"అది సినిమాలకు జాస్తిగా వస్తున్నదట-నిజమేనా?" అన్నాడు రంగడు.

"రెండు మూడు సార్లు వచ్చింది. ఎందరు రావటం లేదు? అయినా అది నిన్ను సుఖపెట్టలేదు రంగా! దానికి బుద్ధిలేదు."

రంగడిక తన పెళ్ళాంమాట ఎత్తనేలేదు.

సీతమ్మ వాళ్ళకు తలుపు తీసింది. బుడ్డిదీపం పెద్దది చేసి సుందరాన్ని చూసి "నువు టే?" అన్నది. తరువాత ఆమె ముందుగది తలుపు దగ్గిరిగా వేసి వంట ఇంటిలోకి వెళ్ళిపోయింది. రంగడువెళ్ళి రెండు గదుల మధ్య వుండే తలుపు గడియ పెట్టాడు.

తెల్లగా తెలవారినాక సుందరం ఇంటికి వెళ్ళిపోయింది....

అది మొదలు సుందరం ప్రతి రాత్రి రంగడి కోసం రాసాగింది. బండి మీద వచ్చేది. కిల్లీలూ, సిజరు పాకెటూ తెచ్చేది. వద్దంటే ఊరుకునేదికాదు. "నువు పేద్ద సంపాదనపరుడివని తెలుసులేయ్యా!" అనేది.

రంగడి తరగతి మనుషులకు సుఖంకన్న ఆనందమంటే బాగా తెలుస్తుంది. సుఖాలు అనుభవించగలవాళ్ళ జీవితాలలో నిజమైన ఆనందం పాలు తక్కువ. రంగడిప్పుడు ఇంద్రుడు, త్రిలోకాధిపతి. వాడి ఆనందం కట్టలు తెంచుకుని ప్రవహించింది. భూప్రపంచంలో వాడు ఎవరిని చూసీ అసూయపడనవసరం లేదు. లోకంలో ఒక్కతే ఆడది ఉన్నది. అది తనది. దాన్ని తనది కాకుండా చెయ్యగల మగాడు ప్రపంచంలో లేడు. ఈ సంగతి రంగడికి దేవుడే స్వయంగా చెప్పినంత నమ్మకంగా తెలుసు!

రాజుకు ఏ రోజు వార్త ఆ రోజు అందుతూనే ఉంది.

"ఇదే సరయిన జోడు....సుందరాన్ని ఒక్కతెనే అయితే నువ్వు పోషించవచ్చు - ఇప్పుడు ఎడా పెడా ఖర్చు చెయ్యటం నేర్చిందనుకో, దాని మీద బతికే ఆ నలుగురైదుగుర్ని ఎట్లా పోషిస్తావు రంగా? రోజూ మీ యింటి కొచ్చిందంటే వాళ్ళనోట కరక్కాయే. వాళ్ళమ్మ దానికి పెళ్ళి చేయకపోయిందెందుకనుకున్నావు?" అన్నాడు రాజు.

రంగడి మనస్సు చివుక్కుమన్నది. సుందరం నాలుగు డబ్బులు గడించుకోకుండా తాను అడ్డుపడుతున్న సంగతి రంగడికి తట్టింది కాని, "రోజూ ఎందుకులే రావటం?" అనటానికి అతని సాధ్యంకాలేదు. తనను సాధారణంగా ఎవరెవరు పిలిపిస్తారో కూడా సుందరం అతనితో చెప్పింది. అయినా కూడా ఆ

విషయం ప్రస్తావించి జ్ఞాపకం చెయ్యటం అతనికి అసంభవమయింది. ఎంత డొంక తిరుగుడుగా చెప్పినా, అప్పుడే వాడికీ నామీద మొహం మొత్తింది? అని సుందరం అనుకుంటే తనగతి ఏం కావాలి? అటువంటి అనుమానం తల ఎత్తటానికైనా తానుగా అవకాశం ఇవ్వటం సాధ్యమయే పనా!

"చూడు రాజూ! నేను సుందరాన్ని రోజూ రమ్మనలేదు. అదే వస్తున్నది. వద్దననా? అదైనా తన సంగతి తాను చూసుకోగల్గే మనిషే - చాతగాని దద్దమ్మ కాదు." అన్నాడు రంగడు.

అవును లెమ్మన్నట్లు రాజు తల ఊపాడు....

గంగి ఎట్లా వెళ్ళిందో అట్లాగే తిరిగి వచ్చింది - వెంట ఎవడో వస్తాదులాటి వాడున్నాడు. ఆమె వచ్చేటప్పటికి ఇంట్లో సీతమ్మ తప్ప ఎవరూ లేరు. కోడల్ని చూస్తూనే సీతమ్మ అడగవలసిన నాలుగు మాటలూ అడిగింది. గంగి శివమెత్తినట్లు కేకలు పెట్టసాగింది. సీతమ్మను నానా మాటలు అన్నది. "ఊళ్ళో ఉన్న గుడిసేటి ముండలందర్నీ కొడుక్కు తారుస్తున్నావు" అన్నది. అంతకన్న కూడా అవాచ్యాలతో మాటాడింది. నలుగురూ ఇంటి ముందు పోగయ్యారు.

సీతమ్మ పక్కింటి కుర్రవాణ్ణి ప్రెసుకు పంపింది. వాడు వచ్చి చెప్పగానే రంగడు రాజును కూడా వెనకగా రమ్మని ఇంటికి బయలుదేరాడు.

మొగుణ్ని చూడగానే గంగి అరవటం మాని అతనికేసి పళ్ళుబిగించి, గుడ్లు పెద్దవిచేసి చూసింది. రంగడు మాట్లాడలేదు. గంగిని రెక్క పట్టుకుని బయటికి ఈడ్చుకుపోసాగాడు. ఎవరో తన పీక కోసేస్తున్నట్టుగా గంగి ఏడుపు కేకలు పెట్టింది.

రౌడీగాడు ముందుకువచ్చి "ఆ మనిషి నొదులు!" అన్నాడు కొరడాతో కొట్టినట్టు.

ఆ క్షణంలో ఆగ్రహావేశం వచ్చి, రంగడు తొందరపడ్డాడు; గంగిని వదలి రౌడీతో కలియపడ్డాడు. రంగడు బలహీనుడు కాకపోయినా ఆవేశంలో ఉండటం మూలాన ఒడుపుకూడా చూసుకోక అరనిమిషంలో రౌడీకి చిక్కిపోయి, కిందపడి పోయి, రౌడీచేత కాలితన్నులు తిన్నాడు. చుట్టూ చేరిన జనం "అయ్యో! అయ్యో!" అన్నారేగాని రంగణ్ణి రక్షించటానికి రాలేదు.

సినిమాలో లాగా సమయానికి రాజూ మరియిద్దరు ప్రెస్సు కుర్రాళ్ళూ వచ్చారు. ముగ్గురూ రౌడీమీద కాట్ల కుక్కలల్లే పడి వాడి రక్తం కళ్ళచూశారు. వాణ్ణి రోడ్డు అవతలిపక్కకు ఈడ్చేసి రాజు గంగితో "ఇందుకేనా మాతల్లి నువ్వొచ్చింది? మంచిగా నీ దారిన నువు పోతావా? నీక్కూడా ఏమన్నా కాస్త పూజ జరగాలా?" అని అడిగాడు.

ఎవరినీ లక్ష్యపెట్టని గంగి రాజును చూసి అదిరి ముడుచుకు పోయింది. రాజే ఖాళీబండి పోతుంటే ఆపి, గంగిని "ఎక్కూ!" అని అదిలించాడు.

గంగి బండి ఎక్కి వెళ్ళిపోయే టైముకు రౌడీ లేచి ఆ బండిలోనే ఎక్కాడు.

"సరయిన జోడా?" అని రాజు కేక పెట్టి వికృతంగా నవ్వాడు.

ఆ తరవాత గంగిదోవ గంగిదీ, రంగడిదోవ రంగడిదీ అయింది. రాజును దగ్గిర పెట్టుకుని రంగడు సుందరంతో, "నువు మా యింటికొచ్చి నా పెళ్ళాంగా ఉండిపో, నా కభ్యంతరంలేదు. మా అమ్మకూ అభ్యంతరంలేదు" అన్నాడు.

చాలాసేపు తలవంచుకుని ఆలోచించి సుందరం చిట్టచివరకు తల అడ్డంగా తిప్పేసింది. "నీకు నిజంగా పెళ్ళామే కావాలంటే మంచిదాన్ని చూసి చేసేసుకో. నేనే కావాలంటే కాకిచేత కబురుచెయ్యి, వచ్చి వాల్తా. నా దారిన నన్ను బతకనీ" అన్నదామె. ఆ సమాధానంలో మంచిగా తీసుకునేదీ, చెడ్డగా తీసుకునేదీ, కూడా రంగడికి కనిపించింది. తాను రంగడికి పెళ్ళాంగా ఉండతగనన్న భావం ఉంది. ఎంత ఇష్టం ఉన్నా రంగడికి పెళ్ళామనిపించుకోవటం తన కిష్టం లేదన్న భావమూ ఉంది. అయితే రంగడికి సుందరంలో చెడ్డ చూడడమనే సమస్యే లేదు. తాను ఆమెకు మొగుడనిపించుకోవటానికి తగడన్న ఆలోచనతో రంగడు తృప్తిపడ్డాడు. ఆ మాట అనుకోవటం అతనికి అవమానమనిపించలేదు.

సుందరానికి ఏ మూలో చిత్రమైన అభిమానం ఉంది. తనకు నష్టమైనా ఆమె రోజూ రంగడింటికి రావటం తానై మానలేదు. ఈ ఏర్పాటుకు విఘ్నం దానంతటదే ఏర్పడింది. రంగడు నాలుగు రోజులపాటు పొరుగూరు వెళ్ళాడు. ఆ తరవాత రంగడు కబురు చేసినప్పుడు సుందరం వచ్చేటట్టు ఏర్పాటు చేసుకున్నారు. ఈ ఏర్పాటును రంగడు దుర్వినియోగపరచలేదు.

సుందరం చేసిన అసలు పొరపాటు శేషుగాడికి చిక్కటం. మొదట్లో శేషు సుందరానికి అరిచేతిలో వైకుంఠం చూపించాడు. డబ్బు విదజల్లాడు. వాడు పాత కేడీ. కనీసం ఒక హత్య కేసులో చిక్కుకున్నవాడు. చెరువుపక్క వాడిల్లు జూద గృహం. మిండగాళ్ళూ, తాగుబోతులూ, దొంగలూ వాడి పరివారం. ఒకడికి దడవటమనేది సుందరాన్ని పగలగోసినా లేదు. ఆ హజంతోనే శేషు దగ్గర చేరింది. ఆ చేరటం పొరపాటయింది. ఆమెకున్న ఒక్క స్వేచ్ఛా పోయింది.

ఆ చెరలోనుంచి బయటికి రావటానికి నాలుగేళ్ళు పట్టింది. శేషుగాడు ఎవరినో పొడిచి జైలుకు పోయాడు. వెళ్ళేటప్పుడు సుందరాన్ని తన అనుచరుల ఆడాలో పెట్టి మరీ వెళ్ళాడు.

అప్పటికి రంగడు రంగారావూ, కథకుడూ, నవలాకారుడూ కూడా అయాడు. కంపోజిటరుగానే అయినా పట్నంలో బతికితే బాగుంటుందా అన్న

ఆలోచనలో ఉంటున్నాడు. ఇంతలోనే సుందరం జీవితంలో ఈ మార్పులన్నీ వచ్చాయి. అప్పటికి సీతమ్మ పోయికూడా ఆయిదారు నెల్లయింది.

ఒకరాత్రి మెయిలుకు రంగడు స్టేషను చేరుకొని రెండు టిక్కెట్లు కొన్నాడు. సుందరం అన్ని ఏర్పాట్లు చేసుకొని పెట్టెతోసహా స్టేషను చేరుకున్నది. రాజు వెంటవచ్చాడు.

అప్పటి నుంచీ వాళ్ళు పట్నంలోనే వుంటున్నారు. రంగడు ఆటే కష్టం లేకుండానే ఒక మాదిరి ప్రెస్సులో కంపోజిటరు పని సంపాదించాడు. పట్నం జీవితం ఇద్దరిలో ఏ ఒక్కరికీ కావలసినట్లుందనడానికి లేదుగాని వాచిపోయినట్లుగా ఒకరి నుంచి ఒకరు సుఖాన్ని జుర్రుకున్నారు. వాళ్ళ జీవితాలు పెనవేసుకుపోవటానికి ఇంత జరిగి ఇంతదూరం రావలసివచ్చింది.

"మానవత్వం" ముప్పాతిక పైగా అయిపోయింది. అందులోకి రంగారావు అనుకున్నంత కాక దిగలేదు. ఆ సంగతి అతనికి తెలుసు. మానవత్వం లేకుండా చిత్రించిన పాత్రలన్నిటిలోనూ తగు మాత్రం మానవత్వం ఉందనే ఉన్నది. అట్లా చిత్రిస్తే తప్ప చిత్రణ వాస్తవంగా ఉండేటట్టు తోచలేదు. చెక్కు మారదని తెలిసినప్పుడున్న వేడి, క్యాష్ పుచ్చుకున్నాక రంగారావులో లేదు. దాని ప్రభావం రచనలోకి వచ్చింది.

అదీ గాక ఇతరత్రా కూడా రంగారావుకు చిరచిర తెప్పించే విషయాలేమీ లేవు. తనకు వచ్చిన డబ్బుతో చిల్లర బాకీలు తీర్చేవాడు. సుందరం వరసగా రెండు పిక్చర్లలో చిన్న వేషాలు సంపాదించుకొని దాదాపు రోజూ షూటింగుకు వెళుతున్నది. ఇంట్లో ఉన్నప్పుడు కూడా అతను రాసుకుంటుంటే ఆమె అతని ఛాయలకు రాదు. రచయితగా రంగారావుకు ఆమె జీవితంలో ఏ స్థానమూ లేదు. ఆమె బొత్తిగా నిరక్షర కుక్షి కాకపోయినా పత్రికలూ అవీ చదివే అలవాటు లేదు. పుస్తకాల చాయలకు అసలేపోదు.

ఒకనాడు ఉదయం రంగారావు తన ఫైలు ముందు పెట్టుకుని కిందటిరోజు రాసినదంతా చదువుకుంటుండగా రాజు వచ్చాడు.

"అరె, ఎప్పుడొచ్చావ్? కార్డు ముక్కయినా రాయలేదేం? సుందరం, ఎవరొచ్చారో చూశావా?" అంటూ రంగారావు లేచాడు. అప్రయత్నంగా అతని మొహం విచ్చుకున్న పువ్వల్లే అయింది. రాజు మొహం కూడ అట్లాగే ఉంది.

సుందరం షూటింగుకు వెళ్ళటానికి సిద్ధమవుతున్నది.

"ఏం రాజన్నా! కులాసాగా ఉన్నావా? నాలుగు రోజులుంటావా?" అన్నది సుందరం.

"ఈ మెయిలుకే దిగాం. రీబిల్టు డెమ్మీ మిషను అమ్మకాని కున్నదంటె సీతారామయ్యగారూ, నేనూ వచ్చాం" అన్నాడు రాజు.

సుందరం కాఫీ చేస్తుండగా సినిమా వాన్ హారన్ మోగింది. "నేను వెళ్ళాలన్నా! మీరిద్దరూ షూటింగు చూద్దురు రండి" అంటూ ఆమె బయలుదేరి వెళ్ళిపోయింది.

రాజు కబుర్లు చెబుతుంటే రంగారావు కాఫీ పని పూర్తి చేశాడు. ఇద్దరూ కాఫీ తాగారు.

"నువు సినిమాకి రాస్తున్నావంటే మంచి అభ్యుదయకరంగా ఉంటుందని మన వాళ్ళంతా అనుకుంటున్నారు" అన్నాడు రాజు.

"అదంత సులువనుకున్నావా రాజా? అసలు కథ నాదికాదు. సంభాషణలే రాశా. డబ్బున్నవాళ్ళను విమర్శించనిస్తారనుకో. కాని చివరకు వాళ్ళే మంచి వాళ్ళు!" అన్నాడు రంగారావు.

"ఆ-అంతేలే. ఆ విమర్శించటమైనా మనబోటోళ్ళకు కాస్త చమ్మగా ఉండటానికి. లక్షలకు లక్షలు వస్తుందంటే ధనవంతుల్ని రాక్షసులల్లే చూపించినా చూపించొచ్చు! నా మాట అబద్ధమా?" అన్నాడు రాజు.

రాజు రాజకీయ చైతన్యం కలిగిన కార్మికుడు. ప్రెస్‌వర్కర్ల యూనియన్‌లో చురుకుగా పనిచేసేవాడు. రోజూ పత్రిక చదవందే నిద్రపోడు. యుద్ధం వచ్చిన యేడూ,[1] ఆ కింద యేడూ కమ్యూనిస్టు సాహిత్యం పడచదివాడు.

రంగారావుకు రాజకీయాలలో అంత ఆసక్తిలేదు గాని రాజు నిత్యమూ చేసే బోధలసారం తలకెక్కింది. వర్గ పోరాటంలో అతనికి పూర్తి విశ్వాసం కుదిరింది. సాంఘిక పరిణామం స్థూలంగా అర్థం చేసుకున్నాడు. పెట్టుబడిదారీకి కీళ్ళు సడలినాక సోషలిస్టు వుత్పత్తి విధానాలూ, చివరకు కమ్యూనిస్టు వ్యవస్థా రాకతప్పదన్నంత వరకూ అర్థం చేసుకున్నాడు.

అయితే ఈ సాంఘిక పరిణామం సాధించటానికి కమ్యూనిస్టు పార్టీ చేసే కృషి మటుకు రంగారావుకు సరిగా అర్థమయ్యేదికాదు. తక్షణ కర్తవ్యాలూ, తాత్కాలిక విధానాలూ, వాటి మంచి చెడ్డలూ నిర్వహించే రాజకీయ పరిజ్ఞానం తనకు లేదనుకునేవాడతను. రాజుకున్నదీ లేనిదీ కూడా అతనికి తెలియదు.

నిజానికి రాజుకున్న ప్రధానగుణం నాయకత్వంకాదు, విశ్వాసం. పార్టీలోనూ, పార్టీ నిర్ణయంలోనూ, వారి విజయంలోనూ అతనికి అపారమైన విశ్వాసం ఉండేది. తన ఎదట జరిగే ప్రతిచిన్న పోరాటాన్నీ చరిత్రలో అంతర్భాగంగా

1. రెండవ ప్రపంచ యుద్ధం వచ్చిన ఏడు 1939.

రాజు చూడగలిగేవాడు. అతను భవిష్యత్తు గురించి కనిన కలలన్నీ రంగారావుకు తెలుసు.

రష్యా, అమెరికా, బ్రిటనులకు జర్మనీ లొంగిపోయినట్లు వార్త[1] వచ్చిన రాత్రి రంగారావు, రాజూ రాత్రి చాలా పొద్దుపోయినదాకా మాట్లాడుతూ కూచున్నారు. రంగారావు దాదాపు ఏమీ మాట్లాడలేదు. అంతా రాజే మాట్లాడాడు.

"...మానవజాతి కిది పునర్జన్మ రంగా! ఇంతటితో ఫాసిజం[2] పైసలా-

---

1. 1945 మే 7,8 తేదీల్లో జర్మనీ ఏ షరతులూ లేకుండా లొంగిపోయింది. 7వ తేదీ రైమ్సులో జనరల్ ఆల్‌ఫ్రెడ్ జోల్ (1890–1946), 8 వ తేదీ బెర్లిన్‌లో ఫీల్డ్ మార్షల్ విల్హెం కీతె (1888-1946) లొంగిపోయారు. న్యూరెంబెర్గ్ యుద్ధ నేరస్థుల విచారణలో ఈ సైనికాధికారులిద్దరికీ ఉరిశిక్ష పడింది.
2. ఫాసిజం మొదటి ప్రపంచ యుద్ధానంతరం యూరప్‌లో తలెత్తిన పారిశ్రామిక ఆర్థిక సంక్షోభం నుంచి పుట్టిన వికృత జాతీయవాద ధోరణి; పచ్చి కమ్యూనిస్టు వ్యతిరేక విధానం. ఉదారవాదానికీ, ప్రజాస్వామ్యానికీ బద్ధ శత్రువు. ఒకే రాజకీయ పార్టీ, జనాకర్షణ ఉండే ఒకే నాయకుడూ. నియంతృత్వమూ, అధికారపీఠ భద్రతకోసం టెర్రరిజమూ, యుద్ధోన్మాదమూ, పారా మిలటరీ స్వభావమూ, వాగాడంబర ప్రచారమూ, న్యాయ సూత్రాలను లక్ష్యం చేయకుండా శత్రువులను నిర్మూలించే స్వభావమూ, ఉగ్రమైన జాతి వివక్షా, జాత్యహంకారమూ, దురాక్రమణ తత్వమూ - ఇవి ఫాసిజం ప్రధాన లక్షణాలు. ముసోలినీ ఆధిపత్యంలో ఈ ఉద్యమం 1922-1945 మధ్య సాగింది. ముసోలినీ 1922 లో అధికారంలోకి రావడంతో ఇటలీ తొలిఫాసిస్టు దేశంగా తయారైంది. ఫాసిజం వేరువేరు రూపాల్లో వేరువేరు దేశాల్లో తల ఎత్తింది. జర్మనీలో నాజిజం (1933), స్పెయిన్‌లో ఫాలాంగ్, రుమేనియా (1940)లో ఐరన్‌గార్డ్ - ఇవి ఫాసిజం రూపాలే. ప్రధానంగా గ్రామీణ ప్రాంతాల్లోని మధ్య తరగతి ఫాసిజంను సమర్థించింది. సుసంఘటితమైన కార్యకర్తలూ, ధనిక వర్గాల వారూ ఈ ధోరణిని ప్రోత్సహించారు. అధికారంలోకి వస్తూనే నాజిజం కార్మిక, మధ్యతరగతులపట్ల వ్యతిరేకతను దాచుకోలేదు. మూడవ సంపుటంలోని 'అనుభవం' నవలలో కూడా ఈ ప్రస్తావనపై వివరాలు చూడండి. రెండవ ప్రపంచయుద్ధంలో ఫాసిజం ఘోరపరాజయం పొందింది. (వివరాలకు చూడండి The Historical Encyclopaedia of World War I I, Newyork : Greenwich Home, 1977)

ఫట్! మళ్ళీ ఇంకో హిట్లరూ,[1] ఇంకో ముసోలినీ[2] బయలుదేరి ఇంత భారీ ఎత్తున జనాన్ని వంచన చేస్తారంటే అది కల్లోమాట. వీళ్ళ పతనంతోబాటు వీళ్ళకు కుమ్మక్కై ఇచ్చిన సామ్రాజ్యవాదులు కూడా ఫట్!...రష్యా అంత బలం గలదని ఒక్క నాయాలా ఊహించలేదు. సోషలిజమంటే ఏమిటో ప్రపంచంలో అందరికి తెలిసిపోయింది. ఎంత వీరత్వం! ఎంత త్యాగం! రష్యా దిగిందాకా హిట్లరుకు అడ్డే లేకపోయెనే![3]...

"పోయినవాళ్ళుపోతే పోయినారు. మిగిలినవాళ్ళు ఎంత అదృష్టవంతులు. రంగా! ఫాసిజమూ సామ్రాజ్యవాదమూ[4] పోయి జనానికి సోషలిజం[5] ఏమిటో తెలిసినాక జీవితం ఉరకలెయ్యదూ? ఇంకో పదేళ్ళకు, పోనీ ఇరవయ్యేళ్ళకు ప్రపంచంలో చదువురానివాడుండడు. నిరుద్యోగి ఉండడు. ఇల్లూ, తిండీ, బట్టా లేనివాడుండడు. ఎక్కడ బట్టినా ఫ్యాక్టరీల ఉత్పత్తి, రవాణా-ప్రపంచమంతా చీమలపుట్ట లాగవుతుం దనుకో! ఇంటింటికీ ఎలక్ట్రిక్ దీపాలు, ఫ్యాన్లు! బీళ్ళూ, బంజర్లూ వుండవు. సమష్టి వ్యవసాయం - వేలకొద్దీ ఎకరాలు. ఒకటేమిటి తల్లి ముండమొయ్యా!...

---

1. అడాల్ఫ్ హిట్లరు (1889-1945) జర్మనీలో నాజీ అధిపతి, నియంత. ఉదారవాదులకూ, కమ్యూనిస్టులకూ ప్రతిగా పారిశ్రామికవేత్తలు పెంచి పోషించిన సెమిటిజం వ్యతిరేకి. మార్క్సిజం శత్రువు; జాతీయ దురహంకారి.

2. ముసోలినీ (1883-1945) ఇటాలియన్ నియంత. 1922లో అధికారం చేబట్టి ఇటలీని తొలి ఫాసిస్టు దేశంగా మలచినవాడు.

3. సోవియట్ రష్యా రెండో ప్రపంచయుద్ధంలో హిట్లరును సమర్థమంతంగా అడ్డుకుంది. 1941 జూన్ 22 వ తేదీ జర్మనీ, రుమేనియాలు రష్యామీద దండెత్తడంతో జరిగిన పరిమాణాలు హిట్లరు పతనానికి దారితీశాయి. సోవియట్ రష్యా అపార త్యాగాల ఫలితంగా హిట్లరు ఫాసిజం ఓడిపోయింది.

4. సామ్రాజ్యవాదం (ఇంపీరియలిజం) మరొక రాజ్యాన్నో, కొన్ని రాజ్యాలనో రాజ్య విస్తరణ దురాక్రమణ లక్ష్యాలతో స్వాధీనం చేసుకుని పాలిత ప్రాంతంలో చేసే ఆర్థిక దోపిడీ విధానం. బ్రిటీష్ సామ్రాజ్య విస్తరణవాదులు జోసఫ్ చాంబర్లేన్ నాయకత్వంలో ఈ మాటను 1890లో అమలులోకి తెచ్చారు.

5. ఉత్పత్తి సాధనాల మీద సమష్టి అధికారం ఉండే సంఘ విధానం సోషలిజం.

ప్రోలిటేరియ ననేవాడుండడు, నీకు తెలుసా రంగా, ఈ ప్రోలిటేరియన్లననేవాళ్ళు ఒకప్పుడు లేరుట!"

"మన దేశం ఎంత ఎనుకపడి ఉందో! పెట్టుబడిదారీ దేశాల్లో ఎటువంటి ప్రింటింగు మిషన్లు! పెట్టుబడిదార్లు కనీసం తమ జాతినన్నా పెంచరు. ఇంగ్లండు పెట్టుబడిదారీ దేశమైవుండి మనదేశంలో కనీసం పెట్టుబడినన్నా ఎక్కరానివ్వలేదు. సోషలిస్టు దేశాలైతే అట్టా ఒక్కనాటికి చేస్తాయా? ఒక దేశం సోషలిస్టవుతాసంటే ఇంకో సోషలిస్టు దేశం సంతోషిస్తుందిగాని, కళ్ళల్లో నిప్పులు పోసుకుంటుందా?...."

రాజుకు కమ్యూనిస్టు నాయకులంటే ఎంత ప్రేమా, అభిమానమూ, దాదాపు భక్తి ఉన్నదో రంగారావుకు అదివరకే తెలుసు. రాజులో దేన్నయినా ప్రేమించే శక్తి అంటూ ఉంటే దాన్నంతా అతను కమ్యూనిస్టులకూ, కమ్యూనిజంకూ, కమ్యూనిస్టు రాజకీయాలకు అంకితం చేశాడు. ఇప్పుడతని ప్రేమ రష్యాపైకి ప్రసరించింది. అవకాశమే ఉండాలిగాని అతను రష్యాకు వెళ్ళి స్టాలినుకూ,[1] తదితర రష్యను నాయకులకూ, మిలిటరీ ఆఫీసర్లకూ షేక్‌హాండ్ ఇచ్చి రావా లన్నంత ఉద్రేకంతో ఉన్నాడు. శ్రీశ్రీ రాసిన "లేలే రష్యా"[2] అంతా రాజుకు కంఠతావచ్చు. తన అభిమాన నాయకులతో సమానమైన స్థానాన్ని రాజు శ్రీశ్రీకి ఇచ్చాడు.

రాజకీయాలద్వారా సాహిత్యంలో అభిలాష పుట్టినవారిలో రాజొకడు. రాజకీయ దృష్టితో ఒక రచనను చదివి "ఇది బాగాలేదు. అందువల్ల ప్రజలు లాభం పొందరు" అనటానికి ఎవరికైనా అధికారమున్నది. సాహిత్యాన్ని సాంఘిక దృష్టితోగాని, నైతిక దృష్టితోగాని, శాస్త్ర దృష్టితో గాని చూచి, విమర్శించటం సబబైతే రాజకీయ దృష్టితో విమర్శించటం కూడా సబబే. కాని రాజుకు ఒక్క రాజకీయదృష్టి మాత్రమే ఉన్నట్టు కనబడేవాడు. తనకు నచ్చిన రాజకీయ దృక్పథం ఉంటే ఇతర గుణాలు ఏమీలేకపోయినా గొప్ప రచన అనేసేవాడు. ఇది రంగారావుకు కొంచెం పట్టిచ్చేది. కాని ఆ కారణంచేత రాజు అభిప్రాయాలను తోసిపారేసేవాడుకాడు.

"ఏం రాజూ? నువు మళ్ళీ మీ సీతారామయ్యగారి దగ్గరకి ఎప్పుడు వెళుతున్నావు? నావెంట ఎంతసేపు ఉండగలవు? దాన్ని బట్టి కార్యక్రమం ఆలో

---

1. స్టాలిన్ (1879–1953) లెనిన్ అనంతరం 30 ఏళ్ళు రష్యా అధినేత.
2. 1941 జూన్‌లో సోవియట్ విమానదళం కార్యక్షేత్రంలోకి దుమకటంతో ఉత్తేజితుడై శ్రీశ్రీ (అదే ఏడాది) రాసిన 'గర్జించు రష్యా!' గేయంలోని పాదం 'లేలే రష్యా!'

బించాలి. సుందరం షూటింగు చూతటానికి నిన్ను తీసుకురమ్మన్నది. అట్లాగే మా పిక్చరు షూటింగు కూడా చూడొచ్చు. ఏమిటిమరి?" అని రంగారావు రాజును అడిగాడు.

"సాయంకాలం మూడింటిదాకా మనని అడిగే వాడు లేడు" అన్నాడు రాజు.

"అయితే నేను రాస్తున్న కొత్తనవల వినిపించనా?" అన్నాడు రంగారావు.

"చెప్పవేం?" అంటూ రాజు చొక్కావిప్పి వంకెన తగిలించి బీడీలూ, నిప్పుపెట్టె తీసుకుని చాపమీద చతికిలబడ్డాడు. రంగారావు ఫైలు తెచ్చి తాపీగా కూచుని చదవనారంభించాడు.

పఠనం వేగంగా సాగింది. రాజు ఎక్కడా అడ్డురాలేదు. ఎక్కడన్నా ఒక పాత్ర పేరు మరిచిపోతే అడిగి తెలుసుకున్నాడు. ఎప్పుడన్నా ఒకసారి, "ఆ మాట బాగుంది. బాగా పడింది" అన్నాడు. రాసినంత వరకు చదవటానికి గంటన్నర పట్టింది.

అంతా విని రాజు, "చివరికేమవుతుంది?" అని అడిగాడు.

ఆ నవలను తాను ఎట్లా పూర్తి చెయ్యబోతున్నదీ రంగారావు చెప్పాడు.

"బాగుంది. నన్నడిగితే నువు లోగడ రాసిన రెండు నవలల కన్నా ఇది ఇంకా బాగుంది. ఎట్లాగైనా పట్నం వచ్చి పడ్డాక నువు రాసే పద్ధతి ఒక మెట్టు పైకెక్కిందనాలి" అన్నాడు రాజు.

రంగారావు తృప్తి పడ్డాడు. నవల రాజుకు నచ్చిందంటే కనీసం రాజకీయం వైపున పెద్ద లోపం ఏమీ లేదనుకోవచ్చు. మిగిలిన విషయాలలో కూడా ఈ నవల తన పాతవాటికన్న బాగానే నడిచింది. పాత్రలు పని పెట్టుకుని సృష్టించినట్టు కాకుండా మరింత సహజంగా ఉన్నాయి.

"తొమ్మిదిన్నర కావచ్చిందే. నువు గడ్డం గీక్కుంటావా? నేనీలోగా స్నానం చేస్తా. తరవాత నువు చేద్దువు గాని," అంటూ రంగారావు స్నానానికి లేచాడు.

ఇద్దరూ స్నానం పూర్తి చేసి కాఫీ హోటల్లో ఇంత తిని స్టూడియోకు చేరుకునేటప్పటికి పదిన్నర కావచ్చింది.

రాజు ఎన్నడూ సినిమా స్టూడియోలుగాని షూటింగుగాని చూడలేదు. స్టూడియోలోకి అడుగు పెడుతూనే అతను ఆ ఆవరణలో వున్న చెట్లూ, పూల మొక్కలూ, పచ్చిక తివాసీలు గమనించాడు.

"చూశావా రంగా? ప్రతి ప్రెసు ఆవరణా ఇంత అందంగా ఉండవచ్చు. ఇటువంటి చోట పని చేస్తుంటే కార్మికుడికి ఉత్సాహం ఉంటుంది. ఆత్మగౌరవం పెరుగుతుంది. ఏమంటా?" అన్నాడతను.

ఈ సంగతి రంగారావుకు అదివరకు తట్టలేదు. అతను మొదటసారి స్టూడియోలోకి అడుగు పెట్టినప్పుడే శ్రామికుడి మనస్తత్వం విసర్జించి మరీ అడుగు పెట్టాడు.

"అవును. కాని ఇదంతా చాలా ఖర్చవుతుంది...ఎంతో మంది తోట మాలీలూ! ఈ తోటను తడపటానికి ఎంత నీరు కావాలి! ఖర్చు!..." అన్నాడు రంగారావు పార్శ్రామికుల పక్షాన మాట్లాడుతున్న వాడల్లే.

"ఇది పెద్దతోట గనక ఖర్చు జాస్తి. చిన్నతోటే వేసుకో! ఏమీ చేతగాక పోతే నాలుగు మెట్టతామర మొక్కలు పెంచూ! నీకసలు అందమనేది తెలిస్తేగా? ఏవంటా?" అన్నాడు రాజు గొంతెత్తి.

రాజు మాట్లాడే విషయమూ, విధానమూ కూడా స్టూడియో ఆవరణలో "జంగ్లీ" మాదిరిగా కనిపించకుండా ఉండటానికి ఒక కనీస నాగరికత అవసరం. అది తన వెంట ఉన్నవాడితో లోపించటం రంగారావుకు యిష్టంలేదు.

"ఇక్కడ ఫరవాలేదు గాని, ఫ్లోర్ల దగ్గిర ఇట్టా గొంతెత్తి మాట్లాడితే గెంటేస్తార్రోయ్!" అన్నాడు రంగారావు నవ్వుతూనే కాని తీరా అనేసినాక ఆ మాట అని ఉండగూడదని తెలుసుకున్నాడు.

అయితే రాజుమాత్రం దాన్ని యే మాత్రము తప్పుగా తీసుకోక "ఇదో టుందేవిటిక్కడ ?" అంటూ అటూఇటూ చూశాడు.

వాళ్ళుఫ్లోర్‌కేసి పోతుంటే ఒక సినిమా జర్నలిస్టు కనిపించి రంగారావును పలకరించి, "ఆ చివరఫ్లోర్‌లో మీ పిక్చరు అవుతున్నట్లుందే! అక్కడికేగా, నేను కూడా న్యూస్‌కవర్ చేద్దామని అక్కడికే పోతున్నా" అంటూ వాళ్ళిద్దరి వెంటా నడిచాడు.

నాలుగడుగులు వేసినాక ఆ జర్నలిస్టు రంగారావును "ఇప్పుడు కొత్తగా ఏమన్నా రాస్తున్నారా!" అని అడిగాడు.

"అవును. పూర్తికావచ్చింది." అన్నాడు రంగారావు.

జర్నలిస్టు అత్యాశ్చర్యంతో "ఏమిటండోయదీ! చాలా రహస్యంగా జరిగి నట్లుందే?" అన్నాడు.

"నవల....ఓహో మీరు సినిమా స్క్రిప్టనుకున్నారేమిటి కొంపతీసి!" అన్నాడు రంగారావు.

"నవలేనా?" అన్నాడు సినిమాజర్నలిస్టు, గాలిపోయిన టైరులాగా అయి పోయి.

ఫ్లోరుకేసి వెళ్ళేదారిలో ఒక చెట్టుక్రింద తిన్నెమీద మరి ముగ్గురు ఆడ వాళ్ళతో బాటు సుందరం కూచునివుంది. అందరూ మేకప్‌అయి డ్రెస్సులు వేసుకొని ఉన్నారు. వాళ్ళను చూస్తూనే సుందరం లేచి ఎదురు వచ్చింది.

"ఇదా నీ వేషం!" అన్నాడు రాజు సుందరంతో.

"ఈ పిక్చర్లో ఇదీ...ఇంతవరకు ఒక్కషాటు కాలా. ఆరతికర్పూరం యెలిగించి ఇంకా కొబ్బరికాయ కొట్టలేదంటే! జాంవు సేపట్నుంచీ ఈ మేకప్ చావుగా ఉంది!" అన్నది సుందరం.

హారతి కర్పూరం వెలిగించటమూ, కొబ్బరికాయ కొట్టటమూ మాట వరసగా అన్నమాటలనుకున్నాడు రాజు.

"మా వాళ్ళేం చేస్తున్నారో తొంగిచూసి వస్తాం," అని రంగారావు కదిలాడు.

"ఆ మనిషి మీ ఇలాకా అనుకుంటాను. టెమిల్ పిక్చర్లో మేకప్‌లాగుంది!" అని సినిమా జర్నలిస్టు అతి నాజూకుగా రంగారావును ప్రశ్నించాడు.

"అవును, అవును," అని రెండు ప్రశ్నలకూ రంగారావు సమాధానం చెప్పాడు.

రాఘవయ్యగారి సెట్టుమీద టేక్[1] దగ్గరలో ఉన్న లక్షణాలన్నీ ఉన్నాయి. లైట్లన్నీ ఝూమ్మని వెలుగుతున్నాయి. కెమెరామాన్ తల ఎత్తి దూరాన ఎక్కడో లైటు వేసి మీటరు పెట్టి చూస్తూ, "స్పాట్, స్పాట్[2] ఓకే" అంటున్నాడు.

ఆర్టిస్టులు అద్దుడు కాగితాలతో మేకప్ సరిచేసుకుంటున్నారు. ఒక మగ ఆర్టిస్టు అటూ ఇటూ మసులుతూ లైన్లు కంఠస్థం చేసుకుంటున్నాడు. "ఓకే"[3]లూ "సైలెన్స్[4] - టేక్" లూ, జాస్తిగా ఉన్నాయి.

ఈ గందరగోళంలో ఒక నౌకరు కుర్రాడులాంటివాడు గారడీ చేసినట్టుగా కొబ్బరికాయమీద హారతి కర్పూరం మండించి, దాన్ని కెమెరాచుట్టు తిప్పి మైక్‌కు చూపించి, డైరెక్టరు దగ్గిరికీ, కెమెరామాన్ దగ్గిరికీ, ఆర్టిస్టుల దగ్గిరికీ, ఆఖరుకు సౌండ్‌మాన్ దగ్గిరికి తీసుకుపోయి, అందరూ కళ్ళ కద్దుకున్నాక బయటికి తీసుకుపోయాడు.

ఈ తంతంతా రాజు నోరు తెరుచుకు చూచాడు. తరువాత రంగారావు తేసి చూశాడు. తరువాత మాట్లాడుకుందామన్నట్లు రంగారావు సంజ్ఞ చేశాడు.

తరువాత మొదటి షాట్ తీశారు. మూడు టేక్‌లు తీశారు. మొదటి దాన్లోనూ, రెండవ దాన్లోనూ, ఏదో లోపం ఉండి మూడుసార్లు ఒకే షాట్ తీశారు.

---

1. టేక్ : ఒక కేమెరాతో తీసిన దృశ్యాన్ని ఒకేసారి రికార్డు చేయడం.
2. స్పాట్
3. ఓకె.
4. సైలెన్స్ : టేక్ తీసేముందు చేసే నిశ్శబ్దపు హెచ్చరిక.

ఘాజుకు అర్థంకాలేదు. మొదటి షాట్‌లో 'నీకు' అనే రెండక్షరాలను నటుడు వదిలేశాడని రంగారావు చెప్పాడు.

"అవి వదిలేసినా వాక్యం అర్థమవుతూనే ఉందే? ఆ భాగ్యానికి దిగుమతి ఫిలిం[1] రెండింతలు తగలేశారా! నాకు తెలీకడుగుతాను-ఈ షాట్‌లో 'నీకు' అన్న మాట లేనందువల్ల సినిమా ఫేలవుతుందా?" అన్నాడు రాజు. కొబ్బరికాయ హారతి కళ్ళారా చూసినాక రాజుకు సినిమాలమీద కొత్తగా భూతదయ లేకుండా పోయింది.

రంగారావు ఘోరులో ఉక్కను తట్టుకోలేకా, రాజుకు మాట్లాడే స్వేచ్ఛ ఉండదనీ బయటికి వచ్చేశాడు. ఫ్లోర్‌దాటి రాగానే రాజుక్కూడా ప్రాణం లేచివచ్చి నట్టయింది.

"అదికాదురా! మన ప్రజానాట్యమండలివాళ్ళు[2] నాటకాలాడలా? నిమిషం పాటులో ఆరుతప్పులేంటి? ఆ ఉక్కలో ఆ లైట్లముందు నటించినందుకు ఎంత డబ్బిచ్చినా ఇవ్వవచ్చుననుకో. కాని నటనగాచూస్తే నా కేవంత - అన్నట్టు ఈ హారతి షాటుషాటుకూ వెలిగిస్తారా? అందరూ కళ్ళకద్దుకున్నారే! నిజంగా భక్తేనా? ఇందులో మోసం ఏమైనా ఉందా?" అన్నాడు రాజు.

"భక్తునకు - భయం. రోజూ మొదటి షాటుకు హారతి వెలిగించి కొబ్బరికాయ కొడతారు. రిలీజుకుముందు ఫిలిము టిన్నులు తిరుపతికి తీసుకుపోయి ప్రోక్షణ చేయించేవాళ్ళున్నారు. సినిమా నాగరికత తిరుపతి దేవుడుకన్నా ఇంకా సనాతనమైనది. ఫిలిం రిలీజుకు ముందు అందులో పనిచేసిన వాడెవడన్నా చస్తే అది బలికింద లెక్క. ఇక ఫిలిం బాగాపోయిందా లేక....అందరూ కారనుకో - ఇటువంటి నవ భావి భక్తులు కూడా సినిమారంగంలో ఉన్నారు. నువు హారతికే నోరెళ్ళబెడితే ఎట్లా?" అన్నాడు రంగారావు.

---

1. దిగుమతి ఫిలిం : ముడి ఫిల్మును దిగుమతి చేసుకుంటున్న రోజుల ప్రస్తావన రెండవ సంపుటంలోని అరుణోదయం నవలలోని 11వ అధ్యాయం మొదట్లో చూడండి.

2. ప్రజా నాట్యమండలివాళ్ళు : ప్రజా కళారూపాలను ఉపయోగించుకుంటూ ప్రజాజీవితాన్ని చైతన్యవంతమూ, విప్లవానుకూలమూ చేయటానికి 1940 ప్రాంతాలనుంచి పూనుకున్న సాంస్కృతిక ఉద్యమం. 1943 జూలైలో ఇండియన్ పీపుల్స్ థియేటర్ అసోసియేషన్ ఏర్పడింది. అఖిల భారత కార్యవర్గంలో డా. గరికపాటి రాజారావు సభ్యుడయ్యారు. అప్పటినుంచీ సంస్థాగతమై సాంస్కృతిక బృందాల ద్వారా రంగస్థలాన్ని ప్రజలకు సన్నిహితం చేసిన మండలి.

వాళ్ళిద్దరూ అక్కణ్ణుంచి పేబుల్ సెట్టుమీదికి వెళ్ళారు. అది చాలా పెద్ద సెట్టు. ఎక్కువమంది ఆర్టిస్టులున్నారు. కెమెరాను కొయ్యపటాలమీద ఎక్కించటం రాజు గమనించాడు. ఇక్కడ ఇంకా రిహార్సల్స్ పూర్తికాలేదు. కెమెరా ఇంకా ముందుకూ వెనక్కూ నడుస్తున్నది. లైట్లు వేస్తున్నారు. ఆర్పుతున్నారు. "వన్స్ మోర్ రిహార్సల్" అని ఎవరో కేక వేస్తున్నారు. హీరో హీరోయిన్‌ని జుట్టుపట్టుకుని ఇంటినుంచి బయటికి తీసే షాట్. హీరోయిన్ హీరో కాళ్ళుపట్టుకొని దేకుతూ, కాలి తన్నుతో కిందపడిపోతున్నది. ఈ వింతదృశ్యం చూడడంలో నిమగ్నుడైపోయి రాజు సుందరంకోసం వెతకనన్నాలేదు.

అతను రంగారావును రెక్కపట్టుకుని బయటకు తీసుకువచ్చి "అదేమిట్రా? ఆ అమ్మాయి లిప్‌స్టిక్ దగ్గరనుంచి వేసుకుని ఆ మొగుడిచేత అంతమంది చూస్తుండగా అంత అవమానపడుతుందీ! మన గంగానమ్మ పౌరుషంలో నూరోవంతైనాలేదే?" అన్నాడు.

"హీరోయిన్‌కు పౌరుషం ఉంటే పిక్చరుకు డబ్బురాదు. ఈనాటి సినిమా పతివ్రతలముందు సావిత్రీ, చంద్రమతి బలాదూరు తియ్యటానికి పనికిరారనుకో" అన్నాడు రంగారావు.

ఈ విధంగా అడుగడుగునా సినిమారంగాన్ని గురించి అవహేళనగా మాట్లాడటంలో రంగారావుకు ఆనందం ఏమీలేదు. లోపల బాధగానూ అవమానంగానూ ఉన్నప్పటికీ రాజు పక్కనవుండగా సినిమా ప్రపంచాన్ని రాజు కళ్ళతోతప్ప అతను చూడలేకపోయాడు. ఈ క్షణంలో తాను విమర్శించే విషయాలన్నీ రంగారావు లోగడ ఆమోదించినవి, కనీసం సహించినవీనూ.

చెట్టుకింద తిన్నె ఖాళీగా ఉంది. ఇద్దరూ దానిమీద కూర్చున్నారు. రాఘవయ్యగారి ప్రొడక్షన్ కుర్రాడు వాళ్ళున్నచోటికి రెండు లోటాలలో కాఫీ తెచ్చి యిచ్చాడు.

రాజు కాఫీ ఒకగుక్కన తాగేసి బీడీ అంటించి, "ఈ సినిమాల ప్రభావం చెప్పనలవిగాకుండా ఉందంటే నమ్ము. 'ఏం వార్తలు కావాలీ' అంటే జనం 'సినిమా వార్తలు కావాలీ' అంటున్నారు. ఎక్కడవిన్నా సినిమా డయిలాగులే. ఆడపిల్లలు సినిమాస్టార్లల్లే షోకులు చేసుకోవటం, మగనాయాళ్ళు దారేపోయే ఆడవాళ్ళమీద సినిమాపాట విసరడం పరకాయించిచూస్తే భయంగా ఉందనుకో. మన ప్రజానాట్యమండలి సజ్జు సినిమాలు అని కొట్టుకుపోయారనుకో. ఇప్పుడాళ్ళ మతికూడా తీరిందిలే. సినిమా కళని ఉద్ధరిస్తామనుకున్నారు. సినిమా కబంధుడికి చిక్కిపోయారు. ఇదేం జూదావు? అభ్యుదయ చిత్రాలు తీస్తామని వచ్చారు; తీశారు. ఆ

తిమ్మిరికూడా వదిలింది.[1] ఇదుగో మనకి పతివ్రతల చిత్రాలు మిగిలాయి. చలంగారు[2] పతివ్రతల్ని తూర్పారబడితే ఓహో అన్నారు. ఆనక ఇరవై ఏళ్ళకి పతివ్రతలు మన రొమ్ముల మీదెక్కి కూచున్నారు! వాళ్ళని దించే మొనగాడు కనపళ్ళా!" అన్నాడు.

రంగారావేమీ మాట్లాడలేదు. రాజును తప్పుపడితే పాక్షిక దృష్టిని తప్పుపట్టాలి. అది వక్రదృష్టి మట్టుకు కాదు.

* * * *

"మానవత్వం" పూర్తి అయింది. ఈ లోపల రాఘవయ్యగారు రంగారావునకు ఇంకో నాలుగు వందలిచ్చాడు. ఇదే సమయంలో సుందరం కూడా ఇంకో నాలు గైదు వందలు సంపాదించింది.

"ఇంతడబ్బే! ఖర్చుచేసే దెట్టబ్బా?" అన్నదామె, ఇద్దరూ కలిసి తమ సంపాదన లెక్క చూసుకున్నాక.

"అదే నాకూ బెంగగా ఉంది" అన్నాడు రంగారావు.

రంగారావు తన నవల తీసికొని పత్రికవాళ్ళ దగ్గరికి వెళ్ళాడు. వాళ్ళే అది వరకు అతని రెండు నవలలూ సీరియల్‌గా అచ్చువేశారు.

"ఇంకో నవల రాశారేమిటి? భేష్! యిప్పుడు నడిచే సీరియల్ అయిపోగానే దీన్ని వేసుకోవచ్చు. ఇంకో రెండు సీరియల్స్ కూడా వచ్చాయనుకోండి. కాని అవి ఏమంత - " అన్నాడు ఎడిటరు.

"మీ వీలునుబట్టి వెయ్యండి. ఒకరిద్దరికి చదివి వినిపించా. వెనకటివాటికన్న యిది యింకా బాగుందన్నారు. చదివి చూస్తారుగా?" అన్నాడు రంగారావు చాలా నిర్లిప్తంగా మాట్లాడుతున్నా ననుకుంటూ.

కాని ఏదో జరిగింది. మరి రెండు వారాలకు పాత సీరియల్ ఆఖరు ప్రకరణం అచ్చయింది. కొత్త సీరియల్ కూడా ఎనౌన్స్ చేశారు. అది "మానవత్వం" కాదు. పేరు మార్చారేమో ననుకోవటానికి రచయిత పేరు కూడా వేరుగా ఉంది.

రంగారావుకు ఎవరో నడివీధిలో చెంపపెట్టు పెట్టినంత పరాభవం అయింది. తన కొత్త సీరియల్ ఫలాని పత్రికలో వస్తుందని రాజుకూ, మరి

---

1. 1945 - 1948 మధ్యకాలంలోని నిర్బంధాలు అనంతరం సినిమాలలోకి ప్రజా నాట్యమండలిలో సంబంధమున్న కళాకారులు వెళ్ళారు. భారీవ్యాపారమైన సినిమా ప్రపంచంలో అభ్యుదయకళ వాస్తవం కాలేదు.
2. గుడిపాటి వెంకటాచలం: చూడండి ఇదే సంపుటిలోని 'ఐశ్వర్యం' నవలలో.

కొద్దిమంది మిత్రులకూ అతను ముందుగానే రాశాడు. వాళ్ళు నవ్వుకోరా? వాళ్ళకిదే పట్టిందా అన్న సందేహం కూడా అతనికి వెంటనే రాలేదు.

నిజానికి రంగారావుకు ఇటువంటి అవమానం కొత్తకాదు. తాను కంపోజిటరుగా ఉంటూ రాసిన కథలు రెండుమూడు ప్రచురించిన పత్రికే అకస్మాత్తుగా తన కథలను మరి రెంటిని అందుకుంటూనే తిరగగొట్టింది. కారణం విచారిస్తే ఆ కథలు రాస్తున్నవాడు ప్రెస్సు కంపోజిటరని పత్రికవాళ్ళకి ఎవరో చెప్పినట్లు తెలిసింది!

ఈ మాట రంగారావుతో చెప్పినవాడు, "ఇంకో దేశంలో అయితే కంపోజిటరు రాసిన కథ వేసుకున్నామని పత్రికలవాళ్ళు గర్వపడతారు. ఈ దిక్కుమాలిన దేశంలో గొప్పవాళ్ళు చెయ్యటాన్నిబట్టి పనులకు గొప్పతనం వస్తుంది గాని గొప్పపనులు చెయ్యడాన్నిబట్టి గొప్పతనం రాదు. ఇది ఇంతే" అన్నాడు సినికల్‌గా.

ఇంకొకనుభవం కూడా రంగారావుకు జరిగింది. జరగడంలో కూడా ఎవరో కావాలని ఏర్పాటు చేసినట్టుగా జరిగింది.

ఒక చిన్న సన్మాన సభ జరుగుతుంటే అదెట్లా ఉంటుందో చూద్దామనీ, రచయితలను నలుగురినీ పరిచయం చేసుకుందామనీ రంగారావు వెళ్ళాడు. ఏ ఫంక్షన్ కూడా అనుకున్న సమయానికి జరిగే ఆనవాయితీలేదుగనుక నలుగురూ 'అధ్యక్షుల వారి' రాకకు ఎదురుచూస్తూ ఏవో కబుర్లు చెప్పుకోసాగారు.

అక్కడ చేరిన ఒక సాహితీపరుడు ఆ సమయంలోనే పత్రికలో పడుతున్న రంగారావు మొదటి నవల గురించి మాటాడుతూ "నేను సామాన్యంగా సీరియల్ చదవనుగాని దీన్ని చదువుతున్నాను. చాలా బాగుంది. కొత్తరకంగా ఉంది-" అని ప్రారంభించాడు.

ఇంతలో ఎవరో ఆయనకు అడ్డుతగిలి "అది రాసింది వీరేనండీ! రంగారావు గారు!" అన్నాడు.

అంతదాకా మెచ్చుకుంటున్నవాడు కాస్తా, తప్పుచేసి దొరికిపోయినవాడల్లే "మీరేనా రంగారావుగారు? చాలా సంతోషం! మీరు షా రాసిన 'ఇంటలిజెంట్ వుమన్ గైడ్' చదివారా ఏమిటి? మరేం లేదు, అందులో ఉన్న ఐడియాలు కొన్ని-" అని ప్రారంభించాడు.

"చదివేవాణ్ణేమో కానివ్వండి. నాకింగ్లీషు రాదండి. ఇంగ్లీషులో కంపోజింగు చెయ్యగలననుకోండి, నేను కంపోజిటరునులెండి. అది నా బ్రతుకుతెరువు!" అన్నాడు రంగారావు, అక్కసుకొద్దీ అతివినయంగా మాట్లాడుతూ.

వెంటనే ఆ 'షా' భక్తుడు "అలా చెప్పండి!" అంటూ తాను అంతకుముందు మెచ్చుకున్న నవలలో ఏయే లోపాలున్నాయో, సన్నివేశాల కల్పనలోనూ, కథనం లోనూ, పాత్ర పోషణలోనూ ఏయే మార్పులు చేస్తే నవల రక్తికట్టేదో ఏకధాటిగా చెప్పసాగాడు.

రంగారావు వింటున్న మొహంపెట్టి తన బుద్ధిని ఆత్మనిగ్రహం మీద కేంద్రీకరించాడు. తన స్థితిలోవున్నవాడు ఇటువంటి అనుభవాలను అవమానాల కింద పాటించరాదు. తాను ఇంకొకరికి ఇటువంటి ఉపన్యాసాలిచ్చే రోజు రాకపోదు....

ఇతరులు ఎంత శ్రమపడి రచయితలయినారో రంగారావుకు తెలీదుగాని అతను చాలా శ్రమచేశాడు. ఎంతో వ్యర్ధశ్రమకూడా చేశాడు. అతన్ని భయపెట్టిన వాళ్ళు జాస్తి. పనికొచ్చే సలహాలిచ్చినవాళ్ల కొద్ది.

కొందరు 'టెక్నిక్' అన్నారు. అదేమిటంటే, దేవుణ్ణి నిర్వచించినంత అయోమయంగా మాట్లాడారు మరికొందరు. ఇంగ్లీషు సాహిత్యం చదవకుండా తెలుగు కథలు రాయడం అసంభవమన్నారు. మొపాసా చదివితే కథాశిల్పం తెలిపోతుందని కొందరు సూక్ష్మంలో మోక్షం చెప్పారు. కొందరు ఉదార స్వభావులు మొపాసా కథల తర్జుమాలు చదివినా చాలునన్నారు.

"ఏదన్నా కథ చదివినప్పుడు దాన్ని అంతటితో వదిలెయ్యక, దాన్నే అంతకన్నా బాగా రాయటానికి వీలుందేమో ఆలోచిస్తే చాలా లాభం ఉంది" అని ఒకాయన చెప్పిన సలహా రంగారావుకు ఎంతో ఉపయోగపడింది. తనకు బాగా నచ్చిన కథల మీద ఈ ట్రిక్కు పారకపోయినా, తనకు బాగుండని కథలను గురించి ఆలోచిస్తే చాలా విషయాలు తెలిసి వచ్చాయి....రంగారావు మొదట్లో కథలు రాసినప్పుడు కొందరు సలహాలిచ్చారు. వాటిలో ఏమేం మార్పులు చేస్తే బాగుండేదో చెప్పారు. ఇటువంటి సూచనలు ముందు అతనికి బాధ కలిగించినా తర వాత పనికివచ్చినమాట అబద్ధం కాదు....ఎవరెన్ని సలహాలిచ్చినా రాయవలసింది తాను, ఆ బాధ, బాధ్యతా తనదీ! రంగారావు సాహిత్య ప్రక్రియలతో హోరాహోరీ పోట్లాడాడు. ఆశా నిరాశలను చవిచూశాడు. ఇది త్వరలో విచ్చిపోయే సంఘర్షణ కాదనీ, రచయితగా తనకు చెయ్యి తిరగటానికి చాలా కాలం పట్టుతుందనీ ముందు గానే రూఢి చేసుకున్నాడు. కొంత పేరూ, పరిగణనా అతనికి అనుకున్నదానికన్న త్వరగానే వచ్చింది ...

ఇంతకీ "మానవత్వం" ఏమయిందీ తెలియలేదు. ఒకనాడు వీలు చూచుకుని రంగారావు పత్రికవాళ్ళను చూడబోయాడు.

నెలజీతపు ఎడిటరు అతన్ని కూచోమని, తాను చూస్తున్న కాగితాలను పక్కకు నెట్టేసి, తనకూ రంగారావుకూ రెండు కాఫీలు తెమ్మని కుర్రాణ్ణి పంపి, దీర్ఘ సంభాషణకు ఆయత్తుడైనవాడి వాలకం పెట్టేశాడు.

అతనే చెబుతాడు గదా అని రంగారావు తన నవల మాట ఎత్తలేదు. ఎడిటరేమీ తక్కువ తిన్నవాడుకాడు. ఆ నవలను గురించి మాటాడవలసింది ఏమీ లేదన్నట్టుగా, "ఇంకేమిటండీ విశేషాలూ? మళ్ళీ కొత్తది ఏమన్నా మొదలు పెట్టారా? మాకు కథలు కూడా అప్పుడప్పుడూ పంపుతుండకూడదూ?" అన్నాడు.

అతనన్న ఆఖరు మాటతోనే రంగారావు తన నవలను వాళ్ళు వేసుకోరని శంకించాడు. పైకిమటుకు, "కథ అడుగుతున్నా రేమిటి? మీకు ఏకంగా నవలే యిస్తినిగా? దాని విషయం ఇంకా తేలలేదు గామాలి?" అన్నాడు.

"అది మా బాస్‌గారు చదువుతున్నారండీ! సీరియల్స్ ఆయనే చూస్తామన్నారు. మనదేం పోయింది? మనకి పని తగ్గుతుంది. ఇప్పుడు ప్రారంభించిన నవల ఆయన సెలెక్టు చేసినదే. నేను చదవను కూడా లేదు ...కాఫీ అటే వేడిగా ఉన్నట్టు లేదు. తీసుకోండి."

"కనీసం మీరైనా చదివారా?" అని రంగారావు అడిగాడు.

"దాదాపు సగం చదివాను. ఇంతలో ఆయన కబురు చేసి నా దగ్గిర వున్న సీరియల్స్ తెప్పించుకున్నారు."

"పడితే పడుతుంది. లేకపోతే లేదు. దాని ధోరణి ఎట్లా ఉందో చెబితే నాకు లాభిస్తుంది-కొత్త రచయితను కదండీ?"

"చాల్లెండి! ఇంకా నయం! మీరు కొత్త రచయితేమిటి?" అంటూ ఎడిటర్ ప్రూఫ్ చెస్టు చేశాడు.

ఇతనింక మాట్లాడడనిపించినాక రంగారావు "ఇంతకూ నా 'మానవత్వం' మీ కెట్లా ఉన్నదీ చెప్పనే లేదు" అన్నాడు.

ఎడిటరు నీళ్ళు నములుతూ "సాంతము చదవకుండా చెప్పటం సాహసమే ననుకోండి. అయినా అడిగారు గనక - ఇందులో కమ్యూనిజంపాలు జాస్తిగా ఉన్నట్టు నాకు అనిపించింది సుమండీ!" అన్నాడు.

"కమ్యూనిజమా? అదేమీ లేదే!" అన్నాడు రంగారావు అప్రయత్నంగా.

ఆ మాట నోరుజారి వచ్చేసింది. కమ్యూనిస్టు విముఖులకూ బెదురు గొడ్లకూ ఏ పరిస్థితులలోనూ ఎటువంటి సంజాయిషీ కూడా ఇవ్వరాదని రంగారావు ఏనాడో తీర్మానించుకున్నాడు.

ఒక దశలో అతన్ని ఈ కమ్యూనిజం గురించి పీక్కు తిన్నారు. అధోగతిలో వున్నవాళ్ళను "అయ్యో పాపం!" అంటే కమ్యూనిజం! జీతాలివ్వని

యజమానిని కథలో చిత్రిస్తే అది కమ్యూనిజం!....ఒక ప్రెస్సులో రంగారావుకే వరుసగా మూడు నెలలు జీతం రాలేదు. ప్రెస్సు వర్కర్లంతా కలిసి యజమానిని నానా మాటలూ అన్నదాకా వెళ్ళింది. "అనాడే మేమంతా కమ్యూనిస్టుల మయిపోయామన్న మాటా! 'అడిగిన జీతం బివ్వని మిడిమేలపు దొరనుగొల్చి మిడుగుట కంటెన్,[1] అని రాసినవాడు కమ్యూనిస్టేనా?" అని రంగారావు కమ్యూనిస్టు వ్యతిరేకిని ఝాడించి అడిగాడు. ఈనాడు మానవత్వమంటేనే కమ్యూనిజంగా చూచేవాళ్ళు బయలుదేరుతున్నారు గాబోలనుకున్నాడు రంగారావు.

"నే నన్నది లిటరల్‌గా తీసుకోకండి! ఇప్పుడు కొందరు రాసే కథలు జన సామాన్యానికి క్రమశిక్షణ లేకుండా చేసి కమ్యూనిస్టుల మాట వినేలా చేస్తున్నాయి. అందుచేత మా బాస్ అటువంటి రచనల్ని కాస్త చూసి మరీ వెయ్యమంటున్నారు!" అన్నాడు ఎడిటరు.

"మీ బాస్‌గారి సంగతి నాకు తెలీదనుకోండి. కాని మీరు క్రమశిక్షణ అని ఏదో అన్నారే - దారిద్ర్యం అనుభవించటానికీ, పెళ్ళాం బిడ్డల్ని పోషించ లేకపోవటానికీ, వైద్యుడికి డబ్బివ్వలేక రోగాలతో తీసుకోవటానికి ఆట్టే క్రమశిక్షణ అక్కర్లేదండి! ఇంకా విప్లవాలు సాగించటానికే క్రమశిక్షణ కావాలేమో! మాట వరసకు చెబుతున్నాను, మరేమి అనుకోకండి. నాకో స్నేహితుడున్నాడు. ప్రెస్ వర్కరు. కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు. అతనికుండే క్రమశిక్షణ సిపాయీలకుండదు తెల్సునాండి? మీరూ, నేను వేళాకోళానికే అనుకోండి, కమ్యూనిస్టు పార్టీ మెంబర్లం కావాలని దరఖాస్తులు పెట్టినా మనవి తీసుకోరు తెలుసునాండి?" అన్నాడు రంగారావు, తాను నోరుజారి అన్నమాటకు పరిహాసం చేసుకుంటూ.

ఎడిటరు ప్రజ్ఞకోసం పెనుగులాడుతూ, "నేనన్నది మీరు సరిగా అర్థం చేసుకోలేదు-" అని ప్రారంభించాడు.

"ఇంకా అర్థం చేసుకునేటందుకు ఏముందీ? మానవత్వంలో కమ్యూనిజముందని మీరన్నారు. నాకర్థమయింది. మీ మాట నేను నమ్మి దీన్ని ప్రచురించుకోమని 'ప్రజాశక్తి'కి[2] పంపితే వాళ్ళు తిప్పిపంపవచ్చు. అప్పుడుమీరూ, నేను

---

1. సుమతి పద్య పాదం.

2. ప్రజాశక్తి ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ తన భావాల వ్యాప్తికి ప్రారంభించిన పత్రిక. 1942 జూన్ 17వ తేదీన విజయవాడనుండి వార పత్రికగా మద్దుకూరి చంద్రశేఖరరావు సంపాదకత్వంలో ప్రారంభమైంది. 1945 డిసెంబరులో కమ్యూనిస్టు పార్టీ మొట్టమొదటి దిన పత్రికగా రూపొందింది. 1948 ఫిబ్రవరిలో నిషేధానికి గురి అయింది 1951లో కొన్నాళ్ళు ద్వైవార పత్రికగా నడిచింది. 1952 జూన్ 22వ తేదీన విశాలాంధ్ర దిన పత్రికగా పరిణామం పొందింది.

కూడా తెల్లమొహాలు వెయ్యాల్సొస్తుంది...మీరు వేసుకోని పక్షంలో దయచేసి వా నవల నా కిప్పిస్తారా?" అన్నాడు రంగారావు.

ఎడిటరు ఏమరుపాటున డ్రాయరు సొరుగులాగి మళ్ళీ చటుక్కున మూసి, "వారిదగ్గర ఉందన్నానుకదూ? వారు చూసి ఏమాటా చెప్పినా-" అన్నాడు.

"మా ప్రొడక్షనాఫీసుకు టెలిఫోన్ చేస్తే నేనేవచ్చి తీసుకుపోతా" అన్నాడు రంగారావు. ఇంకా నటనతో ఏం పని?

"మీకంత శ్రమకూడా దేనికి? రిజిష్టరు పోస్టులో మీ ఎడ్రసుకు పంపేస్తా లెండి" అన్నాడు ఎడిటర్.

రంగారావు ఆఫీసుదాటి వీధిలోకిరాగానే ఆ పత్రికవాళ్ళ సినిమా ఎడిటరు కనిపించాడు, ఎవరితోనో మాట్లాడుతూ.

"బాబ్బాబు! నాలుగు సినిమాకబుర్లు చెప్పేసి ఈ వారం నాకు తిరుగుడు తప్పించండి-మీకింత టిఫినూ అదీ ఇచ్చుకుంటాను" అన్నాడతను రంగారావుతో.

"మీ ఆఫీసులో అడుగు పెట్టినప్పుడే కడుపు నిండిపోయింది!" అన్నాడు రంగారావు నిష్ఠూరంగా.

"రావయ్యా దేవుడా!... అసలేం జరిగిందేవిటి?" అంటూ సినిమా ఎడిటరు రంగారావును కాఫీహోటలులోకి నడిపించాడు.

ఇంకా లంచ్ అవర్ ప్రారంభం కాలేదు. కాని అందుకు తయారుగా ఉన్నది హోటలు. ఆరు కుర్చీలున్న గుండ్రని బల్లదగ్గిర ఇద్దరూ ఎదురెదురుగా కూచున్నారు.

"బాయ్, ఫాన్! అయ్యర్, రెండు స్వీట్లు కావాలి. ఈ నెల్లో చేసినవిగా పంపించు-కిందటినెలవి వద్దు. రెండు ప్లేట్లు ఇడ్లీ సాంబారు, ఆ తరువాత రెండు కప్పులు స్ట్రాంగ్ కాఫీ!" అని అతను రంగారావు కేసి తిరిగి "మనం ఏం తింటామో ముందే చెప్పేస్తేగాని అయ్యరు మంచినీరు సరిగా సప్లయి చెయ్యడు. స్వీట్ అని ఊరుకున్నామనుకో, మంచినీళ్ళివ్వడు. మంచినీళ్ళు తాగేసి తిండి తగ్గిస్తామని భయం!...ఈ సొళ్ళు కబుర్ల కేంగాని - అసలేం జరిగింది?" అన్నాడు.

రంగారావు జరిగిన సంగతి చెప్పాడు.

"అవును, రైటే! మీ నవల మేం వెయ్యం! ఎందుకు వెయ్యాలండీ? నాకు తెలీకడుగుతానూ. అనామకుడుగదా అని ఒక నవల వేశాం. మీకు కీర్తి వచ్చిందీ! పదిమందీ బాగుందని ఉత్తరాలు రాశారూ! చాలాచోట్లనుండి అన్‌సోల్డ్స్ కూడా రాలేదు. కొన్ని సెంటర్లు ఎక్కువ కాపీలు ఆర్డరిచ్చాయి! అందుకని రెండో నవల వేశాం! మీకు కీర్తి వచ్చేస్తున్నదని ఖాయంగా తెలిసిపోయింది! ఇహ వెయ్యం! మాకు సర్క్యులేషన్ రాకపోతే పీడాపోయె. మా సర్క్యులేషన్ మేం తెచ్చుకో

గలమండీ! మాకు సర్క్యులేషన్ తెచ్చిపెట్టటానికి మీ రెవరండీ? పైగా మా ద్వారా మీరు కీర్తి సంపాదించేసుకుంటే మా కడుపు భగ్గున మండిపోదుటండీ! అంచేత కొన్నేళ్ళపాటు మా పత్రికలో మీ పేరు పట్టానికే వీల్లేదండీ! (మామూలు గొంతు పెట్టి) అయ్యా, అదీ ఉన్న విషయం. మీ నవల వేసుకునే గీత మాకు లేక పోతే మీరు మాత్రం ఏం చెయ్యగలరూ? మీ రెండు నవలలూ చదివా. మొదటి నవల నాలుగిన్‌స్టాల్మెంట్లు చదవలా. ఎవరో డి.వీ. రంగారావంటే చలమా, గోపీ చందా? ఎందుకు చదవాలి పొమ్మనుకున్నా. అందరూ బాగుంది, బాగుంది అంటుంటే పోనీగదా అని బాక్ నంబర్లు తీసి చదివా. ఆ తరువాత విడవకుండా చదివా. రెండు నావెల్సు నాకు నచ్చాయి మరి. రాసింది సబబుగానూ, న్యాయం గ్గానూ, దర్మంగానూ ఉంది. మాటలాగే రాతకూడా నలుగురూ విని బౌననేట్టుం డాలి. ఏమంటారు?"

రంగారావు నవ్వి ఏమీ అనలేదు. ఇద్దరూ లేచారు. రంగారావు జేబులో చెయ్యిపెట్టటంచూసి సినిమా ఎడిటరు, "మీ సినిమావాళ్ళచేత డబ్బు ఖర్చుపెట్టిస్తే పాపం ఏమీలేదుగాని నాకు ఎకౌంటుంది. మా అయ్యరు దొంగ. మీ దగ్గిర డబ్బుకు డబ్బా తీసుకుంటాడు, నా పేర ఖాతాలో రాయనూ రాస్తాడు. అంచేత పెద్దమనిషి శవవాహకులతో అన్నట్టు ఈ సారికిట్టా పోనివ్వండి" అన్నాడు.

ఇద్దరూ వీధిలోకి వచ్చినాక రంగారావు "సినిమా వార్తలు కావాలన్నారు?"

"సినిమా వార్తలకోసం మిమ్మల్ని బాధపెడతానా, మాటవరసకన్నానుగాని హాయిగా నాలుగు పిక్చర్లకు రాసుకుని డబ్బుచేసుకోండి. ఉంటా. మరి సెలవా?"

"మానవత్వం" త్వరలోనే రంగారావుకు తిరిగి వచ్చింది. దాన్ని ఏం చెయ్యాలో, యింకెవరికి పంపాలో అతనికి తోచలేదు. రాజుకు పంపిస్తూ "దీన్ని ఏదో ఒకటి చెయ్యి" అని రాశాడు.

"ఇక్కడ ఒక పబ్లిషరు నీ పుస్తకాలు అచ్చువేస్తానంటున్నాడు. 'మానవత్వం' కూడా తానే వేసుకుంటానంటున్నాడు" అని రాజు రాశాడు. అందుకు సమ్మతిస్తూ రంగారావు జవాబు రాశాడు.

రాఘవయ్యగారి పిక్చర్ రిలీజై బాగా పోతుందన్న పుకారు పుట్టిన రెండు మూడు రోజుల్లోపల మరి ఇద్దరు ప్రొడ్యూసర్లు రంగారావును సంభాషణలు రాయించటానికి కుదుర్చుకున్నారు. ఎడ్వాన్సులుకూడా యిచ్చేశారు.

"ఇక ఫరవాలేదు సుందరం! మనం కాస్త మంచి ఇంట్లోకి మారవచ్చు," అన్నాడు రంగారావు.

"ఈ ఇంటికేమొచ్చింది? నాకీయిల్లే బావుంది. ఇది అచ్చొచ్చింది. అంత డబ్బు జాస్తిగా వుంటే సొంతాన ఇల్లు కట్టిద్దువులే" అన్నది సుందరం.

"జరగనప్పుడు తప్పనే తప్పదు. జరుగుబాటయినప్పుడు కాస్త పరువుగా బతికితే తప్పా? నువ్వింక ఈ ఎక్స్ట్రా వేషాలకు పోనక్కర్లేదులే."

"ఏంటీ? డబ్బంటే అలుసూ, పరువు మీద మోజూ - బుల్లోడు సంగతి శాందాకొచ్చిందే? ఏదీ డబ్బెక్కువుంటే ఇట్టాపారేయ్-నగలూ, చీరలూ కొంటా!"

"మనిద్దరమూ పెళ్ళికూడా చేసేసుకుందాం. ఎందుకొచ్చింది?"

"నా కిప్పుడు పెళ్ళి సంకెళ్ళొకటి తక్కువయిందేం?" అన్నది సుందరం కోపంగా.

ఆమెకు పెళ్ళంటే కోపమని రంగారావుకు తెలుసు. అందుచేత ఆ ప్రస్తావన ఇంతవరకెన్నడూ తీసుకురాలేదు.

ఒక ఆడదీ మగవాడూ కలిసి జీవిస్తున్నప్పుడు వారి ఆర్థికస్థితి కాస్త చక్కబడగానే ఆడది తనంతటతానే పెళ్ళాం హక్కు కోరుతుంది. అట్టా కోరిన ఆడవాళ్ళను రంగారావు చూశాడు. కాని సుందరం లోకానికి విరుద్ధమైన మనిషి. ఆమెకు ప్రేమబంధం సహజంగానే కనబడేదిగాని, నీతిబంధం చాలా అసహ్యంగా కనబడేది. పెళ్ళంటే దానివెంట నీతిబంధం దానంతట అదే వచ్చి పడుతుంది. ఒకరి పెళ్ళామయినాక యింకో మగాడితో మాట్లాడితేనే తప్పు. మాట వరసకి తనకూ, రంగడికీ పెళ్ళే అయితే, రంగడు డబ్బు చిక్కుల్లోవుంటే తాను సంపాదించి పెట్టటానికుంటుందా? రాముడడివికి వెళితే సీతమ్మోరు వెంటవెళ్ళినట్టు తాను కూడా రంగడితోపాటు పస్తులు పడుకోవాలి. ఇది సుందరానికి భయంకరమైన పరిస్థితి - చేతగాని వాజమ్మలు చేజేతులా మెడకు వేసుకొనే ఉచ్చు! రంగడు డబ్బు విషయంలో మెట్టెక్కేశాననుకుని పెళ్ళంటున్నాడు! సుందరానికి మండిపోయింది. "మహా మహావాళ్ళు మట్టికొట్టుకుపోయారు! ఆరు నూరయేది పెళ్ళిమాటమాత్రం తల పెట్టటానికి వీల్లేదు."

పెళ్ళి విషయం సుందరం పట్టుబడితే, ఇంటి విషయం రంగారావు పట్టు పట్టాడు. మరో వారంరోజులకల్లా వాళ్ళు ఒక మేడమీది పోర్షను చూసుకొని అందులో చేరారు. అద్దె నెలకి 90 రూపాయలు. రశీదు 50 కిస్తారు. ఏడాదికి సరిపోయే దొంగ అద్దెకింద అయిదువందల రూపాయలు ఇంటివాళ్ళు ముందుగానే పుచ్చేసుకున్నారు-రసీదులేకుండా.

"డబ్బు పోతేపోయిందిగాని ఇల్లు ఫస్టుగా వుంది" అన్నది సుందరం.

"వద్దంటివే. రేపు పెళ్ళికూడ కావాలంటావు," అన్నాడు రంగారావు. సుందరం మూతి ముక్కచెక్కలు చేసుకున్నది.

ఇల్లయితే బాగుందిగాని ఈ ఇంటికి వచ్చాక నలుగురూ రాకపోకలు సాగించారు. సుందరం మనిషినాపలేని మనిషికాదు. కాని మరీ ఇంత పెద్ద మనుషులు ఇంటికొస్తే ఆమెకు భయం. ఈ అసిస్టెంటు డైరెక్టర్లే, ఈ ప్రొడక్షన్ మేనేజర్లే, స్టూడియోలో కనిపిస్తే అధికార పద్ధతిలో వాళ్ళతో ఎట్లా మాట్లాడాలో, ఎట్లా వ్యవహరించాలో సుందరానికి తెలుసు. కాని వాళ్ళ ఇళ్ళకు అతిథులుగా ఒక్కొక్కసారి పెళ్ళాం పిల్లల్ని వెంటవేసుకుని ఎటోవెళుతూ దారిగదా అని వస్తే ఏం చెయ్యాలో - ముఖ్యంగా ఆడవాళ్ళను ఎట్లా పలకరించాలో సుందరానికి తెలీదు.

ఆ జాతి ఆడవాళ్ళకు "పతివ్రత" అని సుందరం పేరు పెట్టింది; వాళ్ళ భాషే సుందరానికి విడ్డూరంగా ఉంటుంది. "మా వారిట్టా అన్నారు! అట్టా అన్నారు. ఇట్టా చేశారు!" అని వాళ్ళను ఇమిటేట్ చేసేది. "ఆళ్ళ ముక్కు చిట్లించటం మినహా అన్నీ చేస్తారు. కుందేళ్ళను వాసనబట్టే వేటకుక్కల్లే!" అనేది....

ఒకనాడు రంగారావూ, సుందరమూ ఏదో ఇంగ్లీషు సినిమాకు వెళ్ళారు. హాల్లోనుంచి వాళ్ళు బయటికి వస్తుంటే రంగారావు పనిచేసే పిక్చర్ ప్రొడ్యూసరూ, భార్యా కూడా కనిపించారు. వాళ్ళూ అదే ఆట చూశారు. ప్రొడ్యూసరు "ఓహో" అని రంగారావును పలకరించాడు. తన భార్యను పరిచయం చేశాడు. సుందరం భయంచేతనైతేనేం, ఆ తరగతిమీది అసహ్యం చేతనైతేనేం వెనక్కు తగ్గింది. ప్రొడ్యూసరూ, ఆయన భార్యా, రంగారావూ సినిమాగురించి మాట్లాడుకుంటూ నడిచారు.

వాళ్ళు అట్లాగే ప్రొడ్యూసరు కారుదాక వెళ్ళాక ఆయన రంగారావుతో "ముందుసీటులో కూచోండి. మిమ్మల్ని మీ యింటిదగ్గర డ్రాప్ చేస్తాను" అన్నాడు.

రంగారావు వెనక్కు తిరిగిచూస్తే సుందరం కనిపించలేదు.

"ఎవరికోసమన్నా చూస్తున్నారా ఏం?" అన్నాడు, భార్యతోసహా వెనుక సీటులో ఎక్కికూచున్న ప్రొడ్యూసరు.

"మావాళ్ళు-" అన్నాడు రంగారావు తనకే వినపడకుండా. ఇంతలో అతనికి సుందరం ఒకస్తంభం ప్రక్కన ఒదిగినుంచుని కనిపించింది. "అక్కడే నిలబడ్డావేం? వేగిరంరా!" అని రంగారావు అభినయించాడు.

సుందరం రాయల్లే కదల్లేదు.

అతను గబగబా ఆమె దగ్గిరికి వెళ్ళి "ఏమిటిది? వాళ్ళు కాచుకొని ఉన్నారురా, కార్లో దింపేస్తారు" అన్నాడు.

"వాళ్ళ కార్లో నేను రాను" అన్నది సుందరం.

ప్రొఫెసరుగారి భార్య "మనమెందుకు వెయిట్ చేస్తున్నామో మీకేమైనా తెలుసునా?" అనడం రంగారావుకు వినిపించింది.

ప్రొఫెసరు కారుదిగి వాళ్ళ దగ్గిరకి వచ్చి, "కమాన్, పదండి పోదాం. ఏమాలస్యం?" అన్నాడు.

తప్పనిసరి అయి సుందరం కదిలింది. సుందరం తన పక్క కూచుంటే ప్రొఫెసరుగారి భార్య మైలపడిపోతున్నదాని మొహం పెట్టింది.

ఆనాడు ఇద్దరూ బిగుసుకుపోయినారు. సుందరం అట్లా 'సీను' చెయ్య నవసరంలేదని రంగారావుకు అనిపించింది. కనీసం తనకోసమన్నా అతను వాళ్ళను వదిలించుకుని ఉండవలసిందని సుందరం మనస్ఫూర్తిగా నమ్మింది.

కొంచెం తర్కించుకున్నారు.

"వాళ్ళయినా మనుషులేగా? అయిదు నిమిషాలు ఓపికపడితే సరిపోదూ?" అన్నాడు రంగారావు.

"వాళ్ళ వాసన నాకు పడదు. నా వాసన వాళ్ళకు పడదు. ఆ సంగతి నీకు చెప్పినా తెలీకపోతే ఏం చెయ్యాలా?" అన్నది సుందరం.

"వాళ్ళంటే అసహ్యమైనట్లు నటించకు. అసలు నీకు భయం! ఆ మాటొప్పుకోవు!" అన్నాడు రంగారావు. అతని ఉద్దేశం సుందరాన్ని హింసించటమే. కృతకృత్యుడయ్యాడు కూడా.

"వాళ్ళంటే నాకు అసహ్యమన్నట్టు మాట్లాడేవాడివేఅదీ అబద్ధమేగా! నిజానికి వాళ్ళంటే నీకు తీపేనేవే!" అన్నది సుందరం, పగతీర్చుకుంటూ.

ఇల్లు మారినప్పటినుంచీ సుందరం తానుకూడా మారుతున్నట్టు కనపడింది. ఆ పాత డొక్కు కొంప అచ్చొచ్చిందని ఆమె అనుకోవడం మూఢ విశ్వాసమే గావచ్చు గాని, దానివెనుక కొంత హేతువాదం వున్నది. ఆమె తరగతి మనుషు లంతా అక్కడున్నారు. ఈ ఇల్లు జైలు. ఆమెకు యెవరితో మాట్లాడటానికి లేదు. ఇంకొకరితో కలిసి నవ్వుకోటానికి లేదు. జైలుతోబాటు ఇక్కడ ఆమె నోటికి తాళంకూడా పడ్డట్టయింది.

ఆ వాతావరణం కోసం ఒకసారి ఆమె అక్కడికి వెళ్ళితే "మమ్మల్నిడిచి పొయ్యావుగా? ఇప్పుడు నువ్వు గొప్పదానివైపోయావులే!" అని నవ్వుతూనే అంటించారు. సుందరం గుండె చివుక్కుమన్నది. తన పాత స్నేహితులతో మాట్లాడేటందుకు ఆమెకు నిజంగా ఏమీ లేకపోయింది.

తాను మారటం అట్లావుంచి రంగారావే మారుతున్నట్టు ఆమెకు తోచింది. దేనికోసం మారుతున్నాడు? ఈ మనిషికి తాను మనస్ఫూర్తిగా కావాలన్నట్టా? అక్కర్లేదన్నట్టా?

"ఇంకా నాలుగు రోజులాగితే అదీ తెలుసుద్ది" అనుకున్నది సుందరం మనస్సు గట్టిబరుచుకుని...

ఇల్లుమారినాక రంగారావు ఉన్నట్టుండి ఒక కారు కొన్నాడు-డొక్కుకారు. రెండు వేల అయిదువందలు రొక్కం యిచ్చాడు. మిగిలిన రెండువేలూ మార్వాడి అప్పు.

"ఎందుకీకారు? అన్నది సుందరం, ప్రశ్నిస్తున్నట్టుగా కాకుండా.

సుందరం ఎడమవుతున్నదన్న భావం రంగారావులో కూడా కలుగుతూనే ఉన్నది. అతను కూడా బాధపడ్డాడు. కాని తప్పు సుందరందేనని రూఢిగా నమ్మాడు. అతను ఒకనాడు తన తత్వం ఆమెకు వివరంగా చెప్పాడు.

"చూడు సుందరం! మనం లేనివాళ్ళమే. ఒప్పుకుంటా. కాని ఎల్లకాలం లేనివాళ్ళగానే ఉండిపోవాలని కంకణం కట్టుకున్నామా? ఏదో బతుకుతున్నాం. ఎంత బాగా బతికే అవకాశంవుంటే అంతబాగా బతుకుదాం. తప్పేం? ఈ కార్లలో ఊెక్కి తిరిగేవాళ్ళంతా మనకన్న గొప్పవాళ్ళని నీవు మాత్రం ఒప్పుకుంటావా? నాలుగు దబ్బులు చేతిలో ఉంటే నీకు నగలూ, చీరెలూ కొనుక్కోవాలని ఉండదా? నాకట్లాగే మంచి యింట్లో ఉండాలనీ, కారెక్కి తిరగాలనీ వుంది. అది తప్పంటావా? తప్పయితే ఆ తప్పేమిటో నాకూ్కడా చెప్పు-తెలుసుకుంటా!"

"ఇందులో తప్పేమిటి? ఒప్పేమిటి! ఈ కారు మన్ని ఎక్కడికి తీసుకు పోద్దో అని నా అనుమానం" అన్నది సుందరం.

"జీవితమే మనని మన ఊరునుంచి ఈ పట్నం చేర్చిందా లేదా? ఈ సినిమా గొడవ నువ్వెరుగుదువా? నే నెరుగుదునా? ఇక్కడికొచ్చి పడ్డాం. బాగానే ఉన్నాం. మొన్నటిదాకా ఈ మాత్రం ఇంట్లో ఉండలేకపోయాం. ఇవాళ ఉన్నాం. నిన్నటిదాకా సొంత కారు లేదు. ఇవాళ వచ్చింది. రేపటిమాట చూద్దాం"

సుందరం మాట్లాడలేదు. తన వాదన ఆమె అంగీకరించదని రంగారావు అనుకున్నాడు.

అతను తనలో కలుగుతున్న ఇంకొక మార్పు గమనించలేదు - అతను కొంతకాలంగా అంతర్ముఖుడవుతున్నాడు. సినిమాల వాళ్ళు ఏం రాయమంటే అది రాయటమూ, వాళ్ళిచ్చే డబ్బే ప్రధానంగా గడించటమూ అతనికి స్వాభావికంగా కనబడుతున్నది. అతని చుట్టూ ఉన్న వాతావరణంలో అందరూ అదే కృషిలో నిమగ్నులై ఉన్నారు. ఈ వాతావరణంలో కూడా అతనికి సన్నిహితులున్నారుగాని, వాళ్ళతో అతనికున్న అన్యోన్యత రాజుతోనూ, ఇతర ప్రెస్ వర్కర్లతోనూ ఉన్నటువంటిది కూడా కాదు. ఆకాశంలోకి ఎత్తుగా వెళ్ళినకొద్దీ ప్రాణవాయువు తగ్గినట్లుగా ఈ సమాజంలో మనుషుల స్థాయి పెరిగినకొద్దీ వాళ్ళ

మధ్యగల జీవిత బంధాలు సడలిపోతాయి లాగుంది. దీన్ని రంగారావు ఆమోదించాడు. సుందరం ఆమోదించలేదు...

రంగారావు కొంతకాలంపాటు తన జీవితాన్ని తానే నడుపుతున్నట్లు కనపడ్డాడు. అతని రెండో పిక్చరుకు బాగా డబ్బొచ్చింది. మూడో పిక్చరుకు డబ్బు రాలేదు గాని సంభాషణలను అందరూ మెచ్చుకున్నారు. మరి రెండు పిక్చర్లలో బుక్కింగు కూడా దొరికింది.

ఆరు నెలలపాటు సుందరం స్టూడియోల ఛాయలకు పోలేదు. మొహానికి కోటా వెయ్యలేదు. ఆమెకు తాను బతికివున్న సంగతికూడా అనుమానాస్పదంగా కనిపించింది.

ఒకనాడామె పట్టలేక యింటినుంచి బయలుదేరి వేషం కోసం వెళ్ళింది.

"నీ మొగుడు రెండు చేతులా సంపాదిస్తుంటే నీకు వేషాలెందుకు?" అని యేసుమలై అడగాడు.

"ఊరికే కూచుంటే ఏం తోచటం లేదన్నా, అది గొప్పోళ్ళ మనుషులకే చెల్లుతుంది" అన్నది సుందరం.

"రేపు ఉదయం తయారుగా ఉండు. వాన్ పంపిస్తా" అన్నాడు యేసుమలై ..

సుందరం వేషాలేసి వస్తున్నదని తెలిసి రంగారావు బాధపడ్డాడు.

"నీకేం కర్మగాలింది సుందరం?" అని అతను అడిగాడు.

"డబ్బు చేదా?" అన్నది సుందరం.

"డబ్బు కావలిస్తే నే నివ్వనూ?"

"ఉంటే ఇయ్యి, నే నొద్దన్నానా? అంతమాత్రానికే నేను సంపాదించుకో రాదని ఎక్కడుందీ?"

సుందరం హఠం రంగారావుకు తెలుసు. మాట్లాడక ఊరుకున్నాడు.

ఒకనాడు రంగారావు రాసే పిక్చర్లోనే సుందరం ఎక్స్ట్రా వేషానికొచ్చింది. రంగారావు ఆనాడు సెట్టుమీద ఉన్నాడు.

ఆ రోజు ఇంటికొచ్చినాక రంగారావు సుందరం మీద రెచ్చిపోయినాడు. అది ఆనాటి కోపం కాదు - ఏళ్ళకొద్దీ పేరుకొని ఉన్నదంతా కరిగి బయటికొచ్చింది.

అతను మాట్లాడుతుండగానే సుందరం బయటికి వెళ్ళిపోయింది. మళ్ళీ తిరిగి రాలేదు. రాదని తెలిసినాక అతను తన మనసును తానే అర్థం చేసుకోలేకపోయాడు. బెదిరిస్తుందా? ఖయాలీ మనిషి. దాని ఇష్టం వచ్చినట్లు ఇన్నాళ్ళూ ఆడి అలుసైనాను! నేనేం పసిపిల్లవాణ్ని కాను. దాన్ని సుఖపెట్టటానికి నేను చేసిన

ప్రయత్నమూ దానికి విషం కావటానికేదో కారణం ఉండాలి...నేనేం ద్రోహం చేశాను? నా వల్ల జరిగిన తప్పేమిటి? నా పరువు తీసేస్తే తనకేం వొరుగుతుంది?

స్వాతిశయమూ, ఆత్మవంచనా, పశ్చాత్తాపమూ, వీటన్నింటినీ మించిన ఆవేదనా రంగారావును తలా ఒకపక్క లాగి పీడించాయి. తాను చేసినదంతా సుందరాన్ని సుఖపెట్టటానికేనని అతను తనను తాను పూర్తిగా నమ్మించు కున్నాడు. ఎంతసేపు ఆత్మ పరీక్ష చేసుకున్నా తన జీవితాశయాలు సవ్యంగానే కనబడ్డాయి. పరువు తక్కువ పనులు చెయ్యాలన్న సుందరం పట్టుదల నిరర్థకంగానే కనబడింది.

సుందరం వెళ్ళిపోయినాక అతని అహంకారం రెట్టింపయింది. ఎట్లాగంటే చెప్పటం కష్టంగాని, సుందరం మొదటి నుంచి అతనిలో ఆత్మ విశ్వాసం పెంచి, అహంకారాన్ని అదుపులో ఉంచుతూ వచ్చింది. ఇప్పుడా అడ్డంకితొలగి పోయింది.

అతనికి మూడో పిక్చరు బాపతు మూడువేల చిల్లర రానేలేదు. చాలాసార్లు ప్రొడ్యూసరు చుట్టూ తిరిగాడు. లాభం లేకపోయింది. ఇప్పుడు తాను వెనకటి రంగారావు కాడు - చేబదుళ్ళు చేస్తూ, నవనాడులూ బిగించుకుని సహించడానికి. కోర్టులో ప్రొడ్యూసరు మీద దావా వేశాడు.

ఈ సంగతి నలుగురికి తెలిసింది. పత్రికలవాళ్ళు అతన్ని అభినందించారు. ప్రొడ్యూసర్లు మీటింగు ఏమీ చెయ్యకుండానే ఏకగ్రీవ నిర్ణయానికి వచ్చారు. రంగారావుకున్న రెండు పిక్చర్ల నుంచీ రెండు రోజుల వ్యవధిగా ఉద్వాసన జరిగింది. ఇద్దరూ కూడా అనుకున్న మొత్తాలు పూర్తిగా యిచ్చేశారు.

ఇది తనకు గొప్ప విజయమనుకున్నాడు రంగారావు. అతని సినిమా మిత్రులు, "ఏమిటనుకున్నారో, ఈ ప్రొడ్యూసర్లంతా ఒకటే, అసలు నువే ఒక పిక్చరు తీసెయ్యి, అందరికీ బుద్ధి చెప్పినట్టవుతుంది" అని సలహా యిచ్చారు.

రెండు మూడు చోట్ల నుంచి ఇదే సలహా వచ్చిన మీదట రంగారావు చిత్ర నిర్మాత కావటానికి నిశ్చయించాడు. ఒక బుల్లి తారను పెద్ద తారగా చెయ్యటానికి కూడా నిశ్చయించుకున్నాడు. తన మిద్దెమీది ఇంట్లోనే ప్రొడక్షనాఫీసు పెట్టాడు.

ప్రొడక్షనాఫీసనగానే జనం చేరారు. నటులూ, గాయకులూ, తదితరులూ సహకరిస్తామన్నారు. కొందరు పోటీలుపడి తియ్యబోయే పిక్చరుకు శతదినోత్సవాలూ, రజతోత్సవాలూ కూడా చేయించారు. గానాబజానా సాగింది. నాలుగు పాటలు రికార్డు కూడా అయాయి. అంతలోనే రంగారావు చేతిలో వున్న డబ్బు అయిపోయింది. కాస్తో కూస్తో మిగిలితే దాన్ని డిస్ట్రిబ్యూటర్ల చుట్టూ తిరగడానికి ట్రంక్ఫోన్లకూ వాడాడు.

బాకీలు మిగిలాయి. ఎవరన్నా ఒక పిక్చరుకు బుక్‌చేస్తే దానితో గ్రంథం షెడపవచ్చుననుకున్నాడు. కాని ఎవరూ పిలవలేదు. జనం ప్రొడక్షనాఫీసుకు రావటం మానేశారు. మార్వాడివాడు కారు పట్టుకుపోయాడు. ఇల్లుగలవాళ్ళు ఇల్లు ఖాళీ చేయమని నోటీసిచ్చారు.

రంగారావు బుద్ధి షాక్ తిన్నదేగాని సొమ్మసిల్లలేదు. అతను ఒంటరిగా కూచుని, "ఏం జరిగింది? ఎందుకు జరిగింది?" అని ఆలోచించాడు. తన జీవితం ఎక్కడో పట్టాలు తప్పింది. ఇది జరిగింది ఎక్కడో అతనికి తెలియలేదు. పట్నం వచ్చినప్పుడా? సినిమాల్లోకి దిగినప్పుడా? ఇల్లు మారినప్పుడా? కారు కొన్నప్పుడా? సుందరం ఇంటి నుంచి వెళ్ళిపోయినప్పుడా? ప్రొడ్యూసరు మీద దావా వేసినప్పుడా? ప్రొడక్షన్ ప్రారంభించినప్పుడా? ఎప్పుడు?

ఎప్పుడు తాను డబ్బును నమ్ముకుని, మనుషులలో విశ్వాసం పోగొట్టుకుని ఒంటరిగాడై పోయినాడో ఆనాడే తన పతనం ప్రారంభమైనది.

"ఫరవాలేదు. నేను పూర్తిగా చితికిపోలేదు. మళ్ళీ కంపోజిటరు నవుతాను. ఏ హైదరాబాదో వెళ్ళి ఏ ప్రెస్సులోనో చేరుతాను!" అనుకున్నాడు.

అతనిగుండె గుబుక్కుమన్నది. తాను కంపోజిటరు పని కూడా సరిగా చెయ్యలేనేమోనన్న అధైర్యం కలిగింది. రంగారావు కళ్ళు చెమ్మగిల్లాయి.

అది నిజం అధైర్యం కాదు. తిరిగి కంపోజిటరు జీవితం ఆరంభించా లన్నా తాను కొంత ఆత్మ సంఘర్షణకు గురి కావలసి ఉంటుందని అతనికి తెలిసి పోయింది.

రంగారావు తన పెట్టెలన్నీ సర్దుకోసాగాడు. నాలుగేళ్ళకు సరిపోయే బట్టలూ అవీ ఉన్నాయి. కాగితాలు, సగం రాసిన కథలూ, పూర్తిచేసి అవతల పడేసిన చిన్న కథలూ ఉన్నాయి. కొన్ని ఉత్తరాలున్నాయి. ఉత్తరాలలో రాజు రాసినది ఒకటి కనిపించింది. అదివచ్చి మూడు మాసాలు దాటింది. అప్పుడు తాను ప్రొడక్షను గొడవలో ఉండి సరిగా చదువలేదు. అందులో తన పుస్తకాలు ప్రచురించినవాణ్ణి గురించి-వాడు డబ్బు సంగతి తేల్చకుండా ఉన్నాడని కాబోలు-ఉన్నది. వాడు పుస్తకానికి పాతికే ఇస్తాడో, పరకే ఇస్తాడో. దాన్ని గురించి రాజు ఆర్భాటం చేసినందుకు అప్పట్లో రంగారావు నవ్వుకున్నాడు. అప్పుడు అతని దృష్టి నాల్గు అంకెలమీదా, అయిదు అంకెలమీదా ఉన్నది. కాని ఇవాళ ఆ పబ్లిషరు ఇచ్చే మొత్తం తనకు పెద్దదే! ఎంత కొద్దికాలంలో ఎంత మార్పు!

అతనిప్పుడు రాజు రాసిన ఉత్తరాన్ని శ్రద్ధగా చదువుకున్నాడు.

"రంగారావుకు. నీ సంగతులు బొత్తిగా తెలియటం లేదు. చంద్రా ప్రెస్సులో మూడు రోజులుగా సమ్మె సాగుతున్నది. రాయబారాలు ఫలించలేదు.

ఇవ్వాళ మేము కూడా సానుభూతి సమ్మె చేసి ప్రొసెషన్‌లో తిరిగాం. నీ నాలుగు పుస్తకాలలో మూడు అచ్చయాయి. ఛండాలపు కాగితంమీద అసహ్యంగా ప్రింటు చేశారు. అన్నీ తప్పులు. పబ్లిషరును నీ డబ్బు విషయం అడిగా. ప్రెస్సువాళ్ళు ముంచారనీ, పుస్తకాలు అమ్మిందాకా తనకు నమ్మకంలేదనీ, పెట్టినడబ్బు తిరిగి రాదని నిరాశ చేసుకున్నాననీ అన్నాడు. డబ్బివ్వకపోతే ఇంకో పబ్లిషరుకిచ్చి పోటీగా ప్రింటు చేయిస్తానని చెప్పా. కాళ్ళూ, గడ్డాలూ పట్టుకుని బతిమిలాడతాడు. ఏం చేయమంటావోయీ. సుందరమ్మను అడిగానను చెప్పు."

రంగారావు తల చిబ్బెం కట్టుకుపోయినట్టున్నది. అందులో ఏమి సంచలనం కలుగుతున్నదీ కూడా అతనికి తెలియటం లేదు. చాలాసేపు గోడకేసి చూస్తూ రాజు ఉత్తరం చేతితో పట్టుకు కూచుని చివరకు రాజుకొక ఉత్తరం రాయటానికి తీర్మానించుకున్నాడు.

నాలుగు కాగితాలు పాడుచేసిన తరువాత రంగారావుకు ఆశ్చర్యం కలిగింది. తనకు ఉత్తరంలో ఏమి రాయాలో, ఎట్లా రాయాలో తెలియక పోవటం ఆశ్చర్యం కదా! అందులోనూ రాజుకు రాయటం! రాజు ఎదురుగా వుంటే ఏం చెప్పాలో తెలీక బాధపడుతుంటే ఎట్లా వుంటుందో అట్లాగే అనిపించింది రంగారావుకు.

బయట ఎవరో మసులుతున్న అలికిడి అయి రంగారావు ఉలిక్కిపడ్డాడు. ఆలకిస్తే చప్పుడాగిపోయింది.

"ఎవరూ?" అని కేకపెట్టి అతను లేచి వాకిలిదాకా వచ్చాడు.

రాజు అతనికి ఎదురుగా వచ్చాడు. పిట్టగోడనానుకుని బయటికి చూస్తూ సుందరం నిలబడి ఉన్నది.

"రాజూ ఎప్పుడొచ్చావ్?"

"ఉత్తరం రాసింది" రాజు తలను సుందరం కేసి విసిరాడు. "మెయిలు కొచ్చా."

"లోపలికి రండి."

సుందరం అప్పటికిగాని తల తిప్పలేదు.

ఇల్లంతా అయ్యవారి నట్టిల్లల్లే ఉంది. సామాను చాలా భాగం వెళ్ళిపోయింది. ఇల్లు కూడా ఎవరూ చిమ్మలేదు. సుందరం లోపలికి వెళ్ళి చీపురుకట్ట తెచ్చి సావడి అంతా చిమ్మి, చాపతెచ్చి వేసింది. తాను వెళ్ళి గోడనానుకుని నిలబడింది.

రాజూ, రంగారావు చాపమీద కూచున్నాక కొంతసేపు ఇద్దరూ మాట్లాడలేదు. రంగారావు భయపడ్డంతా అయింది. అతనికి తన గొడవ రాజుతో ఎట్లా

చెప్పాలో తెలియలేదు. రెండు మూడు సార్లు సుందరం కేసి చూశాడు. కాని సుందరం సహకరించలేదు.

అకస్మాత్తుగా రాజు, "అన్నట్టు విన్నావా రంగయ్యా? సూర్యం సికింద్రాబాదులో ఏదో ప్రెస్సుకు మేనేజరుగా వెళ్ళాడు. వాడిపని బాగుంది. నీలాద్రి సొంతాన ప్రెస్సు పెట్టుకున్నాడు...ఎట్టయినా నీలాద్రి పని తెలిసినవాడు..."

ఎవడో తుపాకి బారుచేసి, మాట్లాడటం మానితే చంపుతామని బెదిరించినట్లుగా రాజు మాట్లాడసాగాడు. అన్నీ తన చిన్నతనపు గాథలు...రత్తిగాడు ఒక్క రాత్రి పదమూడు వేలు స్ట్రయికింగ్[1] చెయ్యటం.. వాళ్ళెవరో జాబ్ వర్కిచ్చి నీలాద్రిని రెండు గంటల్లో ప్రూఫ్ కావాలంటే నీలాద్రి చేతికి వచ్చిన అక్షరాలన్నీ పెట్టి ప్రూఫ్ తీసి వాళ్ళ మొహాన పెట్టి, 'అట్టాచూస్తారేమండీ? ప్రూఫ్ దిద్ది ఇవ్వండి కరెక్షన్ చేస్తానూ!' అనటం ... నీలాద్రి కేసులోనుంచి వెంకటేశ్వర్లు అక్షరాలెత్తుకు పోవడమూ, వాళ్ళకు ఎప్పుడూ హోరాహోరీ యుద్ధం కావటమూ...వెంకటేశ్వర్లు కేసులో అన్ని అక్షరాలు ఉండికూడా ఒక్కటీ దొరికేది కాదు-వాడి డిస్ట్రిబ్యూషన్...

ప్రెస్సువాళ్ళ కథలు చెప్పటం మొదలుపెడితే వాటికి అంతుండదు. అదొక ప్రపంచం. అందులో ఘోరాలున్నాయి - ట్రెడిల్[2]లోపడి సాంబయ్యా వేళ్ళు నలిగిపోటం లాంటివి. హాస్యం ఉన్నది-కిష్టిగాడు పారం లేకపోతే దాని మీద ఇంత దుమ్ము పోసి నీళ్ళు దిమ్మరించటం లాంటివి...కిష్టిగాడు లైన్లు జస్టిఫై చెయ్యటం దగ్గిరనుంచీ సొంపే! హాఫ్యం సెసులు[3]కూడా ఏళ్ళమధ్య పెట్టి వంచి స్టిక్కులో కుక్కేవాడు! లెడ్లూ, బ్రాస్‌రూల్సూ ముక్కలు ముక్కలు చేసేవాడు!...ప్రెస్‌లో కీర్తిమంతులున్నారు. జగన్నాధం గ్యాలీలో సామాన్యంగా తప్పు దొరికేది కాదు. రాజయ్య అయినా ట్రెడిల్మాన్‌గా ఘనకార్యాలు చేసినవాడే. ప్రెస్ ఆవరణలో శృంగారంకూడా ఉన్నది...

రంగారావు రాజయ్యతోబాటు ఎప్పుడు మాట్లాడ నారంభించాడో రంగారావుకే తెలియదు. సుందరంవచ్చి తన వెనకే కూచోవటం మటుకు అతనికి తెలుసు.

ఆమె అంటీ అంటకుండా తన రొమ్ము రంగారావు చేతికి తాకించి "ఈమాటల్తో మీరీపూట తిండి తినరెట్టా? తరవాత మాట్లాడుకోవచ్చు-ఆకలి మండి పోతాంది" అన్నది.

---

1. ముద్రించటం.
2. ట్రెడిల్
3. హాఫ్ యం సెసులు

రంగారావు నీరసంగా లేచాడు. అతనికి సుందరం కేసి తిరగటానికింకా ధైర్యం చాల్లేదు. "ఎక్కడికి పోదాం?" అన్నాడు తను రాజుతో.

"మా ఇంటికి పోదాం" అన్నది సుందరం.

ఇప్పుడు సుందరం ఇల్లెక్కడోకూడా రంగారావుకు తెలీదు. విచారిస్తే సులువుగా తెలిసేదే. కాని పౌరుషం అడ్డొచ్చింది.

ఇంటికి తాళంపెట్టి ముగ్గురూ వీధిలోకి వచ్చాక రంగారావు కళ్ళు అప్రయత్నంగా ఖాళీ టాక్సీల కోసం వెతికాయి. తనకుతానే హెచ్చరిక చేసుకుంటున్నట్టుగా "బస్‌స్టాండు దగ్గిరేలే" అన్నాడు.

"టాక్సీ!" అని సుందరం కేకేసింది. రంగారావుకు కనిపించని ఖాళీ జేటీ టాక్సీ సుందరానికి కనిపించింది. ఆమె టాక్సీని పిలవగానే రంగారావుకు వెనకటి సుందరం-ముందు వెనుకా ఆలోచించకుండా సిజరు పాకెట్లకూ, కిళ్ళీలకు, తీరు అద్దెకూ డబ్బు పారేసే సుందరం చప్పున జ్ఞాపకం వచ్చింది.

ముగ్గురూ టాక్సీ ఎక్కి సుందరం ఇంటికి వెళ్ళారు. తమ పాత ఇంటికి రెండీళ్ళవతలగా ఆ ప్రాంతంలోనే ఉంటున్నది సుందరం.

ఆమె పొయిరాజేసి అన్నంపెట్టి పక్కింటి కుర్రాడిచేత హోటలునుంచి కాఫీ తెప్పించింది. ముగ్గురూ తాటాకుల చాపమీద కూచొని నలిగిపోయిన పేకతో రమ్మీ ఆడారు.

"ముందు కార్యక్రమ మేమిటి రంగయ్యా?" అన్నాడు రాజు ముక్కలు అటూ ఇటూ సర్దుకుంటూ.

రంగారావు జవాబు చెప్పటానికి కొంత వ్యవధి తీసుకుని "ఏ ప్రెస్సులో నన్నా పనికి కుదరాలి బతకాలిగా?" అన్నాడు.

"ఇక్కడేనా?" అని రాజు అడిగాడు.

"ప్రెస్సులు దేశమంతటా ఉన్నాయిగా?"

"అవునులే. పూలమ్మినచోట కట్టెలమ్మటం! అదీగాక ఈ పట్నంతో ప్రెస్సులు నాకేం నచ్చలా? నేనుకూడా పట్నంలో ఉండిపోదామా అనుకున్నా కిందటిసారి వచ్చినప్పుడు. ఇక్కడ ప్రెడిల్మెన్లందరూ మెషీన్మెన్లయి కూచున్నారు. ఆటోమాటిక్ దానికది కాగితం అందుకొని అచ్చుకొట్టి అదే డెలివరు చేస్తుంటే మెషిన్మన్‌బుల్లాడు పక్కన నిలబడి చూస్తూ ఉంటాడు. ఒకే షిఫ్టులో 20 వేల స్ట్రైయికింగ్ చేస్తేమటుకు వాడి గొప్పేముందీ? వెనక అసలుశ్రమ ప్రెడిలేసే వాడిది. ఇప్పుడు కంపోజిటరుది. అయినా యంత్రాల రాజ్యమయింధి. ఘన లలితా ప్రెస్సు ప్రెడీలు జ్ఞాపకముందా, రంగయ్యా? ముగ్గురు కుర్రనాయాళ్ళు

కిందనుంచి తోస్తేగాని ఇంప్రెషనిచ్చేదికాదు - అంకిళ్ళు పడిపోయిన ప్రెడిలు! ఈ మద్రాసు ప్రెస్సులో మెషిన్లకు ఉక్కపొయ్యనీకుండా ఫాను పెడుతున్నారు!"

"కొయ్యి, రాజయ్యా?" అన్నది సుందరం ఆటీను రాణి కిందపడేస్తూ. చేతి కింద ఉన్న రంగారావు అదివరకు ఆమె పారేసిన కళావరు జాకి ఎత్తుకున్న సంగతి ఆమె మరిచిపోయిందో, లేక కావాలనే పారేసిందో రాజుకు అర్థం కాలేదు. రంగారావు ఆటీను రాణి కూడా ఎత్తుకోవడం చూస్తూ "అబద్ధమనుకున్నావా సుందరమ్మా, ఇప్పుడు రా చూపిస్తా!" అన్నాడు.

"మనం వచ్చేజన్మలో మంచి మిషనుగా పుట్టినా బాగుంటుందంటావ్?" అన్నది సుందరం.

"ఓ! ఆయుధపూజనాడైనా అలంకరించి పూజ చేస్తారు. నన్నడిగితే మంచి కారుగా పుట్టటం మంచిది. రోజూ కడిగి, ఆపేక్షగా తుడిచి, ప్రాణంకన్న ఎక్కువగా చూసుకుంటారు" అన్నాడు రాజు.

"డిప్రీసియేషన్ సొమ్ము రాగానే అమ్మేస్తారు. డొక్కయినాక ఈడ్చి పారేస్తారు" అన్నాడు రంగారావు ఎవరిమీదనో కసితో మాట్లాడుతున్నట్లు.

"డొక్కయినాక కూడా కారు బతికే ఉంటదా, రాజన్నా?" అని సుందరం అడిగింది.

"కారు ఎప్పుడు చచ్చిందీ చెప్పటం కష్టం. చచ్చిందనుకున్న కారు మంచి హనుమంతుడి చేతికిస్తే ఆ పార్టూ ఈ పార్టూ మార్చి మళ్ళీ నడిపిస్తాడు" అన్నాడు రాజు డిక్లేరుచేసూ.

"ఏమైనా డొక్కు కారుగా బతికేకన్న చచ్చిందే మేలు....మీరిద్దరూ ఆడుతూ ఉండండి" అంటూ అవతలికి వెళ్ళింది సుందరం.

"నీకేమని రాసింది?" అన్నాడు రంగారావు, ఆమె వెళ్ళినవేపు తల ఊపుతూ.

రాజు జేబులో ఉన్నకాగితాలు తీసి, అందులోనుంచి ఒక కాగితం రంగారావు కిచ్చాడు.

ఉత్తరంలో విశేషాలేమీ లేవు. ఎవరిచేతనో రాయించినట్టున్నది. రంగారావు కంపెనీ దివాలా ఎత్తుతున్నదనీ, అతను చిక్కుల్లో వున్నాడనీ, తాను విడిచి పెట్టి పోకుండా వుంటే ఇంతదూరందాకా వచ్చేదికాదనీ రాయించింది సుందరం.

ఆఖరు మాటకు రంగారావు నవ్వుకున్నాడు. అతను నాలుగు రోజుల క్రితం తీవ్రమైన మనస్సంక్షోభం పొందుతూ తన బుల్లితార కాస్త మనశ్శాంతి ఇస్తుందేమోనని వాళ్ళ యింటికి వెళితే ఆమె కీచుగొంతుతో "ఏమన్నా అర్జంటు పనుందీ? మరేంలేదు. నేను ఫైవ్ మినిట్సులో బయటికెళ్ళబోతున్నానండీ,

క్షమించి మరేమీ అనుకోకండి!" అని తప్పుకున్నది. తన మీద అలిగి వెళ్ళిపోయిన సుందరం తనను గురించి బాధపడింది! అలిగి వెళ్ళిపోయినదనటం కూడా అన్యాయమే. పరిస్థితి దుర్భరమై వెళ్ళిపోయి వుంటుంది. పొరపాటు తనదే కాని తాను ఎక్కడ గాడి తప్పిందీ ఎంత ఆలోచించినా తెలియటం లేదు. జీవితంలో ఇటువంటివి తెలియటం కష్టమే - పుస్తకాలు రాసినంత సులువుకాదు.

ఉత్తరం విడిచి రాజుకిస్తూ రంగారావు "నీ సలహా ఏమిటి? నన్నేం చేయ మంటావు?" అన్నాడు.

"సినిమాలకి బలాదురు చుట్టినట్టేనా?" అన్నాడు రాజు.

"కాకేమిటి? సినిమావాళ్ళు చెత్త పోగుమీద పారేసిన సరుకు ఎరువుగా కూడా పనికిరాదు. నేనింకా అదృష్టవంతుణ్ణి - సినిమాల్లో ఆటేకాలం నానలేదు. ఇరవై యేళ్ళు సినిమాల్లో దాదాపు ప్రతి సినిమాలోనూ కనిపించి అకస్మాత్తుగా మాయమైనవాళ్ళు చచ్చిపోలేదు. అప్పుడప్పుడు వీధుల్లోనూ, హోటళ్ళ బయటా కనిపిస్తారు. వాళ్ళ స్థితి చూస్తే నాకు వచ్చే ఆలోచనలు రాతకందవు. రాజూ! వీళ్ళల్లో చిల్లర నటులున్నారు. ప్లేబాక్ వాళ్ళున్నారు. టెక్నీషియనులు కూడా వున్నారు. ఘోరం!....వాళ్ళలో కొందరికి ఇంకా పూర్తిగా ఆశ చావలేదు - మళ్ళీ చాన్సు వస్తుందన్న ఆశ కొన ప్రాణంతో వుంది. వీళ్ళకు ఒక జర్నలిస్టు 'సినిమోపహతులు' అని పేరు పెట్టాడు...ఒకళ్ళ దాకా ఎందుకూ? నాకు లేదూ? ఏ మూలనో మనస్సు మళ్ళీ సినిమాలకు రాసే అవకాశం వస్తుందని ఆశపడు తూనే వుంది. కాని నా బుద్ధి మాత్రం ఆ చాయలకు వెళ్ళ వద్దని హెచ్చరిస్తున్నది" అన్నాడు రంగారావు.

"దానికేమిట్లే? సినిమాల వాళ్ళు నిన్నూ మళ్ళీ పిలవరని రాసి పెట్టి వుందా?...నవలలు రాసుకుంటూ కూచో లేనంటావా?" అన్నాడు రాజు.

"నా బతుకుతోబాటు బుర్రకూ్కడా ఏదో వచ్చింది రాజూ. ప్రౌఢక్షను అనుకున్నప్పటి నుంచీ నాలో రాసే శక్తే పోయింది. అందరికీ స్క్రిప్టు రాయ టానికి తయారయినవాణ్ణి నా కోసం నేను కథ ఆలోచించలేకపోయినా నంటే నమ్ము! నీ నవలల్లో ఏదో ఒకటి తీసుకోరాదా అని కొందరు సలహా యిచ్చారు. కాని అవన్నీ చెత్తగా కనిపించాయి. ఒక్కటి కూడా సినిమాకు పనికిరాదని పించింది. అటువంటి నవలలు రాసి రాతగాడనిపించుకున్నందుకు సిగ్గేసింది - దాచకుండా చెబుతున్నాను - ఏదో విషం తాగి బుర్ర తారుమారయినట్టే!"

"అన్నట్టు ఆ పబ్లిషరుదగ్గిర డబ్బు తీసుకొచ్చా, పేజీకి అర్ధరూపాయి చొప్పున ఇచ్చాడు మూడు వందలు. ఇంకో పదోపరకో రావాలేమో-నువే వుంచు

కోతే అన్నా!" అంటూ రాజా గోడచిలక్కి తగిలించిన చేతిసంచీలోనుంచి మూడు పుస్తకాలూ, మూడు నూరు రూపాయల నోట్లూ తీసి రంగారావు కిచ్చాడు.

"వాళ్ళు అచ్చువెయ్యని పుస్తకం ఇంకో పబ్లిషరుకిచ్చా. కాస్త మంచి పబ్లిషరు. పేజీకి రూపాయిస్తానన్నాడు ధర్మాత్ముడు!...కనకా పుస్తకాలమీదికి కాస్త బుద్ధి మళ్ళించు" అని రాజు నీతి బోధించాడు.

రంగారావు చేతిలో నోట్లకేసిచూస్తూ తన మనసులో అంచనా వేసుకున్నాడు. ఐదారేళ్ళ కృషి ఫలితం. పుస్తకాలమీద ఇప్పటికి వచ్చినది మూడొందలు. ఇంకో రెండు వందలు వస్తాయనుకున్నా అంతా కలిసి అయిదువందలు! కథలుగానూ, సీరియల్స్‌గానూ పత్రికలవాళ్ళు వేసుకున్నప్పు డిచ్చినది మహావుంటే నాలుగు వంద లుండేను. అది కూడా కలిపినా తొమ్మిదివందలు. ఏడాదికి సుమారు నూటయాభై సంపాదన! ఇది వృత్తిగా పెట్టుకోమంటాడు రాజు.

"లాభంలేదు రాజూ! వెనకటి పత్రికలు ఒక రాసేవాణ్ణి పట్టుకుంటే వదిలేవి కావు. ఇప్పటి పత్రికలు కాస్త డబ్బులిచ్చేవి - రాసేవాడికి ఎక్కడ పేరొచ్చిపో తుందో నన్నట్టుంటున్నాయనిక్షిచెబుతున్నారు. అదీగాక నన్ను కమ్యూనిష్టని ముద్ర వేసేశారు!"

"నిన్నా?!" అన్నాడు రాజు నవ్వుతూ.

"ఏ పెట్టుబడిదారన్నా డబ్బు ఎగేస్తే కోర్టుకెళ్ళినా నువు కమ్యూనిస్టువే! ఆ ముద్ర సంపాదించటానికి పెద్దగా ఎర్రజెండా పట్టుకు తిరగక్కర్లేదు."

"మా సీతారామయ్యగారే నయమన్నమాట. ఆయనకు కమ్యూనిజమంటే కోపమేగాని, 'ప్రెస్సులో కాస్త బాగా పనిచేసేది కమ్యూనిస్టు కుర్రాళ్ళే. ఎందుచేతరా రాజూ!' అని అడిగాడు. 'ఇదుగో, సీతారామయ్యగారూ, మీరు కమ్యూనిజానికి భలే సర్టిఫికెటిస్తున్నారు!' అన్నా."

రంగారావు నవ్వి "తెలంగాణాలో కూడా ఒకాయన ఏదో మీటింగుల్లో మాట్లా డుతూ, 'అదేం చిత్రమో, ఈ కవితాకన్య కమ్యూనిస్టులను వలచింది' అన్నాట్ట. ఈ సర్టిఫికేట్లు దాచి వుంచుకోవలసినవే!" అన్నాడు.

రాజు కాస్త ఆలోచించి "పోనీ, నువు కారు డ్రైవు చేసుకుని బతికినా బత కొచ్చే!" అన్నాడు.

రంగారావు మనసులో ఏదో తలుపు తెరిచినట్టయింది.

"నువు కారుకొన్నపుడు డ్రయివింగు నేర్చుకుని లైసెన్సు కూడా తీసుకున్నా వుటగా? సుందరమ్మన్నది" అన్నాడు రాజు.

"అవును రాజూ! ఏ ప్రొడ్యూసరు దగ్గిరన్నా చేరి ప్రొడక్షను కారు నడపొచ్చు. ఎవరన్నా అడిగితే ఫలాని ప్రొడక్షను నా చేతిమీదిగానే నడుస్తున్నదని కూడా చెప్పొచ్చు."

రాజూ, రంగారావూ విరగబడి నవ్వారు. రంగారావు నవ్వు సహజమైనది కాదు-అతని హృదయంలో పేరుకున్న కల్మషం కరిగి బయటికి రావటంవల్ల వచ్చిన అసహజమైన నవ్వు. అది అతని ఆరోగ్యానికి మంచిది.

రంగారావు కాస్తకాస్తే మామూలు మనిషి అవుతూండటం గమనించి తృప్తి పడ్డాడు.

"ఇద్దరు మంచి కులాసా మీదున్నారే. తిండికి లేవండి" అంటూ సుందరం వాళ్ళున్న చోటికి వచ్చి, రంగారావు చేతుల్లో ఉన్న నోట్లు లాక్కుంటూ, "డబ్బు మొహమే చూడలేదెట్టా?" అని వాటిని తీసుకుపోయి ఎందులోనో దాచింది.

"ఏమైనా నువు పట్నం వదలకు; నాలుగు రోజులు బెట్టుచేస్తే ఏం గనక, ఈ సినిమావాళ్ళు నీ దగ్గిరికి రాకపోరు. మనిషి రక్తం మరిగిన పులులనుకో; నువు రాసిన పిక్చర్లకు ఒకటి రెంటికి డబ్బొచ్చినమాట వాళ్ళు మరచి పోతారనుకున్నావా? దొరికితే ఏదన్నా పని చెయ్యి-దొరక్కపోతే కూచుని రాసుకో. సుందరమయినా చేతులు కట్టుకు కూర్చోలేదుగా? మీకు జరక్కపోదు....ఏవంటా?" అని రాజు హితవు చెప్పాడు.

ఆ రాత్రి రంగారావు రాజును మెయిల్ ఎక్కించి ఇంటికి తిరిగి వచ్చేటప్పటికి సుందరం దీపం వేసుకుని రంగారావు పుస్తకాల్లో ఒకటి చదువుతున్నది. ఆమె అదివరకెన్నడూ అతని రచనలు చదివింది లేదు.

రంగారావు తలుపు గడియేసి దీపం ఆర్పేశాడు.

"ఏయ్!" అని సుందరం కేకపెట్టింది.

"నువ్వే ఏయ్! ఉండు, నీ సంగతి చెబుతా!" అంటూ చీకట్లో రంగారావు సుందరాన్ని సమీపించాడు.

ముద్రణ : మే, 1962 నుంచి జూన్ 19 2 వరకు
ధారావాహికం, విశాలాంధ్ర పత్రిక.

# పీడకథ

ఒకోడికి కొకో పిచ్చి. సీతారామయ్యకు చిన్నప్పటినించీ కథల పిచ్చి. బళ్ళో చదువుకునేటప్పుడు శనాది వారాలకోసం తహతహలాడేవాడు. శనాది వారాలు రాగానే కథలపుస్తకాలూ, పత్రికలూ దొరికినన్ని చేర్చి, ఇంకో పని లేకుండా చదివేవాడు.

మనస్తత్వంలో మనం సాధారణంగా గమనించే అంశం ఏమంటే, ఏది మనకు ఉద్రేకంతో కూడిన ఆనందం ఇస్తుందో, అదీ దానికి కారణభూతులైన వాళ్ళు మన దృష్టికి అమానుషంగా భగవదంశ సంభూతంగా కనిపిస్తారు. అప్పుడు మనలో ఆరాధన పుట్టుకొస్తుంది. దీనికి తార్కాణం ప్రియురాలు. ఇతర కంఠస్వరాలూ, ఇతరుల దర్శనమూ ఇవ్వలేని ఆనందం ప్రియురాలి గొంతూ, ప్రియురాలి ఆకృతి ఇస్తుంది. అందుచేత ప్రియురాలిలో ప్రియుడికి దేవాంశ కనిపిస్తుంది.

సీతారామయ్యకు కథకుల్లో ఇటువంటి అంశే కనిపించేది. అయితే సీతారామయ్యకూ కవికాముకుడికీ ఉన్న తేడా ఏమిటంటే, కవికాముకుడు తన ప్రణయ గీతాలు పట్టుకుని చచ్చేదాకా వేళ్ళాడతాడు. అవి తుక్కు అన్నవాణ్ణి తిట్టిపోస్తాడు. తుచ్ఛమైన తన కీర్తిని అనేక వేదికల మీదినించి చాటుతాడు. సీతారామయ్య అట్లా కాదు. అతను కథకుల్ని ఆరాధించినంతకాలము ఆరాధించి ఆఖరుకు ఒక శుభసమయాన చదువుతున్న పత్రిక నేలకేసి కొట్టి, "ప్రెతీవెధవా కథ వ్రాసేవాడే!" అని చీదరించుకున్నాడు.

ఆ ముహూర్తాన ఒక సామాన్య వ్యక్తి, ఒక అనామకుడు, ఆఖరుకు నవ్య సాహిత్యపరిషత్తు[1] సభ్యత్వంకూడా ఎరగని ఒక "కౌన్-కిస్కా-హై" గాడు, నవ్యసాహిత్య పరిషత్తుకూడా శీతకన్నేసిన కథాసాహిత్యం[2] మీద విప్లవం చేశాడు.

---

1, 2 : నవ్య సాహిత్య పరిషత్తు ఒక సాహిత్య సంస్థ. 1933 మార్చి 10, 11, 12 తేదీల్లో బరంపురంలో అభినవాంధ్ర సభగా మొదలైంది. 1936 నాటికి గుంటూరులో నవ్యసాహిత్య పరిషత్తుగా రూపొందింది. పరిషత్తు స్థాపనకు ముఖ్య కారకులు గురు భాగవతుల ధర్మారావు, పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, నవ్య సాహిత్య ప్రచారానికీ, ఆధునిక ప్రామాణిక భాషా వ్యాప్తికి దోహదం చేసిన సాహిత్య సంస్థ ఇది. మొత్తం మీద

"ప్రెతీవెధవా కథర్రాసేవాడే!" అనే తృణీకారభావం ఎప్పుడైతే కలిగిందో అప్పుడే సీతారామయ్యకు, "నేనే కథ ఎందుకు రాయగూడదు?" అనిపించింది.

తానే కథ రాయాలనే లోకోత్తరమైన అభిప్రాయం సీతారామయ్యకు కలగటం ఎంతో మేలయింది. లేనిపక్షంలో ఈపాటికి సీతారామయ్య ఆధునిక తెలుగుకథా సాహిత్యంమీద విప్లవం సాగించి లెనినో, సాహిత్య స్టాలినో, అయి కూర్చుని ఉండును.

"నేనీ వెధవలపాటి రాయలేకపోను!" అనుకున్నాడు సీతారామయ్య, అప్రయత్నంగా. అతనికి "ఆ వెధవల" పక్షాన పుట్టుకొచ్చిన క్రోధాగ్ని దోవతప్పి ఎటో మారుపడిపోయింది. సీతారామయ్య తీవ్రంగా కథను గురించి ఆలోచన మొదలుపెట్టాడు.

అందుబాటులో ఉండాలేగాని, కథగురించి ఆలోచించటానికి "ఈజీచైర్" రంటిది మరొకటిలేదు. దానికితోడు తలకింద చిన్న దిండూ, కాళ్ళు ఎత్తుగా పెట్టుకోవటానికి ఎత్తయిన స్టూలుగాని, ఇంకో కుర్చీగాని ఉంటే మరీ మంచిది. అదే రాత్రివూటనయితే ఆవలింతలు రావటం ప్రారంభమయ్యే వేళకు దీపం తగ్గించేసి, ఆలోచించే వాడి తత్వానికి అనుకూలంగా కుడిపక్కకో, ఎడంపక్కకో ఒత్తిగిలి పడుకుని ఆలోచిస్తే మంచిది.

అదృష్టవశాత్తూ సీతారామయ్య దగ్గిర ఒక పడక్కుర్చీ ఉంది. సీతారామయ్య అందులో నడుంవాల్చి తను రాయబొయ్యే కథనుగురించి తీవ్రంగా ఆలోచించసాగాడు.

త్వరలోనే అతని తల ఒక పక్కకు ఒరగబడిపోయింది. అతని కుడి చెయ్యి తలవెనుక దిండుగా పనిచేస్తున్నది. అతని ఎడం చెయ్యి గుండెమీద విశ్రాంతి తీసుకుంటున్నది. ఆలోచనా సమాధి సమగ్రంగా ఏర్పడింది.

"నేను పనికొస్తాను, నన్నుపయోగించుకో!" అన్నాడు ఎదురుకుండా ఉన్న వ్యక్తి.

"ఎవరు నువు?" అన్నాడు సీతారామయ్య.

"నన్నెరగవా? నేను పాప్యులారిటీ వోటుపొందిన కథానాయకుణ్ణి!"

"నీకు వోటిచ్చినవా రెవరు? కథలు చదివేవాళ్ళేనా?"

---

నవ్య సాహిత్య పరిషత్తు కవిత్వానికిచ్చినంత ప్రాధాన్యం కథా సాహిత్యానికి ఇవ్వలేదు. నవ్యసాహిత్య పరిషత్తు సభ్యుల్లోకూడా కవుల సంఖ్య ఎక్కువగా ఉండేది.

"చదివేవాళ్ళ దగ్గిర ఎవరన్నా వోటు తీసుకుంటారా ఏమిటి? నేను రాసే వాళ్ళ వోట్లూ, ప్రకటించేవాళ్ళ వోట్లూ పొందాను."

"ను వెవరన్నాను, నీ కుల మేమిటి? గోత్ర మేమిటి? నీ ఆస్తెంత? నీకేం పని! నువు కాంగ్రెసువాడివా? ముస్లింలీగువాడివా? నీ రాజకీయ సిద్ధాంత రాద్ధాంతా లేమిటి? ఏమీ తెలీకుండా నిన్నెట్లా ఉపయోగించను?"

కథానాయకుడు నవ్వాడు.

"నీకు కథలు రాయటం బొత్తిగా చాతకాదల్లే ఉంది. నా జీవిత చరిత్ర రాసే వాడల్లే మాట్లాడుతున్నావే. నా జీవితంలో ఒక్క సంఘటన గీకి అవతల పారేసి గొప్ప కథకుడై పోవటానికి నా కుల గోత్రా లడుగుతా వేమి టెక్కడో?"

"నిన్ను గురించి ఏమీ తెలియక్కర్లేకుండా రాయదగిన నీ జీవిత సంఘటన ఏముంట దబ్బా?!"

"ఒక ప్రణయఘట్టం రాసెయ్యవోయ్ - ఝాంసేపు తర్కించకా!"

"నీ ప్రణయంతో నీ సంస్కారానికీ, ఆస్తికీ, నీ ఉద్యోగానికీ ఏమీ సంబంధం లేదా ఏమిటి?"

"నన్నెటూగానివేళ నవ్వించకు. అర్ధరాత్రి వేళ ఆ తోటలో-"

"ఏ తోటలో ?"

"ఏదో తోటలో ! నీకు సంబంధించని విషయాలు కెలక్కు....ఆ తోటలో నేను, ఆమె నాకు దక్కదని నిరాశ చేసుకుని పచారు చేస్తుండగా, చీకట్లో మెరుపల్లే నా దగ్గిర వాలి, నన్ను తన బాహువుల్లో పెనేసి నా ఒళ్లో వాలిపోవ టానికి నే నెవ్వణ్ణయితే నీకేం!"

"మాటవరస కడుగుతున్నాను, ఆవి డెవరు ?"

"బాగుందే ? నాకు మటుకేం తెలుసూ ? ఆవిడా నా మాదిరిగానే చాలా అంటగత్తె. అంతకన్న నీకేం కావాలి? ... కొంప తీసి చలం[1]గారల్లే నాకున్న రోగాలూ రొష్టూ పెట్టకు. నే నింత మందిని వశం చేసుకున్నా గాని, నా కళ మేళం మాత్రం తటస్థ పళ్ళేదు. కనక దయవుంచి—వెంటనే నా కథరాసి నీ వోటు కూడా నాకు పారేయ్ ?"

"ఇంతమంది ఓట్లు సంపాదించావు. నా ఒక్కడి వోటూ లేకపోతే ఏం?"

---

1. గుడిపాటి వెంకటచలం ప్రస్తావనను ఇదే సంపుటంలోని 'ఐశ్వర్యం' నవలలో చూడండి.

"ఆ మాటలో అర్థం లేదు. వోట్లు నా కోసమా? జన సామాన్యం కోసం గాని ! జన సామాన్యానికి నా కథలే కావాలి, నీకు డెమోక్రసీలో[1] ఏమన్నా విశ్వాసం ఉంటే, నీ వోటేదో నాకే తగలెయ్!"

" 'కావాలి' అనే మాటను చాలా దుర్మార్గంగా ఉపయోగిస్తున్నావు. వాళ్ళు నీ కథలు కోరుతున్నారు. వాళ్ళకు కావాలసిందేమిటో వాళ్ళకు తెలీదు. నన్నాటే వేధించక ఇక పద...తరవాత వాళ్ళెవరో ముందుకు రండి" అని అతన్ని వెళ్ళగొట్టాడు.

ఒక ఆడ మనిషి ముందుకొచ్చింది.

"ఇందాక నీతో మాట్లాడిన వెధవతో నువు చలం గారి మీద అభిమానం ఉన్నట్టు మాట్లాడావు. నన్ను గురించి కథరాయి" అన్నదావిడ తన వొంపు లన్నీ ప్రకటిస్తూ.

"ఎవరు నువు ?"

"నే నెవ రేమిటి ? నేనే సుందరమ్మను[2], చుక్కమ్మను[3], అరుణను[4], మాదిగమ్మాయిని[5], 'కా'ను[6], 'చా'ను[7], 'జా'![8] తెలిసిందా?"

"ఏం చేస్తావు నువు ?"

"రకరకాల మగవాళ్ళకి స్వర్గం చూపిస్తాను. నన్ను ప్రేమించనిస్తాను. నాకోసం యాడవనిస్తాను. నా కోసం పిచ్చెత్తనిస్తాను. నా వొంపులు తనివి దీర మాడనిస్తాను."

"న్నువేం చేస్తావని అడిగాను."

"న్నేనా?" ఆలోచించింది "నేనూ ప్రేమిస్తాను."

నవ్వింది విజయసూచకంగా.

"ఎవర్ని?"

"నిలవదీసి అడక్కు. ఆడది అనేక మందిని అనేక విధాలగా ప్రేమిస్తుంది. అందులో కథకుణ్ణి మాత్రం కొంచెం ప్రత్యేకంగా ప్రేమిస్తుంది."

"మధ్య కథకు డెవడు?"

"కథకు డంటే కథానాయకు డన్నమాట. పోనీ నీ యిష్టం. నన్ను చూస్తే భయమైతే నువు పాత్రవుగా వుండకు. నా కెట్లాగైనా ఒకటే."

"ఇంతమందిని ప్రేమిస్తే నిన్నెవరూ తన్నరూ ?"

"నన్నా ? నన్నా ! నన్నారాధిస్తారు, నా కోసం ఏడుస్తారు, నా కోసం కొట్లాడుకుంటారు..."

1, 2, 3, 4, 5. చలం తన కథల్లో నవలల్లో సృష్టించిన పాత్రల పేర్లు.

6, 7, 8. చలం యథార్థ పాత్రలనూ, కల్పిత పాత్రలనూ పేర్కొనే పద్ధతి.

"నిన్ను తన్నేటంత నిర్లిప్తుడుండడా" అని అడిగాను. "నీ భర్త-"

"వెధవ! నన్ను సుఖపెట్టలేదు, తన్నగలడా?"

"అది చాతకాక, ఇది చాతైనవాళ్ళు లేకపోలేదు. నీ మాట కాదన్నందుకు క్షమించు."

"నన్నెవరూ తన్నరు. నేనా జాతి కాదు. ఆ జాతివాళ్ళు వేరే ప్రచారానికి!"

"పిచ్చిదానా! ఎవణ్ణి ఎవడైనా నడి వీథిలో జుట్టు పట్టుకు తన్నవచ్చును. నీ వంటిదాన్ని నిన్నారాధించేవాళ్ళే తన్నవచ్చును."

ఆవిడ కళ్ళు ఆగ్రహంతో మెరిసినై.

"ఎవడ్రా నువూ? నీ చచ్చుబొక్కు తెలుగాడవాళ్ళతో మాట్టాడినట్టు నాతో మాట్లాడతావా? నే నెవతె ననుకున్నావు? మొపాసా[1], వెల్స్[2], మైకేల్ ఆర్లెన్[3] మొదలైన వాళ్ళ తలల్లోంచి ఊడిపడ్డదాన్ని తెలిసిందా?[4] ఒళ్ళు దగ్గిర పెట్టుకు మాట్లాడు."

"అదా నీ రహస్యం? అయితే పద, వేంచెయ్యి. నేనింత సుప్రసిద్ధుణ్ణి కాను. వెనుక ఎవరో రండి!"

ఇద్దరు దంపతులు ముందుకొచ్చారు.

"మీరిద్దరూ భార్యాభర్తలా?"

"అవును. మేం హరిజనులం. మేం పొలం పన్లూ, తోట పన్లూ ఆవీ చేస్తూంటాం. లోకం మమ్మల్ని అస్పృశ్యులనుగా చూసి ఎడతెగని పాపం అంటగట్టు కోవటమే కాకుండా, మా మీద దారుణమైన అత్యాచారాలు చేస్తున్నది."

"మీరు చదువుకున్న హరిజనులా?"

---

1. మొపాసాను గురించి ఈ సంపుటంలోని 'ఐశ్వర్యం' నవలలో చూడండి.
2. వెల్స్ (1866 - 1946) బ్రిటిష్ నవలా రచయిత; శాస్త్ర విజ్ఞాన కల్పనా సాహిత్య స్రష్ట, చరిత్రకారుడు. ప్రఖ్యాత రచనలు: The Time Machine (1895), The War of the Worlds (1898), Short History of the World (1922).
3. మైకేల్ ఆర్లెన్ (1895 - 1956) ఆర్మేనియన్ నవలాకర్త, కథా రచయిత, 1922లో బ్రిటిష్ పౌరసత్వం తీసుకున్నాడు. The Green Hat, These Charming People అనే నవలల్లో మొదటి ప్రపంచ యుద్ధానంతరపు ఉన్నత వర్గీయుల జీవితాల్లోని డాంబికాన్నీ, అవినీతినీ, విలాసాన్నీ చిత్రించాడు.
4. యూరోపియన్ రచయితలను అనుకరించడం పట్ల కొ. కు. తమ వ్యతిరేకతను ఏనాడూ దాచుకోలేదు.

"కాదు. మాకు చదు వెట్లా వస్తుంది? ఎవరు చెప్పిస్తారు? మమ్మల్ని గుళ్ళ
క్కే పోనివ్వరే, బళ్ళల్లోకి రానిస్తారా?"

"మీకు గుళ్ళోకి పోవాలని ఉందా?"

"ఉండదా?"

"దేనికి?"

"మీరంతా పోరా?"

"నేను బుద్ధెరిగి గుళ్ళోకి పోలేదు. ఎప్పుడన్నా తిరణాలకు పోతాను. అక్కడ
ఆ జనసమ్మర్దంలో - అదంతా మీ కనవసరం. ఇంతకూ అసలు సంగతేమిటంటే,
మీ రింత స్వచ్ఛంగా ఎట్లా మాట్లాడుతున్నారు? మీకు కొంత సంస్కారం ఉన్నట్టు
కనబడుతుందే, అదెక్కడిది?"

"మీ కథలు రాసేవాళ్ళ సంస్కారమే మాదిన్నీ. మీకు ప్రతిష్ఠ తేవటానికి
మేంగాని, మాకు వొరిగేదేముందేం?"

"బాగానే ఉంది. అయితే మీ కథ ఏమిటి?"

"కథేముందీ? మేమిద్దరమూ ఎంతో ప్రేమతో-"

"ప్రేమా?"

"అవును, ప్రేమే! మేం మనుషులం కామా? మాకు హృదయములు లేవా?
మమ్ము భగవంతుడు ప్రత్యేకించి సృజించెనా?"

"కోప్పడకు, కోప్పడకు! ఈ భాగ్యానికే గ్రాంథికం దేనికి?"

"ఉద్రేకం జాస్తి అయినప్పుడు వాడుక భాష చాలదు. ఇట్లా అడ్డపుల్ల వేస్తే
కథ సాగదు మరి."

"కానీ, కానీ! అడ్డంరాన్లే, చెప్పు!"

"మేమంత అన్యోన్యంగా ఆ గుడిసెలో కాపురం చేస్తుంటే, ఇంతలో నాకు
జబ్బు చేస్తుంది. నేనొకపూట నడుం వాలుస్తే ఇంటో గంజి నీళ్ళుండవుగా? ధన
మదాంధులైన ఎక్కువ జాతివారికి మా దారిద్ర్యం పడుతుందా? వారి కాఫీలేమో,
వారి సినిమాలేమో, వారి చీనిచీనాంబరాలేమొ, వారి తాగుళ్ళేమో-"

"నువు కమ్యూనిస్టువు కూడానా?"

"భాగ్యవంతులనుచూసి అసూయపడేవాడు కమ్యూనిస్టు. నేను భాగ్యవంతు
లను చూసి జాలిపడతాను. మావంటి దరిద్రులే మంచివాళ్ళు. మేమే హరిజనులం.
ప్రపంచమంతా దరిద్రులే ఉంటే, పాపాత్ములుండరు. నేను కమ్యూనిస్టునా? పాపం
శమించుగాక! నాది గాంధీ తత్వం...మళ్ళీ అడ్డొస్తున్నావు!...నేనా విధంగా జబ్బు
పడి ఉంటే నా భార్య, ఎంతో అభిమానవతి, తగని పతివ్రత, ఆ అర్థరాత్రివేళ,
ఆ వానలో-"

"అది వానా కాలమా?"

"నీకు కథలు రాయటం చాతకాదల్లే ఉందే?"

"నువ్వో కనుక్కున్నావూ? ఏమిటా తిరుగుడు?"

"బయట వానా, ఉరుములూ, మెరుపులూ, హోరుమని గాలి, గుడిసెలో మినుకు మినుకు మంటూ ఆరిపోజూస్తున్న గుడ్డి దీపమూ-అది నా ప్రాణానికి తీప్నాంలే! - ఇదంతా ట్రాజెడీకి ఎటువంటి ఎట్మాస్ఫియర్!"

"ఓహో! తెలిసింది. తరవాత?"

"తరవాత నా భార్య, తగని పతివ్రత-"

"అదంతా చెప్పావు."

"నీ నసచూస్తే నాకు మండిపోతున్నది. నా భార్య చంటిపిల్లవాణ్ణి చంకనేసుకుని-"

"ఓ చంటిపిల్లాడు కూడానా?"

"వాడు భగవంతుడి స్వరూపం. జరగబొయ్యే పాపకృత్యానికి వాడే సాక్షి. చంటిపిల్లాణ్ణి చంకనేసుకొని ఆ వానలో పడి మా యజమాని యింటికి పోతుంది. మా యజమాని తప్పతాగి ఒంటరిగా ఉంటాడు."

"ఒంటరిగా ఏం ఖర్మం?"

"అదంతా నన్నడక్కు. భాగ్యవంతులు వాళ్ళకేం? వందమంది నింటోపెట్టుకున్నా, ఉన్నవారిని వెళ్ళగొట్టినా వారికి చెల్లుతుంది. నా గుడిసెలో నేను ఒంటరిగా ఉండటానికి లేదే. ఓ రాత్రివేళ నా గుడిసెలోకి ఏ బొమ్మరదాన్నన్నా చేర్చటానికి లేదే--

నా భార్యను చూడగానే మా యజమానికి కామోద్రేకం కలుగుతుంది. తడిసిన బట్టల్లోంచి తళతళా మెరిసే దానిదేహం, ఆ దేహంతాలూకు వొంపులూ-"

"ఆ వొంపులు కాస్త సరిచెయ్యి బాబూ! అన్నట్టు నీ భార్య ఒళ్ళు తళతళా మెరవాల్సిన అవసరం ఏముందీ? నల్లగా ఉండదూ?"

"పోనిస్తూ! నువ్వెక్కడో విమర్శకుడల్లే ఉన్నావుగాని, కథకుడల్లే లేవు. తలుపు సరుకులో నాణెము లేదా? వార్నిష్ వేస్తే చంద్రకొయ్య మెరవదూ?... ఆ దుర్మార్గుడు, ఆ ధనమదాంధుడు మోహావేశపరవశుడై నా భార్యను గవయబోవ నాయమ సంభ్రమము చెందియుండ చంకలోని కుర్రడు కెవ్వన నార్చి..."

"అదంతా నేను రాస్తాను. నువు టూకీగా కథ చెప్పు."

"మా యజమాని నా భార్యను చెరిచేస్తాడు, ఆ పసిగుడ్డు ఎదట. నా భార్య శరీరతీ తాలూకు వెచ్చదనం వాడి శరీరాన్ని మరింత మత్తెక్కిస్తుంది. దాని పటువైన రొమ్ములు వాడి రొమ్ముకు అదుముకుని, దాని నునుపైన తొడలు-"

"ఈ దిక్కుమాలిన వర్ణనంతా దేనికి? నా కాడదాని గొడవే తెలీదనుకున్నావా ఏం? తరవాత?"

"అక్కడ నా భార్యకు మానభంగం అయే ముహూర్తాన ఇక్కడ దీపం ఆరిపోతుంది. నేను మరణిస్తాను. యజమాని నా భార్యను పట్టుకులాగటంలో పిల్లవాడు కిందపడి చచ్చిపోతాడు. యజమానిచేత పాతివ్రత్యం కోల్పోయి నా భార్య గుడిసెకు వచ్చి నా శవంచుట్టూ ప్రదక్షిణం చేసి, పోయి బావిలో పడి మరణిస్తుంది."

"సరే. దోషగుణం తగిలి మీ యజమాని మరణిస్తాడు. క్షమించు, నీ కథ నాకొద్దు. నువు వెళ్ళేటప్పుడు నీ తరువాత మనిషిని పంపించు."

* * * *

ఈ వ్యాపారం సీతారామయ్య కంత కంతకూ రక్తిగా కనిపించసాగింది. ఏ కథకుడూ ఇంతవరకు పాత్రలతో మాట్లాడినట్లు అత నెరగడు. తను ఎన్నడూ మామూలు వ్యక్తులతో ఇంత తెలివిగా మాట్లాడి ఉండలేదు. మామూలు మనుషులతో మాట్లాడ్డంకన్న పాత్రలతో సంభాషించటం చాలా తేలిగ్గా ఉంది.

ఒక్కసారిగా అయిదారుగురు వ్యక్తులు, స్త్రీ పురుషులు తోసుకుంటూ లోపలి కొచ్చారు.

"మీరంతా ఎవరు?" అన్నాడు సీతారామయ్య.

"మేం యథార్థ వ్యక్తులం!" అన్నాడు వాళ్ళ ప్రతినిధి.

"అంటే-ఇటీవల బయలుదేరిన యథార్థవాదం[1]తో మీకేమన్నా సంబంధం ఉందా? ఎందుచేతనంటే ఈ యథార్థవాదం నాకు స్పష్టంగా అర్థం కాలేదింకా. యథార్థమనే వంక పెట్టి కొందరు వొట్టి పొడినిజం-ఏ విధమైన ప్రయోజనమూ ఉండటానికి వీల్లేనిది-రాస్తున్నారు. ఉన్నదే రాయటానికి రాత ఎందుకూ; రాయదలుచుకున్న తరవాత ఉన్నదానిమీద సంస్కారం అంటూ యాడవాలిగా! పోనీ, యథార్థం వాదం త్యజింతామూ అంటే, భావ కవులతో వేగలేకుండా ఉన్నాం. వాళ్ళు మబ్బుల్లో కూచుని జీవితంకేసి చూడకుండా ఉన్నారు. కనుక-"

1. యథార్థవాదం ఒక ఆధునిక సాహిత్య ధోరణి. దీన్నే ఇంగ్లీషులో Naturalism అంటారు. తెలుగులో ఈ మాటకు స్వభావ వాదం అనే పేరు కూడా చలామణీలో ఉంది. జీవితంలోని పొడినిజాన్ని, సంఘటనలను ఉన్నవి ఉన్నట్లుగా చిత్రించే రచనా ధోరణి ఇది. పెట్టుబడిదారీ సంస్కృతి సంక్షోభ దశను అనుభవించి, ఆ వ్యక్తిగత అనుభవాన్ని మాత్రమే ఉన్నది ఉన్నట్లుగా పాఠకుల అనుభవానికి తేవటానికి ప్రయత్నించిన అచారిత్రక సాహిత్య ధోరణి.

"ఈ ఉపన్యాసమంతా ఏమిటి? మే యథార్థ వ్యక్తులం, అంటే నీ పరిచితుల్లో వాళ్ళం."

"నేను మిమ్మల్నెరగనే !"

"నువు నీ పరిచితుల్ని మాత్రం ఎరుగుదువా ఏమిటి?"

"తనతనే- నువ్వెరుగున్న వారిలో ఎవరి మీదన్నా దెబ్బతియ్యాలనుకో, ఎవడన్నా నీ కథ అచ్చెయ్యలేదనుకో, ఎవడన్నా నువ్వు పుసన్నది కాదన్నాడనుకో, నిన్ను పోషించి కాఫీడబ్బు ఇమ్మకునేవాడికెవడన్నా అవమానం చేశాడనుకో, వాడి మీద తవాఖా తియ్యటానికి వాడిస్థానే మమ్మల్ని పెట్టి నువ్వా ఆట ఆడించెయ్యవచ్చు."

"తెలిసింది తెలిసింది! అదా యథార్థ వ్యక్తులంటే ? అప్పుడు చాలా ఉత్తమ కథకులూ, నవలాకారులూ, నాటకకారులూ ఇతర కారులూ, మిమ్మల్ని బాగా ఉపయోగిస్తున్నారు. ప్రస్తుతం నేను అనామకుణ్ణి. నాకూ ఓ పేరు వచ్చి, నేనూ ఓ యింటివాణ్ణయి, నన్ను చూసి ఏడిచే దౌర్భాగ్యులు కూడా ఏర్పడ్డప్పుడు నేను తప్పక మీకు కబురు చేస్తాను. ప్రస్తుతం మీరు వెంచెయ్యవచ్చు. మీ సౌహార్దానికి నా ధన్యవాదాలు."

అకస్మాత్తుగా సీతారామయ్యకు భయంవేసింది. తనను ఇంటర్వ్యూ చెయ్యడానికి అనేక వేలమంది తయారుగా ఉన్నారనే నమ్మకం అతనికెందుకో కలిగింది. ఇంతమందితోనూ తను తెలివిగా మాట్లాడటం అసంభవం. అసలు మంది మీద ప్రయోగించేది తెలివి తేటలు కానేకావు. అందుకనే రచ్చగెలిచేవాడు ఇంట గెలవలేడు. సభను ఉర్రూతలూగించేవాడు ఇవతలికొచ్చి ఒంటరిగాడికి సమాధానం చెప్పలేడు.

వెనక గిరీశం[1] అనుకున్నట్లే సీతారామయ్య కూడా "శీఘ్రబుద్ధేః పలాయనం" అనుకున్నాడు. అతను బయటికొచ్చాడో లేదో ఓ లక్షమంది అతన్ని చుట్టుముట్టేసినట్టయింది. అందరూ ఒక్కసారే మాట్లాడుతున్నారు.

"మేం, పాశ్చాత్యులు కల్పించిన పాత్రలం. మమ్మల్ని ఉపయోగించు. ఎవరూ కనుక్కోలేరే.. నేను కథకుణ్ణి. నన్నే పాత్రగా ఉపయోగించు. నేనంటే

---

1. గిరీశం గురజాడ తన కన్యాశుల్కంలో సృష్టించిన పాత్ర. "వెంకుపంతులు గారి కోడలికి లవ్ లెటర్ రాసినందుకు యెప్పుడో ఒకప్పుడు సమయం కనిపెట్టి దేహశుద్ధి చేస్తారు" కాబట్టి "శీఘ్రంగా యిక్కణ్ణుంచి బిచాణా యెత్తివెయ్యడమే బుద్ధికి లక్షణం" అని గిరీశం ప్రథమాంకం 1వ స్థలం-విజయనగరంలో బొంకుల దిబ్బ మీద అనుకునే సన్నివేశ ప్రస్తావన.

నువేనన్న మాట ! తెలీలా ? నీకు జీవితంలో ఏయే కోరికలు తీరటం లేదో అవన్నీ నీ కథల ద్వారా తీర్చుకో. నాద్వారా నేను నువుగా? తెలిసిందా? ... మేం పురాణ వ్యక్తులం. మమ్మల్ని గురించి కొత్త దృష్టిలో రాయి. మేం దేవతలం. మమ్మల్ని కూడా ఉపయోగించు. నీ వెధవ వాస్తవికత్వం[1] కట్టిపెట్టు! ... మమ్మల్ని గురించి రాయి. మేం జీవిత శ్లేష్మంలో పడి కొట్టుకుంటున్న ఈగలం. మా దరిద్రమూ, మా విశ్వాసమూ, అసమర్థతా, అవినీతీ ఉన్నదున్నట్టు రాయి. గొప్పవాడివవుతావు! పైకొస్తావు! ఒట్టి నిజం లోకానికి చెప్పు ! పోబోకు రా, రా!"

సీతారామయ్య చెవులలో వేళ్ళు పెట్టుకుని పరుగెత్తసాగాడు. అప్పటికీ ఆ గొంతులు తనను వెన్నాడుతూనే ఉన్నై. ఇంకా పరుగెత్తుతున్నాడు...

* * * *

అంతా ప్రశాంతంగా ఉంది. సీతారామయ్య చేలమధ్య నిలబడి ఉన్నాడు. తను నిలబడివున్న రోడ్డు ఏదో బస్తీకి పోతున్నది. బస్తీ దూరంగా చెట్లమీదినించి కనిపిస్తున్నది. రోడ్డుకు ఒక ప్రక్కవున్న చేలో నాట్లేస్తున్నారు. మరో పక్క కుప్పలు కొడుతున్నారు. "వారే బూసనం", "వాసే యీరమ్మ ", "వాసి రత్తీ" అని పిలుపులు మధ్య మధ్య వినపడుతున్నై.

సీతారామయ్యకు వాళ్ళను చూస్తే ప్రాణం లేచివచ్చింది. కనీసం వాళ్ళయినా తమ పనులు తము చూసుకుంటున్నారు. సీతారామయ్యను ముట్టడించడానికి వాళ్ళేమి ప్రయత్నం చెయ్యలేదు. వెంటనే సీతారామయ్య వాళ్ళను సమీపించి, "ఏమర్రా, మీరంతా నా కథలోకి రండి" అన్నాడు.

ఒక చాపల్లాంటి కళ్ళుగల మిటారి పడుచు ముచ్చటగా మొహం చిట్లిస్తూ, "యేందీ ?" అన్నది.

"నువు నాకథలోకి రా!" అన్నాడు సీతారామయ్య.

"యెటకారాలా యెట్టాసి. మా అయ్యతో జెప్పి నీ తిక్కొదల గొట్టిపిత్తా! ఛా చంగ తెరగవ్" అన్నది.

ఆడవాళ్ళతో వ్యవహారం తేలదని సీతారామయ్య కాస్త వయోవృద్ధుడైన వాణ్ణిచూసి వాడితో తన కోరిక చెప్పాడు. "మా వోటా నల్ల బేపన కుర్రాయన కిచ్చేశాం. సల్లగా నీదారే నువ్వెల్లు!" అన్నాడు ముసలాడు.

సీతారామయ్య బిత్తరపోయి రోడ్డు వెంబడే బస్తీ చేరుకున్నాడు. బస్తీలో అంతా కుర్రకారు కనిపించారు. అంతా రాయిస్టులూ, సోషలిస్టులూ, కాంగ్రెసు

---

1. వాస్తవికత్వం అనే మాటను వాస్తవికతావాదం అనే అర్థంలో కొ. కు॰ ఉపయోగిస్తున్నట్లు మనం ఈ సందర్భంలో అర్థం చేసుకోవాలి. వాస్తవికతావాదం కళారంగానికి వర్తించే ఒక ధోరణి.

సోషలిస్టులూ, కిసానిస్టులూనూ. ఒకడు 'విప్లవాన్ని జమ్' అంటున్నాడు. మరొకడు 'ఆర్థిక భౌతికతత్వం' అంటున్నాడు. చాలా మంది రష్యాలో ఉన్నామనుకుంటు న్నారు. కొందరు 'రష్యా పరిస్థితులకీ, ఇండియా పరిస్థితులకి తేడా' లేదంటున్నారు. మరొకడు సక్రమమైన ఫాసిస్టు వ్యతిరేక ప్రణాళిక తయారు చేస్తేగాని, ఈ యుద్ధం సరియయిన ఆకారం దాల్చదు,[1] అంటున్నాడు.

వాళ్ళ మాటలన్నీ సీతారామయ్యకు అగమ్యగోచరంగా ఉన్నప్పటికీ వాళ్ళను చూస్తే ముచ్చటేసింది. వీళ్ళ అజ్ఞానాన్ని చిత్రించటమైనా చెయ్యదగిన పనే ననిపించింది. కొత్త సమస్యలు కొత్త అజ్ఞానాలకు అవకాశం కలిపిస్తాయి. లేని సమస్యలను గురించీ, తీరిపోయిన సమస్యలగురించీ అజ్ఞానంగా ప్రవర్తించే పాత్రల కంటె వీళ్ళు చాలా నయం.

"ఏమర్రా? మీరంతా నా కథలో పాత్రలుగా ఉండరాదూ?" అన్నాడు సీతారామయ్య.

"మా సంగతి మా వాడు చూస్తాడులే. నువ్వు రాస్తే చెడగొడతావు. తమరు దయచెయ్యండి!" అన్నాదొక మనిషి.

సీతారామయ్య హతాశుడైనాడు. ఆ పొలాల్లో ప్రపంచం పని తమ పనే అనే విశ్వాసంలో పనిచేస్తున్న వాళ్ళూ, ఈ ఊళ్ళో ఎవరి పని అయినా ప్రపంచం పనే అనే విశ్వాసంతో, చేసే పనిలేక తర్జనభర్జనలు పడుతున్న ఈ కుర్రాళ్ళూ తనను నిరాకరించారు. ఇక తన జీవితమంతా తనకు కావలసిన పాత్రలను వెతకటంలో గడపాలి కాబోలు. అదుగో! ఎవరో తనను పిలుస్తున్నారు. వాళ్ళేమైనా తమ చోటిస్తారేమో! పోవాలి....సీతారామయ్య పరుగెత్తసాగాడు. ఏదో కాలి కడ్డం తగిలి బొక్కబోర్లా పడ్డాడు. తలకు ఏదో గట్టిపదార్థం టంగున తగిలింది....

సీతారామయ్య కుర్చీలో లేచి కూర్చున్నాడు. కుర్చీ అడ్డకర్రకు తల తగిలి కొద్దిగా నెప్పి పెడుతున్నది. .

బయట ఎవరో, "సీతారామయ్యగారూ!" అని పిలుస్తున్నారు.

"ఓయ్, వస్తున్నా!" అన్నాడు సీతారామయ్య నిద్రమత్తుతో.

ప్రచురణ: మే 1946, 'వరప్రసాదం' కథల సంపుటిలో,
రెండవ ముద్రణ: యువ బుక్ డిపో, మద్రాసు.

1. రెండవ ప్రపంచ యుద్ధంలో ఫాసిస్టు వ్యతిరేక రాజకీయ పక్షాల దృష్టిని తెలిపే వ్యాఖ్య.

# అ ద్దె కొం ప

మా శారదాంబ మొగుడు శివకామయ్య యోగ్యుడే కాని కుటుంబంలో వాడితో పోల్చదగిన మనిషిలేడు. శివకామయ్య తండ్రి వొట్టి దద్దమ్మ. పెళ్ళాం ఎంత చెపితే అంతా. వాళ్ళ వూళ్ళో పార్వతీశంగా రిల్లంటే ఎవరూ చెప్పరు; కామాక్షమ్మగా రిల్లంటే ఎవరికన్నా తెలుస్తుంది. అంతేకాదు; కానూరి కామాక్షమ్మ అని ఆవిడ నెవ్వరూ పిలవరు. కూనపల్లి కామాక్షమ్మ అనే పిలుస్తారు. ఆవిడ కూనపల్లి వారి ఆడబడుచు. ఏడుగురు పిల్లలతల్లి అయినా ఈనాటికీ ఆవిడ కన్న వారింటనే ఉంటున్నది. ఎరగనివాళ్ళు పార్వతీశం ఇల్లరికమని కూడా అనుకోవటం కద్దు. కాని నిజం ఏమంటే కామాక్షమ్మ తండ్రిగారి కాపరం ఏనాడో చితికిపోయింది. జప్తుచేసిన తండ్రి ఆస్తిని కామాక్షమ్మ మొగుడుచేతనే కొనిపించింది. అందుకోసం పార్వతీశం అప్పుచెయ్యవలసి వచ్చింది. ఆ అప్పు తీరక, స్వగృహం అమ్ముకోవలసి కూడా వచ్చింది. మామగారి కొంప వ్యవహారరీత్యా తనదే అయినా, పార్వతీశంగారు దాన్ని మామగారి ఇల్లల్లేనే చూశాడు. తనకన్న మామగారి వాళ్ళకే ఆ యింటిమీద అధికారం ఎక్కువ ఉన్నట్టుగా భావించాడు. అతని తరపున బంధువులు ఎవరు వచ్చినా వాళ్ళకా యిల్లు పార్వతీశం మామగారిదే - కాకపోతే, కూనపల్లి కామాక్షమ్మగారిది - అనిపించేదిగాని, పార్వతీశంగారి దనిపించేది కాదు. కామాక్షమ్మ తల్లిదండ్రులూ, అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్ళూ కూడా ఆ యింటిని స్వగృహం లాగే చూసుకునేవాళ్ళు. అయిందా-కామాక్షమ్మ నోరు చెడ్డది, ఆమె హృదయం చాలా మంచిదని చెబుతారుగాని, దాన్ని గురించి సాక్ష్యం దొరికేది కాదు. ఎప్పుడన్నా తన కిష్టమైనవారికి మొగుడి సొత్తు పంచితే పంచేదేమో మనమెందుకు కాదనాలి? కాని మొత్తం మీద ఒకటి నిజం. పార్వతీశంలాంటి నోరూవాయీ లేనివాడిలో వెయ్యి మంచిగుణాలున్నా గమనించే వాళ్ళుండరు. కామాక్షమ్మలాంటి గచ్చపొదలో ఏ మాత్రం మంచివున్నా వెంటనే ప్రచారం అవుతుంది. ఆవిడ కోడళ్ళను కోసుకు తినేది. ఆ మాటంటే "కోడళ్ళ కావిడ ఇచ్చే శిక్షణ తల్లులు కూతుళ్ళకు కూడా ఇవ్వరు!" అనేవాళ్ళు. నిజానికి కామాక్షమ్మ పెద్ద కోడలు అమిత దురుసుపిల్ల. వాళ్ళ పుట్టింటివాళ్ళు, "ఇది కాపరం ఏం చేస్తుంది? ఏ మొగుడు దీనితో వేగుతాడు?" అనుకునేవాళ్ళు. అటువంటి రాక్షసిపిల్ల కామాక్షమ్మ ఇంట అడుగుపెట్టిన ఆరు నెల్ల లోపల పిల్లి అయిపోయింది.

అగ్నికి వాయువు తోడైనట్టు కామాక్షమ్మగారికి తోడుగా ఉండేది విధవ అప్పగారు. ఆ యిద్దరి మధ్య నలిగి పోతూండేవాళ్ళు ఇంటి కోడళ్ళు. ఇంటి కొడుకు లకు తల్లినిచూస్తే చెడ్డభయం. పెళ్ళాలతో మాట్లాడాలన్నా వాళ్ళ తల్లి అనుమతి పొందవలసిందే. ఇంట్లోవున్న పదిమందీ ఒక్క మనిషి మాటమీద పోవటంవల్ల పైకి కాపరం చాలా గుంభనంగా కనిపించేది. కాని లోపల ఏ ఒక్కరికీ సుఖం ఉండేది కాదని నా అనుమానం. కామాక్షమ్మగారి పెత్తనానికి ఎదురు తిరిగినవాళ్ళు ఇద్దరు కనిపిస్తారు. అందులో మొదటిది మా శివకామయ్య చెల్లెలు, కృష్ణవేణి. అంటే మా శారదాంబ మూడో ఆడపడుచు. ఆవిడ మొగుడి దగ్గరికి వెళ్ళినాక తిరిగి పుట్టింటి గడప తొక్కలేదు. ఈ విధంగా ఇల్లు వదిలిపెట్టిపోయిన మరో కుర్రవాడు శివకామయ్య తరువాతవాడు సుందరం.

ఇదంతా ఎందుకు చెప్పానంటే - మా శారదాంబను అటువంటి ఇంటో ఇచ్చాం. కామాక్షమ్మగారు కోడళ్ళను కాల్చుకు తినటంలో మొరటు పద్ధతులులేవు. కొట్టటమూ, తిట్టటమూ, వాతలు వెయ్యటమూ, అన్నం పెట్టక మాడ్చి చంపటమూ మొదలైనవీ లేవు. అందుచేత ఆవిణ్ణి గురించి నలుగురూ అనుకోవటం కూడా జరగ లేదు. మా శారదాంబలాగా ఆత్మాభిమానంతో పెరిగిన పిల్లకి తిట్లకన్నా, దెబ్బ లన్నా ఒక మాట భరించటం చాలా కష్టం. తొందరపడి దానిమీద నేరం మోపితేనే సహించని మనిషి - కామాక్షమ్మగారి కవాతుకు ఎట్లా లొంగుతుంది? శారదాంబ ఎప్పుడూ నోరుచేసుకునే రకంకూడా కాదు. భరించలేని పరిస్థితి అనితోస్తే ఏదో అఘాత్యం చేసేస్తుంది.

అందుచేత శివకామయ్యకు పట్నంలో ఉద్యోగం దొరికిందంటే చాలా సంతోషించాను. ఎందుచేతనంటే-మొదటనే చెప్పినట్టు అతను చాలా యోగ్యుడు. మా శారదాంబకూడా అతనంటే చాలా సదభిప్రాయమే ఉంది. కాని అతను ఇంటి దగ్గర ఉన్నంతకాలమూ మా శారదాంబకు సుఖం లేకపోయింది. ఈ ఉద్యోగం దొరకటం అతని ప్రాణానికీ, దాని ప్రాణాలకూ, మా ప్రాణాలకు కూడా ఎంతో సుఖమిచ్చింది.

అవి యుద్ధం రోజులు[1]. శివకామయ్యకు దొరికిన ఉద్యోగం కూడా తత్సం బంధమైనదే. అయితే ఏ మొచ్చిందంటే అతను మా శారదాంబను వెంటబెట్టు కొని పట్నంలో కాపరం పెట్టాడో లేదో, ఇంతలోనే మద్రాసుకు విమాన దాడి భయం[2] జాస్తి అయి, అక్కడినుంచి మన తెలుగువాళ్ళు సకుటుంబంగా స్వగ్రామాలకు పారిపోయి రాసాగారు. ఏ మాటకామాటే చెప్పాలి. మన శివ కామయ్య భయం లేదని చెబుతూనే ఉన్నాడు. కాని మేం-అంటే మా వాళ్ళంతా-

1, 2. రెండవ ప్రపంచ యుద్ధదినాలు (1939-1945)

శారదాంబను గురించి భయపడసాగాం. శివకామయ్య ఉద్యోగం వదిలి రాలేదు. శారదాంబకున్నపాటి ప్రాణభయం అతనికీ ఉంది. కాని మేం తన్నిగురించి అట్టే విచారించలేదు. మా పిల్లను గురించే భయపడ్డాం. శారదాంబను పంపితేగాని వీలు లేదని పట్టుబడితే, మా మాట తీసివెయ్యలేక అతను శారదాంబను మా ఇంటికి పంపేశాడు.

అయితే ఏమయిందంటే, శారదాంబ వచ్చిన కొద్ది కాలానికే ఆ విషయం కూడా రూఢి అయింది. ఆ సంగతి తెలియగానే దాని అత్తగారు తమ ఇంటికి తీసుకు వెళ్ళి అయిదో నెలలో పంపిస్తామన్నారు. సరే, రెండు నెలలు అత్త వారింట గడిపి మా శారదాంబ పురిటికి తిరిగి మా యింటికి వచ్చేసింది. దానికి పురుడొచ్చి పిల్లవాడు పుట్టి, వాడికో మూడు నెలలు గడిచేసరికి అక్కడ పట్నంలో పరిస్థితులు మారి పోయినై. పట్నంనుంచి వెళ్ళిపోయిన వాళ్ళంతా తిరిగి రాసాగారు. పట్నంలో ఇళ్ళన్నీ గబగబా అయిపోతున్నాయి.

ఇంటివాళ్ళు బతిమాలగా, బతిమాలగా మా శివకామయ్య తాత్కాలికంగా తన భాగంలో నుంచి రెండు గదులు ఇంటివాళ్ళకిచ్చేసి తను సామానుతో సహా ఒక్కగదిలో చేరాడు. ఇంటివాళ్ళు శివకామయ్యను ఎంతో మర్యాదగా చూసేవాళ్ళు. కారణమేమంటే, ఆరు నెల్లపాటు ఇల్లంతకీ శివకామయ్య ఒక్కడే వుండి ఇంటిని కాపాడాడు. నాలుగు మాసాల అద్దె అతనిదగ్గర వాళ్ళు తీసుకోలేదు కూడాను. అటువంటి పరిస్థితిలో వాళ్ళు రెండు గదులివ్వమంటే శివకామయ్య కాదనలేక పోయాడు. అదీకాక వాళ్ళు మాటకూడా యిచ్చారు. మా శారదాంబరాగానే, నూరారయినా, ఆరునూరయినా ఆ రెండు గదులూ తిరిగి ఇప్పించేస్తామన్నారు. సహం ఆ ధైర్యంతోటే శివకామయ్య ఖాళీ చేశాడు.

పిల్లవాడికి మూడోనెల అనగా శారదాంబ అత్తవారు తీసుకువెళ్ళారు. మళ్ళీ పట్నం వెళ్ళితే ఎప్పటికో! వాళ్ళకు మాత్రం పిల్లవాడి ముద్దు ముచ్చట్లు చూచుకోవాలని ఉండదూ? శారదాంబ అత్తగారింట రెండు నెలలుండి పట్నం వెళ్ళట్టానికి ఏర్పాటయింది. ఫలాని తేదీకి తనకు రెండు గదులూ తిరిగి కావాలని ఇంటివారితో చెప్పాడు శివకామయ్య. దానికేం భాగ్యమన్నారు ఇంటివారు. శారదాంబ ఇంకో వారానికి బయలుదేరుతుందనగా శివకామయ్య మళ్ళీ ఇంటివారిని హెచ్చరించాడు. ఆ గదిలో మరెవ్వరో ఉంటున్నారు, ఈ లోపుగానే మరో యిల్లు చూచుకుని వెళ్ళిపోతున్నారని ఇంటాయన చెప్పడంతో, శివకామయ్య బయలు దేరవద్దని శారదాంబకు తంతి యిచ్చాడు. "నా దగ్గర మూడు గదులకూ అద్దె పుచ్చుకుంటూ ఇదేంపని?" అని ఇల్లుగలవాళ్ళని అడిగాడు. దానికి ఇంటివాళ్ళు "ఈ రోజుల్లో పదిహేను రూపాయలకు మూడు గదులెట్లా వస్తాయి? నీ రెండు

గదులకూ కలిసి పాతిక రూపాయలు చెవులు మెలేసి పుచ్చుకుంటున్నాము" అని సమాధానం చెప్పారు.

ఇంటివాళ్ళ డబ్బు దాహమూ, దగాబుద్ధీ చూస్తే మా శివకామయ్యకు ఆశ్చర్యం వేసింది. యుద్ధం మూలంగా ప్రజల మనస్తత్వంలో కలిగిన మార్పు[1] ప్రత్యక్షంగా చూడటం అతనికిదే మొదటిసారి కాని, చేసేదేమీ కనిపించలేదు. ఇంకో ఇంటికోసం వెతుకుదామంటే ఆదివారం తప్ప తీరదు. కాకపోయినా కాళ్ళకు బలపాలు కట్టుకుని తిరిగే వాళ్ళకే ఇళ్ళు దొరక్కుండా ఉన్నాయి. దొరికేవాళ్ళకు దొరుకుతున్నయ్యనుకోండి. వందలకొద్దీ లంచాలు పెట్టాలి. లేదా ఇచ్చే బాడుగలో సహానికే రశీదు తీసుకోటానికి ఒప్పుకోవాలి. అదీకాకపోతే రెండు సంవత్సరాల అద్దె-అంటే ఇల్లు కటటానికి అయ్యే ఖర్చులో ఏ అయిదో వంతో ఆరోవంతో ముందుగా దర్శించుకోవాలి.

ఈ పరిస్థితిలో మా శారదాంబ అత్తవారింటోనే ఉండిపోవలసివచ్చింది. అక్కడే వచ్చింది చిక్కు. మా శారదాంబ అత్తగారు తన పద్ధతులు మార్చుకో లేదు. ఆ పద్ధతులకు మా చెల్లెలు అలవాటుపడుతుందా అంటే, అదీ కనిపించ లేదు. దాని దగ్గర్నుంచి నాకు వారానికో ఉత్తరం రాసాగింది. ప్రతి ఉత్తరం లోనూ చివరికి ఒకటే ముక్క: "నేనిక్కడ ఒక్కక్షణం ఉండలేను. ఎవరికీ చెప్పకుండా బయల్దేరి వచ్చేస్తాను." కాని అవతల పట్నంలో తన మొగుడికి కొంపలేదాయె. మా ఇంటికి తీసుకుపోతే బాగుండదాయె. దాని అత్తగారింటో, అందరి అభిప్రాయమూ ఏమంటే-ఇవ్వాళో రేపో శివకామయ్య ఇల్లా సంపా దిస్తాడని. అటువంటప్పుడు మా శారదాంబను మేం తీసుకుపోతామంటే ఏం బాగుంటుంది?

ఒకసారి ఏదో వంకపెట్టుకుని కామాక్షమ్మగారి యింటికి వెళ్ళాను. వీలు చేసుకుని మా శారదాంబతో మాట్లాడిచూశాను. ఎవరెవరిమీదోపెట్టి తనను నానా మాటలూ అంటారంటుంది. ఇందులో మా శారదాంబ అనుకోవటం ఎంతో, నిజం ఎంతో నాకయితే తెలీదుగాని, మా శారదాంబ బాధపడుతున్నదనటంలో అతిశయోక్తి ఏమీలేదు.

అందుచేత శివకామయ్యకు ఉత్తరం వ్రాస్తూ, శారదాంబ పరిస్థితి గురించి అది రాసుకోలేని వివరాలన్నీ రాశాను. తన వాళ్ళను గురించి రాశాడని అతను అనుకునేవాడు కాదులెండి.

నా ఉత్తరం అందిన కొద్దిరోజుల్లోనే శివకామయ్య ఒక అఘాయిత్యం చేశాడు. తన భాగంలో ఉండవలసిన గదులు ఇంటాయన అవసరానికి తీసుకుని

---

1. రెండవ ప్రపంచ యుద్ధకాలంలోని దొంగ వ్యాపారం, దగా బుద్ధీ, ధన దాహం, లంచాలు, స్వార్థం -వీటి ప్రస్తావన.

తిరిగి యివ్వటంలేదని రెంటు కంట్రోలరుదగ్గర ఫిర్యాదుచేశాడు. రెంటు కంట్రోలరు ధర్మాత్ముడు. ఇంటాయన చెప్పిన అబద్ధాలన్నీ నమ్మక శివకామయ్యదే న్యాయమని గుర్తించాడు. అయితే ఇంటాయన ఇంకోపేచీ పెట్టాడు. సంవత్సరంన్నర క్రితం నాలుగు నెల్లపాటు శివకామయ్య అద్దె ఇవ్వలేదనీ అందుచేత అతన్ని ఖాళీచేయించమనీ అర్జీ పెట్టుకున్నాడు. న్యాయానికి శివరామయ్యదగ్గర ఆ నాలుగు నెలల రశీదులు లేవు. దానికి కారణం; ఇంటాయన అప్పట్లో అద్దె తీసుకోనన్నాడు. ఆనాడు కృతజ్ఞతాపూర్వకంగా చేసినపని ఈనాడు స్వార్థానికి అక్కరకు వచ్చింది. అయినా శివకామయ్యే గెలిచాడు. ఆ పాతబాకీ ఆరునెలల మీద తీర్చేటట్టు శివరామయ్యకు అవకాశం యిచ్చి రెంటు కంట్రోలర్ శివకామయ్యకు రెండు గదులూ ఇప్పించాడు. రెంటు కంట్రోలరు ధర్మమా అంటూ మా శారదాంబ పట్నం వచ్చేసింది.

* * *

నేను పట్నంవచ్చి వారంరోజులయింది. ఈ వారం రోజులనుంచి చాలా విచిత్రమైన కథ నడవటం చూస్తున్నాను.

ప్రతిరోజూ ముప్పూటలా ఇంటావిడ వంటింటోంచి నానా అవాచ్యాలూ మాట్లాడుతుంది. అవి శాపనార్థాలుకావు, అవి రంకెలుకావు! ఆవిడ అనే మాటల్లో కాస్త సౌమ్యమయినవి ఏమిటంటే, "వీళ్ళకి సిగ్గన్నా లేదేం! మా యింటోంచి పొండర్రా అంటే పోయిచావరేం! మా కొంప తప్పితే వీళ్ళకి నిలవనీడే లేదేమో! అయితే చెట్టుకింద పడుకోరాదూ? సిగ్గులా! ఛీ- వీళ్ళ మొహాలు తగలెయ్యా. కోర్టుకుపోతారట. వీళ్ళ పిండాలు పిల్లులకెయ్యా!" ఈ ధోరణిలో.

మామూలు మధ్యతరగతి కుటుంబాల్లో గౌరవంగా బ్రతికే ఆడమనిషి నోట ఇటువంటి మాటలు రావడం నా కాశ్చర్యం వేసింది.

"ఎవర్ని ఆ తిట్లు తిట్టుతున్నది?" అని మా శారదాంబ నడిగాను.

శారదాంబ నవ్వి "ఇంకెవర్ని? మమ్మల్నే! చావనీ! గింజుకోనీ! మేం ఇల్లు ఖాళీచేస్తే ఈ భాగాన్నే నలభై రూపాయలకి ఎవరికన్నా ఇవ్వాలని వాళ్ళ ఆలోచన. డబ్బుదాహం నోటంట అట్లా పలుకుతున్నది. ఇదేం చూశావూ? దొడ్లో పొరపాటున చంచా వదిలేసినా, ఎత్తుకుపోతారు. వాళ్ళకు పనికిరానిదైతే విరగగొడతారు. కొళాయి గొట్టం చిల్లిపొడిచి మా పక్క సందంతా నీళ్ళ ప్రవాహం చేశారు. అలగా కుర్రవాళ్ళకు కానీ అర్థణా చేతిలోపెట్టి మా కిటికీముందునుంచి బండబూతులు అనిపిస్తారు!" అన్నది.

ఇదంతా ఎలా భరిస్తున్నావని మా శారదాంబను నే నడుగలేదు. ఎలా భరిస్తున్నదో, శారదాంబ ఎంతవరకు మారినదో నే అర్థం చేసుకోగలిగాను. మా

శారదాంబ అత్తవారింట్లో అమలులో వున్నది క్షీణించిపోతున్న సంస్కృతికి చెందిన వికృత ఆచారం. కనుకనే శారదాంబ దాన్ని అతిక్రమించి అసహనం ప్రకటించగలిగింది. ఇక్కడ ఈ మద్రాసులో అద్దెయింటి సమస్య అటువంటిది కాదు. దీని మూలకందమేమిటో, ఎలా దీన్ని ఎదుర్కోవాలో మా శారదాంబకు తెలియదు, తెలియలేదు. అందుచేతనే దీన్ని సులభంగా భరించగలిగింది. ఏ ఇబ్బంది అయినా తప్పనిసరి కాదనీ, పరిష్కారమవుతుందనీ స్పష్టంగా తెలిసే వరకూ మనం తిరుగుబాటు చెయ్యలేము గద!

ముద్రణ: జనవరి 1948, ఆంధ్రజ్యోతి.

# దైవాధీనపు జీవితం

మా బావ వెంకటేశ్వర్లు జీవితంతో చెమటలు కక్కుతూ పోరాడటం అందరికీ కనిపిస్తుంది. కొందరు జీవితంతో నిశ్శబ్దంగా పోట్లాడతారు. కొందరు జీవితంతో ఆటాడే చాంపియన్లలాగా కనిపిస్తారు. మరికొందరు ఒడుపుగా వేటాడుతారు. ఇంకా కొందరు నిర్లక్ష్యంగా కూర్చుంటే జీవితమే వచ్చి, వనమాలలు వేస్తుంది. (ఇవి నాలుగు కేరట్ల 'పసిడి పలుకులు'. వీటికీ కథకూ ఏమీ సంబంధం లేదు.)

నా నాయనమ్మ కూర్చున్న పీటమీదినుండి లేచినట్టు కనబడకుండా పన్నెండు మందికి వంట చేసేది. వంట ఎప్పుడారంభమయిందీ, ఎప్పుడు ముగిసిందీ తెలిసేదే కాదు. మా అమ్మ వంట ప్రారంభించటానికి ముందు, సినిమాలలో టైటిల్స్ మ్యూజిక్ లాగా పెద్ద ఆర్భాటం మొదలవుతుంది. అయిపోవచ్చే సమయానికి పెద్ద క్లయిమాక్స్‌గా ఉండి, యమటెంపోలో ట్రంపెట్లూ, ఓబోలూ, పియానో బాదుళ్ళూ చెలరేగుతాయి. అంతా ఉండేది అయిదుగురమూ, వోటు తీసుకుంటే అయిదుగురికి అయిదుగురమూ 'ఈపూట వంట ఆలస్యమయింది' అనే స్థితిలోనే ఉంటాం. మేము భోజనాలముందు కూర్చునప్పుడు నాకు 'జనగణమన' లీలగా వినిపించి నట్టుంటుంది. (ఇది శుద్ధ డైగ్రెషన్. దీనిక్కూడా కథతో సంబంధం లేదు.)

మా వెంకటేశ్వర్లు బావ అత్తగారి పోలిక - అంటే మా అమ్మ పోలిక. అతని జీవితంలో బాక్ గ్రౌండు ఎఫెక్ట్స్ కొంచెం మోతాదుమించి ఉంటాయి - తన కున్నది నాలుగెకరాలభూమీ, ఆరుగురు పిల్లలూ, ఒక ఎలిమెంటరీ స్కూలూమూ. నాలుగెకరాల భూమి ఒకటే రాబడి గలది; మిగతా రెండూ ఖర్చు పద్దులే.

ముగ్గురు పిల్లలు పుట్టాక ఇక హాల్ట్ పెట్టమని మా బావకు చెప్పిచూశాను- వింటాడని కాదు - నా తప్పులేకుండా చెప్పానన్న ఆత్మసంతృప్తి కోసం- చెమటోడ్చటంలో ఆశక్తిగలవాడు భారం తగ్గించే పద్ధతులను తప్పక ఆక్షేపిస్తాడు.

దేన్నయినా ఆక్షేపించవచ్చు. ప్రపంచంలోగల ప్రతి మానవ విశ్వాసానికీ వ్యతిరేకంగా మరొక మానవ విశ్వాసం ఉండనేవుంది. సైన్సులోకూడా, విశ్వా-

సాలు ఇంద్రియగ్రాహ్యంకన్న కూడా బలీయమైనవి గదా! (మరికొన్ని పసిడి పలుకులు - కాని కథకు అప్రస్తుతం కావు.)

కాని విశ్వాసాల సమర్థింపు విశ్వసనీయంగా ఉండాలి. (ప.ప.?)[1] పిల్లలను కనడం ఆపు చెయ్యరాదని నన్ను ఒప్పించడానికి చెప్పిన కారణాలు పరస్పర సంబంధం గలవి కావు. అవి ఇలా ఉన్నాయి:

పిల్లలు కావాలంటే పుడతారుట్రా, వెధవా? దేవుడివ్వాలి. క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి. మర్త్యలోకం విశంతిగాళ్ళు తన కడుపున (అంటే, ఆరోగ్యం కోల్పోయి, కాల్షియం డెఫిషన్సీతో బాధపడే మా అక్క కడుపున) పుట్టుకురావలిసి ఉంటే ఆపడం నీ తరమా, నా తరమా? బిడ్డలో అని మొత్తుకునేవాళ్ళకు పుట్టరేం?

ఇద్దరు ఆడపిల్లలూ, ఒక మగపిల్లవాడూ పుట్టారుగదా, ఆడముండల మెజారిటీ ఎక్కువ కాలా! ఇద్దరు మగపిల్లల తరవాత ఒక ఆడపక్షి పుట్టినా నువ్వన్నట్టు హాల్ట్ పెట్టెయ్యొచ్చు. బాలెన్స్‌షీట్ ఫేవర్‌బుల్‌గా ఉంటుంది. కాని వ్యాపారం నష్టంలో ఉండగా ఎలా ఆపటం?

ఈ గర్భనిరోధ విధానాలున్నాయి చూశావూ? అవీ ఖర్చుతో కూడినవే. లెక్కేసి చూశాగా! ఓ విధంగా పిల్లలే చౌక. మరోటేమిటంటే, అవి నమ్మకంగా పని చెయ్యవు. మా వూళ్ళో లక్ష్మీనారాయణ లేడూ...

అన్ని వాదనలూ విని 'ఆపరేషన్' చేయించుకుంటే?' అన్నాను.

మా బావా నాకేసి కోపంగా చూసి, 'ఇంకా నయం!' అన్నాడు. అంటే ఆయన ఉద్దేశం నా కర్థంకాలేదు. ఆపరేషన్లు చేయించుకున్నవాళ్ళు నా ఎరికిని కనీసం అరడజను మంది ఉన్నారు. వాళ్ళు పెళ్ళాలతో నిశ్చింతగా సుఖపడుతున్నారు.

ఇంకోరు చెప్పేది వినకపోవడమేకాకుండా ఇంకోరు విననిది చెప్పడం కూడా మా వెంకటేశ్వర్లు బావకు పరిపాటే.

ఎందుకో చెప్పలేనుగాని, కొందరు సుమతి శతకం పద్యాలు[2] చదివినా అలకించ బుద్ధి అవుతుంది; మనకు తెలిసిన విషయాలే చెబుతున్నా అందులో ఏదో కొత్త సత్యం ఉన్నట్టు అనిపిస్తుంది. మరికొందరు ఎంత పనికివచ్చే మాటలు చెప్పినా వినబుద్ధి పుట్టదు. లోపం వాళ్ళు చెప్పే తీరులోనో, ఆ చెప్పడం వెనక వుండే మనస్తత్వంలోనో ఉంటుందనుకుంటాను.

---

1. పసిడి పలుకులు సంక్షిప్తరూపం.
2. బద్దెన (13-14 శ.) రాసిన సుమతిశతకంలోని పద్యాలు.

మా బావ జీవితపోరాటంలో కొండలకు వెంట్రుకలు కట్టే ధోరణి తరచు ప్రదర్శించేవాడు. కొండలకి వెంట్రుకలు కట్టటమనేది కడుపు నిండినవాళ్ళు చేసే పని. జీవితంతో జూదమాడటం కూడా ధనికుల వ్యాపకం. మా బావలాటివాళ్ళకు తగినదికాదు.

ఆయనకున్నది నాలుగెకరాలు. ఆ నాలుగెకరాలల్లోనూ పద్నాలుగు రకాల పంటలు వేసి రెండు చేతులా వేలకువేలు సంపాదించటానికి పథకాలు వేసి కలలు కనడమేగాక, వాటిని వివరంగా అందరికీ చెప్పేవాడు.

'ఒరే, చెరుకువేస్తే ఎంతలాభమనుకున్నావ్?...పొరపాటైపోయింది గదరా! పొర పొగాకు వేసివుంటే...ఒరే, మా వూరి మునసబు అల్లుడు కడపలో బత్తాయి తోటలువేసి లాభం చేస్తున్నాట్టగదా—! అన్నట్టు, ఈ అనబిషాహీ ద్రాక్షగురించి నీకేమన్నా తెలుసా!....కనకాంబరం పూలసంగతి విన్నావూ? అరెకరం తోటమీద రోజూరు ఇరవై రూపాయలొస్తా యంటున్నారే? రోజు కిరవయ్యయితే నెల కెంత యింది? పోనీ, అందులోనే సహం చూసుకున్నా....అసలు వెయ్యాలిసింది నిమ్మ తోటరా, వొరే! ఏడాదికి ఎకరానికి ఎనిమిది వేలు లాభం రాని నిమ్మతోట వొట్టి వెధవ తోటట!....'

ఇదీ వరస. ఒకసారి బంగాళాదుంప, ఒకసారి కాబేజీ లేక కాలీఫ్లవర్. ఒక సారి బుంగమిరప, ఇదంతా ఏమిట్రా? ఉత్త ఆవాలు చల్లితే ఎంత లాభమో తెలుసా! చేసేది ఏమీలేదు....విత్తులు చల్లు, పంట నల్చుకో. మరోసారి జీడిమామిళ్ళు.... గవర్నమెంటు సబ్సిడీతో మరీనూ...

భూమిని కొంచెం కూడా మార్చకుండా మా బావ ఆ నాలుగెకరాల్లో అన్ని రకాల పంటలూ పండించాడు - మానసికంగా లక్షలు గడించాడు. అదీ మానసికం గానే మరి-వాస్తవంగా సాధించిన దేమంటే, ఆర్గురు పిల్లలూ, అంతకంతకూ పెరిగి పోతున్న దారిద్ర్యమూనూ.

ఈ పంటల కలలు అలా ఉండగానే, భద్రాచలం ప్రాంతాల్లోనూ, మంజూరు గాని ప్రాజెక్టుల కిందా కారుచవగ్గా వందలేసి ఎకరాలు కొని కళ్ళు చెదిరే సేద్యం చేశాడు-మానసికంగానే.

కొంతకాల మయాక ప్రాజెక్టులకు సంబంధం లేనిచోట్ల వందలకొద్దీ ఎకరాలు కొనడం గురించి కలలు ప్రారంభించాడు. ఎందుకని అడగండి - ఇళ్ళ స్థలాలుగా అమ్మడానికి! ఈ ప్రక్రియలో మా బావ సంపాదించే లాభం నోటితో గుణించేది కాదు. నేను కాగితంమీద లెక్క వేసిన దాకా వదల్లేదు. వేసుకో! ఎకరం వెయ్యి చొప్పున కొని గజం రూపాయిన్నర చొప్పున అమ్మితే ఎంత లాభం? మాట వరసకి యాభై ఎకరాలతోనే బిజినెస్ చేశామనుకో - ఎంతయింది?

"ప్లాటువేసి అమ్మేటప్పుడు రోడ్డుకూ వాటికీ వదలాలి గామాలుగా?" అన్నాను.

మా బావ పళ్ళు బిగబట్టి, మాతితో అయిష్టాన్ని సూచించే చప్పుళ్ళుచేస్తూ "అటంతా వదలినాకనే మనం గజం రూపాయిన్నర చొప్పున గిట్టేట్టు అమ్మామను కుంటే పోలా? నిక్షేపమంటి ఇళ్ళస్థలాలు గజం రూపాయిన్నర కెవడైనా ఇస్తాడూ? రెండున్నర అంటే ఎగరేసుకు పోరూ?.... లెక్క ఎంతొచ్చిందీ?" అన్నాడు బావ.

"గజం రూపాయి చేసుకో, బావా. ఎకరం నాలుగువేలా ఎనిమిదొందలనుకుంటే, యాభై ఎకరాలకు-?"

'ఛీ, ఛీ! అంతేనా? పని లాభమంతా దిగలాగేస్తున్నావు' అన్నాడు బావ.

"కాస్త తక్కువ అంచనాలోనే ఉంటే మంచిది. బావా."

"సరే పోని, రౌండుగా ఎకరం మీద అయిదువేలు వస్తుందనుకో-చచ్చుధర-అయినా మనలో మనం అనుకోవటానికేం? యాభై ఎకరాలూ యాభై ఐదు వేలు. అంటే రెండున్నర లక్షలు. ఇంతేనా?"

బావకు నీరసం పుట్టింది.

"ఎకరన్నరకూడా ఎక్కడిది? యాభై ఎకరాలు ఊరికే రాదుగా? ఎకరం రెండువేల చొప్పున ఒకలక్ష పోనేపోయె."

"ఇంకా నయంరోయ్! ఎకరం రెండువేలే! వెయ్యేగదా అనుకున్నాం? పై అర లక్షా పోయిందా. అంటే దిగుబాటు రెండు లక్ష లయిందా?... మనం మరీ తక్కువ కమ్ముతున్నా మన్నమాటే. ఈపాటి బిజినెస్‌మీద సునాయాసంగా అయిదారు లక్షలు వచ్చేస్తాయి. తెలుసా?"

నాకు తెలీ దన్నాను. బావ నా అజ్ఞానానికి జాలిపడ్డాడు. ఆయన అమాయకత్వానికి నేను దడుచుకున్నాను.

మా బావ కలల ఆర్భాటం గురించి పూర్తి దండకం చదవటం నాకిష్టం లేదు. (గ్రంథ విస్తరభీతి) ఒకవేళ చదవదలచినా నాకు ఆయన బుర్రలో ఉన్న ఆలోచనలన్నీ తెలుసుననుకోను. అంచేత నాకు తెలిసిన వాటిలో కొన్ని మాత్రమే చెప్పాను. (అన్నీ చెప్పానులెండి. కాని జిడ్డు పట్టించానని ఎలా ఒప్పుకోను? కొందరు మహారచయితలు వాళ్ళకు తెలిసిందంతా రాసేస్తారు. నాబోటివాడు తెలిసినదానికన్న ఒక్క పిసరు హెచ్చే రాసినా నమ్రతగా ఉండటం మంచిది గదా.)

ఉద్యోగం విషయం అడక్కండి. ఎలిమెంటరీ స్కూలు. అందులోనూ పల్లెటూరు. స్కూలుమీద వచ్చే ఆదాయం ముడుపులకు చాలదు.

సంతానయోగం బాగా ఉన్నందున ఎవరూ ఏ పూటా సరిగా తినేవాళ్ళుకారని నా అనుమానం. ఏ పిల్ల ఒంటినా చిరగని బట్టలు నేను చూళ్ళేదు. నేను చూడనప్పుడు వాళ్ళు మంచి బట్టలే కట్టుకునే వాళ్ళనుకుంటే నాకు తృప్తిగానే ఉంటుంది గాని, అనుకోవటం చాతకావటంలేదు.

మా సుందరక్క కాపరానికి నేను చెయ్యగలిగిందేమీ కనిపించలేదు-ఏ పండగనో వంకపెట్టి వాళ్ళందర్నీ పిలుచుకొచ్చి, ఓ వారం రోజులుంచుకుని, ఓపిక మటుకు బట్టలూ అవీ పెట్టి పంపించడంతప్ప.

మా బావకి బస్తీ జీవితం బాగుండేదికాదు. మా అక్క వారం పదిరోజులు చాకిరీ తప్పిందని సంతోషించేదే గాని, ఆవిడకూ బస్తీ జీవితం అంత నచ్చదు. పిల్లలు మాత్రం మా ఇంట్లో ఉన్నన్నాళ్ళూ స్వర్గంలో ఉన్నట్టే ఉండేవాళ్ళు. తిరిగి ఇంటికి బయలుదేరేటప్పుడు పెద్దపిల్లలు దిక్కుమొహాలు వేసేవాళ్ళు.

అందరికన్నా గోపాలం మరీ దిక్కుమొహం వేసి, "అప్పుడేనా? నేను రెండు రోజులుండి వస్తా . అసలు రానే రాడు. మావయ్య గారింట్లోనే ఉండిపోతా," అని దశలవారీగా తన అసమ్మతిని పెంచుకుపోయేవాడు. చివరకు అందరితోబాటు వాడూ వెళ్ళేవాడు.

మా బావ ఆపరేషన్ చేసుకోమన్నపుడు మగపిల్లల మెజారిటీ కోసం నిరాకరించాడన్నానేమోకాదూ? అది సాధ్యపడింది కాదు.ఇద్దరాడపిల్లల తరువాత గోపాలం పుట్టాడు. వాడి తరవాత మళ్ళీ ఇద్దరాడపిల్లలు పుట్టి, ఆరోవాడు మగపిల్లవాడు పుట్టాడు. బడ్జెటు లోటు రెట్టింపయింది.

ఆడపిల్లల్ని గురించి నేను చేయగలదేమీ లేదు. చట్టాన్ని ధిక్కరించి వాళ్ళను చిన్నతనంలోనే మా బావ యెవరికో ముడి పెట్టేస్తారు. పెద్దదాన్నీ, రెండోదాన్నీ, అలాగే పదేళ్ళు దాటకుండా ముడిపెట్టేసి గుళ్ళోపెళ్ళి, గుట్టుచప్పుడు కాకుండా చేశాడు. పెద్దదాని పెళ్ళికి పిలవొచ్చినప్పుడు నాకు శైత్యభారంగా ఉంది.

"ఇంత జబ్బుతో నువు పిల్లల్నేసుకొని ఏం బయలుదేరతావుగాని, ఛదిభింపు శ్రేమైనా ఉంటే ఇప్పుడే నా మొహాన పారెయ్యి ఆ పురోహితుడిచేత నీపేరు చెప్పిస్తాను" అన్నాడు బావ. ('ఇంత జలుబుతో' అనే- ఓ వ్వేళ బావ అన్నాడేమో. నాకు 'జబ్బు' అన్నట్టుగానే వినిపించింది. అందుచేత చిత్రగుప్తుడు నన్ను క్షమించుగాక!)

ఓ యాభై చేతిలో పెట్టి పంపాను. దాంతోనే దావ పెళ్ళి ఖర్చు గడిపేశాడా అని నా అనుమానం.

రెండోపిల్ల పెళ్ళికి పిలవడానికి వచ్చినప్పుడు, 'ఒరే, నువు పెద్దదాని పెళ్ళికీ రాలేదు. ద్వితీయవిఘ్నం చేస్తావా ఏం? అన్నాడు. కావాలనే అన్నాడో, మాట వరసగా అన్నాడో నాకైతే తెలిదు.

'ఎందుకు చేస్తాను బావా?' అన్నాను. పెళ్ళికి వెళ్ళలేదు. ఈసారి నూరు రూపాయ లిచ్చాను.

అసలు సంగతేమిటంటే, అందరికీ ఆడపిల్లలు బరువైతే మా బావ వాళ్ళ బరువును చాలా అవలీలగా దించేసుకునే తెలివితేటలు ప్రదర్శించాడు.

కాని గోపాలంగాడి భారం మహా మోస్తున్నట్టు కనబడ్డాడు. రెండోపిల్ల పెళ్ళికి ముందే వాడిమీద దాడి ప్రారంభించాడు.

'వాడిమీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాను. వెధవ నన్ను దగా చేసేట్టున్నాడు. అసలు వాడో అయిదేళ్ళు ముందు పుట్టాలిసింది. అయిదేళ్ళాలస్యంగా పుట్టాడు. నాచేతి కక్కరకు రావటం అయిదేళ్ళు ఆలస్య మవుతుందా కాదా? మొదటి సంతానంగా అఘోరిస్తే నాకు సంసారభారం అయిదేళ్ళు తగ్గేదిగదా. మాట్లాడవేం?'

'ఏం మాట్లాడను, బావా? మొదటి సంతానం అంత చురుగ్గా ఉండ దంటారు.'

'ఏడిసినట్లుంది! ఏడిచి మొహం కడుక్కున్నట్లుంది. నేను మొట్టమొదటి సంతానమే!'

"అంచేతే..." అనబోయి మానేశాను.

'వీడు మూడో సంతానమై ఏం అఘోరిస్తున్నా డంటావు? లెక్కలు సున్నా! అన్నీ సున్నాయే! ఈ క్షణం చదివింది మరుక్షణం మరిచిపోతాడు.'

'కొంచెం మతిమరుపేమో?'

'వెధవకి సినిమాపాటలన్నీ జ్ఞాపకం ఉంటాయేం? మతిమరుపుకాదు. మాయ రోగం. చూస్తాను. చూస్తాను. గొడ్లవెనుక పంపిస్తాను.'

మా బావను చూస్తే జాలేసింది. బడిపంతులు కొడుకు చదువులో బండ అంటే కొంచెం పరువు తక్కువే మరి! కొడుక్కు చెప్పలేని చదువు ఊళ్ళో పిల్లలకేం చెబుతాడంటారు నలుగురూ. కాని బావ మాటల్లో నాకాటే నమ్మకం కుదరలేదు. గోపాలాన్ని చూస్తూనే ఉన్నానుగదా. వాడు కాస్త పరధ్యానం మనిషేమోగాని, బండ అన్న అనుమానం నాకెన్నడూ కలగలేదు.

ఈసారి శలవులకు వాణ్ణిపంపించు. వాడి గొడవేమిటో కాస్త నేనుకూడా చూస్తాను' అన్నాను.

గోపాలం ఒంటరిగా మొదటిసారి మా యింటికొచ్చేటప్పటికి వాడికి ఏడో ఏడనుకుంటాను. అంతకుముందే మా పెద్దపిల్లకు సంగీతపాఠాలు మొదలు పెట్టించాం. మా శకుంతల వాడీడుదే. వాడికన్న నలభై రోజులలో ఎంతో చిన్న. ఇద్దరికీ ఈసారి భలే దోస్తీ కలిసింది.

'బావ సినిమా పాటలు భలే పాడుతాడు నాన్నా, అచ్చు నాగయ్య[1]లాగే పాడతాడు' అన్నది శకుంతల నాతో.

పాడమనటం వ్యవధిగా గోపాలం పాడాడు. వాడి గొంతు, పాడేటప్పుడు, చాలా శ్రావ్యంగా ఉంది. మా అక్కయ్య చిన్నతనంలో తుంగల చలపతి[2] పాటలూ, రామనాథశాస్త్రి[3] పాటలూ బాగా పాడేదని నాకు గుర్తుకొచ్చింది. ఇంకేం? గోపాలానికి తల్లి నుంచి పాట అబ్బింది.

సంగీతం మేస్టరు వచ్చి మా అమ్మాయికి పాఠం చెప్పేటప్పుడు గోపాలం దరిదాపుల్లోనే వుండి, దాని పాఠాలన్నీ తానుకూడా ఒప్పజెప్పేవాడు.

---

1. చిత్తూరు నాగయ్య (1904-1973) అగ్రశ్రేణి తెలుగు నటుడు; గాయకుడు సంగీత దర్శకుడు, దర్శకుడు. గృహలక్ష్మి (1938)లో ప్రధాన పాత్ర ధరించడంలో చలన చిత్ర జీవితం ప్రారంభమైంది. 'కల్లుమానం డోయ్ బాబూ కళ్ళు తెరవండోయ్ బాబూ' అనే ఆ చిత్రంలోని పాట ఆయనకు కీర్తి తెచ్చింది. వందేమాతరం (1939) సుమంగళి (1940) దేవత (1941) భక్త పోతన (1942) స్వర్గసీమ (1945) త్యాగయ్య (1946) యోగి వేమన (1947) చిత్రాల ద్వారా గొప్ప నటుడుగా ఖ్యాతి పొందాడు. మూడు వందల చిత్రాల నటించాడు.

2. తుంగల చలపతి (      ) :ప్రసిద్ధ రంగస్థల నటుడు, గాయకుడు. 1935లో వచ్చిన సక్కుబాయి చిత్రంలో నటించారు.

3. కపిలవాయి రామనాథశాస్త్రి (1894-1935) ప్రసిద్ధ రంగస్థలనటుడు, గాయకుడు. చిన్నతనంలోనే మైలవరం నాటక సమాజంలో చేరి ఆ సమాజానికి ఖ్యాతిని సంపాదించి పెట్టినవాడు. పద్యం పాట - వీటిని పాడటం సొంత శైలిని ఏర్పర్చుకున్న గాయకుడు, గ్రామఫోను రికార్డుల రూపంలో వచ్చిన ఆయన పాటలూ, పద్యాలూ విపులప్రచారాన్ని పొందాయి. 1935లో వచ్చి శ్రీకృష్ణ తులాభారం చిత్రంలో శ్రీకృష్ణుడుగా నటించారు.

నా కనిపించింది - సంగీతం చెప్పిస్తే గోపాలానికి బాగా వస్తుందేమో! వాడు కూడా వాళ్ళ నాన్నల్లేనే ఎలిమెంటరీ స్కూలు నడపాలని ఎక్కడుందీ?

'ఇక్కడే ఉండి చదువుతోబాటు సంగీతంకూడా నేర్చుకుంటా వేమిట్రా?' అని అడిగితే గోపాలం కళ్ళెగరేసి, 'ఓ!' అన్నాడు.

కాని మా బావ 'చచ్చినా ఆ ఏర్పాటుకు ఒప్పుకో' నన్నాడు.

'వాడికున్న తెగులే సంగీతమైతే, దాన్ని పెంచుతా నంటావేమిటి? ఆ సంగీతం పోయిననాడు వాడికి చదువొస్తుంది. పుస్తకం ముందేసుకుని కూనిరాగాలు తీస్తాడు కుంక! పుస్తకం ఏం వంటబట్టుతుందీ?' అన్నాడు బావ.

'సరే నీ యిష్టం' అన్నాను.

గోపాలం ఆ వేసవికి మా ఇంటికి మళ్ళీ వచ్చాడు. ఈసారి మా శకుంతల కృతులు పాడేస్తున్నది. మా ఇంట్లో రేడియో కూడా ఏర్పాటయింది.

మా శకుంతల అస్తమానమూ రేడియోలో హిందీ సినిమా పాటలు వినేది. దానికి- సహజంగా- తాను నేర్చుకునే కృతులకన్న హిందీ సినిమా పాటలే బాగుం డేవి. ('సహజంగా' అంటే నా మనస్తత్వాన్ని బట్టి అని అర్థం. నాకు తెలిసినంత వరకూ ఈ మాటను అందరూ ఈ అర్థంతోనే వాడతారు).

కొద్దిరోజుల పాటు గోపాలం కూడా సినిమా పాటలు విని ఆనందించాడు. ఆనందించటమే కాదు. రెండు మూడుసార్లు విన్న పాటలను తిరిగి పాడేశాడు. మా శకుంతల ఆశ్చర్యం వర్ణనాతీతం.

'మీ ఇంటో రేడియో ఉందా? నువ్వీ పాటలు చాలా వందలసార్లు విన్నావు కదూ!' అని అది అమాయకంగా గోపాలాన్నడిగింది. వాడు లేదంటే నమ్మలేదు.

అంతకంటే చిత్రమేమంటే రెండుమూడు వారాలు గడిచాక గోపాలం శాస్త్రీయ సంగీతం ముందు సినిమా పాటలేవీ ఆగవని ఖచ్చితంగా శకుంతలతో చెప్పేశాడు. మా పిల్ల పాడే కృతులు వాడికి కంఠతా వచ్చేశాయి.

'అబద్ధం కాదు. చెక్కూ. నువు నేర్చుకునే కృతులకన్న ఈ సినిమా పాటలేం గొప్ప?' అన్నాడు గోపాలం. ('శకుంతల'కు అపభ్రంశ రూపం 'చెక్కు'. అటు వంటి అపభ్రంశాలు పోషను.)

ఇక్కడ ఒక్క విషయం ఒప్పేసుకో నివ్వండి. గోపాలం అన్నమాట నాకు వేదవాక్యమై, సంగీతంలో నా కుంటూ వచ్చిన అంతంత మాత్రపు అభి రుచిని సరైన దారిలో పెట్టింది. ఈ ఒక్క విషయంలోనూ వాడు నాకు గురువు. ఈ సినిమా పాటలు పుబ్బలో పుట్టి మఖలో మాడిపోతుంటే కృతులు శతాబ్దాల తర బడి ఎందుకు బతికి ఉన్నాయో నాకు తెలిసేటట్టు చేసినవాడు గోపాలం.

వాడు సంగీత విద్వాంసుడు కాకూడదని నిర్ణయించిన వాడి తండ్రి గురించి నా అభిప్రాయం అడక్కండి - నాకన్న పెద్దవాడు.

తిరిగి స్కూళ్ళు తెరిచే సమయానికి మా బావ వాణ్ణి తీసుకుపోవటానికి వచ్చినప్పుడు నేను మళ్ళీ వాడి సంగీతం గురించి ప్రస్తావించి చూశాను.

మా బావ ఔరంగజేబల్లే సంగీతం అనగానే శివమెత్తి పోయాడు.

'బంగారం పారేసుకుంటున్నావు, బావా!' అన్నాను.

"ఆ కాకి బంగారం నాకొద్దు. నా కసలే వాడంటే మండిపోతున్నది. నన్ను మరింత రెచ్చగొట్టకు. నీ మేనల్లుడిలో నీ కంత నమ్మకం ఉంటే ఒక పని చెయ్యి. వాడెట్టాగూ నా కక్కరకురాడు. నువు వాణ్ణి నీ ఇష్టానుసారం పాడుచేసుకో. నీ కూతుర్నిచ్చి పెళ్ళిచెయ్. ఇల్లరికం ఉంచుకు తిండిపెట్టు. కట్నం ఇచ్చేదేదో ఇప్పుడే నామొహాన పారెయ్యి" అన్నాడు బావ.

నాకు పెద్ద ఎసరే పెట్టాడు. తప్పించుకోవటానికి ఒకదానికొకటి అతక్కుండా కారణాలు దొర్లించేశాను. (నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష!)

ఒకటేమిటంటే, శకుంతలను గోపాలానికిస్తే వరహీనమవుతుంది. మా బావ తన కూతుళ్ళకు చేసినట్టే నేను కూడా ఏడాది లోపుగా పెళ్ళి చేస్తే, ఆ పెళ్ళికూతురి పక్కన ఆ పెళ్ళికొడుకును చూసి అంతా నవ్వుతారు. అదీగాక మేనరికాలు చెయ్యటం చాలా తప్పు. పెట్టుకున్న వరసల ప్రకారం బావామరదళ్ళే అయినా, రక్త సంబంధాన్ని బట్టి అన్నా చెల్లెళ్ళే. అటువంటి వాళ్ళ మధ్య పెళ్ళిళ్ళు ఎంత మాత్రమూ కూడవు. మరోటేమిటంటే, రేపు నేను వాణ్ణి గొప్ప సంగీత విద్వాంసుణ్ని చేసి, వాడు రెండు చేతులా వందలూ, వేలూ సంపాదిస్తుంటే బావ ఈ మాట మీద ఉండడు. నా కొడుక్కు ఇల్లరికం ఉండే ఖర్మేమిటంటాడు.

మా బావ పెద్దగా నవ్వి, 'ఎందుకింత ఉపన్యాసం? వాడు సంగీతం నేర్చి బిచ్చం కూడా ఎత్తుకోలేడని నీకూ తెలుసు. ఆ మాట అఘోరించరాదూ?' అన్నాడు.

ఆ తర్వాత కొద్దిరోజులకే గోపాలం వ్యవహారం నా చెయ్యి, మా బావ చెయ్యీ కూడా దాటిపోయింది. గోపాలం ఫస్టుఫారం అందరికన్నా పెద్ద రాంకులో తప్పాట్ట. మా బావ వాణ్ని స్పృహతప్పి పోయేట్టు కొట్టాట. గోపాలం ఎవరితోనూ చెప్పకుండా ఎక్కడికో లేచిపోయాట్ట.

'నేన్ను నాన్న కన్న ఎక్కువ సంపాదించినదాకా ఉత్తరం కూడా రాయను' అని ఆ పన్నెండేళ్ళ వెధవ కార్డు రాసినదాకా అక్కయ్య అన్నం కూడా తినకుండా ఏడుస్తూ కూర్చుందిట.

గోపాలం ఇంటికి రాలేదన్న మాటేగాని వాడి సంగతులు అప్పుడప్పుడూ తెలుస్తూనే ఉన్నాయి. వాడేదో నాటక సమాజంలో చేరాడని విన్నాను. ఆ నాటక సమాజంలో చేరి వాడు చేసిన ఘనకార్యం హోటలు నుంచి టిఫిన్లు తీసుకురావటమూ, అడపాదడపా చాకిరీ చెయ్యటమూ మాత్రమేనని తరవాత తెలిసిందనుకోండి. వాడు ఎంగిలి పళ్ళాలు కడిగినా నాకేమీ నామోషీ లేదు. అంత చిన్నతనంలో వాణ్ని వాడు పోషించుకోగలిగి నందుకు సంతోషించాను.

ఈ దేశంలో కాక మరే దేశంలోనైనా వాడి వంటి కుర్రాడికి మంచి అవకాశాలుండేవేమోనని అనుమానం నన్ను వదలలేదు. ఏమో? నాకు మటుకేం తెలుసు? ఇంతకన్న కూడా బడుగు దేశాలుండవచ్చు! అక్కడి కుర్రాళ్ళ జీవితం ఇంతకన్న కూడా దైవాధీనం కావచ్చు.

అయిదారేళ్ళ క్రితం మా గోపాలం మద్రాసు చేరినట్టు తెలిసింది. సినిమా ఛాన్సుల కోసం చూస్తున్నాడని ఎవరో చూచాయగా అన్నారు.

మా అమ్మాయి కాలేజీలో చేరుతూనే సంగీతం మానేసింది. నేర్చుకున్నంత వరకూ బాగానే పాడుతుంది.

ఒకనాడది రేడియో వింటూ, "ఆ గొంతు బావదల్లే ఉంది" అన్నది. ఏదో పాటల నాటకం. నాటకం చివర చెప్పిన పేర్లలో వి. గోపాలరావు అనే పేరుకూడా ఉంది. మా మేనల్లుడే అయుండాలి. నేను గొంతు ఏమాత్రమూ గుర్తించలేదు. కాని మా శకుంతల గుర్తించింది.

ఆ తరువాత అప్పుడప్పుడూ మద్రాసు రేడియోకేంద్రం పాటల నాటకాల్లో వాడిగొంతు వింటూ వచ్చాం.

రెండేళ్ళక్రితం మా శకుంతల పెళ్ళి అయినప్పుడు గోపాలం ఆకాశం నుంచి ఊడిపడ్డట్టుగా దిగాడు. మనిషి పూర్తిగా మారిపోయాడు.

రేడియోలో వాడు పాడినప్పుడల్లా విధిగా వింటున్నామని చెప్పాం. (మేం విన్నది మొత్తం మూడుసార్లే. కాని అలా అంటే వాడు సంతోషిస్తాడని!)

"అవునుగాని గోపాలం, శాస్త్రీయసంగీతం సాధన చేశావా?" అన్నాను.

"ఎందుకొచ్చిన శాస్త్రీయ సంగీతంలే మామయ్యా? ఎవడి క్కావాలది?"

"ఇంతకూ నీవు మద్రాసులో ఏం చేస్తున్నావు? ఎట్లా గడుస్తున్నది" అన్నాను.

"ఒక మ్యూజిక్ డైరెక్టరు దగ్గిర అసిస్టెంటుగా పనిచేస్తున్నాను. ఎప్పుడన్నా రేడియోవాళ్ళు పిలుస్తారు. ఫరవాలేదు. ఒకటి రెండు డబ్బింగు పిక్చర్ల ఛాన్సు తగిలింది. కాస్త డబ్బు బాంకులో వేసుకున్నాను కూడా." అన్నాడు గోపాలం.

డబ్బు బాంకులో వేసుకున్నానంటే రెండొందలో, మూడొందలో అనుకున్నాను. కాని కిందటేడు గోపాలం చేసిన ఫీట్లు తెలియవచ్చాయి. పట్నానికి పదిహేనుమైళ్ళ దూరంలో గోపాలమూ, ఇంకోడు కలిసి ఆరెకరాలు కొని, ప్లాట్లు వేసి ఇళ్ళస్థలాలకింద అమ్మి, చెరొక యాభైవేలూ చేసుకున్నారట. చెరో వెయ్యి గజాలు తమ సొంతానికి ఉంచుకున్నారట. అక్కడికి అయిదారు మైళ్ళ దూరాన గోపాలం పదెకరాలు కొని, బావి తవ్వించి, పంపుసెట్టు పెట్టి, సమస్తమైన కూరలూ పువ్వులూ పండించి, నెలకో అయిదారు వందలు సంపాదిస్తున్నాడు. వాడికి పెళ్ళి అయింది. ఒక ఆడపిల్ల కూడానూ. తన సొంత స్థలంలోనే మంచి ఇల్లూ, తోటా ఏర్పాటుచేసుకున్నాడు. ఇప్పుడు సినిమా గొడవలేమీలేవు. ఇటీవలనే తాంబరానికి మూడుమైళ్ళ దూరాన మరో పదెకరాలు కొని, ఇళ్ళస్థలాలుగా అమ్ముతున్నాడని తెలిసింది. మహాబలిపురం వెళ్ళేదారిలో కూడా ఏవో స్థలాలమ్ముతున్నారనీ, అందులో వాడికో భాగం ఉందనీ వింటున్నా. కనక అయ్యా-దైవాధీనపు జీవితం:

ముద్రణ : 1966, యువ దీపావళి ప్రత్యేక సంచిక

# కలిసిరావాలి

డబ్బు చెయ్యటం కూడా ఒక రొమాన్సే. ప్రణయకథలు ఆకర్షించటం మానేశాక ప్రతివాళ్ళు డబ్బు కథలు చదవాలి.

ఇది డబ్బుకథ. రొమాన్సు-అంటే నూటికి కోటికీ తప్ప జరిగే కథ కాదు. ఇందులో నీతికూడా ఉంది. ప్రపంచానికి డబ్బుతో అవసరం హెచ్చుతున్న కొద్దీ ప్రజలకు డబ్బుమీద అదోవిధమైన ఏవగింపు కలుగుతున్నది. ఇదీ పెద్ద పొరపాటు. డబ్బు ఆరోగ్యకారి. ఉల్లాసం యిస్తుంది. కీర్తి, ఘనతా యివ్వటం మాట చెప్పనే అక్కర్లేదు. డబ్బు విజ్ఞానం కూడా ఇస్తుంది. అనేక పుస్తకాలు చదివిన వాళ్ళూ, యెంతో అనుభవం ఉన్నవాళ్ళూ తెలుసుకోలేని సంగతులు డబ్బున్న వాడికి ఇట్టే తెలిసిపోతాయి. డబ్బున్నవాళ్ళు కవులకు యెట్లా కవిత్వం రాయాలో, చిత్రకారులకు బొమ్మలెట్లా గీయాలో, గాయకులకు పాటలెట్లా పాడాలో, నటులకు నాటకం ఎట్లా ఉండాలో చెప్పటం నేను స్వయంగా చూశాను. ఇంతే కాదు వాళ్ళు డబ్బున్న వాళ్ళు చెప్పినట్లు చెయ్యటం చూశాను. దాంతో నా సందేహాలు రహితమైనాయి.

దురదృష్టవశాత్తూ నేను కథానాయకుడి నిజమయిన ఊరూ పేరూ బయట పెట్టటానికిలేదు. సహజ వినయసంపన్నుడైన రంగయ్యగారు ప్రచారమంటే హడలిపోతాడు. గబ్బిలానికి చీకట్లో యెంత సుఖంగా ఉంటుందో అజ్ఞాతంగా ఉండటం రంగయ్యగారి కంత సుఖంగా ఉంటుంది. అందుచేత రంగయ్యగారి పేరు బయట పెట్టను.

అసలు రంగయ్యగారిది కుగ్రామం. ఆయన కడుబీద కుటుంబంలో జన్మించాడు. ఆయన చిన్నతనంలో ఏపూటా పొట్టనిండా తిని ఎరగడు. ఆయనకు వాళ్ళవాళ్ళు అక్షరాభ్యాసం కూడా చెయ్యలేదు. ఇప్పటికీ ఆయన నిరక్షరుడనే చెప్పాలి.

"చదువు రాకపోవటం నాకు చాలా లాభిస్తుంది. మన దేశానికి పాఠశాలలే అనర్థంగా ఉన్నాయని నా గట్టి నమ్మకం" అంటాడాయన.

పువ్వుపుట్టగానే పరిమళిస్తుంది. అతి బాల్యంనించీ కూడా రంగయ్యగారిలో డబ్బు కూడబెట్టే లక్షణమూ పొదంచేసే లక్షణమూ కూడా కనిపిస్తాయి. వాళ్ళింట్లో షావుల పెట్టెలోగాని, తండ్రి పడుకునే మంచంమీద దిండుక్రింద కానీ, అర్ధణా, బేడా, పావలా దొరికితే రంగయ్యగారు దాన్ని భద్రంగా తీసి ఎవరికంటా

పడకుండా దాచేవాడు. ఆయన తండ్రిగారి పాతికేళ్ళ హయాములోనూ దొరికినంత అప్పుచేశాడు గాని ఎర్ర ఏగాని కూడబెట్టిన పాపాన పోయి యెరగడు. రంగయ్య పదేళ్ళుదాటకముందే దాదాపు పదిరూపాయలు పోగుచేసి దాచాడు. రంగయ్య తండ్రి ఉత్తరక్రియలకు కూడా మిగుల్చుకోకుండా చచ్చిననాటికి రంగయ్య దగ్గిర పాతిక రూపాయలకు తక్కువలేవు. అయినా డబ్బు దుర్వ్యయం చేసే దురభ్యాసం లేనివాడు కావటం చేత తండ్రి దినవారాదికాలకు లోకుల్ని చందా వేసుకోనిచ్చాడు.

ఆ రోజుల్లోనే రంగయ్యకు పోటి పద్ధతిలో విశ్వాసం ఉండేది. ప్రపంచం యావత్తూ పోటీమీదే ఆధారపడింది. పాము కందకుండా తప్పించుకున్న కప్పలు పిల్లల్ని పెట్టి తమ వంశాలను వృద్ధిచేసుకుంటాయి. యుద్ధాలు జరిగితే చచ్చిన వాళ్ళు కీర్తి సంపాదిస్తే, బతికినవాళ్ళు రాజ్యాలేలారు. వ్యాపారంలో అవతలవాణ్ణి చంపగలవాడే నెగ్గుతాడు అంటాడాయన.

ఈ పోటీ పద్ధతి ననుసరించి రంగయ్య తనకంటె చిన్న పిల్లల చేతిలో కానీ అర్ధణా కనిపిస్తే వెంటనే పుచ్చేసుకునేవాడు. మనకంటె బలహీనుణ్ణి చెయ్యి దాటి పోకుండా ఉండటమూ మనకంటె బలవంతుడికి చిక్కకుండ ఉండటమూ పోటీలో ప్రధానాంశాలు.

"బలంతో గెలవదగిన వాడిని బలంతో గెలు. బలంతో గెలవలేనివాడిని యుక్తితో గెలు" అంటారు రంగయ్యగారు.

తాను జయించలేని వాళ్ళుంటూ ఉంటారని రంగయ్య ప్రాణం పోయినా ఒప్పుకోడు. అపజయమనే మాట ఆయన నిఘంటువులో లేదు. తనకంటె ధనికు లను చూస్తే ఏదో చెప్పరాని దాహమూ ఆకలి పుట్టుకొచ్చేవి. వాళ్ళ చేతిలో డబ్బు యెంత, ఎట్లా, ఎప్పుడు తన చేతిలోకి వస్తుందా అని నిద్రాహారాలు లేకుండా ఆలోచించేవాడు. కాని ధనికుల మీద ఆయన ఎప్పుడూ కోపంగాని అసూయగాని చూపేవాడుకాదు. చెట్టునున్న వంకాయ మీద మన కోపమూ, అసూయ చూపు తాము. తరుణం కోసం వేచివుండి, తప్పనిసరి అయితే చాటుగా కోసేసుకుంటాం బస్!

"నీళ్ళతో పనివుంటే చెరువు దగ్గిరికి పోవాలి. డబ్బుతో పనివుంటే డబ్బున్న వాళ్ళ దగ్గిరికి పోవాలి" అంటారు రంగయ్యగారు.

ఆయన యెప్పుడూ డబ్బున్న వాళ్ళవెంటే ఉండేవాడు. వాళ్ళు తనను హీనంగా చూస్తారని ఆయనకు విచారం లేదు. వాళ్ళు తిట్టినా, కొట్టినా, మీద ఉమ్మేసినా ఏమీ అనుకునే వాడుకాడు. కాళ్ళు బురదకాకుండా వ్యవసాయం ఎట్లా చేస్తావు?

"దురభిమానం డబ్బు విలువ తెలియనివాళ్ళ వినోదం ఖర్చుతో కూడుకున్నది." అంటారు రంగయ్యగారు.

రంగయ్య చిన్నతనంలోనే మనుషులను అర్థం చేసుకోవటానికి ప్రయత్నించేవాడు. "నీకర్థంగాని దాన్ని నీకు కావలసిన విధంగా మార్చలేవు" అని మార్క్సిస్టు సూత్రాన్ని రంగయ్య పసితనంలోనే అర్థంచేసుకున్నాడు.

వాళ్ళ ఊళ్ళో నెలకు ఇరవైరోజులు జూదం నడిచేది. రంగయ్య అక్కడ చేరి జూదం ఆడేవాళ్ళకు రకరకాల సహాయపడి రోజుకు అయిదారు రూపాయలు కూడా చేసుకునేవాడు. గెలుపు చేతులను ఉబ్బెయ్యటం రంగయ్యకు లాభించేది.

తండ్రి చచ్చిపోయిన పదేళ్ళకల్లా రంగయ్య ఏడెనిమిది వందలు కూడబెట్టాడు. మరొకడయితే ఆ డబ్బు ఏనాడో ఖర్చయేది. కొందరికి డబ్బు ఖర్చు చేయటం ఒక వినోదం. రంగయ్యకు ప్రాణకంటకం. డబ్బు ఖర్చు చెయ్యటంలో ఆనందం అనుభవించేవాడు కూడబెట్టలేడు. అది సిద్ధాంతము. కూడబెట్టే డబ్బు ఎంత అనే విచక్షణ లేదు. దమ్మిడీలూ, దమ్మిడీలో దశాంశాలు కూడా దబ్బే. డబ్బు కూడబెట్టటం ఒక తపస్సు. దానికి నియమాలున్నాయి. నీ అవసరాలు ఎంత వరకు కొనకుండా గడుస్తాయో చూడు. ఏది అవసరం అనేదాన్ని గురించికూడా ఇంకోడు చెప్పేది నమ్మకు. రోజుకు రెండుసార్లు తినడం అవసరమని నమ్మే వాళ్ళున్నారు. అది మూఢ విశ్వాసం. ఇటువంటి మూఢ విశ్వాసాలు చాలా వున్నాయి. అనేక జబ్బులు మందులు వెయ్యకుండానే పోతాయి. మందులతో రోగాలుపోతే డాక్టర్లు మట్టికొట్టుకుపోతారు. చాకలికీ, మంగలికీ ఇచ్చిన డబ్బు వట్టిదండగ. రంగయ్యగారు పుట్టుగడ్డం గొరిగించనే లేదు.

"నేను ప్రపంచంలో ఉండే బిచ్చగాళ్ళనూ, దరిద్రులనూ ఇప్పటికీ మరచిపోలేను. ఒకవేళ ఒక కానీ వృధా చేద్దామనుకుంటే ఆ కానీతో అవసరం ఉన్న అనాధలందరూ జ్ఞాపకం వస్తారు" అంటారు రంగయ్యగారు.

రంగయ్యగారు జీవితంలో ఎన్నడూ కాయకష్టం చెయ్యలేదు. "కాయకష్టం చేసేవాడు తనకుతానే సేవ చేసుకుంటాడు. నేను మొదటి నుంచీ ఒకరికింత ఉపకారం చేసి ధనం సంపాదించిన ప్రతి దమ్మిడి కూడా నేను లోకానికి చేసిన ఉపకారం చాటుతుంది."

ఇది నిజం. రంగయ్యగారు ఆ రోజుల్లో వడ్డీ వ్యాపారం చేసేవాడు. రాత్రికి బియ్యానికి లేనివాళ్ళూ అవసరంగా పదిరూపాయలు కావలసినవాళ్ళూ, పోలికాపరకా పట్టుకెళ్ళేవాళ్ళే వడ్డీ యిచ్చేవాళ్ళు. మంచివడ్డీయే ఇచ్చేవాళ్ళు. కాని నిర్బంధంలేదు. వాళ్ళంతట వాళ్ళు ఇష్టపడే ఆ వడ్డీకి ఒప్పుకునేవారు. కొందరు పదిరూపాయలు పట్టుకెళ్ళి నెలాఖరుకు ఇరవై చేత పెట్టేవాళ్ళు. కేవలం సంగతే

ఆలోచించకుండా డబ్బు దొరుకుతున్నది గదా అని పట్టుకుపొయ్యేవాళ్ళే, తరువాత పశ్చాత్తాపపడి రంగయ్యను తిట్టేవాళ్ళు. డబ్బు తిరిగి ఇవ్వలేక పోయేవాళ్ళు కోర్టుకు ఎక్కి అవసరమైన దానికంటే ఎక్కువ ఖర్చు చేసుకునేవాళ్ళు.

ఈ విధంగా రంగయ్య అనేక కుటుంబాలను తన పొట్ట పెట్టుకున్నాడని వాళ్ళ ఊళ్ళోవాళ్ళకు గుర్రుగా ఉండేది. కాని ఆ కుటుంబాలన్నీ చితికిపోయినవే. అవి ఎట్లాగూ దక్కేవికావు. రంగయ్య తెలివి గల వాడు గనక వాటిని తన పొట్ట పెట్టుకున్నాడు అంతే.

రంగయ్య ఎన్నడూ చట్టాన్ని వ్యతిరేకించ లేదు. చట్టాన్ని వ్యతిరేకించ కుండా బాగుపడేహక్కు ప్రతిమనిషికీ ఉంది. కొందరు అది చాతకాక చట్టంలోని నీతులు చెబుతారు. వాళ్ళనుచూస్తే రంగయ్య గారికి తగనిమంట. కాని, ఏ మాట కామాటే చెప్పాలి. లోకులు తనకు శాపనార్థాలు పెట్టారనీ, తనవాకిట్లో పేడా పెంటా వేశారనీ, తనమీద చాతబడులుకూడా చేయించారనీ ఆయనకు కోపంలేదు.

ఒకడి బాగు పదిమంది సహించరు. అది సిద్ధాంతం. అందరిచేతా మెప్పులు సంపాదించుకునే వాళ్ళు సర్వనాశనమై పోతారు. సర్వనాశనమై పొయ్యేవాళ్ళనే ప్రపంచం మెచ్చుకుంటుంది.

జీవితం అరాచకమైనది. చట్టం ఒప్పుకున్నా ప్రజలు ఒప్పుకోరు. రంగయ్య పాతికేళ్ళు దాటకమునుపే ఉన్న ఊరు వదలి పెట్టేశాడు.

పట్నానికి వచ్చినాక రంగయ్యకు అవకాశాలు హెచ్చాయి. ఇక్కడ మునిసి పాలిటీలున్నాయి. కక్షలున్నాయి. విభేదాలున్నాయి. వ్యాజ్యాలూ ఉన్నాయి. ఇవన్నీ డబ్బు సంపాదించటానికి సాధనలే. ఇద్దరు తగాదాపడి కోర్టుకెక్కితే ప్రైవేటుకూ, ప్లీడరుకూ, ప్లీడరుగుమాస్తాకూ, స్టాంపువెండరుకూ, ప్రభుత్వానికీ, కోర్టు అమీనా లకూ, కాఫీహోటళ్ళకూ, జట్కాబళ్ళకూ లాభం. మునిసిపాలిటీలలో రెండేసి పక్షాలు తగాదా పడితే ఇంకా ఎంతమందికి ఎంతేసి లాభాలుండొచ్చు?

ఒక స్త్రీ జీవితంలో చాలా కుళ్ళున్నది. డబ్బు పండించే వాడి కిదంతా ఎరువు. రంగయ్యగారు మునిసిపలు వ్యవహారాలలోనూ, కంట్రాక్టులు వగైరాలలోనూ తలదూర్చి ఉట్టుడియంగా డబ్బు చేసుకోసాగాడు. చాలామంది పలుకుబడి గల వాళ్ళ స్నేహం సంపాదించాడు. డబ్బు ఖర్చుచేసేవాడికి దొంగ స్నేహితులు చుట్టూ చేరుతారు. డబ్బు చేసేవాడికి నిజమైన నమ్మకస్తులు తటస్థపడతారు. డబ్బి స్తేనే ఎవరైనా పలుకుతారనేది భ్రమ. మనుషులు డబ్బునుచూసి ఎక్కువ భ్రమపడ తారు. చేతిలోకి వచ్చినడబ్బు మట్టితో సమానం. అందుబాటులోనికిరాని ఆడదాని మల్లేనే అందుబాటులోకి రాని డబ్బే మనిషిని ప్రబలంగా భ్రమపెడుతుంది. ఇది రంగయ్య స్వానుభవం. ఆడదాని మాటకాదు - డబ్బుమాట. రంగయ్య నిఘంటువులో ఆడవాళ్ళు లేరు.

ఇంతలో యుద్ధం వచ్చింది.[1] రంగయ్య పంట పూర్తిగా పండింది. యుద్ధం జరిగితే వస్తువులు దొరకవనేది చాలామందికి తెలుసు[2]. దాన్ని సరిగా వినియోగ పరచుకున్నవాడు రంగయ్య. అందిన వస్తువులల్లా చాలా కొనేశాడు. అన్నిటికన్నా బంగారం విరివిగా కొన్నాడు. అనేక కంట్రాక్టులు సంపాదించాడు. రెండు చేతులా డబ్బుగడించాడు.

రంగయ్యకు చదువు రాకపోవటం ఏమి అడ్డంరాలేదు. పెద్దపెద్ద చదువులు చదువుకున్నవాళ్ళు నెలకు యాభై రూపాయలు పుచ్చుకుని తనకు అవసరమైనంత సహాయం చేస్తారని రంగయ్య తెలుసుకున్నాడు. చదువుకున్నవాళ్ళు నమ్మకస్తులుగా ఉంటారు. ఇంకొకరి డబ్బుమీద వారికి ఆశవుండదు. వాళ్ళకి డబ్బు చెయ్యలేని లక్షణాలన్నీ ఉంటాయి. నీతి ఉంటుంది. ఇతరులలో ఈ లక్షణా లుండటం తనకు మంచిదని రంగయ్య తెలుసుకుని చదువుమీదా నీతిమీదా గౌరవం చూపసాగాడు. ఇతరులందరికీ చదువుండడం తనకెంత లాభమో, ఇతరులు నీతిగా ఉండడం తనకు లాభమని రంగయ్య గ్రహించాడు.

యుద్ధ సహాయం చేసాడని రంగయ్యను దేశద్రోహి అనేవాళ్ళు మూఢులు. రంగయ్య దేశభక్తికీ, దేశద్రోహానికీ కూడా అతీతుడు.

ఆయనకి రాజకీయాలతో ప్రసక్తిలేదు. అయినా యుద్ధాన్ని బలపరచినవాళ్ళను రంగయ్య బలపరిచాడు.

యుద్ధకాలంలో అనేక మందికి పరిశ్రమలమీద ఆసక్తిపుట్టటం కనిపెట్టాడు రంగయ్య. అనేకమందికన్న రంగయ్య అధికంగా డబ్బు చేశాడు గనక వాళ్ళు ఆయన సహాయంతో వ్యాపారాలు ఆరంభించటానికి సిద్ధపడ్డారు. ఇది తనకెట్లా లాభిస్తుందని రంగయ్య ఆలోచించాడు. వ్యాపారంలో ఉత్సాహం ఎంత సులభంగా పుడుతుందో నిరుత్సాహం కూడా అంత సులభంగానే పుడుతుంది. వ్యాపారంలో డబ్బు పెట్టిన వాళ్ళకు నిరుత్సాహం పుట్టిస్తే, వాళ్ళు తమ వాటాలు సగానికి సగం నష్టపడి అమ్ముకుపోతారు. కంపెనీలు పెట్టి రంగయ్య పాతికవేలు చేసుకున్నాడు. ఆ వ్యాపారాలు సాగనేలేదు. నష్టపడ్డవాళ్ళు రంగయ్యతో కలిసి పెట్టుబడి చేసిన వాళ్ళే[3].

1. రెండవ ప్రపంచ యుద్ధం (1939-1945) ప్రస్తావన. వివరాలకు ఇదే సంపుటంలోని వారసత్వం నవలలో చూడండి.

2. దొంగవ్యాపారం, సరుకుల కొరతా యుద్ధకాలంలో ఉండేది.

3 యుద్ధకాలంలోని లిమిటెడ్ కంపెనీల స్థాపకులు వారసత్వం నవలలోని రామ దాసు లాంటివాళ్ళు. రంగయ్య ఆ కోవలోని వ్యక్తే.

యుద్ధం మూలంగా రంగయ్య ఎంత డబ్బు చేసినా రంగయ్యకు యుద్ధం కంటె అంతకుపూర్వం వచ్చిన ఆర్థిక కాటకమే[1] బాగుంది. "కాటకంలో ప్రతి రూపాయి విలవా మూడు రూపాయలకు హెచ్చింది. నేను చౌక రూపాయలిచ్చి వడ్డీతో సహా ఖరీదైన రూపాయలు పుచ్చుకున్నాను. ఈ యుద్ధంలో రూపాయి ధర అయిదణాలకు దిగిపోయింది. రూపాయి రాదగినచోట ముప్పావలా కూడా రావటం లేదు. ధరలు ఎంత పెరిగినాయి!" అన్నాడు రంగయ్య. ఆయనకి ఆర్థిక పరిజ్ఞానం లేదని ఎవరనగలరు?

రంగయ్యనుంచి ఏదైనా నీతి నేర్చుకోవాలని ప్రయత్నించాను. కాని సాధ్యం కావటంలేదు. కారణమేమంటే, ఆయన డబ్బు అపరిమితంగా గడించుతున్న కొద్దీ ఆయన తాత్వికంగా క్షీణిస్తున్నట్టు కనిపిస్తున్నాడు. ఆయన సిద్ధాంతాలు ఏ కారణం చేతో ఇప్పుడు సూటిగా పనిచెయ్యకుండా ఉన్నాయి. ఒకప్పుడు చట్టాన్ని అతిక్రమించకుండా మహారాజులాగా డబ్బు కూడబెట్టిన రంగయ్యకు రాను రాను అడుగడుగునా చట్టం అడ్డువస్తున్నది. గడచిన పదిహేను నెలల కాలంలోనూ ఆయన రెండుసార్లు వెంట్రుక వాసిలో జైలు తప్పించుకున్నాడు.

ఆయన్నడిగితే చట్టాన్ని తిడతాడు. కాని నా అనుమానం ఏమిటంటే, ఆయన సిద్ధాంతాలను అతిక్రమించి ఆయన ఏదో ఒకటి చేస్తేగాని ఇంకమీదట డబ్బుచేయడం సాధ్యంకాదు. కొత్తసిద్ధాంతాలు ఆయన అందుబాటులోకి రాకుండా ఉన్నాయి. ఆయన మనస్సు ఏ విధంగా పనిచేస్తున్నదీ నేను పరిశీలనగా చూస్తూ వస్తున్నాను.

దేశానికి స్వాతంత్ర్యం రావటం అనర్థమయింది.[2] ఈ కాంగ్రెసువాళ్ళే అన్నిటికీ అడ్డంగా ఉన్నారు. ఒక్క అరడజనుమంది దొంగవెధవల్ని చంపి పారేస్తేగాని పరిస్థితులు బాగుపడవు అన్న అభిప్రాయాలు ఆయన నోట విన్నాను.

ఈ అభిప్రాయాలు సరియయినవి కావని నేను నొక్కి వక్కాణించగలను. స్వరాజ్యం రావటంవల్ల ధనికుల చిక్కులు హెచ్చలేదు. కాంగ్రెసువాళ్ళు ధనిక వర్గానికి ద్రోహం చేస్తున్నారనటానికి ఏమీ ఆధారంలేదు. ఇక హత్యలంటారా, రంగయ్యకు సంబంధించినంతవరకూ అవి గొంతెమ్మ కోరికలే.

---

1. ఆర్థిక కాటకం (1929-1934) వారసత్వం నవలలోని 8 వ అధ్యాయం చూడండి.

2. 1947 ఆగష్టు 15న వచ్చిన స్వాతంత్ర్యం.

ఏమీ సందేహం లేదు. డబ్బు రంగయ్యను ఓడగొట్టుతున్నది. ఈనాటి స్వాతంత్ర్య వాతావరణంలో చల్లని కాంగ్రెసు పరిపాలన కిందా, లేదా హత్యలు చేసీ లక్షలూ కోట్లూ చేసుకోగలవారి జాబితాలో రంగయ్య పేరుచేరే అవకాశాలు కనిపించడం లేదు. రంగయ్య మెడతాడు బిగలాగుకుంటున్నది. ఇక ముందరికి పోవటానికి ఎంత ప్రయత్నం చేస్తే అంతగా మెడ బిగుసుకుంటుంది. నలభై దాటినై. ఇక రంగయ్య మారలేడు. తన మనస్తత్వాన్ని సిద్ధాంతాలనూ మార్చు కోలేడు. సాంఘికంగా ఆయనకు తోడ్పడదగిన వాళ్ళుకూడా దగ్గిరలేరు. రాబందులు మూగుతున్నాయి. ఇద్దరు టోపీదాసులు ఎగుమతి పర్మిట్లు సంపా దించి పెడతామని రంగయ్యచేత పదేసివేలు ఖర్చుపెట్టించి దాటిపోయారు. ఈః భాగ్యంతో రంగయ్య చితికిపోడు గాని, ఇంకా మిగిలివున్న రంగయ్యసొమ్ము ఎలా హరించి పోతుందో చూడవలసి వుంది. రంగయ్య డబ్బులో కనీసం ఒక వెయ్యి అయినా నా చేతిమీదగా హరించేటట్టు చేసుకునే తాహతు నాకు లేనందుకు నాకే ఎంతో విచారంగా వుంది.

ప్రచురణ : (ప్రచురణ తేదీలేదు) దుక్కిటెద్దు కథల సంపుటిలో
జయా పబ్లికేషన్స్, విజయవాడ.

# అట్టడుగు

నేను స్వతహాగా బంధు ప్రియుణ్ణి కానుగాని, ఏడెనిమిదేళ్ళు బంధువు లందరికీ ఎడమైపోయి, దేశంకాని దేశంలో ఉండటం మూలాన కొంత బంధుప్రేమ నాలో కూడుకుంది. అందుచేత రాములు రాసిన ఉత్తరం చేతికందగానే ఎంతో ఆత్రంగా చించి చదవసాగాను.

పన్నెండు పేజీల ఉత్తరం రాశాడు రాములు. ఆ కాగితాలబొత్తి చూడ గానే నాకు నవ్వొచ్చింది. రాములు మారలేదు. ఒకప్పుడు వాడూ నేనూ చాట భారత మంత ఉత్తరాలు రాసుకునేవాళ్ళం. ఏం రాసేవాళ్ళమో నాకిప్పుడేమీ తెలీదు. కాని ఆ రోజుల్లో ఆ ఉత్తరాలు మా కిచ్చిన ఆనందం ఏ సాహిత్యమూ ఇచ్చేదికాదు. అయితే నాకు పెద్ద ఉత్తరాలు రాసేశక్తి ఏనాడో పోయింది. స్థల వాతావరణాలు మారగానే నేనూ మారిపోయాను. ఉన్నచోటే ఉండటంవల్ల రాములు మారలేదు. నేను కాస్త ప్రోత్సాహమిస్తే వాడు ఇవాళ కూడా వారానికో పన్నెండు పేజీల ఉత్తరం రాసిపారెయ్యగలడు.

మనిషి తన అహంకారంకొద్దీ తన స్వచ్ఛయికు లేని ఆధిక్యం అంటగట్టు కుంటాడు. మానవ చరిత్రా, మానవ సంస్థలూ, మానవ ధర్మచట్టాలూకూడా మానవుడికి లేని శక్తుల్ని అంటగట్టుతున్నాయేమో, తప్పులు చెయ్యటానికీ ఒప్పులు చెయ్యటానికీ సంఘాన్నీ చరిత్రనీ మార్చటానికీ వ్యక్తులు మనం ఊహించేటంత సమర్థులు కారేమో. మానవ సామాజికశక్తుల్ని నేను శంకించటం లేదు. ఆ శక్తులే లేకపోతే ఇంతగా నాగరికతా సంస్కారాలు పెరగవు. కాని వ్యక్తుల్ని చూసినప్పుడు వాళ్ళకీ వాతావరణాన్నిబట్టి మారే ఇతర ప్రాణులకీ పెద్ద వ్యత్యాసం కనబడదు. చీడపట్టి చెడిపోయే చెట్లనీ, ఎరువు బాగావేస్తే బాగాపండే పొలాలనీ, ఆహారం చూడగానే తోక ఆడించే కుక్కల్నీ అర్థం చేసు కున్నట్టుగా "తప్పుడు" పనులూ, "మంచి" పనులూ చేసే మనుషుల్ని అర్థం చేసుకోమనిపిస్తుంది. కన్నం వెయ్యటమూ వెయ్యక పోవటమూ నిర్ణయించుకునే అధికారం దొంగకీ, యుద్ధరంగంలో చావటమూ, చావక పోవటమూ నిర్ణయించుకునే శక్తి సైనికుడికీ ఉన్నట్టు మనం నటిస్తాం. ఈ నటన మీదే మన సాంఘిక విశ్వాసాలూ, నైతిక ధార్మిక విశ్వాసాలూ ఆధారపడ్డట్టు కనిపిస్తుంది. అన్ని నియమాలూ గాలికి వొదిలేసి అథాతికంగా బతకాలని కూడా

నా అభిప్రాయం కాదు. నేనడిగేదల్లా ఏమిటంటే మనం మనుషుల్ని మార్చటానికి చేసే ప్రయత్నంలోనూ వ్యయంలోనూ సగానికి సగమైనా వాతావరణాన్ని మార్చటానికి ఎందుకు చేయమూ అని; ఎవరన్నా వాతావరణాన్ని మార్చటానికి ప్రయత్నం సాగిస్తే వాళ్ళు దేశ ద్రోహులనో సంఘ ద్రోహులనో రుజువు చెయ్యటానికి ఎందుకు ప్రయత్నిస్తామూ అని.

## 2

రాములు వ్రాసిన ఉత్తరం ఆత్రంగా చదవసాగాను. ఒక్కొక్క పంక్తి చదువుతున్న కొద్దీ నా వుత్సాహం నీరుకారిపోసాగింది. అంత ఉత్తరంలోనూ ఒక్క మంచి వార్త ఉన్నట్టు నా బుద్ధికి తోచలేదు. కాని రాములు ఆ వార్తలన్నీ మామూలు వార్తలల్లేనే రాశాడు.

మా బంధువులు అంతా ఒక దారీ అయినారు. యుద్ధం మూలంగా[1] కాలాలు కొందరు చాలా దూరం వెళ్ళారు. వాళ్ళందరికన్నా దూరం వెళ్ళిన నన్ను గురించి నాకు జాలి కలగలేదు. కాని వాళ్ళనిగురించి చాలా జాలేసింది. కొందరికి పిల్లలు పోయినారు. కొందరికి మొగుళ్ళూ, పెళ్ళాలూ పోయినారు. కొందరు ఆస్తులమ్మేసుకున్నారు. కొందరి పెళ్ళిళ్ళయినై. మరికొందరు కాపరాలికి వెళ్ళారు. చాలామందికి ఇద్దరు ముగ్గురేసి పిల్లలుకూడా కలిగారు. ఎందుచేతో ఈ వార్తలు కూడా నాకు దుర్వార్తలల్లేనే తోచినై.

నేను ఇట్లా ఇవతలికి వచ్చెయ్యగానే మా బంధువుల జీవితమంతా నానా రభసా అయినట్టూ, నేను అక్కడే ఉన్నట్టయితే ఇవేమీ జరగనట్టూ నాకు అనిపించింది. అసలు రహస్య మేమంటే, ప్రత్యక్షంగా జరిగే ఏ మార్పునైనా సహించి మనసు సరిపెట్టుకోవచ్చు. కాని పరోక్షంగా జరిగే మార్పులు గురించి మనసు సమాధానపరచుకోవటం చాలా కష్టం. అందుచేతనే మరో దేశంలో జరిగే విప్లవాలూ మరోవర్గం వాళ్ళు చేసే విప్లవాలూ మనని ఆందోళన పెడతై.

## 3

నిరుత్సాహంగా రాములు వ్రాసిన ఉత్తరం చదువుకు పోసాగాను. అకస్మాత్తుగా నా కళ్ళు నమ్మలేని విషయాలు ఉత్తరంలో కనిపించినై. వాటిని ఒకంతట నా బుద్ధి అవగాహన చేసుకోలేక పోయింది. ఆ నాలుగు పంక్తులే అరడజను సార్లయినా చదివి ఉంటాను - యింకోసారి చదివితే అక్షరాలు మారిపోతాయనే

1. రెండవ ప్రపంచయుద్ధం (1939-1945) ప్రస్తావన. వివరాలకు ఇదే సంపుటిలోని వారసత్వం నవలలో చూడండి.

ఆశతో, నేను తప్పు చదువుతున్నానేమో అనే భ్రమతో అందులోవున్న విషయం గురించి నా తల ఆలోచించకుండా కాస్సేపయినా వాయిదా వేసుకునే ప్రయత్నంలో;

కాని ఏం లాభం? ఆ అక్షరాలు మారవు. నేను సరిగానే చదివానని అర డజను సార్లు రుజువయింది. గణపతి బిచ్చ మెత్తుతున్నాడనే విషయాన్ని గురించి ఆలోచించటం అయిదు నిమిషాలు వాయిదా వేశాను; ఇంకెంతసేపు వాయిదా వెయ్యను?

అయినా యింత ఘోర వార్తను గురించి అనుకునేటందుకు మాత్రం ఏముందీ? నేను ఈ దూరదేశంలో ముష్టెత్తి బతుకుతున్నానంటే గణపతి ఏమనుకుంటాడు? నేను ఊహించలేనా? యింకా అదేనయం. ఇక్కడ నేను ముష్టెత్తినా నన్నడిగే వాడుండడు. వాడు పాపం. పుట్టి పెరిగినచోట మానం వొదిలేసుకుని ముష్టి ఎట్లా ఎత్తుతున్నాడు? ముష్టెత్తటానికి వెనక ఎంత వంశాచారం వుండాలి? ఎంత స్వానుభవం వుండాలి? అదంతా గణపతి కెక్కణ్ణుంచి వస్తుంది? గడవక వాడు ముష్టెత్తినా మిగిలిన మా బంధువులు వాణ్ణెట్లా ముష్టి ఎత్తనిస్తున్నారు?

నాకు అకస్మాత్తుగా రాములుమీద పట్టరాని ఆగ్రహం వచ్చింది. రాములేం చేస్తున్నాడు?

ఎవరు గానీ హేయమైన సంఘటనలు నిర్లిప్తులై ఎట్లా చూస్తారో నాకు తెలీదు. మనం చూస్తూ వుండగా ఎవరన్నా ఎట్లా తిండికి మాడి చస్తారు? జీవితాన్ని గమనించటమే చాతనయి దాన్ని మార్చటం ఏ మాత్రము చాతకానట్టు ప్రవర్తించే వాళ్ళని నేను సహించలేను. "ఇవాళ కలకత్తా వీధుల్లో యింతమంది తిండిలేక చనిపోయినారు" అని ఏ విలేఖరిగాని ఏ పత్రికకైనా వార్త పంపినట్టు చదవగానే నా రక్తం వుడికిపోయేది - ఈ విలేఖరి అందులో ఒకడికైనా తిండి ఎందుకు పెట్టలేకపోయినాడు- ఈ విషయం టెలిగ్రామిచ్చే డబ్బుతో ఒక్కడికైనా యింత గంజినీళ్ళు పొయ్యటానికి సాధ్యం కాదా?

అయినా పొరపాటు నాదేనేమో, ప్రపంచంనిండా వార్తా విలేఖరులున్నారు. తాము మార్చగల సంఘటనలకు సహితం వాళ్ళు పత్రికలకు పంపిస్తారు. సంఘటనలని మార్చటం నేననుకున్నంత సులభం కాదేమో.

రాములు తినటాని కింత కలవాడు. గణపతి నా అంత దగ్గిర చుట్టం కూడాను. "గణపతీ, వాడి భార్యా, పిల్లలూ మాడుతుంటే తెచ్చిపెట్టాను. మా అందరికీ సరిపడే తిండి లేకపోవటంచేత అందరమూ ఒక పూటే తిండి తిని మరో పూట పస్తులుంటున్నాము" అని రాములురాస్తే నాకా వార్త సవ్యంగా తోచి వుండేది. పోనీ అంతదాకా వద్దు; "గణపతికి నేను నెలకొక పది పంపుతున్నాను" అని రాము లెందుకు రాయలేదో నా కర్థం కాలేదు.

ఈ మాట నాకు తోచగానే వుత్తరం మడిచి జేబులో పెట్టి గణపతి పేర ఇరవై రూపాయలు మనియార్డరు చేశాను.

# 4

ఆఫీసులో ఇరవై రోజుల శలవూ, బాంకులో రెండువందల రూపాయలూ పేరుకుని వున్నై. అవి రెండూ ఖర్చుచేసి మా వాళ్ళందర్నీ చూసిరావాలని కోరిక పుట్టింది.

బయల్దేరాను.

బంధువుల్ని ఒక్కొక్కరిని చూడటం ఆనందంగానే ఉన్నది. కాని ఒక్కొక్క ఇంటా ఒక్కొక్క రోజూ, పూటా గడిపి వెళ్ళిపోవటం వట్టి వంచనగా కనబడింది. వాళ్ళ జీవితములో[1] భాగం పంచుకొనటంలోనే నిజమైన బంధుప్రేమ వుందిగాని, ఇట్లా కొన్ని ఏళ్ళ కొకసారి కనిపించి మర్యాద చేయించుకుని దాటిపోవటంలో నిజమైన తృప్తి ఏమాత్రమూ లేదు.

కావలిస్తే నేను వీళ్ళందరితోనూ ఇంకా కొంతకాలం గడపగలను కాని, రాముల్నీ గణపతినీ ఎప్పుడు చూద్దామా అని ఆదుర్దాగా ఉంది.

గణపతిని గురించి ఆలోచించాను. వాడు ఎందునా కాకుండా చెడ్డాడు. వాళ్ళ నాన్న బతికి ఉండగా బాగానే సంపాదించాడు. అంతకంటే బాగా ఖర్చు పెట్టాడు. ఆ రోజుల్లో ఆయనకు అక్కర్లేనిదిలేదు. మరి మా వూళ్ళో కాంగ్రెసు ఉద్యమం[2] సహం ఆయన నెత్తిమీదగానే పోయింది. గణపతి స్కూలులో చదువు కుంటుంటే మానిపించి మా వూళ్ళో పెట్టిన జాతీయ విద్యాలయంలో[3] వాడిచేత నవారు నేయించాడు. ఇంట్లో కూడా రాట్నాలు పెట్టి నూలు తీయించాడు. జాతీయ

---

1. కా.కు. శైలికి సరిపడని కావ్యభాషా ప్రయోగం.

2. కాంగ్రెసు పార్టీ ఆధిపత్యంలో జరిగిన ఉద్యమం.

3. జాతీయోద్యమ నిర్మాణ కార్యక్రమాల్లో భాగంగా ఆంధ్రలో వెలసిన జాతీయ పాఠశాలలు. 1921 జూన్ నాటికి ఈ పాఠశాలల్లో 275 మంది విద్యార్థులుండేవారు. ఏలూరు జాతీయ కళాశాలను గాంధీజీ ప్రారంభోత్సవం చేశారు. జాతీయ దృక్పథం కలిగిన చరిత్ర బోధనా, హిందీ భాషాభ్యసనమూ, రాట్నం వడకడమూ, నేతా, వడ్రంగమూ మొదలైన వృత్తుల్లో తరిఫీదూ జాతీయ విద్యాలయాలు చేపట్టిన కార్యక్రమాలు.

విద్యాలయం మూలబడి ఆ జాగాలో ఒక పిండిమర, ఒక వ(స్త్ర)ంగపు కార్ఖానా ఏర్ప డ్డాక గణపతికి అమరకోశమూ,[1] శబ్దమంజరీ,[2] పంచకావ్యాలూ[3] చెప్పించాడు.

ఆయన చచ్చిపోగానే గణపతి సంసారం బయటపడింది. ఆయన కొని పెట్టిన రెండువందల యాభై గజాల నివేశస్థలంలో ఆయన మిగిల్చి పోయిన రెండువందలలో మిగిలినదాంతో ఒక చిన్న కుటీరం వేసుకున్నారు. గణపతి తల్లి తన మెడలో వున్న నాలుగు సొమ్ములూ అమ్మింది. దాంతో కాలక్షేపం ఆరంభించారు.

గణపతి ఎట్లాగైనా నెలకో పది రూపాయలు సంపాదింతామని చాలా ప్రయత్నం చేశాడు. కోమటి గుమాస్తాగిరీ చేశాడు. ప్లీడరు వాలంటీరుగా పని చేశాడు. ఎవరికో పిల్లలికి సంస్కృతము కూడా చెప్పాడు. ఒక నెల సంపాదిస్తే మరొక నెల ఏమి ఉండేదికాదు. ఆఖరుకు వాడి సమస్య ఒక విధంగా పరిష్కార మయింది. గణపతి తాత తమ్ము డొకాయన చచ్చిపోగా ఆస్తిలో నాలు గెకరాలు వచ్చింది. అది గణపతి జీవితంలో పెద్ద పరిణామం. ఆ రోజుల్లోనే నేను దేశం విడిచి వెళ్ళాను.

మా బంధువు లందరిలోకి జీవిత యథార్థాన్ని గుర్తించినవాడు ఆ రోజుల్లో గణపతి ఒక్కడే. మా మాదిరిగా ఇంగ్లీషు చదువు చదివి కృతక సంస్కారం సంపాదించక పోవడమువల్లనో, ఏమో గణపతి డబ్బు తత్వము, సంఘ తత్వము బాగా కనుగొన్నాడు.

"వీ డెప్పుడో కమ్యూనిస్టుల్లో చేరిపోతాడురా" అని మేం నవ్వుకునేవాళ్ళం

అటువంటివాడు ముష్టి ఎత్తుకునే స్థితికి వచ్చాడంటే యీపాటికి కమ్యూనిస్టు అయ్యే ఉంటాడనుకున్నాను. 1937 లో కాంగ్రెసు ప్రభుత్వం రాగానే గణపతి నలుగురు పెద్దల్ని చూశాడు. వాళ్ళు చాలా మంచిగానే మాట్లాడారు. కాని వాడికేమీ చెయ్యలేకపోయినారు. కాంగ్రెసు వాడైనంతమాత్రాన ఏం లాభం? గణపతి తండ్రి రాజకీయవేత్తకాదు. పైగా బతికిలేడు. కాంగ్రెసు నిజమైన రాజకీయంలో దిగగానే రాజకీయవేత్తలుకాని కాంగ్రెసు వాళ్ళంతా అడుక్కు దిగిపోయినారు. గణపతి అట్టడుక్కు జారిపోయినాడు పాపం.

---

1. అమరకోశం-కర్త అమర సింహుడు, సంస్కృతకోశం.
2. శబ్ద మంజరీ-నడిమింటి సంగమేశ్వరశాస్త్రి సంస్కృత భాషను నేర్చుకో టానికి రాసిన చిన్న గ్రంథం.
3. పంచకావ్యాలు - తెలుగులో : శృగార నైషధం, మనుచరిత్ర, ఆముక్త మాల్యద, వసుచరిత్ర, పాండురంగ మహాత్మ్యము.

# 5

నేను మొదట రాములు దగ్గిరికే వెళ్ళాను తీరా ఊళ్ళోకి వచ్చినాక నేరుగా గణపతి దగ్గిరకి వెళ్ళటానికి గుండె చాలలేదు.

నన్ను చూడగానే రాములు ప్రాణం లేచివచ్చినట్టు మాట్లాడాడు. వాడి ఉత్సాహంలో నేను సహంకూడా చూపలేకపోయినాను.

సాధ్యమైనంత పెందలాడే గణపతి మాట ఎత్తాను.

"గణపతికేంరా? షైలాపచ్చీసుగా ఉంది వాడిపని" అన్నాడు రాములు.

రాములు అట్లా ఎట్లా మాట్లాడగలిగాడో నా కర్థంకాలేదు. వాడేనా మారలేదని నేను అనుకున్నాను. ఎంత పొరపాటు!

"అడుక్కు తినటం నీకు వేళాకోళంగా ఉందా?" అన్నాను.

రాములు ఇంత మొహం చేసుకున్నాడు. పశ్చాత్తాప మనుకున్నాను. నా మాటకు చిన్నబుచ్చుకున్నాడని నాకు తెలియలేదు.

"అడుక్కుతినని దెవరులే?" అన్నాడు వాడు అసందర్భంగా.

ఎందుకో నాకు రాములు దగ్గిర ఇక గణపతి గురించి మాట్లాడ బుద్ధి కాలేదు. గణపతిని అడుక్కుతిననిచ్చిన తప్పు తనమీదకూడా అంతో ఇంతో వుందని గుర్తించటం ఇష్టంలేక, రాములు గణపతి పని షైలా పచ్చీసుగా ఉందనీ, అందరూ అడుక్కుతినే వాళ్ళేననీ తన అంతరాత్మను సమాధానపరచుకుంటున్నాడు కాబోలనుకున్నాను.

కాస్సేపు అదీ ఇదీ మాట్లాడి నేను గణపతి ఇంటికి బయలుదేరుతూ రాముల్ని వస్తావా అని అడిగాను. వాడు బయల్దేరడనుకున్నానుగాని నా అంచనా తప్పింది.

ఇద్దరమూ కలిసి గణపతి ఇంటికి బయలుదేరాము.

గణపతి ఇంట్లో లేడు. వాడి తల్లి పదిమందికి సరిపడే వంకాయలూ, తోటకూరా, పచ్చిమిరపకాయలూ, తియ్యే కంపగడ్డా చుట్టూ పెట్టుకుని కూరలు తరుగుతున్నది. తద్దినమో ఏమో అనుకున్నాను.

"ఏమమ్మా అత్తయ్యా! ఎట్లా ఉన్నారు?" అన్నాను.

"ఎప్పుడొచ్చావురా? రా. కూచో. ఎట్లా ఉన్నాం? అట్లాగే ఉన్నాం. గణపతి బియ్యం తేబోయినాడు ఇప్పుడే వస్తాడు" అన్నది గణపతి తల్లి.

"గణపతి ఏదన్నా ఉద్యోగం సంపాదించలేకపోయినాడా?" అన్నాను.

"ఆఁ. ఏం ఉద్యోగాలు? ఏం వస్తుంది ఉద్యోగాలు చేస్తే? నువ్వు చూడరాదూ" అక్కడెక్కడో ఉండి ఏం సంపాదిస్తున్నావు?"

చూస్తుండగానే గణపతి తల్లి అన్ని కూరలు తరిగి కోడల్ని పిలిచింది. గణపతి పెళ్ళాం దొడ్లోనించి లోపలికి వచ్చి కూరలు తీసుకుని వంట యింట్లోకి పోయింది.

గణపతి భార్య బాగా వొళ్ళు చేసింది. ఆవిడ పట్టుచీర కట్టుకుని వుండటం గమనించాను.

ఈ ఇంటో నే నూహించిన వాతావరణం లేదు. ఎందుచేతా? నాకర్థం గాలేదు.

బయట అడుగుల చప్పుడయింది. గణపతి వస్తున్నాడేమో అని వాకిట్లో తొంగిచూశాను. గణపతి కాదు - ఎవరో నడివయస్సు మనిషి. "పిన్నీ! రెండు రూపాయల దియ్యం ఇప్పించమ్మా!" అంటూ వచ్చింది.

"అయ్యో, పాపం దియ్యం లేవే?" అన్నది గణపతి తల్లి.

"ఇదుగోనమ్మా డబ్బు" అంటూ ఆ వచ్చిన మనిషి నిష్ఠూరంగా అన్నది.

"కిందటిసారి పట్టుకెళ్ళినదానికో?" అన్నది గణపతి తల్లి.

"రేపిస్తాలే."

గణపతి తల్లి రెండు రూపాయలూ తీసుకుని లోపలికి వెళ్ళి కాస్సేపు బియ్యం చప్పుడు చేసి, ఒక చేటలో కాసిన బియ్యం పోసుకుని వచ్చింది.

"ఏమిటిదీ?" అన్నది బియ్యం కోసం వచ్చిన మనిషి దాష్టికంగా.

"చెప్పలా లేవనీ? రూపాయి వున్నై. తీసుకుపో."

"అవ్వ! యివి రూపాయివా?"

గణపతి తల్లి మారుమాట లేకుండా చేట తీసుకుని లోపలికి పోతున్నది.

"తే తే! ఏం చేస్తాం?" అంటూ ఆ మనిషి బియ్యం ఒళ్ళో పోసుకు పోయింది.

ఏ వీరేశలింగంగారి ప్రహసనమో! చూస్తున్నట్టుగా వుంది నాకు.

మా గణపతి తల్లికి మాత్రం ఇదంతా పరిపాటే గామాలు. ఆవిడ ఏమీ జరగనట్లు రాములుతో, "అయితే రాములూ! ఆ పదిహేను రూపాయిలూ పట్టుకు పోయినవాడు మళ్ళీ అయిపులేడే!" అన్నది.

"వాడెక్కడికి పోతాడులే, వస్తాడు" అన్నాడు రాములు.

ఒక్కసారి వాడి చూపులూ నా చూపులూ కలిసినై. నేనే మొహం తిప్పుకున్నాను.

---

1. కందుకూరి వీరేశలింగం (1848-1919) రాసిన ప్రహసనం ప్రస్తావన ఇదే సంపుటిలోని 'ఐశ్వర్యం' నవలలో కూడా కందుకూరి ప్రహసనాల ప్రస్తావన చూడండి.

కాస్సేపటికి గణపతి వచ్చాడు. వాణ్ణి నేను గుర్తించలేదు. పైన చొక్కా లేదు. మొహాన ఇంత కుంకం బొట్టు, మెళ్ళో రుద్రాక్షలు, పిలకలో ఒక చిన్న సందివర్ధన పువ్వు. మనిషి అతి విచిత్రంగా మారాడు. వాడి చంకలో జోలి బరువుగా ఉంది. ఒక్క ఊపు ఊపి గిర్రున తిప్పి, రెండు చేతులతోనూ కింద దింపాడు. జోలెలోనుంచి ఒక బూడిద గుమ్మడికాయ తీశాడు.

"గుమ్మడికాయ లెచ్చాను, వొడియాలు పెటంత్రరా!" అన్నాడు గణపతి. ఆ తరువాత నాకేసి తిరిగి, "ఎప్పుడొచ్చా?" అన్నాడు.

"ఇప్పుడే" అన్నాను.

"ఏమే! ఇది లోపలికి పట్టుకెళ్ళు.... కులాసా?" అన్నాడు మళ్ళీ.

"ఉన్నానిట్లా!" అన్నాను.

"వెంకట్రామయ్య గారు రామాయణం చెప్పమంటున్నారే అమ్మా!" అన్నాడు గణపతి.

గణపతి తల్లి మొహం వికసించింది.

"అట్లాగా? ఆయన పాపం, పిసినిగొటు వెధవకాడు. ఆ లక్ష్మీకాంతం ఉన్నాడే, వాడినోట పుండుపడ, వాడి పేరు చెపితేనే నాకు మండిపోతుంది-" అని ఆవిడ మెటికలు విరవసాగింది.

రాములు నవ్వుతూ, "లక్ష్మీకాంతం డబ్బివ్వలేదురా గణపతీ?" అన్నాడు.

"ఇచ్చాడులే, బాకీ తీర్చినటు అదా పైసలతోసహా" అన్నాడు గణపతి మొహం మటమట లాడించి.

"అదికాదు, రాములూ! నెలరోజులు పురాణం చెప్పించుకున్న వెధవా, ఆవరి రోజున్నా ఇంతభోజనం పెటి, పటు తాపితాలు కాకపోతేమానె, ధోవతుల చాపన్నా పెట్టడూ? పురాణం చెప్పినచోట ఇంత సమారాధన చేసుకోకపోతే నెత్తి అడవదూ? ఆరునెలల్లో చూడు, వాడికొంప కాలకపోతే" అంటూ గణపతి తల్లి శాపెంచింది.

గణపతి నాతో ఇక మాట్లాడేటట్టు కనబడలేదు. కనీసం నేను పంపిన డబ్బు మాటన్నా ఎత్తుతాడేమో అనుకున్నాను. అదేమీ లేదు. వాడు నేరుగా దొడ్లోకిపోయి కాళ్ళు చేతులు కడుక్కొని, తడి అంగగోస్త్రం చుట్టుకుని వంటయింట్లోకి పోయి, మడిబట్ట ధరించి దేవతార్చనకో కూర్చుని కన్నుమూశాడు.

"పోదాం రాములూ!" అన్నాను.

"మా యింట్లో భోంచెయ్యవా?" అన్నది గణపతి తల్లి.

"వెన్నెలోపుగా వస్తాలె" అన్నాను.

"ముప్పెత్తుకొని గణపతి తగ్గాడనుకుంటున్నావు. వాడి లెక్కలో చాలా పైకి వచ్చాడు.

ఇప్పుడు వాడికి డబ్బున్నవాళ్ళ ప్రాపకం ఉంది. ఇన్నాళ్ళూ వాణ్ణి ఉపేక్షించిన కాంగ్రెసువాళ్ళు వాణ్ణిప్పుడు చేరదీశారు. ఈ ఊళ్ళో కొత్త ధనిక వర్గం ఏర్పడింది - దొంగవ్యాపారస్తులు, పరిమిట్లవాళ్ళూనూ! వాళ్ళంతా మనవాడికి పోషకులు. నువ్వూ నేను వాడి కిప్పుడొక మనుషులల్లే కనిపించం. వాడిప్పుడు బియ్యం అమ్మి, డబ్బు వడ్డీలకిచ్చి, డబ్బున్నవాళ్ళని పొగడి చక్కగా బతుకుతున్నాడు. భాగ్యవంతుల పెళ్ళాలు వాడి భార్యకి తాము విడిచేసిన ఖరీదైన చీరెలిస్తారు. ఆవిడ కళ్ళకద్దుకుని స్వీకరిస్తుంది. నువ్వూ, నేనూ ఉద్యోగాలు చేస్తున్నామని గణపతి మననిచూసి జాలిపడుతాడు. లోపల ఏవగించుకుంటాడు కూడా. మనకన్న డబ్బుండి, మనకు ఉద్యోగాలు యివ్వగలవాళ్ళు మనకన్న పెద్దతరగతివాళ్ళని ఒప్పుకోం మనం. వాడు ఒప్పుకుంటాడు. వాళ్ళతో సమంగా తన సాంఘిక, రాజకీయ హక్కులు కావాలని వాడు కోరడు. వాడు పురాణం చెబుతుంటే వినాలి. అందులో కూలిజనాన్నీ, సోషలిస్టులనీ, కమ్యూనిస్టులనీ వాడు తిట్టటం వినితీరాలి. నువ్విదివరలో రాజకీయ పురాణాలు[1] వినివుండవు. ఫరవాలేదు, తరించాడు" అన్నాడు రాములు.

"అవును. నిలువుగా తరించాడు, అట్టడుగు తాకాడు" అన్నాను.

ప్రచురణ : (ప్రచురణ తేదీ అలభ్యం)
కథా సాగరం, సంపుటిలో
దేశికవితా మండలి, విజయవాడ.

1. రాజకీయ ప్రత్యర్థులను ప్రధానంగా వామపక్ష ప్రత్యర్థులను తిట్టే తిట్ల పురాణాలు.

# సద్యోగం

అర్జంటు పనిమీద వాల్తేరు బయలుదేరాను. త్వరగా వెళ్ళి ఇంటరు క్లాసులో పక్క పరుచుకుంటే ఆ తరవాత అడిగేవాడుండడు. సహం అందుచేత సూర్యనారాయణను పలకరించలేదు.

అతన్ని ఒకసారి స్టేషనులో పుస్తకాల షాపుదగ్గిర చూశాను. అతను కూడా మెయిలుకు వస్తున్నాడనే సంగతి అతన్ని ప్లాట్ఫాం మీద చూసేవరకూ తట్టలేదు. అప్పటికీ నమ్మకంలేదు. అతనిది మూడోక్లాసు టిక్కెట్టు తప్ప ఇంకోటయి ఉండటానికి వీలులేదు. నిజంగా ప్రయాణం చేసేవాడయితే ఎక్కడో చోటు చూచుకు కూర్చోక ఇంకా ప్లాట్ఫాంమీద తారట్లాడతాడు దేనికి ?

కావటాని కతను నాకు బాల్యస్నేహితుడు గాని మా స్నేహంలో ఆప్యాయత పోయి చాలా కాలమయింది. ఇప్పటికి పదిహేను, పదహారేళ్ళుగా అతను పరమ దరిద్రం అనుభవిస్తున్నాడు. తన చిక్కులూ, కష్టాలూ, దురదృష్టమూ తప్ప అతనికి మాట్లాడేందు కేమీలేకుండా పోయింది. అతనితో మాట్లాడాలని ఎవరికి ఉంటుంది ? అతని కష్టాలన్నీ విన్నాక అతనికి తృణమో ఫణమో సహాయం చెయ్యవలసి వస్తుందేమోనని అతన్ని తప్పించుకు తిరిగే స్నేహితులు కూడా ఉండవచ్చు. నేను కాదనను. నా మటుకు నేను అతన్ని తప్పించుకు తిరగటంలో స్వార్థం ఏమీ లేదు. నిజానికి అటువంటివాడి ఆర్థిక సమస్య నేనేం తీర్చగలను ? ఎప్పుడైనా ఇంకా కాఫీ పోయించగలను. రెండు రూపాయలు మించకుండా చేబదులివ్వగలను. అందుచేత నా భయం డబ్బుసంచీ భయం కాదు.

సూర్యనారాయణకు ఇంకోరి కష్టసుఖాలు వినిపించుకునే శక్తి పూర్తిగా పోయింది. తన దరిద్రం అతనికో విశిష్ట విషయంగా పరిణమించింది. ఇంకోడికి భార్యపోయినా, పిల్లలుపోయినా అతనికి "అయ్యో, అట్లాగా. పాపం !" అనే శక్తిలేదు. పోనీ, తనలాగే దరిద్రంలో ఉండి ఒడ్డునపడ్డ స్నేహితుణ్ణి అభినందించే శక్తి అయినా లేదు. తన సాటివాళ్ళంతా ఏదోవిధంగా తనకంటె బాగా ఉన్నారనీ, వాళ్ళకు కష్టాలు వచ్చినా తనబాటి కష్టాలు కావనీ, అన్ని కష్టాలలోకీ డబ్బులేని కష్టమే ఎక్కువైనదనీ, జేబులో నాల్గు రూపాయలుంటే ఏ ఇతర కష్టాన్నయినా ఎదుర్కోవచ్చుననీ అతను అభిప్రాయపడ్డట్టు కనిపించాడు. అతనికి

అటువంటి అభిప్రాయం కలగటంలో ఆశ్చర్యంలేదు. మనకు ఏది లభించకపోతే అదల్లా అమూల్యంగా కనిపిస్తుంది.

ఏమైనా రానురాను సూర్యనారాయణతో సంభాషించటం కూడా నాకు దుర్భరంగా పరిణమించింది. అతని భావాలు నా చెవులకు పైశాచికంగానూ, నీచంగానూ వినిపించేవి. అతన్ని పలకరించడమంటే అతనిలో వున్న కుళ్ళు భరించటమన్న మాటేగాని మరొకటి కాదనిపించేది.

కొద్దికాలం క్రితం అతను పట్నం చేరాడని తెలిసింది. ఏదన్నా ఉద్యోగం దొరికిందేమో, పోనీ పాపం, బాగుపడతాడనుకున్నాను. కాని అతనికి ఉద్యోగం ఏమీ లేనట్టూ ఊరికేనే తిరుగుతున్నట్టు, పట్నంలో గొప్పవాళ్ళను పట్టుకుని వ్రేళ్ళాడుతున్నట్టూ విన్నాను. జలగలాగా తగులుకుంటే తృణమో ఫణమో పారేసే దనికులైన ఆంధ్రులు పట్నంలో[1] ఉన్నారు. ఫలానివాడికి ఈపాటి సహాయం చేశామని చెప్పుకోవటానికి సాటివాణ్ని హీనంగా చూసే అవకాశం దక్కించుకోవ టానికి సూర్యనారాయణ వంటి వాళ్ళకి డబ్బిచ్చేవాళ్ళున్నారు. దురదృష్టవశాత్తూ అతను కవిగాని, రచయితగాని, వక్తగాని, గాయకుడుగాని, శిల్పిగాని కాదు; అయి వుంటే అతనికింకా బాగా జరిగిపోయి ఉండును.

## 2

నేను ఇంటరుక్లాసులో[2] పక్కపరుచుకుని టైము చూస్తే బండి బయలు దేరటానికింకా ఇరవై నిమిషాల టైముంది తాపీగా ఒక సిగరెట్టు కాల్చుకుందామనీ, కనిపిస్తే సూర్యనారాయణను లాంఛనంగా పలకరిద్దామనీ బండిలో నుంచి బయటికి అడుగు పెట్టేసరికి అతనే ప్రత్యక్షమైనాడు. అతన్ని దగ్గిరగా చూసేసరికి నాకు చెప్పరాని ఆశ్చర్యం వేసింది.

అతను వేసుకున్న కోటు అంత దూరానికి ఖద్దరు కోటల్లే కనిపించింది గాని దగ్గిరిగా చూస్తే అది ఉన్ని కోటు. దాని లోపల సిల్కు చొక్కా. అతని ధోవతి కూడా సిల్కు ధోవతే - నేననుకున్నట్టు మాసిపోయిన మల్లు ధోవతి కాదు. అతని చేతిలో స్టేట్ ఎక్స్‌ప్రెస్ టిన్ను[3], వేళ్ళకి రెండు మూడుంగరాలు. అధమం ఒక్కటైనా రవ్వల ఉంగరం !

అతన్ని చూస్తేనే నా మనస్సులో అనేక ప్రశ్నలు బయలుదేరినై. ఏమిటి దీని అర్థం? ఇతను ధనికుడైనాడు! ఎట్లా అయినాడు? డబ్బున్నవాడు ఇంత

1. మద్రాసులో-
2. మొదటి తరగతి, రెండో తరగతి మధ్య క్లాసు. రైల్వేలో 1960 దశకందాకా ఉండేది.
3. సిగరెట్ల రకం- టిన్నుల్లో వచ్చేవి.

ఖరీదు పెట్టి ఇటువంటి నాజూకులేని గుడ్డలు కొనకపోతే అందులో సహం ఖరీదులో ఎంతో అందమైన దుస్తులు వేసుకోవచ్చునే? యుద్ధకాలంలో[1] బాగుపడ్డవాళ్ళు చాలా మంది ఉన్నారు. వాళ్ళల్లో ఇతను లేడని స్పష్టంగా తెలుసు. ఆరునెల్ల క్రితం కూడా ఇతను పట్నం వచ్చినప్పుడు బికారిగానే వున్నాడు. ఈ లోపల ఏం జరిగింది? అతని మొహాన ఇప్పటికీ నైచ్యం వుండనే వుంది. వొంటికి సులభంగా సిల్కులు తొడగవచ్చు గాని మనస్సుకు తొడగడం సులభం కాదు.

"ఏమోయ్, జ్ఞాపకం ఉన్నానా?" అన్నాడు సూర్యనారాయణ. నేను సిగరెట్టు కోసం జేబులో చెయ్యి పెట్టటం చూసి తనచేతిలో టిన్ను తెరచి "తీసుకో", అన్నాడు.

సిగరెట్టు తీసుకుంటూ "ఎందుకు జ్ఞాపకం లేదూ? ఈ మధ్య నడమంత్రంగా నాకేమీ ఐశ్వర్యం కలగలేదే?" అన్నాను. అతనితో అదివరకెన్నడూ అంత క్రూరంగా మాట్లాడలేదు. కాని ఇప్పటి అతని వాలకంచూస్తే దరిద్రంలో ఉన్నప్పుడే అతను కొంచం భరించ వీలుగా వున్నాడనిపించింది. అదివరకు ప్రపంచాన్ని ప్రతిఘటించి పోరాడే వాడల్లే కనిపించిన సూర్యనారాయణ ఇప్పుడు ప్రపంచాన్ని జయించినవాడి మొహం పెట్టాడు.

నా ఎత్తిపొడుపు అతనికి అర్థమయిందిగాని అతను చలించకుండా నా కళ్ళలోకి చూస్తూ ఒక విషపునవ్వు నవ్వి "దరిద్రం స్నేహితులను పోగొట్టుతుంది. దరిద్రం పోయినమీదట వచ్చే ఐశ్వర్యం ఆ పోయిన స్నేహితులందరినీ శత్రువులుగా మారుస్తుంది" అన్నాడతను.

కళ్ళల్లోకి చూసి మాట్లాడేవాళ్ళను చూస్తే నాకు మంట. నే నతనికన్నా తీక్షణంగా కాస్సేపు అతని కళ్ళల్లోకి చూసి క్షణంలో అతని చూపు దింపేశాను. అతనిలో సాహసము వున్నంతగా ధైర్యం లేదని రూఢి అయిపోయింది. ఆ సాహసమైనా డబ్బుతో వచ్చిన సాహసమే. అతను ఏంచేసి డబ్బు సంపాదించాడో తెలీదుగాని, ఆ సంపాదించిన పద్ధతి గౌరవనీయమైనదై వుండదు. వుంటే అత నింత పిరికిగా ప్రవర్తించవలసిన అవసరం లేదు.

"నువ్వు కొంచెం పొరపాటు పడుతున్నావు సూర్యనారాయణా! అసలు సంగతి నువ్వు చెప్పిందికాదు; మనకు దరిద్రం వచ్చినప్పుడు మన స్నేహితులంతా మనని శత్రువుగా చూస్తున్నా రనుకుంటాం. మనకు మాత్రం వాళ్ళ మైత్రితో అవసరం వుంటుంది. మనకు మళ్ళీ డబ్బు వచ్చినాక ఆ అవసరం తీరిపోతుంది. అప్పుడు మనం స్నేహితులందర్నీ శత్రువులుగా చూడటం ప్రారంభించి, వాళ్ళ మీద ఏదో పగ తీర్చుకునే వాళ్ళ వైఖరి అవలంబిస్తాం," అన్నాను.

---

1. రెండవ ప్రపంచ యుద్ధ కాలం (1939-1945)

సూర్యనారాయణ మొహంమీద చిరునవ్వు కాస్తా బుస్సున ఇంకిపోయింది. అతను నిప్పుపుల్ల వెలిగించి నా సిగిరెట్టు అంటించి తనదికూడా అంటించుకుని పుల్లను సిగిరెట్టుపొగతో ఆర్పేసి "నేను నెల్లూరుదాకా వెళుతున్నాను. అంతదాకా నా కంపార్టుమెంటులోకి రాకూడదూ?" అన్నాడు.

"నీది సెకండుక్లాసు బెర్తా?" అని అడిగాను.

అతను నాకేసి ఆశ్చర్యంగా చూసి, "అవును" అన్నాడు ఆ విషయం సందేహించే అధికారం నాకు లేనట్టు.

"ఎందుకులే? ఇంటరులో చక్కగా పైబెంచీ మీద పక్కపరుచుకున్నా. చాలా దూరం వెళ్ళాలి కూడానూ," అన్నాను.

సూర్యనారాయణ నాతో చెప్పకుండా పెట్టకుండా మా పక్కగా వెళుతున్న టికెట్టు కలెక్టరును పిలిచి నా టికెట్టు సెకండు క్లాసుకు మార్పించటానికి ప్రయత్నాలారంభించాడు.

నాకు సూర్యనారాయణ ప్రవర్తన ఏమీ నచ్చలేదు. కాని ఏం చెయ్యాలో తోచలేదు. టికెట్టు కలెక్టరుముందు సూర్యానారాయణతో కొట్లాటలు ప్రారంభించనా? అప్పుడే అతను నూరు రూపాయల నోట్లు పైకితీసి టికెట్టు కలెక్టరు ముహాన ఝుళిపిస్తున్నాడు. వాల్తేరు దాకా సెకండు క్లాసులో వెళ్ళటానికి దగ్గిర డబ్బులేదు. ఇంటరు క్లాసు కొనటమే చాలా సంకోచిస్తూ కొన్నాను

ఎక్సెస్ టిక్కెట్టిచ్చి డబ్బు పుచ్చుకుని టిక్కెట్టు కలెక్టరు చిల్లర తెచ్చి ఇస్తానని వెళ్ళిపోయిన తరవాత సూర్యనారాయణ, "నీతో సరదాగా గడుపుదామని ఈ పని చేశాను. ఏమీ అనుకోకు" అన్నాడు.

చేసేదిలేక సూర్యనారాయణ కూర్చున్న సెకెండు క్లాసు కంపార్టుమెంటులోకి మారాను.

# 3

గంటలు కొట్టారు. ఈలలు వేశారు. సాగనంపవచ్చిన వారు బండిలో నుంచి దిగి ప్రయాణికులతో కిటికీలగుండా ఆఖరు మాటలు మాట్లాడారు. ఇంజను మోత మార్చింది. కూత వేసింది. రైలు కదిలింది.

సూర్యనారాయణ నాతో ఏమీ మాట్లాడలేదు. నేను అతనితోనూ మాట్లాడలేదు పావుగంట గడిచింది. రైలు గమనం వేడెక్కి బండి జోరుగా పోతున్నది.

"నీకు నన్ను చూడగానే ఏదో దురభిప్రాయం కలిగింది. అవునా?" అన్నాడు సూర్యనారాయణ.

"ఏమీ కలగలేదు. నీ దుర్దినాలు అయిపోతే నేను సంతోషించటానికి సిద్ధంగా ఉన్నాను. దరిద్రం పగవాడికైనా ఉండకూడదని నా సిద్ధాంతం. నువ్వు

నాకు పగవాడివైనా కావు. అటువంటప్పుడు నాకు నీమీద దురభిప్రాయం ఎందుకుండాలి?.... నా సంతోషం తెలియజేయటానికి నువు అవకాశం ఇవ్వలేదు. జ్ఞాపకం ఉన్నానా అని అడగటంలో నీ ఉద్దేశమేమిటి? నా కున్న ఐశ్వర్యానికే నాను తల తిరిగిపోయిందనా! అయితే నాకన్న ఐశ్వర్యంలో ఉన్నావు. నీకెంత తల తిరిగి వుండాలి? లేక వస్తుతహా నీలో లేని దుర్బుద్ధులు నాలో ఏమైనా కనిపెట్టవా? కనిపెట్టినట్టయితే నాతో ఎందుకు చెప్పలేదు? స్నేహితుడివి కద!" అన్నాను.

నా ధోరణికి నివ్వెరపోయి సూర్యనారాయణ, "మాట్లాడితే కరుస్తున్నావేమిటి?" అన్నాడు. ఆతనీ మాట అన్న మీదట అతని మీద స్నేహభావం కొంత తిరిగి వచ్చింది. మొదటనే నాతో సమానస్తుడల్లే మాటాడివుంటే నేను కాదన్నానా?

"చూడు సూర్యనారాయణా, నీకదివరలో అనేకసార్లు చెప్పాను. నువు అర్థం చేసుకోవటానికి ప్రయత్నించలా. డబ్బు రావడంగాని, పోవడంగాని అదృష్టమనుకున్నట్టయితే నువు ప్రపంచంమీద పగ పట్టకుండా వుండవలసింది కాదు. నీ కష్టసుఖాలన్నిటికీ మనుషులే కారకులన్నట్టయితే నువు నీ నిజమైన స్నేహితులెవరో, నీ శత్రువులెవరో స్పష్టంగా తేల్చుకుని ఉండవలసింది. నువ్వదీ చెయ్యలేదు. ఇదీ చెయ్యలేదు. నీ స్నేహితుల అవసరం గుర్తించావు. కాని అందరూ నీకు శత్రువులే అని నమ్మావు. నా వంటి అభిప్రాయాలు కలవాడికి నీ ప్రవర్తన ఎట్లా నచ్చుతుంది? మేమెవ్వరమూ కష్టాలు పడలేదనుకున్నావా? అంతమాత్రాన మాకూ ప్రపంచానికీ వున్న సంబంధం మరచిపోయివామా? మరచిపోలేదు. పైపెచ్చు ఆ సంబంధాన్ని గురించి అనేక కొత్త విషయాలు నేరుకున్నాం. నువ్వూ ఆ పనే చేసివుండవలసింది. దరిద్రస్థితిలో నిన్ను చూసినప్పుడల్లా, "అవకాశం దొరికితే ఈ మనిషి ధనికుడి మనస్తత్వం అవలంబిస్తాడు" అని నా కనిపించేది. ఇప్పుడది కళ్ళారా చూశాను. నా టిక్కెట్టు సెకండు క్లాసుకు మార్పించటమూ, నూరు రూపాయల నోట్లకట్టలు మా మొహాలమీద ఝళిపించటమూ నాకు నచ్చలేదు. ఎక్కడిదీ కట్టలు?"

సూర్యనారాయణ వెంటనే నాకు సమాధానం చెప్పలేదు.

"ఇష్టం లేకపోతే చెప్పకు. నువు దరిద్రంలో ఉన్నప్పుడు ఎట్లా గడుస్తున్నదని నిన్నెన్నడూ అడిగిన పాపాన పోనివాణ్ని. ఈ డబ్బెక్కడిదంటే చెప్పటం నీకిష్టం లేకపోవచ్చు. కాని నా వుద్దేశంలో దరిద్రం అవమానకరం కాదు. ఖరీదైన గుడ్డలు వేసుకుంటామనీ, సెకండు క్లాసులో ప్రయాణం చేస్తామనీ మనలో ఎవరమూ సంఘానికి గ్యారంటీ ఇవ్వలేం. అటువంటి గ్యారంటీ అడగడానికి సంఘానికి

అధికారం లేదు. కాని నువు ఒకప్పుడు దరిద్రం అవమానంగా భావించావు. సాధారణంగా డబ్బు సంపాదించే పద్ధతులే చాలా హేయంగానూ నీచంగానూ వుంటై. అందుచేత అడుగుతున్నాను" అన్నాను.

సూర్యనారాయణ పౌరుషంగా "నేను నీచంగానే డబ్బు సంపాదిస్తున్నాను. మర్యాదగా బతకడానికి ప్రయత్నించిన రోజుల్లో పది రూపాయల నోటు చేతపట్టటం బ్రహ్మ ప్రళయంగా వుండేది. నువ్వొకడివి నాతో మామూలుగా మాట్లాడావేమో, నా పాత స్నేహితులంతా మొహం తప్పించారు." అని ప్రారంభించాడు.

"నేను నీతో మామూలుగా మాట్లాడలేదు. నువు మా కవకాశం ఇవ్వలేదు. నీతో నా మాదిరిగా బాధపడ్డవాళ్ళు కొందరున్నారు నాకు తెలుసు," అన్నాను.

"ఉద్యోగం కోసం ప్రయత్నించాను. అదీ దొరకలేదు. నా ఖర్మం ఇట్లా కాలిందిగాని మా నాన్న బాగా బతికినవాడు. ఆయన స్నేహితుల్లో లక్షాధికార్లున్నారు. ఒక్కడు కూడా సహాయం చెయ్యలేదు. కొందరు నాకు దర్శనం కూడా ఇవ్వలేదు. వాళ్ళనుంచి నేను నౌకరి అడిగాను కాని దానధర్మం అడగలేదు. అడిగినా చెయ్యగల వాళ్ళే. వాళ్ల విలాసాలకోసం ఖర్చుపెట్టేదాన్లో నా అవసరఖర్చు ఎన్నోవంతో లేదు. వాళ్ళమీద నేను పగపట్టడం తప్పా ?"

"వాళ్ళు మీ నాన్న నెరిగిన పాపాన నువ్వు వాళ్ళమీద పగపట్టావుగాని, దేశంలో ఇంకా ధనికులెందరు లేరు? వాళ్ళమీద పగపట్టావా? పట్టి మాత్రం ఏం చెయ్యగలవు? వాళ్ళు కొన్ని పద్ధతులమీద ధనికులు కాగలుగుతున్నారు. ఆ పద్ధతులు అమలులో ఉన్నై. వాటిని మార్చటానికి నువ్వేమైనా ప్రయత్నించావా?"

"సంఘాన్ని మార్చటమేనా నా పని?"

"కొంతమంది అటువంటి చాదస్తం గలవాళ్ళున్నారు."

"ఉంటే ఉండనీ. నా పని పగతీర్చుకోవటం!"

"ఎట్లా?"

"వాళ్ళ పద్ధతులే వాళ్ళమీద ప్రయోగించాను."

"ఏమిటా పద్ధతులు?"

"మిగతా నీతి నియమాలన్నీ డబ్బుకు తీసికట్టన్నట్టు ప్రవర్తించటం.... నేను వ్యాపారంలో ప్రవేశించాను."

"నీకు పెట్టుబడి ఎక్కడిది ?"

"మన మాధవరావుకు పెట్టుబడి ఎక్కడిది ? కానీ లేకుండా లిమిటెడ్ కంపెనీ పెట్టాడు. ప్రజల డబ్బుతో వ్యాపారం సాగించాడు. లాభంలో అయితే వంతు కమిషనుకింద కొట్టేశాడు. మేనేజింగు ఏజంటనే పేరుతో చక్కని జీతం పుచ్చుకున్నాడు. దగావ్యాపారం చేశాడు. లాభాలన్నీ తనే తినేసి, కంపెనీ

దివాలా ఎత్తించాడు. ఇట్లా సంపాదించిన లోకుల డబ్బుతో నాలుగు కంపెనీలు పెట్టాడు. ఒకనాడు వందరూపాయ లప్పుపుట్టని మాధవరావుకు లక్షరూపాయ లెక్కడ్నించి వచ్చినై?

"నువుకూడా కంపెనీ పెట్టావా?"

"నా పెట్టుబడి లోకుల కష్టార్జితమైన డబ్బుకాదు. ధనికుల కుమార్తెలూ, భార్యలూనూ!"

"ఆదేమిటి?" అన్నాను నిర్ఘాంతపోయి.

"మాధవరావు భార్య నాకెప్పుడు కావాలన్నా వెయ్యి రూపాయలు చేబదు లిస్తుంది.... మనిషి మాంసం ఖరీదైనది. ఒకంతట ఖర్చయిపోదు.... యుద్ధంలో, జనం కొందరు తెగబలిశారు.... నా క్లయింట్లు చాలా పెద్దవాళ్లు. వాళ్ళు నాకు కానిమారా[1]లో విందులు కుడుపుతారు.... భార్యా భర్తలిద్దరూ నా క్లయింట్లుగా వున్న కేసులుకూడా వున్నై."

"నువ్వేం చేస్తావ్?"

"చాలా అమాయకమైన ప్రశ్న వేశావు. నేను పబ్లిసిటీలో ఆరితేరాను. నా సరుకులు నా క్లయింట్లకు వచ్చేటట్టు చెయ్యడమూ, నా వ్యాపారంలో వారికి ఆసక్తి కల్పించటమూ, ఆ ఆసక్తి దిగజారకుండా చూస్తూ వుండటమూ, వారికి ప్రమాదం రాకుండా పైపెట్టున కనిపెట్టి వుండటమూ నా పని. నీ దయవల్ల నా క్లయింట్లు సాధారణంగా జారిపోరు. మొదట కొద్ది వ్యాపారం ఇచ్చినవాళ్ళు క్రమంగా పెద్ద వ్యాపారం ఇస్తారు."

నా చెవులు నేను నమ్మలేకపోయాను.

"ఎవరన్నా బయటపడి అల్లరి అయితే?" అన్నాను.

"కాకుండా చూస్తాను. ఖర్మం చాలక ఆయే సూచన కనిపిస్తే అందరికన్నా ముందు నేనే అల్లరి ప్రారంభిస్తాను. మొత్తంమీద నా క్లయింట్లు నన్ను భయభక్తులతో చూడటం నేర్చుకుంటారు."

"నిన్ను వీళ్ళు ఏవిధంగా దగ్గరికి రానిస్తారు? నీ సంగతి వాళ్ళు తెలుసుకోరా?"

"పిచ్చివాడా! అవినీతి పరులను సంఘం దూరంగా వుంచుతుందని భ్రమతో వున్నావు. అటువంటిదేమీ లేదు. నేను మనుషుల్ని - కాస్త కలవాళ్ళను ఆకర్షించినట్టుగా నువ్వాకర్షించనేలేవు. నువ్వు వాళ్ళ దౌర్బల్యాన్ని బలపరచావు. నేనూ బలపరుస్తాను."

---

1. మద్రాసులో ఒక ఖరీదైన హోటలు పేరు.

సూర్యనారాయణ ధోరణి వింటున్నకొద్దీ నాకు ఏవగింపు కలిగింది. తానేదో చాలా ఘనమైన పనిచేశానని అతను అనుకుంటూ వుండాలి. తాను సంపాదించే డబ్బునుబట్టే తన విజయాన్ని కొలిచి వుండాలి.

కాని అతన్ని నేను పల్లెత్తుమాట అనలేదు. అనటానికి నా కేమధికారం వుంది? దేశంలో అవినీతిగా డబ్బు గడించే అధము లెంతమందిలేరు? అటువంటి వాళ్లు అనేక రంగాల్లో ప్రముఖులుగా కూడా వుంటున్నారు. వాళ్ళని నే నేమన గలిగాను? లోకమంతా సూర్యనారాయణ మోస్తరుగానే డబ్బును ఆరాధిస్తున్నది. వస్తువులూ, హృదయాలూ, భావాలూ, విశ్వాసాలూ, అంతరాత్మలు కూడా డబ్బు కమ్ముడై పోతున్నై. "మనిషి మాంసం" అమ్ముడుపోతే వచ్చిందా? "మనిషి మాంసం"తో వ్యాపారం సాధ్యమైనప్పుడు ఒకరు ఆ వ్యాపారం చెయ్యకుండా వుండరు. సూర్యనారాయణ ఆ వ్యాపారం సాగిస్తున్నాడు. తన క్లయింట్లను తృప్తి పరుస్తున్నాడు. వారి నాగరికతకు అవమానం కలిగించని వేష భాషలు అవలంబించాడు.

అతనితో నా కెందుకు మధ్యపేచీ?

ముద్రణ : ఆగస్టు 1947, ఆంధ్రజ్యోతి మాసపత్రిక.

# నువ్వులూ - తెలకపిండీ

తెలకపిండి యెట్లా వస్తుందో అందరికీ తెలుసు. నువ్వులు ఆట్టే నాగరికత లేని సరుకు. అది పొలాల్లో కష్టజీవుల చేతుల్లో పెరిగి మధ్యవాళ్ళకు అమ్ముడుపోయి బస్తీ చేరుతుంది. అక్కడ దాన్ని గానుగ ఆడి నూనె తీస్తారు. ఆ నూనె అందమైన సీసాలకూ డబ్బాలకూ యెక్కి, అనేక వంటిళ్ళను అలంకరిస్తుంది. తెలకపిండి చక్కను నువ్వు లొకవేళ చూసినా పోల్చుకోలేవు. అది గొడ్లకూ పే వాళ్ళకూ ఆహారమౌతుంది.

నువ్వులు గానుగాడటం యేమంత గొప్ప విషయంకాదు. నేను మనుష్యుల్ని గానుగాడగా చూశాను. ఎందుచేతనో నాకా పద్ధతి రుచించలేదు.

సోమయాజులు నా ఆప్త స్నేహితుడు. వాడిపట్ల నాకున్న భావాన్ని గురించి యే కవులూ, ఏ కథకులూ రాయలేరు. అటువంటి భావాలను మాటల్లో వ్యక్తం చెయ్యటానికి ప్రయత్నిస్తే అబద్ధాలనో, అతిశయోక్తులనో అనిపిస్తాయి. నేను వాడికోసం ప్రాణం త్యాగం చేస్తానో లేదో-పరీక్షకు రాలేదు. అదృష్టవశాత్తూ అటువంటి పరీక్షే వస్తే యేం చేస్తానో చెప్పలేను. ఇటువంటి ప్రశ్నలకు అంతరాత్మలను సమాధానా లడిగితే అవి చెప్పే కబుర్లు కోటలు దాటుతాయి. సోమయాజులును పులి వెంబడిస్తే వాణ్ణి తప్పించటానికి నేను పులితో కలియబడగలనని అంతరాత్మ చెబుతున్నది. కాని పులుల్ని మించిన మనిషి వాడి వెంటపడి కోరలతో పట్టుకుంటే నేను మంత్రానికి కట్టుబడ్డ వాడల్లే చూస్తూ నిలబడ్డాను.... ఐనా నా అంతరాత్మలో నాకు విశ్వాసం చావలేదు. నిజానికి మనం పులులతోనూ, విషసర్పాలతోనూ యెట్లా వ్యవహరించాలో నిర్ణయించినంత బాగా పులులవంటి, విషసర్పాలవంటి మనుష్యులతో వ్యవహరించటం గురించి నిర్ణయించలేం....

సోమయాజులు పేదకుటుంబానికి చెందినవాడు. నేను చిన్నతనంనుంచీ వాడితో కలిసి చదివినవాణ్ణి కనక వాళ్ళమ్మా, నాన్నా, వాడి తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ బాగా తెలుసు. వాళ్ళ యింటి వాతావరణాన్ని నేను కొంచెమైనా సహించలేకపొయ్యేవాణ్ణి. వాళ్ళు దరిద్రంలో బాధపడకుండా దారిద్ర్యాన్ని ఆరాధించ

ఒంటలాగా కనిపించేది. వాళ్ళింటిలో అందరి సంస్కారమూ ఒకే ధోరణిలో ఉండేది - ఎట్లా పూచికపుల్ల దగ్గిర్నుంచి పోగుచేతమూ అని! అది దారిద్ర్యంతో సంబంధం లేకుండా వేరే వ్యక్తిత్వం సంపాదించుకున్నది. ముఖ్యంగా సోమయాజులు తల్లి అద్దమైన, పనికిరాలిన వస్తువులన్నీ సంపాదించటానికి దొంగతనం మినహాగా మిగిలిన యుక్తులన్నీ చేసేది. ఏ ఉదయం వీధిలో చూసినా ఆవిడ పేడకోసం యెవరితోనో ఒకరితో పోట్లాడుతూనే వుండేది. తరువాత ఆమె దగ్గిర దేవిరింపు కూడా వుండేది. ఆవిడ మా యింటికి వచ్చినప్పుడల్లా "మీకు అక్కర్లేనిది - ఏదన్నా వుంటే యిస్తురూ" అని పుచ్చుకుపోతూ వుండేది. ఆ వస్తువు మా యింటిలో వుండటం చూసే ఆవిడ అడిగేది. అది మాకు అక్కర్లేని దన్నట్లు నటిస్తే మేం మరింత త్వరగా యిస్తామని ఆవిడ విశ్వాసం. మా అమ్మకు ఆవిడ దేవిరింపు బొత్తిగా గిట్టేది కాదు. ఆవిడ అడిగిన వస్తువు నిజంగా అక్కర్లేకపోయినా మా అమ్మ తనకు దానితో పని వున్నట్లు నటించేది. మా అమ్మేమీనా తక్కువ తిన్నది కాదు. కాని సోమయాజుల తల్లి యింటికి వచ్చినప్పుడల్లా వంటింటిలో డబ్బాలకేసి, కూరగాయలకేసి, పప్పుకేసి ఆశగా చూస్తుంటేనూ, ఏదన్నా మా అమ్మ బాగు చేస్తుంటే చూచి "అయ్యో, నెయ్యం నూక పురుగు పట్టినట్టుందే! గోధుమ రవ్వ ముక్కినట్టుందే!" అంటేనూ భరించటం కొంచెం కష్టంగానే వుండేది.

సోమయాజులుగాడింటో అసహ్యంగా వస్తువులు ఆదా-దమ్మిడీలో సూరో పంతు చెయ్యని వస్తువుల పొదుపు-తపస్సులాగా సాగుతూ వుండేది. ఈ తపస్సులో నిమగ్నులై వున్నవాళ్ళకు మరో ఆనందం వుండే అవకాశం లేదు. మనస్తత్వ రీత్యానైతేనేం, దృక్పథాలలో నైతేనేం వాళ్ళు మానవులకంటె కాడియెద్దులకు సన్నిహితంగా వుండేవాళ్ళు.

శ్రామిక వర్గానికి చెందవలసిన ఆర్థిక పరిస్థితులుండి కూడా బ్రాహ్మణ కుటుంబాలైన కారణం చేత మధ్యతరగతి హోదాతో నెట్టుకు వచ్చినవారిని నేను చాలా మందిని చూశాను. కాని బ్రాహ్మలైన దోషం చేత మధ్యతరగతి అనిపించుకుంటూ శ్రామికులు పొందిన జీవితానందం కూడా సాధించలేకపోయిన కుటుంబం నా యెరుకలో సోమయాజులు వాళ్ళదే. రానురాను బ్రాహ్మణ కుటుంబా లకు ఈ గతే హెచ్చుగా పడితే నే నాశ్చర్యపడను.

అప్పటికి సోమయాజులు కుటుంబం మధ్యతరగతి సంస్కారానికి చాలా వరకు ఉద్వాసన చెప్పేశారు. వాళ్ళింట అక్కరలు వచ్చేవి కావు. ఒకవేళ వస్తే యెవరికీ తెలిసేది కాదు. ఎవరన్నా పిలిస్తే వెళ్ళేవాళ్ళు. కాని వాళ్ళని ఎదురు పిలిచేవాళ్ళు కారు. ప్రక్కవీధిలో వున్న చుట్టాలనే యేడాదికొకసారి చూసే

వాళ్ళు కారు. ఉన్న దరిద్రాన్ని చిన్న పసిపాతతోనన్నా కప్పటానికి యత్నించే వారు కారు.

సోమయాజులు యేవిధంగా వాళ్ళ యింటో విగతా వాళ్ళతో అతికినా నేను స్నేహం చెయ్యలేకపొయ్యేవాణి. లేక స్నేహం కారణంగా వాడు నాకు మరొక విధంగా కనిపించేవాడో! ఏమైనా నా కళ్ళకు సోమయాజులు దరిద్రం ఒక లోపంగా కనిపించేదికాదు. నాకు హాణ్ణీహస్తే అవ్యాజంగా చెప్పరాని జాలి కలిగేది. కాని, ఆ జాతి బాల్యస్నేహ లక్షణం. దానికి వాడి దారిద్ర్యంతో గాని, వాడి కష్టాలతో గాని సంబంధంలేదు. నిజంగా కష్టాలు చూసి జాలిపడే శక్తి అంత చిన్న వయసులో యెక్కడుంటుంది?

స్కూలు ఫైనల్‌దాకా నేనూ సోమయాజులూ కలిసి చదివాం. కాని అంత టితో వాడు చదువు కట్టిపెట్టి వకీలు సత్యనారాయణగారి దగ్గిర ప్లీడరు గుమాస్తా పని నేర్చుకునే వాలంటీరుగా చేరాడు. ఆ తరువాత నేను నాలుగేళ్ళు కాలేజీ చదువు చదివి పైనా లోపలకూడా యెన్నో మార్పులకు లోనైనా, ఏ మూలో వాడి కోసం నా హృదయంలో కొంతమేర మార్పులేకుండా దాచి వుంచాను. గడియారాల నెవరూ వెనక్కు తిప్పలేరుగాని కొంతవరకు వాటిని ఆపి వుంచటం అసంభవం కాదు.

సోమయాజుల్ని గురించి చెప్పవలసిన విషయం చెప్పలేదు. వాడు పాడ గలడు. ఎవరంత బాగా పాడగలడని అడక్కండి. నిజంగా గొప్పపాటకు సాటి లేదు. సంగీతంలో విద్వత్తును పోల్చవచ్చు. సాధనను పోల్చవచ్చు. గొంతెత్తి మనస్సులు కరిగించే వాడి పాటలో ఆనందాన్ని యింకో దాంతో యెట్లా పోల్చటం? సోమయాజులుకు రాగజ్ఞానం లేదు. సర్వజ్ఞానం లేదు. తాళజ్ఞానం లేదు. పాటతో తన్మయత్వం తీసుకురావటానికి యీ మూడూ అవసరం లేదని నాకు సోమయాజులు ఋజువు చేశాడు. ఒక్క సాహిత్యంతో తప్ప తన్మయత్వంరాని నాకు వాడి పాట వెర్రెత్తించింది. అది అహోరాత్రాలు నన్ను రకరకాల పీడించేది. వాడి పాట వినే ఆనందంలో సుఖమే హెచ్చుగా వుండేదో బాధే హెచ్చుగా వుండేదో నిర్ణయించ లేకపోయేవాణ్ణి.

సోమయాజులు పాటనుగురించి నేను చెప్పేది అతిశయోక్తికాదని ఋజువు చేయటానికి లేదు కాని, ఒక్క మాట మాత్రం చెప్పగలను. వాడి పాట విని చలించనివాళ్ళను కూడా చూశాను. నాకన్నా వెర్రెత్తిన వాళ్ళను కూడా చూశాను. జయలక్ష్మి ఒక పెద్ద తార్కాణం.

నాకు జయలక్ష్మిమీద యేవిధమైన అభిమానంగాని, గౌరవం గాని లేదు. కాని ఆ పిల్ల వాడివెంట ఎందుకు పడిందో నేనూహించగలను. నేను ఆడదాన్నయి వుంటే సోమయాజులుపట్ల సరిగా జయలక్ష్మిలాగే ప్రవర్తించి వుండేవాణ్ణేమో!

జయలక్ష్మి మరెవరో కాదు, వకీలు సత్యనారాయణగారి చెల్లెలు కూతురు. వాళ్ళ నాన్న పట్నంలో గొప్ప వ్యాపారస్తుడు. ఆయనకు ఏమీలేదు. సత్యనారాయణ గారి చెల్లెలు మల్లికాంబను ఆయన కిచ్చినపుడు సత్యనారాయణ తండ్రిగారిని అంతా కోప్పడ్డారు - దారే పొయ్యేవాడికి పిల్లనిచ్చారని. సత్యనారాయణగారు ప్రాక్టీసు పెట్టి రెండుచేతులా సంపాదన ప్రారంభించగానే అత్తవారి దృష్టిలో గురునాధంగారు మరీ చులకన అయినాడు. కాని, జయలక్ష్మి పుట్టడమే ఆరంభం, గురునాధంగారి దశ తిరిగి, పట్టిందల్లా బంగారం కాసాగింది. చూస్తుండగానే ఒక లక్ష వెనకవేసి రెండో లక్షకు నడుం బిగించాడు. చిన్నచిన్న బస్తీల వాతావరణంలో వదిలిపోయిన మొక్క పట్టణం వాతావరణంలో పెరిగి మహావృక్షమై ఊడలు దించసాగింది. జయలక్ష్మి సంపన్నుల పిల్ల. జయలక్ష్మి అన్న ఇంగ్లండులో చదివివచ్చి పెద్ద వుద్యోగంలో వున్నాడు.

జయలక్ష్మి మేనమామగారింట కొన్ని రోజులు వుండటానికి వచ్చింది. సోమయాజులు పాడతాడని ఆమె యెట్లా పసికట్టిందో తెలియదు. తన మేనమామ దగ్గిర గుమాస్తా కనకా, తను సంపన్నురాలూ, అతడు బీదవాడు కనకా ఆమె మొదట తన అధికారం వినియోగించి అతనిచేత పాడించుకున్నది. తన మేనమామ యింటో లేనప్పుడు అతన్ని మేడమీది వరండాలోకి పిలిపించి పాడమనేది. సోమయాజులు పాడేవాడు.

నిజంగానే జయలక్ష్మికి మతిపోయింది, సోమయాజులు పాటతో. అతను పాడనంటే బాధపడేది. క్రమంగా అతనిమీద తనకుగల అధికారాన్ని మరిచి పోయింది.

"ఇదుగో, అమ్మాయ్! ఇక నన్ను పాడమనకు. ప్లీడరుగారు కోప్పడ్డారు. 'పాటలే పాడతావా, పనే చేస్తావా?' అన్నారు. నా కీ పాట కూడు పెడుతుందా గుడ్డ పెడుతుందా?" అన్నాడు సోమయాజులు ఒకరోజు జయలక్ష్మితో.

"పోనీ పాడకు - నీ కిష్టంలేకపోతే" అన్నది జయలక్ష్మి నిబ్బరంగా. కాని లోపల ఆమె మనస్సు దహించుకుపోతున్నది. నల్లమందు అలవాటైనవాడికి అది లేకుండా వుండటం యెంత దుర్భరమో, సోమయాజులు పాట వినకుండా వుండటం ఆమెకంత దుర్భరమయింది.

ఒకరోజు సాయంకాలం సోమయాజులు కోర్టునుంచి ప్లీడరు గారింటికి వచ్చాడు పనుండి. ప్లీడరుగారు నేరుగా క్లబ్బుకు వెళ్ళారు.

ఆఫీసుగదిలో సోమయాజులు పని చూసుకుంటుండగా జయలక్ష్మి వచ్చి అతని ఎదురుగా మాటా పలుకూ లేకుండా నిలబడింది. ఆమెలో ఏదో మార్పు కని పించింది సోమయాజులుకు. వారం రోజులు పస్తున్నదానల్లే వున్నదామె.

"ఏమిటి" అన్నాడు సోమయాజులు.

"నేను రేపు వెళ్ళిపోతున్నాను" అన్నది జయలక్ష్మి.

"అట్లాగా?" అన్నాడు.

"ఎంత అదృష్టం! నేను మళ్ళా కనిపించనని నీకు విచారం లేదు కద!" అన్నదామె.

దీని కేమనాలో సోమయాజులుకు తెలియలేదు.

"ఒక్కసారి పాడు! మళ్ళీ వినను" అన్నది జయలక్ష్మి.

"ఇప్పుడా? పనుంది" అన్నాడు సోమయాజులు.

జయలక్ష్మి భరించలేకపోయింది.

"పని! పని! ఏం పని యిది? గొప్పవాళ్ళ యిళ్ళల్లో కుక్కలు నీ కన్న బాగా బతుకుతై. ఇదేనా పని? మా మామ నెలకు పదిరూపాయ లిస్తాడా? ఈపది రూపాయల కేనా నీకు దేవుడింత పాట యిచ్చాడు? నీకు ఆశలేదా? గొప్పవాడి వౌదామని లేదా?" అని ఘాటుగా యెత్తిపొడిచింది జయలక్ష్మి.

"అందరూ గొప్పవాళ్ళయితే కొద్దివాళ్ళెవరు?" అన్నాడు సోమయాజులు.

"నువ్వు కొద్దివాడివిగానే వుండు. కాని కాస్సేపు పాడు. నీ యిష్టం. ఏదన్నా రాగం ఆలాపన చెయ్యి. నీకు పాటలు పాడటం చాతకాదు" అన్నది జయలక్ష్మి.

సోమయాజులు నవ్వి సన్నగా పాడసాగాడు. పైగా కేదారగౌళ ఆలాపన చేశాడు. వాడి శంకరాభరణం గాని కల్యాణి గాని కొంతవరకు తట్టుకోవటం చాలాకష్టం.

జయలక్ష్మికి నిజంగానే మతిపోయింది. వాడు పాడటం ఆపగానే "ఎట్లా పాడతా వింతపాట? ఎన్నోసార్లు నేను మోసపోయినా ననుకున్నాను. నువ్వు నిజంగా అంత బాగా పాడవని నేనే వూహించుకుంటున్నాననీ అనుకున్నాను. నేనింకా యే డెబ్భైయేళ్ళో బతుకుతాను. కాని నీ పాట వినలేను, నీవు నిజంగా యింత బాగా పాడలేదనీ నా భ్రమ అనీ మళ్ళీ నన్ను నేను నమ్మించుకుంటున్నాను. ఎట్లా సోమ యాజులూ? రోజూ నీ పాట వినటం యెట్లా సోమయాజులూ? రోజూ నీ పాట వినటం యెట్లా? మీయింట్లో వాళ్ళంతా యెంత అదృష్టవంతులు? రోజూ నీచేత పాడించుకు వింటారు కాదూ?" అన్నది.

"నాచేత బలవంతంగా పాడించే వాడింకొక్కడే వున్నాడు" అన్నాడు వాడు.

"ఐతే నే నొక్కతెనే కాదన్నమాట? నాకు మతిపోలేదన్నమాట! ఈ అను మానం కూడా నాకు తట్టింది సుమా!" అన్నది జయలక్ష్మి.

* * * *

సోమయాజుల్ని పెళ్ళాడాలనే బుద్ధి జయలక్ష్మికి యెప్పుడు పుట్టిందో నాకు స్పష్టంగా తెలీదు. సోమయాజులకు ఆమె పట్నంనుంచి ఒక వుత్తరం రాసింది. ఉత్తరంలో చాలా కవిత్వం వుంది. సోమయాజులు మనిషియెదురుగా వున్నా చలిం చని వాడు కాస్తా ఆ వుత్తరానికి చలించాడు. విశేషమేమంటే ఆ ఉత్తరంలో జయ లక్ష్మి తనను పెళ్ళాడమని సోమయాజులు నడిగింది. వాడు ఒప్పుకుంటే తన తండ్రిని ఒప్పిస్తానన్నది. వెధవ ప్లీడరు గుమాస్తాగిరి మానేసి తనదగ్గిరే వుండవచ్చు నన్నది.

వాళ్ళిద్దరి మధ్యా వుత్తర ప్రత్యుత్తరాలు సాగినై. అన్ని వుత్తరాలూ వాడు నాకు చూపలేదు. ఆ విధంగా అందులో యేమున్నదీ నాకు తెలియజేశాడు.

ఒకటిమాత్రం ఖాయం. గురునాధంగారు కూతురు పెళ్ళి ఆలోచనకు వెంటనే ఒప్పుకోలేదు. కాని జయలక్ష్మి చాలా మొండిది. ఆఖరుకు సోమయాజు లును వాళ్ళు పట్నం పిలిపించారు. వాళ్ళే రైలు ఖర్చులుకూడా యిచ్చారు. ఇంత దాకా వచ్చినాక సోమయాజులు తల్లిదండ్రులకు విషయం తెలిసిపోయింది. వాళ్ళ సంతోషానికి మేరలేదు. తమ కొడుకు పెళ్ళి అయినట్టుగా అందరితోనూ చెప్పే శారు.

వాడి తండ్రి నన్ను చాటుగా పిలిచి "చూడు బాబూ! మావాడికి వాళ్ళు బాగా కట్నం యిచ్చేట్టు చూసుకోవద్దూ మనం? ఇవ్వగలవాళ్ళేగా - తీపురమా?" అన్నాడు.

"మీరిందులో జోక్యం కలిగించుకోకండి. అసలే దగ్గితే వూడే ముక్కుగా వుంది. ఈ పెళ్ళికి వాళ్ళెట్లాగూ ఒప్పుకోరు. ఒకవేళ ఒప్పుకుంటే అదే అన్ని కట్నాలూనూ. మీరిందులో తొందరపడి వేలు పెట్టారో-అసలుకు మోసం వస్తుంది" అన్నాను.

"అదేమిటోయ్! మనం మగ పెళ్ళివాళ్ళంగా? మన పిల్లవాణ్ణి వాళ్ళు పిలిపిం చటం యేంటి?" అన్నాడాయన.

"ఈ పెళ్ళి జరిగితే పెళ్ళిఖర్చంతా కలిసి మీ అబ్బాయి ఒక్కడే. ఆ చేసు కునే అమ్మాయి ఒక్క మొగుణ్ణే చేసుకుంటుందిగాని అత్తగారినీ, మామగారినీ చేసుకోదు" అన్నాను.

"అదేం? కాపరానికి రాదూ?"

"మనవాడే కాపరానికి పోతాడు."

"ఛా!" అన్నాడు సోమయాజులు తండ్రి, నా మాట నమ్మలేకుండా.

గురునాధంగారూ వాళ్ళూ సోమయాజుల్ని గురించి యెంత తక్కువ అంచనాలు వేసుకున్నారో మనకు తెలీదు. అది సోమయాజులకే లాభించింది.

"కుర్రాడు బాగానే వున్నాడే!" అన్నది జయలక్ష్మి తల్లి మల్లికాంబగారు. గురునాధం గారికికూడా అదే తోచి వుండాలి.

అదీకాక సోమయాజులు అందరిపట్లా చాలా వినయవిధేయతలుగా వుండేవాడు. ఎవరితోనూ, ఏ విషయాలలోనూ పేచీలు పెట్టుకునే వాడుకాడు. అన్నిటికన్నా ముఖ్యం - జయలక్ష్మిమీద చాలా ఆపేక్షగా ఉండేవాడు. వాణ్ణి బజారుకు తీసుకుపోయి జయలక్ష్మి వాడికి మంచి సూట్లు రెండు ఆర్డరు చేయించింది. ధోవతులూ, షర్టులూ కొనిపెట్టింది.

గురునాధంగారి యింట్లో జయలక్ష్మికి ఎటువంటి అడ్డూ లేదు, ఆమెకు వేరే గది ఉంది. ఆ గదిలో యిద్దరూ గంటల తరబడి కూర్చునేవాళ్ళు. సోమయాజులు చేత గంటలతరబడి పాడించుకునేది. వాణ్ణి ఆనుకొని కూర్చునేది. మరీ ఆపేక్ష వస్తే వాళ్ళోనే వచ్చి కూర్చునేది.

ఇంకా పెళ్ళికాక పూర్వమే సోమయాజులుకు పాడటమంటే అసహ్యం పుట్టిపోయింది. పాపం! జయలక్ష్మి తన తృష్ణ సంతృప్తి పరచుకోవటంలో సోమయాజులుకు ఆవగింజంతైనా స్వాతంత్ర్యం లేకుండా చేసింది. తనంతట తాను గొంతెత్తి యెన్నో యుగాలైనట్టనిపించింది వాడికి. ఈ సమయానికి వాడికి జయలక్ష్మి మీద ప్రేమే ప్రజ్వలించకపోతే ఎవరితోనూ చెప్పకుండా యింటికి వచ్చెయ్యవలసినవాడే.

వాడు పట్నం వెళ్ళిన నెలరోజుల్లో పెళ్ళి ఐపోయింది. పెళ్ళికి వాడి తల్లి దండ్రులెవరూ వెళ్ళలేదు. "మీరు వెళ్ళనవసరం లేదు" అని నేను చెప్పిన సలహా, డబ్బు ఖర్చవుతుందన్న వాళ్ళ తాపత్రయానికి కలిసివచ్చింది.

* * *

జయలక్ష్మి సోమయాజుల్ని తప్ప పెళ్ళాడనని ఎందుకు పట్టుపట్టిందీ ఆమె ఇంటోవాళ్ళకుగాని, స్నేహితులకుగాని తెలియదు. పెళ్ళి అయినాక మాత్రం ఆమె "మా ఆయన సంగీతం మీరు వినలేదు కాదూ?" అని అందరి దగ్గిరా వాడిపాట వినిపించసాగింది.

తన మొగుడిపాట విన్నవాళ్ళంతా తన మాదిరిగానే వెర్రెత్తిపోతారనీ, యింత పాటగాణ్ణి మొగుణ్ణి చేసుకున్నందుకు వాళ్ళు తననుచూసి అసూయపడతారనీ ఆమె ఆశించి వుంటుంది. ఈ విషయంలో ఆమెకు నిరాశ అయింది.

సోమయాజులు పాట విన్నవాళ్ళలో చాలామందికి అందులో యేమంత ప్రత్యేకత కనిపించలేదు. కొందరు అతన్ని "ఆ రాగం పాడు. ఈ రాగం పాడు. ఈ కృతి పాడు, ఏవైనా సినిమా పాటలు పాడు, హిందీ పాటలు పాడు" అని అడిగి ఆశాభంగం పొందారు. కాస్త సంగీతజ్ఞానం కలవాళ్ళు సోమయాజులు కాజ్ఞానం లేదని తెలుసుకున్నారు.

పైకి అందరూ "యింపైన పాట! చక్కని శరీరం, మంచి హొదుగు" అన్నారేగాని ఒకళ్ళూ జయలక్ష్మి లెక్కన తన్మయత్వం పొందలేదు.

పైగా సోమయాజులు తిరగబడ్డాడు. "నీకోసం పాడమంటే పాడతాను గాని వీళ్ళందరిముందూ పాడమంటావు దేనికి? వాళ్ళకు నా పాట నచ్చకపోవచ్చు. నువు జిడ్డు తగిలిస్తున్నావనుకోరా?" అన్నాడు.

"పాట అన్న తరవాత నలుగురికీ గాని ఒక్కరికా?" అన్నది జయలక్ష్మి, తన కీర్తికాంక్షను అభ్యుదయ నినాదంతో సమర్థిస్తూ.

ఈ అంధకారంలో జయలక్ష్మికి ఒక ఆశారేఖ అగుపించింది. గురునాథం గారి స్నేహితులలో ఒక పాటగా డొకాయన వున్నాడు. ఆయనకూడా సోమయాజులు పాట విన్నాడు. తన అభిప్రాయం జయలక్ష్మి వింటుండగానే గురునాథం గారికి చెప్పాడు.

"మనవాడు పూర్వజన్మవాసనవల్ల మంచిగాత్రంతో పుట్టాడు కాని, సరిగమల దగ్గర్నుంచీ కట్టుగా నేర్చుకుంటే గాని పాటగాడుగా రాణించలేడు" అన్నాడాయన.

"అట్లా ఐతే సంగీతం చెప్పిద్దాం" అన్నాడు గురునాథం.

సోమయాజులు గొప్ప పాటగాడు కావటానికి, పాడేశక్తి కోల్పోవటానికి అదే మొదలు.

సోమయాజులుకు చాల పెద్ద విద్వాంసుణ్ణి చూసి పెట్టారు. సాధన ప్రారంభించాడు. ఇంటిదగ్గరకూడా తంబురా పెట్టుకుని సాధన చేసేవాడు. అదివరలో తన మొగుడు గొంతెత్తితే పరవశమయ్యే జయలక్ష్మి ఈ సాధన బలవంతాన సహించవలసి వచ్చింది.

ఈ విధంగా సోమయాజులు మూడేళ్ళపాటు సంగీత శిక్షణ పొందాడు. రాగాల్లో భేదా లేమిటో, మేళకర్త లేమిటో, జన్యరాగా లేమిటో, ఆరోహణావరోహణ లేమిటో, తాళభేదాలూ జాతులూ అన్నీ నేర్చుకుని కర్ణాటక సంగీత విద్వాంసుడైనాడు.

అదివరకు తాను పాడిన "గాలిపాట" తలుచుకుని వాడు సిగ్గుపడేవాడు. కాని ఇప్పుడు వాడి పాటచూసి పరవశమయ్యేవాళ్ళు లేరు. సంగీత పాండిత్యంతో

వాణ్ణి తలదన్నిన హేమాహేమీలు వుండనే వున్నారు. ఏ రోజున రేడియోను మద్రాసుకు గాని తిరుచునాపల్లిగాని తిప్పినా సోమయాజులు జన్మలో సంపాదించ లేని కీర్తిని సంపాదించుకున్నవాళ్ళు వినిపిస్తారు! సోమయాజులు ప్రత్యేకత యేమిటి?

ఇప్పుడు సోమయాజులు పాడితే జయలక్ష్మి గుండె తటతట లాడటంలేదు. ఆమె వాణ్ణిప్పుడు పాట పాడమని అడగదు. వాడు రాగం పాడితే గొంతెత్తగానే రక్తిగా ఉండేది. ఇప్పుడు గంటా గంటన్నరా వింటేగాని అందులో ఏ రసమూ ఉత్పత్తికాదు.

"ఏమోయ్! ఇంత కష్టపడి ఇంత డబ్బు ఖర్చుచేసి నేర్చుకున్నావు సంగీతం. దీనివల్ల ఫలిత మేమిటోయ్?" అన్నాడు మామగారు.

"పాటకచేరీలు చేసుకోవచ్చు-ఎవరన్నా చేయిస్తే" అన్నాడు అల్లుడు సంకోచంతో.

చిత్రమేమిటంటే, సోమయాజులు సంగీతం నేర్చుకున్నందుకు సంతోషించిన వాడు సోమయాజులొక్కడే. పాపం, వాణ్ణి పాటకచేరీలు చెయ్యటానికెవరూ పిలవ లేదు.

వాడికి విద్వత్తు లేకపోవటం ఒక్కటే లోపమన్నట్టు వెనక మాట్లాడిన వాళ్ళు కూడా విద్వత్తు సంపాదించి వాడు పరిపూర్ణుడైనాడని హర్షించలేదు.

జయలక్ష్మి రేడియో యెప్పుడన్నా పెడితే సినిమా రికార్డులు పెట్టుకునేది. కాని ఆమెకు సంగీతంమీద వెనకటి ఆసక్తిలేదు.

* * * *

ఒకరోజు జయలక్ష్మి అన్న ఉద్యోగం మానేసి యింట్లోవుంటున్న రోజుల్లో గురునాథంగారింటికొక మనిషి వచ్చాడు. జయలక్ష్మి అన్న పరబ్రహ్మశాస్త్రి ఆయనతో ఏదో వ్యవహారం మాట్లాడాడు. పరబ్రహ్మశాస్త్రి తన బావమరిదిని పిలిచి ఆ పెద్దమనిషి దగ్గర పాడమన్నాడు. సోమయాజులు పాడాడు. ఆ తరువాత వాళ్ళు వాణ్ణి పంపించేశారు.

సోమయాజులు భార్య నడిగాడు.

"ఏవో నాటకాలు కంట్రాక్టు చేస్తారుట. మా అన్నయ్య చెప్పలా?' అన్నది జయలక్ష్మి అట్టే ఆసక్తి లేనిదానల్లే.

"నన్నెందుకు పాడమన్నారు?"

"ఏమన్నా వేషం వేయిస్తారేమో? పాడగలరుగద?" అన్నది జయలక్ష్మి.

ఆ మాట అక్షరాలా నిజమయింది.

ఈ సంఘటన జరిగిన నెలకల్లా పరబ్రహ్మశాస్త్రి పట్నంలో ఒకమూల యిల్లు తీసుకుని నటులను చేర్చి నాటకం రిహార్సల్స్ ఆరంభించాడు. ఆ పెద్దమనిషి - ఆయన పేరు శేషయ్య - పాటలు యెట్లా పాడాలో, డైలాగు యెట్లా నటించాలో

చెబుతూ వచ్చాడు. సోమయాజులుకు చాలా పాటలు పద్యాలు గల పాత్ర యిచ్చారు.

"నీకేం, బోలెడంత పాట ఉంది. పాడేస్తే చాలు. నాటకం రక్తికడుతుంది. నటించనక్కర్లేదు. కాస్తో కూస్తో నేను చెబుతాను. రెండునెల్లు రిహార్సల్సు నలిగితే తరువాత అసలు అనుభవమంతా స్టేజిమీద వస్తుంది" అన్నాడు శేషయ్య.

"ఇంత కష్టపడి సంగీతంనేర్చుకుని నేను స్టేజిమీద పద్యాలు పాడటమేమిటి?" అన్నాడు సోమయాజులు బావమరిదితో.

"అదే పొరపాటు. కోటివిద్యలూ కూటికొరకే. చెరువులో నీళ్ళుండి ఏంలాభం వాటిని మనం ఉపయోగించుకోవాలి" అన్నాడు శాస్త్రి.

రిహార్సల్సులో శేషయ్య సోమయాజులుకు పద్యాలెట్లా పాడాలో, ఎక్కడ నిలపాలో, ఎక్కడ రాగంతియ్యాలో, పద్యం ఎట్లా ఎత్తుకోవాలో, ఎట్లాముగించాలో చెప్పాడు. శేషయ్యకు గొంతులేదు. పాటరాదు. కాని పద్యం ఎట్లా చదవాలో తెలుసు. పద్యం చదవటంలోకాక రాగాలాపన చెయ్యటంలో ఆసక్తి మెండుగాగల సోమయాజులుకు సంగీతం ఖూనీ అవుతున్నట్టు తోచింది. శాస్త్రితో ఫిర్యాదుచేస్తే, శేషయ్య చెప్పినట్టు చెయ్యమన్నాడు.

రెండు నెలల్లో నాటకం పడింది. మొదటి ప్రదర్శనానికి అట్టే జనం రాలేదు గాని వచ్చినవాళ్ళు సోమయాజులు పాటకు తన్మయులైనారు. కొన్ని పద్యాలు మూడేసి సార్లుకూడా పాడించారు.

"ఆ వన్సుమోర్లు నాకు-నీకుకాదు!" అన్నాడు శేషయ్య.

"నాకు తెలుసు" అన్నాడు సోమయాజులు నిగర్వంగా.

ఈ నాటకం మొత్తంమీద రెండువందల ప్రదర్శనాలు పడ్డాయి. శాస్త్రి, శేషయ్య కలిపి పాతికవేలు లాభంచేశారు. సోమయాజులుకు ఆంధ్రదేశంలో స్టేజిమీద పాడగలవాడనే పేరు మాత్రం లభించింది.

అతనికి నాటకాలలో ఆఫర్లుకూడా రాసాగినై. ఆటకు యాభై మొదలు నూరు రూపాయల చొప్పున యిస్తామని అతనివెంట పడ్డారు నాటకాలవాళ్ళు. కాని వెళ్ళ వద్దని శాస్త్రి అన్నాడు.

పరబ్రహ్మశాస్త్రికింకా పెద్ద ఆలోచన లున్నాయి. అతను గ్రామఫోనూ, సినిమా పాటల రికార్డులూ కొన్నాడు. ముఖ్యంగా హిందూస్తానీ సినిమాల రికార్డులు.

"ఇదీ రేపటి సంగీతం. ఈ సంగీతంలో లక్షలున్నాయి. వీటిని బాగా పట్టుకోండి. ఈ బాణీ అలవాటైతే ఆ తరువాత యేం చెయ్యాలో చెబుతాను" అన్నాడు శాస్త్రి.

సోమయాజులు గొంతుకీ పంజాబీ సంగీతం - ఒక రాగలక్ష్యంగాని, ఒక శాస్త్ర నిబంధనగాని లేని ఈ కలగాపులగపు సంగీతం - పచ్చివెలక్కాయ అయి కూర్చుంది.

"ఇదేం సంగీతం? దీన్లో అర్థమేమిటి? దీన్ని నేర్చుకోవటమేమిటి? నా కిదెట్లా అబ్బుతుంది?" అని సోమయాజులు వాపోయినాడు.

"వినటానికి సుఖంగానే వుంటుంది. అందులో యేం లోపం వుంది?" అన్నది జయలక్ష్మి.

"అందులోవున్న సంగీత మేమిటి కనక?" అన్నాడు సోమయాజులు.

"అందులో ఏమీ లేదని మీరే అంటారు. అది ఎట్లా అబ్బుతుందని మీరే అంటారు; ఏది నిజం?" అన్నది జయలక్ష్మి సానుభూతి లేకుండా.

ఆకస్మికంగా సోమయాజులు సంగీతం విషయం ఆలోచించటం మానేసి జయలక్ష్మిని గురించి ఆలోచించసాగాడు. తనకోసం తనవాళ్ళందరితోనూ పోట్లాడి పెళ్ళాడిన జయలక్ష్మి తనకు దగ్గరగా వుండికూడా యెంత దూరమయింది! ఎందుకిట్లా అయింది? తను యే మహాసముద్రంలో యే దిక్కుగా ప్రయాణిస్తున్నట్టు? ఈ ఓడ ఏ రేవు చేరుతుంది? తను కష్టపడి కర్ణాటకం నేర్చుకున్నాడు. దాన్ని వదిలి నాటకం పద్యాల్లో పడ్డాడు. అవీ వొదిలేసి యిప్పుడు సినిమాపాటల్లో పడబోతున్నాడు! ఎవరి కోసం? ఎవరు మెచ్చుకోవటానికి? తనకేపాటా రానప్పుడు తన పాట విని ఆనందించిన వాళ్ళున్నారు. ఇవ్వాళ?

ఈ ప్రశ్నలకు నిజంగా సమాధానాలు లేవు. ఉంటే సోమయాజులకు తెలీవు.

వాడు ఏ పనీ సహంచేసే బాపతుకాదు. ఒక సంవత్సరమల్లా సినిమా సంగీతంలో మునిగితేలాడు. అందులో భావానికి గల ప్రాధాన్యం అర్థం చేసుకున్నాడు. వివిధ వాద్యాలు ఏ విధంగా వుపయోగిస్తారో ఊహించాడు. అందులో కొన్ని వాద్యాలు ఎట్లా వుంటాయోకూడా వాడికి తెలీదు. కాని వాటి ప్రత్యేకతలు వాడి చెవి పట్టింది.

శాస్త్రి చాలా సాహసమైన ఎత్తువేశాడు. ఎవరో సినిమా చిత్రం తీస్తుంటే అందులో తాను రెండణాల వాటా తీసుకున్నాడు. తన ఎత్తేమిటో శాస్త్రి సోమయాజులుకు చెప్పేశాడు.

"నేను పదిహేనువేలే పెడుతున్నాను. ఇది పోయినా నాకంత్యంతరలేదు. కాని నేను ఈ పిక్చరుకు గట్టి మ్యూజిక్ డైరెక్టరును పెడుతున్నాను. నువ్వు అతని వెంటవుండి సినిమా సంగీతం గురించి నేర్చుకోదగినదంతా నేర్చుకో. ఆ తరువాత ఏం చెయ్యాలో నేను చెబుతాను" అన్నాడు శాస్త్రి.

ఈ కొత్తచిత్రంలో పన్నెండు పాటలున్నాయి. ముందు పాటలే తయారు చేశారు. సంగీతదర్శకుడు ప్రసిద్ధుడూ, సమర్థుడూనూ. పన్నెండు పాటలూ పూర్తి అయి రికార్డు చేయటానికి రెండునెలలు పట్టింది. ఈ రెండు నెలలూ సోమయాజులు సమస్త విషయాలూ చూశాడు. కొన్ని పాటలలో అక్కడక్కడా మార్పులు కూడా

సూచించి, సంగీత దర్శకుడిచేత బాగుందనిపించుకున్నాడు. చివర ఒకటి రెండు పాటలు తనే స్వయంగా రాశాడుకూడాను!

పాటలన్నీ రికార్డయినై. వాటిని విన్నవాళ్ళు చాలా మెచ్చుకున్నారు. అదొక గొప్ప విషయంకాదు. సోమయాజులు రాసిన రెండు పాటలను యెవరూ గుర్తించలేదు. మిగిలిన పాటలతో సమంగానే అవీ వున్నాయి. ఆ ఆధారంమీదే శాస్త్రి సినిమాకంపెనీ ఆరంభించాడు. వీళ్ళింకా చిత్రాలు తీయలేదుగాని తీస్తారు. వాటికి సోమయాజులు సంగీత దర్శకుడుగా వుంటాడు. అచ్చంగా సంగీతంమీదే హొయ్యే చిత్రాలు తీస్తారు. వాటిమీద వచ్చేలాభం గురునాధంగారి మూడోలక్షలో చేరుతుంది. సోమయాజులు దేమీవుండదు. నాలుగైదు చిత్రాలవరకూ సోమయాజులుకు ఢోకా వుండదు. ఆ తరువాత అతని పాటలు పాతబడసాగుతాయి. ఆ తరువాత సోమయాజులు తెలకపిండి రూపంలో గానుగలోంచి తోడబడతాడు. గురునాధంగారి వ్యాపారరధం చెక్కుచెదరకుండా ముందుకుసాగిపోతుంది.

ఎక్కడో అనామకుడుగా పడివున్నవాణ్ణి తెచ్చి యింతవాణ్ణిచేసిన కీర్తి ఏ విధంగానైతే గురునాధంగారికి దక్కిందో, ఆ విధంగానే సోమయాజులులో సంగీతం - డబ్బుచేసే సంగీతం-ఇంకిపోయిన మర్నాటినుంచీ వాణ్ణి బతికున్నంత కాలమూ పోషించే భారంకూడా గురునాధంగారికే దక్కుతుంది. అందుకుగాను సోమయాజులు యావజ్జీవమూ వారికి కృతజ్ఞుడై వుండగలడు.

ముద్రణ : జనవరి 1950, ఆంధ్రజ్యోతి మాసపత్రిక

# అష్టకష్టాలు

ఎన్నడూ ఏ కష్టాలు ఎరుగని శివరామశాస్త్రిగారికి దేశంగాని దేశంలో అష్టకష్టాలూ సంప్రాప్తమయినాయి. అసలే దనికుడు - లక్షరూపాయల ఆస్తికి దత్తు పోయినాడు. ఆ పైన కాటకమప్పుడు[1] బాకీలవాళ్ళంతా చాలా ఆస్తి చచ్చుధరలకు అంటగట్టారు. దాంతో శాస్త్రి బాగా ధనికుడైనాడు.

డబ్బున్నచోట నలుగురు చేరడం సహజం. శాస్త్రిని పెంచుకున్న పెద్ద మనిషికి పరలోకప్రాప్తి కలిగినమీదట అమాయకుడైన శాస్త్రి చుట్టూ చాలామంది చేరారు. వాళ్ళందరికీ ఒకే ఆలోచన - శాస్త్రిని మరికాస్త ధనికుణ్ణి చేద్దామని. ఈ సదుద్దేశంతో డబ్బు సంపాదించేందుకు చాలా ఉపాయాలు చెప్పారు. అయితే, వైద్యులలైనే, ఈ శ్రేయఃకాములు ఒకరు చెప్పిన ఉపాయాన్ని ఒకరు చెప్పకపోగా, ఒకరు చెప్పిన ఉపాయాన్ని మరొకరు కొట్టియ్యటంకూడా జరిగింది. శాస్త్రి వస్తుతహా అమాయకుడు కనక, అందరుచెప్పినదీ వినక పోయినా కొందరు చెప్పిన సలహాలన్నా విని, ఇంత కలవాడు కనక, నాలుగు వ్యాపారాల్లోనూ నాలుగు డబ్బులు పెట్టాడు. పదివేలతో అవుతుందనుకున్న సినిమాహాలు పాతికవేలు దాటింది. 20 వేలు ధారపోసి రెండు బస్సులు కొన్నాడు. 30 వేలు పెట్టి మందులషాపు పెట్టాడు. మళ్ళా ఇంకొకళ్ళెందుకని, తనకు ఆయా సలహాలిచ్చిన శ్రేయఃకాములనే వాటి వాటిల్లో పెట్టేసి పూర్తిగా స్వతంత్ర మిచ్చేశాడు.

శాస్త్రిచేత తమకు నచ్చిన వ్యాపారాలు చేయించలేకపోయిన శ్రేయఃకాములు, శాస్త్రి సొమ్ము స్నేహితులు తెగ తినేస్తున్నారో అని గోలపెట్టారు: బస్సులమీద బోలెడంత లాభాలు వస్తున్నా శాస్త్రికి కానీ దక్కనివ్వకుండా మధ్యవాడు తినేశాట్ట! మందులషాపు మీద అంతులేని లాభం వస్తుంటే ఆ లాభాన్ని గల్లా పెట్టెదగ్గిరవాడు తినేశాట్ట! సినిమాహాలు నడిపినవాడు సాక్షాత్తు నష్టమే చూపించాట్ట! అందరూ తలా ఒకవిధంగా అన్నారు-శాస్త్రితోనే. కానీ అమాయకుడు కావటంచేత వినిపించుకోలేదు.

'అఁ వాళ్ళట్టా చేసేవాళ్ళుకారు. నా మేలు కోరినవాళ్ళు' అన్నాడు.

---

1. ఆర్థిక కాటకం (1929 - 34) ఇదే సంపుటంలోని 'వారసత్వం' నవలలో చూడండి.

కానీ ఎంత అమాయకుడైతే మాత్రం ఎన్నాళ్ళు నష్టం భరిస్తాడూ? బస్సుల మేనేజరునూ, మందులషాపు మేనేజరునూ, సినిమాహాలు మేనేజరునూ కూడా తీసేశాడు. ఊరికే తీసేశాడా? వాళ్ళను చూసి జాలిపడ్డాడు. 'పాపం, మీరేంచేస్తారు? నాకు కలిసివచ్చే గీతలేదు. నన్ను నమ్ముకుని మీరుకూడా ఇంతకాలం నష్టపడ్డారు' అంటూ తలా ఒక వెయ్యీ రెండు వేలూ వాళ్ళకి దక్షిణ కూడా ఇచ్చుకుని మరీ పంపాడు.

వాళ్ళు పోమన్నారు. ఎంత నష్టం వచ్చినా ఉంటామన్నారు. శాస్త్రికి లాభాలు చూపిస్తే గాని తమ జన్మలు తరించవన్నారు. కాని శాస్త్రి వినిపించు కోలేదు. తన అంతరాత్మ ఒప్పటం లేదన్నాడు. మిగిలిన చిల్లర వ్యాపారాల మాట అటుంచీ, ఈ మూడు వ్యాపారాలమీద శాస్త్రి యుద్ధం పూర్తి అయేలోగా[1] మూడు లక్షలు చేశాడు.

యుద్ధం అయిపోయే సమయానికి శాస్త్రిలో పూర్వం లేని గొప్ప గుణాలు తలయెత్తాయి. మొదటి సంగతి-శాస్త్రి చాలా దైవభక్తి కలవాడూ, మతభక్తి కల వాడూ అయినాడు.

శాస్త్రి తీర్థయాత్రలకు బయల్దేరటానికి ఇదే పెద్ద కారణం. ఈ తీర్థయాత్ర లోనే శాస్త్రి దగ్గిర వున్న డబ్బూ, సామానూ, టిక్కెట్లూ అన్నీ పోయాయి.

## 2

శాస్త్రి తీర్థయాత్రకు తన భార్యనూ చంటిపిల్లనూ మాత్రమే తీసుకుని బయలు దేరాడు. మిగిలిన పిల్లల్ని గాని, కనీసం ఒక నౌకర్నుగాని, చుట్టాన్ని గాని వెంట పెట్టుకు పోలేదు. అసలే రైలు ప్రయాణాలు బాధాకరంగా ఉన్నాయి. 'తేలికగా ప్రయాణించండి' అని రైల్వే శాఖ వారు ఒకవంక బొమ్మలతో సహా హెచ్చరిస్తూ ఉండిన రోజులు. రైళ్ళ అన్ని తరగతులలోనూ జనసమ్మర్థం చాల హెచ్చుగా ఉంది. అప్పటికీ శాస్త్రి తమ వెంట తీసుకుపొయ్యే సామాను సాధ్యమైనంత తక్కువ గానే ఉండేటట్టు చూశాడు. రెండు పక్క చుట్టలూ, ఒక ట్రంకుపెట్టే, ఒక మర చెంబూ, ఒక బుట్టా, రెండు చేతి సంచులూ, ఇంతే వీళ్ళు వెంటపెట్టుకు బయల్దేరారు. ప్రయాణం ఇంటరు క్లాసులో.

శాస్త్రీ భార్యా మొదటగా సింహాచలంలో దిగారు. అక్కణ్ణుంచి పూరీ జగన్నాథం వెళ్ళారు. తరవాత కలకత్తా వెళ్ళి, అక్కణ్ణుంచి కాశీ బయల్దేరారు.

---

1. రెండవ ప్రపంచ యుద్ధం ముగిసేలోగా (1945): ఇదే సంపుటంలోని 'వారసత్వం' నవలలో చూడండి.

సింహాచలం దాటినప్పటి నుంచే వాళ్ళ పని అయోమయంగా ఉన్నది. 'దేశం గాని దేశం' అని శాస్త్రి భార్య ఎన్ని వందలసార్లన్నదో తెలీదు. దేశంగాని దేశమే ఏమిటి? భాషగాని భాషా, మనుషులుగాని మనుషులునూ, వింత వింత బట్టలు కట్టుకుని, ఏవేవో భాషలు మాట్లాడే కూలీలూ, రైలు అధికార్లూ, ఇతరులు, తన మొగుడితో ఏమేమిటో మాట్లాడినప్పుడల్లా ఆ ఇల్లాలి ప్రాణం కొట్టుకుపొయ్యేది - వాళ్ళు ఎక్కడ టోపీ వేసి కాజేస్తారో అని. రహస్యమేమంటే ప్రపంచమంతా అనుకున్నట్లే, ఆవిడకూడా తన భర్త వొట్టి అమాయకుడని నమ్మేది.

కలకత్తాకు కాశీకి మధ్య చోరీ జరిగింది. ఎట్లాగో కష్టపడి శాస్త్రి భార్య పిల్లను పక్కన పడుకోబెట్టుకొని కాస్త నడుం వాల్చింది గాని శాస్త్రి రైల్లో తెల్లవార్లూ మేలుకొనే కూర్చున్నాడు. నిద్ర సుఖమెరుగదని ఊరికే అన్నారా? మధ్య స్టేషనులో టిక్కెట్టు కలెక్టరు వచ్చి శాస్త్రిని లేపి టిక్కెట్టు అడిగే సమయానికి ఆయన పక్కమనిషి మీదికి ఒరిగి నిద్రపోతున్నాడు.

శాస్త్రి పెట్టె కోసం తడువుకున్నాడు. పెట్టె కనబడలేదు. శాస్త్రి డబ్బూ, టిక్కెట్లూ, అందులోనే ఉన్నాయి. ట్రంకు పెట్టెతో బాటూ రెండు ప్రక్కచుట్లల్లో ఒకటీ, మరచెంబూ, బుట్టా, రెండు చేతి సంచులు కూడా పోయాయి.

శాస్త్రి ఎవరి నడుగుతాడు? దాదాపు పెట్టెలో వాళ్ళంతా నిద్రపోతున్నారు. తన సామానంతా పోయిందని శాస్త్రి టిక్కెట్టు కలెక్టరుకు విన్నవించుకున్నాడు.

టిక్కెట్టు కలెక్టరు ఏ స్టేషన్లో పోయిందని అడిగాడు. ఇది చాలా దయారహితమైన ప్రశ్న. కానీ శాస్త్రి తనకు తెలీదని ఒప్పుకోక తప్పింది కాదు. టిక్కెట్టు కలెక్టరు ఇంకా చాలా ప్రశ్నలు వేశాడు. ఎక్కణ్ణుంచి వస్తున్నారు? ఎక్కడికి పోతున్నారు? ఏ క్లాసు టిక్కెట్లు కొన్నారు? టిక్కెట్ల నంబర్లేమిటి? ఎంత ఖరీదైనాయి? మీ పేరేమిటి? అసలు ఏ దేశం?

ఈ ప్రశ్నలన్నింటికీ శాస్త్రి తెలిసినంత వరకు సమాధానాలు చెప్పాడు.

సామాను పోవటం కాదుగాని శాస్త్రి చాలా చిక్కుల్లో పడ్డాడు. మెల్లిగా రైలు పెట్టెలో వాళ్ళంతా లేచారు. ఒక్కొక్కరే శాస్త్రిని అనేక రకాల ప్రశ్నలు వెయ్యసాగారు. అందరూ ఇంగ్లీషు భాష మాట్లాడలేదు. కొందరు హిందీ, ఒకరిద్దరు మార్వాడీ కూడా మాట్లాడారు.

పక్క స్టేషనులో గార్డు వచ్చాడు. ఏవో రాసుకున్నాడు.

'బనారస్‌లో ఎక్కడ దిగుతాడు? సిటీలోనా, కాంటన్మెంటులోనా?'

శాస్త్రికి సరిగా జ్ఞాపకం లేదు. ఎక్కడో దిగాలని చెప్పాడు. రెండూ విన్న పేర్లే. టిక్కెట్టు మీద ఏమున్నదోకూడా సరిగా చూడలేదు. చిక్కేమిటంటే? ఎవరో తెలుగాయన కనపడి, హౌరా స్టేషనులో ఆ టిక్కెట్లు తెచ్చి పెట్టాడు.

ఆయన చిల్లర సరిగా ఇచ్చిందీ, లేందీ చూసుకోవటానికైనా వీల్లేనంత హడావిడ అయిపోయింది.

శాస్త్రి ఏ ఉద్దేశంతో వెళుతున్నదీ తెలుసుకుని గార్డు బెనారస్‌కు కాంటో న్మెంటులో దిగమన్నాడు. స్టేషను మాస్టరుకు టెలిగ్రాం ఇప్పిస్తానన్నాడు.

# 3

తెల్లవారింది. శాస్త్రి పెళ్ళాం శోకాలు పెట్టింది. ఏవేళ బయలుదేరామో నన్నది. ఎవరి మొహం చూశామో నన్నది.

'పోనీలే. పోయినదంతా కలిపితే రెండు వందలు చెయ్యదు' అన్నాడు శాస్త్రి. ఇంటిదగ్గర బయల్దేరింది లగాయతు ఆయన ప్రతిపూరికీ టెలిగ్రాం మని యార్డరు తెప్పించుకుంటున్నాడు కాని ప్రయాణ ఖర్చంతా దగ్గిర ఉంచుకోవడం లేదు.

కాని ఇతర కష్టాల గురించి ఆయస ఆలోచించ లేదు. మొట్టమొదట మొహం కడుక్కోవటం దగ్గరే కష్టాలు ఆరంభమయాయి. పళ్ళపొడి పోయిన సంచీలో ఉండిపోయింది.

బండి కాశీ చేరటానికి ఏ పదో అవుతుంది. బేడ పెట్టి రెండు పూరీలూ కూరా తిందామంటే జేబులో బేడాలేదు.

చంటిపిల్లకు పోతపాలు, అది లేవగానే పాలడుగుతుంది.

ఇవన్నీ ఒక్కటొక్కటే శాస్త్రికి జ్ఞాపకం రాసాగాయి.

'తీరా కాశీ స్టేషను చేరగానే కూలివాళ్ళచేత సామాను దింపించాల్సి వస్తుంది. వాళ్ళకేమివ్వను? నా డబ్బు పోయిందంటే వాళ్ళూరుకుంటారా? అను కున్నాడు శాస్త్రి. ఈ కష్టం గురించి ఆలోచిస్తూండగానే తసకు దించే సామాను ఒక పరుపు చుట్టేనని జ్ఞాపకం వచ్చి గుండె గుభేలు మన్నది.

'ఆఁ- ఏముంది? కాశీలో దిగిన మరుక్షణం అర్జెంటు వైరిచ్చి సొమ్ము తెప్పిస్తాను' అనుకుని మనసును స్వస్థపరచుకున్నాడు శాస్త్రి.

ఎందుచేతనో రైలు ఒక చిన్న స్టేషనులో ఆగి మరికదలలేదు. అది మామూలుగా ఈ రైలు ఆగే స్టేషను కాదు. ఏమయిందంటే ఏమయిందని అందరూ ఒకరినొకరు చాలసేపు అడుగుకున్నాక, అవతలి స్టేషనులో లైను కడ్డంగా గూడ్సుపెట్టెలు రెండు అంతకుమునుపే పడిపోయినట్టు తెలిసింది.

గంట గడిచింది. రెండు గంటలు గడిచాయి. చంటిపిల్ల లేచింది. పాల కేడుపు లంకించుకుంది. ఎందుకు పిల్ల ఏడుస్తుందని అందరూ అడిగారు. పాల కేడు స్తున్నదంటే, 'అయ్యో, పాపం!' అని ఊరుకున్నారు.

శాస్త్రి పెళ్ళాం ఆరాటం చెప్పడానికి వీలులేదు. ఇంత సంపదా ఉండి తన కూతురికి గుక్కెడుపాలు కరువై, దేశంగాని దేశంలో ఆకలికి రోదించేగతి సంప్రాప్తమవుతుందని ఆ యిల్లాలు కలలోకూడా అనుకోలేదు. మానవజాతి పుట్టిన తరువాత చంటిపిల్లకు పాలులేక ఏడవటమనేది మొట్టమొదటిసారి తన ఒడ్డకే సంప్రాప్తమయిందనుకున్నది. చన్ను కుడిపింది. కాని తన దగ్గర పాలులేవు. పిల్ల ఒక్క క్షణం నోరుమూసిందేగాని మరింత గుక్కపట్టి మళ్ళా ఏడుపు లంకించుకుంది.

'అట్లా చూస్తూ కూచుంటా రేమండీ? పోయి ఎవరన్నా చుక్క పాలిస్తారేమో అడగండి!' అన్నది శాస్త్రి భార్య.

శాస్త్రి ఎవరి నడుగుతాడు? తన స్నేహితుడయిన గార్డు నడిగాడు. గార్డు మాత్రం ఏం చెయ్యగలడు? స్టేషను మాస్టర్నడిగాడు. స్టేషను మాస్టరు ఇంటికి కబురుచేసి పాలు తెప్పిస్తానన్నాడు.

'పాలు తెప్పించి ఏం లాభం? పిల్ల కొమ్ముచెంబూ, రబ్బరు పీకా లేందే తాగలేదు' అన్నది శాస్త్రి భార్య. అవి రెండూ ఇంకో సంచితోబాటు పోయాయి.

'ఏదో ఒకటి చెయ్యాలి. ఇంట్లో అమరినట్టు అన్నీ అమరుతాయా?' అన్నాడు శాస్త్రి.

స్టేషను మాస్టరు పాలు తెప్పించాడు. మట్టిపిడతతో పాలు వచ్చాయి. పాల నిండా ఏదో సన్నని బొచ్చులాటిది తేలుతున్నది.

మట్టిపిడత నోటి కందిస్తే పిల్ల తాగలేక కొరబోయి ఏడిచింది.

ఈ సమయంలో ఒక నల్లటి మనిషి తోసుకుని ముందుకువచ్చి హిందీలో 'ఇట్లాతే బిడ్డను' అన్నది. శాస్త్రిభార్య అర్థంకాక చూస్తూంటే ఆ మనిషి శాస్త్రి భార్య దగ్గర్నుంచి బిడ్డను లాక్కుని ఒక పక్కగా తీసుకుపోయి పాలివ్వసాగింది.

శాస్త్రి కూతురు కాళ్ళూ చేతులూ ఆడిస్తూ ఆకలిమీద రెండు పక్కలా పాలు పీల్చేసింది.

ఇతరులతో పని ఉన్నప్పుడు ఎంత అలగా మనుష్యులనైనా ఆకాశానికెత్తటం అలవాటయిన శాస్త్రిభార్య దాన్ని తెలుగులో తెగ ఉబ్బెయ్యసాగింది. కానీ దానికి ఆవిడమాట ఒక్కటీ అర్థం కాలేదు.

'ఆ మనిషికొక అణో, బేడో ఇవ్వండి సంతోషిస్తుంది. చాలా బీదమనిషి' అన్నాడు స్టేషను మాస్టరు, ఇంగ్లీషు బలవంతాన మాట్లాడుతూ.

'నా దగ్గిర కాణీ లేదు. నా సామానంతా ఎత్తుకు పోయినారు. టికెట్లుకూడా పోయాయి' అని శాస్త్రి బీద అరుపులు అరిచాడు.

స్టేషను మాస్టరే తన జేబులోనుంచి ఒక అణా తీసి పాలిచ్చిన మనిషి కిచ్చాడు.

# 4

శాస్త్రి కాశీ చేరే సమయానికి రెండయింది. తనకూ పెళ్ళానికీ పిల్లకు ఆకళ్ళు దహించుకు పోతున్నాయి. పిల్ల పోరు పెట్టి ఏడుస్తున్నది. ఎప్పుడో తొమ్మిది న్నరకు తాగిన పాలు. అయితేనేం? తెలుగు మాట్లాడే పండా ఒకడు రైలులో తగి లాడు. తన వెంటవస్తే అన్ని ఏర్పాట్లూ చేయిస్తానన్నాడు. చేశాడు కూడాను. ఆరోజు సాయంకాలం మూడింటికి అర్జంటు టెలిగ్రామిస్తే - మర్నాడు పదింటికల్లా రెండు వందల రూపాయలు వచ్చేశాయి. కష్టాలు ఎల్లకాలమూ ఉంటాయా-అవతల ఇంత ఉన్నవాళ్ళకి?

ముద్రణ : 4 ఆగష్టు 1950, తెలుగు స్వతంత్ర

# ఉద్యోగం

సరస్వతీ ప్రచురణల సంస్థలో పని చెయ్యాలని నాలుగేళ్ళుగా నా ఆరాటం. నేను బొత్తిగా వీధుల్లో అడుక్కు-తింటున్నవాణ్ణి కాననుకోండి. పుస్తకాల షాపులో కునికిపాట్లు పడుతూ, నెలకో నూటయాభై తెచ్చుకుంటున్నాను. నేనూ, నా భార్యా, పిల్లలూ ఒకపూట ఫలహారం చేసినా ఒక పూట తింటూనే ఉన్నాంగాని బొత్తిగా పస్తులుండటం లేదు. మైలుదూరంలో బీచి ఉన్నది గనుక రోజూ నడిచిపోతాం. జమీందార్లల్లే బీచిగాలీ, బీచిదృశ్యాలూ[1] అనుభవిస్తాం. వేరుకడలెవాళ్ళు[2] వచ్చి తమ బుట్టలు మా ముఖాల మీద పెట్టినప్పుడు పక్కకు చూస్తాం. అవసరమైతే పిల్లలకేసి గుడ్లు ఉరుముతాం. కడుపుల్లో ఆత్మారాముడు కలవర పెట్టినప్పుడు లేచి ఇంటికి బయలుదేరి వెళ్ళి ఇంత ఫలహారం తిని, కడుపులో నీళ్ళు కదలకుండా నిద్రపోతాం.

పుస్తకాల షాపు ఉద్యోగానికి వంక పెడుతున్నా ననుకునేరు. ఆదేమీ లేదు. దివ్యమైన ఉద్యోగం. అందులోనూ పట్నం బ్రాంచి, ఖామందు మనుషులు ఎన్నడో తప్ప రారు. స్కూళ్ళూ, కాలేజీలూ తెరిచిన రోజుల్లో తప్ప ఆటే పని ఉండదు. ఎప్పుడో ఎవరో వచ్చి ఏ శతకమో, దండకమో కొనుక్కు పోతారు. ఆ తరవాత కూర్చొని కబుర్లు చెప్పుకోవటమే.

కొందరికి వినోదాల వేలం వెర్రి-సినిమాలూ, నాటకాలూ, పాటకచ్చేరీలూ, అప్పుడప్పుడూ ఎగ్జిబిషన్లూ, ఎప్పుడైనా సర్కసులూ · ఎందుకివన్నీ? డబ్బుఖర్చు. పట్నంలో కానీ ఖర్చు లేకుండా ఎంత వినోదమైనా ఉంది. పార్కుకుపోయి చెట్ల కేసి చూడు. ఊరికే రోడ్డువెంట నడుస్తూ పోయినా ఎంతో అందమైన ఇళ్ళూ, వాటిముందు ఎంతో అందమైన తోటలునూ, ఏ సినిమాల్లో చూస్తాం? కొన్ని కొన్ని ఇళ్ళు చూస్తే అలాటి ఇళ్ళలో ఉంటే ఎంత మజాగా ఉంటుందో ఆలోచిస్తూ నెలలు గడపవచ్చు. నా మటుకు నేను సాయంకాలం పూటవెళ్ళి దేర్‌హాస్ దగ్గిర నిలబడితే, ఏ ఇంగ్లీషు సినిమానో చూస్తున్నట్లుంటుంది. వచ్చే బస్సులూ, పొయ్యే బస్సులూ, జనమూ, దూరంగా వెళ్ళే ఎలక్ట్రిక్ రైళ్ళూ...ఎంత సందడి, ఏమిటి సంగతి? ఎన్ని జాతుల మనుష్యులు! ఎన్ని రకాల తలకట్లు! తిరుపతి వెళ్ళొచ్చే

1. మద్రాసులో బీచి.
2. వేరుసెనగకాయలు / పల్లీలు అమ్మేవాళ్ళు.

వాళ్ళ మాట కాదు; ఆడవాళ్ళమాట....తమాషా చూశారోలేదో కొన్నేళ్ళ క్రితం సినిమాలను విమర్శించేవాళ్ళు-ఎక్కడా లేని యిళ్ళూ, బట్టలూ, స్టయిల్సూ సినిమాల్లో చూపుతారని! ఇప్పుడు నేను చూసే ఇళ్ళూ, పాషన్లముందు సినిమా సెట్టింగులూ, స్టయిల్సూ దిగదుడుపుకు పనికిరావు....

అంచేత నేమిటంటే, నేను 'సరస్వతి ప్రచురణ'లో చేరాలని మనసు పడింది కేవలం డబ్బు కోసం అనుకోకండి....డబ్బు చేదని కాదు, ఇంకో యాభయ్యో, వందో హెచ్చువస్తే రెండో పూట కూడా తిండే తింటాం, ఫలహారం మానేసి....

'సరస్వతీ ప్రచురణలు' పేరు ప్రఖ్యాతులు గల సంస్థ. మా పుస్తకాల షాపు లాగా ఊరూ, పేరూ లేనిదికాదు. సగటున రోజుకో పుస్తకం వేస్తారు. ఒక రకం పుస్తకాలా? ఆడవాళ్ళ పుస్తకాలు, మగవాళ్ళ పుస్తకాలు; ముసిలాళ్ళ పుస్తకాలు, పిల్లల పుస్తకాలు; అమ్మాయిల పుస్తకాలు, అబ్బాయిల పుస్తకాలు; బొమ్మలుండే పుస్తకాలు, లేని పుస్తకాలు; గద్య పుస్తకాలు, పాఠ్యపుస్తకాలు; నీతి పుస్తకాలు, నేరం పుస్తకాలు; వేదాంత పుస్తకాలు, విజ్ఞాన పుస్తకాలు; బెస్టు సెల్లర్లు, వరస్ట్ సెల్లర్లు-సమస్తమూ వేస్తారు.

పుస్తకాలు రాసేవాళ్ళు రోజూ తీర్థప్రజగా వస్తారు. ఎప్పుడన్నా వెళ్ళండి. వాళ్ళ ఆఫీసు రిజర్వుబ్యాంకంత సందడిగా ఉంటుంది. ప్రొడక్షన్ సెక్షను, డిజైను సెక్షను, ప్రూఫ్‌రీడర్ల సెక్షను, పేపరు స్టోరు, కంపోజింగ్ సెక్షను, ప్రింటింగ్ సెక్షను, బైండింగ్ సెక్షను, సేల్స్ సెక్షను, పబ్లిసిటీ ఆఫీసరు, ప్రింటింగ్ స్పెషలిస్టు-చెప్పతరం కాదు. అటువంటిచోట పడ్డట్టాయెనా, నేనింక భవిష్యత్తు గురించి ఆలోచించుకో అక్కర్లేదు. నెల తిరిగే సరికి వెంకటేశ్వర స్వామి హుండీలో మూడు లక్షలూ పడ్డంత గ్యారంటీగా నెలతిరిగే సరికి జేబులో జీతం డబ్బులు పడతాయి. అక్కడ పనిచేసే మందిలో నాకు దిష్టి అట్టే తగలదు.

నేనా? ఏదైనా చేస్తాను. ప్రూఫులు దిద్దుతాను, డిస్పాచ్ చేస్తాను, ఉత్తరాలు టైపు కొడతాను. ఖాకీడ్రెస్సూ, ఖాకీటోపీ పెట్టుకొని ఆఫీసుబాయ్‌గా అటూ ఇటూ హడావుడిగా తిరగమన్నా తిరుగుతాను. ఏ పని ఇచ్చినా విశ్వాసంతో చేస్తాను.

ఆ మాటే రాశాను-నేను పెట్టుకున్న మూడు దరఖాస్తుల్లోనూ. 'తమరు నాకు తమ మహోన్నతమైనటువంటి సంస్థలో ఏ చిన్న ఉద్యోగం ఇచ్చినా నేను తమకు జన్మజన్మలకూ ఋణపడివుంటాను. నన్నూ, నా కుటుంబాన్నీ తమరే ఉద్ధరించిన వారవుతారు. నా సంసారబాధలూ, సొంతబాధలూ పట్టించుకోకుండా తమ పనితోనే నిమగ్నుడనై ఉండగలవాడను' అని రాశాను, కాని మూటికీ సమాధానాలు లేవు.

మొదటి అప్లికేషను ఎవరికీ చూపకుండా పంపాను. దానికి అతీగతీ లేక పోయేసరికి, నా రెండో అప్లికేషన్ను, ఎందుకైనా మంచిదని, చంద్రానికి చూపించాను.

'ఏమిట్రా ఈ బీద అరుపులూ? నిన్ను పెట్టుకుంటే వాళ్ళ లాభాలు పెంచటానికి విశ్వప్రయత్నం చేస్తానని రాయి, పనికొస్తుంది' అన్నాడు.

ఆ సమయంలో అక్కడే వున్న చంద్రం దావమరిది 'ఇప్పటికే వాళ్ళు టాక్సు కట్టలేకుండా ఉన్నారేమో! సోషలిస్టు వే ఆఫ్ లైఫ్ రావద్దా మరి? గొప్ప కాపిటలిస్టుయితే తప్ప మధ్యతరకం వాళ్ళి బతకనివ్వరు. చిన్న రకంవాళ్ళే చావనిస్తారు. చిన్నకారు మధ్యకారు కాపిటలిస్టులు సింద్రీ చేరితే, ఓ రెండు పుంజీల కాపిటలిస్టులు మాత్రమే మిగులుతారు. ఆ తరువాత సోషలిస్టు వే!' అన్నాడు.

అతను తానేదో గొప్ప తెలివిగల వాణ్ణనుకుని నాన్సెన్స్ మాట్లాడుతాడు. అది తనకూ అర్థంకాదు. ఇతరులకీ అర్థంకాదు.

నేను చంద్రం దావమరిదికేసి కొరాకొరా చూశాను. నాక్కావలసింది చంద్రం సలహా - వాడి దావమరిది వదురుడు కాదు.

'అయినా ఈ అప్లికేషన్లు అనేవి ఇప్పుడు ఔటాఫ్ డేట్. కాగితం ముక్కలకి విలువలేదు. నిండు ప్రాణులు నీ పక్షాన నిలబడి పనిచేసి పెట్టాలి. అప్పుడే పని అవుతుంది' అన్నాడు చంద్రం.

నా కెవడు శిఫార్సిస్తాడు? నేను 'సరస్వతీ' వాళ్ళ నెవర్నీ ఎరగను. ఒకళ్ళిద్దరి ముఖాలు తెలిసి మాత్రం ఏం లాభం? వాళ్ళు ఏం చేస్తారు? ఎందుకు చేస్తారు?

చంద్రం ఎటూ తేల్చి చెప్పక పోవటంచేత ఆ అప్లికేషను పోస్టు చేసేశాను.

జవాబుకోసం మూడు నెల్లు ఎదురు చూశాను. ఈ మధ్యకాలంలో 'సరస్వతీ' వాళ్ళు కనీసం ముగ్గురు కొత్తవాళ్ళకు ఉద్యోగాలిచ్చినట్టు నాకు తెలియవచ్చింది.

ఈసారి మూడో అప్లికేషను ఇంతా వినయంగా రాసి, ఎందుకైనా మంచిదని పెద్దవాడూ అనుభవజ్ఞుడూ అయిన మా ఎదుటింటి త్రివిక్రమరావు గారికి చూపించాను. ఆయన తన గొయ్యి కుర్చీలోంచి కష్టపడి లేచివెళ్ళి కళ్ళజోడు తెచ్చుకుని, ముందు మొదలూ చివరా చదివాడు. తరువాత మధ్యవాక్యాలు చదివాడు. చిట్టచివరకు మిగిలిన వాక్యాలు చదివాడు. తాపీగా కళ్ళజోడు తీసి కాగితం నాకిచ్చి, కళ్ళు నలుపుకుని, 'అదే పొరపాటు' అన్నాడు.

నా గుండె జారిపోయింది.

'అప్లికేషను సరిగా లేదాండీ?' అన్నాను.

ఆయన చెయ్యెత్తి రెండు మూడుసార్లు అడ్డంగా తిప్పాడు. దాని అర్థం అప్లికేషను బాగాలేదని కావచ్చు. అసలు విషయం అది కాదని కావచ్చు. నన్ను మాట్లాడవద్దనీ కావచ్చు. అర్థం ఏదైనా నేను మాట్లాడటం వృధా. అంచేత నోరు మూసుకుని ఆయనకేసి కళ్ళు పెట్టుకు చూశాను - 'సెలవివ్వండి' అన్న పోజులో.

'కాపిటలిజం - అనగా పెట్టుబడిదారీ' - అని బరువుగా అని త్రివిక్రమ రావుగారు ఆగాడు.

నేను మాట్లాడక, ఆయన్నే మాట్లాడనిచ్చాను.

'–యొక్క ఫస్ట్ ప్రిన్సిపల్ ఏమిటంటే–' అన్నాడాయన ఇంకా బరువుగా. 'నౌఖరీ ఇచ్చేవారు ఫ్రీ యేజెంట్; పుచ్చుకునేవాడూ ఫ్రీ యేజెంట్....అంచేతేమిటీ? నువు నీ లేబర్ పవర్ - అనగా శ్రమశక్తి అవతలివాడికి ఇంతకని అమ్మేస్తావు. వాడు కొనుక్కుంటాడు. వాడిస్తానన్నది నీకు గిట్టుబాటు కాదూ, వెళ్ళిపోతావు.'

'వెళ్ళిపోనండి. వారిస్తామన్నదాంతోనే సరిపెట్టుకుంటానండి. అవసరమైతే రెండు పూట్లా ఫలహారమే చేస్తాం. తప్పుతుందా? హరిశ్చంద్రాదులకి తప్పలేదు' అన్నాను.

త్రివిక్రమరావుగారు చాలా బాధలో ఉన్నట్టు మొహంపెట్టి, గార్డు పచ్చ జెండా ఊపినట్టు చెయ్యి గబగబా వూపాడు. అది నాకు ఎర్రజెండా అని గ్రహించి మౌనం వహించాను.

'నువ్వడిగేది అవతలివాడికి హెచ్చుగా తోస్తుందీ - వాడు నీకు ఉద్యోగం ఇవ్వడు.'

'నాకు జీతం వొద్దన్నా వీళ్ళు ఉద్యోగం ఇచ్చేట్టు లేరండి' అన్నాను. అని, ఆయన చెయ్యి ఊపేలోపల ఆగిపోయి, ఇంక మాట్లాడనన్నట్టు పోజు పెట్టాను.

'అంచేత నేమిటంటే, ఈ కృతజ్ఞతలూ, ఋణపడి ఉండటాలూ, ఇదంతా అప్లికేషన్‌లో అప్రస్తుతం.'

'మీరన్నది నిజమే అనుకోండి. కాని ఉద్యోగం ఇవ్వగలవాడు ఒకడూ, ఉద్యోగం కావలసినవాళ్ళు పదివేలమందీ ఉన్నచోట ఉభయులూ ఫ్రీ ఏజెంట్లెలా అవుతారండీ?' అన్నాను.

ఆయనకు కోపం వచ్చినట్టుంది.

'అలా అయితే మరి నీ యిష్టం' అన్నాడాయన. అదే ఆఫీసై ఉండి, ఆ పక్కనే కాల్‌బెల్ ఉన్నట్లయితే, ఆయన ఆ కాల్‌బెల్ కొట్టి, నౌకర్ని పిలిచి 'ఈయన్ని బయటికి పంపు' అనేవాడే!

ఆయన అంతపనీ చేసినట్టుగానే భావించి, నేనే లేచి, ఆయనవద్ద సెలవు పుచ్చుకుని, రోడ్డుదాటి ఇంటికి వచ్చేసి, ఆ అప్లికేషను ఆ పూటే పోస్టు కూడా చేశాను.

నెల రోజులైంది. జవాబు లేదు. ఉంటుందని నే ననుకుంటే గదా!

* * *

పొద్దున్నే మా యింటిముందు టాక్సీ వచ్చి ఆగితే నేను అయోమయంలో పడ్డాను. మా యింటి కెవరూ రారు. టాక్సీలో అసలేరారు. ఎవరో ఎడ్రసు తెలీక వెతుక్కుంటూ వచ్చి ఉంటారనుకున్నాను. అందులోనుంచి పొడుగ్గా మా పార్వతీశం దిగేసరికి నాకు మరింత ఆశ్చర్యమయింది. పార్వతీశం నాకు సయానా పెత్తల్లి కొడుకు. వాణ్ణి నేను చూసి పదేళ్ళయింది. వాడెక్కడ ఉంటున్నాడో, ఏం చేస్తున్నాడో నాకు ఉజ్జాయింపుగా కూడా తెలీదు. టాక్సీలలో తిరిగేపాటి డబ్బు సంపాయిస్తున్నాడన్న మాట! పోనీ, అదే చాలు.

'ఏంరోయ్, ఎప్పుడు రావటం?' అన్నాను వీధిలోకి వెళ్ళి.

'నేను వచ్చి మూడు రోజులయింది' అన్నాడు పార్వతీశం, టాక్సీవాడితో ఏదో అని లోపలికి వస్తూ.

'ఇక్కడే దిగకపోయావా?'

'ఎందుకు మీ ఆవిడకు శ్రమ? 'దాసప్రకాశ'[1]లో దిగా. మళ్ళీ ఇవ్వాళ సాయంకాలం ప్లేనులో వెళ్ళిపోతున్నా.'

టాక్సీలతో పోనివ్వక విమానాల్లో కూడా తిరుగుతున్నాడు! ఇకనేం? ఏం చేస్తున్నావని నేను వాణ్ణి అడగాలేదు, వాడు చెప్పాలేదు. నేనేం చేస్తున్నాననీ, ఎంత జీతమనీ అడిగాడు. దాచకుండా చెప్పాను. వాడేమీమాట్లాడలేదు. మా ఇల్లు చూశాడు. పిల్లల్ని చూశాడు. మా ఆవిడ కాఫీ ఇస్తానని బయపెడితే, అంతకు ముందే తాగానని తప్పించుకున్నాడు. (ఇంట్లో కాఫీ పొడి లేదు. బహుశా పాలూ లేవు. ఎలా ఇద్దామనుకుందో? అయినా ఆడవాళ్ళ విద్యలు మనకు అర్థం కావు!) భోజనం చేసి వెళ్ళమన్నది-అదీ ఒక విధమైన బెదిరింపే.

'ఏ ఒంటిగంటకో తింటాను. ఈ లోపల పదిచోట్లకు తిరగాలి' అన్నాడు వాడు.

ఓ అరగంట సేపు కబుర్లు చెప్పుకున్నాం-పదేళ్ళకు పూర్వంవి. తరువాత వాడు బయలుదేరే ప్రయత్నంచేస్తూ, 'బట్టలువేసుకో. అలా తిరుగుదాం' అన్నాడు.

నేను ఎందుకనిగాని, ఎక్కడికనిగాని అడక్కుండా, వేసుకుని ఉన్న బనీనుమీద చొక్కావేసుకుని, 'రెడీ' అన్నాను. కార్లలోనూ, విమానాల్లోనూ తిరిగే

1. మద్రాసులో ఒక ప్రముఖ హోటల్.

వాడు సయానా నాకు పెత్తల్లి కొడుకు కాకపోయినప్పటికీ, ఏట్లో దూకమంటే దూకే స్తాను. వాడివెంట తిరగటానికి నేను మహాచేస్తే ఓ పూట షాపుపని ఎగ్గొట్టవలసి రావచ్చు. అదొక లెక్కలోది కాదు. షాపు రేపుంటుంది. పార్వతీశం ఇవాళ సాయంకాలానికల్లా విమానం ఎక్కేస్తాడు.

టాక్సీ బయట వేచున్నది. అందులో ఎక్కికూర్చునేటప్పుడు మీటరు చూశాను. అయిదు రూపాయలు దాటింది. నా రోజు కూలి!

ఆ టాక్సీ తిన్నగా 'సరస్వతీ' ప్రొప్రయిటరింటికి పోకపోయినట్లయితే ఈ కథలోకి పార్వతీశం వచ్చి ఉండకపోను. నా కథలోకి వాడు అలా ఇలా కాదు-బాగానే వచ్చాడు.

'సరస్వతీ' ప్రొప్రయిటరు అల్లుడూ, పార్వతీశమూ మంచి స్నేహితులట. ఇద్దరూ ఒక ప్లేనులో వచ్చారు. మళ్ళీ ఒకే ప్లేనులో వెళ్ళిపోతున్నారు కూడాను. — మేం రాగానే ప్రొప్రయిటరు అల్లుడికి పార్వతీశం నన్ను పరిచయం చేశాడు. అతను నన్ను తన మామకు పరిచయం చేశాడు.

'వీడు నాకు చాలా దగ్గిర బంధువండి. ఏదో పుస్తకాల షాపులో రాట్ అవు తున్నాట్ట. మీ ఇన్‌స్టిట్యూషన్‌లో ఇటువంటి వాడికి ఆపర్చునిటీ దొరకదా? వీళ్ళ నాన్న ప్రెస్ నడిపాడు. వీడికి ప్రెస్ పని బాగా తెలిసి ఉండాలి. సగం అందుకే పుస్తకాల షాపులో ప్రవేశించాడేమో. ప్రెస్ వాసన వాడి రక్తంలో ఎక్కి ఉండాలి' అన్నాడు పార్వతీశం.. అదొక జోక్ అనుకున్నట్టు అందరూ నవ్వారు. నేనూ నవ్వాను మరి. ఎందుకో చెప్పలేను. సరస్వతీ ప్రొప్రయిటరు నవ్వినప్పుడల్లా నాకూ్కడా నవ్వేబుద్ధయింది.

'ఆపర్చునిటీ ఎందుకుండదూ? లేకపోతే క్రియేట్ చేద్దాం!' అన్నాడు స. ప్రొ.[1]

బ్రహ్మదేవుడు ప్రత్యక్షమైనప్పుడు హిరణ్యకశిపు డెలా ఫీలయి ఉంటాడో నేను ఊహించగలిగాను....

వివరాలన్నీ ఇక్కడ ఏకరువు పెట్టనవసరం లేదు. స.ప్రొ. నా ఎడ్రసు తీసు కున్నాడు. నే నా మధ్యాహ్నం దాస ప్రకాశ్‌లో రెండు రూపాయిలన్నర అంచి తీసుకున్నాను.

ఆ రోజు నేనాఫీసుకేసి పోలేదు. ఆ ఆఫీసు - అదే, ఆ పుస్తకాల షాపు - ఏనాడో చచ్చిపోయినట్లు నాకు భావన కలిగింది. ఇక నేనక్కడికి పుస్తకాలు కొన డానిగ్గూడా పోనేమోననిపించింది. ఆ సాయంకాలం పార్వతీశం ప్లేనుకు వెళ్ళిపోయి ఉంటాడు.

1. సరస్వతీ ప్రొప్రయిటరు సంక్షిప్త రూపం.

కాని మర్నాడు నేను షాపుకు యథాప్రకారం వెళ్ళినప్పుడు నిన్న జరిగిన దంతా కలో, సినిమానో అన్నట్టున్నది. మూడు అప్లికేషనుల్లో కూడా నా ఆద్ర స్తున్నది. అదే ఎడ్రసును కాగితం ముక్కమీద రాసుకున్నంత మాత్రాన స.ప్రా. నాకు ఉద్యోగం ఇస్తాడా? ఏదో మా పార్వతీశం తృప్తికోసం అలా అన్నాడు. 'సరస్వతీ ప్రచురణలు మిథ్య. పుస్తకాల షాపు నిత్యం' అనుకున్నాను.

అక్కడే పొరపాటు పడ్డాను. ఈ మిథ్యావాదం నా తలలో బాగా ఇంక నిచ్చి ఓ వారం రోజుల అవతల నాకో ఉత్తరం వచ్చింది. నేను వచ్చి, నా యిష్టం వచ్చినప్పుడు సరస్వతీ సంస్థలో పని ప్రారంభించవచ్చునని.

నేను స.ప్రా.కు అన్యాయం చేశాను. పార్వతీశం వెళ్ళిన మర్నాడే ఆ ఉత్తరం టైపయింది. ఎందుచేతనో వెంటనే అది పోస్టు కాలేదు. పెద్ద సంస్థగదా! ఉత్తరాలు టైపు కొట్టినాక నాలుగురోజులు నానబెట్టి మరీ పోస్టు చేస్తారల్లే వుంది.

ఉత్తరం అందిన మర్నాడే సరస్వతీ ప్రచురణాలయానికి వెళ్ళాను. నడిచీ బస్సుమీదా, నడిచీ అక్కడికి చేరాను. గేటువాడు నన్ను చాలా అనుమానంగా చూసి, 'ఎక్కడికి? ఏం పని? ఎవరితో పని?' అని అడిగి, స.ప్రా. సంతకం గల ఉత్తరం తలకిందులుగా పెట్టి చూసాక, రిసెప్షనిస్టు గదికేసి చెయ్యి ఊపాడు.

రిసెప్షనిస్టు నన్ను అప్పుడల్లే చూసి నవ్వి, 'నేను తమకేం చేయగలనండి?' అని ఇంగ్లీషులో అడిగాడు. క్రిస్టియన్ లాగున్నాడు.

నేను స.ప్రా. సంతకం గల ఉత్తరాన్ని అతనికికూడా చూపాను.

'వోంట్యూ ప్లీస్ టేక్యూర్ సీట్?' అని, టెలిఫోన్‌లో ఏదో నంబరు కాల్ చేసి, 'హీజిడ్జ్ నిజ్‌సీడ్ ఎడ్ మోమన్' అన్నాడు. ఆ తరువాత ఆ అబ్బికి నాలో పూర్తిగా ఆసక్తి పోయింది.

నేను దాదాపు పావుగంటసేపు కూర్చున్నాను. టెలిఫోన్ మోగుతూనే ఉంది. అతను అందులో మాట్లాడేటప్పుడు పులిలాగో, పిల్లిలాగో తప్ప మధ్యస్థంగా కుక్కలాగాని, గేదెలాగాగాని మాట్లాడనే లేదు.

ఉన్నట్లుండి అతను అకస్మాత్తుగా నాకేసి చూసి, 'యూర్ స్టిల్ హియా?యూడ్ బెటర్గో యినైథింక్!' అన్నాడు.

వాణ్ణి చంపబుద్ధయింది, 'నన్ను ఎప్పుడైనా లోపలికి పంపగలవాడు పావు గంటసేపు ఎందుకు నిలవేసి వుంచినట్టు? మా పుస్తకాల షాపులో ఇంత అర్థం లేకుండా ఎవరూ ప్రవర్తించరు. వాడిమీద స.ప్రా. తో ఫిర్యాదు చేద్దామా అన్నంత కోపం వచ్చింది.

నేను లోపలికి వెళ్ళాను. అడుగడుగునా నన్ను ఎవరో ఒకరు అటకాయించి, ఎవరితోపని అని అడుగుతూనే వచ్చారు. నేను నా దగ్గరున్న బ్రహ్మాస్త్రం వాళ్ళకు

చూపుతూనే వచ్చాను. ఏ ఒక్కరూ దాన్నిచూసి బెదిరినట్టు కనిపించలేదు. నన్ను ఒక్కడు మరొకడి దగ్గరికి తీసుకెళ్ళాడు. ఆ మనిషి స్టేషనులో బుకింగ్ క్లార్క్ లాగున్నాడు. స.ప్రొ. మాత్రం కాదు- ఆయన్ని నేను చూశాను.

ఈ బుకింగ్ క్లర్క్ నన్ను చూడగానే 'ఏమిటి?' అన్నట్లు తల ఆడించి, అర్జంటు పనిమీద ఉన్నవాడిలాగా టెలిఫోన్ రిసీవరు ఎత్తి డయల్ చెయ్యబోయి, మానేసి, రిసీవరు పెట్టేశాడు; తరవాత ఎదురుగా ఉన్న నోట్ పాడ్ దగ్గిరకి లాక్కుని జేబులోంచి పెన్నుతీసి, దాని కాప్‌తీసి, ఏదో రాయబోయి మానేసి, కాప్ మళ్ళా పెట్టేసి, పెన్ను మళ్ళా జేబులో పెట్టేసుకున్నాడు. ఆ తరవాత తనకు కుడిపక్కనున్న మాగజీను ఎత్తి, పెద్ద చప్పుడుతో ఎడమ పక్కనపెట్టి అప్పుడు తల ఎత్తి నాకేసి చూసి, 'ఏం? ఏమిటి? ఏంపని?' అని తాను అడగదలుచుకున్న ప్రశ్నకోసం తడవుకున్నాడు.

బు. క్లా.[1] ఏదో మెంటల్ కేసని నాకు అనుమానం వేసింది.

అంతదాకా మౌనంగా నిలబడేవున్న నేను 'ప్రొప్రయిటరుగారిని చూడాలండి' అన్నాను.

బు.క్లా. ముఖం కోపంతో కందగడ్డలాగయింది. ఆయన పొగలూ, మంటలూ కక్కుతూ, నిలువున వణికిపోతూ, 'అడ్డమైనవాళ్ళందర్నీ ప్రొప్రయిటరు గారు చూడాలండీ! మేమంతా ఉన్నదెందుకిక్కడ? మీ ఘనమైన పనేమిటో నాకు చెబితే నేనే చూడగలను. అదీగాక - ఫర్ యువర్ ఇన్ఫర్మేషన్ ప్రొప్రయిటరు గారు ఊళ్ళోలేరు. ఊటీ వెళ్ళారు. ఇంకా పదిహేను రోజులుదాకా రారు' అన్నాడు.

'సరే, నాకేమీ తొందరలేదు. పదిహేను రోజులయాక, టెలిఫోను చేసి-మరీ వస్తాను,' అన్నాను.

'ఆయన ఊళ్ళో ఉంటేమాత్రం స్వయంగా చూస్తారనేమిటి? మా దగ్గరికే మిమ్మల్ని పంపవచ్చు-' అన్నాడు బు. క్లా. తన వాలకమంతా మార్చేసి.

'మేము, మా దగ్గరికి' అని ఆయన ఎవర్ని తనలో కలుపుకుంటున్నాడో, లేక తానే పదిమంది పెట్టనుకుంటున్నాడో నాకు తెలియలేదు; నేనాయన మాట విని-పించుకోకుండా బయటికి నడిచాను.

బయటికి అడుగు పెట్టగానే ఒక కళ్ళజోడాయన ఎదురై, నన్ను చూసి ఆగాడు. ఎందుకోగాని, ఆయన్ను చూడగానే నాకు నా బ్రహ్మాస్త్రాన్ని ఆయన-చేతికివ్వబుద్ధయింది. ఇస్తూ 'ప్రొప్రయిటరుగారు వూళ్ళోలేరుట' అన్నాను.

---

1. బుకింగ్ క్లార్కు సంక్షిప్తరూపం.

కళ్ళజోడు బ్రహ్మాస్త్రాన్ని చదువుకుని, 'ఆయన లేకపోతేనేం లేండి - ఇలారండి-' అంటూ దగ్గిరిలోనే ఉన్న ఒక గదిలోకి దారితీశాడు. మేము ప్రవేశించేదాకా గది ఖాళీగానేవున్నా, పైన ఉన్న ఫాను మాంచి జోరులో తిరుగుతున్నది!

కళ్ళజోడు బల్ల వెనక్కిపోయి కూర్చుంటూ నన్ను తన కెదురుగా కూర్చోమన్నాడు.

ఇద్దరమూ కూర్చున్నాక ఆయన పుట్టెడు దిగులుతో, 'ఖాళీలేమీ లేవండీ! మీ రేంపని చెయ్యగలరూ?' అన్నాడు.

వ్యవహారం మొదటికొచ్చింది. నాదేం పోయింది? ప్రొప్రయిటరుగా ఉండమన్నా ఉంటాను. మొదలీ కళ్ళజోడుకు గేట్ కీపరు పని అయినా యిప్పించే త్రాణ ఉన్నదీ లేనిదీ నాకు తెలీదు.

'ఏపని ఇచ్చినా చేస్తానండీ! ప్రొప్రయిటరుగారు ఏమిద్దామనుకున్నారో నాకు తెలీదు,' అన్నాను.

'అదే వచ్చిన చిక్కు. ప్రొప్రయిటరుగాడు ఏమీ అనుకోరు. ఆ డిటేల్సన్నీ మే మే చూసుకోవాలి,' అన్నాడు కళ్ళజోడు.

ఈయనకూడా 'మేం' అనే అంటున్నాడు. స. ప్రొ. గారి పనులన్నీ చేసేటందుకొక క్లబ్బులాంటిది ఉన్నట్టుంది.

నేనేమీ జవాబు చెప్పలేదు. ఆయన నన్నేమన్నా అడిగాడు గనుకనా?

'చూడండీ ఒక ప్రూఫ్‌రీడర్ సీటు ఖాళీ అయింది. ఉన్న ప్రూపురీడర్లలో ఒకాయన టర్నప్స్ కంపెనీకి కాషియర్‌గా వెళ్ళిపోయాడు. ప్రస్తుతం అందులో చేరుతారా ఏమిటి, ప్రొప్రయిటరుగారొచ్చేదాకా?' అన్నాడు కళ్ళజోడు.

నే నాటే మతిమంతుణ్ణి కాను. నా కున్న మతికూడా పోతున్నట్లయింది. ఖాళీలు లేవని క్షణం క్రిందట అన్నవాడు, ప్రూఫ్‌రీడరు సీటు ఖాళీగా ఉందంటున్నాడు. ఆ సీటు ఖాళీచేసినవాడు ఇంకెక్కడికో ఎకౌంటెంటుగా పోవడమేమిటి? ఎకౌంటెంటు పనిచెయ్యదగినవాడు ఇక్కడ ప్రూఫ్‌రీడరుగా ఎందుకు పనిచేస్తున్నాడు? రేపు ఇక్కడి కంపోజిటరు ఫిలిం డైరెక్టరుగా వెళ్ళిపోతే? జీవితం ఇంత వైరానుపత్రా?!

అది సరే, ఆ ప్రూఫ్‌రీడరు పని కావాలో వద్దో నన్ను నిర్ణయించమంటా డేమిటీ? నన్ను ఆఫీస్ బాయ్‌గా వేసే అధికారంకూడా ఈ కళ్ళజోడుకు లేదనే అనుమానంతో 'పోనీ, అదే ఇప్పించండి,' అన్నాను.

'ఆల్ రైట్!' అంటూ ఆయన టెలిఫోన్‌నెత్తి, డయల్ చెయ్యటానికి వేలు కూడా ఎత్తి, 'జీతం ఎంత ఇమ్మన్నారు?' అని అడిగాడు.

'ఓ వెయ్యి తగలేయించండి' అందామని మహా అనిపించింది. కాని అనే త్రాణ లేదు.

'మీరు ప్రూఫ్‌రీడర్ల కేమిస్తారో నాకేం తెలుసు?' అన్నాను.

'ఇప్పుడున్న చోట మీ కేమిస్తున్నారు?' అని అడిగాడు కళ్ళజోడు.

చెప్పాను, నిజమే చెప్పాను.

'సరే, అంత తక్కువ ఇవ్వటం జరగదనుకోండి. అయినా ప్రొప్రయిటరు గారు వచ్చాక ఆ సంగతి తేల్చుకోవచ్చు' అన్నాడాయన.

నేను ఉభయభ్రష్టుణ్ణవుతానని భయం వేసింది.

'పోనివ్వండి. నాకేమీ తొందరలేదు. ప్రొప్రయిటరుగారు వచ్చాకే జాయినవుతాను' అంటూ లేచాను.

'మీ యిష్టం' అన్నాడు క. జో.

* * *

వారం రోజులు గడవనిచ్చి ప్రతిరోజూ 'సరస్వతి'కి టెలిఫోన్ చేస్తూ వచ్చాను.

'ప్రొప్రయిటరుగారు వచ్చారా?'

'ఎక్కణ్ణుంచి?'

'ఏమో, నాకేం తెలుసూ? ఊరికి వెళ్ళారన్నారే?'

'ఏ ఊరూ?'

టెలిఫోను పెట్టేశాను.

ఇంకోసారి -

'ప్రొప్రయిటరుగారు ఊళ్ళోకొచ్చారా?'

'మీ రెవరు? . . ఏం పని? ఉద్యోగం విషయమా? ఉద్యోగాల విషయం టెలిఫోనుమీద మాట్లాడటానికి వీల్లేదండి.'

ఈసారి అవతలవాడే పెట్టేశాడు.

మరోసారి -

'ప్రొప్రయిటరుగారు ఎప్పుడొస్తారండి?'

'తెలీదు. వారీపూటే హైద్రాబాదు వెళ్ళారు.'

'ఊటీనుంచి ఎప్పుడు తిరిగొచ్చారు?'

'అయ్యో, నాకు తెలిసినంతవరకు వారు ఊటీకాని, కొడైకానలుగాని, డార్జిలింగుగాని, మరే చల్లని కొండ ప్రదేశంగాని వెళ్ళలేదు.'

ఎవడో చెడిబతికిన జర్నలిస్టు. పాపం!

టెలిఫోను నేనే పెట్టేశాను ..

ఓ రోజున మా షాపుకు ఒక బట్టతలాయనవచ్చి, 'రాధికా సాంత్వనం[1] గాని వైజయంతీ విలాసం[2] గాని, అలాంటిదే మరో పుస్తకంగాని ఉందా?' అని అడిగాడు.

ఒక అరడజను బూతు పుస్తకాలు ఆయనముందు పడేశాను. ఆయన వాటి లోని రసవత్తర ఘట్టాలను, ఈగలు పుండును పసికట్టినంత తేలిగ్గా పసికట్టి, మెరిసే కళ్ళతో చదవసాగాడు. ఏదీ కొనడని అప్పుడే ఊహించాను.

"అయ్యా! తమరెక్కడ పనిచేస్తుంటారు?"

'ఊఁ?' అన్నాడు పరధ్యానంగా బట్టతల.

'ఏంలేదు. తమర్ని ఎక్కడో చూసినట్టుంది.'

రసవద్ఘట్టం నుంచి మహా అయిష్టంగా ఊడి వచ్చి, 'నేనా? సరస్వతీ ప్రచుర ణాల్లో' అంటూ బ. త.[3] బుడుంగున మళ్ళీ పుస్తకంలో మునిగాడు.

నా తల్లో ఫ్లడ్ లైటు వెలిగింది.

'కావలిస్తే ఈ పుస్తకాలు ఇంటికి పట్టుకెళ్ళి, చదువుకుని రెండు రోజుల్లో మళ్ళీ తెచ్చి ఇవ్వొచ్చు. కాని, ఒకటి చెప్పండి. తమరు సరస్వతిలో ఏం పని చేస్తారు?'

సెక్సుకన్నా ఇంపైన విషయం ఎత్తినట్టున్నాను - ఆయన రాధికా సాంత్వ నానికి స్వస్తి చెప్పేసి, నాకేసి చూసి ఒక వింత నవ్వు నవ్వి, 'సరస్వతిలో నేనేం చెయ్యాలని అడిగితే ఇంకా బావుండేది. అయ్యా, అక్కడ నేను చెయ్యనిదంటూలేదు. అన్ని డిపార్టుమెంట్లవాళ్ళూ పిలుస్తారు. చంపేస్తారనుకోండి! (ఏదో జ్ఞాపకం వచ్చి గట్టిగా నవ్వాడు.) ఓసారో గమ్మత్తయింది. మా జెనరల్ మానేజర్ నాకోసం పది చోట్లకి టెలిఫోన్ చేశాట్ట. ఎక్కడా లేను. నా మీద ఇంత పొడుగున రాసి ప్రొప్ర యిటరు గారికి పంపాడు. అంతసేపూ నేను ప్రొప్రయిటరు గదిలోనే ఉన్నాను, చాలా అర్జెంటు విషయం మాట్లాడుతూనూ. 'డోంట్ మేక్ సిల్లీ కంప్లైంట్స్, జీ.కే. వాజ్ విత్మీ ఆల్ ది టైమ్' అని మా ప్రొప్రయిటరు టెలిఫోనులో జనరల్ మానే జర్ని గట్టిగా చివాట్లేశాట్ట. 'జీ. కే. వాజ్ విత్మీ ఆల్ ది టైమ్!' 'హహ్హహ్హహ! ఆల్ ది టైమ్!' అంటూ బ. త. గొప్ప పారవశ్యంలో-రాధికా సాంత్వనం కూడా ఇవ్వని ఆనందంలో - పడ్డాడు.

'అయితే చూడండి బాబూ, ప్రొప్రయిటరుగారు ఊళ్ళో ఉన్నారా?' అని అడిగాను.

---

1. రాధికా సాంత్వనం (క్రీ.శ. 1740) ముద్దుపళని శృంగార ప్రబంధం.
2. వైజయంతీ విలాసం (క్రీ.శ. 1600) సారంగు తమ్మయ్య విప్రనారాయణ చరిత్ర ఆధారంగా రాసిన ప్రబంధం.
3. బట్ట తల సంక్షిప్త రూపం.

'ఏమిటి కథ?'

నా బ్రహ్మాస్త్రం పైకి తీశాను. అది ఈ పాటికి కొంత షాప్ సాయిల్ అయి వున్నది. ఇంకొంతకాలమైతే తూకానికి అమ్మవలసిందే!

బ. త. (లేక జీ. కే.) కాగితాన్ని వాటర్ మార్కుతో సహా పరీక్షించి 'ఇది డ్రాఫ్ట్ చేసినవాడు రాంబందు. రాంబందు అన్నది ముద్దుపేరులెండి. అసలు పేరు రాంబ్రవం. ఏం ఉత్తరమండీ ఇదీ! వాడి శ్రాద్ధం డ్రాఫ్టూ! ప్రొప్రయిటరు చెప్పేది సరిగా వినడు. విన్నది అర్థం కాకపోతే క్లారిఫై చేసుకోడు, ఏదో ఖాళీ చూసి మిమ్మల్ని అపాయింటు చెయ్యమని ప్రొప్రయిటరు చెప్పివుంటాడు. కనీసం జీతం ఎంతివ్వాలో కూడా అడిగి తెలుసుకోకుండా ఇలా తలా తోకలేని లెటర్ డ్రాఫ్ట్ చేసే శాడు. ఈ దేభ్యానికి కంపెనీ కారు పోతుంది! వాడిపిల్లలు స్కూలుకు పోవటానికీ, భార్య పేరంటానికి పోవటానికీ, అందరూ కలిసి తిరపతి వెళ్ళటానికి కంపెనీ కారే! వాళ్ళింట్లో ఎవరూకూడా కంపెనీకారులో తప్ప వీధి గుమ్మం దాటి వెళ్ళరను కోండి!' అంటూ చాలా విషయాలు చెప్పాడు.

ఆ ప్రవాహానికి సిమెంటులేని ఆనకట్ట వేసి 'అయితే నన్నింతకీ ఏం చెయ్యా మన్నారు?' అన్నాను.

'కొంచెం ఆలోచించుకోనివ్వండి' అంటూ బ. త. చూపుడువేలితో ముక్కు మీద అయిదారు సార్లు లయప్రకారం కొట్టుకున్నాడు. చాలామంది నుదుటిమీద కొట్టుకుంటారు. ఈయనకు నుదురుండాలిసిన చోట ముక్కున్నట్లుంది. ఆయన పైకి ఆలోచిస్తున్న వాడల్లే 'ప్రొడక్షన్‌లో ఖాళీ లేదు. సేల్స్ సెక్షన్లోనూ లేదు. ప్రూఫ్ రీడర్స్‌లోనూ లేదు' అని ప్రారంభించాడు.

'ఒక ప్రూఫ్‌రీడర్ సీటు ఖాళీ అయిందన్నారే?' అన్నాను. 'క్రిందటి వారం ఒక ఎమ్మే బి యల్ ఆ సీటు భర్తీ చేశాడు. అన్నట్టు ఒక జూనియర్ ఎకౌంట్స్ క్లార్కు కావాలండీ! ఆ సీటు ఖాళీ కాబోతున్నది' అన్నాడు బ. త.

నాకు ఆసక్తి పుట్టింది. 'ఆ సీటులో ఉన్న వారెక్కడికి పోతున్నారండీ?' అన్నాను.

'నీలగిరి టీ ఎస్టేటుకు డిప్టీ మేనేజరుగా పోతున్నాడు.' అనుకున్నట్టే అయింది.

ఆయన ఇంకా చాలా విషయాలు చెప్పాడు. వాళ్ళ కంపెనీలో ఉన్నవాళ్ళు బాగుపడతారట. గోడౌను కీపరు జీతం నూరురూపాయలట. బయటికి పోయిన వాళ్ళు యింకా బాగుపడతారట. సంపాదన వెయ్యికి పైనే ఉంటుందట. అదెలా సాధ్యమన్నాను.

'స్టాక్ చెకింగ్ చేసినప్పుడు కదండి తెలుస్తుందీ? అధమం పాతికవేల రూపా యల పుస్తకాలైనా షార్టయి ఉండాలి. ఆ గోడౌనులోకి ఎవరు పోతారు? ఎలా చెకింగు చేస్తారు? మహాసముద్రం!"

పోతూ పోతూ బి.త. నన్ను మర్నాడు పదకొండూ, పన్నెండూ గంటల మధ్య తమ ఆఫీసుకు రమ్మనీ, తనను చూడమనీ అన్నాడు. అలాగే నన్నాను.

మర్నాడు నేను 'సరస్వతి'కి వెళ్ళేసరికి పన్నెండు కావస్తున్నది. దేవుడు ప్రత్యక్షమైనట్టుగా ప్రొప్రయిటరుగారు ఎవరో ఇద్దరు పెద్ద మనుషులతో మాట్లాడుతూ గేటుదగ్గిరే కనిపించాడు. ఆయనా నాకేసి చూశాడు. కాని నమస్కారం చెయ్యటానికి నేను చేతులెత్తుతూండగానే ఆయన చూపు తిరిగి పోయింది.

ఆయన నన్ను గుర్తించినట్లు లేదు. నేను తెల్లలాల్చీ వేసుకోక గళ్ళ లాల్చీ వేసుకున్నందు వల్లనేమో!

ఆ ఇద్దరు పెద్దలూ నమస్కారాలు చేసి సెలవు పుచ్చుకుంటూండగా నేను స.ప్రొ.ను సమీపించి, నమస్కారం చెప్పాను.

ఆయన చిన్నగా నవ్వి, 'ఎవరూ?' అన్నాడు.

'పార్వతీశం మా పెత్తల్లికొడుకేనండి!' అన్నాను.

ఆయనకు లింకు దొరికినట్టు లేదు.

'ఏ పార్వతీశం? మా ఫ్రెండరా?' అన్నాడాయన.

'కాదండీ! మీ అల్లుడుగారి కలీగ్. ఆరోజు మేమిద్దరం తమ దర్శనం చేసుకున్నాం. తమరు నాకు ఉద్యోగం ఇస్తామన్నారు. మీ ఆఫీసునుంచి ఈ ఉత్తరం వచ్చింది. వచ్చికూడా శాన్నాళ్ళయింది.'

మడతలదగ్గిర చిరుగు చూపుతున్న బ్రహ్మాస్త్రం పైకితీశాను. 'రాంభద్రం రాసినట్టుందే? ఒరే! వీర్ని రాంభద్రం దగ్గిరికి తీసుకుపోరా!' అని ఒక ఖాకీ టోపీగాడికి నన్ను అప్పగించి, స.ప్రొ. మెల్లిగా నడుచుకుంటూ, దారివెంట కనిపించినవాడినల్లా ఆకర్షించి, చిన్నగుంపును పోగుచేసుకుంటూ వెళ్ళిపోయాడు.

'రాంబందు' అన్న ముద్దు పేరుగల రాంభద్రం నా ప్రాణానికి సరికొత్త వాడు. ఆయన నన్ను చూసి పెదవి విరిచాడు. బ్రహ్మాస్త్రం చూసి మళ్ళీ పెదవి విరిచాడు.

'ఖాళీ లేమీలేవు' పెదవి విరిచాడు. 'ఎప్పుడనంగా రాసిన ఉత్తరం! ఇన్నాళ్ళేం చేస్తున్నారు?' పెదవి విరిచాడు. పెదవి విరుస్తూనే టెలిఫోను ఎత్తి ఏదో నంబరు డయల్ చేసి ఇంకెవరితోనో మాట్లాడాడు. పెదవి విరిచాడు. ఇంకో నంబరు డయల్ చేసి ఇంకెవరితోనో మాట్లాడి మళ్ళీ పెదవి విరిచాడు.

'మీ ఎడ్రసిచ్చి పొండి,' అన్నాడు.

ఈ లెక్కన వాళ్ళ ఫైళ్ళనిండా నా ఎడ్రసులే ఉంటాయి. నాకేం నష్టం! ఎడ్రసిచ్చి వచ్చేసాను.

అంతే, ఆ తరవాత ఏమీ జరగలేదు. మరి సెలవా?

ముద్రణ: 1 ఆగష్టు 1947, ఆంధ్రజ్యోతి మాసపత్రిక.

# నిరుద్యోగం

కోటేశ్వర్రావు తన కుర్చీలో కూర్చుని డ్రాయరు తాళంచెవులకోసం జేబు తడువుకుంటుండగా ఆఫీసు కుర్రవాడు వచ్చి "మిమ్మల్ని మేనేజరుగారు రమ్మంటున్నారు" అన్నాడు.

కోటేశ్వరరావు గుండె చిన్న అడుగేసింది. మేనేజరుగారు రమ్మంటున్నారనే వార్త కోటేశ్వరరావుకు ఓ తెరలాంటిది. దాని వెనుక ఏ బూచులున్నాయో తెలీదు. ప్రతిసారి మేనేజరు చీవాట్లు పెట్టడానికే పిలువడు. అయినప్పటికీ, పాతకాలపు వాళ్ళకి, టెలిగ్రాం వచ్చిందంటే ఎంత భయమో-కోటేశ్వర్రావుకు మేనేజరు పిలుపంటే అంత భయం. చిన్నప్పటినుంచి ఆతనికి కీడెంచి మేలెంచే అభ్యాసం. ఈ భయం ఇక్కడితో ఆగక ఆ ఆఫీసు కుర్రాణ్ని చూసినప్పుడల్లా కూడా అతని గుండె చిన్న అడుగేస్తూ ఉంటుంది. వాడు మేనేజరుగారి ప్రత్యేక నౌకరు. ఒక అశుభవార్త లాంటివాడు. వాడు తానున్న చోటికి వచ్చినప్పుడల్లా, వాడు వచ్చినది తనకోసం కాదని రూఢియైనదాకా, కోటేశ్వరరావు గుండె చిందు తొక్కుతూనే ఉంటుంది.

గబగబాలేచి కోటేశ్వరరావు మేనేజరు సమక్షానికి వెళ్ళాడు. మేనేజరు తల ఎత్తిచూసి "ఓ వచ్చావా? కూర్చో!" అన్నాడు. 'తమరు నన్ను మందలించటానికి పిలవలేదులెండి, అది నాకు తెలుసులెండి!' అన్నట్టుగా కోటేశ్వరరావు మేనేజరుకేసి ఒక నవ్వు పారేశాడు. అది అతనికి మామూలే.

"నువ్వీ ఆఫీసులో మూడేళ్ళపైగా పనిచేస్తున్నావు. ఆఫీసు సంగతులు నీకు తెలియనివికావు. క్రిందటేడు ఎట్లాగో నష్టం లేకుండా బయటపడ్డాం. కాని ఎవరికి బోనసు లివ్వలేకపోయాం, అక్కడకదే ఎంతో దిగజారుడనిపించింది. ఎందుకంటే, 1949లో మనం నాలుగేసి నెలలు జీతాలు బోనసిచ్చాం. ఆ రోజులు అయిపోయాయి ఇక రావు. ఈ యేడు మనం ఖచ్చితంగా నష్టంలో పడుతున్నాం. రిట్రెంచిమెంటు లేకుండా చూద్దామని చాలా ఆలోచించాం. కాని లాభం లేకపోయింది. జీతాలివ్వలేని పరిస్థితి కూడా ఏర్పడబోతున్నది. అందుచేత-"

మేనేజరుగారు డ్రాయరులోంచి ఒక చిన్న కవరు పైకి తీశాడు.

"ఈ మూడేళ్ళు నువు చాలా శ్రద్ధగా పనిచేశావు. నీ పనిలో నిజానికి ఏ లోపమూ లేదు. కాని-పరిస్థితులు చెప్పానుగా? ఇదిగో-ఈ నెలజీతమూ, నోటీసుకు బదులు మూడు నెల్ల జీతము ఇస్తున్నాను. అదృష్టం ఉంటే రేపీపాటికి ఇంతకన్న మంచి ఉద్యోగం దొరకవచ్చు."

మేనేజరు అందించే కవరు తీసుకోవటానికి కోటేశ్వరరావు చెయ్యి జంకింది. అది ముట్టుకున్న మరుక్షణం తన కేసు పునర్విచారణకు అవకాశం కాస్తా జారిపోతున్నట్టు భయం వేసింది. "నా ఒక్కడి జీతం ఆఫీసుకు బరువయిందా? ఎంతో విశ్వాసంగా పనిచేశాను. ఏ లోపం చెయ్యలేదు. బయట కూడా ఆఫీసును గురించి ఎన్నడూ అగౌరవంగా మాట్లాడలేదు-" తానేమంటున్నదీ కోటేశ్వరరావుకే తెలీదు.

"అంతా నిజమే. కాని ఈ విధంగా నిర్ణయం జరిగిపోయింది. ఇంకో రహస్యం కూడా చెపుతాను. నా నమ్మకం ఈ రిట్రెంచిమెంటు తాత్కాలికమేనని. జనవరి నుండి ఆఫీసు పరిస్థితి కాస్త చక్కబడుతుందనే ఆశ వుంది. అయితే ఈ మాట వాగ్దానంగా మటుకు భావించవద్దు."

"మీరు తలుచుకుంటే-"

"నావల్ల అయేది ఏమీలేదు. ఇక నువ్వు వెళ్ళవచ్చు."

కోటేశ్వరరావు కవరు తీసుకొని పరధ్యానముగా[1] విప్పి చూసుకున్నాడు. లోపల నోట్లున్నాయ్. అవి తీసి లెక్కపెట్టటం అతనికి సాధ్యం కాలేదు. లోపలి కోటుజేబులో కవరు దాచిపెట్టి "జ్ఞాపకం ఉంచుకోండి, నేనింకే ఉద్యోగం కోసం ప్రయత్నించను, వీలు దొరకగానే కబురుచేయండి!" అన్నాడు.

మేనేజరు, "ఓ-అట్లాగే" అన్నాడు. ఆయన ఏదో చిరునవ్వు ఆపుకుంటున్నట్టు కోటేశ్వరరావుకు అనిపించిందిగాని అది భ్రమ అయివుండాలి. తన దుస్థితిని చూచి మేనేజరు ఎందుకు నవ్వవలసి వస్తుంది? తమకేం శత్రుత్వమా?

మేనేజరు గదివెలుపల నౌకరు కుర్రాడు కనిపించాడు. ఈ ఆఫీసుకు తన కన్న, వాడు అవసరం కావటం - తాను ఉద్యోగం మానిన ఇంకో ఆరు నెలలకు వాడింక ఇక్కడే యథాప్రకారం మేనేజరు బెల్ కొట్టినప్పుడల్లా హాజరవుతూ, మేనేజరు ఎవరిని పిలవమంటే వాళ్ళని యములవాడల్లే పట్టుకెళ్ళుతూంటాడన్న భావం - కోటేశ్వరరావుకు విచిత్రంగా తోచింది. తనకు ఉద్వాసన! ఆలోచిస్తే ఏదో అబద్ధంలాగా ఉంది. పోనీ, తాను శేషాచలమల్లే అసమర్థుడైతే? లేదూ, నారాయణమూర్తిలాగా చాటున అమ్మ ఆలి బూతులు తిట్టేవాడైతే! అదేంకాదే ... ఒక

---

1. కొ.కు. శైలికి సరిపడని కావ్యభాషారూపం.

రోజు మేనేజరు తనని పిలిచి ఎట్లా మెచ్చుకున్నాడు! "ఈ ఆఫీసులో నీ వంటి వాళ్ళి ద్దరుంటే చాలు, ఎంతపని అయినా సాధించగలం" అన్నారు. ఆ సంఘటన తలచు కుంటేనే ఈ క్షణంలో కోటేశ్వరరావుకు శరీరం వెచ్చగా అయిపోయింది. పోయిన విజయదశమికి ఆఫీసులో ప్రసాదం అదీ తయారుచేశారు. ఈ మేనేజరే "కోటేశ్వర రావుకు ప్రసాదం అందినట్లు లేదు!" అన్నాడు. "లేదండి, నేను ముందే పుచ్చు కున్నా!" నన్నాడు తాను ఎంతో కృతజ్ఞతతో....ఇదంతా అబద్ధమే? అసంభవం! తన జీవితంతో ఈ ఆఫీసుకు ఇంత తలవని తలంపుగా రుణం తీరిపోయిందా? పోట్లిది. ఇది నిజంగా తాత్కాలికమే. జరిగిన మూడు సంవత్సరాల ఉద్యోగము జ్ఞాపకం తెచ్చుకుంటే తనకూ ఈ ఆఫీసుకూ గల సంబంధం ఆదర్శవంతమైనదిగా కనిపించింది - చచ్చిపోయిన క్షణంలో భార్యను గురించి భర్తకు అన్నీ మంచి విష యాలే జ్ఞాపకం వచ్చినట్టు.

కోటేశ్వరరావు తన సీటు దగ్గరికి రాగానే ఇద్దరు ముగ్గురు గుమాస్తాలు మూగారు. ఏదో జరిగిందని తెలిసినవాళ్ళల్లే ఆదుర్దాగా "ఏమిటి? ఏమి జరిగింది?" అని అడిగారు. వాళ్ళామాట అనగానే ఎందుకో కోటేశ్వరరావు పీక ఎవరో నొక్కేసి నట్టయిపోయి కళ్ళు చెమ్మగిల్లాయి. నోట మాట రాలేదు.

"అయిపోయింది. వెళ్ళవచ్చునన్నారు."

"నే చెప్పలా?" అన్నాడు శ్రీరాములు. మిగిలిన వాళ్ళకేసి తిరిగి "దాం.... లం - కా!" అన్నాడు. నారాయణమూర్తి అందుకున్నాడు - "కాళీ అయిన సిరా బుడ్డిని అవతల పారేసినట్టే. మంచీ, చెడ్డా, న్యాయం, ధర్మం, సబబూ, సందర్భం- ఏమీ అక్కర్లా! కారణం అక్కర్లా!"

కోటేశ్వరరావు మేనేజరును సమర్థిస్తూ మాట్లాడసాగాడు. నారాయణమూర్తి మాటలు అతనికి ఉత్సాహం ఇవ్వక కాదు. కాని తాను మేనేజర్ను సమర్థించటం నారాయణమూర్తికి చాలా అవసరంగా తోచింది. "జీతాలివ్వలేని పరిస్థితికూడా ఏర్ప డింది. రిట్రెంచిమెంటు చెయ్యక చస్తారా?"

"అదివరకు తిన్న లాభాలన్నీ ఏమయినై? వ్యాపారంలో ప్రతి దమ్మిడీ మీదా లాభమే వస్తుందా? ఏ నెల రాబడికన్నా ఖర్చు జాస్తయితే ఆ నెల ఐ.పీ.[1] దాఖల్ చేస్తారా? ఇది వ్యాపారంచేసే మొహమేనా? పదేళ్ళనుంచి అంతులేని లాభాలు తిన్నారే, జీతాలివ్వలేని పరిస్థితి అనగా అర్థమేమిటి?" నారాయణమూర్తి అర్థుస్తు న్నాడు.

"ఊరుకో, నీకు పుణ్యముంటుంది. ఎవరన్నా వినగలరు."

---

1. Insolvent Petetion.

"వినవే, ఇందులో రహస్యమేముంది? ఈ ముంద మోపి ఉద్యోగానికి మూడు సార్లు రాజీనామా ఇచ్చా. మూడుసార్లు ఒకే పూరి కాగితం చింపేయించారు. ఏముంది వెధవ బ్రతుకు, అందితే జుట్టూ, అందకపోతే కాళ్ళూను!"

నారాయణమూర్తి అట్లా మాట్లాడగల్గటం కోటేశ్వరరావు కేదో కొత్తబలం వచ్చినట్టయింది.

"కొంచెం పరిస్థితి బాగుపడితే మళ్ళీ పిలిపిస్తానన్నారు. నిజమైనా, అబద్ధమైనా కాస్త మర్యాదగా బయటికి పోతున్నా, అంతేచాలు!" అన్నాడు కోటేశ్వరరావు.

"ఈ మర్యాద కేంలే? ఇటువంటి శుష్కప్రియాలకు డబ్బు ఏగానీ ఖర్చు లేదుగా!"

"ఏదో మూడునెల్ల జీతం ఇచ్చారు. అదే బోనస్సనుకుంటా!"

కోటేశ్వరరావు డ్రాయరులో ఉన్న తన సొంత కాగితాలూ, వస్తువులు తీసేసుకుని డ్రాయరు మూసి తాళంచెవులు శ్రీరాములుకిచ్చేసి అందరిదగ్గిరా సెలవు పుచ్చుకుని బయలుదేరాడు. అతని మనసు ఎంత వేగంగా జారుతున్నదో మనం వూహించవచ్చు. అయిదు నిమిషాల క్రితంకూడా తనకూ, ఈ ఆఫీసుకూ గల దృఢబంధాలను గురించి ఆలోచించి, ఇవి ఎట్లా తెగుతాయా అని ఆశ్చర్య పోతున్న కోటేశ్వరరావుకు ఇప్పుడీ ఆఫీసు చాలాకాలం క్రితం ఖాళీ చేసిన ఇల్లులా ఉంది. వీధిలోకి రాగానే కోటేశ్వరరావుకు మొట్టమొదట కలిగిన భావం ఆనందం. గాను గెద్దుకు స్వేచ్ఛ! ఈ వేళప్పుడు తాను నిష్పూచీగా వీధిలో ఎన్నడూ తిరగలేదు. తిరిగే స్వేచ్ఛ లేకపోయింది. జేబులో ఏడు వందల రూపాయలు మాత్రం- అతని జేబులో ఎన్నడున్నై?

అతనికి ఇంటికి పోబుద్ధి పుట్టలేదు. ఇది ఏకాంతంగా కూర్చుని ఆత్మ పరీక్ష చేసుకోవలసిన సమయం. పార్కు ప్రశాంతంగా ఉంటుంది. అటుకేసి బయలుదేరాడు. అతని తలకాయలో ఆలోచనలు చీమలపుట్టలో చీమల్లాగా చిందర వందరగా పరుగెత్తుతున్నాయి. వాటిని ఒక మార్గానికి తిప్పుకోవాలి.

ఇదేదో తన మంచికే వచ్చింది. నెల నిండకుండానే నెలజీతమూ, మూడు నెల్ల బోనసు ఇచ్చారు. పిచ్చిముండాకొడుకులు! ఒకటో తారీఖుకల్లా మళ్ళీ ఉద్యోగం సంపాదించాలి. ఈ డబ్బులో కనీసం అయిదు వందలన్నా బ్యాంకులో వెయ్యాలి. వీటిని మదుపు పెట్టి అట్టే శ్రమలేకుండా లాభసాటిగా చేసుకునే సైడు వ్యాపారం ఏదన్నా చెబుతాడేమో రమణరావు నడగాలి... ఈ డబ్బంతా తీసు కొని రైలెక్కి రెండు నెల్లపాటు దేశమంతా తిరగేస్తే? ఛీ! పెళ్ళాం పిల్లలేమౌతారు? ప్రతివాళ్ళకి ఈ పెళ్ళాం పిల్లలొక సమస్యే గదా! వాళ్ళవైపునుంచి

చూసినా సమస్యే. మరి ఇంతమంది ప్రాణులు ఒక్కడి సంపాదనమీద ఆధార పడటమేమిటి? అర్థం లేదు. ఈ సంపాదించేవాడు నిరుద్యోగి అయిపోవచ్చు. చావొచ్చు. సీతారామయ్య కుటుంబం గతి ఏమయింది? ఏడెనిమిది వందలు తెచ్చు కుంటూ మహారాజల్లే బతుకుతున్నవాడు కాస్తా గుండె ఆగి చచ్చాడు. ఉత్తర క్రియ లకుకూడా డబ్బులేదు. ఇంట్లో ఉన్న సామానంతా అయినకాడికి తెగ నమ్మారు. ఇప్పుడు సీతారామయ్య భార్యా, ఆరుగురు పిల్లలు దిక్కులేని పక్షులు!....చావన్నది ఎప్పుడొస్తుందో ఎవరు చెబుతారు? తాను ఇంటికి చేరిం దాకా నమ్మకం ఉందా ఏమిటి? ఏ బండికింద పడ్డా పడవచ్చు. జనం మూగు తారు. తన శవాన్ని ఎవరూ గుర్తించలేరు. పోలీసులు వచ్చి జేబులు పరీక్షిస్తారు. కవరు దొరుకుతుంది. అందులో డబ్బంతా కొట్టేస్తారు. కనీసం తాను ఫలానా అని అయినా తెలుస్తుంది. తాను చచ్చిపోయినట్టు తెలియగానే అందరూ ఆత్మ హత్య కాబోలు ననుకుంటారు. మేనేజరేమనుకుంటాడో? ఎందుకు తీసేశానా అని విచారించకపోతాడా? నిద్రపట్టక, అన్నం సయించక చావనీ? అంతే కావాలి....

పెద్ద చప్పుడుతో కారొకటి కోటేశ్వరరావు వెనకగా ఆగింది. ఉలిక్కిపడి కోటేశ్వరరావు పక్కకు తప్పుకున్నాడు. కారు డ్రైవరు కోటేశ్వరరావును తిట్టు కుంటూ గియరుమార్చి కారును తోలుకుపోయినాడు. అదురుతున్న గుండెతో కోటేశ్వరరావు ఆ కారుకేసి చూచాడు. అతని ఆలోచనలన్నీ డీ డీ కొట్టినట్టుగా మాయమయినై.

తుపాను భీభత్సంలో సముద్రం మీది ఓడ ఏ క్షణాన ఏ దిక్కుగా పోతుందో తెలియదు. కోటేశ్వరరావు అనుకున్న దానికన్న చాలా తొందరగానే ఇల్లు చేరాడు. భార్య ఆశ్చర్యపడింది. జరిగినది తెలుసుకొన్నది. అడగవలసిన మాట అడిగింది.

"డబ్బు లేకపోతే మిమ్మల్నే ఎందుకు తీసెయ్యాలి? పని పాడుచేసి ఉంటారు. నాకు మొదట్నుంచీ తెలుసు- ఈ ఉద్యోగం దక్కించుకోలేరని! స్వాటి వాళ్ళంతా నిక్షేపంగా ఉద్యోగాలు చేసుకుంటూంటే మీరు రోజూ ఉద్యోగం యిచ్చినవాళ్ళని తిట్టిపొయ్యటమేనాయె!"

గోరుచుట్టుమీద రోకలిపోటు పడ్డా కోటేశ్వరరావు మాట్లాడలేదు. నారాయణ మూర్తి నలుగురితోనూ అనే మాటలు కోటేశ్వరరావు భార్య దగ్గర అంటూండే వాడు. "ఈ ప్రపంచంలో ఒకరు ఉద్యోగాలిచ్చేవాళ్ళు ఒకరు పుచ్చుకునేవాళ్ళు ఉన్నంతకాలం జీవితం ఇంతే. ఆ ఇచ్చేవాళ్ళకు నీ ద్వారా లాభాలు వచ్చే అవ కాశం లేకపోతే నీకు తిండి తినే యోగ్యత లేదు. ఇదంతా, పోతుందిలే, పోతా వుంటు". వగైరా.

కాని ఈ మాటలకు కోటేశ్వర్రావు భార్య ఎన్నడూ చలించలేదు. వాళ్ళ ధర్మమా అంటూ ఇంత పని చూపించి నాలుగు రాళ్ళిస్తుంటే నోరు మూసుకుని పని చెయ్యక ఈ ఉపన్యాసాలన్నీ దేనికని ఆవిడ వాదం. బాగుపడే వాళ్ళంతా తన వైఖరే అవలంబిస్తున్నారని ఆవిడ విశ్వాసం. కోటేశ్వర్రావు ఉద్యోగం ఊడడంతో ఆవిడకు అఖండ విజయం. నా భార్య నా మీద గెలవటానికి నేను అనుభవించవలసినది ఇదా? హుఁ!! అనుకున్నాడు కోటేశ్వర్రావు- ఆత్మగతంగా మాత్రమే.

"చూస్తుండవే! మూడు నెలల జీతం బ్యాంకులోవేసి రేపిపాటికి దీని బాబు లాటి ఉద్యోగం సంపాయిస్తాను" అన్నాడు.

"అయితే డబ్బు ఎవరికీ కాకుండా బ్యాంకులో దేనికి. నాకో దండ చేయించండి" అన్నది భార్య.

ఆపత్సమయంలో తన ధర్మపత్ని ఇంతమాట అడుగుతుందని కోటేశ్వర్రావు కలలో కూడా అనుకోలేదు.

"దండా?" పైన మాటకూడా పెగల్లేదతనికి.

"ఏం పర్వాలేదు. ఎప్పుడు కావాలన్నా మార్చుకొని డబ్బు చేసుకోవచ్చు."

"ఇంకా నయం!" అన్నాడు కోటేశ్వర్రావు.

ఉద్యోగం పోవడం విషయమై తన మనస్సు ఏదో ఒక విధంగా సరిపెట్టు కుందని కోటేశ్వర్రావు మొదటిరోజుల్లో చాలాసార్లు అనుకున్నాడు. కాని అతని మనసు ఊగుడు ఇంకా ఆగనేలేదు. ఒకసారి ఇది తన మంచికే వచ్చిందనిపించేది. మరోసారి ఇక తనకు మళ్ళా జీవితంలో ఉద్యోగం దొరకదనిపించేది. ఒకసారి తాను చేయదగినది ఏమీ లేదనిపించేది. ఇంకోసారి చేసేదేమైనా ఉంటే దానికింకా తొందర లేదనిపించేది. మరుక్షణమే తాను ఆఘాతం ఒడ్డున ఉండి కూడా తన క్షేమం కోసం ఏమీ పాటుపడటం లేదనిపించేది. ఒకసారి ఉన్న డబ్బు పూర్తిగా ఖర్చు పెడదామనిపించేది. మరోసారి ఇప్పటినుంచే ప్రతి దమ్మిడీ భద్రంగా ఖర్చు పెట్టకపోతే చాలా ప్రమాదమనిపించేది.

ఉద్యోగం పోయిన మూడోనాడు శ్రీరాములు ఇంటికి వచ్చాడు. "నిన్ననే మూడు వందల జీతంమీద కొత్తవాణ్ణి వేశారు. వాడి పోజు భరించలేక చస్తున్నాం!" అన్నాడు.

"ఓహో. అట్లాగా?" అన్నాడు కోటేశ్వర్రావు నిర్లిప్తంగా. కాని లోపల అతని మనస్సు రోదిస్తోంది. తన భార్య అన్నమాట నిజమై ఉండాలి. తన పని వాళ్ళకి నచ్చకే తీసేశారు. డబ్బు లేదన్నది సర్వాబద్ధం. తాను ఉద్యోగానికి పనికి రాడన్న భావము వాళ్ళ కెంతకాలం నుంచీ ఉందో! కొత్తవాడిమీద నిజంగా వాళ్ళకు చాల గొప్ప అభిప్రాయం ఉండాలి. మళ్ళీ ఆలస్యమైతే వాడు రాడేమో

అని నెలకాక పూర్వమే తనకు ఉద్వాసన చెప్పారు! తానింత పనికిమాలినవాడినైతే ఇంకొకరిని మాత్రం ఉద్యోగం ఇమ్మని అడిగేదెట్లా? ఉద్యోగాలిచ్చే వాళ్ళకి తానెట్లా కనిపించేదీ తెలిస్తే బాగుణ్ణు అనుకున్నాడు కోటేశ్వర్రావు. కాని అటువంటి జ్ఞానం ఎవరికి సాధ్యమవుతుంది?

దీనితోబాటు కోటేశ్వర్రావుకు తన నిరుద్యోగం గురించి ఇతరు లేమను కుంటున్నారో తెలియలేదు. మనని ఎరుగున్నవాళ్ళలో మనకు నిజంగా ఆసరాగా ఉండే వాళ్ళెందరో ఆపత్సమయంలోగాని తెలీదు. చాలామంది అతని ఉద్యోగం పోవడం గురించి "ఓహో, అట్లాగా?" అన్నారు- ఈ వార్త వాళ్ళ జీవితాలకు ఏ విధంగానూ సంబంధించినది కానట్టు. కొందరుమటుకు సలహా లిచ్చారు- వీరిని కలుసుకోమనీ, వారిని కలుసుకోమనీ, ఈ ఉద్యోగానికి దరఖాస్తులు పెట్టమనీ. కోటేశ్వర్రావు అడ్డమైన ఉద్యోగాలకి దరఖాస్తులు పెట్టాడు. కొందరు "నువ్వుండు, నీకు క్షణంలో ఉద్యోగం దొరికేట్టు నేను చూస్తాను" అని కూడా అన్నారు. కాని వాళ్ళు చూడలేకపోయినారనుకోవాలి.

జూన్ మాసం గడిచింది. జూలై కూడా వెళ్ళింది. ఆగస్టు వచ్చింది' స్వాతంత్ర్య దినంనాడు కోటేశ్వర్రావు సర్వస్వతంత్రుడై ఉన్నాడు.

తన ఉద్యోగం పోయిననాడు అంత అనాలోచితంగా మాట్లాడిన భార్య ఈ కొద్ది నెలల్లో ఎట్లా మారిపోయిందో చూసి కోటేశ్వర్రావు ఆశ్చర్యపడ్డాడు. కోటేశ్వర్రావు కంటె కూడా ఆమె దారిద్ర్యాన్ని శీఘ్రంగా ఆమోదించింది. పాలూ, నెయ్యీ, కూరలూ, వేణ్ణీలూ మొదలైనవి తగ్గించేసింది. చేతిలో ఉన్న డబ్బు తరిగిపోతోంది. ఆంధ్ర రాష్ట్రం కోసం దీక్షపట్టి నిరశనం చేసిన పొట్టి శ్రీరాములు తన శరీరపు కొవ్వు కండరాలమీద జీవించినట్టు[1] కోటేశ్వర్రావు కుటుంబం తనను తానే ఆహుతి చేసికోసాగింది.

మార్చిలో పిల్లల చదువులు అయిపోయి కొంత ఖర్చుతగ్గేనాటికి బరువు కొంత దిగితే కలిగే ఆనందాన్ని కూడా కోటేశ్వర్రావు అనుభవించే స్థితిలోలేడు. అందరి బట్టలు ఏనాడో చిరుగులు పట్టాయి. కొత్తబట్టలు లేవు. ఇంట్లో తమ అవసరాలకు మించిన సామానున్నట్టు తెలుసుకొని కోటేశ్వర్రావు భార్య క్రమంగా అమ్మసాగింది. వాటిని కొన్నవాళ్ళు చాలా లాభసాటి వ్యాపారం చేసుకున్నారనీ, కోటేశ్వర్రావు దారిద్ర్యం వాళ్ళకి - కళేబరములు గద్దలకు లాభించినట్టు - లాభించిందనీ తెలియ జేయటానికి సంతోషిస్తున్నారు.

---

1. పొట్టి శ్రీరాములు (1901 - 1952) : ఆంధ్ర రాష్ట్రం కోసం 58 రోజులు నిరసన దీక్ష పాటించి ఆత్మార్పణం కావించిన జాతీయవాది.

అన్నిటితోబాటు కోటేశ్వర్రావుకు, భార్యకు, పిల్లలకు మధ్యగల సంబంధాలు కూడా నిరుద్యోగ వ్రతానికి ఆహుతి కాసాగాయి. పిల్లలకిప్పుడు కోటేశ్వర్రావంటె తమకు కావలసినవి తెచ్చిపెట్టేవాడు కాడు. తల్లంటే వంటింట్లోకి పిలిచి రకరకాల వస్తువులు వొద్దనేదాకా మెక్కబెట్టే మనిషి కాదు. కోటేశ్వర్రావు కూడా పిల్లల్ని చూసి ఒక్కసారి ఆశ్చర్యపడేవాడు. ఏట్లో పడ్డవాళ్ళన్నా మిగిలినవాళ్ళ విషయం మానేసి తాము ఒడ్డుకు చేరే సంగతి ఆలోచిస్తారు కాని ఈ జీవితంలో భార్యాబిడ్డలు అట్లాకాదు. వీరు మారుమాటాడకుండా నాతో చస్తారు కాని నన్ను విడిచిపోరు అనుకునేవాడు.

జీవితమే దూరమైపోతున్నట్టు కనిపించింది కోటేశ్వర్రావుకు. ఉద్యోగం పోయిన కొత్తలో తేదీలు లెక్క పెట్టేవాడు. తరువాత నెలలు లెక్కించాడు. ఇప్పుడు నెలలక్కూడా అర్థం లేకుండా పోయింది. రైలు పట్టాల పక్కన నిల బడితే దగ్గిర పట్టాలమధ్య గీతలూ, అడ్డచెక్కలూ, పట్టాల తాలూకు ఫిష్‌ప్లేట్లూ కనిపిస్తాయి. దూరం పోయినకొద్దీ ఈ వివరాలు తెలీవు. అవును. జీవితం అతనికి దూరమైపోతున్నది.

ఒకనాడొక పెద్దమనిషి కాఫీ హోటల్లో సుష్టుగా భోంచేసి బయటికి వస్తూ చటుక్కున ఆగిపోయాడు. ఆయన కళ్ళకు విచిత్రమైన ఆకారం ఒకటి కనిపించింది. ఆ ఆకారాన్ని - కోటేశ్వర్రావును - గుర్తించి ఆ పెద్దమనిషి ఆగి "ఏమిటిది?" అన్నాడు.

కోటేశ్వర్రావు ఏమీ అనలేకపోయాడు.

"జబ్బు చేసిందా ?"

"ఒకటే జబ్బు. నాలుగు రోజులుగా ఇంట్లో అందరం పస్తే!" కోటేశ్వర్రావు మొహానికి చినిగిన చొక్కా అడ్డం పెట్టుకునే పాటి మానవత్వం ఇంకా మిగిలినందుకు కోటేశ్వర్రావును మనం అభినందించుతాం.

"ఇదిగో!" అన్నాడు పెద్దమనిషి అంతా విని. ఒక రూపాయి తీసి ఇస్తూ, "నేను బుధవారం మళ్ళీ వస్తా, అప్పుడు కలుసుకుంటా. ఇల్లెక్కడ ?"

పెద్దమనిషి రాసుకున్నాడు.

ఆయన బుధవారం రావటం పడలేదు. శుక్రవారం వచ్చాడు. కాని పని తొందరలో కోటేశ్వర్రావు మాట జ్ఞాపకం లేదు.

రెండు నెల్లు గడిచాయి. ఆ పెద్దమనిషి ఈసారి జ్ఞాపకం పెట్టుకొని కోటేశ్వర్రావిచ్చిన ఎడ్రసుకు వెళ్ళాడు. కోటేశ్వర్రావు కుటుంబం ఆ యిల్లు వదలి పోయింది.

"ఎక్కడికి చచ్చారో నాకు మాత్రం ఏం తెలుసు? మూడునెల్ల అద్దె ఎగ్గొట్టి, గెంటిస్తేగాని బయటకు పోలేదు. కూరలవాళ్ళకి, పాలవాళ్ళకి, అందరికీ బాకీలు పడ్డాడు. చెప్పలేక చస్తున్నా. ఇంతమంది డబ్బు తిన్నాక ఇంతమంది ఉసురు తగలకుండా ఉంటుందా?" అన్నాడు ఇంటి యజమాని.

ముద్రణ : 1 అక్టోబరు 1953, విశాలాంధ్ర పత్రిక.

# మనమూ మేమూ

(అనేక భాషల్లో యీ వ్యత్యాసం లేదు. వినేవాణ్ని కలుపుకున్నా వేరు చేసినా ఒకటేమాట వుంటూ వుంటుంది. వేరువేరు మాటలుగల ఘనమైన భాషల్లో తెలుగు ఒకటి).

## 1

"రాజయ్యా, నాన్నగారి హయాంలో యెట్లా వెళ్ళిపోయిందో వెళ్ళిపోయింది. ఇప్పుడు పెత్తనం మనదే. పేరుకు నేనేగాని నిజానికి యిదంతా మీదే. మీరంతా భారం మీదేసుకుంటేనేగాని జరగదు. నేను నిమిత్తమాత్రుణ్ణి. మీరు మీమీ పనులు శ్రద్ధగా తెలివిగా చేశారా అందరమూ రాణిస్తాం. లేదూ, అందరికీ కళంకమే."

"బుద్ధెరిగిన తరవాత యింత మంచి ముక్కలు చెవిన పళ్ళేదు, బాబూ! పెద్ద బాబుగార్ని యెంత శ్రద్ధాభక్తులతోనో సేవించాంగాని ఆయన మమ్మల్ని కూలి చేసుకునే నౌకర్లకన్న యెక్కువగా చూశ్ళేదు, బాబూ- అంటే మీకు కష్టంగా ఉంటుందేమోగాని!"

"పిచ్చివాడా, నేను మఱుకెరగనా? నాన్నగా రదోరకం మనిషి. అన్ని పన్లూ తనే చూసుకోగలనని ఆయనకు మహా ఉండేది. ఆయన తెలివిగలవాడే అనుకో, ఎంత తెలివిగలవాడైతే మట్టుకు అన్నీ ఒక్క మనిషి చూడగలడా? అందులో యెఫిషెన్సీ - అంటే...పనితనం అన్నమాట! - లేదు అని నా అభిప్రాయం సుమా!"

"బోలెడంత చదువుకున్నవారు, తమరికి తెలియదా యేమిటండి?"

"అవునా? నాన్నగారి హయాంలో కళాకాంతులేమైనా వుండేవేమో చూడు! ఈ ఇల్లూ, ఈ ఆవరణా, ఈ తోటా చూడూ!"

"వాటికేమండి? మన యిల్లు లాంటిది ముప్పై ఆమళ్ళో లేదండి-"

"అయ్యో, రాజయ్యా! నువు బొంబాయి చూడకపోతివి! అక్కడ మలబారు హిల్‌మీద - మలబారు కొండన్నమాట? - అక్కడి యిళ్ళ ముందిది దూపానికి పనికొస్తుందా?"

"ఎక్కడో మంచిళ్ళుంటేనంతా ఉంటయ్యా అండి?"

"ఎక్కడో ఉండటమేం? మనకు లేకపోటమేం? మనది డబ్బుకాదా? ఇంటినీ తోటనీ అందంగా చేసుకోటానికి మనమో యాభైవేలు ఖర్చుపెట్టుకోలేముటోయ్, రాజయ్యా ?"

"పెట్టుకోవాలనుకుంటే యెందుకు పెట్టుకోలేం లెండి?"

"అనుకోవటమేమిటి? యాభైవేలూ ఖర్చుపెట్టి తీరుదాం. మనకింత భగవంతు డిచ్చినందుకు అనుభవించకుండా దేనికి, రాజయ్యా?"

"అంత ఖర్చు యిప్పుడు దేనికనండి?"

"అట్లా అడుగు చెబుతాను. ఈ చిన్న చిన్న వూళ్ళల్లో చూస్తానుగదా, కాస్త గొప్పవాళ్ళ యిల్లు కనిపెట్టివున్నవాళ్ళకీ కొద్దిపాటి యిల్లు కనిపెట్టి వుండే వాళ్ళకీ జీవితం ఒకటిగానే ఉంటుంది. అసలు గొప్పయిళ్ళూ కొద్దియిళ్ళూ అన్నీ ఒక్కటిగానే యేడుస్తయ్! ఫలాని రాజయ్య ఫలానివారి నౌకరీలో ఉన్నాడంటే వాణ్ణిచూసి వాడి తరగతివాళ్ళంతా అసూయపడాలి. ఒక్కోసారి నాకనిపిస్తుంది సుమా! ఈ వందలేసి ఎకరాలకు బదులు ఏ బకింగ్‌హాం పాలెస్‌లోనో ఓ చిన్న దర్వానుగా వుంటే జీవితం ఎంత హాయిగా ఉంటుంది గదా అని. ఆ దర్వాను రోజల్లా బకింగ్‌హాం పాలెస్‌లో గడుపుతాడు గద? అది వాడిల్లే! నిన్నూ నన్నూ అందులోకి అడుగు పెట్టనివ్వరే ! అబ్బే !"

"అట్టాగాండి?"

"ఆహా!.... అదే నేను చెప్పేది. మన ఈ తోటంతా చక్కగా దార్లు వేయించి, బోర్డర్లు నాటించి, పూలమొక్కలు వేయించాలి. మన ఇంటిముందు కారు పెట్టటానికి పోర్చి కట్టించాలి. దానిమీదికి లతలు పాకించాలి. ఏ లతయితే బాగుంటుందంటావు ?"

"సొరపాదులు పెట్టిస్తామా అండీ?

"ఛీ, ఛీ, ఛీ ! సొరపాదేమిటి, రాజయ్యా ? నా ఉత్సాహమంతా పాడు చేస్తివే !"

"చక్కగా కాయలు కాస్తుందండి. ఇంత తోట ఉన్నందుకు కాయకూరల సౌకర్యం లేకుండా యేమిటికండి?"

"చెబితే నమ్మవుగాని, రాజయ్యా! బకింగ్‌హాం పాలెసు తోటల్లో ఒక్క సొరపాదు కూడా లేదు. ఒక్కటి కూడా !"

"కాయగూరలే లేవా అండీ?"

"కిమిన్నాస్తి ! మాట్లాడగూడదు !"

"మరి తోటంటే ఏముంటయ్యండి ?"

"ఏవో పూల మొక్కలూ అవీ ఉంటై."

"వాళ్లు పూలు జాస్తిగ్గా పెట్టుక్కుంటారు కామల్లంతి?"

"పిచ్చి రాజయ్యా, దొరలు పూలు పెట్టుకుంటారా? వాళ్ళు పూలను చెట్ల మీదే చూసి ఆనందిస్తారు."

"మనకట్లా కుదురుతుందా అండి? మన తోట్లో పూలమొక్కలేస్తే అమ్మ గారూ, చిన్నదొరసాని గారూ పూలు కోసుకోరా, పూళ్ళో నలుగుర్నీ పిలిచి యిచ్చుకోరాండి?"

"అదయినా అంత యిబ్బంది లేదుగాని పోర్చిమీద, దాం దుంప తెగా సొరపాదు- దానమ్మ కడుపు కాలా, పాకించమంటివే, సీ తస్సదియ్యా!"

"ఏదో తెలీకన్నాను, బాబూ!"

"నేనది మొదటే గ్రహించాలే!.... అయిందా! ఓ మంచి కారొకటి అర్జంటుగా కొనాలి -"

"మోటారుకారే!"

"ఏమిటంత ఆశ్చర్యం! బొంబాయిలో మనలో సహం ఆస్తిలేని వాళ్ళు కూడా కార్లల్లో రంయిమని పోతారుసుమా!"

"కాని మన ఈ పల్లెటూళ్ళో-"

"కారున్న తరవాత ఊళ్ళోనే తిరుగుతామా ఏమిటి? అకస్మాత్తుగా పని పడిందనుకో. ఇట్టే పదినిమిషాల్లో బస్తీ చేరుకోవచ్చు."

"అదీ నిజమేనండి!"

"ఆ తరవాత రేడియోసెట్టుకూడా ఒకటి కొందామనుకుంటున్నా."

"అదేమిటండి?"

"అదిచూస్తే నువ్వు నిజంగా ఆశ్చర్యపోతావు సుమా! ఇక్కణ్నించే మనం మద్రాసులో పాడే సంగీతంగాని, బొంబాయిలో పాడే సంగీతంగాని విన వచ్చు. చెవితే నమ్మవుగాని, రాజయ్యా, లండనులో మాట్లాడుతుంటే ఇక్కడికి దానిమీద వినిపిస్తుంది."

"ఆశ్చర్యమేనండి."

"నాగరికత ఆరోజు కారోజు అట్లా సాగిపోతున్నది, రాజయ్యా! ఇక్కడ మనం, ఈ ముష్టి పల్లెటూళ్ళో కూర్చుని ప్రపంచం గురించి ఏంతెలుసు కుంటున్నాం?"

"అవునండి. కాని మీరివన్నీ యేర్పాటు చేస్తే-"

"అదే నేనన్నది. మన ఊళ్ళోకి కాస్త నాగరికత తెద్దామనే నా ప్రయత్నం. జీవితంలో సొరపాదులేకాక, యింకా చాలా ఉన్నయ్యని మన ఊరివాళ్ళకి తెలియ జేయాలని నా ప్రయత్నం."

"ఎందుకులేవండి? ఆంకిసీడుగారు వాముల్దొడ్లో గుమ్మడిపాదు పాకింది గదా-"

"సరే, ఇక నువు వెళ్ళు, రాజయ్యా! నాకు తొందరపనులున్నై."

"చిత్తం. సెలవు పుచ్చుకుంటానండి."

## 2

"రాజయ్యా, మన తోట ఇప్పుడెట్లా వుంది?"

"నిక్షేపమంటి వేపచెట్లు రెండూ కొట్టించేస్తిరి, నాకు దొడ్డేగాని తోట ఎక్కడా కనిపించటం లేదండి. ఈ రెండూ వేపులా గులకరాళ్ళ దార్లు వేయించారుగాని అవెక్కడికీ పోవాయె. గుండ్రంగా తిరిగి మళ్ళా అక్కడికే వస్తున్నై గాని!"

"నీకీ విషయాలు తెలీవు, రాజయ్యా! నీకే యేమిటి, యిక్కడ ఎవరికీ తెలీవు. కాని తొందరపడకు, మనవాళ్ళ కన్ని తెలియజేస్తాగా, తోట కనిపించటం లేదన్నావా, కొంచెం ఆగు అదే కనిపిస్తుంది. బోర్డర్లూ అవీ యిప్పుడేగా నాటాం. మొక్కలు కూడా కాస్త పెరిగితేగాని శోభ కనిపించదు. ఇంక ఈ దారు లెందు కంటావా? మనం హాయిగా తిరగటానికి. ఈ దార్ల వెంబడి దిమ్మెలు కట్టిస్తున్నా, మనం సాయంకాలం పూట కూర్చోటానికి."

"చిత్తం. మన మోటారు బండి యెప్పుడొస్తుందండి?"

"ధరలు మరీ మండిపోతున్నై, రాజయ్యా! మోటారంటే భయమేస్తున్నది. అయినా మానీన్లే; సెకండు హేండు కారయినా కొని తీరుతా. కొన్ని సెకండుహేండు కార్లు కొత్త కార్లకన్న బాగా పోతై సుమా. అయినా మన ఊళ్ళో అసలు కారేలేదు గనక సెకండుహేండు కారయినా గొప్పే, చెట్టులేని చోట ఆముదపు చెట్టే-ఏదీ?"

"అంతేనండి.... మన రేడియో నిన్న సాయంకాలం పాడించినట్టున్నారండి? పాట మన తూర్పు పొలాల దగ్గిరికి వినిపించిందట."

"అట్లాగేం? మనవాళ్ళంతా పాట విన్నారేం?"

"ఫలానా పాటనవుతే తెలియలేదుగాని యేదో విన్నారండి."

"నీకు వినిపిస్తారా రాజయ్యా.... నిన్ననే మన వాళ్ళందర్నీ పిలుద్దామనుకున్నా గాని యేం పన్లమీదుంటారోనని మళ్ళా పిలవలా.... ఇదుగో, చూశావా చూడటానికే సెట్టెంత ముచ్చటగా వుందో! దీనికోసం అయిదొందలు పోశాను, రాజయ్యా, అయిదొందలు!"

"ఎత్తునెత్తు వెండన్న మాటండి."

"బాగా చెప్పావు, అయితే ఏంలే! అది పాడేపాట విను...."

"పుణ్యానికి పెట్టి కాస్తా పగిలిపోతుందేమో. తరువాత పాడిద్దురుగాన్లెండి."

"ఆ చప్పుళ్ళు చూసి నువు భయపడుతున్నావు గామల్లు. అది దానికి పరిపాటే."

"అదుగో పాడుతున్నదండి. మీరు దాన్ని నిలపకుండా ఉన్నారు."

''అది మనక్కావలసిన స్టేషనుకాదు, నీకన్ని స్టేషన్లూ వినిపిస్తాలే....ఇదుగో ఇది ఢిల్లీ.... ఇది మద్రాసు.... ఇది బొంబాయి-''

''ఉణ్నివ్వండి. ఉణ్నివ్వండి. చక్కగా యెవరో మంగళహారతి పాడుతున్నారు.''

''మంగళ హారతులకేంలే! ఇందులో ఇంకా హాలండూ, బెల్జియమూ, స్వీడనూ, డెన్మార్కు, అమెరికా, యిరాన్ అన్నీ వస్తయ్.''

''మనం విననికాడికి వచ్చి యేం లాభమండి?''

''ఎందుకు వినమూ! ఇదిగో ఇది ఇంగ్లండు లాగుంది. అంటే లండనన్న మాట.''

"అట్లాగా అండి. మరి ఈ ఊరిలో పాటలు లేదేమిటండి?"

"ఇప్పుడు లేదు. కాస్సేపు ఉంటే వస్తుంది."

"అక్కడ ఇప్పుడు పాడేవాళ్ళే లేరా అండి?"

"ఉంటే వినేవాళ్ళమేగా?"

"మరి వాళ్ళెపుడు పాడతారో మనకెట్లా తెలుస్తుందండి."

"పుస్తకంలో చూస్తే తెలుస్తుంది. ఇదుగో, చూశావా, యిదీ పుస్తకం."

"అందులో ఎవరెవరు ఎప్పుడెప్పుడు పాడేదీ అంతా రాసుంటదా అండి?"

"ఆహా!"

"మన ఊళ్ళో మాదిరిగా ఆ దేశాల్లో వాళ్ళు ఇష్టం వచ్చినప్పుడు పాడుకోరా అండి?"

"పాడుకుంటారు, కాని మనం వినేది ముందుగా చెప్పి పాడేవాళ్ళనే. అంతా చాలా గొడవుందిలే. చెప్పినా నీ కర్థం కాదు."

"ప్రపంచం రానురానెంత విచిత్రంగా అవుతున్నదండి!"

''ఆ విషయం మీ అందరికీ తెలియాలనేగా నా ప్రయత్నం?''

''మాకేమీ అర్థం అయే విషయాలు కావాయెను. ఏం లాభమండి?''

''చూస్తూ ఉంటే క్రమంగా అవే అర్థం అవుతైమరి.''

## 3

'చూడు, రాజయ్యా, యిదేం బాగాలేదు.''

'ఏదండి?''

''రోజూ మీ పనిచేసే కుర్రాళ్ళు మా తోటలోనే కూచుంటారు. వాళ్ళకి చూస్తే పనీపాట లేమీలేవా ఏమిటి?''

''మన ఊరివాళ్ళ కిటువంటి తోటచూట్టం కొత్తగనక చూసి ఆనందించటానికి వస్తున్నారండి. పని పాటలు లేనప్పుడే వచ్చి కూచుంటారండి - వాళ్ళ చేతిమీదగా వేసింది గనక-''

"పని పాటల్లేకపోవట మేమిటి? చేసుకునే వాడికి క్షణం తీరుతుందా అసలూ? రోజల్లా అక్కడికొచ్చి వనవిహారం చేసే తిరణాల ప్రజని చూస్తే అది మా తోటో ఊళ్ళోవాళ్ళ తోటో తెలీటంలేదు."

"తోటలోకి రావద్దని అందరితోనూ చెబుతాలెండి."

"ఆ పని చెయ్యి, రాజయ్యా, నీకు పుణ్యం ఉంటుంది.... నేనన్నానని ఎవతోనూ అనకు సుమా! నీ అంతట నువ్వే అన్నట్టుగా అను."

"తప్పేముంది లెండి?"

* *

"చూడు, రాజయ్యా రేడియో వేసుకోవటానికి భయంగా వుంది. అలగా జనమంతా యింటి చుట్టూరా వేళ్ళాడుతున్నారు. ఎట్లాచావు? పొండర్రా అంటే పోరే. రేడియో పెట్టి మూణ్నాళ్ళయింది. చెబితే నమ్మవుగానీ."

"ఎంత చిక్కొచ్చి పడ్డదండి."

"చిక్కన్న చిక్కా? హాయిగా పొలాల్లోకూడా వినిపిస్తుంది గదా, యింటి చుట్టూ మూగటం దేనికి చెప్పు?"

"చెబుతా లెండి."

"మళ్ళా నేనన్నానని-"

"లేదులెండి నేనే అంటా?"

* * *

"ఎంతో తొందర పని మీదొచ్చావు, రాజయ్యా!"

"రోసాయిగాణ్ని మన పోట్ల ఆంబోతు పొలంలో పడదోసి కాళ్ళు రెండూ విరగదొక్కిందండి. ఆసుపత్రిలో పారెయ్యాలి. స్పృహతప్పి పడున్నాడు. కాస్త దయవుంచి మన కారు బయటకి తీస్తే-"

"ఇంకానయం. రోశాయిలకూ భూషాయిలకూ కార్లలవాటు చేస్తే యింకేమన్నా వుందా? అయినా మాణిక్యమంటి కార్లో కాళ్ళు విరిగినవాణ్ని కూచోబెట్టితే కారంతా నెత్తురైపోదుటోయ్?"

"త్వరగా ఆసుపత్రి చేర్చటానికి-"

''చూస్తావేం మరీ? వేగిరం బండి కట్టించు. వేగిరం పోతై, నల్లగిత్తల్ని తగిలించు.''

"రెండు గంటలన్నా పడుతుందండి, ఎడ్లబండి మీదయితే. ఈ ఒక్కసారికి కారు దయచేస్తే-"

"రెండు గంటలేగా? ఇంతలో మునిగిపోలే! ఆస్పత్రిలో మటుకు వెళ్ళగానే మొహం చూస్తారేమిటి?''

"అవున్లెండి!''

* * *

"ఎక్కడా కనిపించటం లేదు, రాజయ్యా?"

''రోశాయి దగ్గిర ఆస్పత్రిలో బడున్నానండి!''

''కాస్త నయంగా ఉందా?''

''రాత్రి రోశాయి పోయినాడండి!''

''అట్లాగా? నాకు తెలీదే?''

''ఊళ్ళో అందరికీ తెల్లారక మునుపే తెలిసిందండి!''

''నాకెవరూ చెప్పలేదేం? ఊరిపెద్దనుగదా, నాకు తెలియక్కర్లా, రాజయ్యా?''

''ఎవరికి తెలిసి ఏముందిలెండి? ఊరి కళేపోయింది. ఎక్కడ చూసినా రోశాయే ఉండేవాడు. రోజల్లా పాడుతూ ఎగురుతూ ఉండేవాడు. సినిమా పాట లెంత చమత్కారంగా పాడేవాడండి! పాట పాడుకుంటూ ఎంత చాకిరయినా చేసేవాడు. ఈ పని నావల్ల కాదనేవాడు కాదండి. పెద్ద బాబుగారు వాణ్ని తన పెంపుడు కొడుకని చెప్పుకునేవారు. కన్న ఒక్క కొడుకూ పోయి ఆ ముసల్ది అల్లాడుతుంటే చూడశక్యం కాకుండా వుంది....''

''పోనీ, చూడు, రాజయ్యా! ఊళ్ళో జనం రోశాయిని మరిచేదాకా మన రేడియో వింటూండమను.''

''రోశాయికి రేడియో సాటొస్తుందాండి? ఎక్కడి మాట!''

ముద్రణ : ఆగష్టు 1944, రూపవాణి

# మనుషులకుగల స్వేచ్ఛ

తారకం ఎలాగైతేనేం వచ్చాడు. వచ్చాడంటే, బుద్ధిపూర్వకంగా అమ్మను నాన్ననూ తమ్ముళ్ళనూ చూడాలన్న కోరికతో రాలేదు. రమ్మని ఉత్తరాల మీద ఉత్తరాలు తండ్రి రాయగా, రాకుండా ఉండటానికి వంకలన్నీ అయిపోయాక, ఏడాది తరవాత వచ్చాడు. వాడు రైలు బట్టలు విడిచి, స్నానమైనా చెయ్యక మునుపే, దుర్ముహూర్తాన వచ్చాడని వాళ్ళ అమ్మకు తోచింది.

వాడు హోల్డాలు హాల్లోపడేసి, దాని మీద కూర్చుని తండ్రి ప్రశ్నలకు జవాబులు చెబుతుండగా లచ్చి వచ్చింది. రేపటి నుంచీ పనిలోకి వస్తాననీ, ఇంకా తనకు బదులు సరస రాదని చెప్పటానికి.

తారకం లచ్చికేసి ఎగాదిగా చూసి, ''ఇదా మన పని మనిషి? నూరు లంఖణాలు చేసినట్టుందేమిటి?'' అన్నాడు.

''నూరు కాకపోతే పాతిక లంఖణాలైనా చేసింది. చచ్చి బతికింది. నలభై రోజులు నాగా పెట్టింది'' అన్నాడు తండ్రి.

''జీతం డబ్బిలిచ్చారా?'' అన్నాడు తారకం అర్థం లేకుండా.

''నీదంతా సోద్దెంరా! నెలపైన పని చెయ్యకపోతే జీతం ఎవరిస్తార్రా? దీని బదులు సరసచేత పని చేయించుకొని దానికిచ్చాం డబ్బులు'' అన్నది తల్లి.

''అంటే, ఈమెకు పొలాలమీదా ఇళ్ళ అద్దెలమీదా వస్తుంది గామాల్లే!'' అన్నాడు తారకం.

వాడి తల్లీ, తండ్రీ ఒకరి మొహాలొకరు చూసుకుని తారకం కేసి వింతగా చూశారు.

''ఏమిటి నువ్వనేది? ఆమె పాచిపని చేసుకునేది. ఆమెకు పొలాలేమిటి? ఇళ్ళమీద అద్దెలు రావటమేమిటి?'' అన్నది తల్లి.

''నేను ఓ కథ రాశాను,'' అన్నాడు తారకం తండ్రినే చూస్తూ. ''అందులో పాచిపని చేసుకుబతికే మనిషి ఒకతె బ్రహ్మదేవుణ్ణి గురించి తపస్సు చేస్తుంది. బ్రహ్మ ప్రత్యక్షమై, ఏం వరం కావాలని అడుగుతాడు. 'తండ్రీ, అష్టైశ్వర్యాలు అడుగుదును గాని, అవి ఇయ్యడం నీ తరం కాదు. అయిశ్వర్యాలు అయిశ్వర్య వంతులకే వస్తాయి, కాని నువ్వు ఒకపని చెయ్యి. నాకు ఎన్నడూ ఎలాంటి జబ్బూ చెయ్యకుండా ఏ మందులూ అవసరం లేకుండా వరం ఇయ్యి' అంటుంది."

"వెనకటికి రాక్షసులు చావులేకుండా వరం అడిగినట్టుగానా?" అన్నాడు తండ్రి, కొడుకు ధోరణి కొంతవరకు అందుకొని కూడా దాన్ని నిరసిస్తూ.

"బ్రహ్మదేవుడికి అదే అనుమానంవచ్చి, 'నీవు చావు లేకుండా వరం అడుగుతున్నావు. వెనక రాక్షసులకయితే అలాంటి వరాలిచ్చాను గానీ, నీలాంటి ఒక్క ప్రాణులకు జరామరణాలు లేకుండా వరం ఇయ్యటానికి చట్టం ఒప్పదు, అనేశాడు" అన్నాడు తారకం.

"తరవాత ఏమయింది?" అని తండ్రి అడిగాడు.

"ఏమవుతుంది? 'సరే, ముందు రాక్షసినయి మళ్ళీ వొస్తాను' అన్నది పాచి పని చేసుకునేది" అన్నాడు తారకం.

"ఈ కథను ఎవరు అచ్చేశారు?" అన్నాడు తండ్రి.

"ఎవరూ వెయ్యలేదు. అలాంటి కథ ఎవరూ చదవరని నా స్నేహితులు కూడా చెప్పారు. అదీగాక ఈ కథ సాంఘిక అశాంతికి దారి తీస్తుందన్నారు."

"ఎలా?" అని తండ్రి సవాలు చేస్తున్నట్లుగా అడిగాడు.

"ఒకవేళ బ్రహ్మదేవుడు వరమిస్తే ఈ పాచిపనిచేసే ఆమె తన కొడుకును ఐ.ఎ.యస్. పాస్ చేయించి తనచేత పనిచేయించుకున్న వాళ్ళందరినీ ఏదోవిధంగా శిక్షించవచ్చు."

"పాచిపని చేసి కొడుకును ఐ.ఏ.యస్. పాస్ చేయిస్తుందా?" అన్నాడు తండ్రి ఆశ్చర్యంగా.

"సినిమాలలో అడపా దడపా అలా జరుగుతూనే వున్నదిలే! ప్రొడ్యూసరు రాయమన్నట్టు కథ రాసినందుకు పాతికవేలు పుచ్చుకునేవాళ్ళు అంత తెలీకుండా రాస్తారా?" అన్నాడు తారకం.

కొడుకు మంచి జోక్ వేసినట్టుగా తండ్రి గట్టిగా నవ్వేశాడు.

"దీనికి ఎంత జీతం ఇస్తున్నాం?" అన్నాడు తారకం విషయం మార్చి.

"ఇరవై! అంతకు తక్కువ రారు నాయనా! వెనకటి రోజులుకావు!" అన్నది తల్లి.

"ఇరవై రూపాయలా? అంటే ఓ వారంపాటు ఈమెకు రెండు పూటలా తిండి ఉంటుందన్న మాట! మిగిలిన మూడు వారాలూ ఏం తింటుందిటా?" అని తారకం ఆశ్చర్యపోయాడు.

తండ్రికి ఛర్రుమని కోపం వచ్చింది. "అధిక ప్రసంగం! అది మన కెందుకూ?" అన్నాడు.

"మనింట్లో నెల పొడుగునా, ఏడాది పొడుగునా పనిచేసే మనిషి సమస్యలను గురించి మనకు ఏదో అవగాహన ఉండాలిగదా! బొత్తిగా నూతిలో కప్పలల్లే మనకు సంబంధం ఉన్న మనుషుల మంచిచెడ్డలు పట్టించుకోకుండా ఎలా ఉంటాం?" అన్నాడు తారకం.

వ్యవహారం జోక్ దాటుతున్నది.

"సరే, నువ్వు వెళ్ళవే," అన్నాడు తండ్రి లచ్చుతో.

"లేచి స్నానం చెయ్యరా, అన్నం పెడతాను," అన్నది తల్లి.

## 2

భోజనాలయినదాకా అసలు విషయం చర్చకు రాలేదు. తల్లిదండ్రులు తారకాన్ని రమ్మన్నది పెళ్ళి సంబంధాలు చూడటానికి.

"అందమైన పిల్ల కావాలంటే వున్నది. కట్నం బాగా ఇచ్చే పిల్లతండ్రీ వున్నాడు. బాగా చదువుకున్న పిల్లలుకూడా వున్నారు. నలుగురినీ చూశావంటే నీకు కావలసిన పిల్ల ఇట్టే దొరికిపోతుంది" అన్నది తల్లి.

"నాకు కావలసింది ఇవన్నీకాదు. నాతో సమంగా పరిగెత్తగల పెళ్ళాం కావాలి నాకు. దొరకటం కష్టం," అన్నాడు తారకం.

"ఒలింపిక్స్‌కు ఎంటర్ చేస్తావా ఏం?'' అన్నాడు తండ్రి వెటకారంగా.

తారకం ఎంతో సహనంతో నవ్వి, "ఇది రికార్డులు స్థాపించే రేస్ కాదు. ఇది హర్డిల్ రేస్. ఇప్పుడున్న స్థితిలోనే నా కాబోయే భార్య నన్ను అందుకోవటానికి చాలా అవాంతరాలు దాటుకుని రావాలి'' అన్నాడు.

"ఏమిటవి?" అన్నాడు తండ్రి.

"ఎందుకడుగుతావు? పనిమనిషి విషయంలోనే మనం తూర్పు - పడమరలుగా వున్నాం. ఇలాటివి జీవితంలో వేలూ, లక్షలూ వున్నాయి. నేను నా విశ్వాసాలన్నిటినీ బయటపెట్టి ఏం బావుకుంటాను?'' అన్నాడు తారకం.

"ఆ పనిమనిషి విషయంలో నేను నీతో కామన్ సెన్స్ మాట్లాడటానికి సిద్ధంగా వున్నాను" అన్నాడు తండ్రి, తనకు అపజయం అసాధ్యమన్నట్టు.

"కామన్ సెన్స్ చెప్పండి. రోజుకు నాలుగు గంటలు మన ఇంట పనిచేసి, ఇరవై రూపాయలమీద ఎట్లా బతుకుతుంది? మరో నాలుగు గంటలు ఇంకో ఇంట్లో పనిచేసి ఇంకో ఇరవై సంపాదిస్తుందనుకుందాం. నలభై రూపాయల నెల జీతంతో ఒక మనిషి ఎలా బతుకుతుంది? ఇంకోరిని పోషించటం మాట ఎత్తనే వద్దు."

"దాని ఇంట ఇంకా సంపాదించే వారుండరాదా? అది పదహారేళ్ళ పిల్ల - తల్లిదండ్రుల వెంట ఉంటున్నది. వాళ్ళూ పనిచేసుకుంటారు. చన్నీళ్ళకు వేణ్ణీళ్ళు-"

"మనం ఆమె కుటుంబ వ్యవహారాలు చర్చించేటందుకు అర్హులం కాదు. ఆమె డబ్బుతోనే మనకు సంబంధం లేదు. ఆమె తల్లిదండ్రుల సంపాదనతో మనకేం సంబంధం. కాకపోయినా మనకోసం శ్రమచేస్తూ తండ్రి సంపాదనమీద బతుకుతున్నదంటే మనకెంత అవమానం?"

తండ్రి మొహం ఎర్రగా అయింది.

"నీవు ఏలోకంలో ఉండి మాట్లాడుతున్నావు? ఆమె స్వతంత్రజీవి. మన జీతం చాలకపోతే పని మానెయ్యొచ్చు. అలాగే మనము స్వతంత్రులం. ఆమెకు జబ్బుచేసి పని చెయ్యలేకపోతే పని మానిపించి ఇంకొకర్ని పెట్టుకుంటాం." అన్నాడు తండ్రి.

"నువ్వు చెప్పేది కూడా ఏమంత వాస్తవంగా లేదు. నువ్వు చెప్పే స్వాతంత్ర్యం మనకూ లేదు, ఆమెకీ లేదు. మాటవరసకు, ఒక పూట గడిచే జీతం ఒకరు ఇస్తామనీ, ఇంకొకరు అంతకన్నా తక్కువ ఇస్తామంటే ఆమె మొదటి వాళ్ళకే చచ్చినట్టు పనిచేయాలి. ఆమెకున్న స్వేచ్ఛ ఏపాటిదో ఆమె ఆకలి నిర్ణయిస్తుంది" అన్నాడు తారకం.

"ఆమెకు రెండుపూట్లా తినేటట్టు జీతం ఇచ్చే స్వేచ్ఛ ఎవరికీ లేదా?" అన్నాడు తండ్రి.

"లేదనుకుంటాను."

"అనుకోవడం రుజువుకాదు" అన్నాడు తండ్రి, తానే గెలిచిన గొంతుపెట్టి.

"మీరు వెళ్ళి విశ్రాంతి తీసుకుంటారా? నేను వీడితో సంబంధాల గురించి మాట్లాడాలి" అన్నది తల్లి తన భర్తతో.

"మహారాజుగా!" అని తండ్రి లేచివెళ్ళి దక్షిణపు గదిలో మంచంమీద నడుం వాల్చాడు.

## 3

లచ్చు పని పూర్తిచేసి, "పోతున్నానమ్మగారూ?" అని చెప్పి బయటకు వెళ్ళటమూ, దానివెనకనే కొడుకు వెళ్ళటమూ తల్లిచూసిందిగాని, ఏమీశంకించలేదు.

"ఆగు!" అని తారకం అనటం విని లచ్చు ఆగింది.

తారకం దాన్ని కలుసుకొని వెంటనడుస్తూ "బక్కచిక్కి వున్నావు, అప్పుడే పనిలోకి ఎందుకు వచ్చావు?" అని అడిగాడు.

"జరగొద్దా, బాబూ?'' అన్నది లచ్చు.

"ఇన్నాళ్ళూ ఎట్లా జరిగింది? నీకు మందులకే బోలెడంత అయివుండాలే? మీ ఇంట్లో ఎవరు సంపాదించేవాళ్ళు?''

''మా నాన్న పని చేస్తాడు. ఆ సంపాదన ఏ మూల? నాకు జబ్బు నయమయిందాకా సరస మా ఇంట్లోనే వుండి తన సంపాదన అమ్మకిచ్చింది.''

''సరస అంటే నీకు బదులు పనిచేసిన మనిషా?''

''అవును, చెయ్యెత్తి దణ్ణం పెట్టాలి. అది చిన్నపిల్లగా ఉండగా దాని తల్లి ఎవడితోనో లేచిపోతే, తాగుబోతు తండ్రి పట్టించుకోకుండా తిరిగితే, మా అమ్మ చేరదీసిందట. మనిషికి మనిషి తోడేగాని డబ్బు కాదంటుంది.''

''దానికి సంసారం లేదా?''

''పెళ్ళయిందిట. మొగుడు వదిలేశాడు, ఒంటరిగా బతుకుతుంది. ఇదిగో, ఈ అయిదారు వారాలనుంచీ-''

''ఇదుగో!'' తారకం జేబులో చెయ్యిపెట్టి, పది రూపాయల నోట్ల బొత్తి తీసి పదినోట్లు ఎంచి లచ్చుకిస్తూ, ''ఇది నీకు న్యాయంగా మా అమ్మ ఇవ్వవలసిన జీతం. నువ్వు తీసుకుంటున్న జీతం చాలాతక్కువ. దాన్నిగురించి తరువాత ఏదో చెయ్యాలి. ప్రస్తుతం ఈ డబ్బు మీ అమ్మకియ్యి. నువ్వు పళ్ళూ, పాలూ బాగా తాగు. పనిమనిషి వస్తాదులా గుండాలి. తెలిసిందా?'' అన్నాడు.

లచ్చు చెయ్యి వెనక్కు పెట్టుకుని, డబ్బు తీసుకొనటానికి బెదిరింది.

''మీలాటి వాళ్ళకు డబ్బంటే భయం. అందుకే పొట్టగడవని జీతాలకు ఒళ్ళు విరుచుకుంటారు. నడిబజారులో ఇస్తున్నాను. నే నిచ్చానని, ఇది నీ జీతమనీ మీ అమ్మకు చెప్పు. ఇందులో దాపరికం ఏమీలేదు. అంటే నన్నంటారేమో గాని నీమీద మాటరాదు'' అంటూ డబ్బు లచ్చుచేతిలో పెట్టి తారకం వెనక్కు వెళ్ళి పోయాడు.

''మంచి బేరం తగిలిందే, పిల్లా!'' అంటూ ఒక నడివయసువాడు ఇకిలించి తల ఎగరేశాడు.

లచ్చు దడదడలాడే గుండెతో ఇంటికి పోయింది.

బాంబు పేలటానికి ఎంతో కాలం పట్టలేదు. ఆ సాయంకాలం పనికి లచ్చు రాలేదు దాని తల్లి వచ్చింది - పనిచెయ్యటానికి కాదు, పోట్లాడడానికి. వస్తూనే అది పది రూపాయల నోట్లు తారకం తల్లికిస్తూ, ''ఇంతకాలంనుంచీ చూస్తున్నారు, మేం ఇట్లాంటివాళ్ళమని ఎట్లా అనుకున్నారు?'

ఆ సమయానికి తారకమూ, తండ్రీకాక, తారకం పింతల్లి కొడుకు కాముడు కూడా వున్నాడు.

లచ్చు తల్లి ఏమంటున్నదో ఒకంతట తారకం తలికి అర్థం కాలేదు. అతని తండ్రి మటుకు, తన కొడుకు ఇటువంటి పని ఏదో చేస్తాడని ఊహించిన వాడిలాగే కనిపించాడు.

ఆయన లచ్చుతల్లితో, "చూడు, రాజమ్మా! నీ కూతురు ఖాయిలా పడిందనీ, ఖర్చయిందనీ తెలిసి మావాడు డబ్బు సర్దాడు, అప్పుగా! దాన్ని నింపాదిగా నువ్వు తీర్చేసుకో, ఈ భాగ్యానికి ఇంత హంగామా దేనికి?" అన్నాడు.

"మా అమ్మాయి అప్పుకావాలని అడిగిందాండీ? ఉన్నపిల్ల చేతిలో నూర్రూపాయలు పెట్టటంలో మీ అబ్బాయిగారి ఉద్దేశం ఏమిటో ఎవర్నన్నా అడగండి! పైగా పెద్దవాళ్ళతో చెప్పమన్నార్ట - మేంకూడా సంతోషిస్తామని గామోలు! ఎందుకని అంత లోకువయాం బాబూ?" అన్నది రాజమ్మ.

"నీకు అవసరం లేకపోతే ఇచ్చెయ్యగలందుకే నీతో చెప్పమనుంటాడు. ఇచ్చేశావుగదా? ఇంకేమిటి పేచీ?" అన్నాడు తారకం తండ్రి.

"ఇంతకీ నీ కూతురేదీ? అంట గిన్నెలు, అవీ వున్నాయి" అంది తారకం తల్లి.

"ఏ మొహం పెట్టుకొని వస్తుందమ్మా? పని మానుకోమన్నాను" అన్నది రాజమ్మ - తారకంకేసి కొరకొరా చూస్తూ..

"అదేమిటీ! మావాడు పెళ్ళి సంబంధాలు చూడటానికి వచ్చాడు. రేపు మళ్ళీ తిరిగి వెళ్ళిపోతాడు. నిక్షేపంలాంటి వాడిక మానేస్తావా? ప్రస్తుతం ఆ రెండు గిన్నెలు తోమిపెట్టి రేపొద్దున్నైనా పిల్లదాన్ని పంపించు!" అన్నది తల్లి.

అంతదాకా మాట్లాడని తారకం అకస్మాత్తుగా కలగజేసుకుని, "మనది మంచి వాడిక అని వాళ్ళు అనుకోవాలి, మనమే చాటించుకోరాదు. మనది మంచి వాడిక కాదు! మనకన్న తమకు చాలా ఎక్కువ నీతి ఉన్నదని చెప్పుకునేటందుకు అవకాశం దొరికింది. దానికోసం మన ఇల్లు వదులుకొని, ఇంకో ఇల్లు దొరికినదాకా పస్తులైనా ఉంటుంది. నలభై రోజులు మంచాన బడివుంటే ఎవరు ఉద్ధరించారు? అట్లాగే ఇంకో పదిరోజులు డొక్కలో కాళ్ళు పెట్టుకుంటే ఇటువంటి ఇల్లే మరొకటి దొరక్కపోదు. నాన్న చెప్పినట్టు, పని మానుకునే స్వేచ్ఛ వాళ్ళకున్నది. మానుకోవద్దని నువ్వు బతిమాలావంటే, పని మాన్పించే స్వేచ్ఛ మనకు లేదన్న మాట!" అన్నాడు.

తారకం ఏమంటున్నాడో, ఎందుకంటున్నాడో ఎవరికీ అంతు చిక్కలేదు. ఎవరూ పట్టించుకోనూ లేదు. కాని అందరికన్నా అజ్ఞానం మనిషి రాజమ్మ ఉద్రేకమంతా ఎందుకో చల్లారింది. తారకం గొంతులో తప్పుచేసి దొరికిపోయి సిగ్గుతో చచ్చిపోతున్నవాడి లక్షణాలు లేవు. రాజమ్మ కోరిన సంతృప్తి వస్తున్నట్టే కనిపించి చప్పున అదృశ్యమయింది. ఆమె కొంగు బొడ్లో దోపుకుంటూ అంట్ల గిన్నెలు తోమడానికి సిద్ధమయింది.

కాముడు విరగబడి నవ్వి "దొరక్క దొరక్క నీకు లచ్చి ఎక్కడ దొరికిందిరా! నువ్వు దానికి డబ్బిచ్చింది చేసిన పనికా, చెయ్యబోయే పనికా?" అని తన జోక్‌కు మళ్ళీ నవ్వాడు. ఆతడు తాను వెయ్యబోయే జోక్‌కు ముందు తాను నవ్వి అందరితో కలిసి నవ్వుతున్నాననుకొని తరవాత ఇంకోసారి నవ్వుతాడు.

తల్లి, "హవ్వ! హవ్వ!" అనుకుంటూ మళ్ళాదంగంలోకి వచ్చి, "ఏం పనిరా ఇదీ? నీకు పిల్లనిస్తామని ఎంతోమంది సిద్ధంగా వున్నారు. ఈ సంగతి తెలిస్తే ఇంకేమైనా వుందా?" అన్నది.

తారకం తండ్రి మండిపడి, "నువ్వేళ్ళి మావాడు పనిదాన్ని ఉంచుకున్నాడని అందరితోటీ చెప్పిరా!" అన్నాడు.

"నే చెప్పకపోతే ఆగుతుందా ఏం?" అన్నది తల్లి.

"ఎందు కాగుతుంది? సంబంధాల వాళ్ళ ఎడ్రసులు రాజమ్మ కియ్యి!" అన్నాడు తండ్రి.

ఇద్దరూ వాగ్వాదాలు పడేటట్టు కనిపించారు. తారకం అడ్డంవచ్చి, "నేను నీతిపరుణ్ణని ఎవరెవరికి గ్యారంటీ ఇచ్చారేం? ఎవరు మానుకున్నా కట్నం ఇయ్యటానికి సిద్ధంగా ఉన్నవాళ్ళు మానరు. తాగుడుకూ, ముండలకూ తగినంత ఉంటేగాని కట్నాలు వొయ్యరు. తరువాత వాడు తాగకపోతే వాడి ఖర్మ! చూడు, నాన్నా! శ్రమ అమ్ముకునే మనిషికన్నా ఒళ్ళు అమ్ముకునే మనిషికి ఎక్కువ ఇయ్యొచ్చునన్నే నా నమ్మకం కూడా. నీ నమ్మకమేమిటి, రాజమ్మ నమ్మకమేమిటి అందరి నమ్మకమూ అదేగా కనిపిస్తుంది. అదిపోనీ, నేను చెప్పదలుచుకున్నది నీవు చెప్పే స్వేచ్ఛ లేదని పవి మనిషికి హెచ్చు డబ్బిచ్చే స్వేచ్ఛ మనకు లేదు. తీసుకునే స్వేచ్ఛ ఆమెకి లేదు" అన్నాడు.

"ఇది రుజువు చెయ్యటానికా దానికి డబ్బిచ్చావు?" అన్నాడు తండ్రి.

"కాదు. న్యాయంగా మనం ఆమెకి బాకీ ఉన్నామనుకునే ఇచ్చాను. నేను నీ నమ్మకాలు మార్చుతానా? ఎవరి నమ్మకాలు వారే మార్చుకోవాలి. నిజం తెలుసుకుంటూపోతే మనం చాలాదూరం పోతాం. అశాంతి, తిరుగుబాటు, విప్లవాలు ప్రత్యక్షమవుతాయి. అందుచేత శాంతంగా ఉండదలచినవాళ్ళు కొన్ని అబద్ధాలను నమ్మి, లోకంలో సాగే అన్యాయంలో భాగం పంచుకోవటం మంచిది" అన్నాడు తారకం.

తారకం తండ్రి క్షణంపాటు ఆలోచించేవాడి మొహం పెట్టి, మరుక్షణం ఆలోచనను దులిపేసుకున్నాడు.

తారకం మర్నాడే రైలెక్కాడు. వెళ్ళేముందు అతను తన పెళ్ళి అదివరకే నిర్ణయమయిందని తల్లికీ, తండ్రికీ చెప్పి తనకోసం సంబంధాలు చూడవద్దన్నాడు.

"నీతో సమంగా పరిగెత్తుతుందా?" తండ్రి అడిగాడు.

"చూడాలి! నేను తనతో సమంగా పరిగెత్తగలనా అన్న అనుమానం ఇంకా పోలేదు," అన్నాడు తారకం.

'ఏదవరకపోయావు!' అనుకున్నాడు తండ్రి.

ముద్రణ: నవంబరు 1978 దీపావళి ప్రత్యేక సంచిక,
ఆంధ్రజ్యోతి వారపత్రిక.

# షావుకారు సుబ్బయ్య

"యాభై ఏళ్ళ కిందట మావూళ్ళో కోమటి దుకాణం లేదు" అన్నాడు బావ.

చిట్టి కిలకిలానవ్వి, "కోమటికొట్టు లేకపోతే పిప్పరమెంటులూ, బిస్కట్లూ ఎవరమ్మేవాళ్ళు?" అన్నది.

"పిప్పరమింటులూ, బిస్కట్లు ఎక్కడివీ! అవీ ఉండేవి కావు" అన్నాడు బావ.

"కోమటికొట్టు లేకపోతే ఉప్పూ, పప్పూ, చింతపండు ఎక్కణ్ణించి వచ్చేవీ?" అన్నాడు బుల్లాడు.

"బళ్ళమీద రాసులు పోసుకుని తెచ్చేవాళ్ళు. ఏడాదికి సరిపడా అందరూ కొనుక్కునేవాళ్ళు" అన్నాడు బావ.

"అంత పెద్ద ఊరు గదా, మీ ఊళ్ళో అన్ని కాఫీ హోటళ్ళున్నాయే, ఒక్క కోమటి దుకాణం లేదా?" అన్నాడు బుల్లాడు నమ్మలేకుండా.

"అప్పటికింకా మా ఊరిమీదుగా రైలులేదు. ఊరుకూడా చాలా చిన్నది. కాఫీహోటళ్ళు లేనేలేవు. అట్లావుండగా మా ముత్తాతగారి పెళ్ళి అయింది" అన్నాడు బావ.

"మీ ముత్తాత పెళ్ళికి పల్లకీ ఎక్కాడా?" అన్నది చిట్టి.

"ఎందు కెక్కడూ? మా ముత్తాత చిన్న జమీందారు. దాదాపు ఊళ్ళో పొలాలన్నీ ఆయనవే" అన్నాడు బావ.

"హిహిహి? ముసలాళ్ళు పల్లకీ ఎక్కుతారా?" అన్నది చిట్టి.

"పెళ్ళికి మా ముత్తాత బుల్లాడికంటె కొంచెం పెద్దవాడు" అన్నాడు బావ. చిట్టి నవ్వటం ఆపింది.

"ఆ పెళ్ళికి-" అని బావ ఏదో చెప్పబోతుంటే బుల్లాడు అడ్డంవచ్చి, "ఆ పొలాలన్నీ ఏమైనయి బావా?" అన్నాడు.

"అక్కడేవున్నై. ఇంకా పెరిగినై కూడానూ" అన్నాడు బావ.

"అవన్నీ యిప్పుడు నీవేనా?" అన్నాడు బుల్లాడు.

"కావు. మా ముత్తాతకు ముప్ఫయిమంది ముని మనమలం" అన్నాడు బావ.

"ఆ పొలం అంతా పంచుకున్నారా?" అన్నాడు బుల్లాడు.

"అందులోనూ ఒక్కొక్కనికీ నూరోవంతుకూడా రాలేదు. చెబుతా వినండి మా ముత్తాత గుడికట్టించి, గుడికింద కొంతపొలం ఇచ్చేశాడు. ఊళ్ళో ఒక మంగలి వాణ్ని, ఒక చాకలివాణ్ని, ఒక కుమ్మరిని, ఒక కంసాలివాణ్ని పెట్టి, వాళ్ళందరికీ తలా రెండెకరాలా యిచ్చేశాడు. బీదబ్రాహ్మలందర్నీ చేర్చి వాళ్ళకి భూదానం చేశాడు" అన్నాడు బావ.

"మీ ముత్తాత చాల మంచివాడే" అన్నది చిట్టి.

"ఆయన ఊళ్ళో ఒక భోగందాన్ని కూడా తెచ్చిపెట్టి, దానికి యాభై ఎక రాలు రాసిచ్చాడు. ఒక రెండంతస్తుల మేడకూడా కట్టించి పెట్టాడు" అన్నాడు బావ.

"ఎబ్బే మీ ముత్తాత చెడ్డవాడు" అన్నది చిట్టి, ఆముదం తాగిన మొహం పెట్టి.

"వినండి!" అన్నాడు బావ. "మా ముత్తాత పెళ్ళికి సరుకు లందించటానికి గాను ఒక కోమటిని నియమించారు. ఆ కోమటి దక్షిణాదివాడు. మా ముత్తాత పెళ్ళి చాలా వైభవంగా జరిగింది."

"ఎన్ని వేలు ఖర్చుపెట్టారు?" అన్నది చిట్టి.

"ఒక వెయ్యిరూపాయలు ఖర్చయి ఉంటై" అన్నాడు బావ.

"అంతేనా? నీ పెళ్ళికే నాన్న వెయ్యిరూపాయలు ఖర్చుచేశాడు గదా!" అన్నది చిట్టి.

"అప్పటి రోజుల్లో వెయ్యిరూపాయలంటే చాలా ఎక్కువ. పట్నం నుంచి నూరు రూపాయల మందుగుండు సామాను తెచ్చారు. సదస్యం నాడు అయిదు వందల రూపాయలు సంభావన ఇచ్చారు. గృహప్రవేశం నాడు వెయ్యి మంది భోజనాలు చేశారు. ఇదీ పెళ్ళికొడుకు వారివేపు ఖర్చు. రెండువేపుల వాళ్ళకి కావలసిన బట్టలూ, నగలూ, సరుకులూ సమస్తమూ కోమటాయనే కొన్నాడు. ఈ పెళ్ళిలో కోమటి బోలెడంత డబ్బూ, వస్తుసామాగ్రీ, బట్టలూ, బంగారమూ కూడా వెనకేశాడు. ఇది పెట్టి ఆయన మా ఊళ్ళో చిన్న చిల్లర దుకాణం పెట్టాడు. మొదట్లో ఈ చిల్లరదుకాణం ఊళ్ళోవుండే అలగాజనానికి ఉపయోగపడింది. వాళ్ళు కొనే దమ్మిడీ చింతపండులోనూ, దమ్మిడీ మిరపకాయల్లోనూ, దమ్మిడీ ఉప్పు లోనూ కోమటికి సగానికి సగం లాభం.

"కోమటికి పెద్ద గిరాకీ ఏమి అంటే మా ముత్తాత వుంచుకున్న భోగంది. ఆవిడ రకరకాల చీరెలూ, నగలూ, అగరువత్తులూ, అత్తర్లు కోమటిద్వారా తెప్పించుకునేది. వీటిల్లో కోమటి మంచి లాభం చేసేవాడు ఇది గాక కోమటి చిన్న చిన్న రైతులకూ వాళ్ళకి కొట్లో కాతాలు పెట్టేవాడు. తప్పుడు లెక్కలు రాసేవాడు. పంట రాగానే ధాన్యం కొలుచుకునేవాడు. డబ్బు తీసుకోకుండా

ధాన్యం కొలుచుకోవడంలో కోమటికి మరింత లాభం ఉండేది. ఆ రోజుల్లో కోమటిని ముష్టివాణ్ణి చూసినట్టు చూసేవాళ్ళు. ఎందుకంటే, అందరిదగ్గర వినయ విధేయతలుగా ఉండి, చెయ్యిచాచి అడిగి, న్యాయంగా రావలసినదానికన్నా ఎక్కువ పుచ్చుకునేవాడు.

మా తాతగారి కాలంనాటికి కోమటి ముసలాడైనాడు. నాలుగైదు వేలు పోగు చేశాడని చెప్పుకునేవాళ్ళు. కాని ఆ ఎర్రపంచెతప్ప కట్టేవాడు కాడు. ఆయన కిద్దరు కొడుకులు. పెద్దవాడు బళ్ళ సరుకుల వ్యాపారం ప్రారంభించాడు. బెల్లమూ, చింతపండూ, కందా, పెండలమూ, ఉల్లిపాయలూ-ఇటువంటివి తానే తెచ్చి ఊళ్ళో అమ్మినంత అమ్మి, మిగిలినవి దుకాణంలో పెట్టించి, తమ్ముడిచేత అమ్మించేవాడు. ఊళ్ళో ధాన్యం కొని బస్తీకి పట్టుకెళ్ళి మర పట్టించి అక్కడే అమ్మేసేవాడు. చిన్నవాడు సన్న సన్నగా వడ్డీవ్యాపారాలు ప్రారంభించాడు. రోడ్లు కాస్త మంచివి పడేటప్పటికి మా వూరు పెరగటం మొదలు పెట్టింది. ఊళ్ళో కాస్త కలవాళ్ళు ఒళ్ళుతెలియని ఖర్చులు చేసి, ఆ తరాని కాతరము ఆస్తి పంపకాల మీదతరిగిపోతూ ఉన్నకొద్దీ దాయాదుల తగాదాలు పెంచుకుని కోర్టులకెక్కి ఉన్నది కూడా తగలేసుకోవటం మొదలు పెట్టారు. కుటుంబాలు పెరుగుతున్నకొద్దీ వ్యవసాయం మీద బతకటం కష్టసాధ్యమై చదువులకూ, ఉద్యోగాలకూ ఎగబడవలసి వచ్చింది. ఊళ్ళో రైతులు పెరిగారు. మధ్యతరగతిలో ముందాలోచన లేని మూఢులు తమ తదనంతరం పిల్లలేమవుతారో అనే ఆలోచనైనా లేకుండా రెండు చేతులా అప్పుచేసి జూదాలాడి, ముండలకు పెట్టి ఒళ్ళూపై తెలీకుండా ఖర్చుచేసేశారు. ఇదంతా కోమటికి చాలా లాభించింది. కోమటి బిడ్డలు పెద్ద వ్యాపారస్తులే కాక వడ్డీ వ్యాపారస్తులుకూడా అయినారు. బీద రైతులందరూ వాళ్ళ బాకీదార్లే. ఊళ్ళో పెద్ద కుటుంబాలన్నీ వాళ్ళకి ఋణపడ్డవే.

"మా తాత తనకు వచ్చిన ఆస్తిలో అయిదో వంతుకూడా పిల్లలకు దక్కనివ్వలేదు. మీరు చెబితే నమ్మరు. మా తాతకు దస్కతు చెయ్యటం రాదు. తన పిల్లలకింత చదువన్నా చెప్పించలేదు. మా నాన్న మెట్రిక్యులేషన్ దాకా చదివి తాలూకా ఆఫీసు గుమాస్తాగా చేరాడు. అందరూ తలో దారీ అయినారు."

"మా వూరి కోమట్లు కూడా తలోదారీ అయినారు. ఒకడు పట్నంలో నగల వ్యాపారం చేస్తున్నాడు. మరొకడు గుంటూరులో పొగాకు వర్తకుడు. ఇంకోడు బెజవాడలో బియ్యం మరలు కంట్రాక్టు తీసుకొని కనపడని లాభాలు తీస్తున్నాడు. మా వూరికి మాత్రం సుబ్బయ్య మిగిలాడు. సుబ్బయ్య తండ్రి పాతిక వేలు పెట్టి మా వూళ్ళో బ్రహ్మాండమైన మేడ కట్టించాడు. దాన్ని అద్దాలమేడ అంటారు. సుబ్బయ్య తండ్రి మొన్న మొన్నటిదాకా చెప్పుతరంగాని వడ్డీ

వ్యాపారము చేశాడు. అన్నీ మార్వాడి వడ్డీలు. బీదవాళ్ళకిచ్చే తక్కువ మొత్తాల మీద ఎక్కువ వడ్డీలు. ఎందరి కొంపలు తీశాడో తెలీదు. ఊళ్ళో పది పన్నెండిళ్ళు కొన్నాడు. అయిదారు సొంతాన కట్టించాడు. మా వూరికి మునిసిపాలిటీ వచ్చిన తరువాత సుబ్బయ్య తండ్రి లేకుండా పురపాలక సంఘం లేదు. అటాకూడా డబ్బు దోచాడు.

"సుబ్బయ్యా, సుబ్బయ్య మేనత్త కొడుకు బంగారయ్యా, మా బాబాయీ కలిసి చదువుకున్నారు. 1921లో గాంధీ ఉద్యమం[1] వచ్చినప్పుడు మా బాబాయీ బంగారయ్యా కలిసి చదువులు మానేసి ఖద్దరు వేసుకున్నారు. సుబ్బయ్య మట్టుకు అందులో చేరలేదు. బంగారయ్య మాటేమోగాని మా బాబాయి తనకున్న కాస్త ఆస్తీ తగలేసుకున్నాడు. సుబ్బయ్య తండ్రి చేసిన వడ్డీవ్యాపారం అందుకున్నాడు. 1930లో మా బాబాయి సుబ్బయ్యను అడిగాడు, ఈ సారన్నా ఉద్యమంలోకి వస్తావా అని.[2] సుబ్బయ్య, 'మాకు ఉద్యమాలెందుకు బాబూ! పెద్దలు మీరంతా వున్నారుగా, ఉద్యమం నడపండి, మీ వెనక మేమూ ఉన్నాంలే' అన్నాడు.

"కిందటిసారి కాంగ్రెసు ప్రభుత్వం వస్తూనే వడ్డీవ్యాపారస్తుల నడుము విరగ్గొట్టింది. డబ్బు కాటకం మూలంగా సుబ్బయ్య ఎన్నో లక్షల విలువైన ఆస్తులు అంటగట్టుకుని లాభాని కమ్ముకున్నాడు.[3] కాని ఇప్పుడు కాంగ్రెస్ తన పొట్టమీద కొట్టిందని కాంగ్రెసును దుమ్మెత్తి పోశాడు. మా బాబాయికీ సుబ్బయ్యకూ ఓ నాడు పెద్ద యుద్ధమైంది కూడాను.

---

1. గాంధీజీ ప్రారంభించిన స్వదేశీ ఉద్యమం :
విదేశ వస్తు బహిష్కారం, విద్యార్థులు విద్యాలయాలను వదలిపేయటం, న్యాయవాదులు కోర్టులను త్యజించటం, ప్రభుత్వోద్యోగాలు మానివేయటం ఈ ఉద్యమ లక్ష్యాలు. 1921 మార్చి 31, ఏప్రిల్ 1 విజయవాడలో జరిగిన భారత కాంగ్రెసు సంఘ సమావేశంలో గాంధీ, నెహ్రూ, సి.ఆర్. దాస్, పటేల్ మొదలైన జాతీయ నాయకులు పాల్గొన్నారు. గాంధీజీ పర్యటన ఆంధ్రదేశంలో ఈ ఉద్యమవ్యాప్తికి దోహదం చేసింది. 1920-1922 మధ్య నడచిన ఉద్యమం సహాయ నిరాకరణ ఉద్యమం. నిర్మాణ కార్యక్రమంలోని అంశాలు ఖద్దరు ఉత్పత్తి, ఖద్దరు ధారణ, అస్పృశ్యతా నిర్మూలనం, హిందూ ముస్లిం సఖ్యత. బహిష్కార కార్యక్రమం రెండోది. శాసనోల్లంఘనం మూడోది.
2. కాంగ్రెసు శాసనోల్లంఘన (1930-1934) ఉద్యమంలోకి, ఉప్పు సత్యాగ్రహం 1930లో.
3. ఆర్థిక కాటకం (1929-1934) తెచ్చిన సంక్షోభం ప్రస్తావన.

"కాంగ్రెసు పదవిలోకి వచ్చే వరకు[1] సుబ్బయ్య అటు ప్రభుత్వోద్యోగులను ఒక కంట కనిపెట్టే వున్నాడు. కాంగ్రెసు పరిపాలన ప్రారంభం కాగానే గాంధీ టోపీ ఒకటి సంపాదించి కొన్ని ఖద్దరు గుడ్డలు కూడా చేర్చాడు. ఇంటి మీద కాంగ్రెసు జెండా కూడా ఎత్తాడు.

"యుద్ధం వచ్చింది.[2] ఇకనేం సుబ్బయ్య పంట పండింది. ఖద్దరు టోపీ అవతల పారేశాడు. మంచి మంచి సూట్లు కుట్టించాడు. మెద్రాసు చుట్టూ తిరిగాడు. ఆ అధికార్లను చూచాడు, ఈ అధికార్లను పట్టుకొని ఏవేవో కంట్రాక్టులు సంపాదించాడు. దొంగ వ్యాపారస్తులతో చేరి లక్షలు సంపాదించాడు. ఒక కేసులో పట్టుబడి వెయ్యి రూపాయలు జరిమానా కూడా ఇచ్చుకున్నాడు.

"యుద్ధం జరిగిన కాలములో[3] సుబ్బయ్య మా బాబాయికి చాలా సహాయము చేశాడు. కాని, మా బాబాయికి సుబ్బయ్య చేసే పనులు రుచించేవి కావు. బంగారయ్యతో కూడా మా బాబాయికి చెడిపోయింది. బంగారయ్య పోయి కమ్యూనిస్టుల్లో చేరాడు. అయినా మా బాబాయికి సుబ్బయ్యనుచూస్తే కన్న బంగారయ్యను చూస్తేనే ఎక్కువ కోపంగా ఉండేది.

"ఇది ఇట్లా వుండగా ఇంకో చిత్రం జరిగింది. మా వూళ్ళో వెంకయ్య అనే ఒక పెద్ద మోతుబరి వున్నాడు డెబ్బై ఎకరాల ఆసామీ. ఆయన కొడుకు వెళ్ళి కమ్యూనిస్టుల్లో చేరాడు. సుబ్బయ్య కొడుకూ, వెంకయ్య కొడుకూ చిన్నప్పటి నుంచి స్నేహితులు. వెంకయ్య కొడుకు సుబ్బయ్య కొడుకును కాస్తా కమ్యూనిస్టుల్లో చేర్చాడు. ఈ సంగతి తెలియగానే సుబ్బయ్య కెక్కడలేని దుఃఖమూ వచ్చింది. ఒక్కడే కొడుకు. తను సంపాదించిన లక్షలన్నీ ఏంగాను? కొడుక్కి నయానా భయానా చెప్పి చూచాడు. లాభం లేకపోయింది. సుబ్బయ్య బంగారయ్యను తిట్టాడు. పని పెట్టుకుని వెంకయ్యను కూడా తిట్టాడు. వెంకయ్య సుబ్బయ్యను ఓదార్చి 'నా కొడుకూ చెడిపోయినవాడే నన్నేం చెయ్యమంటావు. ఈ కాలపు వెధవలిట్లా పుట్టుకొస్తున్నది' అన్నాడు.

"సుబ్బయ్య దొంగ వ్యాపారం చేస్తున్నమాట ఊళ్ళో అందరికీ తెలుసు. 'కమ్యూనిస్టులు సుబ్బయ్య దొంగతనం పట్టుకోకపోవడం సుబ్బయ్య కొడుకు కమ్యూనిస్టు పార్టీలో వుండటంవల్లనే' అన్నారు.

---

1. కాంగ్రెసు పదవిలోకి వచ్చింది 1937లో. శాసన సభల్లో కాంగ్రెసుకు మెజారిటీ వచ్చింది. 1937 నుండి 1939 వరకు మద్రాసు, బొంబాయి, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాల్లో కాంగ్రెసు మంత్రి వర్గాలు అధికారంలో ఉన్నాయి.

2, 3. రెండవ ప్రపంచ యుద్ధం (1939-1945) ప్రస్తావన.

"ఇంతలో ఒక రోజు ఒక చిత్రం జరిగింది. వెంకయ్య కొడుకు ఊళ్ళో బుర్ర కథా, కూచిపూడి భాగవతమూ పెట్టించాడు రైతులకోసం. అది చూడ టానికి వెంకయ్యా, వాళ్ళ బలగం యావత్తు వెళ్ళారు. వెంకయ్యకీ కొడుకుక్కూ పడదు గనుక వెంకయ్య వెళ్ళడనుకున్నారు. కాని వెంకయ్య వెళ్ళాడు. అందర్నీ పిలుచుకుని కూడా వెళ్ళాడు. కొడుక్కూ తనకూ తేడాలుంటే అవి తమ ఇద్దరి మధ్యనే. ఊళ్ళోవాళ్ళకి సంబంధం లేదు. ఊళ్ళో తన కొడుకు చేయించేది, తను చేయించేదీ, వెంకయ్య పెత్తనం మీదేసుకుని పందిరి కట్టించాడు. వచ్చిన వారికి చూచునే సదుపాయాలుకూడ మధ్యాన్నం నుంచి చేయించాడు.

"ఈ సంగతి తెలిసి సుబ్బయ్య అనుకున్నాడు గదా, నేనూ నా కొడు కుతో పైకి సఖ్యంగానే ఉంటాను. వెంకయ్యకు కొడుకుతో లేని పేచీ, నా కొడుకుతో నా కెందుకు? వాడడిగితే డబ్బుకూడా యిస్తాను. వాడి పెళ్ళి వైభవంగా చేస్తాను అనుకున్నాడు.

"ఆ రాత్రే అటు బుర్రకథ జరుగుతున్న సమయములో ఇటు కమ్యూ నిస్టు కుర్రవాళ్ళు సుబ్బయ్య దొంగతనం పట్టుకున్నారు. పట్టుకున్నవారిలో సుబ్బయ్య కొడుకుకూడా ఉన్నాడు. సుబ్బయ్య కొందరు రౌడీలను దొంగ మార్కెటు సరుకువెంట కాపలా ఉంచాడు. ఒక రౌడీ సుబ్బయ్య కొడుకు నెత్తి మీద కర్రపెట్టి బలంగా కొట్టాడు. ఇంతలో మిగిలినవాళ్ళు వచ్చి రౌడీని పట్టుకుని పోలీసులకు వప్పగించారు. పోలీసులు రౌడీలను వదలివేశారు. సుబ్బయ్యమీద కమ్యూనిస్టులు పెట్టిన కేసు ఏమయిందో తెలీదు.

"సుబ్బయ్య కొడుకు ఇరవైరోజులు మంచంలో వుండి తెప్పరిల్లాడు. కొడుకు చస్తాడనే భయంతో సుబ్బయ్యకు మతిపోయింది. ఆఖరుకు కొడుకును చూడటానికి వెళ్ళాడు. కొడుకు సుబ్బయ్యకేసి చూడలేదు. 'నువ్వెవరవో నేనెరు గను వెళ్ళిపో' అన్నాడు. సుబ్బయ్య ఏడుస్తూ ఇంటికొచ్చాడు" అని కథ పూర్తి చేశాడు బావ.

"అంతేకావాలి సుబ్బయ్యకు, అంతే కావాలి!" అన్నది చిట్టి కసిగా.

"ఏవో కబుర్లలో వున్నారే! అన్నానికి లేవ్వోయ్!" అన్నాడు నాన్న.

ముద్రణ : జనవరి 1947, అభ్యుదయ

# పైకి వచ్చినవాడు

సీతారామారావు ఒక విచిత్రమైన వాతావరణంలో పెరిగాడు. అతడు హైస్కూలు చదువు పూర్తిచేసినదాకా ఉన్న ఊరు విడిచిపెట్టి వెళ్ళలేదు. ఆ ఊరే అతని ప్రపంచంగా ఉండేది. ఎందుకంటే అతని అయినవాళ్ళంతా అక్కడే ఉండేవాళ్ళు. అతని మేనత్తలిద్దరినీ ఆ ఊరే ఇచ్చారు. అతని అక్కనుకూడా మేనరికం ఇచ్చారు. హైస్కూలు తప్ప చెప్పుకోదగిన సంస్థ మరేదీ లేని ఆ గ్రామంలో ప్రతిమూలా సీతారామారావు సొంతం లాగుండేది-కొన్ని బంధువుల ఇళ్ళు, కొన్ని స్నేహితుల ఇళ్ళు, కొన్ని బాగా ఎరిగున్న వాళ్ళ ఇళ్ళు, మిగిలినవి కూడా అంతా తెలిసిన ఇళ్ళే. ఊళ్ళో ప్రతివీధి గురించీ సీతారామారావుకు ఏవో స్మరణలున్నై. ఊరినిండా అతను ఎక్కిన చెట్లే. అతని జీవితం ఆ వూరితో బాగా పెనవేసుకొనిపోయింది.

అతని చిన్నప్పటి వాతావరణంలో ఉండిన మరొక విశేషమేమిటంటే, వాళ్ళ వాళ్ళు చాలా సాధారణ కుటుంబమయినప్పటికీ దారిద్ర్యమూ, సంపదా అనే ద్వంద్వం ఎన్నడూ అతన్ని బాధించలేదు. వాళ్ళది చిన్న పెంకుటిల్లు. వాళ్ళ చిన్న మేనత్తగారిది రెండు నిట్టాళ్ళ పాకా, పెద్దమేనత్త డాబా వేయించింది. అయితే తన ఇంటికన్న పెద్ద మేనత్త ఇల్లు గొప్పదనిగాని, చిన్న మేనత్త ఇల్లు తక్కువదనిగాని అతనికెన్నడూ తట్టలేదు-తట్టేటట్టు ఎవరూ చేయలేదు కూడా. తీరే అవకాశం లేని కోరికలు లేనివాడికి ఐశ్వర్యం గురించీ, దారిద్ర్యం గురించీ ఆలోచనలు రావు. అటువంటివాడు "నేను డబ్బున్నవాణ్ణి, డబ్బులేని వాణ్ణి" అనుకోడు. సీతారామారావుకూడా అట్లాగే పెరిగాడు. అతని బంధువర్గంలో మనిషి ఆదరం హెచ్చుగా ఉండేది. వాళ్ళ మధ్య కలహాలూ, కక్షలూ, సాధింపులూ రావటం సీతారామారావు ఎరగనే ఎరగడు. అతని అక్కగారి భర్తా, బావగారూ ఆస్తులు పంచుకున్నప్పుడు తమ్ముడికి మంచివాటా వచ్చిందన్న అభిప్రాయం అన్న ప్రకటించినప్పుడు సీతారామారావు తండ్రి, "వాడేం కట్టుకు పోతాడుట్రా? అవసరం వస్తే తనదంతా తెగనమ్మి నీకు పెట్టడూ?" అన్నాడు. అందులో అతిశయోక్తి కూడా ఏమీలేదు. ఎందుకంటే అందుట్లో ఎవరికి ఏ అవసరం వచ్చినా నలుగురూ కమ్ముకునేవాళ్ళు. ఎవరూ తీర్చలేనంత అవసరాలు రానూలేదు.

నిజానికి మానవజాతి యావత్తూ ఎంతో కాలంపాటు ఇటువంటి ఏర్పాటుమీద కాలం వెళ్ళబుచ్చలేదు. జీవితంలో పెద్ద పరివర్తనలేని సమయాల్లో ఒకటి రెండు తరాలమధ్య మాత్రమే తాత్కాలికంగా ఇటువంటి పొత్తుకుదురుతుంది. ఇటువంటి వాతావరణం సాధ్యమవుతుంది. కాని సీతారామారావు ఆ వాతావరణం తప్ప మరేమీ ఎరగని కారణం చేత ప్రపంచమంతా ప్రతి యుగంలోనూ ఆ పద్ధతినే నడిచిందనీ నడుస్తుందనీ పొరపడ్డాడు.

* * *

సీతారామారావు కాలేజీ చదువు కోసం పైపూరు వెళ్ళవలసి వచ్చినపుడు చాలా బాధపడ్డాడు. తనకుగల సర్వస్వమూ వొదిలేసి ఏ అరణ్యవాసమో పోతు న్నట్లనిపించిందతనికి. అతనివెంట ఊరి కుర్రాళ్ళు మరిద్దరు కూడా బయలుదేరారు. సీతారామారావు అన్న ఈ ముగ్గుర్నీ తన బండిలో ఎక్కించుకుని హైరోడ్డుదాకా తోలుకుపోయాడు. సీతారామారావు అన్న రాఘవులు చదివేటప్పుడు ఊళ్ళో మిడిల్ స్కూలుండేది.[1] రాఘవులు ఉన్నంతవరకూ చదివి, తరవాత వ్యవసాయంలో ప్రవేశించి తండ్రికి సాయపడసాగాడు. అతనికి పెళ్ళయింది. ఇద్దరు పిల్లలు కూడానూ.

బస్సు వచ్చిందాకా రాఘవులు తిరిగిపోలేదు. ఏవేవో విషయాలు మాట్లాడుతూ నిలబడ్డాడు. సీతారామారావు ఎక్కువగా మాట్లాడలేదు. కాని అన్నను చూచి గర్వ పడ్డాడు. రాఘవులంత మంచివాడు ఊళ్ళోలేడని అందరూ అనుకునేవాళ్ళు. అతనిలో ఏ కోశానా స్వార్థమూ, కోపమూ లేనట్టుండేది.

బస్సు వచ్చింది. ముగ్గురు కుర్రాళ్ళూ ఎక్కారు. రాఘవులు బండి మళ్ళించు కుని బయలుదేరాడు. బస్సు కాలవ వంతెన ఎక్కి దిగేదాకా సీతారామారావు అన్న తోలుకుపోయే బండిని చూస్తూనే ఉన్నాడు. ఆ బండిలో తన పంచప్రాణాలూ ఇంటికి తిరిగిపోతున్నట్టనిపించింది. సమ్మె చేసినట్టుగా ముగ్గురూ మాట్లాడటం మానే శారు. మరో అరగంట గడిచినాక మిగిలిన కుర్రాళ్ళలో ఒకడు తనకేసి తిరిగి, "ఏరా? ఈపాటికి రాఘవులన్నయ్య వాముల్దొడ్డికాడికి పోయి ఉండడూ?" అనేసరికి సీతారామారావుకు ఏడుపు వచ్చినంత పని అయింది. మరికాస్సేపటికల్లా రైలుస్టేషను వచ్చేసింది.

టిక్కెట్లుకొని రైల్లో ఎక్కికూచున్న మరుక్షణం నుంచీ సీతారామారావుకు తన జీవితం మీద తనకేమీ అధికారం లేనట్టయింది. అయితే అది కేవలం భ్రమ. ఆ క్షణానే అతని మనస్సు ఈ మారిన పరిస్థితులకు అనుగుణంగా మారే ప్రయత్నం రహస్యంగా ప్రారంభించింది.

---

1. 8వ తరగతిదాకా ఉన్న పాఠశాల.

"మన వాళ్ళందరిలోకి పెద్దచదువు చదవబోతున్నవాణ్ణి నేనే. చదవగానే సరి కాదు నలుగురికీ సాయపడాలి. పొలం అన్నకుంటుంది. నేనందులో దమ్మిడీ ముట్టుకోకుండా జరుపుకోవాలి. కాకపోయినా ఏం పొలం? అన్నకిప్పుడే ఇద్దరు కొడుకులు, ఇంకా పుట్టుకొస్తారు! ముగ్గురు నలుగురు పుట్టి పంచుకుంటే ఏమొస్తుంది? తిండికి చాలదు. లాభంలేదు. నా సంపాదనతో ఒక్కొక కుంటేకొని పొలం చేర్చాలి. అన్న పిల్లలకు చదువులు చెప్పించాలి. వాళ్ళు కూడా సంపాదించుకో గలిగితే ఇబ్బంది ఉండదు..."

సీతారామారావు ఆలోచనలు గాలికి కొట్టుకుపోసాగాయి. షావుకారు కోటయ్యగారికి మెరకా మాగాణీకలిసి నూటయాభై ఎకరం, ముగ్గురు పిల్లలు. వాళ్ళకు ముగ్గురేసి పుడితే? పెద్ద ఆస్తి ముక్కచెక్కలై పోవటానికి మూడు తరాలు కూడా పట్టదు గద! .. బియ్యే పాసయితే కనీసం నెలకో యాభై తెచ్చుకోవచ్చు. ఆరేడుపుట్ల ధాన్యం ఇంటికొచ్చినట్లే! అయిదారెకరాలు కొనుక్కున్నట్టన్నమాట! ఇంకా పెద్ద జీతం వస్తే అడగనే అక్కర్లేదు.

నిరాశ కలగకుండా ఉండగలందుకు సీతారామారావు యాభై రూపాయల నెల జీతం లెక్కవేసుకున్నాడే గాని నూరు నూటయాభై దాకా సంపాదించగలనని అతనికి ధైర్యం లేకపోలేదు. అయితే పానకంలో పుడకలాగా ఒక్క ఆలోచన అతనికి గొంతు కడ్డం పడింది-అంత ఉద్యోగం చెయ్యాలంటే పొరుగూరు వెళ్ళాలి! పుట్టి పెరిగిన ఊళ్ళో ఉండి ఉద్యోగం చెయ్యటం సాధ్యంకాదు, ఏం చేసేటు?

ఆ ప్రశ్నకు కాలమే సమాధానం చెప్పింది. సీతారామారావు బియ్యే పూర్తి చేసేసరికి కాటకం వచ్చి ధరలు పడిపోయినై[1]. అతని చదువుకని చేసిన అప్పు క్రింద ఆరెకరాల పొలం తెగనమ్మవలసి వచ్చింది. తండ్రికి పక్షవాతం వచ్చింది. రాఘవు లన్న నలుగురు పిల్లల తండ్రి అయినాడు. ఇప్పుడు తను కోటయ్యగారి తూర్పు పొలం కమతానికి చేస్తున్నాడు. జీవితం ఎంతమాత్రం సుఖంగా లేదు. సీతారామారావుకు ఉద్యోగం లేదు. గోళ్ళుగిల్లుకుంటూ కూచున్నాడు.

కాని ఊరు పాచిపోయిన చద్దికూడులాగా తయారయింది. చలికాలం రాగానే ఎవరి ఇళ్ళలో వారు దూరి తలుపులూ కిటికీలూ బిడాయించుకున్నట్టుగా అయిపోయినారు జనం. బంధువుల ఇళ్ళు పూర్వం స్వంత ఇళ్ళల్లే వుండేవి. ఇప్పుడు పరాయి

1. ఆర్థిక కాటకం (1929-1934) ఇదే సంపుటంలోని వారసత్వం నవలలో వివరాలు చూడండి.

"బోలెడంత డబ్బు తగలేసి పెద్ద చదువు చదివావు. ఈ ఫ్రాళ్ళో కూచుంటే ఏముందిరా? ఎక్కడికన్నా వెళ్ళి నాలుగురాళ్ళు సంపాదించుకుని నీ దారిని నువ్వు బతుకు. నీ అన్న సంసారం ఈదలేక రెక్కలు విరుచుకుని నానా హైరానా పడుతున్నాడు. వాడికి నీ బరువు కూడా దేనికి?" అని చాలా మంది సలహా యిచ్చారు.

ఎవరో పిలిచి తనకేదో ఉద్యోగం ఇస్తారని సీతారామారావు భ్రమ. తాను పొరుగూరు వెళ్ళి నలుగుర్ని యాచించి, కొందరిచేత లేదనిపించుకుని దొరికిన చోట ఉద్యోగం సంపాదించుకొనటమన్నది అతనికి చాలా అవమానకరంగా తోచింది. అయినా తనకు అది తప్ప మార్గాంతరం లేనట్లు అందరూ చెబుతున్నారు. అంతకన్నా తన అన్న చేసేపనే మగసిరిగా ఉంది - మనిషి ఎంత హైరానా పడుతున్నా!

మొత్తానికి సీతారామారావు ఒక ఏడాదల్లా అన్నకి బరువుగానే వున్నాడు. తరువాత అతనికి పెళ్ళయింది. బస్తీపిల్లనే చేసుకున్నాడు. మామగారు ప్లీడరు. బాగా సంపాదించుకుంటున్నవాడు. మునిసిపల్ వ్యవహారాలలో ఒక వర్గానికి సలహాలిస్తూ పలుకుబడి ఉన్నవాడు. సీతారామారావుకు ఆ సంబంధం రావటం చాలా అదృష్టమని అందరూ అన్నారు. పిల్ల కొంచెం స్థూలంగా ఉన్నా అనాకారి కాదు.

పెళ్ళి అయినాక సీతారామారావు మామగారి ఇంటనే జాస్తిగా ఉంటూ వచ్చాడు. అతనికి అదే సుఖంగా ఉంది. ఇక్కడ అతను ఎవరి ఆర్థికచిక్కులూ ఎదుర్కోనవసరంలేదు. తన మామూలు ఖర్చులు కూడా ధారాళంగా వెళ్ళిపోతున్నాయి.

మామగారు సీతారామారావుకు క్లబ్బు గుమాస్తాగిరీ ఇప్పించాడు. కరువు రోజుల్లో నలభైరూపాయల జీతం. పెద్దపెద్ద వాళ్ళందరితోనూ పరిచయం, కొద్దిగా పలుకుబడికూడా. ఈ నలభైలోనుంచి కనీసం పదో పదిహేనో అన్నకి పంపుదామని సీతారామారావు అనుకున్నాడు. కాని ఎందుకో పడలేదు. ఈ మాట భార్యతో అంటే ఇంత చిన్న మొత్తాలను గురించి నిరసనగా మాట్లాడింది.

"తిండిఖర్చా, ఇంటిఖర్చా లేదాయె. మంచిబట్టలు కొనుక్కోరాదూ?" అన్నది భార్య. భార్య ముచ్చట తీరటంకోసం ఖరీదైన సూటు కుట్టించాడు సీతారామారావు.

ఇంతలో ఎన్నికలు వచ్చాయి.[1] కాంగ్రెసు ఎన్నికల్లో పోటీచేయ నిశ్చయించి ప్రణాళిక ప్రకటించింది.[2] ఆ ప్రణాళికను ఉన్నదున్నట్టు కాపీకొట్టి ఒక రాజాగారు తామొక పార్టీ లేవదీసి వేరు వేరు నియోజక వర్గాల్లో నిలబెట్టటానికి అభ్యర్థులను వెతికారు. ఆయనకు చిక్కినవారిలో సీతారామారావు మామగారొకడు.

ఆయన సీతారామారావును వెంటపెట్టుకొచ్చి మద్రాసు కాస్మాపాలిటన్ క్లబ్బులో దిగాడు. ఈ కొత్తపార్టీ గెలుస్తుందనీ, ప్రభుత్వం నిర్వహిస్తుందని ఎవరి అంతరాత్మలలోనూ అట్టే ధైర్యం ఉన్నట్టు కనబడలేదు. అదివరకే దెబ్బతిన్న జస్టిస్ పార్టీకి మరొక బురఖా తొడిగి రంగంమీదికి తీసుకొస్తున్నారు. ఇది అందరికీ తెలిసిన రహస్యం. సీతారామారావు మామగారిలాంటివాళ్ళు పూర్వం బహిరంగంగా కాంగ్రెసు ఉద్యమాలతో సానుభూతి చూపినవారు. ఈ ఎన్నికలలో ఈ పార్టీకి పెద్ద అండ ఎన్నికల ఖర్చుకు కొంత డబ్బు తీసుకుని మామా అల్లుళ్ళు తిరిగి వచ్చారు.

ఈ పార్టీ అభ్యర్థుల జాబితాలో సీతారామారావు మామగారి పేరు పడింది. ఎన్నికల ప్రచారం ఆరంభమయింది. ప్లీడరుగారికి డొక్కు కారొకటి ఉన్నది. (ఇదికూడా ఆయన అభ్యర్థిత్వానికి తోడ్పడినమాట అబద్ధంకాదు.) ప్లీడరుగారు తన అనుచరులతో అల్లుడితో ఎన్నికల ప్రచారానికి బయలుదేరాడు. కొద్దిరోజుల పాటు పలుకుబడిగల వాళ్ళచుట్టూ తిరిగారు. వారిలో కొందరు తమకిందనున్న

1,2. 1937 ఎన్నికల ప్రస్తావన కావచ్చు. ఈ ఎన్నికల్లో కాంగ్రెసు విజయం సాధించింది. జూలై 14 వ తేదీన రాజగోపాలాచారి నాయకత్వంలో ఉమ్మడి మద్రాసు రాష్ట్ర మంత్రివర్గం ఏర్పడింది.

3. 1916 నవంబరులో పిట్టి త్యాగరాజు చెట్టి మొదలైనవాళ్ళు 36 మంది సభ్యులు కలిసి దక్షిణ భారత ప్రజల సంఘం అనే పేరున మద్రాసులో ఒక సంస్థను ఏర్పాటు చేశారు. ఇది బ్రాహ్మణేతరుల సంఘం. ఈ సంఘం జస్టిస్ అనే పత్రికను వెలువరించింది. 1916 డిసెంబరులో బ్రాహ్మణేతరుల ప్రయోజనాల పరిరక్షణకోసం **South Indian Liberal Federation** అనే సంస్థకూడా స్థాపితమైంది. ఇదే త్వరిత కాలంలో జస్టిస్ పార్టీగా అవతరించింది. 1920 నుంచి ఎన్నికల్లో పాల్గొంది. అధికారంలోకి వచ్చింది. తర్వాత జరిగిన ఎన్నికల్లో దాన్ని స్థానాలు తగ్గుతూ వచ్చాయి. ఇది జమిందారులూ సంపన్నుల పార్టీ అని పేరుగాంచింది. 1930 నాటికి పార్టీ పతనావస్థ చెందింది.

ఓట్లు ప్లీడరుగారికే వచ్చేట్టు చూస్తామన్నారు. కొందరు నమ్మకంగా చెప్పరే మన్నారు.

"ఈ ఎన్నికలలో నేను ఓడినా నా కష్టాంతరం లేదు. నా యందు విశ్వాసం వున్న వాళ్ళ వోట్లు నాకు పడితేచాలు. నేను మాత్రం కాంగ్రెసువాణ్ణి కానా? ఈసారి కాంగ్రెసు గెలవదు. కాంగ్రెసు ఎన్నికలకు నిలబడడం మహాత్మాజీ[1] దగ్గర్నుంచీ ఎవ రికీ ఇష్టంలేదు. నేను పోటీ చేయకపోతే ఇంకో క్షుద్రుడు వస్తాడని నిలబడటమే. పార్టీనిచూచి నాకు వోటివ్వవద్దు. నన్నుచూసే ఇవ్వండి" అని వేడుకున్నాడు ప్లీడరు గారు.

ఇంతకీ ఈయన కెదురుగా నిలబడిన కాంగ్రెసు "క్షుద్రుడు" అప్పటికే అయి దేళ్ళు జైళ్ళలో మగ్గినవాడు!

ఎన్నికలు దగ్గిర పడినకొద్దీ ప్లీడరుగారికి వేడెక్కింది. కారులో ఊరంతా తిరగటమూ, నలుగురు చేరినచోట కారు ఆపి అప్పటికప్పుడే ప్లీడరుగారు ప్రసంగం ప్రారంభించటమూ, గొడ్లకాడ పిల్లలు చుట్టూమూగి నోళ్ళు తెరుచుకు వినటమూ, పెద్దవాళ్ళు వినిపించుకోకుండా పోవటమూ, చదువుకున్న కుర్రకారు నవ్వటమూ- యిది నిత్యకార్యక్రమం అయిపోయింది.

ఈ మీటింగుల్లో సీతారామారావు కూడా మాట్లాడసాగాడు. తన అల్లుడికి మాట్లాడే శక్తి ఉండటం గమనించి ప్లీడరుగారు ఆశ్చర్యపడ్డాడు. ఇంకా పెద్ద సభలు ఏర్పాటుచేసి రేపో ఎల్లుండో ఎన్నికలనగా అల్లుడిచేతా, మరికొందరు మిత్రులచేతా మాట్లాడించాలని ప్లీడరుగారు ప్రయత్నించాడు. ఈ ప్రయత్నం అభాసుపాలై పో యింది. వచ్చిన జనమే పాతికమంది వాళ్ళు సభ జరగనీయకుండా అల్లరి చేశారు.

ఎన్నికలు జరిగాయి. ప్లీడరుగారి డిపాజిట్ పోయింది. ఆయనపడ్డ శ్రమకు నాలుగైదు వందలు దక్కాయి పరవాలేదు.

సీతారామారావు పట్నంలో నూరు రూపాయల ఉద్యోగం సంపాయించాడు. కాస్మాపాలిటన్ క్లబ్ ఊరికే పోలేదు. ఆ రోజులకది మంచి సంపాదనే. నెలకు రెండు పుట్లు! కాని అదేం కర్మమో ఇంటికి పంపించాలంటే కానీ వుండేదికాదు. పాతిక రూపాయలు ఇంటి అద్దెకిందే పోయేది. ఉద్యోగానికి తగిన దుస్తులుండాలి. ఇంటికెవరన్నా వస్తే కూచోటానికి నాలుగు కుర్చీలూ, ఆదివారాలు బయటికిపోతే నాలుగేసి రూపాయలఖర్చూ, భార్యకు అప్పుడప్పుడూ చీరలూ, నగలూ-ఎంతచెట్టు కంత గాలిలాగా-ఎక్కడికక్కడ సరిపోతూనే ఉంది.

1. మహాత్మాగాంధీ

రాఘవులు ఉత్తరాలు రాస్తూనే ఉన్నాడు. ఇప్పుడు రాఘవులుకు అయిదుగురు పిల్లలు. మొత్తం ఏడుగురయితే ఇద్దరు పోయారు. పిల్లలెవర్నీ బడికి పంపటంలేదని రాశాడు. తిండే పెట్టలేనివాడు పిల్లలకు చదువు లెక్కడ చెప్పిస్తాడు?

"ఈ దుర్దశలో నేనుకూడా వాళ్ళగొంతుమీద లేను. అంతేచాలు" అని తన అంతరాత్మను సమాధానపరుచుకో జూశాడు సీతారామారావు. అధమం నెలకో పది పంపినా వాళ్ళకెంతో లాభంగా ఉంటుంది. కాని ఆ పదీ పంపటం అతనికి పడటం లేదు.

అతను పట్నంచేరి దాదాపు రెండేళ్ళు కావస్తోంది. ఈ లోపుగా రెండు మూడు సార్లు అత్తవారింటికి వెళ్ళి నాలుగేసి రోజులుండి వచ్చాడుగాని ఇంటికి వెళ్ళటం పడలేదు. ఆఖరుసారి వెళ్ళినపుడు ఎట్లాగో తెలిసి రాఘవులే చూడవచ్చాడు. అన్ననూ, అతని పెరిగిన గడ్డమూ, పీక్కుపోయిన మొహమూ చూడగానే సీతా రామారావునకు శూలంపెట్టి డొక్కలో పొడిచినట్టయింది. ఎంతదారిద్ర్యం! అటువంటి దారిద్ర్యాన్ని మనుషులు ఎందుకు సహిస్తారు! తాను మారానని ఒప్పుకోవడం ఇష్టం లేక రాఘవులు చాలా మారాడనుకున్నాడు.

"అంతా కులాసాయేనా" అన్నాడు సీతారామారావు.

"అదే కులాసా! ఉన్నాం!" అన్నాడు రాఘవులు విశాలంగా నవ్వుతూ. "ఇంటికేసి చూడకపోతివేం? ఒకసారి రారాదూ?"

"రావాలనే అనుకున్నా! రావటానికీ, పోవటానికీ ఒకరోజు ప్రయాణమే!" అన్నాడు సీతారామారావు.

"అవుననుకో! అయితేమటుకు? పెద్దవాడు ఇంటిపట్టునుండటంలా. ఈ ఊళ్ళోనే ఏదో ప్రెస్సులో పనిచేస్తున్నాడు. నెలకొకసారో, రెండుసార్లో వచ్చి రూపాయో, రెండూ ఇచ్చిపోతుంటాడు. నా కిప్పుడు వాడి బరువులేదు. పెద్ద పిల్లదే చిగులు పట్టుకుంది. ఎక్కడన్నా ఓ ఇరవై తెచ్చుకుంటున్న వాణ్ణిచూసి పెళ్ళి చేద్దామనుంది. ఆ బరువుపోతే మిగిలిన వాళ్ళం ఎట్టాగోట్టా తంటాలు పడతాం మరి. ఏవంటా?"

ఏమనటానికీ సీతారామారావుకు పాలుపోలేదు. తాను తన అన్నకు ఏవిధం గానూ సహాయపడలేక పోవటం తలుచుకున్నకొద్దీ ఆశ్చర్యంగా ఉంది.

"నా సంగతీ అంతంత మాత్రంగానే ఉంది. సంపాదిస్తున్నానేగాని నా సంపాదనంతా పట్నమే తినేస్తుంది. కనపడని ఖర్చు!" అన్నాడు సీతారామా రావు.

"కాదుమరీ!" అన్నాడు రాఘవులు.

"నీ కెప్పుడన్నా డబ్బు కావలిస్తే రాస్తూండు. అయిదుకూ పదికీ అవస్థ పడమాకు" అన్నాడు తమ్ముడు.

రాఘవులు నవ్వాడు.

"ఒరే! డబ్బవసరం ఎప్పుడూ ఉంటుంది. ఏం రాసేది? నీదగ్గర మిగిలి నప్పుడు నువ్వే పంపిస్తూ ఉండు. నువ్వు ఇబ్బంది పడబోకు సుమా!"

రాఘవులు వెళ్ళిపోగానే సీతారామారావు హృదయంలో ఉండిన భ్రాతృ ప్రేమ కట్టతెగినట్టయింది. పుట్టి నూరుదాకా అమ్ముతుండిన రోజుల్లో రాఘవులు చదువుమాని నాగలి పట్టాడు. ఆ కాలంలో రాఘవులు బియ్యేదాకా చదివినా సంసారం ఇంతచితికేది కాదు. తన చదువు కోసం రాఘవులు చేసిన త్యాగం ఏమిటీ? ఇవాళ రాఘవులెక్కడున్నాడు? తాను ఎక్కడున్నాడు? రాఘవులు ఏడాదికి నూరు సంపాదిస్తున్నాడో లేదో!

పట్నం తిరిగిరాగానే తీసుకున్న జీతంలోనుంచి సీతారామారావు ఇరవై రూపాయలు అన్నకు పంపాడు. జీతం తక్కువ వచ్చిందేమని భార్య అడిగింది. అన్నకు పంపానన్నాడు భర్త. భార్య ఏమీ మాట్లాడలేదుగాని ఆవిడ మౌనం మాటలకన్న ఎన్నోరెట్లు భావయుక్తంగా ఉంది.

కొంచెంసేపుండి, "ఈనెల మటుకేనా? నెలనెలా పంపుతారా?" అన్నది.

సీతారామారావుకు చిరాకెత్తింది.

"నెల నెలా పంపుతాను. ఒకనెల తిని మిగతానెలలు పస్తుంటారా?" అన్నాడు.

"నెలకు ఇరవై చొప్పున?"

"నెలకు అరవై చొప్పున చదువుకింద నాలుగేళ్ళపాటు ఉమ్మడి ఆస్తిలో నించి తగలేశాను. మరేంపరవాలేదు. నా చదువుమూలంగా వాళ్ళకుతిండి లేకుండా పోయింది."

* * *

యుద్ధంవచ్చింది.[1] మామగారు తన పలుకుబడితో సీతారామారావుకు రకరకాల ఉద్యోగాలిప్పించాడు. యుద్ధనిధి వసూళ్ళు, ప్రాపగాండా రిక్రూట్‌మెంట్, చివరకు సప్లయిశాఖ—వీటిల్లో పనిచేసి అతను చాలాడబ్బు పోగుచేశాడు. పెద్ద పెద్ద వాళ్ళను పట్టుకున్నాడు. లంచాలు పెట్టాడు. కోటాలు సంపాదించాడు. యుద్ధం ముగిసినా సంపాదన హెచ్చింది.

1. రెండవ ప్రపంచ యుద్ధం (1939-1945) ప్రస్తావన.

ఇప్పుడు రాఘవులు పరిస్థితికూడా వెనకటంత ఘోరంగాలేదు. రాఘవులు పల్లెటూరు వొదిలి బస్తీ చేరాడు. కూతురికి పెళ్ళిచేశాడు. ముగ్గురుకొడుకులు చిన్న చిన్న ఉద్యోగాలు చేసి సంపాదిస్తున్నారు. రాఘవులుకూడా బస్తీలో పొగాకు వ్యాపారం, నేతి వ్యాపారం పెట్టాడు. ఇదంతా విని సీతారామారావు తన అన్న భోగభాగ్యాలతో తులతూగుతున్నట్లు ఊహించుకుని తన అంతరాత్మను సంతృప్తి పరుచుకున్నాడు.

కాని సంతృప్తిపడటాని కేమీలేదు. రాఘవులు పెద్దకొడుకు ప్రెస్సులో కంపోజిటర్. రెండోవాడు సైకిల్ షాపులో పనిచేస్తున్నాడు. మూడోవాడు ఎవరో డాక్టరుగారిదగ్గర నౌకరీ చేస్తున్నాడు. రాఘవులు అల్లుడు కాస్త డొక్కశుద్ధి కల వాడు. యుద్ధానికి ముందరే కమ్యూనిస్టులతో కలిసి తిరగసాగాడు. కమ్యూనిస్టు సాహిత్యం తెగచదివాడు. తన సిద్ధాంతాలను బావమరుదులకు నూరిపోస్తుండే వాడు. ఇక రాఘవులు అమాయకుడు. కల్మషం ఎరగనివాడు. కాస్త మంచిగా మాట్లాడినవాళ్ళకు వీశెలకొద్దీ పొగాకూ, నెయ్యీ అప్పు పెట్టి భాగస్తుడికి కోపం తెప్పించాడు. రెండునెలలైనా తిరగకుండానే ఆ వ్యాపారంలో రాఘవులకు భాగం లేకుండాపోయింది.

పెళ్ళయిన చాలాకాలానికి సీతారామారావు భార్య గర్భవతి అయింది. ఆమెను భర్త పుట్టింటికొకసారి తీసుకొచ్చినప్పుడు అన్నగారి ఇంటికి కూడా వెళ్ళాడు. అక్కడి స్థితిగతులన్నీ చూశాడు. అన్నను చూస్తే జాలివేసింది. ముగ్గురు కుర్రాళ్ళకూ కమ్యూనిస్టుల భాష అలవడింది. ఇదంతా డబ్బు లేకపోవటంవల్ల వచ్చిన జబ్బే అనుకున్నాడు.

"అన్నయ్యా! వీళ్ళని నావెంట పట్నం పంపిస్తావా? ఎక్కడో ఒకచోట వేయిస్తాను" అన్నాడు సీతారామారావు.

"నీ యిష్టం" అన్నాడు రాఘవులు. కాని అతన్ని పిల్లలే పోషిస్తున్నారు. అందుచేత పిల్లలతోబాటు ఆయనకూడా పట్నం రావలసివచ్చింది. అయితే, ఇప్పుడిటువంటి కుటుంబాలు సీతారామారావుకు బరువులేదు. అతనికి చాలా వ్యాపారాల్లో వాటా ఉంది. చాలా రకాల సంపాదన ఉన్నది. స్వాతంత్ర్యం వచ్చిన రోజునుంచీ అతను పలుకుబడిగల కాంగ్రెసు వాదులతో దోస్తీగా తిరుగు తున్నాడు.

రాఘవులు పిల్లలతోసహా పట్నం రావటం మంచిదయింది. వాళ్ళు వచ్చిన కొద్ది రోజులకే కమ్యూనిస్టుల మూలంగా కల్లోలాలు బయలుదేరాయి. రాఘవులు కూతురూ, అల్లుడూ అండర్‌గ్రౌండ్ అయిపోయారు.

సీతారామారావు రోజూ కమ్యూనిస్టులను తిడుతుండేవాడు. రాఘవులు పిల్లలు వాళ్ళని సమర్థిస్తుండేవాళ్ళు. ఈ విధంగా తనకెదురు చెప్పటం కృతఘ్నత లాగా తోచేది సీతారామారావుకు.

ఒకనాడు సీతారామారావు ఇంటికి వచ్చేసరికి ఇంట్లో కొత్త మొహాలు కనిపించాయి. తీరా విచారిస్తే వాళ్ళు రాఘవులు కూతురూ, అల్లుడూ అని తెలిసింది! రాఘవులు అల్లుడు తానూహించుకున్నట్టు లేకపోవడం చూసి సీతారామారావు ఆశ్చర్యపడ్డాడు. అతను ఇంగ్లీషు ధారాళంగా మాట్లాడగలడు. ఎంతసేపు మాట్లాడినా తొణకకుండా హాస్యంగాకూడా మాట్లాడగలడు. పోలీసులుచేసిన దుర్మార్గాలను వర్ణించేటప్పుడుకూడా సాధారణ విషయాలు మాటలాడుతున్నట్టే కనబడ్డాడు. అయితే లోపల ఎంత ఆవేశాన్ని నిగ్రహించుకున్నాడో సీతారామారావు ఊహించగలిగాడు.

వాళ్ళిద్దరూ తమ ఇంట్లో అజ్ఞాతవాసం పెడతామంటారేమోనని సీతారామారావుకు చెడ్డభయం కలిగింది. కాని వాళ్ళు ఉండలేదు. అన్నాలుతిని చీకటిలో పడివెళ్ళిపోయారు. వాళ్ళను దిగబెడతామని బయలుదేరివెళ్ళిన రాఘవులు కొడుకులు తిరిగి ఇంటికి రాలేదు.

తరవాత కొద్దిరోజులకు రాఘవులు పెద్దకొడుకును కొండపల్లి ప్రాంతంలో కాల్చి చంపారు.

మళ్ళీ ఎన్నికలు వచ్చాయి.[1] తనను కాంగ్రెసు మిత్రులు పోటీ చెయ్య మంటున్నారనీ, రెండువారాలపాటు వచ్చి అక్కడే ఉండి సహాయపడవలసిందనీ మామగారు సీతారామారావుకు రాశారు. సీతారామారావు భార్యతోనూ, కొడుకుతోనూ వెళ్ళాడు. ఎవరెవరోవచ్చి తన మామతో మాట్లాడివెళ్ళే విషయాలన్నీ వింటుంటే కాస్మాపాలిటన్ క్లబ్ జ్ఞాపకం వచ్చింది.

ప్లీడరుగారు పోటీచేస్తున్న సీటుకు కమ్యూనిస్టూ, లోక్‌పార్టీమనిషీ, ప్రజా-సోషలిస్టుకూడా పోటీచేస్తున్నారు.

"ఏంటీ కాంగ్రెసువోటు బాగానే చీలుతుంది. అదొక్కటే మనకు కాస్త ఆశ!" అన్నాడు ప్లీడరుగారు.

---

1. 1952 ఎన్నికలు, మొత్తం స్థానాలు 140, కమ్యూనిస్టులకు 41, కాంగ్రెసుకు 40, కిసాన్ మజ్దూర్, ప్రజాపార్టీ, కృషీకార్ పార్టీ, సోషలిస్టు పార్టీ స్వతంత్రులకూ 59 స్థానాలు లభించాయి.

తీరా విచారిస్తే తన మామగారితో పోటీచేసే అభ్యర్థి రాఘవులు అల్లుడేనని తెలిసింది. సీతారామారావు అతనితో మాటలాడాడుకూడా. మంచిమాటలతో అతను తప్పుకుంటాడేమోనని సీతారామారావు చూశాడు కాని అటువంటి ప్రయత్నం అనవసరం.

మామగారి ఎన్నికలకుగాను సీతారామారావు స్వయంగా చాలా ఖర్చు చేశాడు. మీటింగులలో మాటలాడదామనికూడా అనుకున్నాడు. కాని కాంగ్రెసు పక్షాన మీటింగు పెట్టడమే దుస్సాధ్యమయింది.

ఆ ఎన్నికలో కమ్యూనిస్టు అభ్యర్థి గెలిచాడు. ప్రజా-సోషలిస్టుకుకూడా బాగానే వోట్లుపడ్డాయి. మళ్ళీ ప్లీడరుగారికి డిపాజిట్ పోయింది.

ఈ అర్థంలేని ఎన్నికకుగాను తన సొంతడబ్బు ఇరవైవేలదాకా తగలేసుకుని పట్నం తిరిగిపోతూ సీతారామారావు "రాఘవు లన్నయ్య అల్లుడు పైకి వచ్చినదారి ఏమిటో?" అనుకున్నాడు.

ముద్రణ : 8, డిసెంబరు 1954, ఆంధ్ర ప్రభ వారపత్రిక.

# మహా ఇల్లాలు

రోశాం యానాదిపిల్ల. చిన్నతనంనుంచీ మా యిళ్ళలోనే పెరిగింది. అస్త మానం మా యిళ్ళలోనే ఉండేది. గుడిసెకుపోతే చుట్టపుచూపుగా ఏమన్నా పొయ్యే దేమో. మాయింటో తప్పితే సీతయ్యగారియింటో, తప్పితే కోమటిదుకాణంమీద. మరోచోటికిపోయి ఎరగదు. ఈ మూడిళ్ళలోనూ పనిచేసేది. మూడిళ్ళలోనూ తిండితినేది. రాత్రిపూట ఎవరో ఒకరి పంచన పడుకునేది.

"చేసుకున్న అమ్మకు ఒకటేకూర, అడుక్కున్న అమ్మకు అన్నికూరలే." అనేది మా అమ్మ.

"చిన్నతనం. నిర్విచారంగా వుంటుంది. ఏ పని చెప్పినా ఆడుతూ పాడుతూ చేస్తుంది." అనేది సీతయ్యగారి పెళ్ళాం.

"ఏ జనమలోనో పాపంజేసి సూద్దరాళ్ళయి పుట్టటంగాని, అసలు ఆళ్ళకున్న సుకం మన కేణ్ణించొస్తుంది?" అనేది కోమటావిడ.

రోశాం అంట్లు తోమేది, దొడ్డి ఊడ్చేది, బజారుకెళ్ళి అదీ ఇదీ పట్టుకొచ్చేది. బట్టలు ఉతికేది, అది ఉతికిన బట్టలమీద నాలుగుచుక్కలు పవిత్రోదకం చల్లి మా వాళ్ళు ఆరేసుకునేవాళ్ళు.

ఏ కారణంచేతనన్నా రోశాం ఒకరోజు రాకపోతే మా వాళ్ళకు చాకిరి ఎంతచేసినా తెమిలేదికాదు. అయితే ఏం, దాన్ని అందరూ ఎంతో ఆపేక్షగా చూసేవాళ్ళు.

మేం దానికి నెలకి పావలా ఇచ్చేవాళ్ళం. సీతయ్యగారు యింకో పావలా అల్లా ఇచ్చేవాడు. కోమటాయన ఏమీ ఇయ్యకపోయినా రోశాం తల్లికి ఎప్పుడన్నా ఓ దమ్మిడీ ఉప్పు పెట్టేవాడు. రోశాం తండ్రికి ఒకటీ రెండూ అప్పు పెట్టి నెలకు రూపాయికి అణాకంటె వడ్డీ తీసుకునేవాడుకాడు. వ్యాపారం చేసుకునేవాళ్ళకి మటుకు అభిమానాలుండవెట్టా?

ఎప్పుడన్నా మా యిళ్ళల్లో బొత్తిగా చిరిగిపోయిన బట్టలుంటే, అవతల పారెయ్యకుండా దానికే ఇచ్చేవాళ్ళం. తిండి పెడుతూనే ఉంటిమాయె. ఇకదానికి ఖర్చేముందీ? ఏడాదికి నికరంగా ఆరురూపాయల్లా వెనకేసిందన్నమాటే. ఈ లెక్కచూసి ఓసారి కోమటావిడ విరుచుకుపడి పోయినంత పనిచేసింది.

రోశాం తండ్రి వొట్టి పాపిష్టిముండాకొడుకు. తాగేసేవాడు, అందుచేత దాని తల్లి, కూతురి జీతండబ్బులు మావాళ్ళ దగ్గిరే దాచుకుని అవసరమైనట్టు తీసుకునేది.

భగవంతుడు అటువంటి వాళ్ళను కనిపెట్టి వుంటాడు గామాలు. రోశాం ఎన్నడూ మంచానపడి ఎరుగదు. ఎప్పుడన్నా తలనొప్పి, జ్వరమూ వచ్చినా దానికి లెక్కలేదు. అందుచేత దానిచేత మామూలు ప్రకారం పని చేయించుకునే వాళ్ళం. అదికూడా ఎంత జ్వరమైనా ఖాతరు చెయ్యకుండా మామూలు పనులన్నీ చేసేది.

మా నాన్నగారు డాక్టరై ఉండికూడా ఇంట్లో మాకొచ్చే రోగాలకు మందివ్వటానికి విసుక్కునేవారు. "ఆ ముండను చూడండ్రా. దానికేం మందు కావాలి? అన్ని మందులూ మనకే!" అనేవారు.

తక్కువ కులంది గనక, ఏ వస్తువన్నా చప్పున కనిపించకపోతే సహజంగా "ఆ రోశాం ముండ ఎత్తుకుపోయిందేమో." అని అనుకునేవాళ్ళమన్నమాటేగాని అది ఎన్నడూ యథార్థంగా దొంగతనం చేసి ఎరగదు. ఇంటో ఉండే వెండిసామానూ, నగలూ, అక్కడక్కడా పెట్టిన చిల్లరడబ్బులూ, అది ఎన్నడూ ముట్టుకోకపోగా జాగర్త చేసిపెట్టేది కూడానూ. అటువంటిబుద్ధి పనిచేసేవాళ్ళలో అరుదు.

పెళ్ళయేవరకూ రోశాం మా యిళ్ళలో పనిచేస్తూనే ఉందనుకోండి. దానికి పెళ్ళయితే మా యింటో మనిషికి పెళ్ళయినట్టే వుంది. అమ్మ దానికో రూపాయి న్నర చీరా, నాలుగణాల గుడ్డకూడా పెట్టింది. పెళ్ళయిన ఏడాదికల్లా అది పిల్లాణ్ణెత్తుకొస్తే అమ్మ మళ్ళీ పిల్లాడిచేతిలో అణా పెట్టింది.

"నువ్వెళ్ళావు. మళ్ళీ యింటికి అనువయిన పనిమనిషి దొరకలేదే!" అన్నది అమ్మ.

"అదేం దమ్మగారూ!" అన్నది రోశాం అదుర్దాగా.

"ఆఁ! అంతా, రూపాయిస్తావా? రెండిస్తావా? అని అడిగే వాళ్ళేనే! రూపాయలు పోగేసుక్కూచున్నామా?" అన్నది అమ్మ.

"రోజులు మా మండిపోతాన్నయ్యమ్మా!" అన్నది రోశాం....

రోశాం మొగుడు మావూళ్ళో చేరటంతో రోశాం మళ్ళీ మాకు దగ్గిరయింది. పనిలోకి వస్తుందేమోనని ఆశపడ్డాం కూడా. కాని రోశాం మొగుడు అదోరకం మనిషి. దానికి తగ్గవాడు కాడు. వాడికి పొగరు. మేమంతా డబ్బున్నవాళ్ళమని వాడికి కడుపుమంట. తనక్కూడా మేడలూ మిద్దెలూ లేవని ఏడుపేమో! అందు

చేతే వాడికి ఎక్కడా కుదురుగా నౌకరీ చేసుకునే గీతలేదు. రోశాంవంటి మంచి ముండకు అటువంటి నిర్భాగ్యుడు దొరకటం చాలా విచారకరం....

మంచివాళ్ళకి కాలంకాదు. అందుచేతనే రోశాం, పాపం, అన్ని ఇక్కట్లు పడ్డది. ముందు దాని మొగుడికి ఉద్యోగం పోయింది. ఏదో నాలుగు రాళ్ళు తెచ్చుకుంటున్న వెధవ ఊరికే ఉండగూడదా? సమ్మెలుట, సమ్మెలు!

వాడికి ఓ చెంప ఉద్యోగం పోయి ఉన్న స్థితిలో రోశాం పెద్దపిల్లవాడికి రోగం వచ్చింది. ఇంట్లో ఏ పూటకూడా ఓ గింజలేదు. దానికా చాకిరిలేదు. ఎట్లా గడుస్తుందీ? ఎవరిస్తా రేమిటి? ఎందుకిస్తారు? రెక్కాడితేనే డొక్కాడుతుంది. పిల్లవాడికి మందూమాకూ లేదు.

మాయింటో యింటిమనిషల్లే పెరిగిన పిల్ల ఇన్ని అగచాట్లు పడుతూంటే మాకు కష్టంగానే ఉంది మరి. కాని ఎవరి రాత ఎవరు తప్పిస్తారు గనకా? కాని అంత ఇబ్బందిలోనూ అది దేహీ అని ఎవర్ని గానీ అడిగిందా, అదెంత మహా ఇల్లాలో! ఒకవేళ మేం ఇచ్చినా తీసుకుని ఉండేదికాదు. సందేహంలేదు.

కష్టాలు ఒంటరిగా రావుగదాని మొదటో దాని మొగుణ్ణి ఎరెస్టుచేసి తీసుకు పోయినారు. మర్నాడే పిల్లాడు చచ్చాడు. ఆ తరవాత రోశాం మంచం పట్టిందని తెలిసింది. చూసేవాళ్ళు లేరు. కాచిపోసేవాళ్ళులేరు. ఎంతకాలం బతుకుతుందీ?

"నీకి పాడు ప్రపంచంతో రుణం తీరిపోయింది. నా వెంటరా," అని భగవంతుడే దాన్ని తీసుకుపోయినాడు.

దాని పేర ఆ రెండో నలుసు మాత్రం బతికి ఉన్నాడు. వాణ్ణి ఎవరో దగ్గిరికితీసి సాకుతున్నారట. అన్నిటికి ఆ భగవంతుడే దారి చూపిస్తాడు. భూమ్మీద నాలుగు మెతుకులు ప్రాప్తం ఉండాలేగానీ, ఏ దేముడో, ఏ ధర్మరాజో ఆదుకోక పోడు....

ఏమయినా అదిమాత్రం మహా ఇల్లాలు. దానికి మళ్ళీ జన్మంటూ ఉండదు. అది పోయిందంటే మా మూడిళ్ళవాళ్ళకీ మా సొంతమనిషి పోయినట్లే ఉందన్న మాట. అభిమానాలు గుణాన్నిబట్టి రావాలిగాని కులాన్నిబట్టి వస్తాయా ఏం?

ప్రచురణ : డిసెంబరు 1947, తల్లిలేని పిల్ల కథల సంపుటి
నుంచి ప్రజా సాహిత్య పరిషత్తు : తెనాలి.

# దాలిగుంటలో కుక్కలు

వాళ్ళ ఊళ్ళో ఏం చేస్తుందోగాని, పండక్కి పర్వానికి పుట్టింటికి వచ్చి నప్పుడు అక్కయ్యకు బొత్తిగా కాలం జరగదు. అందుకని బావ ఎక్కడెక్కడి పత్రికలూ తెస్తాడు. పిల్లల పత్రికలూ, ఆడవాళ్ళ పత్రికలూ, మగవాళ్ళ పత్రికలూ అన్నీ చదివేస్తుంది అక్కయ్య. చిట్టీ, బుల్లాడూ పిల్లల పత్రికలే చదువుతారు. మిగతావి బొమ్మలు చూసుకుంటారు కాని అక్కయ్య అన్నీ చదివేస్తుంది.

బావ పత్రికలో ఒక మంచి కథ చూపించాడు. అక్కయ్యని చదవమన్నాడు. అక్కయ్య చదివింది. అర్థం కాలేదన్నది.

"నేను చదివి వినిపిస్తే అర్థమవుతుంది" అన్నాడు బావ.

"చదువు బావా, నేను కూడా వింటా" అన్నది చిట్టి.

"నేనుకూడా వింటా బావా" అన్నాడు బుల్లాడు.

"ఏమిటోయ్ అదీ? మంచి కథా యేం? కొంచెం గట్టిగా చదివితే నేనుకూడా విని ఆనందిస్తాగా?" అన్నాడు నాన్న.

"అమ్మాయ్, ఈ వసారాలో చాపేసి దీపం పెట్టవే, చదువుతుంటే నాక్కూడా వినిపిస్తుంది!" అన్నది అమ్మ వంటింట్లోంచి.

బావ చదవసాగాడు. అమ్మ వింటున్నది. నాన్న వింటున్నాడు. బుల్లాడూ, చిట్టీ వింటున్నారు. సరే అక్కయ్య వింటూనే ఉంది.

మధ్య మధ్య బావ, కూలివాళ్ళు సమ్మె ఎందుకు చేస్తారో, వాళ్ళ సమ్మెను యజమాను లెట్లా పడగొడతారో కూలీలను లాకౌటు చెయ్యటమంటే ఏమిటో, పోలీసులు వచ్చి యజమానుల తరపున ఎట్లా హింసలు పెడతారో అదంతా వివరంగా చెబుతూ కథ పూర్తి చేశాడు.

కథ చాలా బాగుందన్నది అక్కయ్య.

"యజమాన్లను చంపినా పాపంలేదు" అన్నది చిట్టి.

"వాళ్ళమీద లాఠీచార్జి చెయ్యాలి, అప్పుడుగాని వాళ్ళ తిక్క వదల్దు" అన్నాడు బుల్లాడు.

"ఏముంది నాయనా, డబ్బు గలవాడిది రాజ్యం! కూలి చేసుకునేముండా కొడుకులను ఆలించే వాళ్ళా, పాలించే వాళ్ళా? తినటాని కింత ఉండికూడా మనమే

ఇన్ని కష్టాలు పడుతుంటే, వాళ్ళగతి ఎట్లా ఉంటుంది, పాపం!" అన్నది అమ్మ కూర తిప్పుతూ.

"నా చిన్నతనంలో ఇంత అన్యాయం లేదోయ్! పని చేసే వాడంటే ఎంతో ఆదరం వుండేది. తిండికీ బట్టకీ లోటనేది పనివా ళ్ళెరుగుదురా? కమత గాళ్ళున్నారంటే ఇంట్లో పెత్తనం దగ్గర్నుంచీ వాళ్ళదే. పనిచేసే వాళ్ళని పరాయి వాళ్ళల్లే చూడటం ఎన్నడైనా కద్దా? ఈ రైళ్ళూ, ఈ ఫాక్టరీలూ వచ్చి మరీ దేముడూ దైవమూ లేకుండా పోయింది. ఈ ఫాక్టరీలవాళ్ళు ఇంతింత సంపాదిస్తున్నారు కదా, పోనీ ఆ కూలివాళ్ళ మొహాన ఇంత పారేస్తే ఏం? ఆశకైనా అంతుండొద్దూ? ఎబ్బే, ఛీ!" అన్నాడు నాన్న.

"ఇదంతా పోనివ్వండిగాని సమ్మె చేసినంత మాత్రాన పోలీసులు వచ్చి కూలీలమీద కాల్చటం దేనికి? పనికి రాకపోతే వాళ్ళకే నష్టంగా? కావాలంటే కూలీలు పని మానుకోకూడదా? వాళ్ళచేత బలవంతాన పని చేయిస్తారా?" అన్నది అక్కయ్య.

"అట్లాగా? ఒకరోజు పనివాడు కూలి మానివేస్తే వాడికి కూలిడబ్బుకే నష్టం. యజమానికి అంతకంటె నష్టం. అదీకాక, పని మానదలచిన కూలివాడు పదిహేను రోజులు ముందుగా యజమానికి నోటీసు ఇవ్వాలి. ఆ పదిహేనురోజుల నోటీసూ కూలీలు యజమానికీ, కూలీలకు యజమానీ అచ్చి ఉంటారు" అన్నాడు బావ.

"సమ్మెకు ముందుగా నోటీసిస్తారు కాబోలుగా?" అన్నది అక్కయ్య.

"ఇస్తారు, ఇచ్చినా సమ్మే, పని మానుకోవటమూ ఒకటికాదు. పని మానుకున్న కూలివాడు ఫ్యాక్టరీ వొదిలిపోతాడు. సమ్మెచేసే కూలీ ఫాక్టరీ దగ్గరేవుండి, మరొకడు తన స్థానం ఆక్రమించకుండా చూస్తాడు."

"అందుకేనా పోలీసులు వచ్చి కాల్చటం?"

"అవును."

"పోలీసులకు ఫాక్టరీ యజమానులు జీతాలిస్తారా?"

"లేదు. మనం కట్టే పన్నులతోటే పోలీసుల జీతాలు ఇస్తారు. ఐతే ప్రభుత్వాలు నడిపేవాళ్ళు యజమానుల మంచి కోరినప్పుడు సమ్మెలు విచ్ఛిన్నం చెయ్యక తప్పదు."

"కూలివాళ్ళని కాల్చటానికి పోలీసులు వెళ్ళకపోతే?" అన్నది చిట్టి.

"పోలీసులు వెళ్ళకపోతే కూలీల సమ్మె గెలవచ్చు. గెలిస్తే కూలీలకు యజమాన్లు ఎక్కువ జీతాలిచ్చుకోవాలి" అన్నాడు బావ.

"అట్లా అయితే బాగుంటుంది" అన్నది చిట్టి సంతోషంతో.

"అట్లా అయితే యజమానులు ఫాక్టరీలు మూసెయ్యవచ్చు. అప్పుడేం జరుగుతుందీ? బట్టల మిల్లులు ఆడవు. మనకి బట్టలుండవు. ఏ మిల్లూ ఆడదు. మనకి అనేక వస్తువులుండవు."

"ఏమీ లేకపోతే ఎట్లా?" అన్నాడు బుల్లాడు.

"అటువంటప్పుడు ప్రభుత్వం యజమాన్లమీద అధికారంచేసి మిల్లులు ఆడించవచ్చు. యుద్ధమప్పుడు కొన్ని మిల్లులు మూసేస్తే ప్రభుత్వం బలవంతాన తెరిపించింది."

"ఆ పని చెయ్యగూడదూ?" అన్నది అక్కయ్య.

"పిచ్చిదానా, ఆ పని చెయ్యటానికి మాత్రం శక్తి సామర్థ్యాలు ఉండొద్దూ? మనకున్న పరిస్థితుల్లో యజమానులు లాభాలకోసం వస్తువులు తయారు చేస్తారు తప్ప, నీకూ నాకూ అవి లేకపోతాయేమోనని తయారు చెయ్యరు. వాళ్ళు లాభాల కోసం మిల్లులు నడిపినన్నాళ్ళూ కూలీలకు దరిద్రం తప్పదు. దరిద్రం భరించ లేక వాళ్ళు సమ్మెలు చెయ్యకా తప్పదు. సమ్మెలు చేస్తే ప్రభుత్వం యజమాన్ల పక్షం వహించి కూలీలను దండించకా తప్పదు. కాల్చి చంపుతారని తెలిసికూడా కూలీలు సమ్మెలు చేస్తున్నారంటే వాళ్ళ బాధ ఎటువంటిదో మనం ఊహించుకోవాలి" అన్నాడు బావ.

"నువ్వెంతైనా చెప్పవోయ్, దేహీ అని యాచిస్తే ఇవ్వనివాడే మన ధర్మం ప్రకారం పరమ పాతకుడు. ఉండికూడా కూలి సరిగా ఇవ్వనివాడు పరమ ఛండాలుడనుకో. ఇదే కవి స్వరూపం. మాలకూడదంటారు గాని, ఆ రష్యాలో పద్ధతే బాగుంది. ప్రతివాడికీ పనంటూ ఉందిట. ఎవరూ తిండికి మాడి చావరుట! ఇంకేంకావాలి? మన మాట ఎట్లావున్నా పాటకపు జనానికి రష్యా అంటే స్వర్గమే" అన్నాడు నాన్న.

"నిండు ప్రాణాల్ని కాల్చి చంపటం ఏమిట్రా? హత్యలు చేసేవాళ్ళని కూడా విచారణ జరిపి శాస్త్రప్రకారం ఉరి తీస్తారు గదా? పని చెయ్యనందుకు తుపాకులు బారుచేసి కాల్చుకుంటారా? ఇదేం రాక్షసం?" అన్నది అమ్మకూడా.

బావ స్నానానికి లేచాడు. అక్క లేచి బావకు తువాలూ, సబ్బూ పట్టుకుని స్నానాల గదికేసివెళ్ళింది. లాంతరు పట్టుకుని బావకూడా వెనకెడితే వెళ్ళాడు.

బయట బండి ఆగిన చప్పుడయింది. కాస్సేపట్లో సేతు మామయ్య లోపలికి వచ్చాడు.

"అమ్మోయ్, సేతు మామయ్యొచ్చాడేవ్!" అంటూ చిట్టి వంటింట్లోకి పరిగెత్తింది.

"ఏంరా సేతూ? ఏమిటి కబుర్లు? ఇదేనా రావటం? అంతా కులాసా?" అని నాన్న అడిగాడు.

"ఆ!" అన్నాడు సేతు మామయ్య కోపంగా. అయితే ఆ కోపం నాన్న మీద కాదు.

"ఏమిటి విశేషాలు?"

"ఆఁ, ఏం చెప్పేది? క్రిందటివారంలోనే ఇరవై మణుగుల పంచదార అందిస్తాడన్నా డా లుచ్చాగాడు. ఇంతవరకు అతీపతీలేదు. ఎంత నష్టమయిందను కున్నావు?" అన్నాడు సేతుమామయ్య.

"పంచదారంటే జ్ఞాపకం వచ్చింది. నాలుగు వీసెలు పంపిస్తానంటివి కాదుట్రా?" అన్నది అమ్మ ఇవతలికి వచ్చి.

"పాపం, వాడికవతల అంది చావకపోతే వాడు మాత్రం ఏం చేస్తాడూ?" అన్నాడు నాన్న.

"ఒక వీశె తెచ్చాలే. బెడ్డింగులో ఉంది" అన్నాడు సేతు మామయ్య.

"పోనీ బాబూ, బతికించావు! చస్తున్నాం కొనలేక, ధరలెట్లా మండిపోతు న్నయ్యో ఎరుగుదువా?" అన్నది అమ్మ.

"ఎవడ్రా వాడూ?" అన్నది అమ్మ.

"ఉన్నాడులే!" అన్నాడు సేతు మామయ్య.

"అంత చాతకాని వాజ ఇస్తానని ఎందుకనాలి?" అన్నది అమ్మ.

"ఇంకా లాభసాటిగా ఎవరికన్నా ఇచ్చాడేమో?" అన్నాడు నాన్న.

"వాడంతవాడే అవును. కానీ కోసం గడ్డి తింటాడు. ఇరవై మణుగులు! వీశె రూపాయిన్నరకి కళ్ళకద్దుకుంటున్నారు. తలుచుకుంటే కళ్ళు తిరుగుతై. ఒక్క పూటలో ఎగిరిపోయి ఉండును! అసలు నాకీ నెల అన్నీ నష్టాలే! కూలీ లంజకొడుకులు సమ్మె చేస్తున్నారు. వినలా?"

"లేదురా, ఇదెప్పణ్ణించి?" అన్నాడు నాన్న.

"మూడు రోజులయింది. మొదటి రోజు నలుగురు పనిలోకి వచ్చారు. అందులో ఇద్దర్ని పట్టుకు చావగొట్టారు. రెండో రోజునుంచీ ఒక్క గాడిద కొడుకు పనిలోకి వస్తే ఒట్టూ! రోజుకు పదిహేను వందలు నష్టం! మంచి అదను! ఏం చెయ్యనూ? కరువు బత్తాలు చాలవుట గాడిద కొడుకులకు! కాళ్ళు విరగ్గొట్టే వాళ్ళు లేక.... వీళ్ళు మిల్లు ముందు పికెటింగు చెయ్యకపోతే వందమంది కూలీలను తెదును. రెండు రోజుల పాటు వడ్ల బస్తాలు వాకిట్లో పడివున్నై. ప్రాణం విసిగి వాళ్ళూ వెళ్ళిపోయినారు.... రోజుకు పదిహేను వందలు పోతున్నది కదా

ఓ యాభై అధికంగా పారెయ్యమంటే పారెయ్యడా అని వాళ్ళ హాజం! వెధవలకి తోలీ ఇవ్వను'' అన్నాడు సేతు మామయ్య.

''పోలీసుల్ని పిలిపించి పికెటింగు చేసేవాళ్ళని మిల్లు ముందునుంచి వెళ్ళ గొట్టించి కొత్త కూలీల్ని తెచ్చుకోక పోయినావా?'' అన్నాడు నాన్న.

''సరేలే! నాకు దాపరించిన వాళ్ళంతా అంతేలే ఆ పోలీసు వెధవతో రారా అంటే రాడు. కూలీలు అల్లరి చేస్తున్నారా నీ సొత్తు ధ్వంసం చేస్తున్నారా అని అడిగాడు.''

''ఇద్దర్ని కొట్టారంటివిగా?''

''మిల్లు దగ్గిర కొట్టారా? కాలవ గట్టున కొట్టారు. ఫలానివాళ్ళు కొట్టారని సాక్ష్యమా? దెబ్బతిన్న వెధవలే నిజం చెప్పకుండా వున్నారు. ఎన్నైనా చెప్పు బావా? కూలీవెధవలంతా ఒక్కటే. జరక్క ఒకరిద్దరు వచ్చి ఏం లాభం?''

''పోనీ మీ—ఆ పోలీసు ఉద్యోగికి కాస్త చెయ్యితడి—'' అన్నాడు నాన్న.

''ఇంకా నయం. వీడుత్త కర్కోటకుడంటే! ఇదే పంతులయితే నాకిన్ని పాట్లుండేవా?'' అన్నాడు సేతు మామయ్య నిట్టూరుస్తూ.

అమ్మ పెట్టున నిట్టూర్చి, ''కాలం కలిసిరాకపోతే అన్నీ అట్లాగే జరుగుతయ్యిలే. స్నానం చేసి భోంచేతువుగాని, మీరుకూడా లేవండి!'' అన్నది నాన్నతో.

ప్రచురణ : 1955, సవతి తల్లి కథల సంపుటి
నుంచి, దేశికవితా మండలి, విజయవాడ.

# శీల పరిశీలన

వాడా? వాడి బతుకు నన్నడగండి చెబుతాను. నేను వాణ్ణి ఇంతప్పణ్ణుంచీ ఎరుగుదు. వెనుకటి జన్మలో ఏదో మహాపాతకం చేసుకోకపోతే నాకు వాడు రక్త స్పర్శగల బంధువై వుండటం జరగదని ఎన్నోసార్లనుకున్నా.... యీ వెధవని చిన్నతనంలో ఎన్నిసార్లెత్తుకు మోశాను! తల్చుకుంటే వొళ్లు గగిరొడుస్తుంది....

వీడి బతుకు ప్రపంచాని కివాళ తెలిసింది గాని నాకు చిన్నప్పణ్ణుంచీ తెలుసు. ఇంతకాలం వీడు ప్రపంచాన్ని యెట్లా "ఫూల్" చేశాడా అని నాలో నేను వితర్కిస్తా. ఇప్పటికైనా వీడి నిజస్వరూపం లోకాని కర్థమవుతున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది. పాతికేళ్ళ క్రితమే నాకు వీడిగుట్టు తెలుసుకదా అని గర్విస్తున్నా కూడా!....

చెబితే నమ్మరుగాని, మా వాళ్లొకప్పుడు వీణ్ణి నాకు నమూనాకింద చూపే వాళ్లు. వాడు నా మాదిరిగా ఎప్పుడూ పోరుపెట్టి యేడవట్ట! పక్కలో ఉచ్చ పొయ్యట్ట! తల్లి దగ్గరలేకపోయినా గంటలకొద్దీ అల్లరిలేకుండా ఆడుకుంటాట్ట! వాడి శ్రాద్ధంట! వొసినెకాట్ట! ఆ పొగడ్తలకీ, మెప్పులకీ వెల్లకిలా పట్టానికి అంతుం డేది కాదు.

తెలీకడుగుతా, ఇవా సత్పురుష లక్షణాలు? ఇప్పుడు మనం హిట్లరువంటి గొప్పవాణ్ని తీసుకుంటే ఆయన చిన్నతనంలో యేడవలేదనీ, పక్కలో ఉచ్చ పొయ్యలేదనీ రుజువవుతుందా? పసివాడు, పడివాడు చేసే పనెప్పుడైతే చెయ్యడో అప్పుడే వాణ్ని మనం సందేహించాలి. మన పెద్దల కాపాటి తెలివితేటలుంటే మన దేశంలో మ్లేచ్ఛు లీ విధంగా చెలరేగటం ఎందుకు జరుగుతుందీ?....

ఈ భ్రష్టుడు పెరిగినకొద్దీ వీడిది విషప్పుచ్చ అనే సంగతి పెద్దలకి తెలిసి రాకపోతుందా అని ఎంతో ఓర్పుతో వున్నా. నిజం బయటపడుతోనే వచ్చింది. కాని కనిపెట్టే నాధుడేడీ?

అయిదోయేట యీ వెధవని చదవేస్తే బడికి ఎగురుకుంటూ వెళ్ళాడు. అందరూ "మస్కా' తిన్నారు: ఓహో, ఎంత బుద్ధిమంతుడన్నారు. అందరూ అనట మేమిటి? వాడి మేష్టరే అన్నాడు: ఆ యీడునే వాడు పంతుల్ని బుట్టలో వేశాడంటే వాడి తడాఖా ఎటువంటిదో ఆలోచించండి మరి.

చదువులో వున్నంతకాలమూ వాడు మేస్టర్లని వంచిస్తూనే వచ్చాడు. వాడి దగ్గర పొడిచేసే తెలివితేటల్లేవనీ, రోజూ పుస్తకాలు పడచదివి నుంచి మార్కులు తెచ్చుకుంటున్నాడనీ, పాపం, ఆ ఉపాధ్యాయ లెరగరు. తెలీకడుగుతాను-పుస్తకాలు పడచదివే వాడికి మార్కులు రావటండీ? అదికూడా ఓ ప్రతిభేనా?

చదవమంటే ఒక్క స్కూలు పుస్తకాలేనా? అడ్డమైన నవలలూ, నాటకాలూ చదివేవాడు. యెవరే పుస్తకం గురించి మాట్లాడదామన్నా వాడికి తెలుసునాయె. ఇక అటువంటి వెధవతో పుస్తకాల గురించి మాట్లాడి ఏం ప్రయోజనం?

వీడి చదువు తగలెయ్యా, చదువు కాదుగాని, మా కుటుంబాల్లోవున్న కుప్రకారంతా వీడి మూలంగా చచ్చి ఊరుకున్నాం. చదువుకున్న వాడికన్న చాకలివాడు మేలనే సామెత కూడా మరిచారు మా పెద్దలు. వాడు చూడరా! లక్షణంగా ఎట్లా క్లాసులు గడుస్తున్నాడో అని మావాళ్లు ఒకటే వెర్రికిలా పట్టం!

అయిందా? వీడు హైస్కూలు పూర్తిచేసి కాలేజీలో చేరాడండీ. అక్కడా యిదే తంతు. ప్రతి సబ్జక్టులోనూ యీ కుంకే నిధి. లెక్చరర్లంతా వీణ్ణి చూసి వెర్రికిలా పడేవాళ్లే. దిక్కుమాలిన అసోసియేషన్లన్నిటికీ వీడే సెక్రెటరీ! ఈ మాట ఎప్పుడైతే విన్నానో అప్పుడే అనుకున్నా: వీడి గ్రహాలింకా నీచకు తిరగలేదు. ఇంకా వీడు కొంతమందిని మోసం చేసికాని బయట పడడని!

కాని వీడి గ్రహాలు అప్పటికే దిగిరాసాగినై. ఎందుచేతంటే వాడు ఇంటరు చదువుతుండగానే కాటకం[1] వచ్చిపడి వీడి తండ్రిని అప్పులవాళ్ళు వొత్తిడి చెయ్యటం జరిగింది. ఉన్న అయిదువేల అప్పు తీరటానికి ఏడెకరాలూ చాలుతుందా, ఇల్లుకూడా పోతుందా అనే పరిస్థితి ఏర్పడ్డది. అటువంటి క్లిష్ట పరిస్థితిలో ఈ దౌర్భాగ్యు డేం చేశాడో చెబితే మీరు నమ్మరు. ఇంకో నాలుగు మాసాలలో పరీక్ష అనగా చదువు చాలించుకుని ఇంటి కొచ్చేశాడు! అదేమిట్రా అని నాబోటి వాళ్ళడిగితే, యీ పరిస్థితుల్లో యీ చదువుకోసం కానీ ఖర్చుచేసినా వ్యర్థమే అన్నాడు. నిక్షేపంలాంటి చదువంటే వాడికంత తేలికయిపోయింది! "బుద్ధి కర్మానుసారిణీ" అని చెడిపొయ్యే కాలాని కీలాంటి బుద్ధులు పుడతయి. తన దిక్కుమాలిన చదువు కోసం ఆస్తికి కరారావు డయిన విషయంకూడా గమనించలేదు. ఆ మాట మేం చెబితే పది పన్నెండేళ్ళమీద తన కిందయిన వెయ్యిరూపాయలకే ఆస్తి పోయిందా అని మహాతెలివిగా అడిగాడు. ఇద్దరాడపిల్లల పెళ్ళిళ్ళకి అయిన ఖర్చు మాటేమిటన్నాడు. ఇవేగా తెలివితేటలూ-ఆపత్సమయంలో ఆడ తోబుట్టువుల మీద యాడవటం!.... తెలీకడుగుతాను, వెయ్యిరూపాయలంటే ఈ రోజుల్లో మాటలా? చదువు

1. ఆర్థిక కాటకం (1929-1934) ప్రస్తావన. వివరాలకు ఇదే సంపుటంలోని వారసత్వం నవలల్లో చూడండి.

లేకపోతే పీడాపోరి. వెయ్యి రూపాయలుంటే ఓ కాఫీ హోటలో, చింతపండు దుకాణమో పెట్టుకుని కాలిమీద కాలేసుకు హాయిగా బతకొచ్చునే! ఆ మాటంటే మనమీద పడేడుస్తాడు. చిల్లర దుకాణాలు పెట్టుకు బతకమంటావా? అని అడుగుతాడు. అవసరమైతే అన్నీ చెయ్యాలి. మరి అప్పుకింద వాడి ఆస్తిపాస్తులు క్షవరమైనమాట అబద్ధమా? చిల్లరకొట్టు పెట్టుకుని బతకమని విధిలో రాసి ఉంటే తప్పుతుందా?

ఇంకా చిల్లరకొట్టే గౌరవనీయ మంటాను. ఎందుకంటే - ఈ నీచుడు అంతకన్నా హేయమైన పనిచేసి జైలుకు పోయినాడు! కాంగ్రెసుట, దేశభక్తిట, స్వాతంత్ర్యదీక్షట, సత్యాగ్రహమట! వెళ్ళి జైల్లో కూచున్నాడు. ఆ పురుషోత్తంగారు, "మా పిల్లను చేసుకో నాయనా, ఇవాళపోయిన ఆస్తి మళ్ళీ రేపురాదా? మళ్ళీ కాలేజీలో చేరి నీ యిష్టమైన చదువు చదువుకో, నే చెప్పిస్తాను?" అంటే ససేమిరా అన్నాడు. చక్కనిచుక్క ఆ పురుషోత్తం గారిపిల్ల; అదీ వాడు లక్ష్యం చెయ్యలేదు. పవిత్రమైన గృహస్థాశ్రమ ధర్మం స్వీకరించాలనే చింతకూడా వాడిక్కలగలేదు. పెద్దమనిషి మాట తీసెయ్యడం ధర్మం కాదనికూడా తోచలేదు. "నాకింకా పదిహేడన్నా నిండలేదు. మీ పిల్లకైనా పదకొండేళ్ళే కదా, చదువు చెప్పించండి. మీరు కోరినట్టు నేనా పిల్లను చేసుకుంటా" నన్నాడు. ఆడపిల్లకి చదువు చెప్పించాలిట! ఆ పిల్ల చదివి, ఈడేరి, ఎందుకూ పనికి రాకుండా పోయిన తరవాత అప్పుడు చేసుకుంటాట్ట.

కాకపోయినా జైలుగీత ఉన్న వెధవకి పెళ్ళెక్కడన్నా అవుతుందా? వెళ్ళాడు జైలుకు. నలుగురూ, ఓహో, అన్నారు. ఉంటారుగా గుడ్డికుంకలు!

జైలునుంచి తిరిగొచ్చాడు. మాల మూకనీ, మాదిగ మూకనీ వెంటపెట్టుకు తిరిగాడు. వాళ్ళకి చదువు చెప్పించాలన్నాడు. తను చదువుకుని ఇంత వెలగబెట్టాడు; ఇక వాళ్ళు వెలగబెడతారు. ఏదో భయభక్తులుగా మననిచూసి అట్లా పక్కకి తప్పుకున్నారు. వాళ్ళతో కలిసి వీడేమేం కూళ్ళు కుడిచాడో నాకైతే తెలీదు. కాని వీడు కులభ్రష్టుడైనా డనటానికి సందేహం లేదు. వాడు కులభ్రష్టుడు కాకపోతే ఇక సంఘంలో కులభ్రష్టుడనే వాడెట్లా ఉంటాడని అడుగుతున్నా. తెలిసిన వాళ్ళెవరన్నా సమాధానం చెప్పండి.

ఈ లోపుగా వీడు సోషలిస్టులతో కలిసి తిరగటమూ, చదవరాని పుస్తకాలు చదవటమూ, పనివాళ్ళ సంఘాల్లోకి పోయి వాళ్ళని చెడగొట్టడమూ మొదలైన పనులు చేస్తున్నట్టు తెలిసింది. విప్లవంట, సమ్మెలట; ఒక దేవుడులేదు! ధర్మంలేదు, కులం లేదు, మతం లేదు; మాన మర్యాదల్లేవు. ఉచ్చనీచాలు లేవు.

అంతా ఎంగిలి మంగలంచేసి పనివాళ్ళచేత సమ్మెలు చేయించి అరాజకం తెచ్చి పెడదామని. ఏమాట కామాట చెప్పాలి. కాంగ్రెసువాళ్ళ ఉద్దేశ్యంకూడా అరాజకం తెచ్చి పెట్టటమే అయినా, ఇంత కలిలేదు. ఇంత పాతకంలేదు. ఆ మాటంటే "నేను గాంధీజీ సిద్ధాంతాలు దాటిపోటం లేదు. హరిజన సమస్యగురించి, కష్టజీవుల హక్కుల్ని గురించీ ఆయన అన్నమాటలు నువు వినిపించుకోలేదు" అన్నాడు. పైగానన్ను సనాతనిష్టు వన్నాడు!

ఈ విధంగా వీడు అయిదేళ్లు గడిపాడు. ఈ లోపల వీడికెట్లా జరుగుతూ వచ్చిందీ నాకర్థంకాలేదు. ఉండటానికి ఇల్లయితే దక్కిందిగాని తిండి ఎట్లా తిన్నాడు? వాణ్ని ఆ విషయం నాకు లెక్కచెప్పమనండి. ఆ ముసలి వృద్ధులంటె వాళ్ళకి అల్లుళ్ళే చెరో అయిదు పంపించేవాళ్ళు; ఎట్లాగో గడిచిపోయింది. వీడి మాటేమిటి?

ఇంతలో వీడి తండ్రి మంచాన పడ్డాడు. తల్లి ఏడుకొండలవాడికి మొక్కాని ముడుపు కట్టింది. ఈ వెధవకు దైవ నిరసనగా? ఆ తండ్రి కాస్తా చచ్చాడు. పాపం ఊరికే పోతుందా? ఈ విధంగా వీడు తండ్రిని కాస్తా తన పొట్టన పెట్టుకున్నాడు. తండ్రి కోసం వలవలా ఏడ్చాడు. ఆ దొంగ యేడుపు చూసి అంతా మోసపోయినారు - నేనుతప్ప!

ఈ పరిస్థితిలో ఈ వెధవ ఏం చేశాడనుకున్నారు? కాలేజీలో చదువుతున్న ఆ పురుషోత్తంగారి అమ్మాయిపై చూపులు చూసి, భ్రమసి, పండువంటి బ్రహ్మచర్యం కాస్తాపాడుచేసి, ఆ పిల్లను పెళ్ళాడాడు. ఓ పెద్దల సభలేదు, తాంబూలాలిచ్చుకోవటం లేదు. ఆ పిల్ల వీడికో ఉత్తరం రాసిందట; వీడు వెళ్ళాట్ట. ఇద్దరూ కలసి మాట్లాడుకున్నారట. పెళ్ళయి పోయింది. పురుషోత్తం గారిటువంటి పెళ్ళికెట్లా ఒప్పుకున్నాడో నా కర్థం కాలా! పిల్లేమో నమ్మకంగా రజస్వలా అయింది. మగపిల్లలతో కలిసి చదువుతున్నది. ఉత్తరాలు రాయటంకూడా నేర్చింది! ఆ స్థితిలో వున్న మనిషితప్ప మనవాడికి పెళ్ళాట్టానికి పనికిరాలా!

ఏదో అయిపోయింది. కాని పెళ్ళాన్నికూడా వాడు బుట్టలో వేసుకుని ఊరుకున్నాడు. అంత చదువుకున్నా మనిషీ వీడి మాయకెట్లా లోబడిందో నాకర్థం కాదు. వాణ్ణి ఒక నగ అడగదు. బట్టలడగదు. పూలన్నా అడగదు. ప్రతిదానికీ వాడు డీ అనకముందే డీ అంటుంది. సాటి ఆడవాళ్ళతో తన కష్టసుఖాలు చెప్పుకోవటము లేదు. పాడూలేదూ; గొప్పగా నలుగురూ చెప్పుకో గలందులకని అత్తగార్ని నెత్తిన పెట్టుకుంటుంది. ఆరునెల్లు సావాసం చేస్తే వారు వీరవుతారన్నట్టు అదికూడా వాడంతదయి కూర్చుంది. నే ఒక్కటే సూత్రం చెబుతున్నా. పెళ్ళామన్న మనిషి కాపరానికొచ్చిన ఏ నెల రోజులపాటో మొగుడికేసి కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకుచూస్తే అది అపేక్ష అనుకోండి; అదే సంవత్సరాలపాటు జరిగితే

శుద్ధ మోసం అనుకోండి. తన్నూ తనభార్యనీ చూసి, మావంటి వాళ్ళం మమ్మల్ని చూసి మూతి ముడుచుకొని మొహం చిట్లించే భార్యలను వొదిలేస్తామని వాడేమన్నా అనుకుంటున్నాడేమో! అది శుద్ధ పొరపాటు-అని నేను గట్టిగా నొక్కి వక్కాణించ గలను.

తీరా యుద్ధం[1] వచ్చేటప్పటికి వీడి అసలు రంగు బయటపడింది. వీడో చెంప యుద్ధాన్ని సమర్థిస్తూ యుద్ధప్రయత్నం చేసి బాగుపడ్డ వాళ్ళని తిట్టాడు. దోపిడిగాళ్ళన్నాడు. దొంగ వ్యాపారులన్నాడు. వాళ్ళు బాగుపడ్డారని వీడికి కడుపు మంట! తనుపోయి ఆ అలగామూకతోచేరి వెధవ చాకిరీ అంతా చెయ్యకపోతే తనూ ఏదో అవకాశం చూసి ఇంత వెనకేసుకోరాదూ? ఎవడొద్దన్నాడూ? పోనీ ఆ కాంగ్రెసుతోనన్నా చేరి జైలుకు పోయినాడా? అదీలేదూ? జైలు తప్పించుకోడానికొక మంచి మార్గం కనిపించింది. రష్యాభక్తుల్లో చేరిపోయి యుద్ధ ప్రయత్నం భగ్నంచెయ్యటం కూడదన్నాడు. కాంగ్రెసును ఎదిరించి కాంగ్రెసు తీర్మానం తప్పన్నాడు. కాంగ్రెసు విరోధి అంటే చంపేస్తారని తనుకూడా కాంగ్రెసు నియమానుసారమే, కాంగ్రెసు కోసమే పనిచేస్తున్నాడు. ఒక చెంప మహా కాంగ్రెసు నాయకులందర్నీ విమర్శిస్తూ కాంగ్రెసును వెనకేసుకొస్తాడు. అదేమిట్రా అంటే నాయకులు గాక వేరే కాంగ్రెసు ననుసరించే ప్రజలెవరో ఉన్నారుట. కాంగ్రెసే బలవత్తరమైన సంస్థట మళ్ళీ! వీడి వంటి వాళ్ళని సంఘం ఇప్పుడిప్పు డర్థం చేసుకుంటున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది. వీడి తాలూకు నిజం తెలుసుకోవటానికి ఒకటే మార్గం: వీడు ఉచితమైన మాటలు మాట్లాడినప్పుడల్లా అది పిరికితనం కొద్దీ ఆడే దగా మాటలనుకోండి; అనుచితాలు మాట్లాడినప్పుడల్లా అది కొవ్వెక్కి పొగరుకొద్దీ చేసే పేలాపన అనుకోండి-వీడి శీలం ఇట్టే అర్థమైపోతుంది.

ముద్రణ : జనవరి 1946, తెలుగుతల్లి.

1. రెండవ ప్రపంచయుద్ధం (1939-1945) ప్రస్తావన.

# పరిశోధనాబుద్ధి

నేను స్నేహపాత్రుణ్ణి కానని ఎవరూ అనలేరు. నన్ను గురించి అటువంటి ముక్క ఎన్నడూ పుట్టనూ లేదు. ఇవాళ ఈ సుబ్రహ్మణ్యమూ ఈ నాగేశ్వరరావూ తమ కడుపుమంట కొద్దీ అన్నంతమాత్రం చేత నేను స్నేహపాత్రుణ్ణి కాకపోతానా ఏమిటి?

నాకు వీళ్ళిద్దరే స్నేహితులా? డజనుల కొద్దీ ఉన్నారే నా స్నేహితులు! ఎవరితోనూ రాని పేచీ నాకు వీళ్ళతోనే రావడమేలా! ఎవరికీ చెయ్యని అవమానం నేను వీరికే చెయ్యడమేమీ? బుద్ధిపొరపాటు తమదే అనుకోరాదూ?

"అబ్బాయి! నీ అభిరుచులూ నా అభిరుచులూ కలవవు. నీకు ఇడ్లీమీద శనగ పచ్చడి ఇష్టం; నాకేమో చింతపండు పచ్చడి ఇష్టం. కనక మనిద్దరికీ స్నేహితం ఎక్కడ కుదురుతుంది?" అనే రకం మనిషిని కనకనా నేను?

నేను సుబ్రహ్మణ్యానికి నాగేశ్వరరావుకూ అవమానం చేసినమాట వాస్తవమే. ఒక్క అవమానం చెయ్యటమే కాదు. జరిగిన సంగతి నలుగురిలోనూ ప్రచారం కూడా చేశాను. చెయ్యగా లేనిది చెప్పటానికి నా కభ్యంతరం ఏమిటి? కాని వాళ్ళిద్దరిలోనూ ఉన్న రిసెర్చి స్పిరిటు నాకు దుర్భరమయ్యేదాకా నేనెంతో ఓర్పుతో సహించాను. వాళ్ళు కాదంటారా?

తమకున్న రిసెర్చి స్పిరిటు నాకు లేదని వాళ్ళిద్దరూ ఎరుగుదురు. నాతో ఏ స్నేహపాత్రత లేదని వాళ్ళిప్పుడు నన్ను వేలుపెట్టి చూపిస్తున్నారో, ఆ స్నేహపాత్రత తమలో ఈషణ్మాత్రమైనా ఉండి ఉంటే, తమ రిసెర్చి స్పిరిటును నా ఎదురుగా ఉన్నంత సేపూ దిగమింగుకోవలసింది. ఆపని చేశారా? ఒక్కనాటికి చెయ్యలేదు. నాకు దయ్యాలు మొదలైన వాటిల్లో నమ్మకం లేదన్నమాట సుబ్రహ్మణ్యం కానీ, తనకు వాట్సనుగిరి చెయ్యటానికి నా కభ్యంతరం ఉండి ఉండ వచ్చుననే మాట నాగేశ్వరరావుకానీ తమంతట తాము తెలుసుకో లేకపోగా, లౌక్యంగా నన్నడిగి తెలుసుకుందామని అయినా ప్రయత్నం చేశారా? ఎందుకు చేస్తారూ?

చిత్రం ఏమిటంటే ఈ సుబ్రహ్మణ్యమూ నాగేశ్వరరావూ ఒకరి నొకరు ఎరగరు. వాళ్ళిద్దరూ కూడబలుక్కుని నన్ను బాధించినట్టయితే నేను ఆశ్చర్య పడి ఉండను. విధి నాకా యిద్దరినీ చెరొక చేతితోనూ ప్రసాదించి నందుకు నేను

చాలా ఆశ్చర్యపడతాను. నిజంపడితే ఇద్దరుకూడా నా స్నేహితులు కారు - నా స్నేహితుల స్నేహితులు; నాకు వాళ్ళద్వారా పరిచయులు మాత్రం అయిచారు. మనుష్యులను కొలిచేసాధనం ఏదైనా ఉంటే ఇద్దర్నీ కలిపి కొలిచినాకు నాకు చాలరు. శరీరబలం చూస్తే నేను ఇద్దర్నీ "ఒక్క లంగోటామీద" మడత పెట్టి తన్నగలను. తెలివి తేటలకయితే-వాళ్ళిద్దరికీ అనేక విషయాలను గురించి నేను చాలాకాలంపాటు చదువు చెప్పగలను. ఏదో మర్యాదగా - రెండుచేతులూ, రెండు కాళ్ళూ, రెండు కళ్ళూ, రెండు చెవులూ మొదలైనవి కలిగిన తరవాత ఆ మనిషిని నిండుమనిషిగా భావించటం ధర్మంగదా అని! - తొమ్మిది వందల పౌనులవాడూ తొంభై పౌనుల వాడూ "మనిషి" అనే ఒక పదం చేతనే నిర్దేశించ బడుతున్నారు గదా అని - నేను వాళ్ళను స్నేహ భావంతో, నా సమానుల కింద గణించి, దగ్గిరికి తీస్తే, ఒకడు (సుబ్రహ్మణ్యం) నన్ను పిల్లవాడి కింద కట్టేసి "ఏమీలేదోయ్! నీలో ఆ రిసెర్చి స్పిరిటు పుట్టిందంటే దయ్యమంటే భయపడటమూ అదీపోయి నీకు దయ్యాల్లో ఆబ్జెక్టివ్ ఇంటరెస్టు కలుగుతుంది" అనీ; మరొకడు (నాగేశ్వరరావు) "ఏమిటోయ్! నువ్వు పవర్స్ ఆఫ్ అబ్జర్వేషన్ లేక జీవితంలో ఎంత మిస్ అవుతున్నావో ఎరుగుదువా?" అనీ నన్ను తగులుతారా?

సుబ్రమణ్యం నన్ను తనకింద అప్రెంటిస్‌గా ఉండమనీ, నాగేశ్వరావు తన షెర్లాక్ హోమ్స్[1] తనానికి నా వాట్సన్‌తనం సహాయం చేసి ఇన్‌స్పిరేషన్ ఇవ్వమనీ! ఇటువంటి "తొక్కుపల్కులు" వాళ్ళు పలుకుతుంటే విని ఆనందించటానికి వాళ్ళేం నా మునిమనమలా?

అయినా సహించాను! ఇద్దరికీ ఫేర్ ఛాన్స్ ఇచ్చాను. నా గదిలో ఒకసారి ఆరణాల డబ్బులు మాయమైతే, నాగేశ్వరావును అపరాధ పరిశోధన కానివ్వమని నియమించాను. ఒక గంటసేపు నన్ను వాగించి, షెర్లాక్ హోమ్స్ ఏమేమి చేసి ఉండేవాడో అదంతా నటించి, చివరకు ఆరణాలూ నేనే తీసి ఉండాలని కని పెట్టాడు. ఫూల్!

---

1. ఒక ప్రైవేటు డిటెక్టివ్. మేధాశక్తితో ఏ అహార్య సమస్యనైన పరిష్కరించగల నేర్పరి. సర్ ఆర్థర్ కానన్‌డైల్ (1859-1930) అనే బ్రిటిష్ నవలాకారుడు సృష్టించిన పాత్ర. డా॥ జోసఫ్ బెల్‌లోని తర్కశక్తి షెర్లాక్‌హోమ్స్ సృజనకు ప్రేరణ. కొడవటిగంటి కుటుంబరావుకు కానన్ డైల్ రచనలు ఇష్టం. కొన్ని అనువాదాలు కూడా చేశారు. ఇదే సంపుటం లోని డిటెక్టివ్ కథలు చదవండి.

సుబ్రహ్మణ్యంన్ని కూడా కొంతకాలం పాటు హ్యూమర్ చేస్తే వాడికే కళ్ళు తెరుపిళ్ళు పడకపోతవా అని, ఒక రాత్రి అతనితో దయ్యాల వేటకు బయలుదేరాను.

"దయ్యం కనపడగానే నేను చెబుతాను. అప్పుడు ఫోటో తీద్దాం!" అన్నాడు. 'సరే' నన్నాను.

"రాత్రిపూట కనుక ఫ్లాష్ లైటు ఉపయోగించాలి. నీ కెమేరా తీసుకు రావాలి. ఏం?"

దానికీ ఒప్పుకున్నాను. ఆ సాయంకాలం నాచేతనే కొనిపించాడు ఫ్లాష్ పౌడరు ఒకప్లేటు లోడ్ చేయించాడు. ఫ్లాష్ ఎట్లా ఇస్తావని అడిగాను. పౌడరు ఒక రేకుమీద పెట్టి దయ్యం కనపడగానే కాలుస్తున్న సిగిరెట్టుతో అంటిస్తా నన్నాడు. నా తప్పెంత వరకంటే - నేను వద్దనలేదు. తను సిగ్నల్ ఇవ్వగానే నేను కెమేరాను దయ్యంవైపు పెట్టి షట్టరుతెరచి ఉంచేటట్టు ఏర్పాటు అయింది.

రాత్రి తొమ్మిదింటికి సుబ్రహ్మణ్యం వచ్చి నన్ను కేకవేశాడు. ఇద్దరమూ కావలసిన పరికరాలతో బయలుదేరాం. పౌడరు వుంచిన రేకు అతను పట్టుకున్నాడు. మా ఇల్లు దాదాపు ఊరి చివర ఉండడంవల్ల నాలుగడుగులు వేసేటప్పటికి ఊరి బయటికి వచ్చాం. అమావాస్య చీకటి. మేం ఒకచోట నిలబడి చుట్టూ పరికించటం మొదలుపెట్టాం. ఒకపక్కగా మాకు యాభై అంగల్లో ఒక నల్లని ఆకారం కనపడ్డది. ఎవరో ఆడమనిషి అని స్పష్టంగా తెలుస్తున్నది.

"మనం ఎటుపోదాం?" అన్నాను.

"అదుగో! అది దయ్యమేనా?" అన్నాడు సుబ్రహ్మణ్యం.

అవునందామనుకున్నాను. కాని అంత దౌర్జన్యం చెయ్యటానికి మనస్సు ఒప్పలేదు.

"కాదు. ఎవత్తో ఆడది."

"కాదు. దయ్యం! లేకపోతే అక్కడ ఎందుకు నుంచుంది? మనల్ని చూసి అయినా కదలదేం?"

"లక్షకారణాలుంటై! ఎందుకు నుంచున్నదని అడుగుతావేం? అయినా, ఆ మనిషిజోలి మనకెందుకిప్పుడు?"

"అది దయ్యమేను, భాయి! రెడీకా! ఫోటో ఎత్తేసుకుందాం!"

అతను ముందూ నేను వెనకా, ఇద్దరమూ ఆ మనిషివైపు నడిచాం. అదీ ఎవత్తో పింతమనిషే. మేం రెండుగజాల దూరంలోకి వచ్చేదాకా కదలక ఆ తరవాత ఒక్కటంటే ఒక్క అడుగు వెనక్కువేసి నుంచుంది. సుబ్రహ్మణ్యం

మరొక్క అడుగు ముందుకు వేశాడు - ఆచేతులో రేకూ, నోట్లో సిగరెట్టూ, వాడూ!

ఆ మనిషి మరి ఏమనుకుందో ఏమిటో? - "ఎందుకయ్యా అట్లా మీదిమీది కొస్తావు?" అంది. ఇక ఆలస్యం చేస్తే దయ్యం అంతర్ధానం అయిపోతుందని విశ్వయించు కున్నాడేమో సుబ్రహ్మణ్యం, అర్థంలేకుండా "స్నాప్ కొట్టు! కొట్టు!" అని అరిచి, చేతులో ఉన్న రేకుమీది పౌడరుమీద కాలుస్తున్న సిగిరెట్టువేసి రుద్దాడు. పౌడరు భగ్గునమండి అతని చెయ్యంతా కాలింది. ఈ గలభాలో ఆ ఆడమనిషీ "చంపుతున్నారర్రో!" అని కెవ్వున అరిచి దిక్కు తెలీకుండా పరిగెత్తి చీకట్లో మాయమయింది. దూరాన్నించి ఎవరో "ఎవడ్రావాడూ? పట్టుకో! పట్టుకో!" అని కేకలు పెడుతూ మావైపు పరుగెత్తుకుని వస్తున్నాడు. మేమిద్దరమూ ఎట్లా కొంప చేరుకున్నామో ఆ పరమాత్ముడికే ఎరుక!

ఇంత గల్లంతు జరిగిన తరువాత మనుష్యమాత్రుడెవడైనా ఆ విషయాన్ని కలలోనైనా స్మరించ గోరుతాడా? సుబ్రహ్మణ్యం మనుష్యమాత్రుడు కాడుమరి. చచ్చిచెడి కొంప చేరుకుంటే, నన్ను ఆదుర్దాగా "ఫోటో తీశావా?" అని అడగటమే కాక, తియ్యలేదని నన్ను కోప్పడటమేకాక, మేంచూసింది దయ్యమనీ, అదీ చూస్తుండగానే మాయమై పోయిందనీ. - ఎవరితోనో కాదు, నాతో - వాదించటం మొదలుపెటాడు. "వీడు ఇక లాభంలేదు! వీడిది హోప్‌లెస్ కేసు!" అని అప్పుడే అనుకున్నాను.

ఆమాట అనుకున్నంత మాత్రంచేత ఏమయింది? నన్ను వీళ్ళు వదిలేది ఎట్లా? వాళ్ళ జాడ్యం నయంకావటం ఎట్లాగనే ప్రశ్నకన్నా ఇది నాకు చాలా ముఖ్యమైన సమస్య. ఒకడుగాదు, నానెత్తిన ఇద్దరు పిచ్చివాళ్ళు! ఒక దెబ్బకు రెండు పిట్టలు అన్న సామెతగా ఒక్క దెబ్బతో ఇద్దర్నీ వదిలించుకునే ఉపాయం ఒకటి ఆలోచించినాను.

ఒకనాడు వాళ్ళిద్దర్నీ టీకి మాయింటికి పిలిచి స్నేహితం కలిపాను. "వీరు డి. సుబ్రహ్మణ్యంగారు, ప్రస్తుతం సైకిక్ రిసెర్చి మీద ఉన్నారు! వీరు పి. నాగేశ్వరరావుగారు, క్రిమినలాజీలో అరి తేరినవారు!" బస్! ఇద్దరూ చేతులు కలుపుకున్నారు. ఆనాటినించీ ఇద్దరూ నా "టీ" తాగటానికి వస్తూ ఉండటమే కాక, నాదగ్గిర రిసెర్చి స్పిరిటు తక్కువగా ఉండటం ఆధారం చేసుకుని, నన్ను ఒక శిథిమైన అస్పృశ్యుణ్ణి చూసినట్టు చూస్తూ మాట్లాడుకుంటుండే వాళ్ళు.

ఈ విధంగా ఒక వారం గడవనిచ్చి మెల్లిగా ఇద్దరినీ ఒక్క పర్యాయం ముగ్గులోకి దించాను.

"ఇది మీరిద్దరూ జాగర్తగా వినవలిసిన విషయం! ఇక్కడికి మూడు మైళ్ళ దూరంలో, పాలెంవెళ్ళే దోవలో ఒక పాడుబడ్డ ఇల్లు ఉంది. మీ ఇద్దరూ చూశారా? సరే! ఒకనాడు అటుకేసి షికారు వెళదాం. ఇల్లు చూపిస్తాను. అది దయ్యాలకొంప!"

"ఏమిటీ?" అన్నాడు సుబ్రహ్మణ్యం ఆశ్చర్యంతో.

"అందులో సంవత్సరం కింద ఒక హత్య జరిగింది."

"హలో!" అంటూ, నాగేశ్వర్రావు ఇకిలిస్తూ చేతులు రుద్దుకున్నాడు. (ఇటువంటి దురభ్యాసం షెర్లాక్ హోమ్సుకు ఉండేదిట?)

"ఆఁ! మరి! ఆ ఇంటి యజమానిని హత్య చేశారు. వరండాలో పడుకుని నిద్రపోతుంటే గుండెల్లో పలుగు దిగవేశారు. ఎవరు హత్య చేశారో నిర్ధారణ కాలేదు. తత్సందర్భంలో నలుగు రైదుగుర్ని ఎరెస్టుచేసినా, ఎవరిమీద కేసు నిలవకపోయింది. ఆయన దయ్యమైనాడని అంతా అంటున్నారు మరి. మీ ఇద్దరికీ ఇది చాలా కుతూహలం ఉండవలసిన విషయం మాత్రం అవును. ఏమంటారు?"

నాగేశ్వరరావు ఉత్సాహం తగ్గిపోయింది.

"అబ్బో! సంవత్సరం క్రితం జరిగిన హత్యను మనం ఇప్పుడు చహరా తియ్యగలమా? నేను గార్దభం మాదిరిగా సంతోషిస్తున్నాను!"

"నీ పట్టుదలతో నీవు చెయ్యలేకపోతే ఇక ఎవడు చేస్తాడో నాకు బోధపడకుండా ఉంది. చచ్చిపోయినవాడు మంచి స్తితిపరుడు. ఆయన భార్యా సోదరుడు ఎస్టేటు మేనేజిమెంటు చేజిక్కించు కుందామనే దుర్బుద్ధితో ఈ హత్య చేశాడని అందరికీ తెలుసు. అతను ఇప్పుడు ఆ పనిమీదే ఉన్నాడు కూడానూ! కాకపోతే కొంత డబ్బు తగలబెట్టి కేసు అయితే తప్పించుకున్నాడు. నువ్వు చెయ్యవలసిందేమిటంటే, స్వయంగా వెళ్ళి కొంత శోధన చేసి, డేటా సంపాదించి, అతగాడి మీద కేసు రుజువు చెయ్యటమే! అది ఎట్లా సాధ్యమవునా అని నువ్వు అనుమానించకు. హత్య జరిగిన నాటినించీ ఆ కొంప ఆ విధంగా పాడుబడి ఉంది. నీవంటి పరిశోధకుడికి ఎంత విలువయిన డేటా దొరికినా ఆశ్చర్యం లేదు."

"డిటెక్టివు" మెత్తబడ్డాడు. సుబ్రహ్మణ్యం అదివరకే జావ అయినాడు కనక అతనికి ఉపన్యాసం అవసరం లేకపోయింది. అదిగాక దయ్యాలు, కొన్ని కొన్ని ఊరగాయల మాదిరిగా, పాతబడి మాగిన కొద్దీ అన్వేషణా పరులకు బాగా రుచించుతవి.

ఒకనాడు సాయంకాలం వాళ్ళను ఆ పాడుబడ్డ కొంపవైపు షికారు తీసుకు వెళ్ళి చూపించాను. ఇంకా ఇతర ఏర్పాటులన్నీ చేసి మా శోధనా ప్రయత్నాలకు ముహూర్తం పెట్టించాను.

బొత్తిగా చీకటిరాత్రి కంటె గుడ్డి వెన్నెలలో అయితే బాగా ఉంటుందని తోచింది నాకు. ఆ ప్రకారమే ఒంటి గంట వేళకు గుడ్డివెన్నెల ఉండే రాత్రిగా చూసి ఇద్దరినీ బయలుదేర తీశాను. మేము బయలుదేరే సరికి పది దాటింది. మూడుమైళ్ళూ ఒక గంటసేపటిలో నడిచి పాడుపడ్డ కొంపకు చేరుకున్నాం.

ఆ ఇల్లు చేలమధ్య ఉంది. దాని ఆవరణ యావత్తూ అయిదువందల చదరపు గజాలుంటుంది. ఇంటికి ఒకవేపున పెద్దదొడ్డి ఉంది. ఈ దొడ్డిలో చెప్పుకోదగిన చెట్లు ఒకటీ లేకపోయినా, ఏవో పిచ్చి మొక్కలూ గడ్డీ తెగ పెరిగి ఉండటం వల్ల కాలు పెట్టటానికి కంపరంగా ఉండి, ఇన్నీ ఒక విధమైన అరణ్యమే అనిపిస్తున్నది. పైగా చీకటి. ఎక్కడా జనసంచారం లేదు. కనుచూపు మేరలో ఒకటే కీచురాళ్ళ రొద ఇల్లు బిక్కు బిక్కుమంటూ "నన్నేం చేసినా సరే" అన్నట్టు ఉన్నది.

ఈ కొంపకు తూర్పువైపున పంచ ఉంది. ఆ పంచలో ముగ్గురమూ చేరాం. మొదటి గంటల్లా నా అనుచరులిద్దరూ వసపోసిన పిట్టలల్లే వాగారు. కాని క్రమేణా వాళ్ళకు మితభాషిత్వం వచ్చింది.

పన్నెండుగంట అయింది. చంద్రోదయం అయింది. అప్పటికి అరగంట నించీ ఎవ్వరమూ నోరువిప్పలేదు.

"ఏమిటీ శవజాగారం? నాకు దయ్యాల్లో నమ్మకం లేదు. మనం లాంతరు గాని "టార్చి" గాని తీసుకురావటం మరిచాం. నేను నిప్పుపుల్లలు వెలిగించి అయినా ఇల్లు పరీక్ష చేస్తాను!" అన్నాడు నాగేశ్వర్రావు విసుగుకుంటూ.

"తొందర పడకోయి! నిదానించు మరి!" అన్నాను.

"ఏమిటా చప్పుడు?" అన్నాడు సుబ్రహ్మణ్యం మాట తడబడుతూ. యింటో ఏదో అలికిడి అయింది. ఒక్క సుబ్రహ్మణ్యమేకాక నేను నాగేశ్వర్రావు కూడా విన్నామా అలికిడి. పరీక్షపెట్టి ఆ గుడ్డి వెన్నెలలో నాగేశ్వర్రావు మొహం చూశాను-పాలిపోయింది భయంతో.

"నాకు దయ్యాల్లో నమ్మకం లేదు- భయమూ లేదు!" అన్నాడతను బింకంగా.

"నాకు నమ్మకం ఉంది కాని భయం లేదు!" అన్నాడు సుబ్రహ్మణ్యం వణుకుతూ.

"నాకు నమ్మకం లేదు గాని భయం ఉంది" అన్నాను నిశ్చింతగా.

"ఏమిటా చప్పుడు" అన్నాడు నాగేశ్వర్రావు.

ఈసారి లోపల ఎవరో నడుస్తున్నట్టు స్పష్టమయింది.

"ఆవెల్తు రెక్కడిది?" అన్నాడు సుబ్రహ్మణ్యం నెత్తిమీద చూరువంక చూస్తూ. అతని మాటలు తడబడినై. ఇద్దరి పసా అయిపోయిందని కనుక్కున్నాను. వీళ్ళను ఈ విధంగా అయిదునిమిషాల కాలం ఆదుర్దాలో పెడితే ఇద్దరికీ పిచ్చి ఎత్తటం తథ్యం.

"లోపల ఎవరో ఉన్నట్టున్నా ర్రా! తలుపు తట్టి కనుక్కుందాం!" అంటూ లేచి వెళ్ళి గట్టిగా తలుపుతట్టాను. కొద్దిసేపటికి తలుపు తెరుచుకుంది. వాకిట్లో ఒక పొట్టి నల్లని ఆకారం కనపడ్డది.

"మీ రెందు కొచ్చారో తెలుసు నాకు. రండి లోపలికి!" అన్నాడు తలుపు తెరిచిన మనిషి హీనస్వరంతో. ముగ్గురమూ లోపలికి అడుగు పెట్టాం. మాకు ముందు నడుస్తూ గృహస్తు మమ్మల్ని లోపలికి తీసుకువెళ్ళాడు. ఆయన చూడటానికి సంసారి మాదిరిగా కనపడ్డాడు. నీరుకావి బట్టకట్టుకున్నాడు. పైన ఏమీ వేసుకోలేదు. గడ్డం మాసి ఉంది. ఆయన మాట శూద్రమాటే!

ఈపాటికి నా స్నేహితుల భయాలు తీరినై.

"మిమ్మల్ని ఇక్కడ ఎక్కువసేపు ఉండనివ్వను.... ఆ చాపమీద కూచోండి!...మీకు కావలసిందంతా ముచ్చి మూడుముక్కల్లో చెప్పి పంపిస్తాను ...మీరు నిలబడి ఉన్నారేం! మీరుకూడా కూచోండి! (ఇది నాగేశ్వరావుకు!) .. నేను బాగా కలవాణ్ణి. కాని ఒక కారణం వల్ల మనుష్య ప్రపంచంతో సంబంధం లేకుండా ఉంటున్నా. నేను మనిషికంట పడడం మానేశాను. అనేక రోజుల్నించీ నాకు అతిథులెవరూ లేరు. రాకరాక మీరొచ్చారని కనపడ్డా.

నేనిప్పుడు పగబట్టి ఉన్నా.

అదెట్లా వచ్చిందంటే?....మొదట నేను వాడెంత అడిగితే అంత డబ్బు ఇచ్చా. అది తగలేసి తాగి ఇంకా కావాలని రాసాగించాడు. వాడికి ముందూ వెనకా తెలీదు కోపం వస్తే! అందుకని, వాడిబుద్ధి ఎట్లా మార్చటమో నాకు తోచక పోయింది. కొంచెం గట్టిగా చెప్పితే కోపం వస్తుందని భయం కాదు! అందుకని వాడి చెల్లిలి చేత చెప్పించా! ఆ రాత్రే వాడు పలుగు పట్టుకొచ్చి నేను మంచంలో పడుకుంటే గుండెల్లో దిగేశాడు. అప్పుడు నేను లెగిసి...."

ఈ కథ చెప్పుతున్న కొద్దీ మొదట హీనంగా ఉన్న ఆసామీగొంతు అంత కంతకూ హెచ్చటం మొదలుపెట్టి చివరకు కేకల కింద మారింది. కథ ఈ ఘట్టా నికి వచ్చేటప్పటికి నా స్నేహితులిద్దరూ కెవ్వన అరిచి పారిపోయినారు. నేను మావేషగాడూ బయటికి వచ్చి చూసేసరికి అప్పుడే వాళ్ళు చాలాదూరం వెళ్ళారు.

"బాగానే ఉంది, రాఘవయ్యా, నీ ప్రదర్శనం. ఇక ఈ ఇద్దరూ నన్ను వేధించరని తలుస్తాను! మనం ఈ రాత్రికి ఇక్కడ కాలక్షేపం చేశామా"

ఇదీ నేను చేసిన అపరాధం. రాఘవయ్య వాళ్ళకు మర్నాడు కనపడటానికి కారణం నేనే. లేకపోతే వాళ్ళకు నేనుచేసిన అవమానం తెలిసిరావడం ఎట్లా? రాఘవయ్య మాఊరివాడు మరి. రాఘవయ్యను నేను బయట పెట్టదలచి ఉండననీ, తమ తెలివితేటలవల్ల నా దుర్మార్గం బయట పడ్డదనీ ఆ మూఢుల నమ్మకం. కానివ్వండి! వాళ్ళేమనుకుంటే మటుకు నాకేం? మీకేం?

ముద్రణ: అక్టోబరు 1935, వినోదిని.

# బాహుకుడు

పదేళ్ళ క్రితం సీతారామయ్యను గురించి విసుగు లేకుండా చేసిన ప్రచారం జ్ఞాపకంవస్తే నా కిప్పుడు చాలా సిగ్గుగా ఉంటుంది. ఈ మధ్యనే ఆ విషయం నా కెవరో జ్ఞాపకం చేశారు. అతన్ని గురించిన ప్రసంగం వచ్చేసరికి "వాడి సంగతి నాకు చెప్పకండి" అన్నాను. "ఇతన్ని ఒకప్పుడు ఊరేగించినవాడివి కావూ?" అని దెప్పిపొడిచారు.

అవును, సీతారామయ్యను ఊరేగించాను. ప్రపంచంలో ప్రతిభావంతులు చాలా అరుదు. రెండు రకాలవాళ్ళు ప్రతిభావంతులను గురించి ప్రత్యేక శ్రద్ధ ప్రకటిం చరు-ప్రతిభ గుర్తించలేనివాళ్ళు నిజంగా ప్రతిభకలవాళ్ళూనూ. దురదృష్టవశాత్తూ నాకు ప్రతిభ గుర్తించే శక్తిమటుకే ఉంది, ప్రతిభలేదు.

సీతారామయ్య చక్కగా సంగీతం పాడేవాడు. ఇప్పుడింకా బాగా పాడు తున్నాడేమో కూడానూ. అయితే నేనతని సంగీతం చూసి ముగ్ధుణ్ని కాలేదు. నాకు సంగీతం గురించి తెలీక కాదు. నన్ను ముగ్ధుణ్ని చెయ్యటాని కా సంగీతం సరి పోలేదేమో అనుకుంటాను. ఏమైనా అతని సంగీతం గురించి నేనెప్పుడూ తాప త్రయపడలేదు. నన్ను బలంగా ఆకర్షించింది, అతనిలో సమగ్రంగా ఉన్న మానవత్వం.

మానవత్వానికి సంఘంలో పలుకుబడిలేదు. ఎన్నడూ ఒకని నీచమైన భావం ప్రకటించని వాణ్ణి, తన బరువు ఆవగింజంతయినా, పొరపాటునకూడా ఇత రులమీద వెయ్యనివాణ్ణి, తన మనోవికారాలను ఏమాత్రమూ ప్రదర్శించని వాణ్ణీ, నలుగురిలో ఉన్నప్పుడు సమయానికి వివేకవంతమైన మాట ఒకటి అని చెడిపోయే పరిస్థితిని సునాయాసంగా చక్కబెట్టేవాణ్ణీ మనుష్యులు చప్పున గుర్తించరు. చిన్న తనంనుంచీ మానవ స్వభావాన్ని పరిశోధించటం అలవాటయింది, గనక సీతా రామయ్యలో ఉన్న విచిత్రమైన సంస్కారాన్ని నేను కనిపెట్టాను. రుజువుకూడా చేసుకుని ప్రచారం ప్రారంభించాను.

ఈ ప్రచారం సులభసాధ్యంకాదు. సాటి మనిషిలో ఒక ప్రత్యేకవిద్య ఉన్నదంటే ఆమోదిస్తారుగాని, ఒక నైతిక ఆధిక్యత ఉన్నదంటే ఎవ్వరూ త్వరగా ఆమోదించరు. అటువంటి ప్రచారం చేసేవాణ్ణి కూడా క్షమించరు. కాని నా ప్రచారం నేను మానలేదు. అతని స్నేహంవల్ల నేను పూర్వంకంటె మంచివాణ్ణి

యినా ననే విశ్వాసం నన్ను వదలిపెట్టలేదు. నా కతనివల్ల కలిగిన ఉపకారం మాటలతో నిరూపించేది కాదు. రూపాయి అణాపైసల్లో లెక్కించేదికాదు. అతనికి నేనేమీ ప్రత్యుపకారం కూడా చెయ్యలేదు. అతన్ని కథలు రాయమని ప్రోత్సహించటం తప్ప, ఈ ఆలోచన అయినా నాకు కలిగినది కాదు. అతనంతట అతనే ఒక కథ రాశాడు. రాసి దాచిపెట్టుకున్నాడు. ఒకనాడది ఎట్లాగో నా కంటపడింది. చదివాను. నాకా కథ అద్భుతంగా ఉన్నట్టు తోచింది.

కథకుడుగా అతని ప్రత్యేకతను గురించి నేను వివరంగా చెప్పను. అతను రాసిన కొద్ది కదలూ వాటికవే సాక్షి. పాత్రలు అనే మాటలకూ, చేసే సామాన్యపు పనులకూ ఒక విచిత్రమైన అంతరార్థం నిరూపించేవాడు. ఏవో సన్నివేశాలు కల్పించి పాత్రలచేత గంభీరంగా మాట్లాడించవచ్చు. కొన్ని సాంఘిక భావాలు ప్రచారం కూడా చెయ్యవచ్చు. కాని మామూలు సంఘటనలే తీసుకొని మామూలుగా మనుషులు చేసే పనులకూ, అనే మాటలకూ ప్రత్యేకత తెప్పించటానికి అపూర్వమైన ప్రతిభ కావాలి. సీతారామయ్య రాసిన కథ చదవగానే అతడు సామాన్యుడు కాదనీ, మనుషుల్ని పుస్తకాలు చదివినట్టు చదవగలడనీ, బతికుండగానే కోసి సునిశితంగా పరీక్షించగలడనీ నాకు తోచింది అతనా కథలో ఏదో ప్రచారం చేస్తున్నట్టు కనిపించింది గాని ఏం ప్రచారం చేస్తున్నాడంటే మటుకు సమాధానం రాలేదు. తరవాత చాలా కాలానికి అతను ఉన్నతమైన మానవత్వం ప్రచారం చేస్తున్నాడని నేను నిర్ధారణ చేసుకున్నాను.

సీతారామయ్యను ఊరేగించటానికి నాకిప్పు డొక పల్లకీ దొరికింది. అది వరకల్లా అతన్ని వ్యక్తిగతంగా పొగడి, నోరు ఖాళీ చేసుకున్నాను. కథకుడుగా అతన్ని ప్రపంచం పరిచయం చేసుకోవాలని నేను తీర్మానించాను. పట్టుబట్టి అతని కథ పత్రికకి పంపించి, కథ లింకా రాయమని అతని గొంతుమీద కూర్చున్నాను. అతను నా మాట తీసెయ్యకుండా రాయటం సాగించాడు. కాని అతని కదలు ప్రత్యేకించి గుర్తించినవారు లేరు. గొప్ప కథకుడని అతన్ని పదిమందీ గుర్తించినట్లయితే అతని జీవితం ఎట్లా ఉండేదో చెప్పలేను. అప్పటికీ అతను పతనం అయివుండేవాడేనేమో గాని, ఈ కీర్తి అతన్ని కొంతవరకు రక్షించి వుండేదేమోనని నా ఆశ.

"పెక్కుభంగులు వివేక భ్రష్టసంపాతముల్" అన్నాడు కవి. సీతారామయ్య పతనం అకస్మాత్తుగా జరగలేదు. చాలా కాలంవరకూ నాకా విషయమై సందేహం కూడా కలగలేదు.

సీతారామయ్యకు సుబ్రహ్మణ్యంతో పరిచయం కావటం నాకు తెలుసు. సుబ్రహ్మణ్యంతో నాకు స్నేహం లేదు గాని పరిచయం ఉంది. సుబ్రహ్మణ్యం

స్నేహంకోసం పాకులాడుతున్నాడని తెలిసి నేనేమీ అడ్డుపడలేదు. నేనెందుకడ్డు పడాలి? సుబ్రహ్మణ్యం లక్షరూపాయల ఆస్తికి పెంపుడు వెళ్ళాడు. వాణ్ణి గారాబంగా చూసే పెంపుడు తల్లి ఉంది. సుబ్రహ్మణ్యం డబ్బు ఊళ్ళో వున్న తాగుబోతులూ, జూదగాళ్ళూ, ముండల ముతాఖోర్లూ తింటున్నారు. మనుషుల్ని కాచి వడబోసిన సీతారామయ్య సుబ్రహ్మణ్యం బతుకు కనుక్కోలేడా? సుబ్రహ్మణ్యాన్ని ఆకర్షించింది సీతారామయ్య కథలు కావు, సంగీతం. ఏ ఆకర్షణ అయితే ఏం? సుబ్రహ్మణ్యం తను తగలేసేడబ్బులో కొంత సీతారామయ్యమీద తగలేస్తాడు. పోనీ, అంతవరకయినా సద్వ్యయ మవుతుంది-పాపిష్టి సొమ్ము.

సీతారామయ్యను గురించి నేనేమీ ఆదుర్దాపడలేదు. సీతారామయ్యకు తనంత దగ్గిర స్నేహితుడు మరొక రుండరాదనే అహంభావల్లె సుబ్రహ్మణ్యాని కున్నట్టు వాసనపట్టి నేను సీతారామయ్యకు పెడపెడగా కూడా ఉంటూ వచ్చాను.

నేను సీతారామయ్య శక్తిసామర్థ్యాలను అతిగా అంచనా కట్టానేమో ననుకుంటాను. ప్రతిభావంతుడయిన మనిషి పరిస్థితులను కొంతవరకు మార్చగలడనేది నిజమేకాని బలవత్తరమైన పరిస్థితులు, ప్రతిభ ఉండినా, ఒంటరిగాడైన వాణ్ణి మరింత నమ్మకంగా మార్చగలవు. సుబ్రహ్మణ్యాన్ని గురించి అందరూ తేలికచేసి మాట్లాడవచ్చు. కాని సాంఘిక శక్తులు సీతారామయ్య వంటి వ్యక్తివేపు లేవు. లక్షరూపాయల వేపే వున్నై.సాంఘిక శక్తులముందు సీతారామయ్య-ఎంత ప్రతిభకలవాడైతేమాత్రం-ఏపాటి? ఈ సంగతి నేను తెలుసుకోలేకపోయినాను. తెలుసుకుంటే ఏంచేసి ఉండే వాణ్ణి బహుశ ఏమీచేసి ఉండను.

సుబ్రహ్మణ్యం, సీతారామయ్యను పాటగాడుగా రూఢి చేశాడు. సీతారామయ్య కథలు రాయటం పూర్తిగా మానేశాడు. సుబ్రహ్మణ్యం, సీతారామయ్య కోసం ఒక తంబురా కొనిపెట్టాడు. ఒక తబలావాణ్ణి కూడా తన పరివారంతో చేర్చాడు.

ఈ తబలిస్టు సీతారామయ్యను, 'ఏయ్, మామా!' అని సంబోధిస్తుండగా నేను స్వయంగా విని నిర్ఘాంతపోయినాను. సీతారామయ్యను ఆ పరివారజనమంతా 'మామా' అని పిలుస్తారనీ, సుబ్రహ్మణ్యం అతనితో చాలా తేలిక మాటలు మాట్లాడతాడనీ విన్నాను.

సీతారామయ్య పాటలో ప్రత్యేకత ఏమీ లేదని నా అభిప్రాయం; ఆ పాటకు జోహార్లు చేస్తూ వచ్చినవాడు సుబ్రహ్మణ్యం. నేను పొరపాటుపడి ఉండవచ్చు. సుబ్రహ్మణ్యమే నిజం గ్రహించి ఉండవచ్చు - సీతారామయ్య పాటను చాలా ఎక్కువగా ప్రజలు ప్రశంసించటం నేను విన్నాను. కాని నాకుపట్టుకున్న భయమదికాదు, సీతారామయ్య పాట కింత జోహార్లు చేస్తూ వచ్చిన సుబ్రహ్మణ్యం

ఎట్లా, ఎప్పుడు దానికంటె ఎక్కువైనవాడైనాడు? అతనా వినయం ఎంత కాలమో నిలబెట్టుకోలేదు. తను సీతారామయ్యను పెట్టి పోషిస్తున్న కారణంచేత సీతారామయ్య పాటనుకూడా పెట్టి పోషిస్తున్నవాడల్లే ప్రవర్తించసాగాడు. సీతారామయ్య పాటను తన ఆవరణలో బాగానే ప్రచారంచేశాడు. నిజమే; కాని ఆ ప్రచారంలో తననుకూడా కలుపుకున్నాడు సుబ్రహ్మణ్యం. సీతారామయ్య పాటలో ఏమన్నా గొప్పతనం ఉంటే అది తనచలవే ననేవిషయం సుబ్రహ్మణ్యం చక్కగా ప్రచారం చేశాడు. అనుమానాస్పదమైన సీతారామయ్య గానకాంతితో తను వెలగాలని ప్రయత్నించాడు సుబ్రహ్మణ్యం.

సీతారామయ్యచేత గ్రామఫోను రికార్డులు కూడా ఇప్పించాడు సుబ్రహ్మణ్యం. దానిమీద వచ్చిన లాభాలకంటె సుబ్రహ్మణ్యం చేతనుంచి పెట్టిన ఖర్చులే ఎక్కువయినై. కాని ఇందుమూలంగా సంస్కార ప్రపంచంలో ఒక అంగుళం జాగాలేని సుబ్రహ్మణ్యానికి నిలవనీడ లభించలేదా? ఈ అట్టహాసమంతాచూసి కొందరు సంస్కారులైనా సుబ్రహ్మణ్యాన్ని తమ వర్గంలోకి స్వీకరించలేదా?

సుబ్రహ్మణ్యం ప్రోత్సాహంతో సీతారామయ్య స్టేజ్ ఎక్కాడు. నాటకాలాడాడు. లాభనష్టాల మాట దేవుడెరుగు. సుబ్రహ్మణ్యానికి వ్యాపారదృష్టి ఏ కోశానా లేనప్పుడు సీతారామయ్య ఆడిన నాటకాలు ఆర్థికంగా విజయవంతమయిందీ కానిదీ తేల్చటానికి అవకాశం ఎక్కడుంది? ప్రపంచానికి సీతారామయ్య పైకి వస్తున్నాడన్న భ్రమకలిగింది. కాని పైకివచ్చినవాడు—సీతారామయ్యను అడ్డం పెట్టుకుని తనకు సంఘంలో చొరరానిచోట్లకు వెళ్ళినవాడు - సుబ్రహ్మణ్యం.

ఆఖరుదశ సినిమా చిత్రనిర్మాణం—ఆపైన ఏమీ లేదు. ఆ సినిమా చిత్రం పూర్తి అయి బయటపడి ఉంటే ఇంకేమేమి జరిగేదో చెప్పలేం. కాని అది పూర్తి కావలిసిలేదు.

సీతారామయ్యకోసం దివాలాతీసినట్టు సుబ్రహ్మణ్యం అందరితోనూ చెప్పుకుంటున్నాట్ట! "నా సొమ్మంతా సీతారామయ్య తాగుడుకూ, సీతారామయ్య ముండలకూ, సీతారామయ్యను పైకి తేవటానికీ పెట్టాను" అంటాట్ట సుబ్రహ్మణ్యం! ఈ ముక్క పచ్చి అబద్ధమైతే నేను బాధపడను. సీతారామయ్య తాగినమాట అబద్ధం కాదు, అతని ముండలూ యథార్థమే.

సీతారామయ్య తానై తాగి ఉండడనీ, చవుకబారు ముండలతో వ్యభిచరించి ఉండడనీ నాకు రూఢిగా తెలుసును. అత నీ పనులు చెయ్యటానికీ సుబ్రహ్మణ్యానికీ సన్నిహిత సంబంధం ఉంది. కాని సీతారామయ్యను తిట్టేవాళ్ళ ఎదట నే

నతన్ని సమర్థించలేను. ఎట్లా సమర్థించనూ? సీతారామయ్య సుబ్రహ్మణ్యంవంటి అధముడి దగ్గిరికి అంత దగ్గిరిగా ఎందుకు వెళ్ళవలసివచ్చింది? సీతారామయ్య దారిద్ర్యంతో నాకు సానుభూతి ఉంది. కాని ఆ దారిద్ర్యానికి సీతారామయ్య అంతగా ఎందుకు లొంగిపోవాలి? ఎక్కడో ఒకచోట అతను తిరుగుబాటు ఎందుకు చేసి ఉండకూడదూ? కొన్ని పరిస్థితుల్లో జీవించేకంటె చచ్చిపోవటం మేలుకాదా! సీతారామయ్య అంత తప్పనిసరి అయితే దారిద్ర్యంతో పోరాడి ఎందుకు చావలేక పోయినాడూ? నాది కఠినమైన తీర్పుగా కనిపించవచ్చు. జీవితం కఠినంగా ఉన్నప్పుడు జీవితంమీది తీర్పులు నాజూకుగా ఎట్లా ఉంటై!

సీతారామయ్య ఆత్మగౌరవంకంటె విలువైనదాన్ని పోగొట్టుకున్నాడు. అతని భార్య సరస్వతి అతను పంపిస్తూ వచ్చిన డబ్బు తీసుకో నిరాకరించిందని విన్నాను. తన కొడుకుతో సహా పుట్టింటికి చేరి ఒంటిమీద ఉన్న కొద్దిపాటి నగలు అమ్ముకుంటూ కొంతవరకు కాలక్షేపం చేసింది. ఆ తరవాత దగ్గిర బంధువుల దగ్గిర ముష్టెత్తింది. ఈ సంగతిని విని నేను కొంత డబ్బు పంపుతూవచ్చాను. తీసుకున్నది.

సుబ్రహ్మణ్యం తలపెట్టిన సినిమా మిషమీద తాగుడుకూ, ముండలకూ సుబ్రహ్మణ్యం డబ్బంతా అయిపోయి, సుబ్రహ్మణ్యానికీ సీతారామయ్యకూ పూర్తిగా తెగిపోయినాక సీతారామయ్య భార్య దగ్గిరకి తిరిగివచ్చాడనీ, భార్య అతన్ని స్వీకరించిందనీ విని సంతోషించాను గాని ఆశ్చర్యపడలేదు. భార్యను సమాధానపరిచేపాటి మానవత్వం సీతారామయ్యలో ఇంకా మిగిలి ఉంటే అందులో ఆశ్చర్యం ఏమీలేదు.

ఊళ్ళోనే ఉన్నాడని తెలిసికూడా చాలాకాలం నేను సీతారామయ్యను చూడబోలేదు. మా కిద్దరికి మధ్య ఏవో తెగిపోయినట్టయింది. కాని నిష్పక్షపాతంగా ఆలోచిస్తే సరస్వతికిలేని బెట్టు నా కెందు కుండాలో అర్థంకాలేదు. ఈ మాట అనిపించినాక సీతారామయ్యను చూడటానికి నిశ్చయించుకుని బయలుదేరి వెళ్ళాను.

సీతారామయ్య ఇంట్లోలేడు. సరస్వతి పిల్లవాడికి అన్నం పెడుతున్నది. మనిషి ఎప్పటిమాదిరిగానే ఉంది గాని ఏమాత్రమూ విచారంగా లేదు. సీతారామయ్యను విమర్శిస్తూనే మాట్లాడాను, సరస్వతి నా పక్షం ఉంటుందనే ధైర్యంతో.

కాని సరస్వతి నాపక్షం కాలేదు.

"జీవితం పామై కరిస్తే ఎవరుమటు కేం చేస్తారు?" అన్నదావిడ.

"దానిజోలికి పోకపోతే ఎందుకు కరుస్తుంది?" అన్నాను.

"ఇంటో కూచుంటే మనిషి కే సంఘమూ ఉండదు గద? ఏదో సంఘంలోకి పోక ఎట్లా తప్పుతుందీ?" అన్నది సరస్వతి.

"ఈ సుబ్రహ్మణ్యం సంఘం తప్ప ఇంకేమీ దొరకలేదా?" అన్నాను.

"ఇంకేం దొరికిందీ?" అన్నది సరస్వతి.

ఆ ప్రశ్నకు నేను సమాధానం చెప్పలేక పోయాను. నిజానికి సీతా రామయ్యను, కథకుడని ఎవరూ గుర్తించలేదు. కాని అతని సంగీతం అతన్నేం ఉద్ధరించిందీ! అతను మళ్ళీ ఎప్పటి స్థితికే వచ్చాడుగద! ఈమాటే సరస్వతిని అడిగాను.

సరస్వతి నాకేసి ఆశ్చర్యంగాచూసి, "ఇప్పుడాయన కోసం ముగ్గురు ఫిలిం కంపెనీవాళ్ళు తిరుగుతున్నారు" అన్నది.

నేనీమాట నమ్మలేకపోయినాను. కాని నిజమే అయి ఉండాలి. సీతా రామయ్య కథల్ని ఖాతరు చెయ్యని ప్రపంచం అతని పాట ఆమోదించింది. నేనే రైటనీ, ప్రపంచం తప్పనీ నాకు తెలుసును. సుబ్రహ్మణ్యం వెంటపడి సీతా రామయ్య ప్రపంచానికి దూరమై పోయినా డనుకోవటం నా భ్రమ-నా అహంకారం. ప్రపంచం నాకు దగ్గిరిగా లేదు. సుబ్రహ్మణ్యానికే దగ్గిర ఉంది. సాంఘిక శక్తులు సుబ్రహ్మణ్యం లక్ష రూపాయలవేపు మొగ్గినట్టే ప్రపంచం సుబ్రహ్మణ్యం సంస్కారం వేపు మొగ్గి ఉంది.

ఈ మాట సరస్వతితో చెప్పాను. చెప్పి, "ఈ ప్రపంచాన్ని ఇట్లా ఉంచటం నాకిష్టం లేదు. నా వేపు తిప్పుకోవాలి. ప్రపంచాన్ని నా పక్షం చేసుకునేటందుకు ఒకప్పుడు సీతారామయ్యను కథలు రాయమన్నాను. ఇప్పుడు నేను ఒంటరి గాణ్ణయిపోయినాను" అన్నాను.

సరస్వతి నన్నుచూసి నవ్వి లోపలికి వెళ్ళి ఇంతలావు కాగితాల కట్ట తెచ్చి నాముందు పడేసింది. నాకు దాన్ని చూడగానే పరమానంద మయింది. సీతా రామయ్య నన్ను ఏమరలేదు.

"ఎంతకాలం నుంచీ రాస్తున్నాడు!" అన్నాను.

"రెండేళ్ళనుంచీ"

సుబ్రహ్మణ్యం దగ్గిరికి వెళ్ళిన కొద్దికాలానికే ఈ బ్రహ్మాండమైన పుస్తకం ప్రారంభించాడన్నమాట! ఎంత పొరపాటుపడ్డాను!

ముద్రణ : ఫిబ్రవరి 1947, ఆంధ్రజ్యోతి మాసపత్రిక.

# పానకంలో పీచు

దత్తాత్రేయులు అయిదో ఏట, తనతల్లి పురుడు పోసుకోవటానికి మేనమామల ఇంటికి వచ్చినప్పుడు మొట్టమొదటిసారి బస్తీ మొగం చూశాడు. తను కూడా ఆ ఇంట పుట్టినవాడే. మూడేళ్ళు నిండకపూర్వం ఇంకోసారి ఇక్కడికి తల్లివెంట వచ్చాడు, తాతకు కిందట్లా మీదట్లు అవుతున్న రోజుల్లో. అయితే ఆ రాకగురించి దత్తాత్రేయులు కేమీ జ్ఞాపకం లేదు-తాత శవాన్ని స్నానం చేయించి ఫోటోతీయడం తప్ప. ఆ ఫోటో కాపీ తన పల్లెటూరి ఇంటిసావడిలో రోజూ చూడకపోతే అతనికి ఈ విషయంకూడా జ్ఞాపకం ఉండదేమో.

తమ్ముడి పురుటకలకు బస్తీ వచ్చినప్పుడు మాత్రం దత్తాత్రేయులు బస్తీ తరహా లన్నీ బాగాచూశాడు. మట్టిరోడ్ల గతుకుల్లోనూ, కాలు దిగబడే బురదలోనూ రోజూ నడిచే దత్తాత్రేయులకు కంకరరోడ్లు అద్దాలల్లే కనిపించాయి. అతడు మూడంతస్థుల మేడ ఎక్కాడు. రాత్రిపూట వీధుల్లో లాంతరు స్తంభాలు చూశాడు. పెద్దబజారులో దుకాణాలు చూశాడు. వాటిల్లో ఆకర్షవంతంగా పెట్టి ఉన్న రకరకాల వస్తువులు చూశాడు. రాత్రివేళ ఈ దుకాణాలలోనే వెలిగే "లస్టరు" దీపాలు చూశాడు. పెద్ద చప్పుడు చేసుకుంటూ బజారులోపొయ్యే మోటారుకారు కూడా ఒకటి చూశాడు. మేనమామల ఇంటికి రైలుదారి అరమైలుదూరంలో ఉంది. కొత్తగా ఏర్పడిన బస్తీ స్నేహితుడివెంట రైలుకట్టనపోయి రైళ్ళు రావటమూ పోవటమూ కూడా, చూశాడు. అదృష్టవశాత్తూ ఆరోజుల్లోనే తారాబాయి[1] జుట్టుతో ఇంత పెద్ద బండ పైకెత్తటమూ, బండిమీద పదిమందిని ఎక్కించి బండి పోలు నుదుటికి ఆనించి బండిని తోయటమూ; కత్తులమీద పడుకోవడమూ, ఆడపిల్ల అందమైన గౌను తొడుక్కుని అంతకన్నా అందమైన గొడుగు చేత్తో పట్టుకుని తీగమీద వెనక్కూ ముందుకూ నడవటమూ చూశాడు.

ఇటువంటి జీవితాన్ని ప్రేమించటం ఎంత సులభం! తన బస్తీ స్నేహితుడి ముందు తాను తీసికట్టుగా ఉన్నట్టు దత్తాత్రేయులు అనుక్షణమూ భావించే వాడు. తనకన్న ఉన్నతస్థాయిలో ఉన్నవాడి ఔన్నత్యం గుర్తించలేని అశక్తత సహజ మైనది కాదు. అహంకారం కష్టపడి సాధించాలి. తన పల్లెటూళ్ళో ఎందరో ఆడ పిల్లలున్నారు. కాని ఆ బస్తీ స్నేహితుడి చెల్లెలు - ఆ పిల్లకూ ఇతని ఈడే వుంటుంది-ఇతని కళ్ళకు అపూర్వంగా కనబడింది.

---

1. తారాబాయి సర్కసు ఫీట్లు చేయడంలో పేరొందిన మహిళ.

"నేను చచ్చినా పల్లెటూళ్ళో ఉండను-పెద్దవాణ్ణయితే!" అనుకున్నాడు దత్తాత్రేయులు.

తన పల్లెటూళ్ళో ఎవరూ చదువుని గురించి అంత ఆసక్తిగా మాట్లాడగా దత్తాత్రేయులు వినలేదు. కాని తన బస్తీస్నేహితుడు చదువు గురించి చెప్పరానంత ఆసక్తిగా మాట్లాడేవాడు. ఆ అబ్బాయి తాను ఓయేం ఎన్నో ఏట పేసవుతాడో, తరువాత ఎంత జీతంగల ఉద్యోగంచేస్తాడో వర్ణిస్తుంటే దత్తాత్రేయులకు నోరూరినంత పనయింది.

దత్తాత్రేయులు అటువాళ్ళూ, ఇటువాళ్ళూకూడా ధనికులనిగాని దరిద్రులనిగాని చెప్పటానికిలేదు. వాళ్ళకి పెద్ద కోరికలూలేవు. పెద్ద రాబడిలేదు. అవసరాలూ, కోరికలూ తీర్చుకునే రాబడికలవాడే రాజాధిరాజు. అందుచేత వారూ వీరూ కూడా రాజాధిరాజులే. కాకపోతే దత్తాత్రేయులు తండ్రి పల్లెపట్టునఉండి తనకున్న కొద్దిపాటి పొలాలూ, దొడ్లూ చూచుకునేవాడు. దత్తాత్రేయులు మేనమామలు ఉద్యోగాలు చేసుకొనేవాళ్ళు.

## 2

దత్తాత్రేయులుకు తండ్రి చదువు చెప్పించరాదని ఎన్నడూ అనుకోలేదు. అయితే అయిదో ఏటనే వాడు చదువుకోసం తాపత్రయ పడతాడని ఆయన అనుకోలేదు. చదువంటే ఆయన ఉద్దేశం వొక్కశుద్ధి అని రాయటమూ, చదవటమూ, లెక్కలు చేయటమూ చాతనయితే దత్తాత్రేయులు జీవితానికి లోటుండదని ఆయన విశ్వాసం. ఆ చదువు ఎప్పుడారంభించినా మూడునాలుగేళ్ళలో పూర్తి అవుతుంది. అంతకన్న ఎక్కువ చదివితే కోరికలు బలుస్తాయని అయనకు భయం.

"నేను బియ్యే ప్యాసవుతాను" అన్నాడు దత్తాత్రేయులు ధైర్యంచేసి.

"నీ మొహమేం కాదూ? బియ్యే ప్యాసయి ఏంచేస్తావు? ఉద్యోగంచేసి డబ్బు సంపాదించి, మీ మేనమామల్లే అంగళ్ళకు పోస్తావా? వాళ్ళ సంపాదనే ఈ వూళ్ళో ఉంటేనా?" అన్నాడు తండ్రి.

"ఈ ఊళ్ళో ఉంటే సంపాదన ఎట్లా వస్తుంది?" అన్నది దత్తాత్రేయులు తల్లి.

"అదీ నిజమే అనుకో. అందుకని మనవాడు ఉద్యోగాల కోసమని ఉన్న చోటు వొదులుకొని ఊళ్ళవెంట పోవాలంటావా? బాగుంది."

"మనం వద్దంటే తప్పుతుందా ఏమిటి? ఇంక నలుగురు పుట్టుకొచ్చి ఈ కాస్తా పంచుకుంటే ఏం తింటారు? వాళ్ళ పిల్లలకేం పెట్టుకుంటారు? ఆ మాత్రం ఆలోచన లేదేం మీకు?"

పెళ్ళాం చెప్పేది ఆయనకు నిజంగానే కనపడినా కూడా నచ్చలేదు. తన అన్నగారు పల్లెటూరి పిల్లను చేసుకున్నాడేమో ఆవిడ ఇట్లా మాట్లాడదు. బస్తీ దాన్ని చేసుకోవటం పెద్ద పొరపాటయిందనుకున్నాడు దత్తుతండ్రి.

"సరే అంతగా కొడుక్కు చదువు కావాలంటున్నావు కనుక నీ అన్నల్ని దగ్గర ఉంచుకు చదువు చెప్పించమను" అన్నాడు దత్తుతండ్రి, పెళ్ళాన్ని శిక్షిస్తున్నవాడల్లే.

"మావాళ్ళు ఈ మాత్రానికి వెరవరు లెండి" అన్నది దత్తుతల్లి.

చివరకు ఆ ఏర్పాటే జరిగింది. చదువుకోసం అంత చిన్నవయస్సులోనే, మేనమామల ఊరు వచ్చేశాడు. కాని దత్తుకు బస్తీవచ్చిన ఆనందం కలుగలేదు. ఇక్కడికి వచ్చినప్పటినుంచీ తల్లీ, తండ్రీ, కాళ్ళూ చేతులు సాగదీసుకుంటూ ఆడుకునే పసితమ్ముడూ, ఇల్లూ, గొడ్లూ, పొలాలు జ్ఞాపకం రాసాగాయి.

దీనికితోడు తన మేనమామల ఇంట్లో జీవితం మొదట కనిపించినంత ఆనందమయంగా లేదు. తల్లి పురుటి అడావుడిలో అందరూ ఒకటైనారు గాని, వీళ్ళలో వీళ్ళకు కలతలున్నాయి. తన ఇద్దరు మేనమామల భార్యలూ అవకాశం దొరికినప్పుడల్లా కీచులాడుకుంటూ ఉంటారు. మళ్ళీ కలుస్తూ ఉంటారు. వీళ్ళ మూలంగా మధ్య మధ్య వీళ్ళ మొగుళ్ళు కూడా తగులాడుకోవలసి వస్తుంది.

ఈ పోట్లాటలో ఉండే స్వార్థం దత్తుకు అర్థమవుతూనే ఉండేది. కాని స్వార్థం మనుషులలో ఉండే చెడ్డతనంవల్లనే కలుగుతుందని ఆ వయసులో దత్తు నమ్మేవాడు.

అతనింకా ఇతర విషయాలు కూడా మేనమామల ఇంట్లో గమనించాడు. తన పల్లెటూళ్ళో ఎరుగనివి - ఇక్కడ వీళ్ళు పొరుగింటి వాళ్ళు చిన్న కరేపాకు రెబ్బలు అయినా ఇవ్వరు. అన్నీ డబ్బుపోసి కొంటారుగాదూ, అందుకని ఎవరికీ ఏమీ పెట్టరు. ఇస్తే ఇచ్చినందుకు గంటసేపు సణుగుతారు. అడిగినవాళ్ళను గురించి అసహ్యంగా మాట్లాడుకుంటారు. అఖరికి ఇన్ని మజ్జిగ ఇవ్వటం కూడా వీళ్ళకు ప్రాణాంతకమే. ఇంటికి చుట్టాలు వచ్చిపోతే వాళ్ళను గురించి, పరాయివాళ్ళను గురించి మాట్లాడినట్టు మాట్లాడతారు. ఊళ్ళో ఉన్న చుట్టాలనే నెలకొకసారి కూడా చూడరు!

## 3

చాలా ఏళ్ళు గడిచాయి. దత్తాత్రేయులు హైస్కూలు చదువు పూర్తిచేశాడు. ఇప్పుడతనికి బస్తీజీవితం గురించి తెలియని విషయాలు లేవు. పల్లెటూరి జీవితం గురించే అతనికి ఏమీ తెలియదు. ఎప్పుడన్నా వాళ్ళవూరు పోతే విశ్రాంతికోసం వెళ్ళినట్టు భావించేవాడు. రెండురోజులు గడిపేటప్పటికి ప్రాణంమీదికి వచ్చినట్టు

ఉండేది. తమ్ముణ్ణి చూస్తే అతనికి ఆశ్చర్యమయేది. గొడ్లకాసుకునేవాళ్ళకీ, రంగడికీ తేడాలేదు. వాణ్ణికూడా చదివించాలని చూశారుగాని వాడికి చదువు అంటనే లేదు. వాడికి పొలాలమీద తిరగటమూ, గొడ్లను చూడటమూ, అలగాజనంతో చేరి పోచి కోలు కబుర్లు చెప్పటమూ సరదా.

స్కూలు ఫైనలు పరీక్షలో దత్తుకు వచ్చిన మార్కులు చూసి వాళ్ళ హెడ్మాస్టరు వాణ్ని కాలేజీ చదువుకు పట్నం పొమ్మన్నాడు. దత్తు కనబరుస్తున్న ఉత్సాహం చెడగొట్టటం యిష్టంలేక తనకు శక్తి లేకపోయినా, తండ్రి పట్నం చదువుకు సమ్మతించాడు.

"అంతగా అయితే అప్పు చేస్తాను. తరవాత వాడు పెద్ద ఉద్యోగం చేస్తే ఈ భాగ్యం తిరిగి సంపాదించలేకపోతాడా ఏమిటి?" అనుకున్నాడు దత్తుతండ్రి!

దత్తుకు ప్రెసిడెన్సీ కాలేజీలో సీటు దొరికింది. మద్రాసులో అడుగు పెడుతూనే దత్తు "అసలు నేనుండవలసింది మద్రాసులో" అనుకున్నాడు. ఈ తారు రోడ్లూ, ట్రాములూ, బస్సులూ, ఈ విద్యుద్దీపాలూ, ఈ పార్కులూ, రేడియోలూ, దుకాణాలూ, సరికొత్త మోటార్లూ, అందులో పొయ్యే ఆడవాళ్ళూ, వాళ్ళు కట్టే ఖరీదైన చీరెలు, పెట్టే రవ్వలూ, బీచీ, అక్కడచేరే విద్యార్థులూ - ఇదే నిజమైన భూలోక స్వర్గమనుకున్నాడు దత్తు.

దత్తు సహాధ్యాయులలో మోటారుసైకిళ్ళు కలవారూ, కార్లమీద వచ్చేవాళ్ళూ కూడా ఉన్నారు. వాళ్ళ జీవితమూ, ఇళ్ళూ, వాకిళ్ళూ, సంసారమూ, వాళ్ళ తండ్రులూ తదితర బంధువులూ చేసే పెద్దపెద్ద ఉద్యోగాలూ, వ్యాపారాలూ చూసి అతను మురిసిపోయాడు. ఒక విద్యార్థి తండ్రి పేరుమోసిన ఎడ్వకేటు. ఏడాదికో లక్ష కళ్ళ జూస్తాడు. మరో విద్యార్థి తాత హైకోర్టు జడ్జిచేసి ఇటీవలనే రిటైరైనాడు. ఇంకో విద్యార్థి తండ్రికి పట్నంలో నాలుగైదు పెద్ద భవంతులున్నాయి. ఆయన వ్యాపారస్థుడు.

వ్యాపారం మాట ఎట్లా ఉన్నా గొప్ప ఉద్యోగాలు సంపాదించే అవకాశం తనకుకూడా ఉన్నందుకు దత్తు సంతోషించాడు. పట్నం జీవితం తనకు అందరాని దని అతనికి తోచలేదు.

అయితే ఈ విషయం అతనికి కొంత అనుమానం కలగటానికి తోడ్పడ్డాడు గణపతి అనే కుర్రవాడు. గణపతి మళయాళీ కుర్రవాడు. అతనికి స్కూలు ఫైనల్ పరీక్షతో అంతులేని మార్కులు వచ్చాయట. గొప్ప వక్త. డిబేటింగులో నిధి. ఇలొక్యూషను బహుమానాలు రెండుమూడు కొట్టేశాడు. చాలామంది కుర్రాళ్ళు గణపతి స్నేహం అభిలాషించేవాళ్ళు. అతనికి గర్వం ఏమీలేదు. అందరితోనూ

మాట్లాడేవాడు. కాని అయిదు నిమిషాలు అతనితో మాటాడితే ఇవతలివాడికే ఏదో జంకు కలిగేది. అంత తెలివిగలవాడితో సరిసమానంగా స్నేహం చేయడం ఎట్లా?

గణపతి ఎన్ని వేల పుస్తకాలు చదివి ఉంటాడోనని దత్తు ఆశ్చర్యపడ్డాడు. కాలేజీలు తెరచిన కొద్ది రోజులకే గణపతి రెండేళ్ళపొడుగూతా చదవవలసిన పుస్త కాలన్నీ ఒక విడత చదివి పారేశాడు. వాటిలో విషయాలను గురించి అతను మాట్లాడుతుంటే లెక్చరర్లు మాత్రం ఇంతకన్న ఏం చెప్పగలరనిపించేది దత్తుకు.

ఈ గణపతి ఒక గొడ్లసావిడిలాంటి కొంపలో అతిబీదగా నివసిస్తున్నాడు. అతని గది చూసి దత్తు నిర్ఘాంతపోయాడు.

"నేనెవర్నని నీ ఉద్దేశం? మా నాన్న పొలం దున్నుకుంటాడు. మా అమ్మ పేడ చేస్తుంది. మా కున్నదల్లా ఒక పూరిగుడిసె. నాకు ఆరుగురు అక్కాచెల్లెళ్ళూ, నలుగురు అన్నదమ్ములూ ఉన్నారు. నేను స్టేటు స్కాలరుషిప్పుతో చదువుకుంటు న్నాను" అన్నాడు గణపతి.

"అయితే ఏం? నువ్వు పెద్ద ఉద్యోగంచేసి చాలాడబ్బు సంపాదిస్తావు. మంచి ఇల్లు కట్టుకొని దర్జాగా బతకవచ్చు" అన్నాడు దత్తు. తన కోరికలన్నీ తనకు సాధ్య మైతే గణపతి కెందుకు సాధ్యం కావనే ఉద్దేశంతో.

"మా సంస్థానంలో తప్ప నాకు ఉద్యోగాలిచ్చే వాళ్ళెవరూ లేరు. నా సంపా దనకు నా తమ్ముళ్ళకూ చెల్లెళ్ళకూ చదువు చెప్పించగలిగితే ప్రయోజకుణ్నే."

"తెలివిగలవాడివి కదా, నీకు ఉద్యోగం ఎవరిస్తారంటావేం?"

"తెలివితేటలకూ, ఉద్యోగానికి సంబంధమేమిటి? పలుకుబడినిబట్టి ఉద్యోగాలు దొరుకుతాయి."

"పోనీ ఏ లాయరో అయితే?"

"దానికయినా వెనక అభిమానించే వాళ్ళుంటేనే తెలివితేటలు రాణించేది."

గణపతికన్న కార్లలో వచ్చే విద్యార్థులే ఎక్కువనుకోవటం దత్తుకు చేత కాలేదు. పెద్ద ఉద్యోగమూ, చాలా డబ్బూ సంపాదించే అవకాశాలు గణపతికే లేక పోతే తన కేమున్నాయనుకోవాలి?

"ఈ ప్రపంచం డబ్బూ, పలుకుబడి కలవాళ్ళది" అన్నాడు గణపతి. తాను ఎరిగిన తెలివిగలవాళ్ళు కొందరు చేస్తున్న ఉద్యోగాలను గురించి గణపతి చెప్పాడు- ఆ కథలు వింటే దత్తుకు నిస్త్రాణ వచ్చింది.

## 4

దత్తు బియ్యే పాసయినాడు. లా చదివాడు. లా చదువుకు తండ్రి అభ్యంతరం చెప్పాడు. ఇప్పటికే దత్తు చదువు చాలా భారమయిందన్నాడు. సగం పొలం తాకట్టు పెట్టి డబ్బు తీసుకురావటమయింది.

మరికొంతకాలం - రంగడివంతు మినహాయించగా మిగిలినది కూడా తాకట్టు పెట్టించి లా చదువు పూర్తి చేశాడు. బియ్యే చదువు పూర్తికాగానే అతని వివాహమైనది. వాళ్ళు కట్నం కింద ఇచ్చిన సొమ్ముతో దత్తు భార్యకు నగలు చేయించారు. ఆ సొమ్ము మిగిల్చినా దత్తు చదువు తేలిక అయేది. మామగార్ని అప్పు అడుగుదామంటే వాళ్ళూ అంతంతమాత్రంగాళ్ళే.

దత్తు చదువు పూర్తికాగానే కాటకం[1] వచ్చింది. అప్పులవాళ్ళు తాకట్టు పెట్టుకున్న ఆస్తంతా రాయించుకుని కూడా తమ అసలు ఫాయిదాలు ముట్టలేదని వలవల్లాడారు. దత్తు తండ్రి కుటుంబమూ, అత్తవారి కుటుంబమూ కూడా ఒక్క దెబ్బన చితికిపోయాయి. దత్తు పట్టా పుచ్చుకోటానికి కూడా కానీ లభించలేదు. పట్టా పుచ్చుకొని మాత్రం ప్రయోజనమేమిటి? కొత్త ప్లీడర్లకు కాఫీఖర్చులు గిట్టటం లేదు. గుమాస్తాల జీతాలు మొదలే గిట్టటంలేదు. చాలామంది లా జర్నల్సు కూడా తెప్పించటంలేదు.

ఈ సమయంలోనే భార్య కాపరానికి కూడా వచ్చింది.

తనూ తన భార్యా రంగడి ఆస్తిమీదపడి తినటం తప్ప మరొకమార్గం లేక పోవటం దత్తుకు విస్మయం కలిగించింది.

"ఈ మారుమూల పల్లెటూళ్ళో కూచుంటే సంపాదన ఎట్లా వస్తుంది? పట్నం పోతాను" అన్నాడు దత్తు.

"రోజులు బాగుపడేదాకా ఆగు. ఉన్నదే నలుగురమూ తిందాం" అన్నాడు రంగడు.

కాని దత్తుకు కాలు నిలువలేదు. పెళ్ళాం మెళ్ళోది తాకట్టు పెట్టి పట్నం చేరాడు. కాని ఇప్పుడు పట్నమంతా అపరిచితంగాఉంది. ఈ మహాపట్నంలో నుంచి శదువెక్కడ దొరుకుతుందో దత్తుకు తెలుసు. కాని 30 రూపాయల నౌఖరీ ఎక్కడ దొరికేది తెలియలేదు. తన పాత కాలేజీలకు వెళ్ళాడు. అవి అతనికేసి గుర్తించినట్లు చూశాయి. రెండు మూడు రోజులు తిరగగా ఎరిగినవాళ్ళు కొందరు కనిపించారు. అతని స్థితి చూసి జాలిపడ్డారు. కాని తరుణోపాయం చెప్పలేక పోయినారు. ఒకప్పుడు కార్లలో తిరిగేవాళ్ళను చూసి అసూయపడ్డ దత్తు ఇప్పుడు ట్రాములలో తలపాగాలూ, కోటు ధరించి తిరిగే వాళ్ళను చూసి అసూయపడ్డాడు. ఆఖరుకు బ్యాంకుల దగ్గిర డవాలీ బంట్రోతులు కూడా తనకన్న అదృష్టజాతకులల్లే క్రమజీవితం గడుపుతున్న వాళ్ళల్లే కనిపించారు.

---

1. ఆర్థిక కాటకం (1929-1934) ప్రస్తావన. ఇదే సంపుటంలోని వారసత్వం నవలలోని వివరాలు చూడండి.

దత్తు కుంగిపోయిన మనస్సుతో ఇంటికి తిరిగి వచ్చాడు. అతనికోసం ఒక ఉత్తరం ఎదురుచూస్తున్నది. ఆ ఉత్తరం ఎవరు రాసిందీకూడా కొంతసేపు దత్తుకు తెలియలేదు. అది రాసినవాడు నాలుగేళ్ళక్రితం అతనితో కలిసి బియ్యే చదివిన ఒక అరవ కుర్రవాడు. దత్తు చిరునామా చాలామంది తీసుకున్నారు. కాని అరవ వాడు ఇన్నేళ్ళూ దాన్ని భద్రంగా దాచాడన్నమాట!

"నువీ పాటికి ప్లీడరీలో ప్రవేశించి ఉంటావనుకుంటాను. నేను బొంబాయిలో ఒక ఎడ్వర్టయిజుమెంటు కంపెనీలోచేరి ప్రొడక్షను అసిస్టెంటుగా ఉన్నాను. నీ క్షేమ సమాచారాలు రాయి."

ఈ ఉత్తరానికి దత్తు వెంటనే సమాధానం రాస్తూ "నేను బొంబాయివస్తే ఉద్యోగం దొరుకుతుందా?" అని అడిగాడు.

దానికి అరవ స్నేహితుడు "చాలా ఉద్యోగాలు ఖాళీ వస్తుంటాయి. నువ్వు వస్తే ఏదో ఒకటి దొరక్కపోదు" అని రాశాడు.

దత్తు బొంబాయికి ప్రయాణమైనాడు.

బొంబాయి చూడగానే దత్తు కడుపులోనుంచి అనిర్వచనీయమైన ఆవేదన, అతి అందగత్తెను చూస్తే కలిగినట్టుగా, బయలుదేరింది. ఇటీవల అతని హృదయంలో జీవితంమీద ప్రేమ దాదాపు పూర్తిగా ఇంకిపోయింది. దానికి కారణం, సగం తనకు అవాంతరాలు తగలటం, సగం తాను గౌరవించేవాళ్ళు చాలమంది సరిగా తిండి అయినా లేకుండా అధోగతిలో ఉండటమునూ. అయితే బొంబాయిలో అడుగు పెట్టగానే జీవితంమీద ఆశ మళ్ళీ దత్తు హృదయంలో చిగిర్చింది. ఈ మహా పట్టణంలో కూలి చేసుకు బతికేవాళ్ళుకూడా మహా అదృష్టవంతులనిపించింది ఈ బొంబాయి ముందు మద్రాసు దివిటీముందు దీపం. ఈ జీవితంలో నచ్చులేదు. ఎంతో వడివుంది. వాళ్ళనూ వీళ్ళనూ విమర్శించటానికీ, తోచక తిరగటానికీ, ఎవరికీ తీరికలేదు.

దత్తుకు త్వరలోనే ఉద్యోగం దొరికింది. నెలకు 60 రూపాయల జీతం. అతని అరవ స్నేహితుడు అతనికి బొంబాయి యావత్తూ చూపటమేకాక అరడజను ఖాళీలు చూపించాడు. దత్తు చేసేపనికి అతని చదువుకూ సంబంధంలేదు. ఇది గుమాస్తాగిరీ. అయితేనే? 25 రూపాయలకు మూడుగదుల భాగం. కొళాయీ, స్నానాలగదీ, ఎలెక్ట్రిక్ దీపాలూ, వంటకుగానూ సహా దొరికింది. తనూ భార్యా హాయిగా ఉండవచ్చు. "ఈ ఇంట్లో ఉంటున్నాను," అని నాలుగంతస్థుల భవంతి తన వాళ్ళకి చూపిస్తే వాళ్ళెంత గర్విస్తారు?

అయిదారునెలలు గడిచాయి. ఈ అయిదారునెలలూ తనూ భార్యా స్వర్గంలో ఉన్నట్లు భావించాడు దత్తు. తన మొదటి ఉద్యోగం వదిలేసి 80 రూపాయలకు ఇంకో ఉద్యోగం సంపాదించాడు.

అయినా దత్తును అసంతృప్తి వేధించసాగింది. అతను జీవితంలో కాసీ మిగల్చటం లేదుసరిగదా, బొంబాయిలో నాగరికంగా బ్రతికి జీవించి ఆనందించా అంటే 80 ఒక జీతంకాదు. అన్ని విధాలా తనతో సమాను లనిపించుకునే వాళ్ళూ, తనకన్నా తక్కువ వాళ్ళూకూడా నెలకు అనేకవందలు సంపాదిస్తున్నారు. ఈ జీతంమీద రోజులు వెళ్ళుతున్నాయేగాని తనజీతం రెండువేలకు భీమా చేసుకోవా లన్నా, నెలకో 10, 15 రూపాయలు వెనక వెయ్యదలచినా, భార్యకొక మంచి చీరెగాని కొనదలచినా ఇదో రాబడికాదు.

రంగడి పెళ్ళి అయింది. దత్తూ, భార్యా వెళ్ళలేక పోయినారు. డబ్బులేదు.

ఇంకో సంవత్సరం తిరిగి వచ్చింది. దత్తు భార్య గర్భిణితో వుంది. ఆమెను పుట్టింట దిగవిడవటానికి పోవాలంటే అప్పు చేయవలసి వచ్చింది. దత్తు అత్త వారింటినుంచి స్వగ్రామం వెళ్ళాడు. అక్కడి జీవితం చూస్తే దత్తుకు కడుపు తరుక్కుపోయింది. తండ్రికి కుడికాలు స్వాధీనం తప్పింది. తల్లికి విడిచి విడిచి చలిజ్వరం. చిక్కి శల్యమయింది. మందూ మాకూలేదు. 60 ఏళ్ళున్నా తిరక్క ముందే వాళ్ళిద్దరూ మృత్యువు నెదురుచూస్తూ వైరాగ్యంతో ఉన్నారు. రంగడి భార్య, పధ్నాలుగేళ్ళది. కాపరానికి వచ్చి, ఇంట్లో అందరికి తన భర్తకుకూడా, గర్భశత్రువల్లే ప్రవర్తిస్తున్నది. ఆవిడిది సత్యాగ్రహం టెక్నిక్కు. జీవితంలోని రొస్టు మనుష్యుల మనస్తత్వాలలో చక్కగా ప్రతిబింబిస్తున్నది. మనుష్యుల మనస్సులు తుడిచిన అద్దాలల్లే మటుకులేవు.

"నీ దగ్గర అయిదో, పదో వుంటే ఇయ్యి, అన్నయ్యా" అన్నాడు రంగడు.

దత్తు దగ్గిరలేదు. అతను అప్పుతెచ్చిన డబ్బు ఖర్చులకు చాలలేదు. బొంబా యిలో బయలుదేరేటప్పుడు ఆఖరు క్షణాన దత్తు భార్య తన తల్లికొకచీరా, తన వదినెగారి కొకచీరా కొనిపించింది. అయిదూ పది తక్కువైతే రంగణ్నడిగి తీసు కుందాం లెమ్మనుకున్నాడు దత్తు.

"నీదగ్గిర లేకపోతేపోనీలే. రూపాయి పుట్టించాలంటే ఎంతకష్టంగా ఉందను కున్నావు. ఏదో నాలుగురాళ్ళు తెచ్చుకుంటానికే అవస్థపడుతున్నావంటే మా సంగతి ఆలోచించు" అన్నాడు రంగడు.

దత్తు చాలా నొచ్చుకున్నాడు. తన జీతంలోనుంచి నెలకు అయిదు రూపా యలు పంపినా వీళ్ళు సుఖపడేవాళ్ళు. తనకా ఆలోచన ఎందుకు తట్టలేదూ? 60 రూపాయలమీద తాను బతకలేదా?

ఈసారి దత్తు బొంబాయి వెళ్ళినప్పుడు తన ఖర్చు పూర్తిగా తగ్గించాడు. సినిమాలు చూడటం పూర్తిగా మానేశాడు. విక్టోరియా స్టేషనునుంచి ఆఫీసుకు

స్త్రీమెక్కకుండా నడవసాగాడు. ఇందువల్ల అతను అయిదారు రూపాయలు మాత్రమే ఆదా చెయ్యగలిగాడు. ఈ అయిదారు రూపాయలకోసం తన జీవితం లోని అల్ప సుఖాలన్నీ త్యాగం చేసినట్టనిపించింది దత్తుకు. కాని పళ్ళ బిగువున దీక్ష సాగించాడు. కాకపోతే తన భార్య లేదుకనక ఇంకో పదిహేను ఇరవై ఆదా అయింది.

దత్తు భార్య ప్రసవించింది. ఆడపిల్ల. తల్లినీ పిల్లనూ తీసుకురావటానికి దత్తే పోదామనుకున్నాడు. ఈ లోపుగానే తల్లికి చాలా జబ్బుగా వుందని రంగడు ఉత్తరం రాశాడు. ఈ ఉత్తరం అందిన రెండోనాడే ఆమె పోయినట్టు టెలిగ్రాం వచ్చింది.

దత్తు బయలుదేరాడు. అతను మామగారింట భార్యనూ పిల్లనూ చూసుకుని స్వగ్రామం వెళ్ళేసరికి తండ్రి కూడా ప్రమాదావస్థలో వున్నాడు. తండ్రికి కాస్త నయమయ్యేదాకా వుండి బయలుదేరుదామనుకున్నాడు దత్తు.

"నాకేం తీపరంరా నాయనా? నేనింకా ఎన్ని అవస్థలు పడాలిసి వుందో, నువు వెళ్ళు. నేను మళ్ళా లేచి తిరుగుతాలే" అన్నాడు తండ్రి.

దత్తు భార్య బిడ్డలతో సహా బొంబాయి చేరుకున్న వారం రోజులకు తండ్రి మరణవార్త తెలిసింది.

దత్తుకు ఈసారి వచ్చినది దుఃఖంకాదు, ఆగ్రహం! ఎవరిమీదనో తెలియ కుండా, పట్టరాని ఆగ్రహం! అతన్ని చూచి అతని భార్య ఆశ్చర్యంతో నిర్ఘాంత పోయింది.

"నన్నెందుకిట్లా పాపం వెంటాడుతున్నది? అయినవాళ్ళ దగ్గిర కూర్చుంటే తిండి లేదు! తిండికోసం దేశాలుకాని దేశాలు పోవటమూ, పెళ్ళయినా, పురుడ యినా, పుణ్యాలైనా దూరాన చావటమూనూను! రంగడి పెళ్ళికిలేను! మా అమ్మ చావుకు లేను! నీ కానుపుకు లేను! మా నాన్న చావుకు లేను. ఎందుకీ ఉద్యో గమూ, సంపాదనానూ; తగలెయ్యనా? నేనిక్కడ పట్నవాసంలో సినిమాలు చూస్తూ కులుకుతుంటే అక్కడ వాళ్ళు రూపాయికీ, అర్ధకూ ఉడ్డు కుడుచుకున్నారు. ఛీ, ఏం బతుకు?" అని దత్తు వాపోయాడు.

"బాగుందే? ఎవరి బతుకు వాళ్ళు బతకొద్దూ" అన్నది దత్తు భార్య.

"ఎవరి బతుకు వాళ్ళు బతికినట్టయితే మా నాన్న ఆస్తి కూడా నా కింద ఖర్చు కాదు. వెధవ చదువు! మావాళ్ళు నాకోసం అడ్డమైన గడ్డీ తిన్నారు. వాళ్ళకు తెలీదు. పాపం ఈ వేదాంతం" అని దత్తు భార్యమీద పులిమాదిరిగా పడ్డాడు.

తండ్రి ఉత్తర క్రియలకు తను వెళ్ళటం అసంభవం. తన నెల జీతంలో నుంచి పది రూపాయలు మటుకు రంగడికి పంపాడు.

తండ్రి పోయిన మూడు వారాలకు చెప్పకుండా పెట్టకుండా రంగడు బొంబాయిలో ప్రత్యక్షమయినాడు. పొద్దున అయిదున్నరకు దిగినవాడు మాతుంగా చేరటానికి తొమ్మిదిన్నర అయింది. రంగడు వచ్చేసరికి దత్తు ఆఫీసుకు బయలుదేరే ప్రయత్నంలో ఉన్నాడు. రంగడికి ఇంగ్లీషూ రాదు. హిందూస్థానీ రాదు.

"నేనా దిక్కుమాలిన ఊళ్ళో ఉండలేను. మళ్ళీ ఒక ఎకరం అమ్మాను. బాకీలు తీర్చగా రెండువందలు మిగిలింది. మిగిలిన రెండెకరాలు తన పేర పెట్టమని నా పెళ్ళాం పట్టుపట్టింది. మామగారు దానికి మద్దత్తు. అవుచేసి దాన్ని పుట్టింట దిగవిడిచి బయలుదేరాను. ఇక్కడ ఏదన్నా చెయ్యలేకపోతానా" అన్నాడు రంగడు.

రంగడు తాను తెచ్చిన డబ్బు దత్తు దగ్గరే ఉంచాడు. కావలసినప్పుడు రూపాయీ అర్ధా తీసుకుంటూ, రోజల్లా ఎక్కడెక్కడో తిరిగి రాత్రికి దత్తుకన్న ఆలస్యంగా ఇల్లు చేరుకుండేవాడు.

ఒకరోజు రంగడు డీలా అయిపోయినవాడల్లే కనిపిస్తూ ఇల్లు చేరుకున్నాడు. రంగడి మొఖాన చిరునవ్వు తాండవిస్తున్నది.

దత్తు రంగడికేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఉద్యోగం సంపాదించాను. లాల్బాగ్ దగ్గిర ఒక ఫ్యాక్టరీలో కూలిపని దొరికింది. రోజుకు మూడు పావలా లిస్తారు. ఇక చింతలేదు" అన్నాడు రంగడు.

దత్తు నిర్ఘాంతపోయినాడు.

"ఆ సంపాదనతో ఎట్లా బతుకుతావు? కాపరం ఎట్లా చేస్తావు?" అన్నాడు

"కాపరమేమిటీ?నా పెళ్ళాన్ని నేను పోషించను. దానికి పొలమిచ్చేశాను. దాని దారి దానిదీ, నా దారి నాదీ? పని చాతయితే రూపాయో, రూపాయిన్నరో కూడా సంపాదించవచ్చు. ఇంకేం కావాలి?" అన్నాడు రంగడు నిశ్చింతగా.

ప్రచురణ : (ప్రచురణ తేదీ అలభ్యం) కథాసాగరం సంపుటి నుంచి
దేశి కవితా మండలి, విజయవాడ.

# కొత్త జీవితం

అది ఫ్యాక్టరీ కూలీలకోసం పెట్టిన హోటలు. అక్కడ అర్ధణాకు "చా" దొరుకుతుంది. అణా పెడితే కాసిని "భజ్యా" తిని "చా" తాగవచ్చు. సాహసించి ఇంకో అర్ధణా ఖర్చు పెట్టదలచినవాడు "పావ్‌ఉసల్"తో పొట్టనింపుకుని "చా" తాగి పోవచ్చు. "భజ్యా" అంటే శనగపిండితో చేసిన పకోడీలు. "పావ్" అంటే నాలుగౌన్సుల రొట్టె. "ఉసల్" అంటే శనగలుగాని, అల్చందలుగాని వేసి నీటితో మరగ బెట్టిన కూర. అందులో రొట్టె ముంచుకు తినవచ్చు.

ఉదయం ఏడున్నరకల్లా ఫ్యాక్టరీ పనివాళ్ళు ఒక్కొక్కరే వచ్చి కూచుని హిందీలోనూ, మహారాష్ట్రిలోనూ తమకు కావలసిన ఆహారపదార్థాలు అతి తొందరగా ఆర్డరివ్వసాగారు. పదార్థాలందించేవాడేకాక, గల్లాదగ్గర కూర్చున్నవాడు కూడా "ఏక్ గ్లాస్ పానీదే. ఏక్ లెమన్ దో!" అని కేకలు పెడుతూ, తినేవాళ్ళ అవసరాలు కనుక్కుంటున్నాడు.

ఈ హోటల్లోకి ఒక కుర్రాడు వచ్చాడు. అందరి కళ్ళూ వాడు తొడుక్కున్న కొత్తచొక్కామీదా, కొత్త ధోవతిమీదా పడ్డాయి. కాని వాడి పల్లెటూరి మొహం తెలిసిపోతూనేవుంది. కుర్రాణ్ణి ఒక గుండ్రని బల్లదగ్గర కూర్చోబెట్టి వస్తువులందించేవాడు, "కాయ్ పాహిజేమలా?" అని అడిగాడు.

కుర్రాడికి ప్రశ్న అర్థమయిందిగాని వాడు వెంటనే సమాధానం చెప్ప పోయాడు. వాడు మొహానికి అడుగున్నర దూరంలో పెద్ద గాజు జాడీనిండా తెల్లటి మజ్జిగ పోసి పెట్టివుంది. బల్లమీద పరచిన చలవరాతి పలకలూ, నేలమీద పరచిన నున్నటి కృత్రిమ చలవరాతి పలకలూ వాడికి ఆశ్చర్యం కలిగించాయి. ఈ హోటలుకు జమీందార్లుకూడా వస్తారని వాడికి దృఢవిశ్వాసం కలిగింది. బల్లల దగ్గర కూర్చున్నవాళ్ళల్లో జమీందార్లెవరన్నా వున్నారేమో చూతామంటే మజ్జిగ జాడీ మూలంగా సాధ్యపడలేదు.

"ఏం కావాలి!" అని మళ్ళీ అడిగాడు వస్తువులందించేవాడు.

"ఏమున్నయ్!" అన్నాడు కుర్రాడు. హోటలువాడు అన్నీ ఏకరువు పెట్టాడు. "పూరీ, శిరా, బటాటా, పావ్, ఉసల్, భజ్యాస, చా, లెమన్, తాక్, షర్బత్..."

కుర్రాడు జాగర్తగలవాడు. అన్నిటిధరలూ కనుక్కొని రెండణాలన్నా తేడా రాకుండా ఆర్డరిచ్చాడు.

హోటలునుంచి ఫ్యాక్టరీకి ఎంతో దూరంలేదు. కొండపక్కగా వెళ్ళే అందమైన రోడ్డు నేరుగా ఫ్యాక్టరీల దగ్గిరికి తీసుకుపోతుంది. రోడ్డుపక్క వరసగా ఇళ్ళవి ఇళ్ళున్నాయి. కొత్తగా కట్టినవి, చాలా అందమైనవి. వాటినిదాటి ఒక ఫర్లాంగు పోతే రెండు ఫ్యాక్టరీలు ఒకదాన్నానుకుని మరొకటి వున్నాయి. ఒక అరఫర్లాంగు అవతల మూడో ఫ్యాక్టరీ వుంది. ఆ రోడ్డువెంబడి వచ్చాడు కుర్రాడు. వాడి కేదన్నా కూలి పని కావాలి.

మొదటి ఫ్యాక్టరీ నిర్జీవంగా కనిపించింది. రెండో ఫ్యాక్టరీ గేటుకెదురుగా రోడ్డు ఆవలివేపున నలుగురైదుగురు మనుషులు నిలబడి వున్నారు. వాళ్ళూ పని కోసమే నిలబడి వున్నారని మన కుర్రాడికి తెలీదు. వాడు గేటుదగ్గర నిలబడి వున్న పఠానువాణ్ణి గమనించకుండా గేటుదగ్గరికిపోయి లోపలికి తొంగిచూశాడు. లోపల చాలా అందంగా వున్నది. ఒక పక్కగా చిన్న కంచెమీద అందమైన లత ఒకటి పాకుతున్నది. దాని వెనక కొన్ని తొట్ల మొక్కలు చక్కగా పెట్టారు. ఫ్యాక్టరీ చాలా లోపలిగా వున్నది.

"పనిచేస్తే ఇటువంటి ఫ్యాక్టరీలో పనిచెయ్యాలి" అనుకున్నాడు వాడు. పెట్టి పుట్టిన పనివాళ్ళు అటువంటి చోట పనికి కుదురుతా రనుకున్నాడు.

ఇంతలో - పఠాన్ గొంతు వినిపించింది.

"ఏయ్, ఏంకావాలి?"

కుర్రాడికి హిందీ ఏమీ రాదు. కాని ప్రశ్న అర్థమయింది.

"పని" అన్నాడు వాడు.

"పోయి వాళ్ళ దగ్గర నిలబడు...అదుగో యజమాని కారు. వెళ్ళు. వెళ్ళు. వెళ్ళు."

కంగారుతో కుర్రాడు రోడ్డుదాటి అవతల పడ్డాడు. వాడవతలికి వెళ్ళిన తక్షణంలోనే నల్లని కారొకటి అతివేగంగా వచ్చి గేటులోకి తిరిగి లోపలికి వెళ్ళిపోయింది.

ఆ కారులోవున్న "మాలిక్" తనను గేటుదగ్గర చూసి కోపం తెచ్చుకున్నారేమో. తనకు పని యివ్వడేమోనని కుర్రాడికి బాధకలిగింది. ఆ నల్లకారు కింద పడ్డా వాడికంత బాధ కలిగివుండదు.

# 2

ఫ్యాక్టరీలముందు నిత్యమూ పనికోసం నుంచునే వాళ్ళను చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. ఆ ఫ్యాక్టరీలలో ఏంచేస్తారో వారికి అవసరంలేదు. అతి వనస్పతి ఫ్యాక్టరీ గానీ, లోహపు ఫ్యాక్టరీ గానీ, బట్టలమిల్లుకానీ వాళ్ళకు ఒకటే. చదువు వెంట పెట్టుకు పొయ్యేవాడికి ఉద్యోగం దొరకదగిన స్థలాలూ, దొరక దగని స్థలాలు అంటూ వుంటాయి. వాడు తనవెంట ఏదో తెచ్చుకుంటాడు. పారి శ్రామికకూలీ తన కండలూ, ఎముకలూ తప్ప యింకేమీ తీసుకురాడు. గొట్టం లోంచి పొగలువచ్చే ఏ చోటైనా వాడికి పోదగిన చోటే. ఏ చోటు అచ్చివచ్చేదీ, ఏది అచ్చిరానిదీ దైవాధీనం. ఒక ఫ్యాక్టరీలో నాలుగురోజులే వుండవచ్చు. మరో ఫ్యాక్టరీలో నాలుగు నెల లుండవచ్చు. కాని కాలక్రమాన ఏదీ అచ్చిరాని చోటే. ఎందుచేతనంటే నాలుగేళ్ళు ఏ ఫ్యాక్టరీలోనూ వుండడు. ఆ తరువాత మళ్ళీ జీవితం ఎప్పటిచోటికి రావటమంటే పనివాడు తన కండలన్నీ వున్నవి వున్నట్టు వెనక్కి తెచ్చుకుంటాడనికాదు. అది ఎన్నటికీ జరగదు. అంతో యింతో రక్తమూ, కండలూ ఫ్యాక్టరీకి ముట్టవలసిందే. ఫ్యాక్టరీల నుంచి బయటికివచ్చే సమయానికి పొరపాటున నాలుగుడబ్బులు జేబులో మిగిలినా అవి పూర్తిగా అయిపోతేగాని మళ్ళీ యింకోచోట పని కుదరదు. ఇది కూలివాళ్ళకు అమ్మవారి శాపం. సులభంగా పని దొరికే యుద్ధకాలంలోనే ఈ విధంగావుంటే యితర సమయాల సంగతి వేరే చెప్పాలా?

ఆ ఫ్యాక్టరీ బయట పనికోసం నిలబడ్డవారిలో ఒకరిద్దరు చాలా రోజుల నుంచి పని దొరకనివారున్నారు. ఫ్యాక్టరీ ప్రారంభమై అరగంటలోగా పని దొరికేదీ లేనిదీ తెలిసిపోతుంది. ఆ తర్వాత యింకోచోటికి వెళ్ళి లాభం వుండదు. అంతా లాటరీ.

ఈ లాటరీలో మన కుర్రాడి అదృష్టం బాగున్నది. యజమాని కారు లోపలికి వెళ్ళిన కొద్దిసేపట్లో లోపలినుంచి ఎవరో వచ్చి నిలబడి వున్న వాళ్ళకేసి ఒకసారి చూసి "తుమ్ ఆవ్. తుమ్ ఆవ్" అని మన కుర్రవాణ్ణి, మరొక యువకుణ్ణి లోపలికి పిలుచుకు వెళ్ళాడు. ఇది బొత్తిగా లాటరీ అనటానికి కూడా వీలులేదు. ఇది ఫ్యాక్టరీ స్వయంవరం. ఇందులో కండపుష్టి, యవ్వనమూ చప్పున ఆకర్షిస్తాయి. లోపలికి పోయిన తరువాత ఆ మనిషి మన కుర్రవాడివంక తిరిగి చాలా తొందర పనిమీద ఉన్నవాడల్లే మాటాడుతూ, "నీ పేరేమిటి?" అన్నాడు.

"విఠల్ పాండురంగ్."

"ఎప్పుడన్నా ఫ్యాక్టరీ పనిచేశా!"

"లేదు."

"రోజుకు మూడు పావలాల్లు మజూరీ. మూడు పావలాలు మూంగాయి, ఈ ఖాతలో పనిచెయ్యి."

తనకు నిజంగా యెంతో గౌరవం జరిగినట్టు భావించుకున్నాడు విఠల్. రోజుకు రూపాయిన్నర చొప్పున నెలకు? కనీసం 25 రోజులు పనిచేసినా ముప్పై ఏడున్నర అయింది! ఏడాదికి? 450 రూపాయలు! తమ ఊళ్ళో ఆడా. మగా, పిల్లా మేకా కలిసి ఏడాది పొడుగునా, వొళ్ళువిరుచుకున్నా పొలంపనిలో అంత గాదే! ఎంత అదృష్టం...అదీ కాక ఎటువంటి పని! ఎంత తెలివైన పని! ఎంత శుభ్రమైన చోటు! మట్టిలేదు. బురదలేదు. ఫ్యాక్టరీ వొదిలిన మరుక్షణం చీకూ చింతా లేదు. రోజుకు ఎనిమిది గంటలు! తమ పల్లెటూళ్ళో పనికి అంతూ పంతూ వుందా? ఎంత చేసినా తరగదు. ఈ పట్టణంలో ఎన్ని బస్సులు, ఎన్ని ట్రాములు, ఎన్ని సినిమాలు! ఎంత బస్తీ ..

ఒక మూల ఆవరణలోనే ఒక లారీ నిలబడి వున్నది. ఆ లారీనిండా లోహపు అచ్చులున్నాయి. నలుగురు పనివాళ్ళు లారీలోకి ఎక్కి ఆ అచ్చులను కిందవున్న కూలీలకు అందిస్తున్నారు. కిందవున్న పనివాళ్ళు వాటిని లోపలికి తీసుకుపోయి పేరుస్తున్నారు. అవి రాగిదిమ్మలు. ఎర్రగా వున్నాయి. లోపలికి చేరవేయమని విఠల్‌ను నియోగించారు. ప్రతి కూలివాడూ ఒక్కొక్క చేత్తో ఒక్కొక్క దిమ్మను పట్టుకుని వగర్చుకుంటూ పోతున్నాడు. రెండు మూడుసార్లు విఠల్ కూడా రెండేసి చొప్పున పట్టుకుపోయినాడు. కాని ఆ దిమ్మలను రెండు చేతులకూ అడ్డంగా పెట్టేవాళ్ళంటే మూడేసికూడా మొయ్యవచ్చు ననిపించింది. ఈసారి లారీదగ్గరికి వచ్చినప్పుడు విఠల్ చేతులు రెండూ ముందుకు పెట్టి వాటి మీద దిమ్మలు పెట్టమని లారీలో నిలబడ్డ కూలీకి సూచించాడు.

"చాల్లే, గొప్ప పనివాడివి! అందుకో" అన్నాడు లారీలోవాడు.

"మూడేసి పట్టుకుపోతా" అన్నాడు విఠల్.

"అందరూ చేసినట్టు చెయ్యి" అన్నాడు లారీలోవాడు, తానే విఠల్ భుజం మీనిలాగా. విఠల్ నిరుత్సాహపడ్డాడు.

# 3

విఠల్ పనిలో ప్రవేశించి నాలుగురోజులయింది. అప్పటికి వాడికి ఫ్యాక్టరీ కొత్త తీరింది. మనుష్యుల కొత్తా తీరింది. కాని ఫ్యాక్టరీ పని వైనం వాడికర్థం కాలేదు. ఇది మనిషి చెయ్యగల పనేగాని మనుషులు చేసినట్లు చేసేపని కాదు. ఈ పని ఎవరో తరుముకొస్తున్నట్టుగా చెయ్యాలిసిన పని. పాటలు పాడుతూ, మాట్లాడుతూ చేసేపని కాదు. ఇష్టమై చేసినట్టుగా చేసేపని కాదు. అందుచేత

మాలు ఈ ఫ్యాక్టరీ కూలీలు తాము చేసిన పనిమీద ఏదో పగ వున్నట్టు చేస్తారు గాని ఆప్యాయంగా చెయ్యరు. చేసేపని గురించి మాట్లావరు. మాట్లాడినా గునుస్తూ మాట్లాడతారు.

మిగిలిన పనివాళ్ళు మొట్టమొదటిరోజు తనను చాలా వేళాకోళం పట్టించారు. మొదటి కారణం తన దుస్తులు.

"నీవు కూలీవా ముకద్దమువా? అని అడిగారు వాళ్ళు నవ్వుతూ. ఒక పెద్ద వాడు "రేపట్నుంచి పనిచేసే గుడ్డలు వేరే తెచ్చుకో-ఇక్కడ నిజంగా పనిఉంటుంది" అన్నాడు చాలా మంచిగా. నిజానికి వాళ్ళందరూ కుళ్ళుగుడ్డలే వేసుకున్నారు. వాళ్ళే కాదు, "సాబ్"లు కూడా కుళ్ళుగుడ్డలే వేసుకున్నారు.

మిగిలిన పనివాళ్ళు ఏ తరగతినుంచి వచ్చిందీ విఠల్ గ్రహించలేక పోయ డాడు. కాని వాళ్ళెవ్వరికీ తనకున్న హోదా ఇంటిదగ్గర లేదేమో అనిపించింది. ఇంటి దగ్గర తనవాళ్ళు గౌరవ కుటుంబీకులు. కాకపోతే కొద్ది పొలంమీద చాలా మంది పడి తినటంచేత కొంత అప్పయింది. తన ఉత్సాహం కొద్దీ తాను పట్నం వచ్చాడుగాని తన నెవరూ పొమ్మనలేదు. ఏ రోజు తన కిష్టం లేకపోతే ఆ రోజు తానీపని మానేసి ఇంటికి పోతాడు. కాని పాపం, వీళ్ళ గతేమిటి? వీళ్ళలో చాలా మంది ఎన్నో ఏళ్ళుగా ఈ చాకిరీ చేస్తున్నారు. ఈ పని లేకపోతే వీళ్ళు వీధిలో నిల బడి అడుక్కుతినాలి.

మచ్చుకు "భయ్యా" ఉన్నాడు. వాడు వెయ్యిమైళ్ళ దూరంనుంచివచ్చి ఇక్కడ పడ్డాడు. వాడు వేలిముద్రగాడు. చదువు రాకపోవడమేగాక వొట్టి మట్టి బుర్ర. అందరూ ఏడిపిస్తారు. బండపని వాడికి చెబుతారు. వాడికి అలుపంటే ఏంటో తెలీదు. వాడు వచ్చి ఎన్నో రోజులు కాలేదు. పనిలో చేరింది లగాయతు వాడు అర్ధణా పెట్టి టీ తాగిన పాపాన పోలేదు. ఇన్నాళ్ళూ వాడు తిండికూడ తినటం లేదుట. తనగదిలో - ఇంకా ఆరుగురు కూడా ఆ గదిలోనే ఉంటున్నారు - వాడు శనగలు నానేసుకొని అవే తింటున్నాట్ట. వెధవకు తెగులు పుట్టుకొచ్చి మొహమంతా ఉబ్బింది. కళ్ళవెంట పుసులు కారసాగాయి.

"నీకేం బుద్ధిలేదా? శనగలు తింటే చచ్చిపోతావు. నీకు పెళ్ళామా, పిల్లలా? సంపాదించినదంతా హాయిగా తినలేవూ? రాయంటి వొళ్ళు మట్టి చేసుకుంటావు. జాగర్త" అని "చాచా" వాణ్ణి గట్టిగా కోప్పడ్డాడు.

"చాచా" పఠాన్. పేరు రహమాన్. అందరూ "చాచా" అని పిలుస్తారు. వయస్సు 62. 1914 యుద్ధంలో[1] యుద్ధ రంగాన రైళ్ళు నడిపాడు. ఇప్పటికీ పుష్టిగా, బలంగా ఉన్నాడు. ఒకనాడు "చాచా" విఠల్‌కు తనకథ చెప్పాడు.

---

1. మొదటి ప్రపంచ యుద్ధ ప్రారంభం.

యుద్ధం నుంచి తిరిగి వెళ్ళిన తరవాత "చాచా" తాను మిగుల్చుకున్న డబ్బుతో సరిహద్దున కొంత పొలం కొన్నాడు. పత్రాలూ, సాక్ష్యాలూ లేవు. అక్కడివాళ్ళకి కచ్చేరీలలో నమ్మకం లేదల్లే ఉంది. పొలం అమ్మినవాడు ఏదో పేచీపెట్టి "చాచా"ను పొలంమీది నుంచి పంపించాలని చూశాడు. "పొలంలోకి అడుగుపెడితే చంపుతా" అన్నాడు "చాచా". పొలం అమ్మినవాడి మనిషి వచ్చి "చాచా" చెయ్యి పట్టుకుని, "ఒకసారి అవతలికి రా, ఒక్కమాట వినిపోదూగాని" అన్నాడు.

"చెయ్యి వదులు" అన్నాడు "చాచా".

వాడు వదల్లేదు. రెండో చేతిలో ఉన్న కర్రతో "చాచా" వాడి మనికట్టుకు ఎగువగా ఒక్కటే దెబ్బ పెట్టాడు. వాడి చెయ్యి విరిగింది. "చాచా"ను మూడేళ్ళు ఖైదులో ఉంచారు.

ఖైదులోనుంచి వస్తూనే "చాచా" కొత్త ఉద్యోగం చూసుకున్నాడు - "డాకూ" ఉద్యోగం.

"డాకూ అంటే దొంగకాదు" అన్నాడు "చాచా" గర్వంగా. "అదొక ఉద్యోగం. చాలా కష్టమైన ఉద్యోగం. నీ భార్యాబిడ్డల్ని నువ్వు రహస్యంగా పోయి చూడాలిసిందే గాని, వాళ్ళకు నువ్వుండే చోటు చెప్పటానికి వీల్లేదు."

"డాకూలు ఎక్కడుంటారు?"

"ఎక్కడుంటారు? ఎవరికీ తెలీకుండా కొండల్లోనో, అడవుల్లోనో ఉండాలి."

"ఎవరూ చూడరారూ?"

"రావచ్చు, కాని నాకు అంతదూరంలో నిలబడాలిసిందే. నా సరసన నిలబటానికి వీల్లేదు - తమ్ముడయేది తండ్రి అయేది."

"ఏమల్లా?"

"డాకూ ఎవర్నీ నమ్మడు. డాకూను పట్టిస్తే సర్కారు డబ్బిస్తుంది. దగ్గిర వాళ్ళే కక్కుర్తి పడవచ్చు. అందుచేత, ఎదురుగా నిలబడు! అంతే! పక్కకి రాకు! భుజం మీద చెయ్యి వేశావా?-"

"చాచా" తన భుజం మీద ఎవరో వేసిన చేతిని ఒక్కసారిగా తోసేసి వాడిమీద తుపాకీ బారు చేసినట్టు అభినయించాడు. ఒక్కక్షణం పాటు "చాచా" కళ్ళల్లో, డాకూ చూపు కనిపించినట్టే తోచింది విఠల్‌కు.

# 4

అవకాశం దొరికినప్పుడల్లా విఠల్ లెఖ్ఖవేస్తుండేవాడు. తాను నెలకు హీనంగా పదిరూపాయలు మిగల్చవచ్చు. కొంచెం కష్టపడితే పదమూడు, పద్నాలుగూ కూడా మిగల్చవచ్చు. ఇంటిదగ్గర రెండొందల యాభై బాకీ ఉంది. మిగిలిన డబ్బంతా ఇంటికి పంపివేస్తే రెండేళ్ళలో బాకీ తీరిపోతుంది.

మొదటినెల పన్నెండు రూపాయలింటికి పంపించినప్పుడు విఠల్ ఆనందానికి మేరలేదు. తన గురించి తన తల్లీ, అన్నలూ ఎంత సంతోషిస్తారో వాడు ఊహిం చుకున్నాడు. ఆ మనియార్డరుతో బాటే తానుకూడా వెళ్ళి మొహాలు చూడాలనిపిం చింది. ఇల్లూ, గొడ్లూ, పొలమూ జ్ఞాపకం రాగానే కడుపులో ఏదో ఆవేదన కలి గింది. కాని అభిమానం అడ్డొచ్చింది. అప్పు తీర్చిగాని ఇంటికి తిరిగిపోరాదు. కనీసం సగం అప్పన్నా, అధమం యాభైరూపాయలన్నా చెల్లువేసి మరీ వెళ్ళాలి. ఏంలేదు. తనకు శలవెవరిస్తారు? ఒకవేళ ఇచ్చినా ఇంటికి వెళ్ళిరావాలంటే ఒక నెల మిగిల్చేదంతా ఖర్చన్న మాటే. నెలల్లా చేసిన శ్రమంతా వృధా!

రెండో నెల గడిచింది. మూడోనెలా నాలుగో నెలా కూడా గడిచాయి యిప్పుడు విఠల్‌కు ఒంట్లోవున్న జవసత్వాలు లేవు. ఆ "చా" దుకాణంలో తినేదీ తనకు పడటంలేదు. ఒక్కసారి యింటితిండి తినటానికైనా వెళ్ళిరావాలనిపించింది. కాని ఎట్లా? మొదట్లో ఫ్యాక్టరీనుంచి ఇంటికి వెళ్ళేటప్పుడే నీరసంగా ఉండేదిగాని, తెల్లవారి నిద్రలేచిన తర్వాత ఉత్సాహంగానే ఉండేది. ఇప్పుడిప్పుడు వాడికి నిద్రవల్ల శరీరం బడలిక తీరటం లేదు.

"వెధవతిండి, వెధవపని, వెధవబతుకు!" అనుకునే వాడు విఠల్. తిండి కన్నా, పనికన్నా ఈ బతుకే వింతగా ఉండేది వాడికి. తాను యిక్కడ ఎట్లా బతుకుతున్నదీ చెబితే యింటిదగ్గర ఎవరూ నమ్మరు. ఈ జీవితం శుద్ధ అబద్ధ మనీ, ఇట్లా జీవిస్తూ తాను మారువేషం వేస్తున్నాననీ విఠల్ భావించాడు. ఆ బాకీ తీరిన మరుక్షణం తాను ఫ్యాక్టరీకి చిన్న సలాంకొట్టి యింటికి తిరిగిపోతాడని తన తోటి పని వాళ్ళెరగరు. తాను ఇక్కడ ఏ విధంగా జీవిస్తున్నదీ యింటి దగ్గర తన వాళ్ళకు తెలీదు.

ఇప్పటికి తాను 30 రూపాయల బాకీ తీర్చేశాడు. ఇక ఇంటికి పోతేనేం? ఆ బాకీ అంతా తీర్చాలని తనలో తాను శపథం చేసుకున్నాడేగాని ఎవరూ తన చేత చేయించలేదు. అదంతా తాను తీర్చెయ్యవలసిన అగత్యం కూడా లేదు. కాని ఇంటికి పోదామని నిశ్చయం చేసుకున్నప్పుడల్లా విఠల్ అంతరాత్మ "నువు మనిషివి కావా?" అని అడిగేది.

విఠల్ ఈ సందిగ్ధంలో ఉండగా సమ్మె వచ్చింది. ఆ రోజుల్లో సమ్మెలు చీటికీ మాటికీ జరగటంలేదు. ఇది కార్మిక నాయకత్వంతో కూడిన అధికార సమ్మె కూడా కాదు. డిసూజా అను ఫోర్మనుకూ ఒక పనివాడికీ కొద్ది రోజులుగా ముసు గులో గుద్దులాట జరుగుతూ అది ఒకనాడు "నువ్వంటే నువ్వు" అనుకునేదాకా వచ్చింది. ఫ్యాక్టరీ యజమాని డిసూజా పక్షమై ఆ పనివాణ్ణి తొలగించాడు.

నోటీసైనా లేకుండా అప్పటి కప్పుడు పనివాళ్ళంతా సమ్మె నిర్ణయించారు. ఎక్కడి వాళ్ళక్కడ పని వదిలేసి ఆవరణలోకి వచ్చారు. అందరూ తలా ఒక్కమాటా మాట్లాడుతున్నారు. ఇద్దరేసి, ముగ్గురేసి, నలుగురేసి ముఠాలుగా చేరి, అవుననీ కాదని ఘర్షణ పడసాగారు.

ఫ్యాక్టరీ మేనేజరు బయటికి వచ్చి, "ఒక్క నిమిషంలో లోపలికి వచ్చి పని చెయ్యని వాళ్ళందర్నీ బయటికి పంపించేస్తాను" అన్నాడు. కొంతమంది లోపలికి వెళ్ళారు. విఠల్ కూడా వాళ్ళతోబాటు లోపలికి వెళ్ళాడు. మిగిలినవాళ్ళను బయటికి పొమ్మన్నాడు.

తీరా లోపలికి వచ్చిన తరువాత విఠల్ ఆశ్చర్యపడ్డాడు. లోపలికి వచ్చిన వాళ్ళు ఇరవైమంది కూడా లేరు. దాదాపు యాభైమంది వెళ్ళిపోయారు. అందరూ లోపలికి వస్తారనుకున్నాడు విఠల్. "సాబ్" మాటకు కూలీలు ఎదురు చెప్పట మంటూ ఉండదని విఠల్‌కు సందేహం కూడా కలగలేదు. ఈ సంగతి ముందు తెలిస్తే తాను కూడా బయటికే వెళ్ళేవాణ్ణనుకున్నాడు విఠల్.

రెండు గంటలపాటు ఫ్యాక్టరీలో ఏ పనీలేదు. ఫ్యాక్టరీకేదో పెద్ద సుస్తీచేసి నట్టయింది. లోపల్నుంచి బయటికీ. బయటినుంచి లోపలికీ ఏం రాయబారాలు జరి గాయో విఠల్ ఎరగడు. రెండు గంటలు దాటిన తరువాత ఫ్యాక్టరీ బయట పెద్ద పెడబొబ్బ వినిపించింది. బయటికి పోయినవాళ్ళంతా పరిగెత్తుకుంటూ లోపలికి వచ్చారు. "జీత్‌గయా, సాలా!" అనే ముక్కే ప్రతినోటా వినిపించింది. పనివాళ్ళలో అంత ఉత్సాహం విఠల్ ఎన్నడూ చూడలేదు... సమ్మె అయిపోయింది తీసిన మనిషిని మళ్ళీ పనిలోకి రానిచ్చారు....

ఒక మహారాష్ట్రి పనివాడు నేరుగా విఠల్ దగ్గరకు వచ్చి ఎందుకో చెప్ప కుండా మహారాష్ట్రి భాషలో తిట్టిపొయ్యసాగాడు. నాకేమీ తెలియదుబాబో, అని విఠల్ ఎంత చెప్పినా వాడి ధోరణి ఆగలేదు. అందరూ సమ్మెచేస్తే తాను చెయ్య నందుకు యజమాని తనకు మెచ్చి మేకతోలు కప్పకపోయినా, పనివాళ్ళకు చాలా కోపం తెప్పించినట్లు విఠల్ గ్రహించేడు. ఇదొక పీడగా తోచింది వాడికి. వీళ్ళంతా ఎందుకు పని మానాలో విఠల్‌కు నిజంగా అర్థంకాలేదు. కాని పైకి ఆ మాట అనలేదు. ఫ్యాక్టరీ పనిలో పనివాళ్ళ జులుం ఒకటి విధిగా ఉంటుందని మాత్రం వాడు గ్రహించాడు.

ఇంకో రెండునెల్లు గడిచింది. విఠల్ తల్లికి సుస్తీగా ఉందని ఉత్తరం వచ్చింది. అసలే పెద్దది. విఠల్ ఆఖరుబిడ్డ. వాడికి తల్లిని చూస్తే పంచప్రాణాలు.

"చాచా, మా అమ్మకు జబ్బుగా వుంది. నేను వెళ్ళాలి. ఎట్లా ?" అన్నాడు విఠల్.

"శలవు పెట్టి పో, ఫోర్మన్‌తో చెప్పు. జీతం మట్టుకు రాదు" అన్నాడు చాచా.

"వెధవ జీవితం ! అన్నాడు విఠల్.

వాడికి వారంరోజులు శలవు దొరికింది. ఆరోజు సాయంకాలమే స్వగ్రామా నికి బయలుదేరాడు.

# 5

తిరిగి స్వగ్రామం కంటపడగానే విఠల్ గుండెకేదో అయింది. అంతా నిన్న చూసినట్టే ఉంది. ఒక్క రవ్వయినా మార్పులేదు. ఎంతోమంది ఎరిగినవాళ్ళు కనిపించారు. నిన్న కూడా తనను చూసినట్టే మాట్లాడారుగాని తనను కొత్తగా చూడలేదు. "ఎల్లావుంది పట్నం ?" ఈ ఒక్క ప్రశ్నే వాళ్ళు వేసింది. కొద్దిమంది మాత్రం, "ఎందుకెళ్ళావురా పట్నం ?" అని అడిగారు. విఠల్‌కు ఏమీ ఉత్సాహ కరంగా లేదు. ఇంటికెళ్ళాడు.

నడవలో తల్లి తన రెండోకూతురి పిల్లని ఒళ్ళో పెట్టుకుని ఏదో తినిపిస్తు న్నది. మనిషి మామూలుగానే ఉంది. జబ్బేమీ ఉన్నట్టు కనబడలేదు.

"అమ్మా నీ జబ్బెట్లా ఉంది ?" అని తల్లి నడిగాడు విఠల్.

"ఏం జబ్బురా ?.... అదప్పుడే పోయింది. వచ్చావేం ?" అన్నది తల్లి.

విఠల్‌కు ఏదో అర్థంగాని బాధ కలిగింది.

"వారంరోజులే శలవు తీసుకున్నా" అన్నాడు విఠల్, యింతేనా అని తల్లి అంటుందేమోనని.

"అట్లాగా?" అన్నది తల్లి. "అట్లా అయితే నీకు కావలసిన వన్నీ చేయించుకు తిను. అక్కడి తిండి ఎట్లా ఉంటుందో !"

"తిండిమాట అడక్కు ! చాలా అసహ్యం." అన్నాడు విఠల్.

తల్లి కొడుకెక్కేసి జాలిగా చూసింది. కొడుక్కు కొంత ఉపశాంతి కలిగింది.

ఇంతలో పెద్దన్న వచ్చాడు. తమ్ముణ్ణి చూడగానే, "అయిపోయింది నౌకరీ?" అన్నాడు చాలా నిరాశ కనబరుస్తూ, "నేనసలు వెళ్ళొద్దనే అన్నాను."

"శలవు తీసుకొచ్చా. వెళ్ళితే ఏం నష్టమయిందీ? దాదాపు యెనభైరూపాయ లప్పు తీరిందా. లేదా?" అన్నాడు విఠల్. తాను డబ్బు పంపిన సంగతి వాళ్ళెవ్వరూ స్మరించేటట్టు లేరు.

"ఇట్లా తీతే అప్పా అదీ?" అంటూ అన్న లోపలికి వెళ్ళాడు.

"ఏమిటమ్మా? నేపంపిన డబ్బుతో బాకీ తీర్చలేదా?" అన్నాడు విఠల్ తల్లితో.

తల్లి పెద్దగానవ్వి, "తీరుద్దామనే అనుకున్నాంగాని, ఏదో ఓఖర్చు వచ్చింది. నువు పెద్దవాడివై సంపాదిస్తున్నావుగా? తీర కేం జేస్తుందిలే?" అన్నది, చాలా ధైర్యంగా.

"ఒక్క రూపాయి కూడా బాకీ కింద చెల్లపెట్టలేదా?" అన్నాడు, విఠల్ ఆశ్చర్యంతో.

"ఇంకా లేదు," అన్నది తల్లి నిబ్బరంగా.

"నే పంపినదంతా ఏమయినట్టు?" అన్నాడు విఠల్ చిరాకుతో.

"నేను పారేశానుట్రా? నువు మొదటిసారి పంపించినప్పుడు మీ మామ వాళ్ళిక్కడే ఉన్నారు. దాని కూతురు చేతులు ఒట్టిగా బోసిగా ఉంటే, ఇంకా రెండు రూపాయలువేసి చేతులకేవో చేయించా. పెద్దకూతురంటే పడిచస్తుందంటా రని గౌరి కూతురికూ్కడా రెండోనెల్లో ఏదో చేయించా. ఆడపిల్లలకే పెడుతుం దంటారని ఇంట్లో పిల్లలకి ఇవీఅవీ కొన్నా. పైకం నా పేర పంపించావు కనక కాస్త నా పెద్దరికానికి తగ్గట్టు చేశామరి, బాకీ తీర్చమని నువ్వేమన్నా రాశావా?" అన్నది తల్లి కొంచెం దెప్పుగా.

విఠల్‌కు చాలా ఆశాభంగం కలిగింది. చూస్తున్నకొద్దీ తనవాళ్ళంతా వొట్టి ఆశపాతకులుగాను, దోపిడిగాళ్ళుగానూ, ఇతరుల కష్టసుఖాలు తెలుసుకోలేనివాళ్ళు గానూ కనిపించారు. తనను ఆరునెల్ల తరువాత చూసి ఒక్కప్రాణి అయినా నిజంగా సంతోషించలేదు. అందరూ కలిసి సంపాదించినంత తాను ఒక్కడూ సంపాదిస్తే ఒక్కరు మెచ్చుకోలేదు. తాను చమటోడ్చి, గడ్డి తిని సంపాదించిన డబ్బు వెనకా ముందూ చూడకుండా అలాములు, పలాములు చేశారు.

విఠల్ తన ఫ్యాక్టరీని జ్ఞాపకం తెచ్చుకున్నాడు. ఒక్క కూలివాణ్ణి తీసి నందుకు ఫ్యాక్టరీలోవున్న కూలీలంతా బయటికి నడిచారే! వాళ్ళా మనుషులు వీళ్ళా? తన మీద 'చాచా' కున్న అభిమానంలో నూరోవంతు ఇంట్లో వాళ్ళందరికీ కలిపినా ఉన్నదా?

"వీళ్ళనని లాభంలేదు. ఇక్కడ జీవితమే ఇంత. నేనూ ఇటువంటివాణ్ణేగా-ఆరునెల్ల కిందటి దాకా! ఇక్కడ ఉండి లాభంలేదు."

మర్నాడే విఠల్ పట్టణానికి ప్రయాణమైనాడు.

"అప్పుడేనా?" అన్నా రందరూ. కాని వాళ్ళకు తాను నిజంగా ఉండిపోవాలని ఉన్నట్టు విఠల్‌కు తోచలేదు.

"కాదు. వెళ్ళాలి! రోజుకు రూపాయిన్నర నిష్కారణంగా పోతుంది.... అమ్మకు జబ్బుండే వచ్చా గాని రాకనే పోదును" అన్నాడు.

"అట్లా అయితే వెళ్ళు, పాపం!" అన్నా రందరూ.

విఠల్ ఈసారి నిజమైన పారిశ్రామిక కార్మికుడుగా పట్నం ప్రవేశించాడు. పట్నం అతన్ని తన గర్భంలో దాచుకున్నది. అతని దగ్గర్నుంచి తల్లికి మళ్ళీ ఒక్క ఎర్ర ఏగానీ కూడా మనియార్డరు ద్వారా చేరలేదు.

ముద్రణ : ఆగష్టు 1950, ఆంధ్రజ్యోతి మాసపత్రిక.

# మాయపొర

"ఇంకా ఏమోననుకున్నా, ఆ రాధాకిష్టమూర్తి బొత్తిగా నాసిరకం"....

"వొట్టి కుళ్ళుమోతు, ఇంకోడు తనకన్న బాగా పాడితే సహించలేడు!"....

"ఎట్లా తెలుసా? అడిగి కనుక్కోవాలా ఏమిటి? ఈ రెండు నెలల్లోనూ ఒకసారి మాటవరసకైనా నన్ను పాడమని అడగలేదు తన మాదిరిగా అంద్రా సైగల్ను కాకపోవచ్చు గాక, అంతో ఇంతో పాడతాను గద! -

లేక, నా పాట విని తన పెళ్ళాం మోహిస్తుందని భయమో!... నాకు తెలీదనుకున్నావా? వొట్టి అనుమానం మనిషి."

"ఈ రెండు నెల్లనుంచీ నేను రోజూ వెళ్ళి చూస్తూనే ఉన్నాగా నాటక మంతా?" ...

"పిసినిగొట్టు కూడానూ....రోజూ నేను ఒయ్యేదేర వీసేదాకా కాఫీ హోటలుకు లేవడు. అప్పుడైనా ఏదో వంక చెబుతాడు, పడిస్నర అయింది, భోజనంవేళ అయింది, ఇప్పుడేం కాఫీహోటలంటాడు. రావలిస్తే కాపీ ఇంట్లో పెట్టిస్తానంటాడు. తీరా వచ్చినాక మొహమాటానికి పిల్ల తను పిసుకేని పప్పేస్తాడు - ఏడుస్తూనూ" అన్నాడు నా మిత్రుడు.

"కాపీ హోటలుకు పిలుచుకుపొయ్యేవాడు తప్పించుకోక తప్పుతుందా? ఏడుస్తూ అయినా ఇప్పుకోవలసిందే," అన్నా.

నా మిత్రుడు నాకేసి కొంచెం వింతగా చూసి ఏదో అనబోయి నోరు తెరిచి మళ్ళీ మూశాడు.

"రెండునెల్ల నించీ రోజూ ఇదే వరసా?" అని అడిగా.

"రెండు నెల్లనించి రోజూ ఇదే వరస!" అన్నాడు, నా అమూల్య మిత్రుడు.

ముద్రణ : 27 జులై 1947, ఆనందవాణి.

# భక్తాగ్రేసరుడు

## (ఒక అభూత కల్పన)

యవ్వనమంతా విషయవాంఛల్లో గడిపిన భోగి నడివయస్సులో తనదృష్టి భగవంతుడిమీదికి మళ్ళించి భక్తుడైనాడు. భక్ష్యభోజ్యపానీయాలూ, స్త్రీలూ ఆనందంలో కొత్త అనుభవం యిచ్చే ఆశ తీరిపోగానే భోగి భక్తుడుగా పరిణమించాడు.

ఐహిక సుఖాలు తన నింకా ఏ మాత్రమో ఆకర్షిస్తూ ఉండటం గ్రహించి భక్తుడు వాటిని తీవ్రంగా నిరసించసాగాడు.

భక్తిలో అతనికి నిజమైన ఆనందం కనిపించక కాదు. కనిపించింది. అపారంగా కనిపించింది.

నువ్వుల్లోనించి వచ్చే నూనెకు అంతున్నది. ఇసుకలోనించి వచ్చే తైలానికి అంతేలేదు. కవిగా దన్నట్టు వినపడే సంగీతం మధురంగా ఉంటుంది; వినిపించని సంగీతం మధురతరంగా ఉంటుంది.

బయటినించి లోపలికి పొయ్యే ఆనందానికి మేర ఉంటుంది; లోపలినుంచి బయటకొచ్చే ఆనందానికి మేరలేదు.

రైతులు సేద్యం చేస్తున్నారు. రాళ్ళవాళ్ళు రాళ్ళు పగలగొట్టుతున్నారు. సాలెవాళ్ళు బట్టలు నేస్తున్నారు. పాకీవాళ్ళు రోడ్లు చిమ్ముతున్నారు. ఆడవాళ్ళు పిల్లల్ని కంటున్నారు. భోగి మాత్రం భక్తుడైనాడు.

ఇతర ప్రపంచం తుచ్ఛజీవితంలో, శ్లేష్మంలో ఈగలాగా పడి కొట్టుకుంటుంటే భక్తుడు ఆత్మసంతృప్తి చెందగలిగాడు.

కాని భక్తుడికి భక్తివల్ల కలిగే ఆనందం చాలలేదు. మొదట ఏకైకత్వంగా కనిపించింది రానురాను ఏకాకిత్వంగా కనిపించసాగింది.

అందుకని భక్తుడు భక్తి ప్రచారం ప్రారంభించాడు.

"ఈ తుచ్ఛ సుఖాల్లో పడి ఎంతకాలం కొట్టుకుంటారు? వీటిని విసర్జించండి! తారకమైన హరిపద సేవ చెయ్యండి! ఈ సుఖాలు హరినామ కీర్తనకు సాటిరావు! ఇవి మిమ్మల్ని ఉద్ధరించలేవు!" అని ప్రచారం చెయ్యసాగాడు భక్తుడు.

భక్తుడి భక్తిపారవశ్యం అందరినీ ఆకర్షించింది. అందరినీ నమ్మించింది.

విషయ లంపటులైన వారంతా భక్తుణ్ణి చూసి ఒక నిట్టూర్పు విడిచారు. "ఆహా! ఎంత ధన్యుడు! ఇంద్రియ వాంఛలను ఎట్లా జయించాడు? మనబోటి మానవ

మాత్రులకు ఆ విరక్తి సాధ్యం కాదు కద! ఆయనతో పోలిస్తే మనం ఎంత పశు తుల్యులం!" అనుకున్నారు వారు. ఈ ఆత్మవిమర్శతో పవిత్రాత్ములైనవారై, తమ ఆత్మలను తిరిగి మకిలపరచుకోవటం కోసం విషయవాంఛలవంక తిరిగారు-నీళ్ళలో పరిశుభ్రమై వచ్చిన కుక్క ఆనందంగా రోడ్డుమీద పొర్లినట్లు.

"ఈ తుచ్ఛ సుఖాల్లో పడి ఎంతకాలం కొట్టుకుంటారు? వీటిని విసర్జించండి! తారకమైన హరిపదసేవ చెయ్యండి! ఈ సుఖాలు హరినామ కీర్తనకు సాటి రావు! ఇవి మిమ్మల్ని ఉద్ధరించలేవు!" అని ఉద్బోధించటం మానలేదు భక్తుడు.

ఈ మాటలు విని విద్యాధికులూ, సంస్కారులూ రసగ్రహణంచేసి వెళ్ళిపోయినారు. కాని విద్యాహీనులకు భక్తుడి మాటల్లో ఒక పిలుపూ, ఒక ఉద్బోధమూ, ఒక ఆజ్ఞా వినిపించినై.

రైతు నాగలి వదలిపెట్టాడు. రాళ్ళవాడు సుత్తె అవతల పారేశాడు. సాలెవాడు మగ్గం ముందునించి లేచాడు. పాకీవాడు చీపురు వదిలేశాడు. అందరూ భక్తుడి చుట్టూ చేరి భజన చెయ్యసాగారు.

ఆడది మాత్రం పురిటి కెదురు చూస్తూ ఉండిపోవలసి వచ్చింది.

పొలం దున్నటంలో ఉన్న ఆనందమూ, రాళ్ళు పగలగొట్టడంలో ఉన్న సుఖమూ, రోజల్లా మగ్గం నెయ్యటంలో ఉన్న తృప్తీ, రోడ్లూడవటంలో ఉన్న సౌరవశ్యమూ వదులుకుని భక్తులంతా తనచుట్టూ మూగినందుకు భక్తుడు సంతోషించాడు.

"ఇవి మిమ్మల్ని ఉద్ధరించలేవు!" అన్న సత్యాన్ని తమకు తెలియజేసినందుకు రైతూ, రాళ్ళు కొట్టేవాడూ, సాలెవాడూ, పాకీవాడూ సంతోషించారు. వారు చదువుకున్నవారైతే ఆ విషయం వారి కదివరకే తెలిసి ఉండును.

ఇతర భక్తుల్ని తన శిష్యులు చేసుకుని భక్తుడు భక్తాగ్రేసరుడయినాడు.

ఆయనకూ, ఆయన భక్తులకూ ఎక్కడికి వెళ్ళినా గొప్ప సత్కారం జరుగుతున్నది.

ఆయన ఖ్యాతి నలుదిక్కులా వ్యాపించింది.

కర్మ పరిపాకము చాలక ఇంకా తమ వృత్తులలోనే ఉంటున్న రైతు, కంసాలి, సాలె, పాకీజనం మూలంగా భక్తాగ్రేసరుడి జీవితానికీ, భక్తుల జీవితానికీ, ఏ విధమైన కొదువా లేకపోయింది.

తమ వృత్తులను విడిచిపెట్టి హరిపద ధ్యానం అవలంబించిన వారికి జీవితం ఇప్పుడు సుఖమయంగా ఉంది.

ఈ సంగతి గమనించి ఇతరులు కూడా ఈ భక్తమతంలో చేరటానికి తండోపతండాలుగా వచ్చి భక్తాగ్రేసరుణ్ణి ఆశ్రయించసాగారు.

భూస్వాముల పొలాలు పాడుపడినై. పెట్టుబడిదార్ల పరిశ్రమలు మూలబడినై.

"ఇది దారుణంగా ఉంది. ఇట్లా అయితే జరగదు" అన్నారు పెద్దలు.

"ఈ పాములకి మనం చేజేతులా పాలుపోసి పెంచాం" అన్నారు పెద్దలు.

"వీటిని మారణహోమం చెయ్యకపోతే ప్రపంచం తలక్రిందై పోతుంది" అన్నారు పెద్దలు.

"ఈ భక్తాగ్రేసరుడు మారువేషంలో తిరుగుతున్న విప్లవకారుడు. రాజద్రోహి. ఇతను చేస్తున్నది సాంఘిక విప్లవం!" అన్నారు రాజకీయవేత్తలు.

"ఇతను చెబుతున్నదంతా శాస్త్రీయంగా అసత్యం" అన్నారు వైద్యులు. "హరిజన మిఠాయి తింటే అన్నమెందుకు? హరినామ పానకం తాగితే మంచినీళ్ళెందుకు?" అని చెబుతున్నాడు భక్తాగ్రేసరుడు. "మిఠాయి తింటే జబ్బు చేస్తుంది. పానకం తాగితే దాహం తీరదు. ఈ ప్రచారం ఆరోగ్య సూత్రాలకు విరుద్ధంగా ఉంది!" అన్నారు వైద్యులు.

భక్తాగ్రేసరుడు రాజద్రోహిగా, దేశద్రోహిగా నిర్ణయించబడ్డాడు. అతన్నీ అతని అనుచరులనూ కారాగృహంలో ఉంచి, ఒక రాత్రి రహస్యంగా అందర్నీ చిత్రవధ చేశారు.

ప్రభుత్వం చేసిన ఈ పనిని జనులంతా గర్హించారు. ఈ విధంగా ఒక ఊరూ పేరూ లేని ప్రభుత్వం చరిత్రలో ఒక స్థానం పొందింది.

జనులంతా భక్తాగ్రేసరుడిమీద కథలు అల్లారు. అతనికి ఒక విగ్రహం చేశారు. అతను చచ్చినరోజు పండుగ చేసుకున్నారు. అతని సంకీర్తనలన్నీ పుస్తకరూపంగా వేసి చౌకగా అమ్మి చాలా లాభాలు సంపాదించి కొందరు మేడలు కట్టుకున్నారు. అతని చరిత్ర చిత్రాలుగా తీసి లక్షలు దోచుకున్నారు.

భక్తాగ్రేసరుణ్ని ఎట్లా ఉపయోగించుకోవాలో లోకానికి తెలిసివచ్చింది.

ప్రచురణ : డిసెంబరు 1946, కవిరాట్టు సంకలనం నుంచి.
యువ బుక్ డిపో : మద్రాసు

# ధనలక్ష్మి నేరం

అకస్మాత్తుగా అభిరాముడు కుబేరు డయ్యాడు. గుడిసె పీకి భవంతి లేపాడు. ఇనప్పెట్టె కొని దానినిండా బంగారం పేర్చాడు. మహారాజుకన్నా ఘనంగా బతుకుతున్నాడు.

కారణం ఏమై ఉంటుంది? మహారాజు మంత్రులతో సమాలోచన చేశాడు. నిధి దొరికిందా? పరుసవేది సంపాదించాడా? పెద్ద ఎత్తున దార్లు కొట్టాడా? కారణం ఏదైనా విచారించాల్సిన బాధ్యత రాజుమీద వున్నది. మహారాజు అకస్మాత్తుగా తన ఇంటికి రావటం చూసి అభిరాముడు ఆనందించాలో, ఆశ్చర్యపడాలో, భయపడాలో తెల్చుకోలేక ఉక్కిరిబిక్కిరి అయ్యాడు.

"నీ ఇనప్పెట్టె తీసి చూపించు," అన్నాడు రాజు.

అభిరాముడు తీసి చూపించాడు.

లోపల బంగారం మొహర్లున్నాయి.

అన్నీ రాజుగారి టంకసాలలో పుట్టినవే!

"ఇది దొంగ సొమ్ము," అన్నాడు రాజు.

"కాదు మహారాజా! లక్ష్మీ కటాక్షం! ఏడాది పూజచేసి, ఆమె అనుగ్రహం సంపాదించాను."

అయితే చోరీ నేరం లక్ష్మీదేవిది. ఆమెను పట్టి ఇచ్చే శక్తి నీకున్నది గదా! అందాకా నువ్వు జైల్లో వుండు" అన్నాడు మహారాజు.

ముద్రణ : నవంబరు 1976, యువ.

# ఎన్నికల ప్రచారం

భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన అనంతరం మొదటి లోక్‌సభ ఎన్నికలకు రాజు పక్షాన దిబ్బేశ్వర్లుంగారూ, రైతు పక్షాన దిబ్బనాయుడూ నిలబడ్డారు. వీళ్లగాక ఇరవై తొమ్మిది మంది సొంతాన నిలబడి డిపాజిట్లు పోగొట్టు కున్నారు. వాళ్ల సోదిలోకి కూడా రారు.

కాని దిబ్బేశ్వర్లుంగారి ఎన్నికల ప్రచారం సువర్ణాక్షరాలతో లిఖించదగినది. అది నల్ల సిరాలో కూడా అచ్చుకాకపోవటం శోచనీయం. అప్పటికి ఇప్పటికి దిబ్బలో ఎన్నికల ప్రచారం అట్టే మారలేదు. గనుక వాని వివరాలు కొంతమందికైనా ఆసక్తికరంగా ఉండవచ్చు.

దిబ్బేశ్వర్లుగారి మీటింగుకు నూట అయిదుగురు వచ్చారు. అందులో ఎనభై తొమ్మిది మంది వారి బలగమే. శ్రీవారు మైక్‌ముందు తప్పతాగి వచ్చాడని గొప్పగా చెప్పుకున్నారు. అదొక పెద్ద ఆకర్షణ అయింది.

"మహా జనులారా!" అని మొదలుపెట్టి వారు చాలాసేపు తమ గొప్ప తనం చెప్పుకున్నారు. ఆ తరవాత అకస్మాత్తుగా వారికి ఎన్నికల మాట గుర్తొచ్చింది.

"మీ వోటెవరికిస్తారు? రావణాసురి కిస్తారా? కుంభకర్ణుడికిస్తారా? వాళ్ల దుర్మార్గులు, నీచులు, రాక్షసులు. నీతీ జాతీ లేనివాళ్ళ? రాముడంటే ఎంత గొప్ప వాడు! ఆ రాముడి పెళ్ళాన్ని ఎత్తుకుపోయినవాణ్ణి ఎంత బుద్ధి తక్కువ్వాడనాలి? వాణ్ణి పగలగోసినా పాపం లేదు! కొరతేసినా తప్పలేదు! ఊరికే చంపేయటంకాదు, అలాటి వాణ్ణి కత్తికి కండలుకోసి, ఉప్పూ, కారము రాయాలి....

శ్రీవారికి ఆవేశం ఎక్కువై, నోటంట నురుగులు వచ్చి మూరపోయారు. ఆయన మనుషులు ఆయనచేత సీసాతో ఏదో తాగించి, స్పృహ తెప్పించినాక ఆయన, "అందుచే తేవిటంటే మీరంతా నాకే వోటు చెయ్యండి," అని వేదిక దిగిపోయారు.

వోట్లన్నీ ఆయనకే పడ్డాయి.

ముద్రణ : జూలై 1977, యువ.

# పందికొక్కులు

దేశంలో పందికొక్కుల విజృంభణ నానాటికి తీవ్రమైంది. మనిషి చెమటోడ్చి పండించిన ధాన్యంలో పదోవంతు పందికొక్కుల కమీషన్‌గా ఆమోదించబడుతూ వస్తున్నది. కాని యాభై శాతం పందికొక్కులు తినెయ్యటం చాలా తప్పు. అందుకని కొందరు యువకులు పందికొక్కులను వెతికి చంపసాగారు. పందికొక్కులను చంపటం హింస. వేద విరుద్ధం. అందుచేత ప్రభుత్వం పందికొక్కులను చంపేవాళ్ళను వేటాడి తుపాకులతో కాల్చటమూ పట్టుబడితే కారాగృహాలలో పెట్టి చిత్రహింసలు చేయటమూ సాగించింది.

అయినా "పందికొక్కులు నశించాలి" అన్న నినాదం యిచ్చింది ప్రభుత్వం.

"ఇది కపట నినాదం. ఈ ప్రభుత్వం పందికొక్కులను తుపాకులతో కాపాడుతున్నది" అంటూ కొందరు రాజకీయవేత్తలు బయలుదేరి, అహింసా పిధానంలో పాత ప్రభుత్వాన్ని పడగొట్టి కొత్త ప్రభుత్వం ఏర్పాటు చేశారు.

వీళ్ళు ప్రజలకు హామీ ఇచ్చారు!

"పందికొక్కుల్ని అదుపులో ఉంచుతాం. దేశంలో ఆహార ధాన్యాల కొరత తీరుస్తాం."

కాని పందికొక్కుల విజృంభణ తగ్గలేదు. హెచ్చింది. క్రొత్త ప్రభుత్వం ఏం చేస్తున్నదని ప్రజలు అడిగారు.

అలా అడగటం అన్యాయం. క్రొత్త ప్రభుత్వం చేతులు కట్టుకు కూర్చోలేదు. అది పందికొక్కులను అదుపులో ఉండమని వేడుకున్నది. న్యాయంగా పది శాతం భోంచేయమన్నది. అంతకుమించి తినటం అక్రమమనీ అలాచేస్తే కఠిన చర్యలు తీసుకోబడతాయనీ అన్నది. ఆ చర్యలు ఎలాటివో అది పరమ రహస్యం.

పందికొక్కుల్ని అదుపులో పెట్టేదానికి పదేళ్లు వ్యవధి ఇయ్యమనీ, పోయిన ప్రభుత్వం పెంచిన పందికొక్కుల్ని అదుపు చెయ్యటం త్వరలో జరిగే పని కాదనీ, అయినా పందికొక్కులను వేటాడేవాళ్ళ ప్రాణాలుతీసే అహింసా కార్యక్రమం అక్షరాలా సాగుతుందని క్రొత్త ప్రభుత్వం అటు ప్రజలకూ, ఇటు పందికొక్కులకు కూడా హామీ ఇచ్చింది.

అందుచేత మళ్ళీ అయిదేళ్ళకు ప్రజలు ఈ ప్రభుత్వాన్నే ఎన్నుకుంటే, పదేళ్ళ తరవాత నందో రాజా భవిష్యతి.[1]

ముద్రణ : జనవరి 1978, యువ.

---

1. సంస్కృత లోకోక్తి. నందుడు రాజవుతాడని అర్థం.

# ఉద్ధరింపు

"చిన్నపల్లిలో పదహారుమంది హరిజనులను భూస్వాముల గూండాలు-"

"పాపం!"

"పెద్దపర్రులో ఎనిమిదిమంది హరిజన స్త్రీలను ముగ్గురు భూస్వాములు-"

"పాపం! పాపం!"

"మధ్యకుంటలో నాలుగు వందల హరిజన గుడిసెలకు నిప్పు పెట్టగా అయిదుగురు హరిజన వృద్ధులూ, ఇరవై ఇద్దరు హరిజన బాలబాలికలూ-"

"దారుణం! దారుణం!"

"-భూస్వాముల మీద కొడవళ్ళతో తిరగబడి, ఇద్దరు భూస్వాములను చంపి, మరి ముగ్గురిని గాయపరచి-"

"వాళ్ళందరికీ ఉరిశిక్ష పడేటట్టు చూస్తాం! దేన్నయినా సహిస్తాంగానీ అరాచకాన్ని-"

ముద్రణ : డిసెంబర్ 1977, యువ

# భూతదయ

## (అల్పిక)

రాజుగారి కొలువులో నిండుసభలో అహింసను గురించిన చర్చ వచ్చింది. ఇద్దరు ప్రజ్ఞావంతులు చెరో పక్షం తగులుకున్నప్పటికి మిగిలిన వారంతా విరమించి వినోదం చూడసాగారు.

బక్కవాడైనా అహింస కూడదని ఘట్టిగా వాదిస్తున్నాడు ఒకడు; బలవంతుడే కాని అహింస పరమ ధర్మమని వాదించి నెగ్గలేకుండా ఉన్నాడు రెండో వాడు.

సభ బక్కవాడి పక్షం అయిపోతున్నది క్రమంగా.

బలవంతుడి మొహం జేగురించింది. ఆగ్రహం పట్టలేకపోయినాడు. బలహీనుడి మీదికి లంఘించాడు. మెడ రెండు చేతులా పట్టుకొని తోటకూర కాడను ఊపినట్టు ఊపాడు.

బక్కవాడు గుడ్లు తేలవేశాడు. అహింస గెలిచింది.

ప్రచురణ : డిసెంబరు, 1946, కవిరాట్టు సంకలనం నుంచి.
యువ బుక్ డిపో, మద్రాసు.

# విప్లవ మేధావి

సాయుధ విప్లవం ద్వారా తప్ప దేశానికి విముక్తి లేదని అందరు మార్క్సిస్టులూ నమ్మినట్టే గణాచారి కూడా నమ్మాడు. సిద్ధాంత సాహిత్యమంతా కంఠస్థం చేశాడు.

అయితే దురదృష్టవశాత్తూ గణాచారికి రెండు ఇబ్బందులు ఎదురయ్యాయి. ఒకటి, అట్టడుగు వర్గాలలో రాజకీయ చైతన్యం-విప్లవ చైతన్యందాకా పోకుండానే.... అంతగాలేదని గణాచారి అనుయాయులు భావించారు. గణాచారికి తుపాకీపట్టి బూర్జువా పెట్టుబడిదారీ తైనాతీల నందరినీ కాల్చిపారెయ్యాలని ఉన్నా, తనకు ఆ శక్తి లేదని అతనికి తెలుసు.

అందుచేత ఏం చెయ్యాలి? ప్రజలలో విప్లవ బీజాలు నాటి, విప్లవోత్సాహం రేకెత్తించే సారస్వతం సృష్టించాలి. ఆ సారస్వతం అక్కడక్కడా ఉన్న విప్లవ కారులకు ఎంతో సహాయంగా ఉంటుంది.

సారస్వత కార్యక్రమం సాగింది. అందులో గణాచారి విశిష్టపాత్ర వహించాడు. తన రచనలు తాను మళ్ళీ మళ్ళీ చదువుతుంటే విప్లవావశ్యకత ప్రజలకు అరటిపండు ఒలిచి పెట్టినట్టుగా స్పష్టమయింది. దాని నిండా లెనిన్[1] కొటేషన్లూ, మార్క్స్[2] కొటేషన్లూ, మావో[3] కొటేషన్లూ కొల్లలుగా ఉన్నాయి. దేశీయుల కొటేషన్లు అంతగా లేవు.

---

1. లెనిన్ (1870-1924) రష్యన్ విప్లవకారుడు. ప్రపంచంలో మొట్టమొదటి సామ్యవాద వ్యవస్థనూ, శ్రామిక రాజ్యాన్నీ నిర్మించి, నూతన సోవియట్ వ్యవస్థకు రూపకల్పన చేసిన రాజనీతిజ్ఞుడు.

2, 3. మార్క్స్ : కార్ల్‌మార్క్స్ (1818-1883). "తాత్వికులు వున్నంతకాలం ప్రపంచాన్ని రకరకాలుగా వ్యాఖ్యానించడం మాత్రమే చేశారు. అసలు చేయాల్సింది దాన్ని మార్చడం" అన్న భౌతికవాది, చరిత్రకారుడు, ఆర్థిక సిద్ధాంతవేత్త, జర్మన్ విప్లవకారుడు. ఆయన ప్రతిపాదించిన ప్రాపంచిక దృక్పథమే 'మార్క్సిజం'. ఎంగెల్స్ దృక్పథం ఇందులో భాగం. మార్క్సిజంలోని మూలాలు గతితార్కిక భౌతికవాదం, చరిత్ర పట్ల భౌతికవాద దృక్పథం, వర్గపోరాటం; విలువ, అదనపు విలువ,

గణాచారికి రోజురోజుకూ ఆవేశం హెచ్చుతున్నది. ఒక వంక విప్లవం దేశం నాలుగు చెరగులా అంటుకున్నది. విప్లవ రచనలతో ఇంక పనిలేదు. అతను ఓ మంచి రోజు చూసి, నినాదాలిచ్చుకుంటూ విప్లవ స్థావరానికి బయలుదేరాడు. దురదృష్టవశాత్తూ అంతకుముందే పోలీసులు ఆ స్థావరంలో ఉన్న చంటి పిల్లల దగ్గర నుంచీ అందర్నీ పోలీసువాన్‌లో కుక్కి, అడవిలోకి తీసుకుపోయి ఇంక వెళ్ళండని చెప్పి, వెనకనుంచి అందర్నీ కాల్చేశారు. ఎందుకంటే, ఎమర్జన్సీయా, మాటలా ?

గణాచారి ఆశ్చర్యపోయి, తనవెనక వస్తున్న లక్షలాది జనం కోసం చూశాడు. ఒక్క పురుగులేదు. కామ్రేడ్‌లు అరణ్యంలో దాక్కొబోయారేమోనని ఇంకా ముందుకు సాగాడు. ఎదురుగా వస్తూ పోలీసువాన్ కనిపించింది.

ముద్రణ : మార్చి, 1978, యువ

సోషలిజం, కమ్యూనిజం. ఆచరణ సిద్ధాంత జీవధాతవనీ, సిద్ధాంతం ఆచరణకు మార్గదర్శకమనీ నమ్మి ఉపదేశించి, ఆచరించి, అంతర్జాతీయ శ్రామిక వర్గ ఉద్యమాలకు పునాదులువేసిన తాత్వికుడు, వర్గపోరాట యోధుడు. కమ్యూనిస్టు ప్రణాళిక (1848), పెట్టుబడి (మూడు సంపుటాలు 1867, 1885, 1894) ఈ శతాబ్ది చరిత్రను కొత్త ప్రపంచంలోకి మలుపు దిప్పిన రచనలు. ఫ్రెడరిక్ ఎంగెల్స్ (1820-1895) మార్క్సు సమయోధుడు, సహరచయిత, మిత్రుడు మావో జెదుంగ్ (1893-1976) చైనా విప్లవ కారుడు, కమ్యూనిస్టు నాయకుడు, నవచైనా నిర్మాత.

# రాజుగారి తలనొప్పి

రాజుగారికి తలనొప్పి వచ్చింది. రాజవైద్యులు వచ్చి ఉత్తమమయిన శాస్త్ర గ్రంథాలు పరిశీలించి అది శిరోవేదన అయివుంటుందని నిర్ణయించారు.

అందువల్ల రాజుగారి తలనొప్పి తగ్గలేదు. హెచ్చింది. దానికేదైనా మందు చూడండి అన్నారు రాజుగారు.

రాజవైద్యులు ఎన్నో చికిత్సలు చేశారు. లాభంలేకపోయింది.

ఆఖరుకు రాజవైద్యులు దిన పత్రికలు తెప్పించి అందులో ప్రకటించబడిన ఒక అమోఘమైన తలనొప్పి మందుచూసి అది తెచ్చి రాజుగారికిచ్చారు.

ఏ విధమైన కారణంచేత కలిగిన శిరోవేదన అయినా ఆ మందువల్ల కుదురుతుందని ఆ పత్రికలలో గ్యారంటీ ఇవ్వబడివుంది.

రాజుగారు ఆ మందు వేసుకోగానే అయిదు నిమిషాల్లోపల చాలా వింతలు జరిగినై.

రాణీగారు రాజుగారిని సాధించటం మానుకుంది.

మంత్రిగారు అడ్డమైన కాగితాలూ రాజుగారి బల్లమీదినించి తీసి చించి ముక్కలు ముక్కలు చేసి కిటికీలోనుంచి బయటకు పారేసి ఆరునెల్లు సెలవుకోరి ఇంటికి వెళ్ళిపోయినాడు.

అధికారుల అత్యాచారాలను గురించీ, తమ ప్రాంతాలలో కలిగిన అతివృష్టి, అనావృష్టి దోషాలను గురించీ మొరబెట్టుకోవడానికి వచ్చిన ప్రజలు తమ అభిప్రాయం మార్చుకుని తమ కష్టాలకు తల ఒగ్గటానికి నిర్ణయించుకున్న వాళ్ళయి తిరిగి వెళ్ళిపోయినారు.

రాజుగారికి విషం పెట్టటానికి ఇరవైఎనిమిదోసారి ప్రయత్నం చేస్తున్న ఉంపుడుకత్తెలు తమ ప్రయత్నం మానుకుని ఆ విషంకాస్తా రాణీగారిచేత తాగించారు.

పక్కదేశపు రాజు, తాను యుద్ధం చేయకుండానే మన రాజుగారికి లొంగిపోదలచినట్టు వార్త పంపించాడు.

రాజుగారి తలనొప్పి అయిదు నిమిషాలలో సర్దుకుంది.

"పత్రికల్లో ప్రకటనల్లో ఏ మాత్రమూ సత్యం ఉండదనటానికి వీల్లేదు," అన్నారు రాజవైద్యులు.

ముద్రణ : ఏప్రిల్, 15, 1945, చిత్రగుప్త.

ధర్మయుద్ధం

# చదరంగం

ఎర్రరాజు బలాలూ నల్లరాజు బలాలూ ఎదురెదురుగా ఉన్నై.

ఆ బలగాల్లో అతి నీచమైనవి భటులు. అంచేత వాళ్ళ చాటున నిలుచున్నారు రాజులూ, మంత్రులూ, రథాలూ, గుర్రాలూ, ఏనుగులూనూ.

'ఉపక్రమించు' అన్నాడు నల్లరాజు.

భటులను ముందుంచుకుని రాజులు చాలా ధర్మయుద్ధం చేస్తున్నారు.

ఎర్రరాజు తన భటుల్ని ముందుకు నడిపాడు. నల్లరాజు కూడా ఆ పనే చేశాడు.

ఎర్రరాజు ఓ గుర్రాన్నీ, రథాన్నీ, తన భటులకు తోడు పంపుతూ నల్ల రాజు సైన్యం మీదికి పంపాడు. నల్ల మంత్రికి అపాయం కలిగే సూచనలు కనిపించినై.

నల్లరాజు భటుణ్ణి అడ్డంగా త్రోశాడు.

ఆట సాగిపోతున్నది.

ఎర్రరాజు తన భటుణ్ణి నల్ల రథం మీదికి త్రోశాడు. ఎర్ర భటుణ్ణి చంప టానికి సాధనం లేదు. నల్లరాజు తన గుర్రాన్ని వొదిలేసుకుని రథాన్ని తప్పించాడు.

నల్ల గుర్రం చచ్చిపోయింది. దానికి కాపున్న నల్ల భటుడి చేతిలో ఎర్ర భటుడు చచ్చిపోయాడు.

'నా భటుడు మాత్రమే చచ్చాడు. నీ గుర్రం కాస్తా పోయింది. నీదే నష్టం' అన్నాడు ఎర్రరాజు.

'ఈః మాత్రానికేనా?.... ఇంకా నయం, నా రథం బతికి బయటపడింది!" అన్నాడు నల్లరాజు.

ఆట సాగింది. యుద్ధం మహా తీవ్రంగా వుంది. రెండు పక్షాలా చావు చాలా నాస్తిగా వుంది.

నల్లరాజుకు రెండు శకట్లూ ఇద్దరు భటులూ మాత్రమే మిగిలారు.

'నీ మంత్రి పోయినాడు. నువ్వింక యుద్ధం విరమించుకోవచ్చు' అన్నాడు.

'నా రథాలు నాకుండగా నన్ను జయించలేవు. పైగా నా మంత్రి బంటూ-ఏనుగు బంటూ బతికున్నారు' అన్నాడు నల్లరాజు.

నల్లరాజు కిప్పుడా బంట్లమీద ఎంత ప్రేమో పుట్టుకొచ్చింది. ఏమో! ఎవరు చూశారు. ఎర్రరాజు ఒక్క తప్పటెత్తు వేస్తే తను కాస్తా ఆ భటుల సహాయంతో యుద్ధం గెలవొచ్చు.

కాని నల్లరాజుకు క్షణ క్షణ గండంగా వుంది. ఎర్రమంత్రి రణరంగమంతటా పరిగెత్తుతూ నల్లరాజు ప్రాణం మీది కొస్తున్నాడు. నల్లరాజు కాలం కాస్తా రథాల మాటున దాక్కోవటంలో సరిపోతున్నది.

అనుకున్నంతా అయింది. నల్లరాజుకు కదలటానికి చోటులేదు. దాక్కోటానికి అంతకన్నాలేదు. నల్లరథాలు రెండూ అసహాయ స్థితిలో వుండి వెలవెలబోతున్నై.

'ఇక యుద్ధం ఆపవచ్చు' అన్నాడు నల్లరాజు కమిలిన మొహంతో 'ఇంకో పట్టుపడదామా?'

ఎర్రరాజు మొహం జేవురించింది.

'రానీ మరి' అన్నాడు ఎర్రరాజు.

తనకేం భయం? నల్లరాజు ఓడిపోతే నల్లరాజు కెంత ప్రమాదమో, ఎర్రరాజు ఓడిపోయినా ఎర్రరాజు కంతే ప్రమాదం.

ఇది ధర్మయుద్ధం....

ముద్రణ : 1944 దీపావళి సంచిక, ఆనందవాణి.

# భాషాసేవ

అన్నగారు భాషాసేవ చేయ సంకల్పించారు.

అయితే అన్నగారు అతి దర్జా మనిషి. వారికి సేవకావృత్తి ఎట్లా ఒప్పుతుందా అని ఆశ్చర్యపడ్డాం మొదట్లో.

కాని, అన్నగారు అన్నిట్లోనూ, అందరల్లేగాక అదో కొత్తదారి తొక్కుతారు. భాషాసేవలో కూడా అన్నగారు కొత్తదారే తొక్కారు !

*　*　*

"అదివరలో భాషాదేవిని ఆరాధించినవారు దేవికి అత్యాచారం చేశారు" అన్నారన్నగారు.

"భాషాదేవిని ఎత్తయిన పీఠంమీద కూచోబెట్టి దానికంట కట్టేశారు.

"ఎత్తయిన పీఠాన కూర్చోబెట్టినంత మాత్రాన దేవీ పూజ పూర్తికాదు....

"దేవికి బంధవిముక్తి కలిగించాలి! పీఠం మీదినుంచి దించి, దేవికి సమ్యగ్దర్శనం గల రసికులందరి పరిచయమూ చేయాలి....

"ఆమెకు వెనకటి అర్చకులు ధూపంవేసి ఊపిరి సలపకుండా చేశారు; దేవిచేత సుకుమారమైన పరిమళాలు ఆఘ్రాణింప చేయాలి?....

"ఆమె చెవులదగ్గిర పూర్వపు అర్చకులు జేగంటలు వాయించి వొదిలి పెట్టారు. శంఖా లూదారు, కఠోరమైన - భావరహితమైన - మంత్రాలు చదివారు; ఆమె చెవులకింపైన వీణాగానం - చక్కని భావకవిత్వం- మెత్తని పువురేకులవంటి మధురశబ్దాలు వినిపించాలి!"

అన్నగారి భావాలకు అందరమూ ముగ్ధులమయినాం. వారి భాషాసేవ కళ్ళారా చూడాలనే కోరిక అందరికీ కలిగింది.

*　*　*

భాషాదేవి కట్లు అందరి ఎదటా విప్పి, ఆమెను ఎత్తయిన పీఠంమీదినుండి కిందికి స్వయంగా చెయ్యిపట్టుకుని దింపారన్నగారు.

అందరూ హర్షింప కరతాళ ధ్వనులు చేశాం.

పాత పూజారులూ మరికొందరు ముసలాళ్ళూ, నెత్తి నోరూ బాదుకుంటూ, అయ్యో! అయ్యో! అత్యాచారం! మీకేం పొయ్యేకాలమర్రా?" అని లబలబలాడారు. కాని వాళ్ళను చూసి మేమంతా నవ్వాం.

ముసలాళ్ళల్లో కొందరు జన్మలో ఎన్నడూ దేవిమీద ఒక పుష్పమైనా విసిరేసిన పాపాన పోయి ఎరగరు. అటువంటి వాళ్ళచేత మాటలు పడటానికి ఒడిగట్టిన అన్నగారిమీద మాకు భక్తి మరింత పెరిగింది.

భాషాదేవికి సేవచేస్తుంటే అన్నగారి దర్జాకు ఏ విధమైనలోటూ కనిపించలేదు.

అన్నగారు దేవికి స్వయంగా విసిరారు. వారు దేవికి విసురుతుంటే దేవదాసీలు దేవుడికి వింజామరలు పట్టినట్టుండేది కాదు! గాలి అన్నగారికి జాస్తిగా తగులుతున్నదీ దేవికి జాస్తిగా తగులుతున్నదీ ఊహించరాకుండా ఉండేది!

దేవిని చుట్టుముట్టిన పరిమళాల గుమాయింపు సర్వకాల సర్వావస్థలయందూ అన్నగార్ని సయితం ఆవరించి ఉండేది.

అన్నగారు దేవిని ఉద్యానాలలో విహరింపజేస్తుంటే వారి శోభ అద్వితీయంగా ఉండేది!

ఈ వైభవమంతా కళ్ళారా చూసిన మాలో కొందరికి అన్నగారివెంట ఒక దేవి ఉన్నదనే జ్ఞానం కూడా లేకుండాపోయింది.

ఏమంటే దేవిని గురించిన అన్ని విషయాల్లోనూ అన్నగారిదే ఆఖరు నిర్ణయం. దేవిని గురించి మే మాలోచించినా అన్నగారి పరంగానే ఆలోచించవలసి వచ్చేది....

*　　　　*　　　　*

అయితే దేవికి సేవ చెయ్యటంలో అన్నగారిని మించిపోయినవాళ్ళు మా దృష్టిలో చాలామంది బయల్దేరారు. అయినప్పటికీ వాళ్ళంతా అన్నగారి దగ్గర ఉపదేశం పొందిన వాళ్ళయినారుగాని అన్నగారి స్థానం ఆక్రమించలేకపోయినారు.

వాళ్ళ కదో ఇబ్బందిగా కనిపించినట్టు లేదు. దేవిని మెప్పించడంకంటె మమ్మల్ని నలుగుర్నీ మెప్పించటం వారికి ముఖ్యంగా కనిపించింది!....

అన్నగార్ల సంఖ్య అధికం గాసాగింది.

*　　　　*　　　　*

రానురాను అన్నగార్లందరికీ పెద్ద చిక్కొకటి వచ్చిపడింది.

అన్నగార్ల ఆధిక్యతను గురించీ, భాషాదేవికి వారుచేసే సేవను గురించీ కుర్రకారు వాళ్ళు సందేహాలు వెలిబుచ్చసాగారు.

"భాషాదేవికి ఈ తుక్కు భావకవిత్వం - ప్రేమకవిత్వం - అశ్రుకవిత్వం ఎందుకు వినిపిస్తారు. ఆవిడగారిచేత మామూలు విషయాలు మామూలు మనిషి మాదిరిగా మాట్లాడనివ్వండి.

"ఈ చందనార్చనలూ, పరిమళాలూ, వీణాతంత్రులూ దేనికి? ఆవిడగారికి దారిద్ర్యమూ, జీవితంలో కుళ్ళూ, ఆర్థిక సమస్యలూ, బాధా, నిస్పృహా - జీవితం తాలూకు యథార్థం యావత్తూ చూపించండి!

"ఆవిడగారికి మనం సేవ చేసేదేమిటి? ఆవిడ మనకేమన్నా సేవ చేస్తుందేమో చూడండి.

"అందరితోపాటు ఆవిడనూ చాకిరి చెయ్యనివ్వండి! ఆవిడక్కూడా మామూలు చీరె ఒకటి కట్టబెట్టి అలుగ్గుడ్డా, చీపురుకట్టా, చేదా-తాడు చేతికివ్వండి!" కుర్రకుంకలు.

అన్నగార్ల ప్రాణం అల్లాడిపోయింది.

"మీ యధార్థం మాసిపోను! మీ యధార్థా లెందుకర్రా? చిరస్థాయి అయిన సత్యం కావాలి కానీ! ఈ జీవిత సమస్యలు ఇవాళ ఉంటై! రేపు పోతై! వాటితో భాషాదేవిని బాధిస్తారా?" అన్నారు అన్నగార్లు.

మా సమస్యలతో బాధపడలేని భాషాదేవితో మాకేం పని? మేం చిరస్థాయి వులం కాము. చిరస్థాయి అయిన సత్యాన్ని ఏం చెయ్యాలో మాకు తెలీదు.

"మీ సత్యప్రియత్వం అఘోరించినట్టే ఉంది. మీరు గానం చేసే వీణా తంత్రులూ, నందనవనాలూ ఎక్కడున్నై? భాషా దేవిని గుడ్డిముండనూ, పిచ్చి ముండనూ చేసి కూచోబెట్టి దిక్కుమాలిన జోలపాటలు పాడుతున్నారు! ఈలోపుగా ఇల్లంతా పేడకుప్పలూ, మట్టిరాసులూ, పందికొక్కు కన్నాలూ అయి ఊరుకుంది. ఇదంతా, మీ భాషాదేవి అబ్బ ఎవడు బాగుచేస్తా డనుకున్నారు?

"మేం చెప్పినట్టు వింటే భాషాదేవి కింత ప్రపంచజ్ఞానమన్నా కలుగు తుంది!" అన్నారు అల్లరివెధవలు.

అన్నగార్లు "హరి, హరీ!" అని చెవులు మూసుకున్నారు.

*

కుర్రకుంకలు భాషాదేవిని రెక్కపట్టుకుని వీధిలోకి తీసుకొచ్చి, నాలుగు మూలలూ చూపించి, అలుగ్గుడ్డా, చీపురుకట్టా, చేదా-తాడూ చేతికిచ్చారు.

భాషాదేవి కాదనకుండా సేవ ప్రారంభించింది.

*　　　*　　　*

కాని అన్నగార్ల అల్లరి జాస్తిగా వుంది.

వెనకటి పూజార్లపూదిరిగానే పీరుహూడా, "అత్యాచారం! మీకేం పొయ్యే కాలమర్రా?" అంటున్నారు.

తమ హయాంలో తాము దేవిని ఎట్లా ఆరాధించిందీ చెప్పుకోలేక వాళ్ళ అంకిళ్ళు పడిపోతున్నై.

వాళ్ళ దప్పులమోత దుర్భరంగా ఉంది.

తమ తరవాత సాహితీదేవికి పూజార్లే లేరని ప్రచారం చేస్తున్నారు....

దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వక పోవడమంటే ఇదేమరి!

ముద్రణ : 15 నవంబరు 1942, చిత్రగుప్త.

# ఆనందం

నాగులూ, జోగులూ పదో నెంబరు బస్సులో కలిశారు.

"ఎక్కడికోయ్, నాగులూ?"

"ఇక్కడికేనోయ్. నువో?"

"నేనూ ఇక్కడికేనోయ్. అందమైన బొమ్మలున్నాయిటగా?"

"ఉండకుండా ఉంటాయా?" అన్నాడు నాగులు, కొంచెంగా నవ్వి.

"నాకు బొమ్మలంటేనూ, దృశ్యాలంటేనూ చాలా ఇష్టం."

"ఎవరికుండదు?"

ఎగ్జిబిషను దగ్గర జోగులు దిగుతూ, "దిగవేం?" అన్నాడు.

"నేనా?" అన్నాడు నాగులు ఆశ్చర్యంతో.

జోగులు బస్సుదిగి ఎగ్జిబిషనులోకి పోయినాడు. తనివిదీర బొమ్మలు చాలా సేపు చూశాడు. చాలా పొద్దుపోయి అతను మళ్ళీ బస్సు ఎక్కేసరికి మళ్ళీ నాగులు తయారు.

"ఆహా, ఎంతమంచి ఎగ్జిబిషను! చూడకపోతివి" అన్నాడు జోగులు.

"పోనిస్తూ," అన్నాడు నాగులు.

"అదేమిటోయ్! అంత సౌందర్యం నీకెక్కడ కనిపిస్తుంది."

"బస్సులోనూ, రోడ్డుమీదా, ఎగ్జిబిషన్‌లోనూ నువేం చూశావు?"

"అందమైన బొమ్మలు."

"ఏమిటా అందం?"

"కంటికి చూడబుద్ధి అయేది; ఎంత సేపు చూసినా చూడబుద్ధి అయ్యేది; నవరసాలూ ప్రేరేపించేది."

"ఆపాటి అందము నేనూ చూశానులే."

"బస్సులోనా?"

"రోడ్డుమీదకూడా. మ్యూజియం దగ్గిర ఒక అమ్మాయి ఎక్కింది. రత్న మనుకో. నల్లగా నిగనిగలాడే జుట్టు, నొక్కులు నొక్కులుగా. చిన్నినోరు. పాలుగారే చెంపలు. పల్చగా ఒళ్ళంతా కనిపించే చీర కట్టింది. ఎటువంటి అవయవ సౌష్ఠవం అనుకున్నావు? అదృష్టం, నా పక్కనే కూచుంది. బస్సు మలుపులు తిరిగినప్పుడల్లా నా మీద విరుచుకుపడి వెంటనే సిగ్గుపడేది. సిగ్గుపడ్డప్పు

డల్లా మొహం జేవురించేది. బొమ్మల మొహాలు జేవురించటం ఎన్నడన్నా చూశావూ?.... ఆ అమ్మాయి కావాలనే అట్లా నా మీద పడిందనుకుంటానోయ్. నే నాడవాళ్ళకి అందంగా ఉంటా గామాలు."

"నీకు అర్టంటే తెలీదోయ్. అర్టు కళ. అది కళాకారులు చేసే ఆదర్శ సృష్టి. నిర్దుష్టంగా ఉంటుంది."

"చెప్పకోయ్, నీ ఎగ్జిబిషను బొమ్మలన్నిటి కన్నా ఆ అమ్మాయి లక్షరెట్లు నిర్దుష్టంగా ఉంది."

"ఇతర రసాల మాటేమిటి?"

"అన్నీ చూశా. నుంగం బాకం మలుపులో కారు ప్రమాదం - బీభత్సం, నాయరు రోడ్డుదగ్గిర ఒక తొంభై ఏళ్ళ ముసలావిడ బస్సు ఎక్కుతూ మెట్లమీద పడింది. పాపం - కరుణ, పదో నంబరు బస్సును పాండే బజారులోనుంచి పోనివ్వనందుకు ఒక ప్రయాణీకుడు కండక్టరుతో పోట్లాట వేసుకున్నాడు-క్రోధం, ఆ మనిషి పానగల్ పార్కు దగ్గిర దిగి వెనక్కు నడిచి పోయినాడు-హాస్యం.... ఏ రసం కావాలో కోరుకో-"

"అయితే కళ వ్యర్థమంటావా?"

"నాకేం తెలుసునోయ్? నేనెప్పుడూ బొమ్మలు చూడను. నాకు బొమ్మ లంటే కొంచెం ప్రెజుడిస్ ఉంది. మూడు రోజుల క్రితం వెల్లింగ్టను సినిమా దగ్గిర ఒక బేనరు చూశా. అందులో ఒకడు మరొకడి గొంతు ఉత్సాహంతో పిసుగుతున్నాడు. ఆ కళాయుతమైన హత్య ఎన్నటికీ పూర్తి కాదు. ఈవాళ మళ్ళీ చూశా. ఆ తప్పుడు ముండాకొడుకు ఇంకా చావలేదు. రేపూ, ఎల్లుండీ, ఆవలెల్లుండీ, ఆటావలెల్లుండీ కూడా చూస్తా. నాకు తెలుసు, వాడు చావడు."

"ఉత్తమమైన చిత్ర కళకూ వెధవ సినిమా బొమ్మలకూ సాటి చెప్పటం న్యాయమేనటోయ్?"

"రెండూ నాకళ్ళకి చచ్చుగానే ఉంటయ్యోయ్!"

నాగులు పక్కసీటు ఖాళీ అయింది. అక్కడ కూచుందామని జోగులు వెనక సీటులో నుంచి లేచాడు. ఇంతలో ఒక అమ్మాయి బస్సులోకి ఎక్కి ఒక క్షణంలో బస్సంతా కలయజూచి నిస్సంకోచంగా నాగులు పక్క కూచుంది.

జోగులుపడ్డ బాధ వర్ణనాతీతం. ఎందుచేత నంటే ఆ అమ్మాయికి నల్లగా నిగనిగలాడే జుట్టూ, రాళ్ళను కరిగించే కళ్ళూ, పాలు గారే చెంపలూ, వొళ్ళంతా కనపడే చీరా ఉన్నాయి. కళాకారులంతా కలిసినా ఆ అమ్మాయి మూర్తిని చిత్రించలేరు. గాలికి రేగే ముంగుర్లను పైకి తోసుకున్నప్పుడల్లా ఆమె వేళ్ళూ—

ఎంత నాజూకైనవి!— నాగులు బుజానికి తగులుతున్నాయి. బస్సు మలుపు తిరిగి నప్పుడల్లా ఆ పిల్ల— సందేహం లేదు, కావాలనే— నాగులు మీదికి ఒరిగి సిగ్గుతో అతనికేసి చూస్తుంది.

ఎటుగాని పాయికడై దగ్గిర నాగులు దిగటానికి లేచాడు. ఆ పిల్లా లేచింది.

"వస్తానోయ్," అన్నాడు నాగులు.

జోగులు మాటాడలేదు.

"నాకు అర్థంటే అభ్యంతరం లేదుగాని, జీవితంలో లభించని ఏ సత్యమన్నా కళ ద్వారా లభిస్తే బొమ్మలు చూడటానికి నాకేమీ అభ్యంతరం లేదు" అంటూ నాగులు దిగిపోయినాడు.

ఆ అమ్మాయి నాగులు వెంటే పోతున్నదో, మరోదారిన పోతున్నదో చూద్దామంటే ఈలోపుగానే బస్సు మలుపు తిరిగిపోయింది.

ముద్రణ : జనవరి 1957, హంస మాసపత్రిక.

# ప్రజాహితుడు

మా జమీందారుగారిని యుద్ధంముందు అమ్మజూపితే కొనేవాళ్ళు లేరు. ఆయన ఖర్చు రాబడికి రెట్టింపుండేది. అప్పు జమీందారీకి రమారమిగా ఉండేది. కాని ఇంతలో దేవుడు పంపినట్టు యుద్ధం చక్కా వచ్చింది. జమీందారుగారు బాగు పడ్డారు. దాని పుట్టి మునిగినట్టు యుద్ధం కాస్తా అయిపోయింది. జమీందారీలు కూడా పోతాయని ఎవరో ఒక వాదు వేశారు.

జమీందారీ పొలాల్లో ఇటీవల బాగుపడ్డవీ, అనాథల చేతుల్లో ఉన్నవీ సొంతం చేసుకోవాలని జమీందారుగారికి వేవిళ్ల కలిగాయి. పోలీసు డిపార్టుమెంటువారు సహాయం వచ్చారు.

ఫలాని ఊరిప్రజలు జమీందారుమీద యుద్ధం ప్రకటించారనీ, పోలీసులు వచ్చి శాంతి రక్షణలు నెలకొల్పారనీ, చచ్చిన రైతులసంఖ్యా, వారి భార్యల సంఖ్యా, పిల్లల సంఖ్యా కలుపుకున్నా వందకంటె లేదనీ వార్తలు వచ్చాయి.

"ఎద్దు ముడ్డి పొడుచుకునే వెధవలక్కూడా ఎంతలేసి కొమ్ములొచ్చాయో!" అన్నాడు నా మిత్రుడు.

మరి కొంతకాలం గడిచింది. ఫలాని ఊళ్ళో పోలీసులు నెలకొల్పిన శాంతి భద్రత లే గాలికి పడిపోయాయో తెలీదు. మళ్ళీ అశాంతి ప్రబలింది. పోలీసులు స్త్రీలను చెరచిచూశారు. దొరికిన వాళ్ళందర్నీ చావగొట్టి చూశారు. అర్ధరాత్రివేళ రైతుల ఇళ్ళలో జొరబడి దొంగతనాలుచేసి చూశారు. కొంపలకి నిప్పంటించి చూశారు. శాంతి భద్రతలు తిరిగి రానేలేదు.

ఫలాని ఊరి రైతులు మళ్ళీ అల్లరి ప్రారంభించారనీ, ఈ సారి పాతికమంది పోలీసులు చచ్చారనీ వార్త వచ్చింది.

"రైతుల్నని లాభంలేదు, వాళ్ళకు న్యాయం చెయ్యాలిసిందే" అన్నాడు నా అమూల్య మిత్రుడు.

ముద్రణ : 27 జూలై 1947, ఆనందవాణి.

# అభ్యుదయగామి

"అభ్యుదయ రచయితల సంఘంలో చేరుతావా?" అని నా మిత్రుణ్ణి అడిగాను.

"కొత్త సాహిత్య పరిషత్తా?" అన్నాడు నా మిత్రుడు.

అవునన్నాను.

"కొత్త సాహిత్య పరిషత్తుల కెంతైనా స్థానం ఉంది మన దేశంలో. ఎందుచేతనంటే మన సాహిత్యం మీద విమర్శలేదు. అసలు సాహిత్యమే చదవరు. విమర్శ లెవరు చదువుతారు? కొత్త సాహిత్యోద్యమాలవల్ల విమర్శలేని లోటు తీరిపోతుంది. అదీకాక మన రచయితలకు పేరు ప్రఖ్యాతులు బొత్తిగా ఉండటం లేదు. వాళ్ళు అప్పుడప్పుడూ కొత్త సాహిత్య పరిషత్తుల్లో చేరి ఉపన్యాసాలిస్తుంటేగాని ఎవరూ గమనించరు. అందుచేత ఈ— దీని పేరేమిటి?— ఈ అభ్యుదయ సాహిత్యోద్యమాన్ని నేనుకూడా బలపరుస్తున్నాను. కాని ఈ ఉద్యమం రాజకీయాల జోలికి పోతుందని చూచాయగా విన్నాను. అది చాలా పొరపాటు—" అని ప్రారంభించాడు నా మిత్రుడు.

"ప్రజాస్వామ్యమంటే రాజకీయార్లో వేలు పెట్టే హక్కు ప్రతివాడికీ ఉండటం కాదా?" అన్నాను.

"అయితే అవుగాక! ఉత్తమ కళారాధకులూ, శాస్త్రజ్ఞులూ, వైజ్ఞానికులూ రాజకీయాల జోలికి పోరాదు. సాహిత్యం కాంగ్రెసు కార్యక్రమాన్ని బలపరుస్తూ, గాంధీజీ ప్రబోధాలు ప్రచారం చేస్తే చాలు, రాజకీయా లనవసరం."

"అభ్యుదయ రచయితలు పాక్షిక రాజకీయాలకు ఎడంగా ఉంటారు," అన్నాను.

"అదే నేనూ కోరేది ... అయినా, ఈ సంస్థకు రాజకీయాలతో సంబంధం లేదని రుజువు చేసేటందుకు, కమ్యూనిష్టుల కిందులో స్థానం లేదని ప్రకటిస్తే బాగుంటుంది," అన్నాడు నా అమూల్య మిత్రుడు.

ముద్రణ : 20 జూలై 1947, ఆనందవాణి.

# అనగా...అనగా

కామేశ్వరమ్మ : అయ్యో, ఎంత చక్కని గొలుసండీ, ఎక్కడ కొన్నారు?

సుందరమ్మ : చేయించాం, కామేశ్వరమ్మగారూ, బజారుకెళ్ళి కొనడానికి మావారు ఒప్పరే. మనక్కావలసిన డిజైనూ, మనక్కావలసిన తూకమూ దొరక దండీ. మీరెన్నయినా చెప్పండి. నాజూగ్గా ఉంటే తూకం ఉండదు. తూకం ఉంటే తగని మోటుగా ఉంటాయి బజారు నగలు. మా వారేమో ఏది లోపించినా ఒప్పరు మరి.

కా : ఏమదృష్టమండి సుందరమ్మగారూ.

సుం : అదృష్టమేమిటమ్మా. మనం ఆడవాళ్ళం పట్టుబట్టితే ఏదైనా సాధించుకో వచ్చు.

కా : మీ కట్లాగే ఉంటుందమ్మా. మీ ఆయన కింత సంపాదన ఉంది గనుక మీ పట్టు సాగుతుంది. (నిట్టూర్చి) నేను పట్టుబట్టి మాత్రం ఏం లాభం చెప్పండీ.

సుం : ఎక్కడి కక్కడే ఉంది. వందలూ పదులూ కాకపోతే రూపాయి రూపాయి చొప్పున ఆదాచేసి మిగిల్చి బంగారం కొనొచ్చు. మరోదీ మరోదీ అయితే విలువలేదు గాని - బంగారం కొనటానికేమమ్మా? ఎప్పటికైనా సొమ్మేగా?

కా : అయ్యో తల్లీ, అట్లాగే రూపాయి రూపాయి చొప్పున కూడబెట్టి చూశా నమ్మా. ఏదో ఖర్చు వచ్చి పడుతుంది. ఆరునెల్లు కూడబెట్టింది ఒక్క పూటలో చెల్లూ.

సుం : పోదురూ, మీదంతా అమాయకత్వం. చేతికి చిక్కిన డబ్బు జారిపోనివ్వ టమా?

కా : ఏం చెయ్యనండి మరీ. కొంపమీది కొచ్చినంత పని అయితేనూ?

సుం : అదంతా మీ భ్రమ. కొంపమీదికేమీ రాదు. అంతగా వస్తే మగవాళ్ళు ఏదో చక్రం అడ్డెయ్యకపోరు. డబ్బు పుట్టించే ఉపాయాలు మనంటండీ వాళ్ళకి నేర్పేదీ? ఏమిటి మీ చాదస్తం?

కా : (కొంచెం ఆగి) ఎంత అందంగా ఉందండి గొలుసూ, ఎన్ని సవర్లూ?

సుం : ఇది మూడున్నరా. మీరు రెండు పేటలది చేయించండి. రెండున్నరలో వస్తుంది - మూడున్నర పెట్టలేమని తోస్తే.

కా : రెండున్నర సవర్లే అమ్మయ్యో!

సుం : సాధ్యం కాదనా?

కా : కూలితో సహా ఏ రెండొందలో కాదుటండీ?

సుం : దాటుతుంది కూడానూ.

కా : నావల్ల కాదు బాబోయ్!

సుం : ఎంత పిచ్చండీ. మీ వల్ల అవుతుందా ఏమిటి? మీ వారివల్ల కావలసింది.

కా : ఆయనవల్లా కాదు లెండి. ఆయన సత్తా నేనెరగనా ఏమిటి?

సుం : అయే ఉపాయం నే చెబితే?

కా : (ఆశగా) నిజమా? ఏదీ చెప్పండి చూస్తాం.

సుం : పాత బంగారం ఏమన్నా ఉందా?

కా : ఏదీ? ఈ మెళ్ళో దండే. తుంపులు తుంపులయితే దారపోగులు కట్టి వేసు కుంటున్నా. ఏం చేసేదీ?

సుం : అది అమ్మేయండి. కాసు పైన ఉండదూ?

కా : ఉండటాని కుంటుందిగాని బంగారమంత మంచిది కాదేమోనండీ. అమ్మ జూపితే చాలా తక్కువ కడిగారు నిరుడు. అంత తక్కువ కమ్మటం ఇష్టంలేక అదే వేసుకుంటున్నా. ఏం చేసేదీ?

సుం : మంచి బంగారం కాకపోతే ఇంకో పదేళ్ళకయినా అంతే. అది వెంటనే అయిన కాడి కమ్మేయ్యండి. ఆ డబ్బు అడ్వాన్సిచ్చి కొత్త నగ పుచ్చు కోండి.

కా : మిగతా సొమ్మో?

సుం : చెబుతున్నాగా? మిగతాది నెలకే ఇరవై చొప్పునో ఇచ్చేద్దురుగాని. మీకు నగ ఏర్పడ్డట్టూ అవుతుంది. మీ వారికి భారమూ ఉండదు.

కా : అట్లా ఇచ్చేవాళ్ళున్నారుటండీ?

సుం : (నవ్వి) ఈ గొలుసు కింద నే నెంత ఇచ్చానని మీ ఉద్దేశ్యం? వందే ఇచ్చాను.

కా : మిగతాది?

సుం : నెలకు యాభై చొప్పున.

కా : నిజమే?

సుం : ఒక్కసారి పొయ్యటానికి నా దగ్గిర మాత్రం ఎక్కడిదమ్మా?

కా : (కొంచెం ఆలోచించి) నెలకు ఇరవై అన్నా ఎక్కువే అంటారో ఏమిటో?

సుం : ఆదే మీ అమాయకత్వం. డాబుగా నగ చేసిన వాడికి నెలకో పాతిక ఇస్తా మనండీ. పది హేనే ఇస్తే కొడతాడా? ఇట్లా జంకితే పన్లు కావండోయ్.

ఓ నెల ఇబ్బందయితే ఆ నెల ఇవ్వనే ఇవ్వమూ. తలకొట్టి మొలేస్తారా? అడుగడుక్కూ మనకే సందేహమైతే ఇంకెట్లా?

కా : (ధైర్యం తెచ్చుకుంటూ) మీరన్నది నిజమే సుమండీ. మా వారు ఒప్పుకుంటార్లెండి. లేకపోతే ఒప్పిస్తాను. మనం రేపు లేదు ఎల్లుండి మీ నగల వర్తకుడి దగ్గిరికి పోదాం.

సుం : ఎల్లుండి కాకపోతే ఆవలెల్లుండీ. మిమ్మల్ని తీసుకుపోయి పీకు గొలుసు కొనిపించే భారం నాదిగా.

# 2

సాంబయ్య : నెలకిరవై అయిదే!

కా : ఇరవైకి ఒప్పుకోమంటే ససేమిరా అంటే నేనేం చెయ్యానండీ?

సాం : నువ్వింకా పెరటిదారినే ఉన్నావు. ఇరవై మాత్రం జీతంలో ఎట్లా మిగల్చటమని? పదిహేను - పది మిగల్చట మెట్లాగో చెప్పు.

కా : మిగల్చదలిస్తే మా బాగానే మిగల్చొచ్చు; ఇంత జీతంలో నిరుటిదాకా మీ తమ్ముడికి నెలనెలా ఇరవై పంపించారు కాదూ?

సాం : (గట్టిగా నవ్వి) నిరుటి మాటా? నిరుటికి మన కిద్దరే పిల్లలు. ఇప్పుడు ముగ్గురూ. నిరుడు ఇంటి అద్దె ఎనిమిది తక్కువిచ్చేవాళ్ళం; నిరుటిది ధరలింత మండిపోవటం లేదు. మన రాబడి తప్ప అన్నీ పెరిగాయి. నిరుటికీ ఈ యేటికీ....

కా : ఈ ఉపన్యాసమంతా దేనికిలెండి - నగ చేయించనని రెండు ముక్కల్లో చెప్పేదానికి. ఇంత సులభంగా కొనటానికే మీ కిష్టంలేకపోతే నే నింకా నగలు కొనేదేమిటి? పెట్టుకునేదేమిటి?

సాం : నీకు నగ చేయించాలిసొస్తుందని ఇంటి అద్దె, వస్తువుల ధరలూ పెంచేశాననా నువ్వనేది?

కా : ఏం వేళాకోళమండీ! ఇంత సులభంగా నగ అమ్మటానికొస్తే కొనలేక పోయినామని నలుగురికీ తెలిస్తే మనకు మాత్రం నామోషీ కాదుటండీ?

సాం : ఎవరికి తెలుస్తుందంటావు?

కా : సుందరమ్మకు తెలిసిందా? ఆవిడకి తెలిస్తే అందరికీ తెలిసినట్లేగా?

సాం : పోనిస్తూ, మనకు శక్తి లేనిమాట అందరికీ తెలిస్తేమటు కేం?

కా : శక్తి లేకపోవటమే అయితే అంతే లెండి. అది కాదుగా?

సాం : నెలకు పాతిక రూపాయలు కట్టి నగ చేయించే శక్తి నా కుందంటావు?

కా : ఉన్నదని మీరు ఒప్పుకుంటారు గనుకనా? వచ్చే ఏడు మన ఖర్చు ఇంకో పాతిక పెరిగితే అప్పుడు మాట్లాడకుండా అంత ఖర్చూ గడుపుతారు? అంతే గాని నాకొక్క దండ ఏర్పాటు కావడం మాత్రం మీకిష్టంలేదు. (కంటనీరు పెడుతూ) నవ్వనివ్వండి. నన్ను చూసేగా నలుగురూ నవ్వేదీ? మీకేం?

సాం : దీనికి ఏడుపు కూడా దేనికిలే. అట్లాగే తీసుకో. తరవాత నేను పడే పాట్లు పడతాను.

కా : (ఆనందంతో) ఆ మాట మొదటే అంటే ఎంత సరసంగా ఉండేది?

సాం : అసలు సరసం ఇన్‌స్టాల్మెంట్లు కట్టేటప్పుడుంటుంది.

# 3

ఆదినారాయణ : పాపం. సాంబయ్యగారు చాలా ఇబ్బంది పడుతున్నట్టు కనిపిస్తుంది.

సుం : సాంబయ్య గారంటే ఆ కామేశ్వరమ్మ మొగుడేనా?

ఆది : ఆయనే ... ఆవిడచేత నువ్వు నగ ఏదో కొనిపించావుట గదూ?

సుం : ఇది మరీ బాగుందండోయ్! "అమ్మా! తల్లీ! నువు కాసులపేరు కొనుక్కో లేకపోతే నా కొంప కూలిపోతుంది" అని నేనావిడతో అన్నానా? నెలకింత చొప్పున ఇచ్చుకునే పద్ధతిమీద కొనాలంటే నేను సహాయం చేసి పెడు తున్నాను తప్పా? అట్లా కాకపోతే ఆవిడగాని, ఆ సాంబయ్యగాని రెండొం దలు కుమ్మరించి నగ కొనగలుగునా? ఆయన చేయించి పెట్టిందేగా ఆ పాత గొలుసూ? హుఁ; నవర్సు యాభై చేసి కొనటానికి లబోమన్నాడు వర్తకుడు. అయ్యో రాత! మధ్య నామీద ఫిర్యాదు చేశాడా ఏం? పోయి ఆవిణ్ణి నాలుగూ అడుగుతాను. నాకు భయమేమిటి?

ఆది : చాల్లే ఊరుకో నీకు పుణ్యముంటుంది. అతను నాతో ఫిర్యాదు చెయ్యలేదు. పాడు చెయ్యలేదు. నగ కింద మొత్తం నూటరవయ్యో ఏమో చెల్లించాడు. ఇంకో అరవయ్యో కాస్త తక్కువో చెల్లించాలట. గిలగిల్లాడుతున్నాడు. ఒడ్డు అంత దూరంలో ఉండగా, రెండు బారలు వెయ్యలేక మునిగి చావా లని ఎవరికీ ఉండదుగా.

సుం : బాగుందే. నగ కొన్నాక డబ్బిచ్చుకోవద్దూ - తల తాకట్టు పెట్టయినా? ఆలికి నగ కొనిపెట్టటం కూడా ఊరికి ఉద్ధరింపు అనుకున్నాడు కాబోలు, మీతో మొరపెట్టుకున్నాడు పాపం!

ఆది : అఁ ఆదేం కాదులే, ఎక్కడన్నా నలభై యాభై రూపాయలు ఎక్కువ వచ్చే ఉద్యోగం దొరుకుతుందా అని చూస్తున్నాడు. ఎక్కడన్నా ఉంటే నన్ను చూసిపెట్టమని మాట వరసకన్నాడు. ఆ విషయం మాట్లాడేటప్పుడు మాటవచ్చి తన భార్య కొన్న దండను గురించి చెప్పుకొచ్చాడు.

సుం : గట్టివాడే; "నీ పెళ్ళామే నా పెళ్ళాంచేత నగ కొనిపించింది గనక నాకు నువు పెద్ద ఉద్యోగం చూపించు" అంటాడా ఏం?

ఆది : ఛీ, ఛీ, పాపం అదేంలేదు. అసలత నటువంటి వాడేకాడు. జీతం రాళ్ళు చాలటం లేదో అని అతను చాల రోజులై....

సుం : గోలెట్టుతున్నాడు ఇంకేం? మంచి ఉద్యోగం ఒకటి చూసి ఇప్పించండి. ఊళ్ళో వాళ్ళని ఉద్ధరించటమేగా మన పనీ.

ఆది : చాదస్తంగా మాట్లాడకు. చేతిలో ఉన్న ఉపకారంచేస్తే అరిగిపోతామా ఏం?

సుం : (దొంగను పట్టినట్టుగా) ఓహో, అప్పుడే ఉద్యోగం చూసి పెట్టారన్న మాట. మనకు లేకపోతే మానె ఊళ్ళో వాళ్ళకు చూసి పెట్టారు. ఇహం లేకపోతే పీడపాయిరి.... పరమైనా వుంటుంది.... ఏం ఉద్యోగం ఇప్పిస్తున్నారు. బాబూ?

ఆది : ఆ ఉద్యోగం మనకు దేనికే? ఏదో సినిమా కంపెనీలో ఎకౌంటెంటు పని. సాంబయ్య ఇంకో యాభై రూపాయలు పై సంపాదన తెచ్చుకుంటాడు, ఉన్న ఉద్యోగం ఉండగా.

సుం : ఆ కంపెనీవాళ్ళు మీకు తెలుసా?

ఆది : కొద్దిగా.

సుం : వాళ్ళ దగ్గర మీకున్న పలుకుబడి కాస్తా సాంబయ్యకు ధారపోశారన్న మాట. అంతేగా? ఆ యాభైరూపాయలూ మనమే సంపాదించుకుంటే చేదా?

ఆది : నా ఖర్మగాలి, నన్ను పొద్దునా సాయంత్రం చిల్లర కంపెనీల ఎకౌంట్లు చూడమన్నావా? ఏమిటి నువ్వు అనేది?

సుం : మీరే చెయ్యాలా ఏమిటి? ఇటువంటి పై సంపాదనలుంటే మన వాళ్ళెవరికన్నా ఇప్పించరాదూ?

ఆది : ఎవరికన్నా అనగానే సరా? ఎవరున్నారు చెప్పు.

సుం : వెతికితే దొరక్క పోతారా ఏం?

ఆది : వెతకాలి గద? దొరికినప్పుడు యిప్పించలేక పోన్లే.

సుం : తీరా అయినవాళ్ళ కిప్పించాలిసొచ్చేసరికి మన పలుకుబడి కాస్తా యితరులకు ధారాదత్తం అయిపోయి ఉండకుండా ఉంటేనూ.

ఆది : చాదస్తం మాటలాడకు. సాంబయ్యకి పై సంపాదన చూపించినంత మాత్రం చేత నా తపోశక్తి అంతా అయిపోలేదు. సాంబయ్య భార్యని మహా ఉద్ధరిస్తూ ఉంటావు. సాంబయ్యకు సహాయం చేసినందు కంత నీలుగుతావేం?

సుం : సాంబయ్యని గాదు, ఇంకోరిని గాదు. ఇప్పించే ఉద్యోగాలు అయినవాళ్ళకెందు కిప్పించరాదూ అని.

ఆది : మళ్ళా మొదలా? ఎవరా అయినవాళ్ళు?

సుం : మా తమ్ముణ్ణి పిలిపించి వాడికి ఉద్యోగాలిప్పించ రాదూ?

ఆది : (ఆశ్చర్యంగా) హయ్యరు పాసయి డ్రాయింగు మేస్టరు చేసుకునేవాణ్ణి-అత్తారింట చేరి ఇంటి అద్దె, తిండి ఖర్చూ లేకుండా హాయిగా కాలక్షేపం చేస్తున్నవాణ్ణి ఇక్కడికి రప్పించి, వాడికి చాతగాని ఎకౌంట్లపని ఇప్పించనా? నీకేమన్నా మతిపోయిందా ఏం?

సుం : మాట వరసకు చెప్పా, మన వాళ్ళెవరున్నారు, ఎవరున్నారంటుంటే! దానికింత రాద్ధాంతం చేస్తారేమిటి?

ఆది : పోనీ, నువు మాట్లాడేది నీకన్నా అర్థమవుతున్నదీ, నాకర్థం కాకపోతేమానె.

సుం : నా మాటలు మీకు ఒకనాడు అర్ధ మయాయా ఏమిటి?

ఆది : నా అదృష్టం. పొద్దు పోయింది. అన్నం పెట్టు.

సుం : మీరే సవాళ్ళేస్తూ కూర్చున్నారు. పదండి.

## 4

కా : నిజంగా మీ భార్యా భర్తలకి ఎంత రుణపడి ఉన్నామో చెప్పలేను. మీ వారు మావారికేదో పై సంపాదన చూపారట. నిన్న సాయంకాలం ఇంటి కొచ్చి, ఆదినారాయణ గారి లాంటి ఉపకారులు లేరని ఎంతోసేపు మెచ్చు కున్నారు.

సుం : చేతిలో ఉన్న ఉపకారం చెయ్యటానికేమిటమ్మా? అరిగిపోతామా? నేనే మా వారితో అన్నా- "పాపం సాంబయ్యగారు ఇబ్బంది పడుతున్నట్టున్నారు. నా మూలంగా వాళ్ళ ఖర్చు కూడా జాస్తి అయిందేమో"-నని.

కా : అదేం మాటండీ? నగ నా మెళ్ళో ఉందా మీ మెళ్ళో ఉందా? మీరాపాటి సహాయం చెయ్యకపోతే ఇది ఏర్పడి ఉండునా?

సుం : ఏం సహాయం లెస్తురూ? మాట సహాయమేగా? నోరు అరిగిపోతుందా?.... ఇంతకూ మీ వారికి ఉద్యోగమెక్కడా?

కా : ఏదో కొత్త సినిమా కంపెనీ పెట్టారట. వాళ్ళ ఎకౌంట్సు చూసి పెట్టా లట. కొంతకాలంపోతే వాళ్ళు ఉద్యోగంకూడా ఇస్తారుట. అంతదాకా నెలకు యాభై ఇస్తారుట.

సుం : ఇంకో రెండు జతల గాజులు చేయించుకోవచ్చు నిక్షేపంగా.

కా : (దెబ్బతిన్నట్టు) కొన్న నగ చాల్లే బాబూ. నానాగడ్డీ తింటున్నాం డబ్బు కట్టలేక.

సుం : (గట్టిగా నవ్వి) అయయ్యో, ఎంతో సత్తెకాలం మనుషులండీ? ఈ మాత్రా నికే జెంబేలు పడిపోతారా? నాలుగు సవర్ల బంగారం ఇట్లాగే కాదుటమ్మా

ఏర్పడేదీ? దండకు డబ్బు కట్టవలసొచ్చేగదా యీ పై సంపాదనంటూ చూసుకోవలిసొచ్చింది. యాభై రూపాయలు పైన వచ్చేటప్పుడు మరో పాతిక నెలనెలా కడితే ఏమీ అంట.

తా : అమ్మయ్యో, ఇంక ఆ ఊసెత్తకండి.

సుం : అదే చాదస్తమంటేనూ. పైనెలనుంచీ యాభయ్యేసి రూపాయలు వస్తాయా? ఇంక రెండు నెలల్లో దండ బాకీ తీరిపోతుందాయె. ఆపైన యాభైకి యాభై మిగులేగా. అందులో ఒక పాతిక గాజులకిందపోతే కొంప మునిగిపోతుంది టండీ?

తా : (కాస్త మెత్తబడుతూ) మీరన్నదీ నిజమేననుకోండి....

సుం : ఇంకా అనుకోవటమేమిటి? నే చెప్పింది అక్షరాలా నిజం. మళ్ళీ ఆలస్య మెందుకూ? ఇవాళే పోదాం నగలవాడి దగ్గిరికి.

తా : మా వారితో ఇవాళ చెప్పి తేపు పోదాం.

సుం : అదే పిచ్చి. మీవారి నడగటం, ఆయన వద్దనటం. మీరు కాదు కూడ దనటం, ఆయన తరవాత చూద్దాం లెమ్మనటం - ఎందుకిదంతా? మీరు నగలు పెట్టుకుంటే ఆయన చూసి సంతోషించరా? ముందుగా చెబితే ఆయనకి డబ్బే కనిపిస్తుంది. నగ, కొన్నాక కనిపిస్తుంది.

తా : సరే కానివ్వండి. ఇటువంటి విషయాల్లో మీకున్న అనుభవం నాకులేదు. నేను పిరికిదాన్ని. పలకల గాజులు పెట్టుకోవాలని ఎన్నాళ్ళనుంచో నాకు మనసు.

సుం : ఇంకేం ఇవాళ తీర్చుకుందురుగాని.

# 5

సాంబయ్య : ఏమండి ఆదినారాయణగారూ! నాకు మతి పోతోంది. ఆ కంపెనీ వాళ్ళెంతకూ తేల్చరేం.

ఆది : తొందర పడకండి, సాంబయ్యగారూ, వాళ్ళు కంపెనీ రిజిష్టరు చేసుకునే ఆలోచనలో ఉన్నారు. ఏకంగా మీకు అందులో ఉద్యోగమే కుదిరిపోయే టట్టు చూద్దాం. ఆ పనంతా నాకు వదలండి.

సాం : (కంగారుగా) క్షమించండి. మీరు నాకు ఉపకారం చెయ్యబోతే నేను మిమ్మల్ని తొందర పెట్టవలసి వచ్చింది. నాకే ఎంతో సిగ్గుగా ఉంది.

ఆది : ఏమైనా డబ్బు అవసరమా?

సాం : ఏం చెప్పమన్నారు. మళ్ళీ మా ఆవిడ కొత్త గాజులు కొన్నది.

ఆది : (ఆశ్చర్యంగా) మా ఆవిడ పనేనా?

సాం : ఆవిడెందుకనటం? మా ఆవిడ అవ్యక్తురాలు గనకనా.

ఆది : ఛీ, ఛీ, ఏం మనిషి? కిందటిసారి గట్టిగా చెప్పాను. వినదు. సాంబయ్య గారూ, మా ఆవిడ మీకు తెచ్చిపెట్టే చిక్కులు చూస్తే నాకే విచారంగా ఉంది. ఎవరి భార్యల చాదస్తంతో వారు బాధపట్టం అదో మోస్తరు. మరొకరి భార్య మూలంగా - ఒక్క క్షణం ఉండండి. (టెలిఫోన్ డయల్ చేసి) హలో, ఆదినారాయణా హియర్....మరే....నేను మీతో సాంబయ్య గారిని గురించి చెప్పానే, ఆయన సంగతి.... ఓహో, రేపే సెటిల్ చేస్తున్నారా? వెరీగుడ్, వెరీగుడ్.... రేపు ఉదయం పదింటికి రమ్మన్నారా? మంచిది. జీతం సంగతి మనం మాట్లాడదాం లెండి. ఆయన కూడ చాలా అనుభవం ఉన్నవారుగాని కొత్తవారు కారు. నేచెప్పాను గదూ.... సన్‌డే (టెలిఫోన్ పెట్టేసి) ఇంకేం సాంబయ్యగారూ, రేపువెళ్ళి అన్ని విషయాలు మాట్లాడండి. మీకు అర్జంటుగా డబ్బు కావాలంటే నా దగ్గిర పుచ్చుకోండి. తాపీగా తిరిగి సద్దవచ్చు.

సాం : నిజంగా మీ మేలు....

ఆది : ఆ మాట అనకండి. నేను చేస్తున్నది మేలేకాదు. పాప పరిహారం.

సాం : మీ భార్యగారిని ఏమీ అడక్కండి? నొచ్చుకుంటారు.

ఆది : అదుగో మాటలోనే వచ్చింది. పాపీ చిరాయుః.

సాం : నే వస్తా మరి.

ఆది : మంచిది వెళ్ళిరండి. రేపు సాయంకాలం నాకు చెబుదురుగాని వ్యవహారం ఏమయిందీ.... ఏమే ఇవేశం కొనిపించావు సాంబయ్యగారి భార్యచేత?

సుం : పోనిస్తురూ మీ వేళాకోళమూ మీరూను.

ఆది : అసలు నీ ఉద్దేశమేమిటో చెబుతావా? సాంబయ్యగారి సంసారాని కెందు కిట్లా ఎసరుతెస్తున్నావు? ఆవిణ్ణి చూస్తే కోపమా? ఆయన్ను చూస్తే కోపమా? ఏమిటిదీ?

సుం : ఒకర్ని చూస్తే నాకెందుకు కోపమండీ? ఆయన మీ చెవిలో, నేను లేని సమయంలో ఊదటమూ, మీరు నామీద ఎగరటమూ, బాగానే ఉందిది.

ఆది : ఆయనేమీ ఊదలేదు. ఆయన వ్యధ నేనే పసిగట్టాను. ఇన్నేళ్ళు నీతో కాపరం చేసినాక నీ మహత్తు నాకు తెలీదా?

సుం : ఆవిడ పలకగాజులో అని కలవరిస్తుంటే నా మహత్తంటారేమిటి? ఆడవాళ్ళు ఆడవాళ్ళకు సాయం చేసుకోకపోతే మగవాళ్ళు చేస్తారా? అంత మనసుగా ఉంటే మీరే వెళ్ళి ఆవిడకి నగలు చేయించిపెట్టండి. నేను మానేస్తాను.

ఆది : ఏడిచావు.

సుం : కాకపోతే మీకా సాంబయ్యగారిపట్ల శ్రద్ధంతా ఏమిటో - తెలీకడుగుతాను

ఆది . నా పెళ్ళాం ఆయన మెడకి ఉచ్చువేస్తుంటే నేన పాటి ఆదుకోవద్దూ. లేక పోతే ప్రపంచం నామీదేగా విరుచుకు పడేదీ?

సుం : మా మంచి సాకే దొరికింది.

ఆది : ఏ సాకో. రేపాయనకు సినిమా కంపెనీలో ఉద్యోగం అవుతోంది. ఇక నన్నూ వారి కుటుంబం జోలికి పోక బుద్ధిగా ఉండు.

సుం : (కోపంగా) ఆ సాంబయ్యగారి చెప్పుడు మాటలువిని నన్ను అడ్డమైన మాటలూ అంటే నేను పడను సుమండీ.

ఆది : పడు, పడకపో. నువ్వాయన్ని ఇంకో రొంపిలోకి దింపినా నే చెయ్యగల దేమీ లేదు.

సుం : ఆయన రొంపిలోకి దిగితే నాకేం, ఏట్లోకి దిగితే నాకేం.

# 6

కా : అవును సుందరమ్మగారూ, ఇది మంచి ఉద్యోగం. ఇక మా కష్టాలు గట్టెక్కి నట్టే. కొన్ని నగలేమో కొనేశాను. ఇక నాలుగు డబ్బులు మిగిలితే వెన కేసుకునే పద్ధతి చూడాలి.

సుం : మంచి ఉద్యోగం, బాగానే ఉందిగాని సినిమా కంపెనీ కాకుండా ఉంటే బాగుండిపోను. పాపం. అందులోనూ మీ ఆయన అమాయకం మనిషి.

కా : సినిమా కంపెనీల్లో జీతాలు సరిగా రావా? మోసం చేస్తారా?

సుం : జీతాలు రాకేం? ఇంటికి రావు.

కా : అదేం?

సుం : ఎంత సత్తెకాలం మనుషులండీ మీరు? సినిమా కంపెనీల్లో వేషాలేసే ఆడ వాళ్ళుంటారు చూడండి, వాళ్ళు అమ్మో.

కా : మావారు అటువంటివారు కారులెండి.

సుం : ఏమిటండీ చెబుతారూ. ఆడది తలుచుకున్నాక మగవాడి ప్రజ్ఞేమిటీ? ముష్టి ప్రజ్ఞా. విశ్వామిత్రు డంతటివాడు పిల్లి మొగ్గలు వేస్తేనూ?

కా : ఈ సినిమా ఆడవాళ్ళేం చేస్తారండీ?

సుం : ఏం చేస్తారేమిటి? తిరుక్షౌరం చేసేస్తారు. జీతం ఇంటికిరాదని చెప్పాగాదూ?

కా : నిజమా? మీకెట్లా తెలుసూ?

సుం : రెండు మూడేళ్ళ క్రితం మా వారికి సినిమా కంపెనీవాళ్ళు ఏడువందల యాభై రూపాయల మీద ఉద్యోగం ఇస్తానంటే నేను ఒప్పుకోలా, బతి కుంటే బలుసాకు తినొచ్చు. అంతేగాని మగవాళ్ళని చూస్తూ చూస్తూ ఆ నరకంలో అడుగు పెట్టనివ్వటమే, ఒకసారి కాలుజారినాక ఇంకేమన్నా ఉందా!

కా : (భయపడి) అమ్మయ్యో, అలాగైతే ఈ ఉద్యోగం వద్దుబాబూ, డబ్బు లేక పోతే పీడా పోయింది.

సుం : చేతులు కాలాక ఆకులు పట్టుకునిమాత్రం లాభమేమిటి గనకా? చెబుదామా వద్దా అని రాత్రల్లా మధనపడ్డా. చెబితే ఏమనుకుంటారో చెప్పకపోతే నిష్కారణంగా పండంటి కాపరం పాడవుతే చూస్తూ ఊరుకున్న పాతకం చుట్టుకుంటుందే! అని చాలా బాధపడ్డా.... అన్నట్టు మీవారొచ్చినట్టుంది. దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోండి.
మంచిదండీ....

సాం ఏమే, ఆ వెళ్ళింది ఆదినారాయణగారి భార్యేనా?

కా అవును.

సాం మళ్ళీ ఏం కొనమంటుందేం?

కా ఆవిడ మనని వెయ్యి కళ్ళతో కనిపెట్టి ఉంటే మాటిమాటికీ ఆవిడమీద పడతారేం.

సాం ఆవిడ దృష్టి దోషంతో ఇప్పటికే చాలా బాధ పడుతున్నాం - వెయ్యికళ్ళు కూడా దేనికిలే. దేవుడులాగా ఆదినారాయణగారీ ఉద్యోగం కుదర్చకపోతే చచ్చేవాళ్ళం.

కా : నా మాట విని ఆ ఉద్యోగం మీరు చెయ్యొద్దు.

సాం : (ఆశ్చర్యంగా) ఏమిటీ?

కా : అంత పెద్ద ఉద్యోగాలు మనకొద్దులెండి. ఏదో ఉన్నదాన్లోనే బతుకుదాం.

సాం : ఉన్నదాన్లో బతకలేకేగాదూ, ఈ ఉద్యోగంకోసం ఆదినారాయణ గార్ని పీడించిందీ?

కా : (ఏడుస్తూ) మన కాపరం తియ్యటానికి ఆయనొకడు దాపరించాడు.

సాం : అదేమిటే, పిచ్చిదానా.

కా : ఈ దిక్కుమాలిన సినిమా కంపెనీలో చేరితే మీ ఇల్లూ వళ్ళూ కూడా గుల్లయిపోతుంది.

సాం : ఈ పరమసత్యం నీకెవరు ఉపదేశించారు? ఇంకా అడగటం దేనికి? ఆవిడ గారే అయివుంటుంది.

కా : (తమాయించుకుంటూ) మన మంచికోరే చెప్పింది.

సాం : ఆవిడ మొదట్నుంచీ మన మంచి కోరకుండా ఏదైనా చెప్పింది గనకనా.

కా : నా కదంతా తెలియదు. మీరు ఈ వుద్యోగం చేయటానికి వీలులేదు.

సాం : నీ చాదస్తం చూస్తే నాకు మతిపోతూంది.

కా : (మొండిగా) అవును, నాది చాదస్తమే. ఏం చేస్తాం. మీరీ ఉద్యోగం చేస్తే నేనెందులోనన్నా దూకుతాను.

సాం : నీ సలహా వింటే కొంప గుండమే. నీకు తెలీని విషయాల జోలికి రాకు.

కా : (ఏడుస్తూ) మీరా ఉద్యోగం చెయ్యొద్దు నన్ను చంపుకుతిన్నట్టే.

సాం : నామాట కాస్త వింటావా ?

కా : నే విన్ను.

సాం : నీ యేడుపు తగలెయ్యా, ఒక్క క్షణం ఊరుకోవే.

కా : (ఇంకా గట్టిగా ఏడుస్తూ) ఉద్యోగం చేయనని ఒట్టేయండి.

సాం : ఛీ, ఛీ; నీ జన్మ చెడా? నాకు నువ్వూ వద్దు. నీ దిక్కుమాలిన ఉద్యోగమూ వద్దు; నేనీ క్షణమే లేచిపోతున్నాను. నీ యేడుపు నువు ఎట్లాగన్నా ఏడుచుకో.

(తలుపు ధడాల్న మూసిన చప్పుడు)

ముద్రణ : 1 జనవరి 1952, ఉదయిని.

# నడమంత్రపు సిరి

## (ట్యుటోరియల్ స్కూల్)

శాస్త్రి : కూర్చోవోయ్, దాసూ ! పేపరు చూశావుగా ? బెనారస్ మెట్రిక్ పిల్లలు నలుగురూ మన మాట దక్కించారు.

దాసు : అవును, చూశా.

శాస్త్రి : అందులో ఇద్దరైనా డింకీ కొడతారనుకున్నా.

దాసు : వాళ్ళ అదృష్టం బాగుందిలే.

శాస్త్రి : నువ్వూ నేనూ వాళ్ళు చచ్చేట్టు సానపడితే అదృష్టమేమిటి, అదృష్టం?

దాసు : అదృష్టంకూడా కలిసి రావాలిగా ?

శాస్త్రి : వాళ్ళ అదృష్టమేం చూశావ్ ? మన అదృష్టం చూడు. ఈ యేడు మన ట్యుటోరియల్ స్కూలు పిల్లల సంఖ్య రెట్టింపు కావాలి మరి. మనిద్దరివల్లా కాదు. ఇంకో మేస్టర్నికూడా వేసుకుందాం. ఏమంటావ్?

దాసు : అట్లా అయితే ఒక మేస్టరుకాదు, ఇద్దరు కావలిసొస్తారు మరి.

శాస్త్రి : ఏం ?

దాసు : నేను వెళుతున్నా శాస్త్రీ పట్నం. ఆ మాట చెబుదామనే వచ్చా.

శాస్త్రి : (దిమ్మరపోయి) పట్నమా? ఏదన్నా ఉద్యోగమా?

దాసు : వచ్చిందో సినిమా ఛాన్సు....చూస్తామనీ!

శాస్త్రి : చాలా సంతోషం. వేషం వేస్తావా?

దాసు : కాదోయ్, డైరెక్టరుకు అసిస్టెంటు. నా స్నేహితుడొకడు.... చాలా కాలం అసిస్టెంటు డైరెక్టరుగా ఉండి, ఇప్పుడు డైరెక్టరు ఛాన్సు సంపాదించాడు. రమ్మని రాశాడు. పోకపోతే బాగుంటుందీ ?

శాస్త్రి : ఒక్కందుకు నాకు చింతగా వుంది. కిందటేడు నేను నీ కిచ్చిన జీతం చాలా కొద్ది...

దాసు : నువు పెద్ద జీతం తీసుకున్నావు గనకనా ?

శాస్త్రి : అది వేరే సంగతి. ఈ ట్యుటోరియల్ స్కూలు నేను నాటిన మొక్క. అది ఇవాళకాకపోతే రేపైనా పెరిగి పెద్దదై ఫలమిస్తుంది. దాన్ని ఇద్దరం పంచుకుంటాంగదా అనే నమ్మకంతో నిన్నుకూడా నాతోబాటు శ్రమపడనిచ్చాను. నువు పడ్డ శ్రమకు ఫలితమేం దక్కింది ?

దాసు : నా కా విచారం లేదులే. ఒక ఏడాది పాటు ఊరికే కూర్చోకుండా కొంత సంపాదించుకునేందుకు అవకాశం ఇచ్చావు. నేను వెళ్ళిపోవడంవల్ల నీ కిబ్బంది కలక్కుండా ఉంటే చాలు నాకు.

శాస్త్రి : నీ అంత శ్రద్ధగా పనిచేసేవాళ్ళు దొరికితే ఇంక లేనిదేం? అయినా ఏదో విధంగా నెట్టేస్తానులే. ఇంతకీ ఎప్పుడు ప్రయాణం?

దాసు : రాత్రి మెయిలుకు పోదామనుకుంటున్నా.

శాస్త్రి : మంచిది దాసూ విష్ యూ లక్.

దాసు : థాంక్స్; నాకింకా చాలా పనులున్నై. పోయిరానా మరి?

శా : మంచిదోయ్.

దా : అన్నట్టు, మా బాబాయి కొడుకు చలపతిగాడు, లెక్కల్లో పూజ్యుడులే. వాణ్ణి బెనారస్ మెట్రిక్ చదివిస్తామా అని ఆలోచిస్తున్నారు. బహుశ నీ దగ్గిరకే తెస్తారు. కాస్త వాణ్ణి కనిపెట్టుండు.

శా : అట్లాగే.

దా : వస్తానోయ్ మరీ.

శా : ఉండు, నేను కూడా బయటికి వస్తున్నా....

దా : రా, అయితే ...

(సోమసుందరంగారి ఇల్లు)

సీత : (పేపరు చప్పుడుచేస్తూ ఉద్రేకంగా) ఇదిగో నాన్నా ! నా నెంబరూ. పాసయాను.

సోమ : అక్కడికి నా పూచీ అయిపోయింది. ఇక ఏం చేస్తావ్?

సీ : ఏం చెయ్యమంటే అది చెయ్యటానికి సిద్ధంగా వున్నాను.

సో : (విరక్తిగా) ఏమిటో, ఏం చదువులో, 'ఆడ పిల్లలకి పెద్ద చదువెందు'కని అందరూ అడుగుతూనే వచ్చారు. బియ్యే పాసయినా, ఎమ్మే పాసయినా, ఆడదానికి మొగుణ్ని సంపాదించుకోవటమే అసలైన ఉద్యోగమన్నారు. అయినా పంతంకొద్దీ బియ్యేదాకా చెప్పించా. ఇక నీకు నేను చెయ్యగలది ఏమీ లేదు. ఫలాని పని చెయ్యమని నీకు సలహాకూడా ఇవ్వలేను. పెళ్ళే చేసుకుంటావో, ఉద్యోగమే చేసుకుంటావో, ఎవర్ని పెళ్ళి చేసుకుంటావో, ఏం ఉద్యోగం చేసుకుంటావో - అదంతా నీ యిష్టం.... ఎవరది? నువ్వుటోయ్, శాస్త్రీ!....

సీ : (ఉత్సాహంతో) నేను పాసయాను శాస్త్రిగారూ.

శా : పత్రికలో చూశా.

సో : నువ్వు అహోరాత్రులు ఇంగ్లీషు నూరి పొయ్యబట్టే పాసయింది.

శా : లేకపోయినా సీత తెలివిగలదేలెండి. ఏదైనా ఆధారం దొరికితే, నిలబడగల వాళ్ళకూ్కడా అట్లా అనుకోబుద్ధవుతుంది. ఇంగ్లీషులో సహాయపడటానికి నేను దొరికాను గనక నా సహాయం తీసుకుంది. లేకపోతే తనకు తానే చదువుకునేది.

సో : ఇక ఏ ఆధారాన్నీ అనుకోవద్దనే అమ్మాయికి చెబుతున్నా. ఏమోయ్, నాకు చేతయిందంతా చేశా. బియ్యే పాసయింది. ఇక పెళ్ళే చేసుకుంటుందో, ఉద్యోగమే చేసుకుంటుందో తన ఇష్టం! ఏమంటావ్, శాస్త్రీ.

శా : మీరు గనక సీతకి ఇంత చదువు చెప్పించారుగాని. మీ స్థితిలో కొందరు మగ పిల్లలకూ్కడా కాలేజీ చదువు చెప్పించరు.

సో : కాదుమరీ ?.... అయినా ఇందులో నా స్వార్థం కూడా లేకపోలేదులే. అమ్మాయి థోర్డుఫారం చదువుతుండగానే ఆలోచన చేశా - దీనికి చదువు చెప్పించటం సులభమా, మొగుణ్ణి సంపాదించటం సులభమా అని. ఎంత ఆలోచించినా చదువే తేలికనిపించింది.

శా : మంచి ఆలోచనే చేశారు కాని, చదువుకున్న ఆడవాళ్ళు తమ పెళ్ళిళ్ళు తామే చేసుకోగలరని మీ నమ్మకమా ?

సో : ఏం? ఎందుకు చేసుకోరాదూ? ఇప్పుడు మా సీతమ్మే ఉందనుకో. దానికన్న నా ఎకు్కవేముందీ? అది సంపాదించుకోలేని మొగుణ్ణి నే మాత్రం ఎక్కడ సంపాదిస్తానూ? ఏమంటావ్?

శా : అనుకున్నంత సులభం కాదు, సోమసుందరంగారూ.... పెళ్ళి అనేసరికి యెంతో మంది సహకారం కావాలి. శకుంతల దుష్యంతుణ్ణి చేసుకోవటానికి అనసూయా ప్రియంవదల సహాయం ఎంతవుందో చూడండి....

సో : అటువంటి సహాయం ఎవరన్నా చెయ్యొచ్చు. అసలు ఉద్యోగం ఓటి సంపాదించి నలుగురిమధ్యా తిరుగుతుంటే అన్ని సహాయాలూ వాటంతటవే వస్తాయి. అమ్మాయికెక్కడన్నా ఉద్యోగం చూసిపెడుదూ!!

శా : ఇక పత్రికలు ముందేసుకుని దరఖాస్తులు పెట్టటమే....అన్నట్టు ఒక ఉద్యోగం నేనే ఇవ్వగలను (అనుమానంగా).... సీతకు అభ్యంతరం లేకపోతే!

సీ : అభ్యంతరం దేనికి ?

సో : ఏమిటి నాయనా అదీ ?

శా : మరేంలేదు. మా ట్యుటోరియల్ స్కూల్లో ఇవాళే ఖాళీ వచ్చింది. దాసు సినిమా ఛాన్సు సంపాదించి పట్నం వెళ్ళుతున్నాడు.

సీ : సినిమా ఛాన్సే! నీకు జ్ఞాపకం వుందా, నాన్నా? నా చిన్నతనంలో ఒక డైరెక్టరు మన వూరొచ్చి నన్ను మాటలు చెప్పమన్నారు, పాడమన్నారూ!

సో : అవునవును ... నువు పనికిరావన్నాడు.

సీ : చిత్రమండీ, శాస్త్రిగారు. 'నేనిప్పుడే వస్తాను' అన్నమాటని ఎన్ని రకాలుగా అనగలనో చూస్తానన్నాడు. నాకు చాతకాలా.... ఆయన అని చూపించి నన్ను అనమన్నాడు. అప్పటికీ చాతకాలా.

శా : నీకు చాతయిన పని.... మా పిల్లలకు పాఠాలు చెప్పు. ఎక్కువ ఇచ్చుకోలేను. నెలకి యాభై యిస్తాను.

సో : నీకు సహాయం చెయ్యాలంటే జీతం తీసుకోవాలిటోయ్? ఊరికేనే ఉందిగా? పోనీ అట్లాగే చెబుతుందిలే.

సీ : ఆయన వేళాకోళానికంటుంటే నువు నిజం పట్టించుకున్నావా, నాన్నా?

శా : వేళాకోళంకాదు సీతా. నిజంగానే. ఈయేడు పిల్లలు ఎక్కువయ్యేలాగుంది. ఒంటరిగాణ్ణయిపోయాను? కొన్ని సబ్జెక్ట్సు మరెవరన్నా చెప్పేందుకుండాలి.

సీ : నేనేం చెప్పగలనండీ.... నా మొహం!

శా : నేను చెబితే సుబ్బేందుకు చెప్పలేవ్? నా అంత చదువు నువూ చదివావుగా?

సీ : అలవాటుండొద్దూ?

శా : రెండేళ్ళక్రితం నాకు మాత్రం ఏమలవాటుందీ? చెబుతుంటే అదే వస్తుంది. నీకేదన్నా అనుమానంవస్తే నేనుంటాను. జీతం విషయమే ఆలోచించాలి. చాలా తక్కువ. ఇంకా రెండు మూడేళ్లు పోతేగాని స్కూలుకు పునాది ఏర్పడదు. అప్పుడు ఇంకాస్త బాగా గిట్టుబాటవుతుంది. ఏమంటావు?

సీ : ఏం నాన్నా!

సో : నేనేమంటానే? నువు యాభై రూపాయలు ఖర్చుచెయ్యటానికి బదులు, యాభై రూపాయలు తెస్తే అది కుటుంబానికి నూరురూపాయల ఆదాయమన్నమాట.

సీ : మీకు ధైర్యముంటే నన్ను వేసుకోండి.

శా : ఇంకో షరతు కూడా మరి.

సీ : ఏమిటది?

శా : ఏప్రిల్ ఆఖరుదాకా అంటిపెట్టుకుండాలి. మధ్యలో మానేస్తే పాఠాలు పాడవుతాయి.

సీ : ఎవరో పరాయివాళ్ళకు చెప్పినట్టు చెబుతున్నారే! మధ్యలో మానేస్తా నాండీ?

శా : పరాయివాళ్ళు కాకపోయినా కూడా ఆది నిష్ఠూరం మంచిది సీతా!

సీ : మీ యిష్టంవచ్చినట్టే కానివ్వండి.

శా : నాకు పెద్ద బరువు వొదిలింది. ఒకవేళ ఇంకో మేష్టరు అవసరం కావచ్చు. ఏ ఇంటర్ పాసయినవాణ్ణయినా చూసి తెస్తానులే. మళ్ళీ కరపత్రాలు అచ్చువెయ్యాలి. నీ పేరు కూడా నా పేరుతోబాటు వేయిస్తాను.

సో : అవునోయ్ నువ్వేదన్నా చక్కగా ఉద్యోగం చేసుకోక ఈ ట్యుటోరియల్ స్కూలు పెట్టుకున్నావేమిటి? ఇది శ్రమ హెచ్చు. ఫలితం తక్కువా కాదూ?

శా : మీరు స్కూళ్ళ పరిస్థితి చూస్తే అట్లా అనరు. బతకలేక బడిపంతులన్న సామెత ఈనాడు అక్షరాలా నిజం. పైన వందమంది యజమానులు, పరువూ, మర్యాదలూ ఏమీలేవు, ఆఖరుకు చదువు బాగా చెప్పామన్న తృప్తికూడా దక్కనివ్వరు. అధికార్ల పిల్లలైతే వాళ్ళని చూసికూడా వొణకాలి. ఇప్పుడు నాకేం విచారముంది చెప్పండి. జీతం డెబ్భై ముట్టినా, నూరుముట్టినా ఈ జీతంరాళ్ళ కోసం ఒకరిని దేహీ అని అడగక్కర్లేదు. పిల్లలకు చదువు అంటుతుంది. వాళ్ళు చదువుకోసమే వస్తారు. మనం చదువే చెబుతాం. ఇంకే రాజకీయాలు ఉండవు. ఇంకో రెండు మూడేళ్లు ఆగి చూడండి. స్కూలును ఎటువంటి స్థితికి తెస్తానో. సీతా! నువ్వు ఇంకో ఉద్యోగం చూడకుండా ఉండిపోతే నీకూ గిట్టుబాటవుతుంది. నాతో సమంగా నీకూ ముట్టేట్టు చూస్తాను.

సీ : అట్టాగేలెండి. ఉన్నవూళ్ళో ఉద్యోగం దొరికితే ఎవరన్నా కాదంటారా!

శా : నేనూ సగం ఆ ఉద్దేశంతోనే పై వూళ్ళ ఆశ వదులుకున్నా. అయితే నువు కూడా ఇవాళనుంచీ ట్యుటోరియల్ స్కూల్లో....

## (ట్యుటోరియల్ స్కూల్)

సీత : ఏమిటి, చలపతీ! నువ్వింకా ఇక్కడే ఉన్నావేం? ఇంటికి వెళ్ళలా?

చలపతి : లేదండీ, శాస్త్రి మేస్టారు వస్తారేమో అని చూస్తున్నా.

సీ : దీపాలు పెట్టిగాని రారేమో.... కొంచెం పనిమీద వెళ్ళారు. నాతో చెబితే నే నాయనతో చెబుతా.

చ : ఏం లేదండీ. పట్నం నుంచి మా అన్నయ్యొచ్చాడు. రేపు శలవు కావాలి.

సీ : మీ సొంత అన్నయ్యా?

చ : కాదండీ. మా పెదనాన్న కొడుకు. రామదాసనీ, ఈ స్కూల్లోనే మేస్టరుగా ఉండేవాడు. ఇప్పుడు సినిమా కంపెనీలో పనిచేస్తున్నాడు.

సీ : ఓహో.... ఆయనా !

చ : షూటింగు పది రోజు లాగిందట. అందర్నీ చూద్దామని వచ్చాడు. వారం రోజులుండి మళ్ళీ పోతాడు.

సీ : వారం రోజులూ చదువు మానేస్తావా ఏమిటి ?

చ : లేదండీ. రేపు శలవు పెడితే శని ఆదివారాలు కలిసొస్తయ్. మా అన్నయ్య దగ్గిర ఊళ్ళకు పోతున్నాడు. నన్ను కూడా తోడురమ్మన్నాడు.

సీ : శాస్త్రి మేస్టారితో చెబుతాలే. మీ అన్నయ్య పనిచేస్తున్నది ఏ పిక్చర్లో ?

చ : సవతితల్లో, పెంపుడుతల్లో, ఏదో ఉందండీ. ఇంకా సరిగా పేరు పెట్టలా.

సీ : అట్లాగా? అందులో ఆయన కేం పనీ ?

చ : అసిస్టెంటు డైరెక్టరనుకుంటా. అన్నిఖర్చులు పెట్టుకుని రెండొందల యాభై ఇస్తున్నారు.

సీ : (వినపడీ వినపడకుండా) అయివారింతలు జీతం!

చ : ఏమిటండీ?

సీ : (తొందరగా) ఏమీలేదు. కావలిస్తే వెళ్ళు. నేను శాస్త్రిగారికోసమే కని పెట్టుకుని వున్నా. రాగానే చెబుతాలే.

చ : అయితే వెళ్ళొస్తానండీ.

సీ : మంచిది. (సీత ఏదో పుస్తకం పేజీలు తిరగేస్తూ మధ్య మధ్య ఏదో రాసుకుంటూ వుంటుంది. గడియారం ఆరుకొడుతుంది. సీత తనలో తాను యేదో పాడుకో సాగుతుంది)

దా : (బయటి నుంచి) శాస్త్రీ! (కొంచెం ఆగి) శాస్త్రీ!

సీ : (కూనిరాగం ఆపి) ఎవరూ?

దా : (దగ్గరికి వచ్చి) శాస్త్రి లేడాండీ? మీరెవరూ?

సీ : ప్రస్తుతం నేనిక్కడ టీచర్ను. మీరు....

దా : సరిపోయింది! నేను ఎక్స్ టీచర్ను. నాపేరు దాసు. శాస్త్రి ఎక్కడి కెళ్ళాడో?

సీ : ఇప్పుడే వస్తారు కూచోండి.

దా : కూర్చోటానికేం? మనవాడు ఆడ టీచర్ని సంపాదించాడా! (తనలో తాను నవ్వుకుంటున్నట్టు కనిపిస్తాడు)

సీ : సంపాదించటం దేనికి? ఆయన నన్ను చిన్నతనంనుంచీ ఎరుగును. కొత్తగా బియ్యే పాసయ్యాను. మీరు స్కూలు వదిలిపెట్టిపోతే మీ పని నేను చేస్తున్నా.

దా : నేను వద్దన్నానా ఏమిటి? మహారాజుగా చెయ్యొచ్చు. అసలు శాస్త్రికి అసిస్టెంటుగా పనిచేసిన వాళ్ళకి అదృష్టం పడుతుంది. నన్ను చూడరాదూ? యెవడు చూశాడు. రేపెవరన్నా వచ్చి నిన్నో సినిమాకు ఎగరవేసుకు చక్కాపోవచ్చు. అసలు నిన్ను చూడగానే పంతులమ్మ అనుకోలా. ఎవరో సినిమా స్టారనే అనుకున్నా.

సీ : దానికి నే నేమనాలి?

దా : ఏమి అనొద్దు వేళాకోళానికంటున్నాననా? సినిమాస్టార్లు నీకన్న పొడిచేసిందేమీ లేదు. నే చూశాగా?

సీ : నాబోటి మానవ మాత్రులకు సినిమా ఛాన్సులు రావనుకున్నానే?

దా : అహోరించినట్లుంది నేను పరమ మానవ మాత్రుణ్ణి. నాకు ఛాన్సు రాలా? అదేం లేదు. కాస్త పిలకపట్టుకు పైకి గుంజేవాడుండాలి. అంతే ఆ రాజ్యలక్ష్మి సినిమాల్లో కెట్లా వచ్చిందీ? ఆవిణ్ని స్టార్ చేసింది ప్రొడక్షన్ మేనేజరు కాదూ ?

సీ : సినిమాకి దొడ్డిదార్లున్నాయంటారు ?

దా : సరేలే.... ఉన్నవే దొడ్డిదార్లు? తలవాకిలి కోసం వెతుకుతున్న వాళ్ళింకా వెతుకుతూనే ఉన్నారు.

సీ : మీరు చెప్పేదాని బట్టి నాకు సినిమాలంటే వున్న గౌరవం కాస్తా పోతోంది.

దా : ఛీ, ఛీ! అట్లా అనుకోవడం పొరపాటు. అసలీ సినిమా అన్నది అంత తొందరపడి అర్థం చేసుకునేదిగాదు. దిగితేగాని లోతు తెలీదు; తింటేగాని రుచి తెలీదంటారే? అది సినిమా గురించి అన్నమాటే.

సీ : అయితే సావకాశంగా కూచుని మీ ద్వారా ఆ విషయాలన్నీ వింటా! మనం పరాయివాళ్ళం కాదులెండి. మీ తమ్ముడు నా శిష్యుడే. మీరు వచ్చారని, శలవడిగాడు కూడా.

దా : లేకపోతే మాత్రం పరాయివాళ్ళమా? ఇద్దరం ఒక కుర్చీలో కూచున్న వాళ్ళమేగా?

సీ : అంతకన్న, మీరే నాకీ వుద్యోగం ఇచ్చారని చెప్పరాదూ?

దా : బాగా చెప్పావ్.

సీ : కాస్త పనివుంది. ఇది చూస్తాను. ఈ లోపుగా శాస్త్రిగారే వస్తారు.

దా : నిరాక్షేపణగా. (ఏదో ఈలపాట పాడి అకస్మాత్తుగా ఆగుతాడు)

శాస్త్రి : (వస్తూ) ఏం సీతా! నా కోసం కనిపెట్టుకున్నావా? (ఆశ్చర్యంతో గొంతెత్తి) ఇదేమిటోయ్, ఎప్పుడు రావటం?

దా : వచ్చా; నా శరీరం అక్కడుందిగాని మనసంతా స్కూలు మీదే వుంది. కిందటేడుకంటె మన స్కూలు కాస్త కళకళ్ళాడుతోందికదూ?

శా : (విరుపుడుగా) మొత్తానికి సినిమా ప్రభావం నీ మీద బాగానే వున్నట్టుంది.

దా : మనం నవంబరులో పుట్టాం బ్రదర్. పరిసరాలనుబట్టి ఇట్టే మారిపోతాం. 'చూడుము షీరో'....

శా : ఇప్పుడు షీరో చదువుతున్నావా ఏం?

దా : ఎందుకడుగుతావు బ్రదర్? ప్రతివాణ్ణీ బర్త్‌డేట్ అడగటం, వాడి బతుకంతా చెప్పెయ్యటం వాడు దిమ్మర పోవటం: ఏదీ నీ బర్త్‌డేట్ చెప్పు?

సీ : నా బర్త్‌డేట్ సెప్టెంబరు పద్దెనిమిది. నా సంగతి కాస్త చెప్పండి.

దా : గుడ్ గ్రేషస్! అది గ్రేటాగార్బో పుట్టినరోజు వండర్‌ఫుల్! సెప్టెంబరులో పుట్టినవాళ్ళ తత్వం ఎట్లా ఉంటుందో తెలుసా? బుద్ధికి చాకులన్న మాట. వాళ్ళ నిర్ణయమే వాళ్ళదిగాని ఇంకొకరి మాటలకు పడరు. వారికి అపజయమన్నది ఉండదు. అందరితోనూ కలవరు. మనిషి తమ సాయావాడైతే తప్ప, లేకపోతే అంతదూరాన ఉంచుతారు. వాళ్ళు ఎల్లప్పుడూ అందంగా కనపడటానికి యత్నిస్తారు. అందమైన పరిసరాలుతప్ప సహించరు. తెలిసిందా? ఇతరులు సాధారణంగా సాధించలేని పనులు వాళ్ళు సాధించగలుగుతారు ..నీ బర్త్‌డేట్ చెప్పావుకావు శాస్త్రీ...

శా : నాది నవంబరు పధ్నాలుగు.

దా : చంపేశావ్; ఇంకేం? నీది గొప్ప జాతకమే.

శా : మనిదరికీ అయిదురోజులే తేడా అనుకుంటా. నీది పందొమ్మిదన్నటు జ్ఞాపకం.

దా : నాకే సరిగా జ్ఞాపకంలేదే? నీ కెట్లా తెలుసు?

శా : అప్పుడే మరిచావా? ఒకసారి మనం అనుకున్నాం- బ్రిటిష్ రాజు ఒకటో చార్లెస్‌దీ నీదీ ఒకే పుట్టినరోజని!

దా : నాకు కొంచెంకూడా జ్ఞాపకం రావటంలేదు. నే వెళ్ళొస్తా. నాకు కాస్త తొందర పనుంది. మళ్ళీ కనిపిస్తాలే. (పోతాడు)

శా : (కొంచెం ఆగి) మనలో కాస్త చదువుకున్నవాళ్ళూ, పనికొచ్చేవాళ్ళూ ఇట్లా ఎందుకయిపోతారో నాకర్థంకాలేదు.

సీ : మీ రాయన్ని, పాపం! చార్లెస్ ది ఫస్టనటం బాగాలేదు.

శా : నా కీ జాతకాల్లో నమ్మకంలేదు. వాడికైనా నమ్మకం ఉంటే తన తలను ఇంకాస్త భద్రంగా ఉంచుకునేవాడే. నిజంగా వాడు పుట్టినతేదీ నవంబరు

పందొమ్మిదే. తెలీనట్టు నటిస్తాడు. ఎవరి జాతకాలు వాళ్ళు చూసుకోక అందరి జాతకాలూ చూడటం దేనికి?

సీ : (మాట మారుస్తూ) పొద్దుపోయింది. నేను వెళ్ళిరానా?

శా : ఒక్క క్షణం కూచో. నేను నిన్నొకటి అడగాలని చాలా రోజులనుంచీ అనుకుంటున్నాను. ఇప్పుడే అడిగెయ్యాలనిపిస్తోంది.

సీ : అడగండి.

శా : ఎప్పటికన్నా నువ్వు పెళ్ళి విషయం ఆలోచించకపోవు. అప్పుడు మిగిలిన వాళ్ళతోబాటు నన్ను కూడా మనసులో ఉంచుకో. ఏరోజున నేను నెలకు రెండు వందల యాభై కళ్ళజూస్తే ఆరోజు పెళ్ళికి సిద్ధంగా ఉంటాను. ఈలోపల నీకెవరన్నా నచ్చి పెళ్ళాడితే సరేసరి. లేనట్టయితే ఆనాడు లగాయితు నువు పెళ్ళాడేదాకా నేను పెళ్ళాడను. నీకు మొహమాటం అక్కర్లేదు. నువు నాతో చేసుకుంటాననితప్ప, చేసుకోనని చెప్పనవసరం కూడా లేదు. సరేనా?

సీ : ఏమో, ఇప్పుడప్పుడే నాకు పెళ్ళాడాలని ఏ మాత్రమూ లేదండీ!

శా : నేనైనా ఇప్పుడెట్లా పెళ్ళాడగలను? నాది కూడా వచ్చేయేటిమాటే. మరో ఏడు తోసినా తొయ్యవచ్చు.

సీ : వస్తానండీ. అన్నట్టు రేపు చలపతి రానని చెప్పమన్నాడు.

శా : సరే.

## (సీత ఇల్లు)

సీత : ఈయన రామదాసుగారు నాన్నా?

సోమ : అంటే?

సీ : నాకు ముందు శాస్త్రి గారితోబాటు మేస్టరుగా ఉన్నాయన. ఇప్పుడు పట్నంలో సినిమా కంపెనీలో ఉన్నారని శాస్త్రిగారు చెప్పలా? అది ఈయనే...

సో : అట్లాగేం! ఆ ఉద్యోగం అయిపోయిందా? దొరికితే ఇంకో మేస్టర్ను కూడా వేసుకోగలనన్నట్టున్నాడే? అదేమైనా...

దాసు : (నవ్వి) నాకంత దుస్థితి కలగలేదులెండి మీదయవల్ల. మా పిక్చరు షూటింగులో కాస్త విశ్రాంతి కలిగితే నలుగుర్నీ చూసిపోదామని వచ్చా.

సో : అంతేగద!

సీ : చూడు. నాన్నా! ఈయనంటున్నారుగదా. నేను పట్నంపోతే చాలా సులభంగా సినిమాఛాన్సు దొరుకుతుందంటున్నారు. సినిమా స్టార్స్‌లో బియ్యే

లెవరూ లేరుట. నాకు బ్రహ్మాండమైన పబ్లిసిటీ వస్తుందనీ, అంతులేని డబ్బు వస్తుందనీ అంటున్నారు.

దా : నే ననటమేమిటి? నిజంగానే వస్తుంది.

సీ : మీరు అనుభవంమీద చెప్పేది మేము మాత్రం నమ్మలేంటండీ?

సో : చూడు, నాయనా! ఈ సినిమాల్లో చేరాలంటే మనం ఏం చెయ్యాలీ?

దా : ఏమిలేదు. మీరు నా వెంట పట్నం రావాలి. కొద్దికాలం వేచి ఉంటే ఛాన్సు తప్పక లభిస్తుంది. అసలందాకా కూడా పనిలేదులేండి. మా పిక్చర్లోనే ఒక చిన్న వేషం ఉంది. దానికింకా ఎవర్నీ బుక్ చెయ్యలేదు. అది మన సీత కిమ్మంటే కళ్ళకద్దుకుని ఒప్పుకుంటారు, డైరెక్టరు మనవాడేగా!

సో : అయినా మనకిప్పుడు సినిమాలెందుకులేస్తూ, ఏదో ఇట్టా వెళ్ళిపోనీ.

దా : అదే మన దగ్గర ఉన్న పొరపాటు, పెద్దగా ఆశించే శక్తికూడా మనకులేదు! మనకన్న తక్కువవాళ్ళు ఆకాశానికి నిచ్చెనలువేసి పైకిపోతుంటే మనం బావిలో కప్పల్లా ఎందుకుండాలండీ?

సో : ఇన్నాళ్ళూ కష్టపడి బియ్యేపాసై సినిమాల్లో వేషాలేమిటోయ్?

దా : అయితే మీకీనాటి సినిమాలను గురించి ఏమీ తెలీదన్నమాట! ఇప్పుడి సినిమా తారలకుండే గౌరవం పెద్ద అధికారులక్కూడా లేదు. ఆ మాట కొస్తే నేను బియ్యేను కానుటండీ? బియ్యే డిగ్రీ నాకిచ్చిన జీతం యాభ య్యేగా? అది కూడా సాటివాడికింద నౌకరీ. సినిమాల్లో అట్లాగా. పది లక్షల ఆస్తిగల ప్రొడ్యూసరు రేపు మీ సీత రాగానే లేచి నిలబడతాడు. సినిమానటి కావటమంటే దిగిపోవట మన్నట్టు మాట్లాడుతున్నారే? ఇంకా నయం!

సో : అయితే ఆ ఛాన్సేదో ఇప్పిస్తానన్నావే? అది ముందిప్పించు, అప్పుడే పట్నం పోవచ్చు. ఈలోపల మానుకోవటం దేనికి? ఉభయ భ్రష్టత్వమవు తుందేమో!...అన్నట్టు సంవత్సరం మధ్యలో వెళ్ళిపోగూడదని శాస్త్రి అనలా?

దా : శాస్త్రి అన్నమాటలన్నీ వేదవాక్యాలుటండి? తన స్వార్థంకొద్దీ అతను ఎన్నయినా అంటాడు. అన్నిటికీ తల ఒగ్గుతామా? ఇచ్చే బోడి యాభై రూపాయలకిన్ని హిరణ్యాక్షవరాలా? సీత ఈ క్షణం ఉద్యోగం మాను కుంటుంది. శాస్త్రి యేం చెయ్యగలడో చెప్పండి?

సో : చేస్తాడూ?

దా : మరికనేం? మంచి ఛాన్సు దొరుకుతున్నదీ; వెళ్ళిపోతుందీ! అంతే! కళ్యాణ మొచ్చినా, కక్కొచ్చినా ఆగదన్నారు. సినిమాఛాన్సు అసలాగదు.

సీ : అసలు విషయం వొదిలేసి అన్నీ మాట్లాడుతున్నాం. జరగవలసిందేదో చెప్పండి.

దా : ఇంకేముందీ? మీ నాన్నగారన్నట్టు; నేను వెళ్ళగానే ఈ పిక్చర్‌లో వేషం గురించి మాట్లాడి రాస్తాను. వెంటనే నువూ మీ నాన్నగారు కలిసి వచ్చేద్దురు గాని.

సీ : ఖరారేనా?

దా : ఖరారే....

సీ : ఏం నాన్నా?

సో : నాకేమిటో ఇది సబబుగా వున్నట్టులేదు.

సీ : ఎన్నో ఏళ్ళకింద ఆ డైరెక్టరుగారు నన్ను చూసినప్పుడే ఒప్పుకుంటివి గద. నాన్నా!

సో : అప్పుడు నువు చిన్నపిల్లవి. దానికీ దీనికీ ఏమిటి సంబంధం?

దా : అయ్యా, నేను చెబుతున్నాను వినండి. మీరలాంటి భయాలు పెట్టుకోనే వద్దు. సినిమాల్లోవాళ్ళు రాక్షసులనీ, పైన పడిపోతారనీ ఒక్కనాటికీ కనుకోకండి. అవన్నీ కట్టుకథలు, బుద్ధిపూర్వకంగా నీతిమాలేవాళ్ళు ఎక్కడన్నా ఉండొచ్చు. ఉండరని నేను చెప్పను. వాళ్ళదారి వాళ్ళదే. మనదారి మనదే ...

సో : అదంతా నిజమేకావచ్చు కాని నీ స్థితిలోవున్న మనిషి చెయ్యగల మహత్కార్యం యిదేనా అని?

దా : అయ్యా. నాకు తెలీకడుగుతాను. మీ అమ్మాయి చెయ్యదగిన మహత్కార్యం శాస్త్రీ స్కూల్లో మేస్టరుగా వుండటమేనా? వీరిద్దరికీ ఎవరు రంకులు కట్టినా కట్టవచ్చునే? దీనికసలు మీరెట్లా ఒప్పుకున్నారో చెప్పండి?

సీ : మీరుండండి దాసుగారూ! చూడు, నాన్నా! నా రిజల్ట్సు వచ్చిన్నాడేమన్నావ్ ఏ ఉద్యోగం చేస్తానో, చెయ్యనో నిర్ణయించే భారం నాదే నన్నావా, లేదా?

సో : ఇప్పుడు కాదన్నానా?

సీ : అయితే నేనీ సినిమా ఛాన్సు ఏరుకున్నా, నాన్నా... నువు మధ్యలో అడ్డు పుల్లలు వెయ్యకు.

సో : నేనేం అడ్డుపుల్లలు వెయ్యను గాని; నువుమాత్రం ఆ శాస్త్రితో ముందుగానే చెప్పు. లేకపోతే అతను ఇబ్బంది పడిపోతాడో ఏమో!

సీ : అట్లాగే చెబుతాలే....

(ట్యుటోరియల్ స్కూల్)

చలపతి : నిజంగానేనండీ, మాస్టరుగారూ! అటు మొన్న మాదాసన్నయ్య వాళ్ళింటికి వెళ్ళాట్ట. అక్కడ చాలాసేపు సీతమేష్టరూ, వాళ్ళనాన్నా, మా అన్నయ్యా మాట్లాడుకున్నారుట. దాసన్నయ్య పట్నం వెళ్ళగానే కబుర్లు చేస్తానన్నాట్ట. కబురందగానే సీతమేస్టారు పట్నం వెళ్ళిపోతార్టట.

శాస్త్రి : ఇది నీకెవరు చెప్పార్రా?

చ : మొన్న ఉదయం ఎక్స్ప్రెస్కు పోతూ మా దాసన్నయ్య చెప్పాడు.

శా : సరేలే. నువ్వింక ఇంటికి వెళ్ళు. పొద్దుపోయింది... (తనలో). సీత సినిమాస్టార్!....ఎందుకాకూడదూ? అందంగానే ఉంటుంది. వాళ్ళు మేకప్వేసి, షోగ్గా ఫొటోగ్రాఫ్ చేస్తారు. అవన్నీ చేస్తే రంభల్లే ఉంటుంది. ఈ నాలు, గైదు నెల్లూ పిల్లలకు పాఠాలు చెప్పిందేమో. పట్టి చదవడమూ, ధైర్యంగా మాట్లాడటమూ చేర్చుకుంది. సినిమాకు పనికొస్తుంది... హుఁ; నేనే సినిమా స్టార్ కావటానికి పునాది వేశానన్నమాట!... ట్యుటోరియల్ స్కూల్లో సహంవాటా ఇస్తే ఉండిపోతుందా? లాభంలేదు. పెళ్ళిచేసుకుంటానంటినే!... ఎంత హాస్యాస్పదం? నన్నుచూసి నవ్వుకుంటుంది. పెళ్ళిచేసుకుంటానన్నానని అందరికీ చెబుతుంది... ఛీ, ఛీ! ఎందుకన్నా నా మాట?.... స్కూలు దెబ్బతింటుంది. వెంటనే నాకు కొత్తటీచరు ఎవడు దొరుకుతాడు? దొరికితే మటుకు పిల్లలు వాడికి అలవాటుపడొద్దా? నేనిచ్చే జీతానికి మంచిటీచరెట్లా దొరుకుతాడు? ఈ సీతమాత్రం ఎన్నాళ్ళు తోమితే దారికొచ్చింది; అందుకే గదా ఏప్రిల్ లోపల విడవొద్దన్నాను.... నా వెర్రి! నేనంటే మటుకు ఆ మాటకు విలవేమిటి? నాకు మాట ఇచ్చానుగదా అని ఈ ఛాన్సు పాడు చేసుకుంటుందా?... నేనూ, నా స్కూలూ ఎట్లాపోయినా ఆ సీతన్నా నిజంగా పైకివస్తే అంతే చాలు; ఈ దాసుగాడి ఉద్దేశం ఏమిటి? ఏదన్నా దురుద్దేశంతో ఆమెను ఇందులోకి దింపుతున్నాడా? రెంటికీ చెడి జీవిత మంతా పాడుచేసుకుంటుందేమో... అయినా నా కెందుకొచ్చిన విచారం. తన మంచిచెడ్డలు తాను చూసుకోలేదా? పైన తండ్రికూడా ఉన్నాడాయె. మధ్య నేనెవణ్ణి?....హుఁ; ఈ స్కూలు తనదల్లే చూసుకుంటుందనుకున్నా. కాలక్రమాన ఇద్దరం భాగస్వాములవుతా మనుకున్నా. అన్నీ పగటికలలు - గొంతెమ్మ కోరికలు - ఆత్మవంచన! ఏమో, ఈ దాసు సమయానికి రాకపోతే యీ గొంతెమ్మ కోరికలు నిజమయే వేనేమో, ఏం జీవితాలు మనవి; ఎంతో చిన్నగాలికి ఎటో కొట్టుకుపోతాయి

...పుల్లాకులు!...సీత వెళ్ళిపోవటంవల్ల పాఠాలు పాడై పిల్లలు తప్పారో, ఆ అవమానం భరించలేను. స్కూలు మూసేస్తాను. తరవాత ఏమైతే అది అవుతుంది. ఏ గాలికో ఒక పుల్లాకునై ఎటో ఎగిరిపోతాను. అంతకంటె...

సోమ : (బయటనుంచి) శాస్త్రీ? ఉన్నావటోయ్?

శా : (గొంతెత్తి) ఎవరూ?

సో : (దగ్గిరికివస్తూ) నేను సోమసుందరాన్ని, ఇంట్లో ఉండవేమో అనుకున్నా.

శా : దయచెయ్యండి. ఇవాళ సీత రాలేదు. కారణం తెలుసుకుందామని మీ ఇంటికే బయలుదేరుతున్నా....

సో : నీకా శ్రమకూడా దేనికి? ఇంకా ముందే వచ్చేవాణ్ణిగాని బజారుపని చూడవలసొచ్చింది. ఇంతకీ విషయం మేమంటే; మేం పట్నం పోతున్నాం.

శా : (ఆటే ఆశ్చర్యం లేకుండా) అట్లాగా! ఏమిటి విశేషం?

సో : ఏముందీ? ఆదేదో సినిమా కంపెనీ వాళ్ళు సీతను రమ్మని రాశారు. నన్నడిగితే నాకేమీ నమ్మకం లేదుసుమా! తీరా అక్కడికి పోవడమూ, ఏమీ లేకపోవటమూ, మేం కాస్తా నెత్తిన గుడ్డేసుకుని వెళ్ళినదారే రావటమూ జరుగబోతుంది. చూస్తూ ఉండు. అయినా వాళ్ళు రమ్మన్నప్పుడు మనం వెళ్ళక తప్పదుగా!

శా : కాదామరి? ఎప్పుడు ప్రయాణం?

సో : ఎప్పుడోనా, ఈ రాత్రి మెయిలుకే. 'అయ్యో, శాస్త్రిగారితో చెప్పనేలేదే!' అని అమ్మాయి అంటే 'నేను చెప్పి మరీ ఇంటికి వస్తాలే' అని చెప్పి అమ్మాయిని బజారునుంచి ఇంటికి పంపించా. అయ్యా; అదీ సంగతి.

శా : ఈ సినిమా ఛాన్సు వచ్చినందుకు నేను కూడా చాలా సంతోషించానని సీతకి చెప్పండి.

సో : అయ్యో! ఎంతమాటా! దాని బాగు కోరిన వాళ్ళలో ఒకడివి కావూ? దానికైనా నీ మీద ఎంత అభిమానమని?

శా : మీరామాట వేరేచెప్పాలా?

సో : వస్తానుమరీ? వెళ్ళంగానే ఉత్తరం రాస్తాంలే. చెప్పాగా, అనుకున్న పని అయిం దాకా నమ్మకం లేదు. ఎల్లుండిపాటికి మేము తిరిగివచ్చినా ఆశ్చర్యం లేదు.

శా : నే నుంటానండి.

సో : మంచిది నాయనా....

(మద్రాసులో సీత లాడ్జి)

దాసు : నే చెప్పలేదా, సీతా? నీ టెస్టు చూడగానే మా డైరెక్టరెంత ఆనందించాడో చూడు. నన్నడిగితే ఈ టెస్టు కూడా దండగే. ఇక లక్ష్మివేషం నీదే. ఎంతలే? నాలుగైదు రోజులు మేకప్ చేసుకోవలసొస్తుంది. అసలీవేషానికి అయిదువంద లిద్దామనుకొన్నారు. నీ పంట పండిందిలే. వెయ్యి యిచ్చేస్తున్నారు. సాయంత్రం మనం ప్రొడక్షన్ ఆఫీసుకు పోతే కంట్రాక్టూ, ఎడ్వాన్సు చెక్కూ సిద్ధంగా వుంటై.

సీత : ఇరవై నెల్ల జీతం.

దా : ఏమిటి?

సీ : ఏమీలేదు. నాకు త్వరలో మేకప్ వేస్తారా?

దా : చెప్పలేం. నీ పని రెండు సెట్లమీద వుంది. అవి ఎప్పుడు వేస్తారో.

సీ : ఆ సంగతి త్వరగా తెలిస్తే బాగుండును.

దా : ఏమిటి తొందర ?

సీ : ఇక్కడ ఉన్నకొద్దీ ఖర్చులేగద? త్వరగా పని ముగించుకుని ఈ వెయ్యి రూపాయిల్లో వీలయినంత మిగుల్చుకొని కొంప చేరుకోవటం మంచిదిగద.

దా : భలే చెప్పావులే. తారాపథం నిచ్చెనమీద ఒక మెట్టు ఎక్కి మళ్ళీ దిగి పోతావా? ఇంత సముద్రంలో ఒక్క చిన్న చేపనుపట్టి ఇంటికి వెళ్ళిపోతావా?

సీ : లేకపోతే నే నిక్కడ లక్షలార్జిస్తానని మీ నమ్మకమా? ఒకవేళ ఆర్జించినా యీ హోటలుకు చాలదు.

దా : ఇంక హోటలు దేనికి? రేపు ఇల్లుచూద్దాం.

సీ : ఇంటి అడ్వాన్సుకింద ఇవ్వటానికైనా యీ వెయ్యీ చాలేట్టులేవు.

దా : అదంతా నేను ఏర్పాటు చేశాగా.

సీ : మీ రిచ్చుకుంటారా?

దా : నేనంటే నేను కాదు, మన డైరెక్టరిస్తానన్నాడు.

సీ : ఏమైనా అచ్చగా ఈ ఛాన్సునే నమ్ముకోకుండా ఇంకో ఛాన్సు చూడటం మంచిది. వ్రతంచెడ్డా ఫలందక్కాలి.... (తొందరగా) ....అంటే....నా ఉద్దేశం సాహసించి సినిమాల్లోకి వచ్చినందుకు, వట్టిచేతులతో ఇంటికి పోలాదని.

దా : మళ్ళీ ఇంటికి పోవటముంటుందీ?

సీ : (నవ్వి) నన్నీ సినిమావాళ్ళంతా నెత్తిన పెట్టుకుంటారని మీకెంత ధైర్యం దాసుగారూ!

దా : ధైర్యంకాదు. నాకు తెలుసు. మళ్ళీ ఎక్కడా అనకుండా ఉంటే ఓ రహస్యం చెబుతా. మన డైరెక్టరుకు ఇంకో ఆఫరు వచ్చింది. ప్రొడ్యూసర్లకు తెలిస్తే ఏడుచుకుంటారు. కాని స్క్రిప్టుపని జరుగుతున్నది. అందులో నీకు తప్పక రెండో హీరోయిన్ ఇస్తానన్నాడు. ఈ పిక్చరు అయిపోగానే అది ఫ్లోర్ మీదికి వస్తుంది. నీ కెందుకు, నువు కళ్ళు మూసుకుని నే చెప్పినట్టు చెయ్యి సీతా! బంగారప్పిచ్చికవవుతావు!

సీ : నా కంత ఆశ లేదండోయ్.

దా : పన్నెండుకూడా కావస్తోంది. ఇంక భోజనానికి లేస్తామా? భోంచేసి కాస్త విశ్రాంతి తీసుకునేసరికి కారు రానేవస్తుంది.

## (నాలుగు మాసాల అనంతరం సీత మకాం)

సో : ఇంత ఆలస్యమయిందేమే, అమ్మాయ్?

సీ : రోజూ ఇంటికి రాగానే నీ కిదో పాఠైపోయింది నాన్నా!....రోజల్లా చేసిన కార్యక్రమమంతా నీ కెక్కడ నివేదించుకునేది?

సో : నాకేమీ నివేదించక్కర్లేదమ్మా. కాస్త పెందలాడి రాగూడదా అని...

సీ : ఇదేమన్నా శాస్త్రి పెట్టిన ట్యుటోరియల్ స్కూలనుకున్నావా, నాన్నా, గంటల ప్రకారం వెళ్ళిరావటానికి? షూటింగూ, లేకపోతే రిహార్సలూ, లేకపోతే డైరెక్టరుగారితో వెళ్ళి ఏదన్నా సినిమా చూడటం. "ఫలానా హిందీ పిక్చరు చూశావా? అందులో గీతాబాలి ఫలాని సీక్వెన్స్‌లో ఎట్లా చేసిందో చూడు. నీకూ్కడా అటువంటి సీక్వెన్సే ఉంది" అంటాడు డైరెక్టరు. ఆయన మాట దక్కిస్తూ వెళ్ళాలా, లేదా? నాకేమీ అనుభవం లేకపోయినా నన్ను పెద్దదాన్ని చేసి నాకు ప్రొడ్యూసర్లు కథ వినిపించి నా అభిప్రాయా లడుగుతున్నారు. నా పేరు చివర ఉన్న రెండు పొడి అక్షరాలూ కాస్త పెద్దరికం ఇస్తున్నాయి! నా కసలే విశ్రాంతి లేకుండా ఉంటే నేనింటికి వచ్చేసరికి అమ్మమ్మ అడిగినట్లు "ఇంత ఆలస్యమయిందేమే?" అంటే ఎట్లా ఉంటుందీ?

సో : నువు పైకివచ్చి పెద్దదానవవుతుంటే నాకు సంతోషం కాదా? కాని అన్నట్టు ఇంతకు ముందు దాసు వచ్చాడు.

సీ : నాతో మాట్లాట్టం కూడా మానేశాడుగా! ఎందుకొచ్చాడూ?

సో : నాతో మాట్లాట్టానికి వచ్చాడు.

సీ : (అనుమానంగా) ఏం మాట్లాడాడు?

సో : ఏవో మంచీచెడ్డా చాలా మాట్లాడాడు. రేపొద్దున ఊరికి వెళ్ళిపోతున్నాట్ట.

సీ : వొట్టిఫూల్! నిష్కారణంగా డైరెక్టరుతో తగూ పెట్టుకున్నాడు. ఆ డైరెక్ట రేదో నా దగ్గిర బావుకుంటున్నాడని అనుమానంకొద్దీ కుళ్ళసాగాడు. నాకు తను అంగరక్షకుడుగా ఉంటానంటాడు. నా కేమీ రక్షణ అక్కర్లేదంటే నేను కృతఘ్నురాలినన్నాడు. నన్ను తను సినిమాలలో చేర్చినందుకు నేను యావజ్జీవం తనకే కృతజ్ఞత చూపాలిట! నాకు అవకాశాలిచ్చిన వాళ్ళకన్న ఇప్పించిన తనను ఎక్కువగా చూడాలిట. ఇట్లా అయితే స్టూడియో గేటుదగ్గిర గూర్ఖాకు కూడా కృతజ్ఞత చూపవలసిందేగా?

సో : అదంతా నాకు తెలీదు, దాసు నాతో తన విషయం ఏమీ చెప్పలేదు. నువు ఏరుదాటి తెప్ప తగలేస్తున్నావని మాత్రం అన్నాడు.

సీ : అంటే అన్నాడులే. అసలాయన్ని బొట్టూ, కాటికా పెట్టి ఎవరు అభిప్రాయం అడిగారని? ఎందుకీ పిలవని పేరంటం? పైకి వెళ్ళటానికి ఇంకో పద్ధతి ఏమైనా ఉందా? ఒక మెట్టుమీదినుంచి కాలు తీయకుండా, ఇంకో మెట్టు ఎట్లా ఎక్కటం? ఆ డైరెక్టరుకూ ఇదే రోగం ఆరంభమయింది. నన్ను ప్రొడ్యూసర్లతో స్నేహంగా ఉండొద్దంటాడు. వీళ్ళంతా చాలా న్యూసెన్స్ చేస్తున్నారు. నాన్నా!

సో : ఏమో మరి! నేనుమాత్రం ఏం చెప్పగలను? పదిమంది పదిమాటలంటారు. ఎవరు నీ మంచికోరి చెబుతున్నారో తేల్చుకునే బాధ్యత నీదీ....

సీ : మిగిలినవాళ్ళ న్యూసెన్స్ ఏదోవిధంగా భరించవచ్చు. ఇంట్లో న్యూసెన్స్ లేకుండా ఉంటే చాలు...

సో : నేనెందుకు న్యూసెన్స్ చేస్తానమ్మా? ఏ క్షణాన నేను నీకు న్యూసెన్సని తోస్తే ఆ క్షణాన ఇంటికి పోతాను. అంతకన్న ఇంకేముంది.

సీ : ఆ మాటలే నాకు మండేది.

## (ట్యుటోరియల్ స్కూలు)

శాస్త్రి : (పేపరు పేజీలు తిరగేస్తూంటాడు) ఎవరూ? దాసూ! ఏమిటిట్లా వచ్చావ్? మళ్ళీ షూటింగ్‌లో విరామం వచ్చిందా? కూర్చో.

దాసు : ఈసారి షూటింగుకు కాదు-నాకే విరామం.

శా : ఏం నౌకరీ అయిపోయిందా?

దా : మీ శిష్యురాలు అయిపోగొట్టింది.

శా : ఏం?

దా : నేను తనను సినిమాల్లో ప్రవేశపెట్టినందుకు నాకు ప్రత్యుపకారం యేదో ఒకటి చెయ్యొద్దూ ? అందుకని మా డైరెక్టరుతో నా మీద చాడీలు చెప్పింది. ప్రస్తుతం ప్రొడ్యూసర్లకి డైరెక్టరు మీద చెబుతున్నది. మా

స్నేహితుడికి కూడా రోజులు బాగాలేవు. ఈ గొడవకేంగాని నీ స్కూలెట్లా వుంది?

శా : ఇవిగో రిజల్ట్స్. బెనారస్ మెట్రిక్కు కుపోయిన ఏడుగురిలో ముగ్గురు పాస యారు. వాళ్ళయిన యెట్లా పాసయినారో నాకు తెలీదు. సీత వెళ్ళిపోయినాక రెండునెల్లపాటు సరి అయిన మేస్టరు లేడు. పాఠాలు లేవు.

దా : నీకెందుకు, శాస్త్రీ? యీ యేడు చూడు. అందరు పిల్లల్నీ ఫస్టుక్లాసులో పాసు చేయింతాం.

శా : స్కూలు మూసేస్తున్నాను.

దా : (ఆశ్చర్యంగా) అదేమిటి?

శా : ఎందుకు దాసూ? మన మొహాలు సంస్థలు నడిపేవికావు. ఎవడి స్వార్థం వాడు చూసుకుంటాడు. దానికోసం యితరులను బలిచేస్తాడు. నేనీ ట్యుటోరియల్ స్కూలును పెంచి పెద్దది చేద్దామనుకున్నప్పుడు, నాకు సహాయం ఎవరుంటారా అని ఆలోచించవలసింది. ఆలోచించలేదు. దెబ్బతిన్నాను. నా స్వార్థమే నన్ను దెబ్బతీసిందనుకో. సీత వెళ్ళిపోతుందనగా నా స్వార్థం నాకు తెలిసొచ్చింది. సీతకు స్కూల్లో సగం భాగమిద్దామనుకున్నాను. సీత నన్ను పెళ్ళి చేసుకుంటుందని కూడా అనుకున్నాను. కాని నాకీ ఆలోచన తట్టేటప్పటికే సీత చెయ్యిదాటిపోయింది. నేను చేసిన పనే నువ్వూ చేశావు. సినిమా ఛాన్సురాగానే నీ స్వార్థం నువ్వు చూసుకున్నావు. తరువాత సీతను సినిమాలలో చేర్పించావు. సీత నీ అధీనంలో ఉంటే నీకు కలిసి వస్తుందనుకున్నావు. నీ కన్న పెద్దవాడు నీతో పోటీకి వచ్చాడు. నీ ఆట కట్టింది. అతనిమీద రేపు ఇంకోరు పోటీకి వస్తారు...సీతమీద మరొకరు పోటీకి వస్తారు...కాని ఒకటి మాత్రం చెప్పగలను. నడమంత్రపు సిరివచ్చి నాకళ్ళు కప్పుకుపోవటం మటుకు జరగలేదు. నేనింకోర్ని నా స్వార్థానికి బుద్ధిపూర్వకంగా బలిచెయ్యలేదు. అదొకటే నాకు తృప్తి....

ముద్రణ : ఆంధ్రజ్యోతి మాసపత్రిక, జనవరి 1954



సాహిత్య రచన దేవతా కార్యంకాదు సాహిత్యాన్ని రచించేటందుకు మహర్షులు తత్తుల్యులు దిగి రానక్కరలేదు. సాహిత్యంయొక్క ప్రయోజనం ఉపదేశం కాదు- అది మత గురువులకే వదలిపెట్టండి. అందువల్ల ముప్పేమీ రాదు. నిజమైన సాహిత్య ప్రయోజనం మనసును రంజింప చెయ్యటం కాదు- అది సాహిత్య కళా ప్రయోజనం! కావ్య ప్రయోజనాలలో ఒకటి. సాహిత్యం యొక్క ఉద్దేశం జీవితాన్ని కళా దృష్టితో చిత్రించుటకాదు, అప్పుడు సాహిత్యం కళతో కూడుకున్న చరిత్ర మాత్రమే అవుతుంది.

జీవితాన్ని విమర్శించటం ! అలంకరించటం, సాహిత్యం చేయగల ఉత్తమ కార్యాలు. ఇదే సాహిత్యం యొక్క ఉత్కృష్ట ప్రయోజనం.

ఏ కాలపు జీవితాన్ని విమర్శించేది ఆ కాలపు సాహిత్యం నేటి జీవితాన్ని విమర్శించలేనిదీ. నేటి భావాలను సంస్కరించలేనిదీ, నేటి జీవితాన్ని అలంకరించలేనిదీ నేటి సాహిత్యం కాదు- నేను రాసినదైనా సరే.

జీవితంలో సాహిత్యానికి లేని గొప్పతనం తెచ్చి పెట్టవద్దు. ఉన్న గొప్పతనాన్ని తక్కువ చెయ్యవద్దు. మానవుడు సాధించటానికి ప్రయత్నం చేస్తున్న వాటిలో సాహిత్యం సర్వోత్కృష్టమైనది కాదు. కానీ మానవుడు చేసే సమస్త ప్రయత్నాలకూ సాహిత్యం ఎంతో తోడుగా ఉంటుంది. నాగరికత పెంపొందించుకోవటానికి, సంస్కారం అభివృద్ధి చేసుకోవటానికి సాహిత్యం అత్యవసరం.

కొడవటిగంటి కుటుంబరావు

(వీణ పత్రిక లోని 'నిజమయిన సాహిత్య ప్రయోజనం' అనే వ్యాసంనుంచి)

Cover Printed at Sri Balaji Art Printers, Chikkadpally, Hyd